శ్రీరామ

# కంబరామాయణము

(ఆంధ్రానువాదము.)

ద్వితీయ సంపుటము

**(సుందర, యుద్ధ కాండములు)**

*గ్రంథకర్త :*

**పూతలపట్టు శ్రీరాములు రెడ్డి**



మహాకవి, ఆంధ్రకంబర్

సాహిత్యరత్నాకర, విద్వత్ కవికుల తిలక

## శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు

జననము : 05-04-1892 మరణము . 08-11-1971

శ్రీ

# విషయసూచిక

## సుందర కాండము.

## యుద్ధ కాండము : : పూర్వభాగము.



యుద్ధ కాండము : : ఉత్తర భాగము.



## 28-3-1953 తేది కారైక్కుడిలో కంబకవి వర్ధంతి సందర్భమున జరిగిన కవి సన్మానము



1. డాక్టరు అళగప్ప శెట్టిగారు సన్మానప్రదాత
2. పూతలపట్టు శ్రీరాములురెడ్డి ఆంధ్ర కంబరామాయణ కర్త
3. కున్నక్కుడి స్వాములవారు సన్మాన సభాధ్యక్షులు
4. సా. గణేశ గారు కంబకవి వర్ధంతి కార్యనిర్వాహకులు

శ్రీ ర స్తు.

# కంబ రామాయణము

## సుందర కాండము

### 1 సముద్ర లంఘన పటలము. (95)

మ॥ క్రూలఁకం జీఁకటి రజ్జువే భుజగమై • కన్పట్టు చందాన నీ
యిల మాయం జనియించు మోహ నిచయం • బీగున్ సమస్తంబు నే
విలసత్తేజముఁ గన్న నట్టి పరుఁడే • విల్లంది లంకాపురిన్
గలనన్ గెల్వ వహించె నంద్రు విబుధుల్ • గణ్య ప్రమాణంబులన్

ఉ॥ అత్తఱి వీరరత్నము మ • హాబలపుత్రుఁడు దేవలోకమున్
జిత్తము రంజిలంగఁ దన • చేరువఁ గాంచి యిదేమి లాకయా?
మత్తిలినాఁడనే? యనుచు • మాన్యులు వొందెడు నాకమిద్దిరా
జోత్తము దేవి యిందరయ • నుండవ యంచు మరల్చె భావమున్.

శా॥ లంకాద్వీప వనంబులన్ గనక • మాలా విస్ఫురద్ద్వారముల్
పొంకంబౌ మణిసౌధవీధులును పెం • పుం గాంచు దుర్గంబులున్
శంకాతంకము లేక గాంచుచు జగ • త్సందోహముల్ దిక్కులున్
సంకోచించి వడంక బాహువుల నా • స్ఫాలించె క్ష్వేడించుచున్

మ॥ విమలాత్ముం డట నూది త్రొక్కఁ గిరియున్ • వేక్రుంగి గర్భంబు చీ
లి మహిన్ వ్రాలిన ప్రేవులంటలె గుహా • లిన్ దుర్విష జ్వాలికా
సముదగ్ర స్ఫుట దంష్ట్రికా భయద దు • ష్ట వ్యాళ సంఘంబు క్ష్వే
ళములం గ్రక్కుచు దొర్లుచున్ వెలువడెన్ • లావేది దుర్భీతిమై

ఉ॥ నెమ్మదిఁ గందరంబులను • నిద్ర యొనర్చు మృగేంద్రపాళి ర
క్తమ్ములు గ్రక్కుచచ్చుటనె • క్రందడఁగన్నశియించెఁ బక్షి సం
ఘమ్ములు సాగరంపు లయ • కాల విఘోషము సిగ్గిలంగ శ
బ్దమ్ము లొనర్చుచుం బఱచె • భానుని కాంతి మఱుంగుపుచ్చుచున్.

చ॥ కరిణులు తోఁకలన్ ముడిచి • గాత్రములన్ గుదియించి కర్ణముల్
పరపగు వెన్నుదాఁక వడిఁ • బ్రాణభయంబునఁ గంపమంద త
మ్మొరయుచు వెంటనంటఁ గరి • యూధము తొండముతోడఁ బావపో
త్కరములఁ గెల్లగించికొని • దవ్వుల కేగెను గీఁకవెట్టుచున్.

తే॥ అమ్మహేంద్రానమించు నా • నతిశయిల్లు, కొమ్మలుంటొడిగా మిడుఁ • గుఱులు చెదర
వెన్ను లగలంగ బెబ్బులుల్ • బెదరి పాఱె, కనులు విప్పని కొదమల • గవ్వికొనుచు

ఉ॥ భూధర రాజ మప్డు తన • పొల్పు చెడంగ వడంక క్రుంగ వి
ద్యాధరులెల్లఁ గేల నడి • దంబులతోడను డాళ్ళతోడ భూ
మీధరమందునుండి వడి • మీఁదికి లేచుట చూడ నొప్పె నా
యోధనమందు శౌరి యడు • పుజ్జగిలం బయికేగు వైఖరిన్

చ॥ శరదము లర్కచంద్రు లుదు • సంటిటి నిక్కడ దప్పఁ గ్రుంగి యు
ర్వర దిగఁబడ్డ పర్వతము • వాఁడి నఖంబులు లావు బాహువుల్
మురువుగ నొప్పు వాయుజుఁడు • మూఁపునఁ గంబమువోలె నుండఁగా
శరధి మునుంగు నోడయను • జానునఁ దోఁచెను చూడ్కి కబ్రమై.

ఉ॥ గైరిక మింగిలీకమును • గందము పుష్పొడి చెందిరంబు నిం
దారఁగఁ బూసికొంచు నచ • లా పగలెల్ల ధరిత్రిపై వడిం
గాలుట చూడ నొప్పె గిరి • గర్భము ప్రీలఁగఁ ద్రొక్క రక్తముల్
ధారిణిఁ జింది వెల్లువయి • తర్లిన విన్నను వొంది యత్తఱిన్.

చ॥ శరనిధిఁ ద్రచ్చు మందరము • చాడ్పున నగ్గిరి రాజ మప్డు ది
రిగఁ దిరుగంగ నందలి య • తిప్రవరుల్ తపముల్ ముగించి చె
చ్చెర విలయంబొకో యనుచుఁ • జింత వహించుచు దేహబంధముల్
విరియక మున్నె తామెగిరి • వెళ్ళిరి మోక్షము చేరు వైఖరిన్.

ఉ॥ భానుని పోలు కాంతిగల • పర్వత మట్టి పటాలమంచు బీఁ
టూనఁగ సుందరుల్ వడఁకి • యొక్కటఁ గౌఁగిలిఁ జేర ఖేచరుల్
మానుగ వెండికొండ దశ • మస్తకుఁ డెత్తుడు నల్లలాడ శ
ర్వాణి పరిష్వజింపఁ గను • పట్టిన శంభుని పోలి రయ్యెడన్.

చ॥ ఒదలిని చేరు మాధవ • మోరిమితోఁ దెలివిన్ వదల్పఁ గిం
కదరిన వేల్పు టింతులు భ • యంపడి యల్కల వీడి యూఱటం
బడసి నిజేశులం గలిసి • పైకి వడిం జనుచుండి విస్మృతిన్
విడిచిన కీరపోతములఁ • బిల్చుచు సంకట మంది రత్తఱిన్.

తే॥ నాకులును తాపసులుఁ దక్క • లోకపలుకు, జ్ఞానులును వచ్చి వరుసలై • పూని నిలిచి
పూవులం జల్లి పావనీ, పోయిరమ్మ, యనుచు హనుమయు వేగిర • మందె నెడఁద.

మ॥ నిజపుత్రప్రాభవశీలి శైలనిభహం • సీరాం పొనుంగైన కుం
భజుఁడే త్రావిన వారిరాశి యసి నే • మాత్రంబు నాకిద్ది య
క్కజమే దాఁటఁగ నంచు నెంచుచ నల • క్ష్యస్ఫూర్తిమై దాఁటి భూ
మిజ నా లంకను కాంచి రమ్మనుచుఁ ద • న్మిత్రుల్ ప్రశంసింపఁగన్.

ఉ॥ పావని తాల్చినట్టి ఘన • బంధుర రూపము లంక దాఁటనే?
యావలికేని వోవఁ దగి • నట్టిది యంచు మహాద్భుతంబునన్
దేవతలెల్లఁ జూడఁ గపి • ధీరుఁడు మున్నుగ వంగి పాదముల్
లావున నూని త్రొక్కి విపు • లన్ దిగఁబాఱె మహేంద్ర మయ్యెడన్.

ఉ॥ వాలము పైకి నెత్తి బలు • పాదములం గుదియించి వక్షముం
బోలఁగఁ గ్రుఁచి యంసములు • పొంగఁగఁ గంఠము వంచి బాహువుల్
వాలిక ముందు చాఁచి తల • బ్రహ్మపదంబును ముట్టఁ బెంచి నే
త్రా లల లంకపై నిగుడ • దర్పము తో వెస దాఁటె మింటికిన్.

తే॥ హనుమ యారీతి నెగయంగ • సతనితోడ, విభుని కార్యంబుకై పోవు • విధము దోఁపఁ
దరువులును పెనుశిలలును • ద్విరదములును, తక్కు ఘన వస్తువులు వియ • త్స్థలికినెగసె.

ఉ॥ మారుత వేగుఁడైన హను • మంతుఁడు నింగికి నట్లు దాఁటగా
బోరున వెంటలేచు విట • పుల్ పెనుగుండ్లును తక్కు ప్రాణులున్
వారక దక్షిణం బరిగి • వైళమ లంకను చేరు [illegible]క్తి పెం
పారమిఁ ద్రోవఁబడ్డ క్రియ • నంబుధిలోఁ బడియెన్ గుభాలునన్.

చ॥ గగనమునన్ వడిం బఱచు • గాడుపు పట్టి మహాశుగోద్ధతిన్
మృగములు ప్రాఁకులున్ లతలు • మిక్కిలి సంద్రము పొంగునట్లుగా
దిగఁబడి యెల్లెడం బరవి • ధీరుఁడు రాముఁడు కిన్క నూను ముం
దుగనె పయోధి యందయిన • తోరపు సేతువు వోలె నేర్పడెన్

చ॥ ఉరవడిచేత భేదిలె మ • హోదధి క్రిందటి నాగలోకమున్
విరివిగఁ గాననయ్యె మణి • బృందము కన్నుల మిట్టిపాటుగా
మెఱసెఁ దదున్నతిం గని స • మీరణ పుత్త్రకుఁ డేను నాగరా
ద్వరభువనంబు గాంచఁ దగు • భాగ్యము గాంచితి నంచు మోదిలెన్.

ఉ॥ ఱెక్కలతో మహార్ణవము • ప్రీలఁగ నేగి సురామృతంబు పే
రుక్కునఁ దెచ్చినట్టి విహ • గోత్తము సత్త్వము నెల్లవేళలన్
మిక్కిలి పల్కుచుండెడు స • మీరణ భోజులు వెండి తార్క్ష్యుఁడే
యిక్కడ కేగుదెంచె నని • యెక్కువ భీతిలి పాఱి రెల్లెడన్.

మ॥ లయకాలానలు పోల్కి నేగు కపిజా • ల వ్యాఘ్రవేగోన్నతిన్
సయిఁపన్ లేక చలించి తూఱు తిమి మ • త్స్య గ్రాహ పాఠీన సం
చయముల్ తెట్టెలు దేల నంబుధి మహా • సంక్షోభముం బొందఁ ద
ద్రయ వీచీ నికరంబు మున్నుగనె మోఁ • దం జొచ్చె లంకాపురిన్.

చ॥ సకల చరాచరంబుల ద • శల్ వచియింపఁగ నేల? దిక్కరుల్
కకవికలయ్యెఁ బంతమున • గాడుపు మేరువు నూఁపువేళ నా

సికరము పెల్లగిల్లి కడు • శీఘ్రగతిన్ జలరాశిమీఁదఁ గం
దుకగతిఁ జిమ్మనం జరుగు • తోయము దోఁచెఁ గపీంద్రుఁ డేగుచోన్.

ఉ॥ మండలధార నేగు పెరి • మాపుపయిం జను వజ్రి కంటికి
న్నిండుగ భారమై పరఁగు • నెవ్వడిఁ గొండలు వారిరాశి భూ
మండల మొక్కటయ్యెంజనగొను • మూర్తిముగాఁ గనుఁగొట్టుచుండ బ్ర
హ్మాండములెల్ల నొక్కటగు • నట్లుగ నేగెను పుష్పకంబు నాన్

తే॥ వేల్పులు నుతింప మునులు దీ • వింప జనులు, మ్రొక్కమారుతి యెగ పడి • మునుకొనంగ
దానవుని కసిదీఱ మ • ర్దనముసేయ, శివుని వికి చను కైలాస • శిఖరిఁ బోలె.

తే॥ బ్రహ్మకంబె విష్ణుని యా • బ్రహ్మవారి, ధర్మవర్తనుఁ డేగుచోఁ • దడపునుండి
యెడసియున్న త్రికూటమన్ • కొడుకుఁజూడ, మేరు వాహుగగతి నేగు • తీరుదోఁచె.

చ॥ పలపల బ్రుంగఁదారకలు • స్వర్గము క్రుంగఁ బయోధి పొంగ ది
క్కులు వడి మ్రంగఁ బెనుహలు • కొండలు పావగలంగ మేరువున్
వెల వెల చెంగ రాఘవుని • విక్రమ సాయక మట్టు లేగు క
ట్వాలి కొడుకొప్పెఁ గల్పమునఁ • బర్వు ప్రచండ సమీరణుం డనన్.

తే॥ పంక్తి కంఠుఁ డింద్రియములఁ • బడిల పఱచి, లిఖిచి చేయు రపంబు పూ • ర్తిగ నశించె
ననెడు సూచన సుర్తెం • మున జనించి, దిక్కులను బోపు భాను చం • దమ్ము దోఁచె.

తే॥ క్రూరులు వసింపు లంకను • చేర జంకి, యితర పురముల నుండంగ • నిచ్చ లేక
రాము శరణంబు నొంది ప • రల వసింప, నరుగు ధర్మనాజ్ఞాచక్ర • మనఁగ నొప్పె.

తే॥ ఒడలికాంతి పెంజీఁకటి • నెడలఁ దోలఁ, గనకగిరి సిగ్గిలంగ నా • కసము నంటు
దీర్ఘ భుజుఁ దంతవేశ ను • దీచి దిశను, వికటముగఁ బుట్టి వచ్చెడు • విధుని పోలె

తే॥ వెన్ను నాజ్ఞచే లావు చూ • పింపఁ గోరి, గిరులు పెన్నంట మొగులులు • కెరలి తూల
జలధులు గలంగ దైత్యుల • తెలివి చెదఁగ, వచిగ నెగసెదు గరుడుని • పగిదిఁదోఁచె

చ॥ సురుచిర పుణ్య లొందుటకు • సూటిగఁ బేర్మిగ నొప్ప, నొక్కచే
చరణమునన్ ముకుందుఁడు వ • శంపడఁ గొల్చిన లోకజాలమున్
బెరయుచు దాఁటి యెల్లరును • బెగ్గడిలంగ మరుత్సుతుండు తా
నురవడిఁ గాలపాశమన • నొప్పిన వాలునఁ గొల్చె నత్తటిన్.

ఉ॥ క్ష్వేళితముం బొనర్చి వడిఁ • గ్రీడగ నంబుధి దాఁటు వీరు లాం
గూలము చూడ నొప్పె శ్రుతి • గోచరు రాము దయాబలంబుచేఁ
జాలిన యాంజనేయుఁడను • చక్కటిఁ దోడుగఁ గొంచు గర్వ దై
త్యాలికి జంకి వంటఁ జను • నంతకు పాశముఁ బోలి యయ్యెడన్

తే॥ శౌరి యాజ్ఞచే గరుడుండు • చేరినంత, కనకగిరిఁ జుట్టి గట్టిగాఁ • గవ్వికొన్న
చిలువ ఱేఁడు చలించి కుం • డలము వీడి, యవలి కేగు బాగున నొప్పె • ననుమ వాలు.

క॥ హనుమఁడు వెడలెడు వేగం, బునఁ బుట్టిన గాలివీవఁ • బొలుపతి యొందొం
టిని తాఁకి విఱిగి పడి జడ, ధిని మునిఁగె విమాన చయము • దివ్యులు బెగడన్.

క॥ వడి నేగు మారుతిం గని, చిడిముడి పడి విబుధు లితని • చింతనమేదో ?
బెడిదులు గల పురిదాఁకనె, నడచునొ కదచునొ యటంచు • నడిఁకి రెడఁదలన్.

తే॥ హనుమ మేనివాయువున ది • శాంతములకు, నదరు కదలియుఁ గలగుండు • వడిచెడంగఁ
బొదవువని గ్రంథములఁజెప్పఁ • బడుచునుండు, తిమి తిమింగిలములుచచ్చి • తెప్పదేలె.

తే॥ అసదృశాత్ముఁ డఖ్లేగుచో • నలవు వేగ. మొసఁగు నిశ్చల దీర్ఘ బా • హువులు రామ
లక్ష్మణులు కరుణాళువు • లక్కడఁక ముందు. పోవు పోలిక గనిపించె • పొలుపు మీఱ

## కడలినుండి మైనాకుఁడు లేచుట

తే॥ మకరకేంద్రముఁ బోలిన • మారుతి యటఁ, బవనువలె నేగ మైనాక • పర్వతంబు
నడుమలేచెను కలశాబ్ధి • నడుమ నుండి, ప్రచ్యుతచి లేచు నైరావ • తంబు కరణి

తే॥ వేయి బంగరు శిఖరముల్ • వెలయ నతము, పాఱు సెలయేళ్లు తెలివల్లె • వాటుగాఁగ
నసుర బాధల నడఁగింప • నబ్ధి నిద్ర, వీడి వెసలేచి వచ్చిన • వెన్నుఁ డనఁగ

చ। నెఱిఁ జదువంగ లేక వినక • నేరక యింద్రియ లోలుఁడైన వే
దుఱు మెడ నిక్కకై వడిని • తోరపు భారముచేఁ బయోనిధిన్
విఱిగి మునుంగు చుండు తఱి • వెన్నుఁడు కచ్ఛపమై వహింపఁగా
నురవడిఁ బైకి రేచిన మ • హోన్నత మందర శైల శేఖరిన్

తే॥ నెగయ ననువుగా ఱెక్కలు • నెగడు చుండఁ, గ్రమకాంతితో గంభీర • కంధిఁజీల్చి
కొనుచుఁ జని సుధ నాగుల • కొనరనిచ్చి, లేచునట్టి సుపర్ణుని లీల యనఁగ.

తే॥ మొదలు తుది యెఱుంగఁగరాక • మొనయువిష్ణు, కిరుణచేఁదొల్త జలమందు • గలిగి సకల
జగములను సృష్టి సేయంగఁ • జాలినట్టి, యజుని దన్నట్టి యాహిర • ణ్యాండ మనఁగ

తే॥ తన్ను మును నీటఁ గాంచిన • తండ్రిఁ గనక, సత్కృతులఁ జేయ లేనని • స్రష్ట తలఁచి
యంద మునిఁగి మహాతపం • బాచరించి, పూర్తిగావించి కొని లేచు • పొలుపు దోఁప

ఉ॥ శానిదుమాల లెక్కడని • తప్పున కోర్వఁగలేని మౌని కో
పానఁ బయోనిధిం బడిన • భాగ్యము లెల్లను వెండి యీయ శ్రీ
శానుఁడు పూనునాఁడు కెల • సంబున దివ్యులు దైత్యులున్ వడిన్
జానుగఁ జిల్కఁ బాల్కడలిఁ • జయ్యనఁ దోఁచిన చంద్రుఁడో యనన్.

సీ॥ ఒక వంక నెఱుపు వే • తొకవంక నలుపునౌ, ఘన శరీరచ్ఛాయ • గడలు కొనఁగ
పవడంపుఁ దీవల • పఱపు గాత్రముతోడ, కమనీయ ఘనశిఖ • రములు వెలయ

గుహల నద్రములు మే • ల్కొని విశ్వసింపంగ, ముత్తెంపుఁ బుర్వులు • మొనసిమొరయ
పటిక బండల మీఁది • పండు మౌక్తికములు, లివిరి చందురు డాలు • దీటుసేయ

తే॥ రత్నరాశి వెలుఁగు శిఖ • రములు హస్త, ములవిధంబునఁ గానరా • జలధి మునిఁగి
మణుల మొత్తముల్ చేవారి • గొనుచుఁ బైకి, లేచి వచ్చెడు మానిసి • లీలదోఁప.

తే॥ సౌధములమీఁద మెలయు ధ్వ • జంబులట్లు, నిర్ఝరశ్రేణి తెల్లనై • నెఱసి పఱవఁ
బనిగ వనధివలన వెలి • వడిన కతనఁ, ద్రుళ్ళి దొనలలోఁ బెను మీలు • త్రొక్కటపడ.

తే॥ శత్రు షట్కంబు ముప్పగ • నమయఁజేయు, జ్ఞాన మొప్పార శంకలు • మాను వారి
కరణి సర్పముల్ గుహలలోఁగష్ట మొంది, బయల నప్పు డూర్చుచు హాయి • వడసి నిలువ.

చ॥ అతులిత ధీరుఁడౌ హనుమ • యద్దముపై నొక యుద్దిగింజ యొ
క్కటదవ దొర్లులోపల న • కాశమునన్ గగనంబు నంటి ది
క్తతులకుఁ బర్వి నిల్చిన యు • దగ్ర మహీధ్రము నక్కజంబుతోఁ
గౌతుకముఁ గాంచి యేమిది యొ • కో యని యించుక చర్చ సేయుచున్.

ఉ॥ ఇయ్యది వార్ధినుండి పయి • కెక్కి నిలంబడెఁ గారణంబు లే
కియ్యెడఁ బాద మూన్పుటయు • నెగ్గగు నంచెద నిశ్చయించి దా
నయ్యవనీధరం బెగసి • యవ్వల దొల్లఁగ ఱొమ్ముతో వెసన్
బ్రయ్యఁగఁ దాఁకి యవ్వల ది • వంబును దాఁకఁగ దాఁటె మింటికిన్.

తే॥ జలధినుండి లేచిన గిరి • వరుఁడు తలరి, యురలి చలియించి చింతించి • మరల లేచి
మనుజరూపంబుతో నిల్చి • మానసీయ! విన్నపం బొండు వినుమని • వినిచె నిట్లు.

సీ॥ పగవాఁడనుచు మది • భావింప వలదయ్య, తొల్లి కొండలు ఱెక్క • లుల్ల సిల్ల
భువనంబులకుఁ గీడు • పొనరించు చుండ నిం, ద్రుఁడు వాని ఱెక్కలు • తుండ్లుగాఁగఁ
ద్రెంచిన తఱి వాయు • దేవుఁడు ప్రేమతో, నీచోట నను చేర్చి • కాచినాఁడు
మిత్ర పుత్త్రుఁడవను • మేల్మి ప్రేరేఁప నా, వలన వేఱగు మేలు • కలదె యనుచు

తే॥ నరసి యిట వచ్చినాఁడ మ • హాత్మ! నీవు, రమ్యకాంచనమయ శిఖ • రంబులందు
కొంత విశ్రాంతి గొనిపొమ్ము • కూర్మిమీఱ, నేనుధన్యుఁడ నౌదు నీ • హితమువలన.

తే॥ నీతినిధి రామునాజ్ఞఁ బూ • నిన కపీంద్రుఁ, డమరులు సుఖింప జానకి • నరయ వచ్చె
మంచియదను నీ భాగ్యమ్ము • మాఁగె ననుచు, వాహినీపతి సెలవిచ్చి • పంపినాఁడు.

తే॥ తల్లికంటె మేలని నన్ను • దలఁచి యిందు, కొంత శ్రమ దీర్చికొని విందు • గొందుగాక
యింటి కేగుదెంచినపుడె • హితుల సత్క, రింపకున్న వేఱొండేది • యింపు నింపు.

క॥ అను నాతని నయ వాక్కుల, విని పావని యతఁడు హితుఁడు • విమలుఁ డనుచు నె
మ్మనమునఁ దలఁచి స్మితుండయి, తను చూడఁగ నెదుట నిలిచి • తద్గిరివరుతో.

చ॥ శ్రమ మొక యింత లేదు రఘు • రామ పదాంబుజ చింతనంబుచే
నమల మనస్కః నాయకుని • యానతి నాదగు కోర్కి తృప్తిగా
నమరక మున్నె యోగిరము • నాదటఁ గైకొనఁజాల నీదు ప్రే
మమె నను తృప్తుఁ జేసె విను • మాన్యత నన్నియుఁ గొన్న యట్లైకా ?

ఉ॥ వేఁడకమున్నె పిల్చి యిడు • వీరుల, వేఁడిన నిచ్చువారలన్
బోఁడిమి సంస్తుతింప నిడు • పూరుషులందు గుణంబె ముఖ్య మీ
పాడగు దేహమం దిదెడు • పాటికి నెమ్మికకంటె నున్నదే ?
ఊడిగ ముందునేమి మఱి • యుర్విని మక్కువకంటె హెచ్చుగన్?

తే॥ వడిగ నేగి త్రికూటాద్రి • పైని లంకఁ, జేరి యేలిక పని పూర్తి • చెందునేని
మరలి వచ్చుచో నీవిందు • పెరిమఁ గొందు, ననుచు సత్యప్రతిజ్ఞుఁడా • హనుమవెడలె.

చ॥ గగనమునందు ప్రొద్దు నెద • గందును రిక్కలు స్వర్విమానముల్
మొగుళులు నొక్కచోఁ గలిసి • ముద్దగఁ జేరఁగనయ్యె వేఱు వే
ఱుగఁ గల వస్తుజాలములు • ఱువ్వన వీచెడు గాలిచేత నొ
క్క గమిగఁ జేరు నప్పగిది • గాడుపుపట్టి గమించు నుర్విడిన్.

చ॥ జడనిధి నుద్ధతిం జను ప్ర • జాహితు వేగముఁ గాంచి భాస్కరుం
డడుగిడలేని శైశవము • నందె మదీయ రథంబు మీఁదికిన్
దడుకున దూఁకె నేరి పయి • దూఁకఁగ నిప్పుడు నిశ్చయించె నీ
జడియని దిట్టయంచు మది • జంకు వహించుచు నుండె నయ్యెడన్.

ఉ॥ కత్తినిపోలు వాఁడి పలు • కాంతి నభోమణిచెంత వెల్గఁ బై
కెత్తిన తోఁకతోడ విరి • యించిన మేను నభంబుఁ గప్పఁగా
నత్తఱి రాహుఁబోలె నతఁ • డగ్గుఁ జీఁకటి పైని కాంతి రే
కొత్త మహోపరాగ దిన • మో యన నొప్పె జగంబు చూడఁగన్.

## సురస హనుమ నడ్డగించుట

తే॥ ముజ్జగంబుల కష్టంబు • లుజ్జగింప. సమ్మతించి వచ్చిన కపి • చంద్రు సత్త్వ
మెంత కొలఁదిదో యెఱిఁగి ర • మ్మి యనంగ. సురల యనుమతి నెదుటికి • సురసవచ్చె.

తే॥ బాకి నోరు రక్కసి రూపు • పడసి వచ్చి. కాల భీకర సమూర్తి శా • ఖామృగంబు
నాకు నామిషంబై వచ్చి • నాఁడ వింక, నెచటి కేగెద వని యొట్ట • యెదుట నిలిచె.

క॥ అదరుచు మండెడు నాఁకలి, నడఁపగ మత్కుటిల దంష్ట్రి • కా కీర్ణంబై
బెడిదమగు కడుపుఁ జొరుమా, విడివడ నొక త్రోవ లేదు , వినుమా యనుడున్.

తే॥ ఆఁడుదాన వాఁకలి బాధ • నలసి తీవు, దేవదేవు నాజ్ఞను తీర్చి • తిరిగివచ్చి
నీకు నాహుతి యయ్యెద • నిజము విడువు, మనుచు మారుతి నవ్విన • యంత నామె.

మ॥ భువనంబుల్ గనుఁగొంచు నుండఁగనె నీ • వింగాల్చి భక్షించెదం
జపు లూలంగ నటంచుఁ బల్కఁగ నిశం • క శ్రేష్ఠుఁ డుద్దండుఁడై
నవుచున్ నీ యుదరంబు చొచ్చెదను వి • న్నాణంబుమై నీవు జా
ఱవ యేనిన్ గ్రసియింపుమా యనుచుఁ గి • న్కం బొంది యన్నారియున్.

సీ॥ పెక్కండములఁ బట్టి • పుక్కిలి గొనఁజాలు, వివివియౌ వదనంబు • విరిసి నిలువ
నదిగని యప్పీరుఁ • దన్ని దిశలఁ బర్వ, నామె నోరే చిన్న • దనఁగఁ బెరిఁగె
సురసయు మఱిమఱి • వివరియుచు నుండ నా, పిఁడు చిటాలున సూక్ష్మ • తనుఁడు గాఁగఁ
గుదిసి కడుపుఁ జొచ్చి • బయలుచ యూపిరి విడు, సంధిలోఁ గుప్పించి • యవ్వల దాఁటె

తే॥ వేల్పులు మెచ్చి కురిసిరి • విరుల వాన, కార్యదీక్ష సనుమ వోపఁ • గడఁగ నామె
స్వస్వరూపంబుతో మెచ్చి • చనపుతోడ, ముచ్చటించి దీవనలిచ్చి • పుచ్చె నతని.

క॥ పాడిరి పాటలు కిన్నరు, లాడిరి రంభాదు లుబ్బి • యభినయములతోఁ
గూడిరి పొగడుచు విబుధులు, వేడిరి దీవించి మునులు • వేదోక్తులతో.

క॥ మందార కుసుమ వాసన, చిందించుచు వీచె గాలి • చెమ్మట వీడన్
జందముగా విద్యాధర, సుందరులును వాదనమునఁ • జొక్కించి రొగిన్.

## అంగారధార హనుమంతుని మ్రింగుట

సీ॥ హాలాహలము బోలు • నంగారధారయన్, రక్కసి యొక జల • రాశి ముంప
వేడొక్క జలరాశి • విరిసిన రెట్టఁగున, లేచి యెన్వాటు నను • లీల దాఁటు
వాఁడంచు గర్జించి • పావాంగదమ్ములు, మున్నీరు పొంగిన • మొగిని మొరయ
వేదవేద్యుని త్రోవ • వెసికి యడ్డగించి, పొడచూపు మృత్యువై • భువిని వోలి

తే॥ కార్చిచ్చల పెడంగు చిందించు • కోఱలొప్ప, నడిపు చందాన గజచర్మ • మమరఁ గప్పి
బ్రహ్మగోళంబునకుఁ జను • ద్వారమనఁగఁ, బెరపి వదనంబు విప్పియా • తెఱవ నిలిచె.

తే॥ జలధి పాపముల్ గనఁగ శీ • ర్షంబు లంటి, సోకుచున్నట్లుగాఁ బెరిఁగిన • చొప్పు గాంచి
యధిక మేధావి మారుతి • యాత్మ దలఁచె, దయయు ధర్మంబు మ్రింగిన • దైత్య యనుచు

ఆ॥ దాని నోటఁ జొరక • తప్పించుకొని పోవు, దారి గనక చింతఁ • దవిలి తేఱి
గుహనుబోలు కడుపుఁ • గ్రొచ్చి యచ్చోలి కేగు, బువితమంచుఁ దలఁచి • యొయ్యఁ బలికె

శా॥ ఛాయా గ్రాహక శక్తి నొందిన గతిన్ • సాధించుచున్నావు న
న్నీయీ చందములన్ గ్రహించియు బలం • బింకేఁ గనన్ లేవు నో
రే యాకాశముఁ బోలఁ గవ్వికొని దా • రిం బట్టి బంధించి తి
ట్లే యేరీతిఁ జరింతు వెవ్వతవు నీ • వెందుందు తెల్పంగదే ?

చ॥ అనవుడు దైత్య యిట్లనియె • నాఁడుది యన్న తలంపు వీడు డా
సిన యవి జీవముల్ గొనుచుఁ • జెల్లఁగఁజాలవు కాలుఁడైన నేఁ

దినఁ దలకొన్న ప్రాణులను • తేఁకువతో విడిపింపలేఁ డహో
వనచర! నీవనంగ నొక • పాటియె నాకని నోరు విప్పుచున్

చ॥ గుటుకున మ్రింగ మారుతియుఁ • గోరికతోడనె దైత్యగర్భమున్
దటుకునఁ జేరి వేలుపులు • ధర్మువు చాలఁ దపించుచుండఁగాఁ
బుటుకున వెల్వడెన్ నృహరి • భూరి భయంకర మూర్తి పోలికన్
బటుకున దాని గర్భమును • వ్రచ్చిన చేతుల నాంత్రరాజితో.

చ॥ మదవతియైన దైత్య యటు • మాసెను తోలుచుఁ బ్రేవులెల్లఁ ద
త్పదములఁ జేతులం బెనఁగఁ • దావని మింటికి నెక్కె ముండ్లతోఁ
బొదలు పొదల్గలట్టి గుహఁ • బూనికఁ జొచ్చి మహోరగంబుగన్
బొదివి వడిం బయల్పడిన • ప్రోద్ధత పక్షిని తార్క్ష్యుకై పడిన్.

తే॥ ప్రేవులంగొని వైళంబ • వింటి కెగురు, హనుమ ఘన చిరంజీవుల • యందు మేటి
వాలపాశమ్ము తోడ నం • బరమునందు, దిరుగు గాలిపడగఁ బోలి • తేజరిల్లె.

క॥ దురపిల్లిరి దైతేయులు, సురలు ప్రహర్షించి యార్చి • సోట సోట విరులం
గురిసి రజుఁడు మెచ్చెను శం, కరుఁడచ్చెరువందె మునులు • గని రగ్గలికన్.

తే॥ చెడుగు నోటిని కడుపును • చీల్చివైచె, దనుజ గూలె నిభంబున • హనుమ యేగె
మేరువును మీఱి పెరుఁగు సా • మీరి పడియు, నెడఁద పడికంబు హెచ్చని • నుడివె రవియు

తే॥ కవుల యూహలమించి యీ • కదలియొప్పె, విఘ్నములవెన్ని యొదవిన • వీఁగఁ కేగఁ
జేరుదును లంక, చేరిన • సిద్ధి యొదవు, ననుచు మారుతి చింతించె • మనమునందు

చ॥ తిరమగు ధర్మముం గొనక • తెక్కలి దైత్యులు చేయు పాపముల్
భరమయి లోకముల్ బహుళ • బాధల నొందుచునుండెఁ దీఱు చొ
ప్పరయగ వేఱు లేదు సక • లాపదలం దొలఁగించు లోక సుం
దరుఁడగు రామచంద్రు శుభ • తారక నామము దక్క నీ భువిన్.

ఆంజనేయుడు ప్రవాళగిరిం జేరి లంకను గాంచుట

ఉ॥ ఊటలు పాఱు కేనియల • నొప్పగు కల్పక వాటి దేవతా
వాటము డాసి యింటఁ జను • వాయుతనూజుఁడు ధర్మకూటమౌ
కోటలు పేఁటలుం గనక • కోరిక లంకకు నేగ కివ్వడన్
దోఁటలు దొడ్వులున్ విరిసి • తోఁచు ప్రవాళగిరిన్ వెసన్ దిగెన్.

ఉ॥ అంబర వీధినుండి వడి • నాఱగ ఘూనుఁడు డిగ్గ నగ్గిరిం
ద్రంబు చలించి పట్టుడిగి • తద్దయు నుబ్బటలూఁగె వస్తు జా
లంబులు నిండఁగల్గి విపు • లంబగు నబ్ధిని గాలివాన చై
దంబున వస్తువుల్ దొరలఁ • దాళక యూఁగెడి నావకై పడిన్.

చ॥ ఇల యడుగున్న యంతయు వ • హించి పునాదిని మేలి పై జగం
బులపులరుం దెరింగిన య • ట్లాతి విచిత్రిత లంక ముందటన్
గల గిరిమీఁద నిల్పి యటఁ • గన్నుల మేరమిఁ దేఱి చూచె న
ర్లలస ముఖంబుఁ గాంచు మఱి • రింబన నొప్పిన యమ్మహాపురిన్.

చ॥ ప్రియమునఁ గాంచి మున్కుమయి • ప్రేరిది యింద్ర పురంబు దీనికా
ప్పయినది యంచుఁ బల్కె మఱి • హైన్యము దెల్పు జగంబు లెల్ల వే
జయము గడించి యెల్ల సుఖ • సంపదలం గొని యేలుసట్టి దు
ష్టయుఁ డగు రావణుం డిచట • రాజిలుచుండఁగఁ దీక్ష్ణబాహుఁడై.

చ॥ అమరపురంబు భోగముల • కాలయమంట యథార్థవార్త కా
దమరిక నెల్ల భోగముల • నంతములై తమ కోరినంత దూ
రము తగనొందుచున్ నిలువ • రంబయి వేసరకుందు రెందు గం
దుమొ యదియే దివంబగు ద్రు • తుల్ పచియించెదు సర్వ మద్దియే.

చ॥ పలుపగు లంక రెండయిము • వందల యోజన విస్తృతంబువే
నులుపగుచుందు రిందు ఘన • నోన్నత వస్తువులెల్లనుండుఁ గీ
లెఱిఁగిన సూక్ష్మబుద్ధులు న • హీనతఁ గాంచఁగఁ గోరినంత పె
ద్దఱికము నొందునే కినులు? • దండడి వింతలు మేర నొందునే?

## 2. పురాన్వేషణ పటలము ( 234 )

చ॥ మొగుళుల దాఁటి చంద్రముని • ముట్టెదు మేడలు పైఁడి మేడలో?
సొగసగు రత్న సౌధములో? • చూడఁగఁ జాలని మించు తిప్పలో?
తొగల విరోధి దీధితుల • తో ఘటియించినవో, మఱేవియో?
తగ నెఱుఁగంగఁ జాలని వి • ధంబున నున్నవి నా యెదందకున్.

క॥ అమరావతి మేడలతో, నమరిన దిందొక్క భాగ • మనఁదగి మిగులం
గొమరారు సౌధములు మల, య మారుతము వచ్చు మాడ్కి • నడరుచునుండెన్.

ఉ॥ తీయని పల్కులం జెలఁగు • దివ్య మృగాక్షులు మించు తీఁగలన్
బాయక పట్టి పట్టి యొక • పాటిగఁ జీఁపరు గట్టి మేడలన్
మాయఁగఁ జేయు గందవొడి • మాటికిఁ జిమ్మి తొలంచి స్వర్ణదీ
తోయము ముంచి తెచ్చి యటఁ • దోఁగఁ గలాఁపి విదుల్తురెప్పుడున్.

ఉ॥ నృత్యమువేళఁ దాళము గ • ణించెడు గజ్జెలచేత లక్కచే
స్తుత్యములైన కాళ్ళ సొగ • సుం గొను ప్రేళ్ళ ప్రవాళకాంతులన్
నిత్యము వీవ నెత్తినయి • నీరదముల్ తమ దేహ సామ్య సాం
గత్యము వీడి యాచెలుల కైశిక • సామ్యము నొందు నయ్యెడన్.

ఉ॥ కస్తురి తావి వీచు నవ • కల్ప పరీమళ పుష్పగుచ్ఛ వి
స్రస్త మరంద మాని భ్రమ • రంబు ఉత్పత్తిని పొంది వేగ వి
న్యస్త వినూతన ప్రియము • లై సురలోకము లీలఁ జేరుచున్
విస్తుల చంద్రశాలలను • నెమ్మదిమై విహరించుచుండెడిన్.

చ॥ నిరుపమ మాధురిం జెలఁగు • నీటు మృదూక్తులు కీర శాబకో
త్కరముఁపస న్నయంబున ము • దంబున నేర్పుచునుండు కాంతలన్
విరివిగ డిన్న దీధితులు • వి ్ ్ న కుడ్యములందు దోఁచు నా
తరుణుల నీడలం దెలిసి • లిప్యముగా వచియింప శక్యమే?

ఉ॥ డంబుగ నింద్రుఁ డుండఁగ నె • డంబుగఁ గట్టిన వైజయంత సౌ
ధంబును బోలు నియ్యవస • ధంబు లనం గొఱయే యగుం జుమీ
యింబుగ నావసస్సు సరి • యే యన దైత్యుల భోగ భాగ్య సం
ఘంబుల కొక్క మేరయును • కల్గను బోలికయుం బొసంగెడిన్.

తే॥ ఎట్టి మేటి రత్నములైన • నీడ్యమైన, కౌస్తుభంబునకున్ సాటి • గాంచనిక్రియ
విశ్వకర్మఁడే స్వయముగా • వేడ్కతోడఁ, దీర్చి కట్టు సౌధములకు • దీటు నున్నె?

తే॥ ఎల్ల ప్రాణులు చొచ్చి ల • యింపఁ దగిన, భువననాయకు నుదరంబుఁ • బోలు లంక
అర్క తేజులు దక్క న • జాండమందు, తనరు హరులెల్ల నిందున్న • వనఁగఁదగును.

తే॥ తరువు లెల్లను కల్పక • తరువులె యగు, మేడలెల్లను బంగరు • మేడలె యగు
దాసదాసీ గణంబు త్రి • దశ గణంబు; పరుల కరుదిద్ది బహు తపః • ఫలమ యగును.

చ॥ దురమున నోడఁగాఁ దొలఁగఁ • ద్రోయుటచే దవుదవ్వు దిక్కులం
జరుగుచు నిల్చినట్టి వగు • సామజముల్ తగ నైదు హస్తముల్
పరఁగు వినాయకుండును వి • భావసుఁ డెక్కెడు నొంటికంటి పె
న్నరదము నన్న యివ్వి పుర • మందునఁ జేరనివై యెడంపడున్

తే॥ అమరవరులం దెవండు లం • కాధిపునకు. సేవ సేయక తప్పిన • రీవికాఁడు
ముగురు మూర్తుల మించియు • నెగడు నితఁడు, చేయు తప మెట్టిపాటిదో • చెప్పవశమె?

తే॥ ద్విరదముల ఘీంకృతులు దుందు • భి స్వనములు, శరధిఘోషంబు మార్కొని • మొరయుచుండు
మధురవాణుల నూపుర • మంద్ర వినవ. మన్ని రవముల నడఁగించి • యదరుచుండు.

తే॥ రత్నమయ రథశాలలు • రవియు బిడియ, మొందు కాంతులతో వెల్గు • చుంటచేత
దీనిముందర మేటియౌ • త్రిదివ జగము, నరకలోకంబువలెనె గా నంగఁబడును

ఉ॥ అందమఁ ద్రావు చందమున • నారసి యచ్చె గుటుక్కుమంచు మ్రిం
గం దమి గొల్పు నంగమునఁ • గ్రాలెడు నిప్పురి నిండుకాంతు లిం

పొందఁగ వీచు ద్వేషగుం • ధూమలు దైత్యులు మేనిరంగు నీఁ
గం దరినేగు చందురుఁడు • కందును నీఁగఁ బయోధి పైఁడిగాన్

చ॥ నగర నిశాంతకాంతి కిర • ణంబులు చీఁకటి మ్రింగుచేఁతరుణ్
జగములనిండు సంధ తిమి • సం బడఁగించు దినేశు చేఁతదున్
దగ నుపమింపరా గిటులు • తప్పి వచించుట న్యూనతన్ గనున్
దొగల విరోధి ముందఱు ము • ణుంగులు లట్టుల నుండు నియ్యెడన్.

తే॥ గంధమును తేనె కస్తురి • కల్పతరుల, క్రొవ్విరులు పరిమళమును • కూడి పాటి
కదలిఁ గలియుటచే నందు • గిలుగు మీలు, గరపు గొచు వాసన పీటి • పరిమళించు.

క॥ పొగడుదమ విశ్వకర్మను, బొగడుదమా పంక్తికంఠు • పూజ్యతపంబున్
బొగడుదమ యజుని వరములఁ, బొగడ వశంపులమె బ్రమయు • ములుచల మెదియున్.

చ॥ అడవులు తోఁటలున్ మణుల • హాటకమందు ఖచించి చిత్రకా
రుఁడు తగ నిల్ప నయ్యవి యు • రుస్థితిఁ బూవులు పండులిచ్చు గా
రదము క్రియన్ విచిత్రగతి • రంజిలు నిచ్చటి సోయగంబు వెం
గడమగుఁగాక పొందఁటయుఁ • గల్గునె స్వర్గము నీ ధరిత్రియున్.

తే॥ అవని జలమగ్ని గాలియు • నాకసంబు, లను మహోన్నతిచే గొప్ప • తనము గనవు
గోపు రౌన్నత్యమును కనుఁ • గొనియెనేని, పౌష్ణమల యెంత లజ్జించి • పుల్లసిలునొ?

చ॥ తిరమగు వప్ర కుడ్యముల • దీధితులే మిఱుమిట్లు గొల్పఁగాఁ
ధరణి కనుంగవ న్మోగిచి • తద్దయు సిగ్గిలి యిప్పకంబుపై
నరుగఁ నేరకే జనము • లందురు క్రూరగుణుండు పంక్తికం
ధరుఁ దలుకన్ వహించునని • దద్దఱి పోవఁడ యన్న యూహమై.

తే॥ జన్మవైరులై సత మెగ్గు • సలుపువారు, నిర్జరులెయంచు వారల • నిలువరింప
దానవేంద్రుఁడు కట్టించె • దారికడ్డు, గోడయన నొప్పుచున్నది • కోట పొడవు.

ఉ॥ పోవదు కోటదాఁటి జగ • మున్ జడిపించెడు చుట్టుగాలియున్
బోవవు భాను దీధితులు • పోవదు కాలుని దార్ఢ్యబుద్ధియున్
బోవదు ధర్మదేవతయు • భూజనులిచ్చెడు యాగభుక్తి కా
పోవక వేచు వేలుపులు • పోవుదురంటయు వ్యర్థవాక్యగున్.

చ॥ అసదృశ భంగ సంగత మ • హాంబుధి మధ్యమునందునిల్చి యా
కస మొరయంగ మేర యిదఁ • గానక యున్నతమై పెరింగి యొ
ప్పెనఁగు విమాన సుందరత • హెచ్చిన లంక సనాతనుండు నా
భి సరసిజంబునుండి తగ • వీడిన యండముఁబోలి వెల్గెడున్.

క॥ పాడెడు వారలు పెక్కం, డ్రాడెడు వారంతకంటె • నధికులు చెలులన్
వీడిన వేల్పుల నాటక, మాడించుచు వేడ్క గనుదు • రచ్చటి యసురల్.

ఉ॥ హర్వుగా నటింతు రచట • నమరకాంత లెపుడు గం
ధర్వవనిత లంతకంటెఁ • దరముగా నటింత్రు పై
మర్వుగా నటింత్రు దైత్య • ముగ్ధలందు వారలన్
బర్వి చూచువారు తక్కు • పడఁతులెల్ల వేడుకన్.

చ॥ నవనిధు లెప్పుడు న్నిలిచి • నాఁడెపు భూషణ వస్త్రమాల్య సాం
కవ మృగనాభికాదుల ర • కంబుగ నిచ్చుచు నూడిగీంద్ర కం
దువము వహించి కొల్చుననఁ • ద్రొక్కట నొందు నుతింప నాల్కయున్
దవిలి తలంపఁగా మదికిఁ • చట్టదు పూనిన దోసమే యగున్.

చ॥ తలఁచిన యట్లు నల్వయు ము • దంబున సమ్ముఖమందు నిల్చి తా
వలచిన రీతిఁ బద్ధతులు • పాటిగఁ దెల్పుచునుండ, వేలుపుల్
తెలచి నుతించు మేరువునఁ • దేర్చిన మిన్నుల వారి తెచ్చి తా
మలచిన యట్లు చల్లి పురి • మానుగ శిల్పి ఘటించె నాఁదగున్.

సీ॥ వాద్య గంభీర రవముల • వార్ధి రావ, మడఁగెఁ బరమేష్ఠి తనకేలఁ • దడవఁదగిన
పొడవు శిఖర సౌధంబులఁ • బొలఁతు లెగచు, నగురు పొగచేత మొగిళుల • పొగరులడఁగె

చ॥ స్ఫటిక శిలామయంబులగు • సౌధములందును కల్పకాది రా
డ్విటపులు గల్గు తోఁటలను • వేఱగు లక్కన చోటులందు ను
త్కటముగఁ గల్గువాని ప్రభ • దప్రద మత్తత నాడువారె గా
కిటనెటఁ గానరారు మది • నించుక చింత గలార లొక్కరున్

చ॥ అసురమృగాక్షులం గలిసి • యవ్వనులందు విహారలీలలన్
విసువక సల్పుచున్ మధువు • వేడుకఁ ద్రావుచుఁ బాడుచుండ సం
తసమున విన్చు మోవిగొని • తన్పుచు సొక్కుచుఁ గిన్కనూనియు
న్న సకులు తేఱ మ్రొక్కి దయ • నల్వఁగ గాంచెడు వారలే చుమీ.

తే॥ స్తనగిరులపైని వ్రాయు చి • త్రంబులంట, నలుపు మేనుల నలముచుఁ • బొలయువారు
అలుగు పడఁతుల పారాణి • యంటియున్న, కేశములను రాక్షసవరుల్ • కిఱుకువారు.

తే॥ చిన్ని పెదవుల విద్రుమ • శ్రేణిఁబోలె, వాడి చూపుల గములఁ గ • ల్వలనుపోలె
వదన వితతిచేఁ జెందమ్మి • వనముఁ బోలెఁ జెలువమీఱినయాలంక • చెలులవఁన

చ॥ అతిశయ చిత్రమయ్యె ద్రుహి • ణాండము మొత్తము నేఁటివాఁక నొ
క్కతలమె భారమెల్లఁ బడి • క్రందుగఁ ద్రొక్కఁగఁ జీలకుండ, నే
వితధముగా భ్రమించి మితి • వెట్టుట యెట్లగు ? నెల్లప్రాణు లీ
దితిజుల సంచయంబు గణు • తింపఁగ సల్గకుఁ జాల వెన్నఁడున్.

సీ॥ ఒడలిచే నున్నతి • నొందినవారువీ, ర్యంబున మితిమీఱి • యలరువారు
జగము లయమునకు • నంసిద్ధులగువారు, వరబలంబున సాటి • పడనివారు

మాయాపులైన దై • తేయులు వసియించు, లంకిరు మేర ప • ల్కంగవశమె?
కాళుల మణిపీర • కిటకాంగదంబులు, హస్తంబులందు క్రూ • రాయుధములు

తే॥ కనుల నెఱ్ఱఁదనంబును • గలుగకుండు, వారలే లేరు; వారలఁ • బదరి యెదలఁ
దలల ఱత్తు: దగులంగఁ • దన్నరుండు, మత్తకాశినుల్ దొరకరు • మందునకును.

సీ॥ ఆసక్తిమైఁ దేఁటు • లలమ నొప్పెడ నవి, యొకరి నీదదరంగ • వెడలునవియు
వెల్లదంతంబులు • నల్లని మేనులు, నెఱ్ఱని శిరములు • నెసఁగునవియు
మత్తిల్లి కొండల • మాడ్కి నుండునవైన, వేదండ తండముల్ • వీఁక తోడఁ
దేనియ గాలువ • రిల్లిన యెఱ్ఱని, వెంద్రుకల్ గల దైత్య • వితతిఁబోలు;

తే॥ స్త్రీలు పురుషులు విసుగుచేఁ • జెదరిపీచు, హారములు కుండలములు మా • ల్యమ్ములెల్లఁ
గరుల మదజలమును తుర • గముల నురుగు, నదులగుచుఁ గొనిపోవఁగ • నుదధి నడఁగు

తే॥ మధువు సేవించి మొగమున • మంచహాస, మమర నసురకాంతలు వాచి • కాంగికములు
గతులు దప్పక చూప దే • వతల సతులు, సిగ్గుపడి మడిసోల వీ • క్షించుచుంద్రు

తే॥ నాశసఱచు టటుండనీ • నగచరేంద్ర, బలము లిట వచ్చుటయు నల • వడునుగాక
భూరి భీకర దైతేయ • వీరపంక్తి, యడరు విప్వీట వారడు • గిడఁగ శకమె?

చ॥ మరలి దినాధినాథ కుల • మండనుతో వివరించుచో ధను
ర్ధరులబలంబె యన్నిట ప • రంబగుసందునొ? ఖడ్గి వారమే
యురవగునందునో? బరచి • యొప్పిన సేనయె దొడ్డదందునో?
బిరుదు వజీర్ల కూట మది • పెద్దది యందునొ? యేమి యందునో?

## సూర్యాస్తమయము

తే॥ లంకఁ గూఱిచి యిట్లు ద • లంచి హనుమ, మత్తు లివటికి వచ్చిన • వత్తురనుచు
మేను క్రుంగించికొని గిరి • మీఁదనుండె, భానుఁడును క్రుంకె నప్పుడు • పశ్చిమాబ్ధి

సీ॥ మనసు పోయిన పోక • లను పోయి జనుల హిం, సించి విత్తమ్ము నా • ర్జించువాఁడు
తలఁపు విచక్షణ • త్వము వివేకనము మా, ననవాఁడు సూక్తుల • విననివాఁడు
కాఁగల చెడుగు లె • క్క గొనని వాఁడు వా, స్తవహీనుఁడగు నొక్క • జనుని కలుచ
విరిసిన పోల్కి • నసురకూటములమాడ్కి, ఋషులు వేలిమి నుండి • రేఁచి పంపు

తే॥ కుంభి చర్మంబుఁ త్రిపురాంత • కుండు తీసి, లోకముల కొక హావడి • లేక సేయఁ
గప్పియుంచిన కైవడి • నొప్పి యంధ, కార మబ్జాండ కుహరంబుఁ • గమ్మిరించె.

తే॥ చిరముగా వేయి నోళులఁ • జిలువ పేఁడు, విడుచు విషము జగంబులఁ • గడి గొనంగ
నెగడి తనవంటి విప్పుతోఁ • బొగలతోడ, నెదురులేకే చెననవొప్పె • నిరుల గములు.

తే॥ సముదుదారుఁడౌ రవికుల • స్వామిదేవి, మాననీయ క్రొత్తడి యగు • జానకిఁ గొని
దోర్బలుఁడు రావణుఁడు కారఁ • ద్రోచుకతనఁ, జెడ్డకీర్తి వ్యాపించెనాఁ • జెలఁగెఁ దమము

అట్లు చీఁకట్లు పరవ దై • త్యాళి యెల్ల, మంచిపద్ధతిఁ బడసిన • మంత్రబలము
వలన దశదిశల్ జరుగంగ • వలఁతులయ్యుఁ. దమము విరిసిన వేళనే • తరలినారు

సహజక్రూరులు రాక్షసు, లహమహమిక నమర నగరి • కరిగెడువారు
త్సహనమున విధుజగమునకు, సహః పతి సామాజు పురికి • సరిగెడి వారల్.

సురరిపు సేవకు విద్యా, ధర పన్నగ యక్ష సిద్ధ • తరుణులు బలు తోం
దరపడి మెఱుపుల గముఁగం బగమున బఱ తెంచు లీల • వచ్చిరి పోరిదిన్.

సురనాగ యక్ష విద్యా. ధర కిన్నర భుజగ సిద్ధ • దానవులు వడిఁగా
వరుసలుగా నే తెంచిరి, పురుహూతవిరోధి సేవ • పోఁడిమిఁజేయన్.

ప్రతిమలవలెఁ జేరిన దే, వత లింతగఁ దామసించి • వచ్చితిమి కదే!
దితిజేశుఁడు కినియునె యని, కౌతుకుచుఁ బరుగిడిరి కొనిర • కోంపము లురలన్

## చంద్రోదయము

తనకం దగని యఘౌఘము, తనకి దహింపంగ నల్లఁ • దనమును గొని మాఁ
డిన ధర్మబీజము హనుమ, యను వానను మొలచుబోల్కి • నబ్జుఁడు పొడమెన్.

తోతెంచిన శశి రాముని, దూత యపగుదెంచె దొనఁగు • తొలఁగిన దంచున్
జేతము తనిసిన ప్రాగ్ది, క్సీత్రితరుణీవదన మనఁగఁ • జెలఁగెను రుచులన్.

జలనిధి వీచులు విండా, మరలవలెం జుట్టి పడఁగ • మాపగకొలమే
పొలిసెనని లేచునిందుతిని, వెలి గొడుగనఁ దూర్పుదెసను • విధుఁ డుల్లసిలెన్.

అంబరంబను వాఁడు హీ • మాంశుఁడనెడి, వెండికుండను గొని పాల • వెల్లి ముంచి
తెచ్చి పోసెననఁగ జ్యోత్స్న • దిశల వెలసెఁ, జుక్కలా పాలచుక్కల • చొప్పుదోఁచె.

గగనమనుసుర భి యుదయ • నగమనియెడు, పొదుఁగునంజంద్రుఁడనుచనుల్ • వదలినట్టి
వెన్నెలను క్షీరధారలు • వెలయ జ్యోత్స్న. దృశ్యమపుడు పాలంబోలి • పృథివిఁబరవె.

హనుమపై సురల్ చల్లిన • యలరులెల్ల, రావణునకుఁ దలంకి ధా • రణిని పడక
దాఁగకయు జోతిరూపముల్ • దాల్చిమింట, మెఱసెననఁజుక్క లెల్లెడ • మీఱి వెలసె

మల్లికలమీఁద మధుపముల్ • మలయుచుండఁ, గౌముదీప్రకరంబు చీఁ • కట్ల గములు
జన్మవైరంబుగొని పరి • స్పరము దాఁకి, పోరు సలిపెడు చందంబుఁ • బోలియుండె.

ప్రథిత రత్న ఖచిత వప్ర • వలయితంబు, వీర రక్షితంబగు పుట • భేదనమున
కొఱగఁ డెల్లనిజప మూ • యుటనుబోలి, హిమమయూఖుని కరము లె • ల్లెడలఁబరవె.

ఉ॥ రామ ధనుర్విముక్త శర • రాజమువోలె మరుత్సుతుండు శ్రీ
రామునిదూత నిర్భయత • రావణ పాలిత లంకఁజేర, నా
రామునికీర్తి కందకము • రాజిలదాఁటి యుదగ్రసాల ము
ద్దామ నిరూఢి దాఁటె ననఁ • దత్పురిఁ బర్వె నఖర్వ చంద్రికల్.

తే॥ అంత హనుమంతుఁ డెంతయుఁ • జింతసేసి, చొరఁగరాని యాలంకను • చొరఁగ నొక్క-
నిశ్చయం బొనరించి యా • నెఱిఁ జనంగ, సమరుల నుతింప నుద్యుక్తుఁ • డయ్యె నపుడు.

## హనుమ లంకా ప్రాకారమును సమీపించుట

తే॥ కంధి సహజ సిద్ధమగు న • గర్తగాఁగ, దివ్యలోకము లేడింటిఁ దీడి • పెరిఁగి
విలయమందును చెడకుండు • లరిఁదనర్చు, పెద్ద ప్రాకారమును సమీ • పించి నిలిచె.

తే॥ నిలుకడగ మింట వెల్గుగా • ముఖ దశాస్య, నకు భయంపడి లంకపై • నడవవనుట
తగదు వప్రంబు దాఁటు స • త్వంబులేమిఁ, బొలఁగి చనుచున్నవని కపి • తలఁచి మెచ్చె.

తే॥ పగ అసంఖ్యాకు లిటనిల్వఁ • వగిన దనుట, యంతరాదిది బ్రహ్మాండ • మంత వెలుపు
నంరక్షించెను పొడిపునై • యదరుఁగోట, యహహ! లంకేశ్వరు~ డెంత • యధికుఁడౌర!

తే॥ సింగమును మదగజమును • సిగ్గుపడఁగ, నెక్కటీఁ డయి నడచు క • పీశ్వరుండు
అలవిలేని సేనలు గల్గి • యమునినోటిఁ, బోలు గోపురద్వారంబు • ముందు గాంచె.

తే॥ కనకగిరిఁ దెచ్చి తొలిచి మా • ర్గంబుచేసి, నిలిపిరో? సురపురి కేగు • నిచ్చెనయొకొ?
సప్తలోకాశ్రయంబగు • స్తంభ మొక్కొ? కదలి నీరోవఁ గట్టిన • కలుజొ? యేమొ?

తే॥ ఏడులోకంబు లొక్కటై • యెదిరెనేని, సొరిదిగాఁ దక్క లోనికిఁ • జొరఁగరాదు
అరుల వాడుక తెరువిది • యంచమన్న, సైన్య జలధి సప్తక మిందు • సాగునేమి?

తే॥ వీరవరులు మాయావులు • ధీరగుణులు, కత్తులను కోఱలిడుగడఁ • గలయ మెఱయ
రెండు వందల వాహినుల్ • క్రేవలందు, గాచి నిల్చుట పావని • గాంచె నెదుట

తే॥ ముసల తోమర కుంత కా • ర్ముక నిషంగ, వక్ర దండ కులిశ చక్ర • భల్ల భింది
పాల కంటక ముద్గర • శూల ఖడ్గ, ధారులగు క్రూర రాక్షస • వీరవరులు

తే॥ గుదియలును పాశములు బరి • గోల లాడిసె, లలును తళతళ మెఱయఁ జే • తులధరించి
రక్తరోములు రోష సం • యుక్తులగుచు, పూచినట్టి మోదుగులట్లు • పొలిచినారు

తే॥ గణనకందని దివియల • కాంతులిరుల, మ్రింగ యముఁడును బెగడొంది • మిడుకునట్టి
గోపురద్వారమున వడి • గ్రుంకకడరు, జడధివడువునఁ గల సైన్య • చయముఁగనియె

తే॥ ఔర! కలకలమార నీ • ద్వారమందు, చొరసమర్థుఁ డొక్కఁడు సురా • సురులయందు
గలఁడె? కాకుత్స్థవర్యుండు • కపివరులును పోరొనర్ప నేతై వడి • ముగియు నొక్కొ!

తే॥ కదలిదాటు టరిదిగాదు • కావలియును, కదలిదాఁటుటె యరిది నా • కర్జమందు
పొరపడిన దుర్ఘటంబగుఁ • బూర్తిసేయఁ, దడపుపట్టును సమరమే • తొడరునేని.

ఉ॥ ద్వారమునంచ వెళ్లెదు వి • ధంబది దుస్తరమై బయల్వడున్
శూరులు చేసి యుంచు దరిఁ • జొచ్చుట నాణెముకాదు గావునన్
సూర మయూఖముల్ చొరని • చొప్పగు వప్రము దాఁటి యేగెదన్
గీగత నంటు నా విమల • తేజుఁడు వోయె మఱొక్క ప్రక్కకున్.

## లంకాధిదేవత హనుమంతు నడ్డగించుట

చ॥ చిరముగఁ గావలిం గలిగి • చెన్నగు తత్పుర జీవితంబు నాఁ
దరుగుటచే బలిష్ఠుఁడగు • నానిగ సూనుని గాంచి సూర్యు మే
దురముగ మ్రింగవచ్చెడు వి • ధుంతుదుపోల్కిఁ బురాధిదైవ ము
ద్ధురగతి లంక పేరుగల • తొయ్యలి నిల్చి యదల్చె సన్నిధిన్

సీ॥ భుజము లొక్కెనిమిది • మోములు నాలుగు, నేడులోకంబుల • కెగయుకాంతి
తిరుగుడు కనుగ్రుడ్లు • త్రిజగముల్ దాఁకిన, మొదలితోఁ గట్టి యం • బుధిని గలుపు
సత్త్వం బమర్ష మ • క్షమును బెడిదంపు, ఉలికిడి గలుగు పా • దాంగదములు
చెంది పల్వురు దవ్వ • నం దోడువత్తురో, యని పాఱఁజూచుచు • నరుగుదెంచి

తే॥ కారు మొగులునా గర్జించి • ఖడ్గశూల, పాశకుంత గదాదులఁ • బట్టి మొగము
పొగలుగ్రక్కఁ గోఱలు పొడ • వగుచు వెలుఁగ, జముఁడు దిగులూన నడగొండ • సరణినొప్పి

తే॥ పంచవన్నె వస్త్రంబు ధ • రించి నాగ, దయముఁడగు గరుఁడునివంటి • పరువుతోడఁ
గ్రొన్నెలంబోలు వంకర • కోఱలొప్పఁ, గడలి ముత్యాలహారముల్ • కాంతులీన.

తే॥ గందమలఁది తారస్థాయి • కంఠరవము. పొనరి భ్రమరముల్ గాంధార • మునసుపాడి
తనివినొందు మందారంపు • దండ లడరు, ఘన కిరీటమ్ము శిరమునఁ • గలదియగుచు.

తే॥ వనధివేష్టిత లంకను • నెనరుతోడఁ, గాచుదేవత యొఱపోలెఁ • గాచుకనులు
గలది భయదరావంబుతో • నిలునిలుమని, యచలుచుమవచ్చెఁ గపియు ర • మ్మనియెఁచ్వరను.

తే॥ వెడఁగుపని చేసి తేల వి • వేకహీన!, ప్రాణముల నొల్లవో? భయ • పడవొ? చనవొ?
క్షుద్రమృగమవొ నీమీఁదఁ • గోపమేల?, తొలఁగిపొమ్మని భర్జించి • పలికె లంక.

తే॥ ఆపలేని యప్పావని • రోష మడఁచి, సామవిధంబునఁ గార్యంబు • నడపనెంచి
చూడఁగోరిన యీలంకఁ • జూచునంచు, నష్టమేమి నీకబ్బు న • నంగ నదియు.

తే॥ పొమ్మనంబోక వాదడఁ • బూని తీపే? యెవ్వఁడవు నీవు? లయ రుద్రు • నెనయువార
లేవి రానోడుదురు కాంచ • నిచ్చగింపి, నంత నీకు రాఁదగిన దే • యనుచు నవ్వె.

ఉ॥ నవ్విన లంకఁగాంచి కపి • నాథుఁడు నవ్వఁగ నోరి నవ్వెదే?
యెవ్వరు పంపవచ్చితి; వ • హింపకు సాహస మింక జీవముల్
నొవ్వగ వీడెదేల? విడి • నూల్కొను లాభమదేది? యింతకుం
జివ్వునఁ బాఱకే నిలిచి • చెంగఁగఁ జూచెదె? యంచు గర్జిలన్.

ఉ॥ చూడకపోవఁగాఁగలనె? • చూచెదఁగా కనువానిఁ గాంచి హా!
వీఁడొక కోఁతికాఁడు కడు • వేఱిఁడియో? కపటాత్ముఁడో యగున్

వేఁడి గరంబు మ్రింగిన ఫ • ణిప్రభు భూషణుఁ బోలె నవ్వుచు
న్వాఁడు జముండు నన్ గని ప • లంటఁ జలింపఁడు నిల్చె గుండునన్.

ఉ॥ చంపెద వీవి నేఁ డటులు • చంపఁగఁ జాలనయేని లంకయే
సంపదతో నశించుటలు • సత్యము యంచెవ నిశ్చయించి యో
తెంపరి! జానవేనియు నె • దిర్చి జయింపుము వోపువాఁడ వా
పెంపగుదారిఁ బోపకిటు • భీతిని బోయని రీతి దాపి తే?

## హనుమ లంకను నిగ్రహించి లోని కరుగుట

మ॥ అనుచుం గోపము పొంగ కూల మొగి న • త్యంతోద్ధతిన్ వైచినన్
ఘన విద్యుల్లతనా మిడుంగుఋజు గ్ర • క్కన్వచ్చు సద్దానిఁ బా
వని సర్వంబును పట్టి చీల్చు ఖగరా • డ్వర్యంబవెం ద్రుంచెఁ గ్ర
క్కున లంకాహృదయంబు యుల్లసఁగ లే • ఖుల్ మోదముం బొందఁగా

తే॥ కూల మట్టులు నుగ్గయి • షోణిఁ బడఁగ. నగ్నివలె మండి లంక ది • వ్యాయుధములఁ
గొనుచుఁ బోరఁగఁ దొడఁగ నా • హనుమ చూచి. నింద కెడమని విఱిచె న • న్నింటిఁ గొనుచు.

తే॥ కైదువులు లేని యాలంక • కనలి యుఱిమి. నగము లచ్చనగాయల • పగిది నాదు
కేలు పైకెత్తి ముష్టి వా • తాంసుతుని. పొడువ నుంకించునంత నా • తఁడును కినిసి

తే॥ చేతు లన్నింటి నొకచేతఁ • జేర్చిపట్టి. వనిత యిది చంప నాఱడి • వచ్చునంచుఁ
బిడికిటం బట్టి వక్షంబుఁ • బొడువ లంక. పిడుగు వడ్డ నాగమువలెఁ • బుడమిఁ గూలె

క॥ పడి బొటబొట కుమని వె. ల్వడ నెత్తురు గ్రక్కి నలువ • వచన మెడందం
గడు తెలివి గూర్పఁ గరువలి. కొడుకున కాంత మ్రొక్కి • గురుతరభక్తిన్

తే॥ కమలజుని యాజ్ఞ నీలంక • గాచు దానఁ. గాన నీకీతి నీపయిఁ • గడఁగవలసెఁ
గరుణ మన్నింపు చంపకు • కలదొకండు. విన్నవింపంగఁ దగు వార్త • వినుతచరిత!

క॥ ఈపురము నెంతకాలము. కాపాడుదు ననఁగ నలువ • కపి యొక్కఁడు ని
న్నేఁపుతఱి రమ్మ విడి లం. కాపురి కానాఁటినుండి • క్షయమగు ననియెన్.

తే॥ బ్రహ్మయన్నట్లయయ్యె ధ • ర్మము జయించుఁ. బాపము నశించుఁ ననుట న•వ్యంపుఁబలుకె?
తలఁచినది యెల్లఁ గొనసాగు • దప్పదయ్య. యేగుమని మ్రొక్కి సెలవంది • యేగె లంక.

ఉ॥ మారుతి సంతసించి ఋజు • మార్గమె ధన్యత గాంచునంచు సీ
తారమణీ హృదీశ పద • తామరసంబు లెదంద నిల్పి ప్రా
కారము దాఁటి లోనెడమ • కాలిడె మున్నుగ నిశ్చయాత్ముఁడై
క్షీరపయోధిలోన నొక • చేమిరి చుక్క ప్రవేశమందెనాన్.

ఉ॥ అంబర చుంబితంబులగు • హాటక మందిర పాళి రత్నసం
ఘంబుల కాంతి జాలములు • గాఢ తమంబును పాఱఁదోలి రే
యింబవ ళొక్కరీతి వహి • యించిన సౌరునుగాంచి దిగ్భ్రమం
బుం బొరసెన్ మరుత్సుతుఁడు • ప్రొద్దుదయించెనకాఁ దలంచుచున్.

చ॥ అరుదగు రత్న సౌధమయ • మై యలరారిన యీపురమ్ము పె
న్నిరులను మ్రింగుచుండుట ది • నేశుఁడు గాంచిన సిగ్గు నొందఁడే?
మెరమెరచెంది యీ ప్రహరి • మీఱఁగఁ జాలక తొంగి చూచి తా
నరిగెను బోలు నెందులకు • నచ్చటికేనని యెంచి లజ్జమై

ఉ॥ ఇందలివారు రేలఁ జరి • యింతురు గావున సంతతంబు వె
ల్గొందు స్వభావముంగల స • మున్నత మేరువువంటి సాలమం
దందములైన రత్ననిచ • యంబులచేత వెలుంగు సౌధముల్
చెందిన లంక యెన్నఁడును • చీఁకటులేవొ యెఱుంగలేనిదే.

చ॥ అమృతము దేవతావళికి • నర్మిలి నిచ్చిన మందరంబుఁబో
లి మనుకులాధినాథు నను • లీమనకీర్తిని పోలి వెల్గు కీ
శమణి యిటుల్ దలంచుచు వి • శంకితవృత్తిని వీధులందు తా
గమనము సేఁత యొప్పదని • కైకొనె సన్నువరూపు నత్తఱిన్.

తే॥ స్యందనాశ్వగ జాదిక • శాలలందు, పసుఃకొట్టము లంగళ్ళ • వాడలందు
కదలిదాఁటిన కాళ్ళతోఁ • గడచి విరుల, వ్రాలు భ్రమరంబువోలిక • వ్రాలిచూచె.

మానిని॥ రిక్కలరోచులు రెక్కొను పెక్కగు • రీతుల సన్మణి భిత్తికలు౯
గ్రక్కన కాంతులఁ గర్వలిబిడ్డఁడు • కానఁగవచ్చుచుఁ గానకయు౯
నక్కుచు నిక్కుచు నెఱ్ఱన తెల్లన • నల్లన య్యో హృదయ స్థితుఁడౌ
నక్కఱివేళపుఁబోలి వెలింగెన • హా! సులభుండయి దుర్లభుఁడై.

## స్త్రీల సమూహములో హనుమ సీత నన్వేషించుట

ఉ॥ కాంచెను వానరోత్తముఁడు • కమ్మని తేనియగాఱు తోఁటల౯
మించులఁబోలు వేళపుల • మెత్తలు స్వర్ణదినుండి సీరమున్
గొంచు వహించి తెచ్చి వడిఁ • గుంకుమ పంకమువోవ నార్పఁగా
నంచలు కేకు లట్టు లను • రాంగన లంబువు లాడుచుండుటల్.

తే॥ తపముచేఁగాక వేఱు ప • ద్ధతిని గాంచు, సత్ఫలములేమి దీవిచేఁ • జాటె బమ్మ
చూడుఁ డాడించువారలు • సురవనితలు, స్నానమాడువారలు దైత్య • చంద్రముఖులు.

చ॥ క్రమగతిఁ దంత్రులం దిగిచి • క్రమ కరాంగుళి పల్లవాగ్రముల్
కమలఁగఁ దాళసంగతులఁ • గాచుచు వీణలఁ బల్కరించు న

బ్దముఖుల పాటలన్ విని స • భంబు రవంబని సంభ్రమించి సౌ
ధములపయిం దనర్చు బల • దమ్ముల నోళులు మూయు తొత్తులన్.

ఉ॥ హర్మ్యగఁ గాంచువారు ప్రమ • దాతి శయంబునఁ దారమేయ గం
ధర్వవిలాసినుల్ జన ను • తంబుగ నాట్యముసేయ దేవతా
పర్వమణి ప్రభన్ విరుల • పందిరి నంచలతెక్కు పాన్పుపై
మూర్వగఁ బవ్వళించి కని • మోదిలు పార్వణ చంద్రబింబలన్.

తే॥ స్ఫటిక వేదికలందు భా • పముఁ దెలుపు, వాలుగనులతో నెడఁబాటు • వలనఁ బెరుఁగు
కామసస్యంబునకు నీరు • గట్టు కరణి, మధువు నానెడు దైతేయ • మానినులను.

చ॥ కలువలఁబోలు నేత్రములు • కాంతుల కన్నుల నైజ సంపదన్
దెలుపఁగ నోష్ఠబింబములు • తెల్లఁదనంబు ఘటింపఁ బ్రీతిమై
చెలువలు కాంతులం గరిసి • చిందెసు ప్రేమముఁబట్టి త్రావు జో
కలఁగొని మార్చి మార్చి చష • కంబుల హాలలఁ ద్రావువారలన్.

క॥ సురతరువు లొసఁగు లత్తుక, యరుణచరణములను దధవి • యంజనమును సొం
పారయఁ గనులనిడి కస్తురి, పరిమళములందు నగలఁ • బట్టిన వారిన్.

చ॥ పులులను పట్టి చీల్పఁగల • పూరుషవర్యుల కొత్తనేరముల్
తలునుల యెడ్డనొంప నమ్ర • తంబును పోలినోట క్ష్వేడముల్
వెలువడ నూర్చి కౌనులు చ • లింపఁగ నందెలు క్రందుసేయఁ గా
ళులఁ దలఁ దన్నునప్పుడు క • లుక్కునఁ బుల్కల నొందు దైత్యులన్.

ఆ॥ కనులు కైపువలనఁ • గడు నరుణములుగా, మొగము చెల్లగాఁగ • బొమలు ముడిచి
చెమటవాలు మోము • చెన్నద్దమునఁగని, ప్రియులకొలకు పగచు • బింబముఖుల.

తే॥ చెఱకుగానుగలందు కం • దరిములందు, విరులవనముల మ్లేమ్ఛుల • వేశ్మములను
కల్లుపాకలఁ బాలేటఁ • గాంచరాని, జోట్ల యధరామృతము నాని • చొక్కువారి.

తే॥ మగలపై నగ్గి కుచకుంభ • మంబు చిటిలి, పెటుల విరిదమ్మిపై నోరు • విడనిమొగ్గ
పూచుకరణిఁ గేల్దామర • మోముపమ్మ, నూని యూఁగుప్రాణములతో • నుండువారి

తే॥ అల్కఁగొని సుమతల్పంబు • లందు పొరిలి, వలపు కాఁక రేఁపగఁ జూపు • వాకిలిపయి
నుంచి దూతికి చిఱునవ్వు • గాంచి యుసులు, పడయుక్రియ లేచి తత్తఱ • పడెడువారి

తే॥ పెక్కు వాద్యముల్ మొరయంగ • వేల్పు చెలులు, భవ్యగీతముల్ పాడంగఁ • బైఁటలోడ
రశన లింతజాఱఁగ నూపు • రములు మ్రోయ, నింటివేల్పుల రహి భజి • యించుచెలుల.

ఉత్సాహ. కుండలములఁ దాఁకు కనుల • కోడెకాంత్రఁ గ్రువ్వఁగా
మెండునగల కాంతు లిరుల • మీఁట మేటి వాద్యముల్
వింద నీరదములవెంట • నెమ్మిగములపోల్కి వే
తండములుగ భవ్యపస్తు • తతులు దెచ్చువారలన్.

తే॥ ఖేలయఁ బిక వీడి ప్రియులతోఁ • గలయఁ బూని, తెప్పలను నౌకలను దీసి • కప్పులనెడి
నేయిపూసి కాంతియు మాయ • నెగడుకన్ను, లన్నెడి కత్తుల దూయుదై • త్యాంగనలను

చ॥ కినుక వహించుచుం బ్రియులఁ • గీటునఁ బుచ్చి మనంబు తెల్వి త
క్కనయవి వారితో జరుగఁ • గీడ్వడి దూపిలి మించుకై వడిన్
దనువులు సంచలింపఁగ ము • దంబఱి యంచలఁ బోలి మెల్లనం
జెనసి కవాటముల్ మొగుచు • చిత్ర నిభాంగ వికాసినీ తతిన్.

సీ॥ కిన్నరకామినుల్ • గీతముల్ పరియింప, నాగకన్యకలు మం • గళము చదువ
శారదాబ్దముల నే • పారు సౌదామినీ, తతులన నొప్పు ము • త్యాల శిబిక
లెక్కి చెల్వలు గొల్వ • నింపుగా నూత్నగృ, హప్రవేశమ్ముల • నందువారి
మంగళరవము చె • లంగ సురాళి ను, తింప సమ్మునులు దీ వింప • మనుల

తే॥ తరుణు లారతులెత్త వి • ద్యాధరాలి, విజయగీతము లాడ స్వ • ర్వేశ్యలాడఁ
జుట్టపక్కాలతోడను • సొంపుగాఁగఁ, గ్రొత్తపెండ్లిండ్లు నెఱవేర్చు • కొనెడువారి.

## హనుమ కుంభకర్ణుని గనుట

తే॥ యక్షరాక్షస నాగవి • ద్యాధరాది, కాంతల కలంకులేని మొ • గంబులెల్ల
శంకదీఱఁ గాంచుచు నేగి • శైలమట్లు, కలఁకలేక నిద్రిలు కుంభ • కర్ణుఁ గనియె

సీ॥ పెనుపుగా నేడు యో • జనముల విస్తీర్ణ, మై బిడౌజుని వైజ • యంతమట్లు
తనరిన మంటపం • బు నడుమ నొకతల్ప, మున నాగ రాజన • వనధి యనఁగ
నిరులకుప్పయనఁగ • వెరవునఁ దలఁపంగఁ, గానికర్మంబులు • కరువు గట్టి
పురుషస్వరూపంబుఁ • బొందె ననఁగనొప్పె, కుంభకర్ణుండటఁ • గూరుచుండ

ఆ॥ వనధి మునిఁగి లేచి • తనకుఁ దగిన మూఁడు, వగల నదలతోడఁ • బ్రసవరజము
పరవు కల్పవనిని • పడిలేచివచ్చిన, మలయపవనుఁ దతనిఁ • గలయ నొరయు.

తే॥ నాకినులు పాదసంవాహ • నంబు సేయ, వారి పూర్ణేందుఁ బోలిన • వదనములను
గాంచి యచ్చటి చలువతొ • ల్గరఁగి చెలులు, మొకలిపై నీటితుంపురు • లురలిపడును.

ఉ॥ ఆక నాసికాంతరము • లందు బయల్వడి వచ్చు నమ్మహా
వాత ము వాయుపుత్త్రకుని • వాఁకిటికిం గొనిపోయి యంతటన్
లోఁతగు ముక్కులోపలికి • లొంగఁ గఁదీయఁగఁ బోవ రోయుచున్
జేతులు వీఁగ నూఁదికొని • చెచ్చెర నాతఁరు దాఁటె నవ్వలన్

ఉ॥ ధూళివయంబు పై దెసకుఁ • దోడన లేవఁగ బైటికేగుచున్
దాళక వత్రిలం దిరుగఁ • దార్చెదు తోరపుటూర్పు లోకహృ
ద్వేళ నెసంగు మారుతము • తేఁకువ నప్పటిదాఁక వీనిహృ
ద్గోళమునందు నెక్కొనిన • తోయము దోఁచుఁ దలంచి చూచినన్.

క॥ పగవాఁడని దోషాకరుఁ, డెగఁబీలిచి నోటఁగప్పు • తీరున దొగయై
పొగ రెగయు నూర్పులో సపు. దగులని మొగమందు వజ్ర • దంష్ట్రిలు వెలయున్.

తే॥ మంత్ర బద్ధమైన భుజంగ • మంబుఁబోలెఁ, గల్పవేళ నిరీక్షించు • కంధివోలె
నడుమ మెలఁకువలేని వి • న్ననువు నిద్రఁ, గాంచుచున్నట్టి యాకుంభ • కర్ణుఁగాంచి.

తే॥ అరఁడు లోకకంటకుఁడగు • నసురవిభుఁడ, టంచు ముమ్మూర్తులందొకఁ • డనఁగనొప్పు
నాంజనేయుండు కరుణాప • యంబులైన, కనులనుండి రాలిచె వహ్ని • కణము లపుడు

క॥ పదిరల లిరువది చేతులు, పొదలవు రావణుఁడు కాఁడు • పొరపాటున నే
ఐపరితి నని కోపాగ్నిని, పదలిచి చల్లార్చె జ్ఞాన • వార్ధి జలముచే.

మ॥ శ్రవణానందముగూర్చు రాఘవుని వి • శ్వస్తుత్య సుశ్లోక మె
క్కువ పర్థిల్లఁగఁ జేయు పావని జ్వల • త్కోపంబు చల్లార్చి వీఁ
డెపుఁడొ నేమి యటంచు ముష్టిగొని మా • యింపంగ లోనెంచి మ
క్కువ నిద్రించెడి నాయువున్నదని యా • కూటంబు వీడెన్ వడిన్.

ఉ॥ రామ నికీర్తి రూపముగ • రాజిలు మారుతి పుష్ప వాటికల్
హేమ విన్నూత సౌధము ల • హీన గృహంబులు పారశాలలున్
రామల గాన నృత్యముల • రంగగు సాలలు దేవళంబులున్
స్వామిహితాగ్రగణ్యుఁడు వె • సన్ వెదకెన్ బహు సూక్ష్మబుద్ధియై.

చ॥ మణిమయ చిత్ర దేహళుల • ప్రాఁగు గవాక్షములన్ సుమంబులన్
దృణములఁ దూలకొఁడలను • తేఁకువ ధూమముపోల్కి వాయు వ
ట్లొఁగుచు సూక్ష్మరూపుఁడయి • యంతట నిక్కుచు స్థూల రూపుఁడై
యణువున మేరువందు హరి • యుట్లు చొరంగ సమర్థుఁడై చనెన్.

చ॥ ఇదియది యంచునెంచ కట • సెల్ల తలంబుల కేగి శ్రద్ధమై
మదవతులన్ మనోజ్ఞ సుష • మాయుతలన్ బరికించి బుద్ధి సం
పదగల నాగ యక్ష సుర • పార్థివ మౌని జనార్హ్య జన్మమై
పొవలిన యవ్విభీషణుని • పుణ్యగృహంబునఁ జొచ్చె నంతటన్.

తే॥ స్ఫటిక వేదికన్ విరుల చ • ప్పరముక్రింద, గట్టివారిలోఁ దెలిరూపు • గాంచఁదగని
దంచు నల్లనిరూపంబు • నపధరించి, దాఁగి తిరుగు ధర్మంబు నాఁ • దనరువాని

తే॥ దాసి యతని సుశీలతఁ • దన సుశీల, లను గ్రహించి నిష్కల్మషుఁ • డనుచుఁ గినుక
మానకనిల సూనుండు వే • తొక్క ప్రక్కఁ, జొచ్చియొక కోటిమేడలఁ • జూచెఁద్రుటిని.

## హనుమ ఇంద్రజిత్తు గృహమును గాంచుట

తే॥ శశిముఖుల సుధాధరల న • చ్చటులఁగాంచి, హృదయవేగంబుకరంబె ముం • దేగుచుండు
పరమపావని పావని • జరగి జరగి, బలవిరోధి చెఱంబడ్డ • తలము చెరె.

తే॥ క్రూరదంష్ట్రులు సాయుధుల్ • క్రోధమూర్తు, లురు రణోత్సాహయుతులు లో • కోత్తరులు విడి
కథలఁ జెప్పికొనుచునుండు • కావలీంద్ర, దగ నసంఖ్యాకులగు వారి • దాఁటి చనియె.

మ॥ పొగయుం దూఱఁగలేని తానములకున్ • బోవంగఁ జాల్డాణఁ దా
ఖగనూనుం దటఁగాంచె లీలఁ గరిభి • త్సూనుండు పంచాస్యముల్
నగ సంకాశ భుజాగ్రశిరశ్శకమున్ • మైదాఁచి యొప్పారు న
ప్పగిదిం జెన్నరు మేఘనాదు బహుళ • స్వర్గాంగనా సంయుతున్.

చ॥ బిలమున నిద్రచెందు నతి • భీషణ కేసరివంటి వీఁడు సోఁ
కుల యొడయండు రావణుని • కూరిమిపట్టియొ ? శంభుసూనుఁడో ?
తెలియగరాదు క్లేశమున • దెప్పరమౌ పెనుపోరు వీనితోఁ
గలుగఁగవచ్చు రేపు మన • కార్ముకవీరుల కంచునెంచుచున్.

ఉ॥ ఇమ్మగవాని బాసటగ • నేడ్తెఱ నొందిన రావణుండు లో
కమ్ముల గెల్చెనంటయు నౌ • కానొకచోద్యమె • శర్వ మాధవుల్
బమ్మయుఁదక్కఁ దక్కుజన • పాళుల సీతని కీడుగల్గ నం
చిమ్మగఁ బల్కువాని వెడఁ • గే యని చెప్పఁగవచ్చు గట్టిగన్.

క॥ అని ముక్కుమీఁద వ్రేలిడి, కొని కాలము నిచటఁగడపఁ • గొఱలు ఫలంబే
మని హనుమఁ డాస్థలము విడి, చని నెమకెను వేలకొలఁది • సౌధము లవ్వన్.

సీ॥ అక్షకుమారుని • హర్మ్యంబు పరికించి, యతికాయు భవనంబు • నందు వెదకి
యోధవరుల సౌధ • వీధు లన్వేషించి, మంత్రుల మేడల • మఱసి కాంచి
రాజబంధుల మంది • రంబులు శోధించి, తక్కువారలయిండ్లు తరిచి చూచి
దానవనాథు నం • తర్మందిరముగనఁ, ద్రపోసి మూఁడుకో • టలకు నడుమ

తే॥ నున్న పరిఖ వీక్షించి వా • యుజుఁడు తాను, జలధిదా టిన యవమతి • సైఁచకిట్లు
సప్తవారిధు లొక్కటై • చలము మీఱ. వచ్చి చేరెనో యని యద్రి • వడిమె లోన.

### అంతర్మందిర పరిఖ నాంజనేయుఁడు దాఁటుట

చ॥ పొడవును గాతమున్ వెలుపు • పొందిన కందక మిద్ది యంచనం
గడఁగుదురేని పల్వురు యు • గ ప్రళయంబు ఘటించుదాఁక నీ
పుడమిని మెల్లఁ గ్రొచ్చినను • బ్రోవది సేయఁగలేరు తేనికిన్
జడిసి పయోధు లేడిటులు • జానుగ నూల్కొని నిల్చెఁ గాపలెన్.

తే॥ అంచితముగ రామునికీర్తి • యలముచోట్ల, నెల్ల వ్యాపించి నాతఁడి • కెన్ని దీని
జడధి దాఁటుటకంచె ని • మ్మడుగు వడిని, దాఁటినను, దాటరాదంచు దలఁచె మదిని.

తే॥ నాల్గువగల యాగడ్తల • నాడెముగను, పిలువఁ దలలెత్తినట్లున్న • యలల తోడి
నీరుగలిగి రావణుసేస • నీరుదాల్చు, నగడిత నుతింప వాక్కున • కలవి యగునె.

తే॥ కరుల మదము హరుల నోటి • నురుగువేల్పు, చెలుల కుంకుమపంకంబు • పొలసుదిండ్ల
సకుల కస్తురి చేనెయుఁ • జందనంబు, గంధవాడిగల రావులు • కడల వీచు

తే॥ చక్ర బక హంస టిట్టిభ • సారసములు, నీరుకోళ్ళు నుల్లంకులు • నారణములు
కలియఁబలికెడి పెలుచని • కలకలంబు. పీనుఁగుసల మచ్చట • వినఁగవచ్చు.

తే॥ కస్తురియు లత్తుకయుఁ దావి • గంధమగురు, చేడకలన మునింగెడి • వారణముల
లోడికలయిక తమిగొల్పు • తోయమొదవఁ, బిడుల కయ్యగడిత దూతి • విధముదోఁచు

ఉ॥ సిష్మని లావిలేనియ సు • ఖమ్ముగ నిమ్ముగఁ గ్రమ్మ తమ్మి మొ
త్తమ్ములు నెమ్మగమ్ముల ము • దమ్ము లొలంగి మొగిడ్చె నెమ్మి పీ
లెమ్మ ముఖమ్ము లీరుస స • యమ్ము సమమ్ము గణించుచుండు చెం
దమ్ములు రామలీరుఁగని • తాముసు మోముల మోడ్పుకుందునే,

తే॥ పటిక బండలు మరిచి సో • పానములుగ,, దీర్పఁ దీరమ్ము నీరమ్ము • నేర్పరింప
రాకయుండెను, జడులు వి • వేకపథఁ, జేవ సులభమ్ముగా వేఱు • సేయనగునె?

తే॥ మీఁదగ్రిందను ఒక్రి నీ • లాదిమణులు, వేఱు వేఱు కాంతుల నీన • క్షీరవారిఁ
దొట్టి పాథోనిధులు వాత • ధూపగతుల, నొక్కటై తోఁచుకైవడి • నుల్లసిల్లె

తే॥ అంత హనుమంతుఁడెంతయు • సంతసమునఁ, దొలిసముద్రంబుదాఁటిన • తోయముననె
ప్రహరి వెనుకఁబడంగ నా • పరిఖ దాఁటి, యరివికాఁపగు సంతర్గృ • హమ్ముచేరె.

## నిద్రితులగు రక్కసుల హనుమ కాంచుట

క॥ యముఁడును దిగులుపడఁ బాటఫ, యముఁ గొల్పు సురారివరుల • కరయఁబసని తో
యమున న్నెమకెను మారుతి, ఉమి ద్వాదశ యోజనములు • తసరిక వీధుల్.

క॥ అడఁగె మధుసేవనమ్ములు, మడఁగెఁ గడలి పగిది నదరు • మాటల రవముల్
ముడిఁగెను తూర్యత్రియరవ, మడిగెను కార్ముకుల చెయువు • లొసరె నిదురయున్

క॥ వారువములు గూరికెఁ బ్రా, కారమ్ములఁ గాచువారి • కటు ఘోషణముల్
మీఱెను కాంతలు కాంతులు, తోరపు బడలికను కూర్కు • దొడఁగి రవశతన్.

క॥ పొలయలుక విడిన పొలఁతులఁ, గలిసి యువకు లనఁగి పెనఁగి • క్లమమగు నవలన్
గలయిక నలయిక వెలువడఁ, జెలువల పక్షముల వ్రాలి • చెందిరి నిదురన్.

ఉ॥ ఇంపగు హాలఁ ద్రావి కయి • పెక్కనవారును ధూప వాసనల్
పింపిన పూల సెజ్జలను • నీటుగ ముక్కడి కామ సౌఖ్యమన్
మంపు రసంబునావి తలి • మంబులఁ దృప్తిని పొందువారునై
పెంపులు దక్కి కూలఁబడి • పెచ్చగు నిద్దురఁ బూని రత్తటిన్.

మత్త॥ త్రాగి యాడెడి, పెక్కుశీతుల • దైత్యవర్యుల యాటలున్
మూఁగి పాడెడి హెచ్చుతీరుల • ముద్దు గుల్కెడి పాటలున్
మ్రోఁగి కూడెడి వాద్యరావము • మ్రొగ్గి తగ్గెను దీటులన్
వీఁగి వేఁడెడి కోడెకాండ్రుర • వేడ్క క్రుంగెను మాటలన్.

మృగమదంబు చందనమును • మేఁగియున్న, తొమ్ములందున మలయ మా • రుతముసోఁక
విరహిణుల ఖండితల కనుల్ • విడిచె జలము, మనసులెల్లఁ దాపంబుచే • మాఁడి మ్రందె

ఉత్సా. వైరి క్రుంగినపు డడంచు • వాఁపిపోల్కి దివెల నా
ధారమైన నేయితగ్గు • తటిని తీర్చె వాయువుల్
వారిజాస్య లొదలికాంతి • వార్ధిఁ గొలువఁ దివురకే
కోరి దెసలఁ గొలువఁబోయి • కూర్చె విరుల గుంపులన్.

తే॥ నిత్యకర్మానుసారులై • నిర్మలులగు, జ్ఞానులును యోగులు సుషుప్తి • నూనివారు
మదగజములు నిద్రించె ను • న్మాదులెల్ల, గుబికిరనఁ దక్కువారలఁ • గొనరనేల ?

తే॥ ద్వంద్వములను నిర్జించిన • దండిమగఁడు, రాజవీథిని చని దైత్య • రాజ నగరి
చెంగలి యగడ్తతోఁ గోటఁ • జెంగలించి, దాఁటి లోనికిఁ జనియె ను • దాత్త దృష్టి.

## హనుమ రావణుని మేడఁ జేరుట

సీ॥ సమరశీలుండగు • నమరారి బంగారు, మేడ రాకాచంద్రు • జాడనొప్ప
రిక్కలగములనాఁ • గ్రిక్కిఱిసి వెలుంగు, నీరజాక్షులయిండ్లఁ • దారసించి
కందు నొందకయుండు • కలువరాబింబంబు, దీలుపడఁగఁజాలు • దాలునేలు
మోములతో యక్ష • రామా లలామలు, వసియించు నొకవాడ • వాంఛఁ జేరి

తే॥ కాంతు లీనెడు వజ్రాల • గడియలున్న, కడల నూలికంటెను గాలి • కంటె సూక్ష్మ
రూపముధరించి తూఱె మ • రుత్కుమారుఁ, డాసగొలుపు దుష్కర్మముల్ • గోసినతఁడు

క॥ కొందలు దశకంధరుపై, దెంద మునిచి మోమువంచి • దిగులున నూర్పుల్
క్రందుగఁ బుచ్చుచు తెప్పల, చిందార్పక యుండి రచటఁ • జిత్రములక్రియన్.

క॥ కొందఱు కలగనుకొఱకో, కందర్పున కడలియో యొ • కం దదియేమో
కందుమనరాదు కనులన్, చెందమ్ములు ముడ్చి యుఱక • చెలఁగిరి సెజ్జన్.

క॥ కొందఱు మరుశరముల వో, టొందిన కుచకుట్మలాంగు • లూఁగెడి శ్వాసం
బంది వగచి చేయునదే, మందురు చిత్తరువు వ్రాయ • నగునే యనుచున్.

క॥ కొందఱు కన్నీరొలుకుచు, సుందరు రమ్మనవు పోవు • చొప్పరయవు నీ
కిందలి పని యేమని చెవి, విందుగఁ బలుకుదురు గోర • పిట్టల తోడన్.

క॥ కొందఱు మందానిలమునఁ, గంది వలుండైన చనులఁ • గని తము పీడిం
పం దొడరు దనుజవరు భుజ, మందము నెదఁదలఁచి తలఁచి • యలయుదురు వగన్.

క॥ కొండలు వెసుమానికములు, చిందిన నిప్పులపు దాలు • సెజ్జల( జొర( జా
లం దినములు నిర్విట్టత, పందురి నిస(బడిరి సంజ • పలుచ నీవలెన్.

క॥ కొండలు లెమ భుజములపలె(, బిండియు మంచముల నిద్ర • నెందెదుచో ధీ
తిందార్చు పీడరిపమను, పెందే లట( జెపుల( గుట్టు • బెగ్గిలు వారల్.

క॥ కొండలు నిసలాద్రి ధనుపు, సందగ్ని శరంబు గూర్చు • నభవుని మల నె
త్తందనరు భుజము లల(దిస, చందనము కుచంబులంటు • చాలలవారల్.

క॥ కొండలు జలధి యుబుక నా, నంద నటన సేయు భవు గు • ణంబుల( గైనా
రిం దంతిగ బహురాగము, లొంద( బొగడువాని వినుతి • యొనరుచు వారల్.

క॥ పలు తెలు(గుల జక్కాను లిటు, వెలయు వసతు లెల్ల(గాంచి • వృక్షచర లస
త్త్రికము లంకానాథుని, కులపాలిత యన్నయిండ్ల( • గోరిక( జేరెఙా.

చ॥ హరువుగ( జీ(కటిన్ దటిమి • యాలక వెల్గెదు కెంపు దీపముల్
మురువుగ నొప్పు నోవరుల • ముగ్ధలు సలెద్పు నూదిగంబులన్
బరువుగ పీడ(గా నసుర • పాటలగంధులు కాంక్ష మున్ను గా(
దరువుగ నేగ( దల్పముల( • దాటి రెడంపలతో( బెనంగుచుణ్

తే॥ అగ్నికీలపై మృగనాభి • యల(దినట్టు, లలరు జడలలో( బొగవలె • సఖులు మునర(
గ్రొవ్విరుల పానుపులను వై • రులుగ నెంచి, పటిక బండల నారట • పడెదువారు.

తే॥ తనువు మిన్నుగా ముత్యాల • దండ బుష, ములుగ జడలు మోదుగురంగు • మొగులుగా(గ
నడుము మెఱుముగా( గన్నులు • జడిగ నొసలు, కొర్రిన్నెలగ సంజవిన్నునా( • గొలలువారు.

తే॥ పొడవుమేడల వెన్నెల • ముంగిళులను, చేటికల( గూడి కన్నుల • నీటుగ్రాల
నెఱికురులు ప్రీల రిక్కల • నెఱిగ(గొనుచు, హవణిలంగ వచ్చనగాయ • లాడువారు.

తే॥ దేవకాంతలు స్వర్నదిం • దెచ్చినట్టి, జలము చల్లగాలేదని • యలిగి మేడ
లల(త నెక్కి మొగుళ్ళను • తొలిచి కాలు, నంబువులయందు జలకంబు • లాడువారు.

ఉ॥ శేష ఫణామణుల్ బలిమి • జీవితనాధు(డు తెచ్చియిచ్చె సం
తోషమెలర్ప మేమె తగు • తో యలులంచు వచించుకొంచు వి
ద్వేషుల గెల్చి కైకొనిన • దివ్య కిరీట లలంతికాది స
ద్భూషల( బన్నిదంబులిడి • పో(డిమి జూదము లాడువారలున్.

చ॥ కుసుమ వనంబులం బసి(డి • కూటములందున ముత్తెపందిరిన్
బసగను సిద్ధకన్యకలు • పాట మృదంగము నాగకన్య లిం
పెస(గ వహింప నప్సరస • లీద్యగతి న్నటియించుచుండ సం
తసమున( బాలపందిళుల( • దార్కొని వేడుక గాంచువారలున్.

చ॥ ఇనుప సలాకవోలె నెద • కెక్కిన మోహ మలంగఁజేయఁ గ
న్గొన లల కొండవాఁగులను • కోఁదగి నిద్రనుపీడ నిండ్ల ప్రాం
గణముల వీణియల్ గొనుచుఁ • గంఠముతోడ లయింపఁగా సుధా
కణములు చింద శ్రావ్యముగ • గానము సేయుచునుండువారలున్.

తే॥ ఇంచు నఱచట్టవలుప చ • లించి తొలఁగఁ, గుండలమ్ములు గదలికఁ • గొరడు లీనఁ
గల్లు ద్రావంగ సుఁదివడు • కనులతోడ, మేనెఱుంగని నృత్యాల • మెలయువారు.

తే॥ విసమువంటి మద్యము ర క్త • మెస గఁ ద్రావి, గుజరి పద్ధతిఁ గంఠంబు • గూర్చి వదరి
ఝుర్ఝరీ వాద్యసరణి హ • స్తములు వట్టి, యందమే చెడ వెఱ్ఱిగా • నాడువారు.

తే॥ పెరుఁగు రంగైన కల్లు త • బ్బిబ్బుసేయ, బొబ్బలిడుచు విట్టూర్పులు • పుచ్చి కురులు
విరియ నొడలెల్ల వడఁకించి • వేల్పునోకె, ననుచు నిచ్చవచ్చిన యట్టు • లఱచువారు.

తే॥ ఇట్టి పెక్కుతీరులనొప్పు • నిగురుఁబోండ్ల, యిండ్లు వీధులు గనిదాఁటి • యేగిసిద్ధ
సాధ్యవనిత లున్నట్టి వే • శ్మములఁ గడచి, చేరె విద్యాధరాంగనల్ • చెలఁగువాడ.

## హనుమంతుఁడు విద్యాధరాంగనలఁ గాంచుట

సీ॥ చొఱమీను రూపొంది • మెఱయు సీసకము ధ, రించిన సోఁకుల • తేఁడు రామి
తిదిక మోహమున మ • ధ్యంబుకంపెను మనం, బులు చలింపఁగ జీవ • ములను వాద
గాయనుల్ దగ జంత్ర • గాత్ర లయలుగల్పి, పాడిన గీతముల్ • పాములట్లు
చెవిఁజొరఁ గలఁగిన • చెలువలు కొందఱు; వాని కోపాగ్నికి • వడఁకి సురలు

తే॥ మునులు బుధులును దిక్కేది • మొనసి యోర్వఁ, బగవహించి చంద్రుఁడు దైత్య • వర్యునందు
ప్రేమగలవారనుచుఁ జాల • వేఁడి వెలుఁగు, లీన నెడఁదలఁ దపియించు • నిగురుఁబోండ్లు.

సీ॥ అల్పకాలము కల్ప • మట్లుగ మదిదోఁప, నుడుకుచు మరుబారి • కడలువారు
మును కౌఁగిలింగొన్న • చనులపైఁ జందన, మంటిన యదిగని • యలయువారు
చెక్కిళ్ళ వ్రాసిన • చిత్రముల్ ప్రాణంబు, లం జీల్చుచుండఁ గ • లంగువారు
కన్నులెఱ్ఱగఁ జేసి • కాంతు నింక విటకు, రానిత్తుమే యని • రగులువారు

తే॥ నైన విద్యాధరాంగన • లలఁగుచున్న, వీధులంగని త్రిభువన • వీరుమేడ
వ్రాలి చందురునోర్చిన • వదనమలరు, మయునికూఁతురు వసియించు • మాళిగఁగనె.

ఉ॥ కాంచి యెలర్చి కార్యమును • కాఁదగుఁబూరితియిందు చిత్రమొ
క్కించుక కద్దు మత్ప్రభున • కెక్కటి ప్రాణమయైన దేవి నిం
దుంచినవాఁడు రావణుఁడు • ప్రోన్నతజాతి మహాశ్మసంతతిన్
మించిన కౌస్తుభంబువలె • మేటి గృహంబిది యంచు నెంచుచున్

సీ॥ రంభాది జంభారి • బంభరవేణులు, మృదులపాదముల మె • ల్మెల్లనొత్త
మణిరాజ భూషలు • ఫణిరాజయోషలు, వింజామరము లల్ల • విసరుచుండఁ

జెలుకురసంబును • చేదనిపించి గం. ధర్వసుందరులు గీ • తములఁ బాడ
బంధముల్ నీఁగిన పాపసులయ్యుద. క్కువ వారి కినుకకు • గుఱియయ్యెనఁ

తే॥ బొందు పెగ్గొంగ్గో యని • పొదము శంక. ము౦యసవనుండు చేటులు • పిలువనేగి
యాజ్ఞగొని పచ్చుఁబోపు ను • య్యాలపగిది. చనవెఱ్ఱెన సరుదు మీఱి • చనరు బుధులు.

## హనుమంతుఁడు మందోదరింగని సీతయని భ్రమయుట

చ॥ వెలిఁగెడు రత్నదీపికం • వెల్గుచెడం దన మేని కాంతి ది
క్కులఁ బరియింప నిద్రిలుచ • కోరపయోధరఁగాంచి యా యన
ర్ఘళ చరణుండు సీతయని • గట్టిగ శంక యొనర్చి పొంగు పే
రిలుని శరీర జీవ హృద • యంబుల మార్చ్వఁగ నెంచె నీగతిన్.

చ॥ ఎముని పయిన్ రహించు నౌద • లెత్తు ఫలంబు వహింపనైతి నా
తపుకటులుండనీ, స్వకుల • ధర్మము ప్రేమలతన్ విదిర్చి స
ద్విమల సతీత్వ మగ్గిసెగఁ • బ్రేల్చిన జానకి యీమె యన్నచో
నమరిన రామకీర్తి యమ • రారులు లంకయు నేనుఁ గూలమే ?

ఉ॥ ఆయమ సుందరాంగి మను • జాధిపకన్యక. చెప్పఁ బూనుచో
నీయలివేణి యక్షిణియొ? యాసురియో? యగు మీననేత్ర లా
నాయకు మేనియందము మ • నంబున నొక్కపరిన్ గణింపఁ బం
చాయుధునైన లెక్కఁడుదు • రా? మతిమాలి యిటుల్దలంచితిన్

చ॥ అమల సతీత్వలక్షణము • లారయఁ గొందొక యున్న యీమె దే
హమె యొక యంగదం బొదువ • నందిక మన్నదియంచుఁ దెల్పెడిన్
సుమయుతవేణి పీడినది • చొప్పలు పల్కులఁ గల్వరించు ని
య్యమపతి వేగ తీలు క్షయ • మందును లంకయు నిశ్చయంబుగన్

తే॥ అనుచు నూహించి నానంది • యంబు వింత. తోడశాంతిలు.గాకని • తొలఁగిపోయి
మేరువను చిన్నదనదగు • మేడఁజొచ్చె. నసుర యెత్తనిగిరిఁబోలి • యలరు ఘనుఁడు.

చ॥ పుడమి చలించె శైలము • భ్రుంగె హందుక్కనుపోలు కొను కై
వడి భుజముల్కనుల్భ్రమలు • పాటలగంధుల దక్షిణాంగముల్
వదఁకె దిశల్ బెదంకెఁ బొల • పంబుగ మించులేక పల్వలన్
బిడుగులు రాలె నూరకయె • భేదిలె మంగళ పూర్ణకుంభముల్.

ఉ॥ మారుతి కన్నులారఁ గని • మానసమందు దలంచి యింతయుఁజా
జేరికయయ్యె నీపురము • నేగికి; నేకులమందు పుట్టి యె
వ్వారయినన్ గడించిన య • శంబో శుభంబో ఫలింపకేగునే ?
కారదవిం జరించినను • కర్మముకంటె బలీయముండునే ?

## హనుమంతుఁడు రావణుని గాంచుట

చ॥ వినుతకలా విశారదుఁడు • విశ్రుత ధర్మ కుశాగ్రబుద్ధి పా
వని యట సైన్యసంతతులు • వాకిటఁ గావలిగాయ క్షీరవా
ర్ధిని పెరవార్ధి పైకొనిన • రీతిని తెల్లని తల్పమందు న
ల్లని జిగి నొప్పు రాక్షస ల • లాముని రావణుఁ గాంచె నయ్యెడన్.

సీ॥ బాలసూర్యులు పూర్వ • పర్వతాగ్రస్థులో, రాణఁ గిరీటముల్ • రాజిలంగ
నొడలిపై వెలలేని • తొడవులు లేయెండ, గాసి రేయిని పూర్తి • గాఁగ మ్రింగఁ
గనక కశిపుఁ జంపి • కనకాద్రి గుహలోన, నిద్రించు బహుశీర్ష • నృహరి యనఁగ
ధర్మమయ స్వర్గ • వాసులో వేల్పుల, పడఁతులు పెక్కండ్రు • బారుతీరి

తే॥ పొన్ను కాఁడల చామరాల్ • పొసఁగ వీవ, సుడియు లేగాలిచేఁ గల్ప • సుమములందు
మధుకణంబులు పడ మేను • మఱిఁగి సీతఁ, దలఁచి నిట్టూర్చి కృశియించు • దైత్యనాదు

ఉ॥ కంతుని క్రూర బాణములు • కంతువిరోధి నగంబునెత్తు బా
హాంతర మందు గ్రుచ్చికొని • యవ్వల డుయ్యటచేత మున్ను దీ
గ్గంతుల దంటముల్ సమర • ధారణి నాఁటఁగనైన యావ్రణా
క్రాంత తదంతరంబుల ని • రంతరమున్ రసి గాఱుచుండఁగన్.

చ॥ కలపపుఁ బూఁతపై మృదువు • గాఁ బడు చల్లని గాలి దర్పకా
నలమును భస్త్రివోలె జత • నమ్మన ఘుమ్మని రెచ్చగొట్ట మై
థిలిపయి నంతరింద్రియ గ • తి ప్రతిపత్తులు పరువెట్టఁ బా
ములు విడివోవు పట్ల యనఁ • బోలిన యుల్లము ఎట్టి పాడుగాన్.

తే॥ ఉత్సుకత మీఱి పైపయి నుల్లసిల్ల, నాఁడు చేసిన యుగ్ర క • ణంబులందు
వారి వారి త్రావఁగ మితి • మీఱి కాఱు, సురల కీర్తినాఁ గోఱల • సొబగువాని.

తే॥ పూలపానుపు మాఁడి ని • ప్పుకలు రాల, మయిని బొబ్బలయట్లు చె • మ్మటలు గ్రమ్మఁ
దేనియలు గాఱు మాలలఁ • దివురు తేంట్లు, కలఁగ నూర్పులు పుచ్చుచు • మలయువాని

తే॥ చక్రవలెఁ దనయెద సీతఁ • జక్కనిలిపి, తలిమమునఁ గల్లకూరికి • దవులువాని
నెలఁత పైఁ గల వలపను • నీరుపోసి, యూరుపను సన్నఁ బ్రాణముల్ • నూఱువాని.

తే॥ కలఁత మీఱుటచే రూపు • గానరాఁగ, నవ్వ గంభీరముఖుని మ • నంబువొంగఁ
జెలువ ముదమునఁ దనసెజ్జఁ • జేరె ననుచుఁ, జెలఁగి యుబ్బి గగుర్పాటు • చెందువాని.

తే॥ బర్హిసంఘమ్ము లొక్క ప • ర్వతమునుండి, వేఱుకొండకు శ్రమ నేగు • విధముదోఁపఁ
బొలఁతులు బలిష్ఠజయశీల • భుజము నొత్తి, వేఱు భుజమున కేగు న • వ్రతమువాని.

తే॥ కదలిపైఁ దోఁచు రవినాఁగఁ • గాంతులొలుకు, మణిసరులు గ్రాల ఉగములు • తనియఁగాచు
హరిహరేంద్రుల చక్రశూ • లాశనులను, వ్యర్థపఱచిన గురువక్ష • మమరువాని.
సీ॥ మాలికాదళముల • మలయు తుమ్మెదలు దిక్కరుల మదంబుల • నెరయు తేంట్లు
చెలరేఁగి లేచి ప్ర • క్కలప్రక్కలం దాఁకి, రాజులఁబోలి ఘో • రముగఁబోరఁ
గలపంబు సిందూర • తిలకంబు లొండొండఁ, గదిసి నిమయువృత్తి • గందరింప
నాశా గజేంద్రదం • తావళి నాఁటిన, వ్రేన వ్రణంబుల వక్ష • మెసఁగువాని
తే॥ హస్తములఁగల భల్లముల్ • వ్యర్థములని, తలఁకి నదముల వ్రాలు శా • త్రవ కిరీట
ఘర్షణములచేఁ గాయలు • గాచియున్న, చరణయుగళంబు వెలయు రా • క్షసవరేణ్యు.
తే॥ వామనునికంటెఁ బిన్నయౌ • వాయుసుతుఁడు, తలలు పదిచేతు లిరువది • కలయఁజూచి
తెలియునంత మనస్సున • తిక్రమించి, వినుల లోకముల్ దహియించు • కరణి మెఱసె.

## హనుమ రావణుని చంప నెంచుట

ఉ॥ వీని భుజాబలంబు బరు • వేయగు నైన నొసర్చునేమి? యి
వ్వాని యశంబదేమి ఫల • వంతమగున్? రఘురాము గేహినిన్
బూనికఁ దెచ్చు క్రొవ్వు తల • బొమ్మలముల్ పడఁదన్ని త్రొక్కనే
వీని వధింపనేని తగు • వీరపు బంటగుటెట్లు స్వామికిన్?

ఉ॥ వేసము పైకిఁజూపి పని • వేఱుగ నెంచుట భృత్యధర్మమే?
మోసముచేసి దేవిఁ గొని • పోయిన చోరుఁడు నేను గాంచియున్
దోసముమీఱ జీవితము • తోడ వసింపుటె? వీనిఁ జంపి నా
రోసము దీఱ మార్తునగ • రున్ బయి మూఁడునదెల్ల మూఁడనీ.

చ॥ అని మది నుత్సహించి కన • లారఁగఁ బండ్లను గీఁటి కేలు నె
ట్టన విదిలించుకొంచు నక • టా! రఘునాయకు నాజ్ఞలేదు నా
పని యటు డించి వేఱొకటి • పట్టుట జ్ఞానుల రీతికాదు యో
చన యొనరింపఁ బెక్కు కలు • షంబుల కియ్యది మూలమే యగున్.

చ॥ ఎఱిఁగి విసంబు ద్రావిన గి • రీశుని పోలిన శక్తిగల్గు ధీ
వరు లెద నాత్మశక్తిఁ గని • పర్వును గాచుకొనంగనెంచి యే
ర్పఱుపక పూనువారె? బల • వంతుఁడు నేర్పరి యయ్యు నాతఁడా
తెఱఁగున వేళవేచి పడిఁ • దేతెఁ బయోధి యడంగు చాడ్పునన్.

శా॥ ఆలంబుం బెదరేఁచు నీయలుక నా • యందే యడంగాఱనీ
హా! లంకాధిపు నొక్కవానరము మా • యం జేసె నన్నన్ జయ
శ్రీ లక్ష్మీవరు రామకార్ముక కలా • సీమాంత విద్వత్తకే
శాలిన్యాఖ్యనత గ్లాన నాకు విధి క • ర్తవ్యంబు గాదెట్టులున్.

క॥ చెలులెవ్వరు సీతవితోఁ, గలిసి నిదురసేయువారు • కారీతని మై
పొలము తపించెడి రాఘవు, కలికి సతీత్వదశ దీనఁ • గానఁగనయ్యెన్.

క॥ అని తలఁచి యింక నేఁ దడ, సిన ఫలితము లేదటంచుఁ • జింత నవలికిం
జని యకటా! యిందెందును, జనకజఁ గననైతి ననుచు • జాలిం బడియెఁగా.

## హనుమ సీతం గానమికిఁ జింతిలుట

తే॥ క్రొత్తడి మహాభిజాత సీ • క్రూర దైత్యుఁ, డొకటఁ ద్రుంచెనో భక్షించె • నో యెఱుంగ
నేవిధమున నెఱుఁగ లేని • యేను పోయి, యేమి పలుకుదు ? మడియుటే • యిందు తగవు

చ॥ కని యరుదెంచుఁ; గాదు మఱి • కాంతనె తోఁగొని తెచ్చునంచుఁ దాఁ
గను లఱచేత నుంచుకొని • కాచిన రాముని మోము నేవిధం
బునఁ గననేర్తుఁ ? గార్య మిటు • మూఁడెఁ గపీంద్రులు చావనున్న వే
ళనె మరణింప కిప్పుడిటు • లంకను వ్యర్థుఁడనై మరింతునే?

చ॥ గడువు దినాలు మున్నె కద • గాంచెను జానకిఁ గాంచనైతి నే
మడిసియు నేమి ? యంగద కు • మారకుఁడాది కపీంద్రపాళి న
క్కడనె నిలుండటంచు బలు • కాఱులు పల్కితిఁ జేయనైతి నా
పొడుపుడివోయెఁ బూర్వమునఁ • బుణ్యమె చేయనొకో జగంబునన్ ?

తే॥ ఏడువందల యామడల్ • గోడ గలుగు, లంకలోన నేఁగాంచని • లవము లేదు
రాముదేవి మాత్రము గాంచ • నోమనైతిఁ, గడలి దాఁటియు దాఁట నీ • యడలు కడలి.

తే॥ క్రూరుఁడగు రావణుని గట్టి • కొట్టి నోళ్ళ, నెత్తురులు గ్రక్క గ్రుద్ది కా • న్పింపుమనుచు
జానకిని గాంతునా ? లేక • వానితోడ, లంకఁ జిచ్చిడి కరఁతునా • లక్కపగిది.

చ॥ సురల వలంచి భూమిజను • చూపుఁడి యన్నను దుష్ట భీతిచే
సురుఁగుచు సాహసింప రటు • చూపరు తక్కిన వారలెట్లుఁ జె
ప్పరు మయినోల నవ్విడని • ప్రాణములన్ ధరియించి యిందు దీ
విరహితుఁడైన యేను పృథి • వీవరనందన నెట్లు కాంతునో ?

ఉ॥ కంక కులాధినాథుఁడటఁ • గాంచుమనుంటిని రాముగేహినిన్
లంక నటంచుఁ బల్కె విఘ • లం బదియయ్యెను; లోనె దాఁచు నీ
లంకను వార్ధిఁగల్పి తగు • లన్ వడిఁగట్టెదఁ గానకున్న నే
వంకనొ వాఁగునో వెదకు • వాఁడ మెయిన్ ధరియింప నేర్తునే ?

చ॥ ధరణిజ దొంగిలించి కొని • దైత్యుఁడు పోవుటఁగాంచి రిమ్మహిన్
నరులు సురల్ నిజంబిది చె • నంటిగఁ జావఁగనేల ? తొల్త నీ
పురి మొదలంటఁ ద్రివ్వి పరి • పూర్తిగ వారిధిఁ గల్పి రావణున్
గరములు మస్తకంబు లెడ • గా నుఱుమాడెద నంత మాఁడెదన్.

చ॥ సుపు గిజారంతయే నెదము • సూకక వింది స్వచిత్త కంజమున్
దవిలిన రాముఁబోలి నిర • త ప్రతిపత్తిని రోసినట్టి యా
పవనజుఁ డట్లు లోఁదలఁచి • పైకటుచూచి శిలీముఖంబు లా
రవ మొనరించు నొక్క వని • రాజిలఁ గాంచి రహింఁబెఁ గాంచఁగన్.

## 3. సీతా సందర్శన పటలము. (77)

### —: సీత స్థితి :—

ఉ॥ చూచితి నెల్లచోటులను • చూడఁగలేదిది యిందు నెమ్మదిం
జూచినఁ జింత దీఱునను • చొప్పు మనంబు వచించు నిమ్మెడన్
జూచినమీఁదఁ జూడఁదగు • సూటియుఁ గర్జములేద యిప్పురిన్
మోచు త్రికూటమున్ బెఱికి • మొత్తెద నంబుధి నేను సీరెదన్.

క॥ అని రామదూత పంజాళ. వనిఁజేరెను సురలు విరుల • వాన కురిసి మో
దన మొందిరి; రక్కసుచే. వనిత యచట నున్న తెఱఁగు • పరికింత మిఁకన్.

తే॥ స్థూలమధ్యలు రాకాసి • జోట్లు ఖడ్గ. హస్తలై జడిపింపంగ • నశ్మమందు
తోఁచి యెండిన మందునాఁ • దోఁచి సౌరు. చెడి నడుమువలె వాడి కృ • శించి యుండె

తే॥ నెమలి చాయయుఁ గలకంర • మమరు సీత. నిద్రయని తెప్పమూయుట • నీఁగి యెండ
మఱయు దీపమువలె జిగి • మాసి పులుల. మధ్యఁ దగులుకొన్న కురంగి • మాడ్కినుండె.

తే॥ పడుట యేడ్చుట వడఁకుట • యడుకుటయును
మఱఁగుటయు లేచుటయు మది • కలఁగుటయును
కుంగుటయు స్రుక్కి సోలు టా • ర్చుటయు తోలు
టయును తక్క వేఱొక్కండు • చెయిది లేదు.

తే॥ బిలమునుండి వెల్వడి కాలు • వలుగఁ బాఱి. కుచగిరుల దాఁటి నేలను • గుంటలు పడఁ
జాలువాలుగాఁ గురియు భూ • జాతకనులు. వాన కనులంట సార్థక • పడియె నచట.

తే॥ పృథివియందు సమంజస • ప్రేమ గలుగు. దంపతీవియోగార్తి యే • తనువుదాల్చె
ననఁగ నొప్పిన సీత న • ల్లని మొగుళ్ళఁ. గాటుకనుగన్నఁ గనులబ్ధి • గాఁగ నేడ్పు

చ॥ పవదముఁ బోలు హస్తపద • పద్ధతినొప్పు పయోదవర్ణు రా
ఘవుని దలంచుచో వెదఁద • కన్నులు రాల్చిన నీటఁదోఁగి య
వ్యవహిత దుఃఖతాపమున • వచ్చిన యూర్పుల వేఁడి నెండు చ
వ్యవసిత రీతి నొప్పెఁ గమ • లాప్త కులేంద్ర కళత్ర మయ్యెడన్.

తే॥ చావ విధిదాఁటు టరిదని • జంకి వెగచి. కాంతుఁ దెల్లైనఁ దనకుల • గరిమనైనఁ
బట్నునై నను గమనించి • వచ్చు వచ్చు. ననుచు దిక్కులఁ గనుచుండు • కనులతోడ.

తే॥ ఓర్వఁగలదియై చంద్రము • నొడిసి మ్రింగి. వెలివఱచు రాహువుంబోలి • పిడుచ గట్టి
యొక్కపైయున్న జడతోడఁ • జెక్కిలివయిఁ. జేయిచేర్చి విసుగులేని • చింతతోడ.

ఉ॥ మిక్కిలి ధూమమంటి కడు • మేవిన పొల్పగు నొంటిచీరతో
జెక్కలువచ్చు హంసల పి • ఱిండి మునుంగని సన్న మేనితోఁ
జక్కెర వింటివాఁడు సుధఁ • జక్కఁగజేసిన ముద్దుబొమ్మ న
ల్పెక్కఁగ ధూమమంటిన ర • హిం గనుపట్టెడి మేనిసొరుతో

సీత రాముని దలంచి పరితపించుట

చ॥ మఱఁదియుఁ జూడఁడేమొ దశ • మస్తకుఁ డీడకు నన్ను దెచ్చుటల్
వఱపగు నబ్ధిమధ్యమున • భాసిలు లంక నెఱుంగరే మొకో?
యెఱిఁగియు వచ్చుటెట్లనుచు • నేడ్గడ సేయుట మానిరొక్కొ? యం
చొఱలుచుఁ గ్రుంగి క్రుంగి యెద • నొందిన దుస్సహమైన బాధతో.

చ॥ జనకుని వంటి పక్షికుల • చంద్రుఁడు వారలు కాంచునంతలో
ననె మరణించెనొక్కొ? విజ • న స్థలి నాగతి నెవ్వరెట్లు రా
మున కెఱిఁగించువార? లిఁకఁ • బొందుగ నీ భవమందు రాఘవుల్
నను గనిపెట్టుటే యరిది • నాదుర వస్థితి యిట్లుఁ జెల్లనే?.

ఉ॥ దూఱితి లక్ష్మణాఖ్యు నట దోసము నాక తదుక్త వించు ని
వేఱి డి తాఁగయందుఁ బతి • వీడునొ? నావిధి యెట్టులుండునో?
దూఱిన పాపకర్మ మిటు • దుర్దశకుం గొనితెచ్చె నెట్టి యీ
కోరికలేల? యంచు నలఁ • గున్ నలఁగున్ మఱఁగుం గుంగుమన్

ఉ॥ వేళకు నెవ్వరాతనికిఁ • బ్రీతిగ లక్ష్మణుఁ డిచ్చు కందముల్
మూలములున్ ఫలంబులును • ముందట నుంచెడువారు? విందుల
వ్వేళకు రాఁగ నెంత దుర • పిల్లునొ? యంచుఁ దలంచి నేలపైఁ
గాలు కదల్పకుండిన సు • కాసి వహించు దురంత తాపమున్

ఉ॥ వంచకులున్ దురాత్ములును • పాపులు దైత్యులు సీత నిన్నినా
ళ్ళించరు నాఁడె చంపి తిని • యుందురు కష్ట మిఁకేది? కానరా
దంచు మదాశ వీడెనొకొ • స్వాన్వయ ధర్మమయైన యొర్పుఁ దా
నంచిత మంచుఁ బూనెనొ? క • టా! యిఁక నేమని యందు దైవమా?

సీ॥ కన్న తల్లులు తమ్ములు • క్రమ్మఱిల్లి. వచ్చి తోడ్కొనిపోయిరో? ప్రతిన గడువు
కడవకుండఁగ నగరికే • గఁడు నిజంబు. వనమునందె యుండు ననుచు • వనటనొందు.

ఉ॥ వీరులు మున్ను పోరునకు • వీఁకను వచ్చినరీతి. దిమ్మటన్
దారుటచేత నందు బెడి • దంబగు సంగరమే ఘటించెనో?

యేరహి నెందు నాకొఱకు • నెంత తపించుచునుండు వారొ? యిం
దారటహొందు నాయెడఁద • వ్యాధికి మందెది? యంచుఁ జంతిలున్

తే॥ నీకు లేదు రాజ్యము తమ్ము • నికె యటంచుఁ, గైక పల్క ముమ్మడుఁగు మొ • గంబు వెలయ.
పురుషసింహుని యెప్పటి • పొలుపు దలఁచి దలఁచి మదిలోన మిక్కిలి • తాపమొందు.

తే॥ అవని పూర్తిగ నేలుమా • యన్నయపుడు, నడవులకునేగుమాయని • యన్న యపుడుఁ
జిత్రమున వికసించిన • చెందొవవలె, వెలయు నెమ్మొగంబును మదిఁ • దలఁచి తలరు.

తే॥ తాఁకియెత్తుటయే యొక • తడవుగాఁగ, స్వర్నదీ జటాధరుఁడు హ • స్తమున వంచు
మేటి మేర్వంశమగు విల్లు • మిడిసి రెండు, తుండ్లు గాఁజేయు భుజముల • దొడ్డఁదలఁచు.

తే॥ విబుధవైరులు పదునాల్గు • వేలమంది, కవియ మూఁడుగడెలలోనఁ • గలను ముగియ
రెండుకొనలును వంగు కో • దండ గరిమఁ, బొగడి పొగడి దూపిల్లును • వగలఁబొగలు.

తే॥ లోఁతునీట మందాకిని • లోనఁ గలము, నడపు గోల యొ గుహునకు • నాయనుజుఁడు
నీకు ననుజుఁ డీ జానకి • నీకు వదిన, యని వచించిన స్నేహవా • క్యంబుఁ దలఁచు.

తే॥ తండ్రి ప్రేమతోఁ దన్నిచ్చు • తరుణమందు, తండ్రి చేనున్న తన కేల • తండు గొనుట
దర్పవలెఁ బవిత్రంబైన • దక్షిణ పద, మెత్తియుంచుట దలపోయుఁ • జిత్తమందు.

తే॥ విరులసరులు తాల్పఁగఁదగు • శిరమునందు, రత్నమకుటంబు గొనక వి • రాగియగుచు
జడలు దాల్చు తమ్ముని గని • జాలినొంది, పరితపించుట దలఁచి తాఁ • బరితపించు.

తే॥ రాజ్యసంపద నీఁగి య • రణ్యములకుఁ, దరలు నాఁడు యాచించిన • ధరణిసురున
కాలమందల నొసఁగి పే • రాసమేర, లేమిగని సుస్మితంబైన • మోముఁ దలఁచు.

తే॥ నరవరుల గండ్రగొడ్డట • నిరువదొక్క, తడవ తిరిగి వధించి ర • క్తమునఁ దండ్రి
తర్పణముసేయు భార్గవు • ధనువుతోడఁ, దపము బలమును గొను పేర్మిఁ • దలఁచి తలరు.

తే॥ కాకమగు జయంతున కొక • కన్ను పోవ, నలుఁగు నేయుట గాక కా • కులకు నెల్ల
నొంటికన్నొ నరించిన • యుగ్ర జయము, శిరమునందాల్చి మించిన • చింత సేయు.

తే॥ దుష్టుఁడగు విరాధుని పెను • దోసములను, ద్రోచి ఘోరశాపమ్మును • పాచినట్టి
ప్రాణనాథుని శ్రీరామ • భద్రు భద్ర. గుణములఁ దలంచి యీరీతిఁ • గుములుచుండ.

## రాక్షసస్త్రీలు నిద్రింప సీత త్రిజటతో నిర్వేదము దెలుపుట

తే॥ శీలవతి ప్రియవాక్య సం • స్కృతియుఁ గలుగు, త్రిజట తక్కఁ దక్కిన దుష్ట • దితిజకాంత
లష్ట రాత్రంబుగా నిద్ర • యనెడి చొక్కు, నీరు ద్రావి మత్తిల్లిరి • నేలఁ బడిరి.

తే॥ అంతఁ దల్లికంబెను ప్రియు • రాలిఁ ద్రిజటఁ, గాంచి నీవు పవిత్ర గు • ణాంచితవును
చెలివిఁ గావునఁ జెప్పంగఁ • దలఁతు నీకు, విను మనుచు నిట్లుపలికె నా • విమల చరిత.

తే॥ చెలియ! నాకును మేలొండు • గలుగునేమి? నాదు పాపంబు లింకను • మోఁదుచున్నె?
కనులు బొమలు మున్నగు నంగ • కమ్ము లెడమ, ప్రక్క నదరెఁ ఉసంబేది • వచ్చునాకు?

క॥ ప్రేమమయుఁడు కౌశికముని, తో మిథిలకు వచ్చునాఁడు • తోడ్తో నేఁపే
నేమమున నెవ్వి యదరెనొ, యామాడ్కిని నేఁడుగూడ • నదరెడిఁ గంటే!

క॥ తెలుపఁగ మఱచితి నిదియును, చెలి వినుమా ధర్మమూర్తి • జీవితనాథుం
డిలఁ దమ్ముఁ దొంపవిడిచి వ, నుల కరిగిననాఁడు, వలను • నొసలే యదరెన్

తే॥ గరళనిభుఁడు దశాస్యుండు • కైతవమున, వనమునందు నాకగపడు దినమునందు
వలకెడనె యదరెను వాని • ఫలము దెలిసె, నిప్పు డెడమవై యదరెడి • నేమి కలదొ?

## త్రిజట సీత కూఱట గఱపుట

క॥ అనుడుఁ ద్రిజట యిట్లను నొద, విన శకునము నీకు మేలె • వెలయించును నా
థుని చేరఁగలవు నిక్కము, వినుమా యని ప్రియముమీఱ • వినిచెఁ మఱియున్

తే॥ పసిమి నీమేనుపొంద జీ • వంబులిందఁ, బొన్నువన్నియ భ్రమర మిం • పునను వచ్చి
యించురంగుల తేనియ • నించుపాట, నీదు చెవినూఁదిపోయెఁ గాం • చితివె మగువ?

తే॥ కాన దీని యోచింప నీ • కాంతుఁ డంపు, దూతవచ్చుట నిక్కంబు • దుర్జనులకుఁ
జెడుగు తొడరుట తప్పదు • పుడమితనయ! మఱియు విను మొక్క కలగంటి • మంచిదద్ది.

తే॥ కలఁతచే నిద్రలేమిని • కలలురావు, నీకు; నేనొక కలగంటి • నీరజాక్షి!
దుస్స్వభావమౌ నీపురిఁ • దోఁచు కలలు, నిక్కములు వినుమని పల్కె • నిక్కువముగ

తే॥ రావణుఁడుతలలను నూనె • రాచికొనుచు, రాసభపిశాచములు లాగు • రథముమీఁద
రక్తమాల్యాంబరములు గా • త్రమున వెలుఁగ, జరిగె దక్షిణదిశకు ని • శ్చయముగాఁగ.

క॥ తనయులు బంధులు తక్కిన, యనుచరులును దైత్యువెంట • నరిగిరి మరలం
గనలేదు తిరిగివచ్చుట, జనకసుతా! భయము విడుము • జరగుట వింటే

ఆ॥ అమిత శౌర్యవంతుఁ • డగు రావణుఁడు వేల్చు హోమకుండవహ్ని • లొకట నాఱె
రత్న దీప వితతి • రాజిల్లు ప్రామేడ, పిడుగు పడుటకతన • క్రీలి కూలె.

ఆ॥ పిడులు మదముగార్చె • భేరి వాయింపకే, పిడుగు పగిది మ్రోఁగె • నుడువు లురలె
మెఱుపుతోడి మొగులు • మింటను లేకయే, పిడుగు లపనిఁబడియె • వికిదముగను

తే॥ ఇరులు తొలఁగ నర్ధమరేయి • యినుని బింబ, మర్ధభాగంబు కాలిన • యట్లుదోఁచె
బలియురగు వీరులు ధరించు • ప్రసవమాలి, కలును మాంసంపుఁ గంపును • వెలువరించె

తే॥ మఱియు లంకయుఁ గోటలు • నెరిసె దిశలు, తెలియగంధర్వ నగరంబు • పొలిసెనిండ్లు
విఱిగె మంగళ కుంభముల్ • తఱిఁగెఁ గలిమి, క్రింగెఁ జేఁకట్లు పవియలఁ • గ్రుంగెఁదెలివి

క॥ తోరణములు తుండ్లైపడె, వారణములు పండ్లురాల • వసుధం గెడసెన్
వీరణములు ప్రీలెఁ గలి, ప్రేరణమున గలశజలము • విరిసెను కల్లై.

తే॥ కలుపఁ బేనిఁ దీర్చికొని రి • క్కలును వెలఁతె, పూయరక్తముల్ గురిసెను • మొగులుగములు
అసి గదాది సాధనము ల • న్యోన్య తాడ, నముల భేదిలఁ బోరె ఘో • రముగఁ దామె.

తే॥ ఐదుపల సూత్రములు సరు • లంటపుండఁ, దమకుఁ దామె తెగుచుఁ బయో • ధర తటములఁ
బొరలె నిట్లిప్పు డేర్పడు • దుర్నిమిత్త, ములు మహోద్భుతములు మఱి • కలవు వినుము

తే॥ రాజ పట్టపుదేవి ! • రోజ పాళి, మెడలిపడి కీలలంటిన • వడిని కమరెఁ
జేటు నిక్కువమంచు నేఁ జెప్పినట్టి, కారణము లివి వింటివే ? నీరజాక్షి !

## త్రిజట తన స్వప్నమును సీతకుఁ దెలుపుట

తే॥ నేఁడు గాంచితి నొక కల • నియతి వినుము, జంటవీడని బహుబలి • ష్ఠంబులైన
సింగముల జత యనుపమ • శిఖరిమీఁద, వ్యాఘ్రయూథంబుతోఁ గూడి • శీఘ్రగతిని.

తే॥ అలవిలేనట్టి పెను • మదా • వళముఖండు, వనము వేష్టించి నిలిచి పీ • డనముచేసి
పీన్గుపెంటలు చేసె న • వ్వేళ నందు, గల మయూర మెగిరిపోయెఁ • గటకమునకు.

చ॥ వినుత సుభాషిణీ ! వినుము • వేయి దివెల్ వెలిఁగించినట్టి స
న్మణి దివియన్ గరంబున న • మర్చి యొకానొక సుందరాంగి రా
వనగరునుండి వెల్వడుచుఁ • జక్క విభీషణుఁ మేడఁ జేరె నే
మనఁగల దింతయున్ బహు శు • భావళి నీకగునంచుఁ జాటెడిన్

తే॥ అమ్మహాత్మురాలట్లు హ • ర్మ్యమునఁ జొచ్చె, నపుడె నను నిద్ర లేపితి • వంత గనదు
కలయనంగ జానకియును • కరము మోడ్చి, కొంతయును గాన నిద్రింపు • కోమలి ! యనె.

## హనుమ సీతను గానవచ్చుట

తే॥ అట్టియెడ శ్రీరఘు ప్రభుఁ • డంపినట్టి, కోడెఁ బోలిన మారుతి • కుసుమ వనముఁ
జూచు చరుదెంచు నాతఁడ • చ్చోటఁ జేరి, ధారణీజాత యున్నట్టి • తీరుగనియె

తే॥ దనుజకాంత లప్పుడు మేలు • కనుచు నమ్మ ! తృప్తిలేని యీనిద్ర బా • ధించె మనసు
ననుచు శూలదండాసి కుం • తాదులైన, కైదువుల దాల్చి గములయి • కదిసినారు

సీ॥ కడుపున నోళ్లు • గలవారు నొసలిపైఁ, గన్నులు గలవారు • కఱకుచూపు
గలవారు పండ్లసం • దులఁ బిశాచములు నేఁ, నికలు చొఁగంటులు • నిద్రసేయఁ
దగు బిలంబులఁ బోలు • తలనోళ్లు గలవారు, పదిచేతు లొక తల • పరఁగువారు
తల లిరువది హస్త • ములు రెండు గలవారు, వికృత వేషిణులును • భీకరాంగ
ఉద్రులం బోలు చనుదొద్రే • లాడువారు, శూల ఖడ్గ చక్రాంకుశ • చ్ఛురిక లొప్ప
విసమె రూపుగాఁ గొనియున్న • విధమువారు, భర్గుఁడును బెగ్గడిలఁ దగు • బలమువారు.

తే॥ తురగ గజ సింహ భల్లూక • శరభ ఖడ్గ, మహిష శార్దూల శునక గో • మాయు కిటి పి
శాచ ముఖములవారు పృ • ష్ఠమున నోరు, గలుగువారలు పొగనోరు • గలుగువారు.

తే॥ దెందమున కందకుండు క • డిందిబలము, నరసి లెక్కింపరాని దృ • శ్యములు గలిగి
యింతులయ్యును మగంటిమి • నెనయువారు, తటుకునన్వచ్చి మైథిలిం • దఱిసినారు.

తే॥ అపుడు రామునిసతి పల్కు • లడంచి వారి, భీకరాస్యంబులం గని • విహ్వలించె
రామదూత యున్నత కుజా • గ్రంబు సేరి, వారి కలకల మాలించి • పలుకెం గనుల

క॥ రాకాసులు పలువురు ఘో, రాకారలు సాయుధలు మ • హా రభసమునన్
మూకిగొని గుంపుగొను వా, రేకారణమో యనుచుం బ • రీక్షించెం దగన్.

## హనుమ సీతను గాంచి యుత్సాహవంతుం డగుట

ఉ॥ కారు మొగుళ్ళంబోలు ఘన • కాయుని యచ్యుతు పేరురంబునన్
జేరి మదీయభక్తకిని • సేవధియై జగదేకమాతయై
శ్రీరమయైన జానకిని • చిత్తము రంజిలం గాంచె రాక్షసీ
నీరదముం బెకల్చికొని • నిక్కిన మైథిలియన్ శతహ్రదన్.

ఉ॥ తాంకంగరాని రక్కసులు • తార్కొని కావలికాయ సూక్ష్మమున్
దాంకిన వాడు పూలత వి • ధంబగు నీమె సముద్రమంతలై
యాకులమందు కన్నుల బ • యల్వడి నిండు తటాక మధ్యమం
దాంక వహించు హంసిక్రియ • నండుట మత్ప్రభుదేవియే యగున్.

ఉ॥ దమ్మము కూలలేదు వడిం • దాఱి నశింపను నేను రోసి యి
య్యమ్మల దేవింగాంచితి వ • హించితి గీర్తి ముదంబు సర్వమున్
గ్రమ్మఱ నంచు వేడ్కయను • కల్లు భజించి మదించి యాడి మో
దమ్మునం బాడి గంతులిడి • దాంటెను కొమ్మల నీవలావలన్

తే॥ లలి ననింద్యములగు రూప • లక్షణములు, రాముండు వచించినట్టులే • రామ కమరె
నౌర! మాయావియైన ద • శాననుండు, రాము జీవముల్ దాంచిన • రాణ యిదియొ?

తే॥ మూండుజగముల ధర్మంబు • మూలముట్టం, దొలంచుపాపి రాఘవు జీవ • ములనుదీయ
నెంచి చేసిన దుష్కృతి • యిద్ది నిక్క, మీమెలక్ష్మియే రాముండు • పేంద్రుండె యగు

చ॥ మసటు వహించు రత్నము క్ర • మమ్మున నున్నది సూర్యకాంతులం
బసచెడు చంద్రుంబోలినది • మాసిన వేణియె దాల్చియున్న దీ
కుసుమ సుగంధి గౌరవము • కోర్కియుం దత్కృతి రక్షణంబునం
దొనంగొక యింతలేదు; భువిం • దోరపు ధర్మము నాశమొందునే?

ఉ॥ శ్రీ రఘువర్యు దొడ్డవగు • చేతులనో? పొగడంగందగ్గ యీ
వారిజగంధి సద్గుణ వి • పాకమునో? ప్రభుయోగ్యసద్గుణో
దారు విదేహరాజు కుల • ధన్యతనో? మఱిదేనినో? మనం
బార నుతించువాండ? వివి • యన్నియు రూపయి యొప్పె నీమెయై.

చ॥ అసురులు నొక్క రూపలము • నందరు బ్రాహ్మణులు పాపయుక్తులై
యమరిరి ధర్మమున్ దగము • నందు నశింపదు మా ప్రభుండు లో
కమున నొసంగ్వదగ్గ యొక • కార్యముగల్గునె? యన్నియున్ భువిన్
సమకులు సింగల్గ మతి • నాదగు సేయు ధన్యమే కదా?

తే॥ దీటులేని యాదేవి స • తీత్వమించు. కంత చెదరిన శ్రీరాము • సలుక యనెడు
కడలి పొంగి కల్పాంతంబు • గానొనర్చు. ననుచు జడిసిరి నిఁక లోక • మమరుకాంతి

చ॥ ఇలుపడి యొందిశీలము ము • హోద్యత, బొంది మనోదృఢత్వముం
గలుగు లిపఁబు పేరిమి ని • రింబుగ సన్నుతి సేయశక్యమే?
యలపున సగ్నినిల్చి విష • యంబుల గెల్చి జలాదు లూర్చియున్
జలుపు తపస్సులేని కుల • సాధ్వుల ముందట నిల్చు వారలే?

చ॥ ఇలపయి నీకుభాంగి జని • యించుటచేఁ దపమూనిపొందు స
త్కుల జననంబు స్త్రీపొడుపు • తోరపు ధన్యత గాంచినట్లు చె
ల్వాల ధనమైన ఁ జయుఁ ద • పం బొనరించి పవిత్రమయ్యె నీ
లి నిట నీమె సత్తప మె • లర్చుట రాముఁడు నోపఁ డారయన్.

తే॥ రాక్షసులు నీతిమాలిన • రాజసాత్మ, లీమె యొకతయే సాధ్వి మ • వేరు లేరు
స్త్రీత్వమును తపం బేకాక • నీత్వ మిదియ: చెలువలకె ధర్మఫలమెల్లఁ • జెందుఁగాక!

ఉ॥ ధర్మమె కాచుచున్నదొ? య • ధార్మికుడైన దశాస్యుచేయు దు
ష్కర్మమె కాచుచున్నడియొ? • కాక మహత్త్వ సతీత్వమే తగన్
శర్మ మొసంగునో? అరుదు! శక్యమె యీగతి నోర్వ నేరికిన్?
నిర్మల నీతి నీస్థితి గ • ణింపగ? సాధ్యమె నన్నుబోఁటికిన్?

ఉ॥ నెట్టన దైత్యసంపద గ • ణింపగ? నిత్తర సేవితంబ యా
నట్టిది; వారి దుష్కృతము • లందమ? యిట్టివి! యిందు మానసుం
దొట్టి వసించుటన్నఁ గడు • దుర్భరి, మిట్టుల నున్న యీమెకీ
పట్టున నేది క్షమగుఁ? బాపము పుణ్యమునే జయించునే?

తే॥ ఇట్లు పలుపలు విధముల • నెంచి వృక్ష, మధ్యమున గుబురగు చోట • మఱుఁగునుండి
హనుమ కాంచుచు నుండిన • యంత నటకు, దానవేంద్రుండు వచ్చుట • గాన నయ్యె.

## 4. నిందనపటలము. (82)

సీ॥ కూటయుతోన్నత • కుధరంబు లొకకొన్ని, చెలువార నొకచోటఁ • జేరెననఁగ
వజ్రాల కుండలా • వళి చలించుచు నుండు, వింశతి భుజములు • విరిసి వెలుఁగ
సాగరోదయ భాను • చందాన నొక్కొక్క, మకుటంబు లేయెండ • మలసికాయ
గంధ మాల్యాదిక • క్రమ ఘుమం ఘుమల్ దిక్కరీంద్రంబుల • ముక్కునింప

తే॥ ఖడ్గ మూర్వశి మోచి ప • క్షమున రాఁగ, నడపముం గొని మేనక • యందియాయఁ
బాదుకలు తిలోత్తమ చేతఁ • బట్టి తేఁగఁ, జుట్టి క్రేపల రంభాది • సుదతు లరుగ

సీ॥ ఒడళులు వెలిఁజిమ్మ • తొడవుల కాంతులు, చీఁకట్ల గుంపులఁ • జేర్చి ప్రమ్రింగ
నూపురములు కింకి • ణులు మేఖలలు పెక్కు, పక్షుల కలకల • ధ్వనుల నెనయ
తావి నూనియ కర • దీపియల్ ధరియించి, వడి నసంఖ్యాకలౌ • వనిత లరుగ
విఘ్నంబు గలుగఁ గో • పించి నిద్రను మాని, నాకోపమెంత ద • వ్వరుగునొక్కొ

తే॥ ధరణిజాఁడి వనము దాఁక • జరుగునొ • మఱి, యెవరి మీఁదికినేగునో • యేటుగతియొ?
యనుచు ననిమేషనయనము • లమరవరులు, గాసికొని చూచుచుండఁగ • ముదము తోడ

సీ॥ నీల భూధర గళ • న్నిర్ఘరంబునుబోలి, పటోత్తరీయంబు • పరిఢవిల్ల
జలధిపై బాలభా • స్కరకాంతి పరవిన, రహి హారరుచులు గా • త్రమున వెలయ
కారుమబ్బులను వి • దారించు కొనివచ్చు, నెఱిమించునా గ జ • న్నిదము వెలుఁగ
హీరమాణిక్యకే • యూర రోచులు గ్రహ, తారకౌఘంబులఁ • దాఁకి పోవ

తే॥ ఘర్మనూపురరుచులు భూ • భాగమందు, పరవి పణిహారులట్లు ముం • దడుగుచుండ
బంధు మందహాస జ్యోత్స్న • పరిధి గట్టి, రాత్రులందును ముఖపద్మ • రాజివిరియ.

సీ॥ ఒడలి వన్నెకు వేలు • పడి డాలు మీఱి మ, ధ్యమున నొప్పారు పీ • తాంబరంబు
నల్లని పెనుగొండ • నడుమఁబడిన ప్రొద్దు పొడపు నీరెండ నా నడరుచుండ
వేత్రభలందలి మించుఁ • బోలు నుంగరముల, మణులవెలుఁగు పూచు • వనమునెనయ
కల్పాంతిమున నిల్చు • కనకాద్రిపైఁ బొల్చు గ్రహముల హారి తా • రములు వోల

తే॥ మస్తకముల శీర్షకములు • మలసి యుపయ, గిరిని పన్నిద్దఱినం ని • ప్పులు తొలంగఁ
బదురు భానులొక్కటఁదోఁచు • పగిదివెలుఁగ, రావణుఁడువచ్చెలోపలి • ద్రావణుండు.

సీ॥ కోఱలు విఱిగి కే • కుల పాచములఁబోలె, జందంబు నెఱిస ది • క్పాలజములు
భువన భీకరుఁడయి • పొలిచిన కనకక, శిపుని వరంబులు • చేవ చెఱుచు
నిశిత దంష్ట్రాభీల • నృహరి పాదాంకముల్, లడవిని గజముల • వడినిజెనడ
జిక్కినుల్ నిద్దుర • నమసిన రంభాది, గణికలును భుజంగ • కన్యకలును

తే॥ సిద్ధ విద్యాధరాసుర • స్త్రీలు వాలు, గంట్లు కువలయ నేత్రలు • చంద్రముఖులు
కుంకుమాంకితోరస్కలు • కోమలాంగు, లద్రిఁజుట్టిన సెలయేఱుల • యట్లు మలయ

సీ॥ సుషిర వాద్యంబుల • సుస్వరంబుల తోడఁ, బొరలిక లేని సొం • పుగ లయించు
చామల గాత్రముల్ • శ్రావ్యంబు గాఁగఁ గి, న్నర గీతములు తాళ • నాదములను
ఝల్లరుల్ మద్దెలల్ • సౌరుగా వినిపింపఁ, బాములు నృత్యంబు • బయలుపఱుప
శృంగాటకములందు • హేమ రత్న విభూష, లందాల్చు హరిణుల • చందమందు

తే॥ హరిసుమధ్యలు చామర • లాలవట్ట, ములను దాలిచి జీమూత • ములనుగాంచి
ప్రీతి నటియించు నట్టువ • పిట్టల వలెఁ, దళుకు బెళుకులఁ జూపుచుఁ • దరలిరాఁగ.

ఉ॥ వీణలు మీఁటి వైణికులు • వీనుల విందొనరింపఁ బొందుగా
గాణలు శ్రావ్యరీతిఁ గల • కంఠరములం బలెఁ బాడఁగా సుప
ర్వాణులు మర్దళాదిక ర • వమ్ములఁ గొల్పఁగ దేవతా పికీ
వాణులు శాస్త్రసమ్మతిని • భావములం బ్రకటించి నర్తిలన్.

ఉ॥ కాలిన పుంటిలోఁ గొరక • కట్టియ చొన్పిన మాడ్కి దర్పకుం
డోలిని తమ్మిగుమ్మితిని • నొమ్మిక యొమ్మనఁ గ్రుమ్మఁ గౌముదీ
జాలము వేఁడిసేయ మన • చందనశైల సమీరణుండు కుం
దాల మరందమున్ గరఁచు • తామ్ర కిటంబుల బోల్కి రాల్పఁగన్.

ఉ॥ తంతువుఁబోలు మధ్యములు • తప్పక భేదిలునంచుఁ దోఁపఁగా
గంతులువైచి పైకుబుకు • గబ్బి చనుంగవ పైఁడి గిండ్లు నాఁ
జింతన సేయఁగప్పి చెవిఁ • జేరిన కన్నులుగల్గు స్త్రీల శ్రీ
మంతములౌ కటాక్షములు • మాటికి బొమ్మ్మస బాహులం బడన్.

సీ॥ కల్పకంబులు నిధుల్ • గంధ మాల్యాంబర, భూషణావళిఁగొని • మొనసిరాఁగ
కలశాబ్ధి పీఠికల్ • గాటుక కొండపై, మలసిన వనఁగఁ జా • మరలు వెరయ
కందుగానని నిండు • చందురుఁ బోలిన, ధవళాత పత్త్రము • ధ్వజిని వెలయ
నడుగు లిడెడు వేళఁ • గదలి చుట్టిన త్రికూ, టస్థమౌ లంక గుం • ట వడి యందు
తే॥ వీచికలు పాఱిదిక్కుల • విరిసి పరవ, భుజగ రాజును భారంబు • మోపలేక
మెదను క్రుంచఁగ వారిధి • మేఖలయును, వెన్ను నెటుకున విఱిగి నో • ర్విడిచి యఱవ.

ఉ॥ తాటకి కంటె నిమ్మడుఁగు • దార్ఢ్యముతోఁ గుధరంబునే నిరా
ఘాటముగా వహింపఁదగి • గాజులు పూనిన కాంతలెట్టి జం
జాటము లేనివారు మన • చక్రగదాసి శరాన సర్వలా
ఖేటక కుంతశూలములు • కేల ధరించి బిరాన వెంటరాఁ.

చ॥ విరియు చివుళ్ళ పూవులును • వేళ్లను మొగ్గలు కాఁడ లాకులున్
హరువుగ నెల్ల యంగములు • హైమములై విలసిల్లు వృక్ష సం
భరిత వనంబు మాఁడునహా • శ్వాసము పుచ్చుచు సీతయున్న చో
టరసియు దోఁపు వోవు మణి • నారయు పన్నగమట్లు రోయుచున్.

ఉ॥ వచ్చెడు దైత్యరాజుఁగని • వాయుకుమారుఁడు చింత సేసి నేఁ
డిచ్చట వీనివంచనయు • నిచ్చయుఁ జేష్టితముల్ బయల్పడున్
జెచ్చెర మీఁద జేయఁదగు • చెయ్దియు నేర్పడు నంచు రామ నా
మోచ్చరణంబు తోడనట • నుండు నశోకహమందు డాఁకొనెఁ.

ఉ॥ అనుపమ్యగాత్రిఁ గాంత నెద • యంబుజ నమ్ముంలోన దీవమై
యొనఁగిన రాముదేవి గం • యిక్కట విగ్రహవైరి చేర్చె వ

వ్వసనమతిపుత్త్రి బెగ్గడిలి • వన్నెల చాలు చేవ కిన్కఁ దీ
మన మెసలారు వేఁగిఁగని • ద్రుమాలు మెకంబు వితాన బెగ్గిలెన్.

వడఁకి జీవముల్ చలియించు • వనజనయన. మోహమునఁ గ్రుంగి తపియించు • మూర్ఛ దైత్య:
ననుమ యొక సాక్షిగాఁ దన • కనులఁగాంచి. చిత్త మొక్కనిల్కడలేక • తత్తరించె.

ఉ॥ దేవికి భద్రముల్ సకల • దేవత లిత్తురుగాత ! వేదముల్
తావలమొంది వర్ధిలుత ! • ధర్మము నిశ్చల మందుఁగాత ! శ్రే
యోవిభవంబు రామునకు • నొందుత మంచనె నా దినేంద్ర దో
షావర నిత్యకీర్తి సువి • చార గుణుం డనుమంతుఁ డత్తఱిన్.

## రావణుఁడు సీతను బతిమాలుట

విసము నమృతంబుగఁ దలంచి • వేఁడువాఁడు, పంక్తికంఠుఁడు దాసి యో • పద్మగంధి!
కోకిలా! యెప్డు నాయెడ • గొప్పకరుణ, యమరుతువో వచింపుమ యని • యణఁగిపలికె
పురవిరోధిసన్నిధి నేని • పరువుగ్రుంచి, యించు కేని తగ్గని దిట్ట • యెడఁద తలఁపు
బిడియమును తన్ను మిక్కిలి • జడను పఱుప, జంకిజంకి యిట్లనియె నా • జవ్వనికడ.

ఆకర్ణాయతలోచనా!, వే కడచనె నిన్నినాళ్లు • వెదలునో మఱియున్
నీ కరుణ యిట్టులున్నది, నాకడ నిఁకఁ గెడయు పిదప • నన్నెన పెదవే ?

వనితాతిలకమ! జగముల, మునుకొని వహియించు నాయ • మోఘ శ్రీపా
లనమున నీకై కలిగిన, మనసిజు పోరాండు దక్క • మఱి కొఱ గంటే !

॥ హేమ పల్లవమా! కీర్తి • యెసఁగు కలిమి, కోరక యుపేక్షచేసితి • ఘోరవనుల
నీ మగండు చావకెదరు • నీఁగి యేగి, పదయునది యల్పమనుజ సం • పద యెకాదె?

॥ పెరిమతోఁ దపస్వులు శాస్త్ర • విదులుపొందు, ఫలమునించుక నీమదిఁ • దెలియనైయి
దేని నాయాజ్ఞ శిరసావ • హించు సురలఁ • జేరి వసియించుచేకదా! • చిగురుఁబోఁడి.

॥ వస్తువులలోన మేలుగా • వఱలు బిడ్డఁ, గోకిలరవంబు వీణను • గోరువంక
నడఁచు మృదుభాషిణీ! నీకు • వెదఁగు బ్రహ్మ, కరుణనడుముతో సృష్టింప • మఱచెనె మో!

చ॥ పరువము నాయువున్ మరలి • వచ్చుట భిన్నఘటంబు నీరముల్
మరలి ఘటంబు నించనను • మాటకు దీటగుఁ ; గానఁగాచు చం
దిరిక వితంబునన్ వయసు • తేరకుఁబోయిన సౌఖ్యమందు చె
క్కెరఁణిని? దుఃఖమందె యిటు • కంది కృశింతువె యోవివేకినీ !

॥ రుణిణా! బతిమాలి నీమది • కరఁగదేని, నిక్కువముగ నాజీవముల్ • విఱ్ఱ
నీసహజ శీల సౌందర్య • వియతికిఁ దగు, సుందరుం డెవ్వఁడున్నాఁడు ఘూహు మదలి!

తే॥ కలికితనము సందంబుఁ బ్ర • గల్భగుణము, మొదలుగాఁ గలపన్నియుఁ • గుదిరియుండి
నెనరు నీవి దాక్షిణ్యంబు • బసనిరులము, నందు నశియించు కారణ • మరయరాదు.

చ॥ పలుకు కుమంబు సీషిఘని • పట్టి పఠించిన యప్పు దార్తిమైఁ
బిలిచిన వానిరూయిపిని • బిమ్మటితో విమఁ జూచు కోరిన్
దలఁపున నుండిరే? పిలిచి • దానము సేయుఁ గుఱంబు గోత్రముం
బలుకుము యన్న యట్లనుట • భావ్యమె యాంయ విన్ను బోఁటికిఁ.

తే॥ నీవలన నాదు టీనముల్ • వీపునేసి, నాపసు స్త వంచవలపై • నా మొందు
పచ్చివర్తిల్లె ననుకీర్తి • పదలి చెవిచె, ననెడి యవాదు నొందెదే • యబ్జవదన!

తే॥ వేలపులు పేర్పు పదఁయులు • రేలుమోడ్చి, నీ దాబముల్ భజియింప • నేపుమీఱు
త్రిభువన ప్రాజ్యరాజ్య ను • శ్రీ లభింపఁ, గాంఁ ద్రోచెడు నీవంటి • బేల గలదె?

తే॥ అపయశమునకు వెలపని • యసురవిభుఁడు, సంల జగతీతనయుల నా • జనులుఁ గాఁగఁ
జేకొనిన నాదు సేవ నం • గీకరింపు, మనుచుఁ గేల్మోడ్చి వాఁగిలి • యవనిఁబడియె.

చ॥ అనలమునందు ద్రాఁగిన శ • రాహతిఁబోలు కటూక్తు లేగు ముం
దున చెవిమాఁడె దెందమును • తోడనె మార్చెదెఁ గన్ను దోయి న
ల్లను వెలిఁగక్కె జీవముల • లక్ష్య మొనర్పని మానినీ గుణం
బును లిలమీఱు కర్కనపుఁ • బోటగు మాటల సీత యిట్లనెన్.

సీత రావణుని నిటూక్తులాడుట

మ॥ ఓ పాపమా! వినుమనె నీకటూక్తుల కల • శ్రీ చెప్ప దే నోర్పుమై
గుణామా! సాధ్వి సంచు నింకె మృదుపుల్ • కొండల్ యదార్థంబు; దు
ర్గుణముల్ కీడిలిఁ జెప్పనే? చదువవేఁ • గొన్నట్టి తెల్వింపయే ?
షడుసౌఖ్యంబునకై యభోగరిపు గిం • గం గప్పఁగా నేఁతువే?

మ॥ ముఖవా! మేరుపుఁ దొల్వఁగా గగనమున్ • భూమిన్ విదారింపఁగాఁ
జలమాంన్ బదునాల్గు లోకముల వం • వాళించి కూల్పంగ న
జలజాతాప్త కులేశు బాణములు పె • ల్చంజాలు టూహించియున్
గల లొక్కుమ్మడిఁ ద్రుంగఁజాచికొనెదే • దర్పోద్ధతిన్ బాలిశా!

మ॥ అతి భీతింగద నాఁడు నీవు బలుమా • యన్ జింక నంపించి నా
పతి లేనప్పుడు మాయవేషివయి బ • ల్పచ్చెంబుతో దాఁగి వ
చ్చితి జీవింపఁ దలంచితేని విడుమా • శ్రీరామచంద్రుండు దృ
గ్గతుఁడై నిల్చినఁ దేటి చూడఁగలవే • కష్టాత్మ! నీ చక్షువుల్.

ఉ॥ నాఁడు ఖగేంద్రు చేతనె మ • నంబగు మూర్ఛగడించినాఁడ వీ
నాఁడు మహోదనుర్ధరుఁ డ • నల్ప పరాక్రమ లీలలం దగం

బో(డిమి(జూప నీదు కర • మూర్ధము లొంచ(గ( గట్టు చిత్ర చి
క్కోడక లక్ష్యపాళులె య • గున్ నిజ మన్య విధంబు( బోలునే ?

ఉ॥ పందవు నా(డె యోడితివి • పక్షికులేంద్రున కౌల రుద్రుచే
నందిన చంద్రహాసమున • నాతని( జంపితి కొక యున్నచో
మందవా? జీవితంబును వ • రంబులు కాలుని చే(తకే చుమీ
కొందెదు రామబాణముల • కున్ గుఱిగాక మనంగ( గూడనా?

తే॥ వరబలము సహాయ బలంబు • వరబలంబు. నలువవార్తలు రాముడు • నారిగూర్చు
వఱకెకాని యావల ఫలిం • పంగ( గలవె?. భానునెదుట( జీకట్లును • ప్రబలునేమి?

శా॥ కైలాసంబు( గగల్చునా(డు మృదుప • త్కంజంబుచే నీ మిడిన్
వ్రీలం జేసిన శంకరుండు షరముల్ • వేకల్చు నారాచమున్
లీలం గూర్చిన మేరు కార్ముకము వ్రీ • లెన్ రాఘవస్వామికిన్
గేలం బట్ట(గ సిల్వ కిప్పటి ధ్వనిన్ • గించిజ్ఞ యాలింపవో ?

శా॥ తారాద్రిం బెకలించి దిగ్గజములన్ • దాటించి జంకించి నా
కౌరా! యెవ్వరు సాటివారలని వ్య • ర్థాలాపముల్ సేయు నీ
వా రామానుజు(డుండు వేళ నట దా • యం గొంకి దా(కొంటి వి
సీ ; రామాచరణంబులం బడెదవో • సిగ్గింత లేకియ్యెడన్.

ఉ॥ నీవు కలంగి దా(గి మన • సెక్కొను చోటిది యంచెఱింగి మ
జ్జీవవిభుండు ఎప్పునెడ( • జెందిన కోపదవాగ్ని యిమ్మహా
రావముతోడి వారిధి( బు • రంబు దహించి యడంగునో? దశ
గ్రీవ; జగంబులెల్ల నుడి • కించిన జీవముతో నడంగునో ;

చ॥ చెడుగరులైన రక్కసుల • జీవములం గొనియే యడంగునో ?
దుడు కొకరుండు సేయ గుఱ • ధూర్వహు కోపముచే నజాండమే
చెడ నగు నేమొకోయనుచు( • జిత్తమునన్ భయమందుచుంటి నా
యెడ(దకు ధర్మమున్ శశి ది • నేశులు సాక్షులు సత్యమీ నుడుల్.

ఉ॥ అందముచెందు నీపుడమి • యందలి జీవులు వేలుపుల్ భయం
బంద( జరించు బాలిశ ; దు • రాత్మ! సమంచిత చేష్టనీడి యీ
దుందుడు కేల గొంటి వి(క • వోరుట నిక్క మజేశ విష్ణు సం
క్రందన సన్నిభుం డనియొ • రాఘువునెంచెదు నీ మనంబునన్ ?

చ॥ ఇనకులు మానవుండనుచు • నెంచెద వేని మహాబలిష్ఠు న
ర్జును నొకమానవుండె కద • రూపడ(గించెను వానిచేవయున్
మనమున నెంతుకాదె? జన • మాన్య చరిత్రుని రాము సత్త్వమున్
ఘనమగు దూరదృష్టి నెఱు( • గందగు దీవును గర్వపర్వతా ;

చ॥ పలువతనంబుచే ననపు • భాగ్యము గోల్పడనున్న మూఢ! వా
రలు నొకయిర్వురే యని వి • రాకృతి సేయుదు వేని సర్వలో
కలయము వేళ నొక్కఁ డలు • కందుఁడ కాఁడె సమాప్తి సేయు నా
పలుకులలో నిజమ్ము పిద • పన్ బపరాస నెఱుంగ గా నగున్.

తే॥ గుణకిణాంకిత భుజాలు స • ఘంరిత జయు, లగు హిరణ్యాక్షుఁడును హిర • ణ్యకశిపుఁడును
పూజ్య పద్ధతుల్ వీడిన • నప్పుడును పరుల, యాంద్ర యెడ మేరదాఁట కే • యరిగినారు.

చ॥ స్థిరులయి నిల్చువారలును • చెట్టలచేసి నశించు వారలన్
సరలా? విశాటులో? తెలియఁ • జూడుము సర్వ జగంబు లోఁగి నా
ఘరపడి సేవసేయి మహి • మోన్నతి నందితి నందువేని య
ప్పురుపు తపః ఫలంబొ మఱి • పాపఫలంబొ? తగన్ గ్రహింపుమా.

ఉ॥ భాగ్యము నీకొసంగిన క • పర్దియు సంతతమున్ భరించు స
ద్భాగ్యము సుస్థిరంబగు త • పః ఫలమందుట చేతఁగాదె? త
ద్భాగ్యమ నీఁగఁగా సుతులు • బంధుజనంబులతోడఁగూలు దౌ
ర్భాగ్యముఁ గోరి ధర్మమును • పాదొనరించితి వేల దుర్మతీ!

ఉ॥ వీర్యము సర్వదా జయము • వీకునఁ గలిన వారలేని దు
ష్కార్యము సేయువారలును • కారుణికత్వము వీడువార లై
శ్వర్యము వోవ నాశిలట • సత్యము; కామముఖారి వర్గ జి
ద్వీర్యులు గాక దుఃఖముల • వీడినవారు మఱేరు? దానవా!

సీ॥ రాముండు దండకా • రణ్యంబు చేరుచో, ద్రవిడభాషకుఁ బ్రోది • తనియఁ జేయు
ముని మొదలగు మహా • త్ములు వచ్చి దుష్ట రా, క్షసులకృత్యములు దు • స్సహము లయ్యెఁ
దపములు సాగవా • దనుజులఁ బరిమార్చి పాలింపు మమ్ము నీ • వలన వారు
నీల్గుట నిక్కమ • నిరి నేను వింటిని, తగిసల్లె నీ యస • త్కర్మ మహరె

తే॥ నీబలము జీవితంబును • నియత బలము, నెఱిగఁ దెలిపిన పిదపనే • నీ చెలియలి
ముక్కుకోఁత నీతమ్ములఁ • జక్కఁడుమట, రవ్వయేని యోచింపవో • రాముబలిమి.

చ॥ ఎఱుకవలేని మూఢ! నిను • హేళనసేయుచు నీకరంబులన్
విఱిచి ముఖంబులన్ రుధిర • భీషణ ధారలు గ్రక్క గ్రుద్ది పైఁ
జెఱనిడ్చు కార్తవీర్యుని వి • శిష్ట భుజంబులఁ ద్రుంచు భార్గవుం
డుఱుకుచు వచ్చి, రామునకు • నోడుట నీవు వినంగ లేదొకో?

సీ॥ కఱచి చంపెడు క్రూర • కాలాహియైనను, మంత్రంబునకు లొంగి • మడఁగియుండు
విదితగు విద్విష్టతగ • దిది పోలు విడికూడ, దని మందలించి న • జ్జన పథంబు
కఱపెడు వారు నీ • కడ నెవ్వరును లేర, యున్నట్టి వారా నీ • వన్నదెల్ల
సరియని మోమోట • సంస్తవనము నేయు, క్రించులై విన్ను ము • గించువారె

యింక నీకు ముగింపు గా • కెవ్విధమున. ముగియు నదియునుకలదె ధ • ర్మపు చెడంగఁ
గర్క శాత్మ! చెట్టు చెడెడు • కాలమునకు. గుక్కమూతి పిందెలు పుట్టు • కోపునిదియ.

మ॥ ధరణీజాత వచించు పాడి వినినం • త న్నేత్రముల్ గ్రక్కె నె
త్తురులన్ మించులపోల్కి వెగ్గె దశవ • క్త్రుండన్ని యాస్యంబులన్
గిరులుం జూర్ణముగాఁగ గర్జిల వడం • కెన్ భూమియుం గోపమూ
స్మర విక్రాంతిని మీటిపోయే వివరిం • పన్ శక్యమే తత్ స్థితిన్ ?

చ॥ నెగసిన లజ్జయున్ దెసల • నెక్కొని కొల్చు భుజంబు లగ్నులన్
బొగలను గ్రక్కు కన్నులును • భూరిభయంకర రీతిఁగ్రాల నీ
మగువను జీల్చి మ్రింగెద న • మాంతముగా నని నీల్గి కోపమో
హగతులు వోరు సల్పఁ గది • యం జనఁ బోవును పోవఁ దొక్కటన్.

తే॥ హనుమయప్పుడ మాస్వామి • వినిదురాగ్ర. హమున నీచుండు తాఁకుట • కరుగుమున్నె
నలఁచి వీనిని చంపి య • వ్వలఁ జరింపఁ. దగిన చందము మాచుకొం • దమని తలఁచె.

ఉ॥ ఎక్కటియైన వీని తల • లెత్తెల గ్రక్కున సూడఁద్రుంచి వే
యిక్కడలిన్ మునుంగఁ బరి • నిట్టులె కాల నడంగఁ ద్రొక్కి యే
నొక్కఁడ పూతశీలను ర • ఘూత్తము దారను మోచికొంచుఁబే
రుక్కునఁ బోవుచే యుఱవు • నొప్పని చేతులు నల్చుచుండఁగన్

క॥ అండమ్ముల నుద్దండతఁ, దుండములుగఁ జెండఁదగిన • ధూర్తుని కోపం
బండజయాన పయింగల, మెండు వలపుచేఱు పాఱ • మెల్లన నాఱెన్.

చ॥ నలఁచెద నంచు నల్గితిని • నల్పఁగఁజాలక యుంటిఁ దొయ్యలీ!
పలికితి కొన్ని యయ్యవి సు • బద్ధములే యగుఁగాక యిమ్మహిన్
చులుకనయుంచు నొక్కటియుఁ • జూడఁగ దెప్పర మంచు నొక్కఁడుం
గలదె? జయంబు నోటమియుఁ • గ్రాలె విహార విలీలలై తగన్.

చ॥ ఒక పలుకాలకింపు మిట • నుగ్మలి! రాముని చంపి నిన్ను నే
నకుటిల లీలఁ దెచ్చిన ర • యంబునఁ బ్రాణము వీడిశేని యే
నకట! మరింత నిక్కముగ • నట్లగుటం గికురించి తెచ్చితిన్
వికచ సరోజలోచన! భు • విన్నను దాఁకెడు వాఁడుఁ గల్గునే ?

మ॥ హరిణంబంచుఁ దలంచి యేగిన మను • ష్య ప్రాకృతుల్ నన్ను తా
రరయంజొచ్చిరయేని యిప్పటికి రా • నంకించి యుంకింప రా
నరులం గూరిచి కుండికుంది యెదురన్ • లాభంబె ? నా చేఁతకున్
సురలైనం బయిలోటగాక తగదం • చున్ వైరముం గొందురే ?

చ॥ అగుదురుగాక నన్ను సమ • రాంగణమందు జయించునట్టి రే
యగుదురుగాక నాశమును • నందని వారలయై త్రిమూర్తులున్

జగముల నేలు నింద్రుఁ డని • శంబుడిగం బొనరింప నేనె ము
జ్జగములఁ గీర్తినించితి ని • జంబుగ నెవ్వరి కిట్లు లబ్బెడిన్?

సీ॥ అలికుల వేణిరో! యజహరి హరులయు, సురలయు బలములు • స్రుక్కునట్లు
జగముల నిండిన • జయము వ్యర్థంబుగ, నీకొఱకై యొక • నింద నొంద
విష్ణుల వ్రతముల • నియతిఁ జేయుచునుండు, బలహీన నరులఁ జం • పంగఁజాల
వారి నిప్పటికి నే • వారక రప్పించి, సేవలు గొందుఁ గాం • చెదవు గాక

తే॥ అల్పగుణ మల్పకార్యంబు • లల్పఫలము, గలుగు నల్పుల కథ నీఁకు • గానఁబడిన
తెలివి బలము నామెడఁజూడఁ • దెలియరాదొ?, వారినొక కేలఁగొని తెత్తుఁ • గోరిచూడు

చ॥ కనిసిన పక్వజన్ములగుఁ • గావుత నాకిటు నిన్నొసంగు మే
ల్వని దలఁపంగఁ జంపఁదగు • వారె? విలాసిని! వారి నాశమే
మనమున నెంతువేని యది • మానుగ నీకు శుభంబయేని నా
కనుమతి యిమ్ము చేసెద ర • యంబున నయ్యది యెంత కార్యమో

మ॥ అవురా! యింతగవేఁడ సమ్మతిల ప • ల్వాయుష్కరాలా! యయో
ధ్య విలాతిం భరతాదులం గెడపి క • ల్పాంతాగ్ని నాఁ బేర్చి కా
ల్చి విదేహంబొగి నశ్రమంబున మృగా • క్షీ! నీదుప్రాణంబులన్
జవులూరఁగ వెదలించి మ్రింగఁదగు నా • సామర్థ్యముం గానవో?

చ॥ అని విలయాంతకాలు క్రియ • నగ్గి కరాచురి వంకఁజూచి నా
కును వశమందవేని యటఁ • గొందును ప్రాణము రెండు నెల్లలో
నను వెదియో మనంబున న • యంబునఁ జూడుము బుద్ధిమంతు లొ
ప్పని నెటిఁగొంచుమంచు జడి • పించి తలంచిన యట్లదల్చుచున్.

తే॥ దీనిఁ దర్జించి భర్జించి • తెలియఁబలికి, వశపడని తేకయున్న మీ • పాలి విషమ
యగుదునని గంటునడు మొగ • ముడర వక్క, పంద్ర కసురరాజు తెలియఁ • జెప్పుమరలె.

తే॥ పంక్తి ముఖుఁడేగ రాహువు • వట్టి విడువ, మనమునొరను వెన్వెంట నె • మబ్బుగములు
క్రమ్ముక్రియ దైత్యకాంతలు • క్రమ్మికొఱు, లన్నివిధములఁ దలఁచి న • ట్లఖచినారు.

తే॥ ముందునిలిచి చఱువుల ని • ప్పుకలురాలఁ, జుఱచుఱు జూచి కుంతముల్ • శూలములను
చూపి చంపుఁడు చంపి న • జ్జగను కొంది, యొల్చి తినుఁడని కొందఱు దర్చినారు.

సీ॥ నలువ మనుమఁడు లోక • నాయకుఁడు సహస్ర, శాఖాన్వితంబగు • సామవేద
పారగుఁడును మహా • ప్రాజ్ఞుండు పాపముల్, తుదముట్టఁ ద్రోచిన • దొడ్డవాఁడు
నీకేమి చెదుగు గా • న్పించెనే రావణుఁ, డంచిత ప్రేమ చూ • పించుచుండఁ
బోఁగాలమే యిట్లు • పుండునఁ గోలఁ జొ, న్పించి నట్టులు ప్రలా • పించి తీవు

తే॥ అతని కోపాన లోకంబు • లంతరించు, నీవు నీవారలెల్లరు • నీల్గునట్టి
చెడుగు తెచ్చుకొంటి విఁ కేమి • చెప్పఁగలదు? సుదతి! యని కొందఱాడిరి • మృదులఫణితి

చ॥ మెలఁతరో: పుట్టినింటికిని • మెట్టిన యింటికి నింగలంబవై
వలువ తనంబు మై నిటులు • పాడొనరింపఁగఁ బూనితేల? నీ
విలుగుట నిశ్చయంబు కల • దెల్లను తేటపడంగ నింతగాఁ
బలికితి మిందుపై మనసు • వచ్చిన రీతిఁ జరింపుమా యనన్.

మ॥ వధియింపం గమకించు క్రూర దనుజ • వ్యాపారముల్ దేవతా
మథనున్ దానవ చక్రవర్తి నెదిరెన్ • మర్దింపుఁడీ చంపుఁడీ
కథ లింకేలని దూఱు వాక్యములు ర • క్షస్త్రీల యాకారముల్
విధిపోల్ దానవు నానతిం దలఁచి న • వ్వెన్ సీత నిర్విణ్ణయై.

ఉ॥ అయ్యెడ దాయుచుం ద్రిజట • యమ్మరో: స్వప్నఫలంబు పూర్వమే
నెయ్యము మీఱఁ దెల్పితిని • నీవిటు లంగద నొంది కేని యో
తొయ్యలి: నీస్థిరత్వ మొక • దోసము నొందెడి నూఱడిల్లు మం
చొయ్యనఁ బల్కెనంతఁ దగ • నుమ్మలికించుట మానె సీతయున్.

చ॥ ప్రభునకు జంకి యప్పగిదిఁ • బల్కెచుఁ గ్రౌర్యమె రూపునొందె నా
రభసము సేయువారు విప • రంబుగ రాఘవపత్ని సేతకున్
శుభముల నొప్పుగాఁ ద్రిజట • జోస్యముపోలె వచింపఁగాఁ గరం
బు భయము గొల్పుటన్ వదలి • పూనిన కోపము మాని రంతటన్.

## స్వరూప సందర్శన పటలము. (117)

చ॥ అవనిజఁ గాంచదగ్గ సమ • యం బిదె తర్జన భర్జనంబులన్
దవిలిన దైత్య కాంతలును • దాయరు నిద్రకుఁ గోరినంతనే
యెవరును నిద్రపోవని క • పీంద్రుఁడు మాయ ఘటించె దాన మృ
త్యువు తలదాఁకినట్లు మయి • దుం గొని యెల్లరు వ్రాలి రయ్యెడన్.

చ॥ చిరము తపించుచున్ వనరు • సీత యొకప్పుడు నిద్రపోవి యా
సుర వనితాలి నిద్రియుట • చూచి మనోవ్యథ నోర్వలేనిదై
విరియ నుపాయమున్ దలఁచి • వే కనఁ జాలనిదై భయంబుచే
విరవిరవోయి క్రుంగి రఘు • వీరునిపైఁ గం ప్రేమఁ జింతిలున్.

మ॥ మనమా: దుర్విధి రామచంద్రు నిటకున్ • మన్నించి తోడ్తెచ్చునే?
ఘన కోదండ గుణారవంబు గురు ని • ర్ఘాతంబు నా వచ్చునే?
తన కెప్డేని విమోచనంబు గలదే? తథ్యంబు వాక్రుచ్చుమా
యనుమానింపక చూడు నావలని భా • గ్యాధిక్య మెట్లున్నదో?

సీ॥ పెరఁగు నిశాకరా: వెల్లివి వెన్నెలా:, నన్నేల యుడికించి • వలఁచువారు
తఱఁగని రాతిరీ: తగ్గవి చీఁకటీ:, నామీఁద నలుగుట • న్యాయ మగునె?

విరితీవలార! చి • చ్చులు పీడు పడగాలి, తోడుగా నీరీతిఁ • దొలుతురేల?
నీరదశ్యాముని • తో రహి విహరించు, మీరు నాస్థితి దెల్పు • మేరగాదా?

తే॥ ఎంచి రాఁడని యతని పే • ధించువారె?, ఆమహాత్ముఁడు రాకుండఁ • డని యుదార
కరుణఁగూర్చి యేఁ జెప్కు దుః • ఖములకోర్చి, ప్రాణముల పీడకుంటి నీ • వఱకుఁదమిని.

సీ॥ వలదు వృషకీర్ణ • పనులకు రాఁ దలం, పకు కొన్ని నాళ్ళలో • మరలి వత్తు
నిలుమంటి నిండిన • నెనరిదియేని ని, న్నెదఁబాసి దిక్కు లే • కిట్టు లలయు
ప్రాణంబులను బాధ • పఱచుచు నూరకు, పేక్షించి యుండుట • యాద్యగుణమె?
యింతేల సీతంద్రి • చింతించి చింతించి, నీకొఱకయి మఱ • జించునట్లు

తే॥ లోకమెల్లను దుఃఖంబు • లోన మునిఁగి, తుది గననిత్రోవ విలపింపం ద్రోచి యేగి,
కానఁ జేరు కట్టఁడివి నన్ • గాతువనుచు, విశ్వసించెడు నాకంటె • వెడఁగు లెవరు?

ఉత్సా
మను సపేక్షగొన్న జీవ • మా! వివేకమా! వెతన్
నను భజించి లజ్జలేక • నలఁగుచున్న వారు నా
ధుని మొగంబు గాంచు దనుకఁ • దొలఁగ రేమి? నేను నిం
దను భరించి బ్రదుకు మీకుఁ దగవుగానె దోఁచెనే?

తే॥ పలువిధంబులుగా నిట్లు • పలవరించి, ప్రాణ మొక్కటి కలదేని • బాము గలదు
దాని పీడిన నన్నియుఁ • దలఁగఁగలవు, కీర్తియును నిల్పు ననుచుఁ బం • కేజనయన.

తే॥ చూడఁగలమను నాసచే • సురిఁగి యోర్చి, ప్రాణముల తీపియెంచి కా • పాడుచుంటిఁ
బలుదినంబు లివ్వటఁ జెఱ • పడ్డ నన్ను, ప్రేమఁ బావనుఁ డంగీక • రించునేమి?

తే॥ పరులు వలచిన పిమ్మట • బ్రతికియుండి, పలువిధంబుల ప్రల్లద • ములను వినియు
బ్రతుకు నింతకాలంబు భా • రముగఁ గడపు, కఠిన రాక్షసుల్ నాకంటెఁ • గలరెయొరులు?

చ॥ జనముల నోళ్ళనుండి పలు • చంచన మొందిన నింద మోచి కుం
దొనరని యాభిజాత్య మొఁగి • యోరిమి లజ్జయు నౌర! యెంత సం
తనగఁ బొసంగి యున్నయవి! తక్కొటి క్రొత్తడులందు నావలెన్
బెనిమిటి పీడి ప్రాణములఁ • బ్రీతిని దాల్చిన వార లుందురే?

మ॥ పరవేశ్మంబునఁ జేరువాని మనలం • బాటించి కైకొంట స
త్పురుషశ్రేష్ఠుల కర్హమే యనుచుఁ జే • తో నాయకుం డిట్టు లో
ప్పరికించెం గద యాతఁ దాఁడి వదన్ • బన్నంబులం బొంది దు
ర్భర జీవంబుల నేను నిల్పుకొను చే • భాగ్యంబు గైకొంటకో?

తే॥ ఎపుడు నిందలపాలైతి • నపుడె జీవ, ములను విడువంగఁదగు నేను • భువి జనములు
ప్రువ్వఁదిట్ట గౌరవమును • పొలిసి పోవ, బ్రదికియుండుట స్వర్గంబు • వడయుకొఱకె?

ఉ॥ ప్రేమములేని పీరులఁ బ • విత్రుల చరిత్రుల రాఘవేంద్రులన్
భూమిని గొప్ప బట్టు వడిఁ • బొందినఁ బొందెదుఁగాక దుస్తర

స్తోమములైన దుఃఖములఁ • జూడవి యున్నత వంశ్యనై గుణ
స్తోమము నొందు నా వనట • దీర్చునదెవ్వరు నేనుగాకిలన్ ?

క॥ కపట మృగము వెంబడిఁ బ్రా. ణపతిఁ దఱిమి మఱఁదిఁ దిట్టి • నాన చెడఁగ దై
త్య పురము చేరిన మనుగడ. విపులకు బరువగుచు వెతల • వెత గాకున్నే ?

ఉ॥ వీరులు రామలక్ష్మణులు • వీకున నింద తొలంపఁగోరి యా
ర్వేరము పూని గెల్చిన స • రే మరణించిరయున్ సరే భువిన్
వేరిమినొంది యిల్వెడిని • పీసరచేసి మెలంగు నేను దు
ర్భారముగా వహించు నడి • వారల నొందునె యెన్నఁడేనియున్ ?

తే॥ మానహాని గల్గెడుచోఁ జ • మర మృగంబు. వంటి గుణమబ్బు సత్పతి • వ్రతల యెదుట
మగవిఁబాసి మాయావుల • నగరమందు. బ్రదికెనంచు జగము నవ్వ • బ్రదుకఁదగునె.

మ॥ తత కల్యాణ గుణాలయుండు ఘనకో • దండంబు చేనంది దై
త్యతతిన్ మూలము ముట్టఁ ద్రుంచియును కా • రాగారముక్తన్ గలం
కిత నంటం దగదన్నచో నతని సం • దేహంబు వాయంగ నే
గతి మద్భూషణమౌ సతీత్వమును తా • ర్కాణింతు నప్పట్టునన్ ?

ఉ॥ కావునఁ జచ్చుటే తగిన • కార్యము వేఱొక దారిలేదు నా
చావునకున్ నిరోధలగు • చానలు మత్సుకృతంబుచేత ని
ద్రావతులైరి మంచి తఱి • దక్కిన దంచును మాధవీ లతా
ప్రావరణ స్థలంబునకు • రామ కళత్రము పోయె మెల్లనన్.

చ॥ హనుమయుఁ జూజె నామె హృద • యంబు నెఱింగె భయంబు పైకొనన్
జెనకి నిరోధముం జలుపఁ • జెందెను జంకు. జగన్నియంత రా
ముని పరవుండ సాహసము • పూనకు మమ్మరొ యంచు సీత వె
న్కనె చని యడ్డుగా నిలిచి • కై ముకుళించి వచించె నివ్విధిన్

శా॥ అమ్మా! రాముఁడు పంప వచ్చితి ననం • ఖ్యాకుల్ కపుల్ నావలెన్
నెమ్మి న్నిన్ను గనంగఁ బెక్కెడలకున్ • వే పోయి యున్నారు లో
కమ్ముల్ రోసెదు వారు పూర్వకృత భా • గ్యప్రోన్నతింజేసి లం
కమ్మీపాదసరోజ దర్శనమునన్ • గణ్యుండనైతిన్ ధరన్

శా॥ తల్లీ! యిచ్చటి యిట్టి నీ యునికి చిం • తా వ్యాకులుండైన శ్రీ
వల్లాభాఘఁ దెఱుంగఁదమ్మ! నిజ మీ • భూలోక దైత్యాన్వయం
బెల్లం గూఁకటివేళ్ళతోఁ దునిసి పో • కీమాడ్కి విల్చిందుటే
తెల్లంబై తగుసాక్ష్యమౌ మఱి నిబ • ద్దింపంగ వేఱేలొకో?

శా॥ సందేహింపకుమా సతీతిలకమా! • సర్వేశ్వరుం డంపుచోఁ
జందంబారఁ నమ్మఁ బంపిన యభి • జ్ఞానంబు పార్థా శియుం

తే॥ తమ్మితో సర్వజగములు • దనరు పొట్టు, వైన నాభికి వలమురి • యైన గంగ
సుడులు వొగడలు సుంతయు • నూటగావ, యుసను యెందుండి తెత్తు నీ • యుర్వియందు.

క॥ అతిసుందర మరకత స, న్నుతమును పెనుగీయు పెడఁద • వక్షమ్మున ను
న్నతినుండ ఘన తపము నం, గతిఁ జేసిన లక్ష్మికంటెఁ • గలరే పుణ్యుల్ ?

తే॥ బంధరములు చెందమ్ములన్ • భ్రమను మునప, వట్రువలయి పీనములయి • వఱలు దీర్ఘ
బాహువులకు వేలుపు గొరు • బలుపుచేయు, బోలు నొకకొంత వేఱొండు • పుడమిలేదు.

ఉ॥ పచ్చని క్రింది పత్రములు • భాసిల నెట్టని పంకజాతముల్
విచ్చినరీతి నొప్పు చెయి • వ్రేళుల యందలి గోళ్లు దుష్ట సం
పచ్చరితున్ † సురారివిభు • వజ్ర శరీరము నెట్లు తుఁడ్లుగా
వ్రచ్చెనొ యన్న సందియముఁ • బాపఁగఁజాలుఁ బతివ్రతామణీ !

ఉ॥ గట్టివికావు కాంతులను • గల్గపు సంగర చైత్రలక్ష్మిఁ జే
పట్టవు మేరుకార్ముకము • భగ్నముగా గొనయమ్ము నీద్వపున్
నిట్ట యశంబు నొందవు జ • నింపవు చెండు సమానరీతులన్
గట్టల నెట్లు పోల్పఁదగుఁ • గాంతుని బాహు విలాస లీలకున్ ?

తే॥ శేష శయను నెదమచేతి • చింద మొందు, పొదలఁగదలి శంఖమ్ము లేఁ • బోఁకమ్రాఁకుఁ
గంఠమున కుపమించు వెం • గలుల పలుకు, లియ్యకొనఁగ మావలనఁ గా • దింత యేని.

క॥ శ్రీ రాము నెమ్మొగముతో, నీరజములఁ బోల్తమన్న • నేత్రంబులకున్
మేరుపమ దేనిఁ జూపుదు, నీరజుఁడును దఱుఁగుచుండు • నెఱి నెలనెలకున్.

చ॥ ఇనకుల వార్ధి చంద్రముని • యెట్టని నోటికి నీరుద్రావి వి
చ్చిన యెఱదమ్మిఁ బోల్ప నది • సిగ్గిలు దేవ సుధాభమైన చ
ల్లని నుడిలేని పంత వివ • శంబగు హాసములేగి విద్రుమం
బును గొని పల్కు చో జగము • మూర్ఖత నాపయి మోపకుండునే ?

సీ॥ వెలయ మొలచు ధర్మ • బీజాంకురంబులా ! యమృతబిందు శ్రేణి • యా ? వచింప
సత్య భూమీజ వి • శ్వల కోరకంబులా !, యమృతాంశు శకల సం • ఘముల ? తలఁప
ముక్తైంబులా ? తక్క • మొల్ల మున్నగునవా ?, ఎదియని తెలుపుదు • రదనపంక్తి
నుక్షేత్రమునఁ బుట్టు • సురరాజ మణికాంతి, మరకతమును బోలు • మావి చిగురు

తే॥ కొసరి కొసరి వేఁడఁగఁజాలు • కొమరుకాంతి, గలుగు రాము మైవాయకుఁ • గలదె సవతు?
తొదరియింద్రగోపముఁ బట్టు • తొండమైన, నాసికకుఁ బోల్పఁ దలఁచుట • నయముకాదు.

ఉ॥ దండకలో ఖరాదు లెదఁ • దన్ వడఁకంగఁ బికాచపంక్తి కో
దండము వేలుపుల్ మునులు • ధర్మము వేదము లెల్ల విద్విష

† హిరణ్య కశిపుని

త్తండమ దుంపతోఁ జెగెఁ గ • దాయని మోదముతొ నటింపఁగాఁ
గొండొక వ్రాలు కన్బొమల • కున్ దగుపోలిక నీవుఁ గాంతువే ?

తే॥ అష్టమీందుండు సహజ చి • హ్నంబు వృద్ధి, తఱుఁగుటలు పుట్టు క్రుంకుటల్ • తొఱఁగునేని
చీకటన్ వికళుండయి • చెలఁగునేని, రాము వెన్నొసటికి సాటి • రాఁగలండు.

తే॥ పొదవులై నెఱులై నీల • ములయి విరిసి, కొనలు వంకరలై వ్రాలి • కుసుమములను
తావిపొగయుఁ గోఁకపుట్టు • తావివీచు, కురులు జడలయ్యె మొగుళుల • క్రొమ్మెరుగలవె ?

ఉ॥ లచ్చియు భూమిదేవియుఁ ద • లంపునఁ బొందఁగఁ దగ్గయట్లుగా
నిచ్చ నిరేడు దీవుల • వహించుప యన్నపుడున్ విలాతి లే
దచ్చుగఁ గానకేగుమని • యన్నపుడున్ దడఁబాటులేని యా
క్రచ్చుటు పోక గిబ్బయెడఁ • గద్దన వారణ మేద్వకుండునే ?

తే॥ ఇట్లు పలుకు పల్కులు విని • యింగలమున, మైన మట్టుబ కరఁగుచు • మఱుఁగుచుండు
సీతఁగని తల్లి! నీపతి • చెప్పినట్టి, యానవాళ్లను వినుమని • యనియె నిట్లు.

చ॥ అడవుల త్రోవలందు నడ • యాడుట కష్టతమంబు పట్టుగాఁ
గడపు దినంబు లింద యెన • కంబుగఁ దల్లుల కెల్లసేవలన్
నడపుచునుండు మన్న తరు • ఖంబున వాడిన మేనితో నొకే
యుడిచిన చేలతోఁ గినుక • యొప్పఁగుఱంగట నిల్చి టాడుమా.

చ॥ ధరణిపునాజ్ఞ నౌదలను • దాలిచి పేరిమి సమ్మతించి రా
జ్యరమను వీడి యేగు సమ • యంబున జానకి కోటవాకిటన్
దఱియః ముస్నె యింత కడు • దవ్వొకొ కాన! మతెంత దూర మం
చరుదుగఁ బ్రశ్నసేయుటయు • నాడటఁ దెల్పుదుగాక మారుతీ!

ఉ॥ నావిభునూఱడింపు వచ • నంబులఁ దేఱితి మానసంబు నం
దేవగయైన చింత పహి • యింపను చిల్కల గోరువంకలన్
నావలెఁ జూచు కొండనుచు • నాచెలియంద్రకుఁ బ్రేమతో సుమం
త్రా! వచియింపుమంచుఁ దగ • నాడిన పల్కులు జ్ఞప్తి సేయుమా.

చ॥ మఱిమఱి పల్కనేల ? హను • మా! యిది యిమ్మ మదీయనామ మ
చ్చెరువుగ హీరరత్నములఁ • జెక్కిన యుంగర మంచు సద్గుణో
త్తరుఁడు ప్రియంబుతో నొసఁగెఁ • దల్లిరొ, కైకొను మంచుఁ జూపె వా
నరవరుఁ డంత మైథిలియు • నర్మిలిమైఁ గనె నంగుళీయమున్

## సీత యుంగరముం గని యానందించుట

సీ॥ అర్ధేందుఫాల యా యంగుళీయముఁ గాంచి, పొందిన స్థితి దేనఁ • బోల్పనగును ?
చచ్చిన వారలు • జన్మ సాఫల్యంబు, గాంచిన సంతృప్తిఁ • గాంచె ననియొ ?

మఱచిన వారలు • మఱచిన నంగళి, సభట్టిగొని బొందు • చంద మనియొ?
విడిచి యేగిన జీవ • విశితి మరలి వచ్చి, బొందిఁ జేరిన నొందు • నంద మనియొ!

తే॥ వీడు మఱిఁగన్న స్వప్నంబు • వీఁక సనియొ?, తొలఁగు నిధి నొందు మానవు • తోయమనియొ?
లేక లేక బిడ్డను గన్న • చిలయనియొ వోయి యేగ్చి కన్నులఁగన్న • పోల్కి యనియొ

తే॥ అందికొనియెను బొమ్మను • నెలఁకొనియె, నెత్తిని ధరించెఁ గన్నుల • నొత్తికొనియె
బాహు లుబ్బెను పులకించెఁ • బాళిఁ గొనియెఁ, గుండె నిట్టూర్చెఁ దెలిసి వా • క్రువ్వఁదరమె?

తే॥ మూరుకొను నక్కునం జేర్చు • మొగిని తడపు, సత్రువుఁ దుడ్చుకొని యట్టె • యదరిచూచుఁ
బలుక నుంకించి నేపయుఁ • బలుకకుండు, మేను పొంగార దానిని • మ్రింగఁజూచు.

క॥ మించుం బోలిన మొదలునఁ, గాంచన సంకాశ రుచులు • గాన్పించె నటన్
మించిన రాముని యుంగర, మంచితమగు స్వర్ణ వేది • యగునేమొ కదా!

తే॥ క్షుధితునకు మించి భోజ్యంబు • చూపుబోలెఁ, గేస్తునకు మంచి విందబ్బు • క్రియఁ దలిర్చె
మరలఁ బ్రాణంబు రప్పించు • మందుఁ బోలెఁ, బడఁతి కారామభద్రుని • భద్రముద్ర.

తే॥ జీవములు నెమ్మదించెంది • చెలఁగుసుదతి, కన్నుల మునత్రువులు తొమ్మఁ • గడుగుచుండఁ
బ్రాణ మొసఁగిలె పుత్తమా? యనుచు మరల, ననియె నిట్టులు మృదుమధు • రాక్షరముల

చ॥ జగముల సృష్టిసేయ నల • స్రష్టకుఁ గారకుఁడైన రాము దూ
లిగఁ జనుదెంచి జీవములఁ • దద్దయు నిల్కడసేయు నీకుఁ బొం
దుగ నొసరించు ప్రత్యుపకృ • తుల్గలవే తలిచంద్రు లట్టి పు
ణ్యగుణా! కృపానిధీ! యిహప • రాధిక సౌఖ్యము లిచ్చి తియ్యెడన్.

ఉ॥ దిక్కొకయింతలేని బలు • దీనకు దిక్కయి దుఃఖ మార్చి యి
ట్లెక్కుడు మోదమిచ్చిన క • పీంద్ర! చిరాయువు నొందుమయ్య! యేఁ
జొక్కపు మానసంబు గల • జోటినయేని యజాండ గోళముల్
స్రుక్కెడు వేళ నేఁటివలె • శోభిలు చుండువు గాక మారుతీ!

ఉ॥ ఎచ్చటనున్న వాఁ డినకు • లేశుఁడు తమ్మునితోడ నిన్ను దా
నెచ్చటఁ గన్నవాఁ డరి గ • జేంద్ర మృగేంద్రున కేడు దెల్పు రే
నిచ్చట నుక్కి నాకుఁ దెఱఁ • గేర్పడఁ బల్కఁగదయ్య పావనీ!
సచ్చరితాగ్రగణ్య! యన • జానకికిం గపివర్యుఁ డిట్లనున్

శా॥ మారీచుండు దశాస్య ప్రేరణమునన్ • మాయామృగాకారుఁడై
శ్రీరాము న్వడిగొంచు దూర మరుగన్ • జింతించి రాముం దొకే

క్రూరాస్త్రంబున సేయ వాఁడు నిను సం • క్షోభింపఁ జేయంగ నా
ర్తారావంబు చెలంగ మ్రోఁతయిదె న • ట్లమ్మా! జగత్పావనీ!

శా॥ ఆకంఠధ్వని లక్ష్మణుండు విని స • త్యం బెంచి రాకుంటకై
కాకుత్స్థుండు శరాసనోగ్రరవముం • గావించె నట్లయ్యు ని
స్తోకంబౌ విధియోగమే గెలిచె నెం • దుం గల్గ కంఠస్వరం
బేకాకొందదొ యేమొ? త్రోవ ననుజున్ • వీక్షించెఁ దా వచ్చుచున్.

సీ॥ కాంచి లక్ష్మణు ముఖా • కారచిహ్నంబుం, జేలోని తలఁపవ • లీల నెఱిఁగి
జరిగిన వృత్తంబు • సౌమిత్రిచే నంత, నాలించి పడిఁ బర్ణ • శాలఁ జేరి
నీ సౌరు మేను గా • న్పింపమి జీవముల్, చెదరిన గతి సొమ్మ • సిల్లె విమల
కరుణామయుండు దుఃఖంబొంద • వేతొక్క, కత మింతకంటెను • గలదె భువిని

తే॥ ఆవల నేనును వెదకి ప్ర • త్యక్షముగను, రమణిఁ గాంచితి నీకు భ • ద్రమగుఁగాక
ప్రభుఁడు రాముఁడు జీవముల్ • పాయలేఁడు, కారణంబును నీవును • గాంచలేవె?

ఉ॥ నిక్కపుఁ బ్రాణమై చెలఁగు • నీవు తొలంగ ససత్య జీవముల్
చెక్కినయట్లు నిల్చె రఘు • శేఖరు చిత్తమునందు యిప్పుడున్
జెక్కు చెమర్ప కుంటి వికఁ • జేటొనఁగూడుట యెట్లు? నీవు ని
ట్టిక్కడనుండ నాతిఁ దట? • నేగతి నేయవి నీదు నమ్మరో!

తే॥ అట్టి రాముఁడు కొండలు • నడవు లెల్ల, వెదక యంత్రక్రమము పోలె • వెదలి చనుచు
జగము కీర్తింపఁ దనజీవ • సరణి వీడఁ, గాచియున్న జటాయువుఁ • గాంచెఁ ద్రోవ

సీ॥ అతని మేనింగాంచి • యడలుచుఁ దండ్రి! నీ, కిట్టి దుస్థితి యెట్టు • లెనసె ననుడు
విను రావణుండు దొంగి • సివుతిఁ దెచ్చుట తెల్పి, చున్నంతలో నల్క • మిన్నుముట్ట
జగములనెల్ల మ • చ్చరచిహ్నకీలఁ, బూది గావింతు నం • చూఁది నిలిచి
కోదండమును గాంచు • కొమరు జటాయువు, వీక్షించి యొక్క యువి • వేకి వెడుగు

తే॥ సేయ జగముల నాశంబు • సేయఁదగునె, శాంతి నొందుము తొందర • చనదు తండ్రి!
ధర్మచరితుఁడ వని సమా • ధాన పఱుప, రామచంద్రుండు కోపభా • రంబు వీడి.

ఉ॥ ఎచ్చట నుండువాఁడు? మతి • యే భువనంబున నిల్చువాఁడు? వాఁ
డెచ్చటి కేగినాఁడు, దను • జేంద్రుఁడు పోయిన దారి యేది? నా
కచ్చు పడంగ దెల్పు జన • కా! యని నాతఁడు చెప్పబూని నో
ర్విచ్చుచుఁ బ్రాణముల్ నెగసె • వీరవరేణ్యుఁడు ఏడ్చి కుందఁగన్

తరల. తలరి మిక్కిలి రామచంద్రుఁడు • తండ్రికిం దగు నంత్యక
ర్మలు సురావళియున్ భ్రమింపఁ గ్ర • మంబుగా నెఱవేర్చి యా
ఖలుని రోయుచుఁ బర్వతంబులు • కానలున్ భ్రమియించుచున్
దెలివినొందక నిన్ను గానమి • దీనతన్ గడియించుచున్.

తే॥ పోవు త్రోవలు రెప్పట • బుడిదగాఁగ, వహ్ని మైనంబు కరఁగిన • వడువు మనసు
కరఁగ రాముఁడు మతిచెడి • విలపించి, పలవరించుచు మిక్కిలి • వనవి వనవి.

తే॥ జనులలోఁ గన్నెపుల దాఁటు • బాలెవరు? వీరలక్ష్మి వసించెడు • వినుతభుజుఁడు
మతి కలంగ సర్వంబు ను • మ్మెతను దాల్చి, చిత్తజాతవైరివలె ను • న్మత్తుఁడయ్యె.

ఉ॥ నీ వనమందు మావటను • నిక్కముగా మునిఁగెన్ మదీయ రా
జీవదళాక్షి కల్లయని • చెప్పెదవే? మదిరాక్షి రోసి నా
కేవగనైన నీవలయు • నీయక తక్కితివేని నీవు గో
దావరి! నిప్పవై మఱిఁగి • తప్పక మాఁడెద వీక్షణంబునన్.

ఉ॥ పర్వతరాజమా! వదిసి • బాలకురంగమనేత్ర నేత్ర సం
పర్వముగాఁగఁ జూపు మటు • పాయక చూపవయేని నీవృథా
గర్వము సర్వముం జెడఁగఁ • గాలిచి బూదియొనర్తు మన్మహో
ఖర్వ శరంబు లొక్కంత నెమిడి • కంబుగఁ జాలఁ జెడంగఁ జూతువే?

ఉ॥ బంగరులేడి మాయలను • పన్నుటచే హరిణాక్షి నేఁడు నా
కుం గనరాక పోయినది • క్రూరకురంగములార! నాదు తి
స్వంగిని చూపరేని కరి • నాత్మఁ దనై ఘుము దుంపతోఁ బ్రమం
గం గనిపీలఁ జంపెద సు • కర్మము గాకిది ఘోరకర్మమే?

తే॥ దెంద మగల సీరీసీఁదాఁ • గుందికుంది, రాఘవుఁడు చాడుచుండ ని • ర్మలమనస్క
తమ్మ చల్లని వాక్సుధా • ధారచేతఁ, జిత్త మొక్కింత తేటయై • చింతవీడె.

తే॥ కీశకుల శేఖరుండు సు • గ్రీవుఁ డుండు, ఋశ్యమూకంబు చేరిరి • నృపకుమారు
లచట నెల్లప్రాణుల మనో • వ్యథ తొలంగ, మిత్ర లకుమిత్ర పుత్రుల • మైత్రికుదిరె.

సీ॥ శ్రుతులచే జ్ఞానవి • శ్రుతులచే నిజరూప, మెఱుఁగరాకుండు లో • కేశ్వరుండు
తనకుఁ గల్గిన దుఃఖ • మునకు హేతువును మా, యెవల పుండ్లుగఁ జెప్పి • యుదిలగొనఁగ
పీతాదవులఁ జూప • నాతండు మూర్ఛిల్లి, యావచనంబుఁ • మరలఁ దెలిసి
యంపి సీతాభవుల • నష్పృతంబు చల్లిన, నాఁజని పెనునొవ్వి • నందినాఁడు

తే॥ ఆమనోవ్యథ మున్నె తా • నం...యున్న, నవుడు మఱిమఱి క్రొత్తలై • యడరె మేము
మది సమాశ్వాస పడఁజూప • మఱియుఁ జెరిఁగె, నేమిచెప్పఁడు రాముని • యెదఁద వసట.

సీ॥ ఆపర్వతంబున • కావలిగిరి నున్న, వాఁడు శైలనిభుండు • వాలి యనెడు
కపిరాజు నీమఃఖ • తతికిఁ గారకుఁడగు, పంక్తికంఠుని దన • వాలమందు
క్రేలాడఁగాఁ జుట్టి • సప్తపీధరంబుల, వననిధులం దాఁటి • వచ్చినతఁడు
వాని నొక్క శరాన • వడిఁ గూలఁగా నేసి, తన మిత్రుఁడగు మిత్ర • తనయునకును

తే॥ రాజ్య మొసఁగి సేనలఁ గూడి • రాఁగఁ బనిచి, వచ్చు దాఁక నాలుగు నెలల్ • వానలేగ
మాల్యవంతంబునందు ల • క్ష్మణునితోడ, జరిపె నాలుగు యుగములు • జరవులీల.

తే॥ కపిబలంబు చేరినది ది • క్తతులు వెనుక(, బడ(గ వెదకంగ వారల( • బంపి నన్ను
దక్షిణంబున కంపె నా • తరలి రాక, కిదియ హేతువు జనక రా • జేంద్రతనయ।

చ॥ చనవున నిట్లు రామ నృప • చంద్రుని తీరు మరుత్సుతుండు వ
ల్కిన విని భర్తృ దుఃఖ మగ • లింప(గ డెందము నొచ్చియున్ ముదం
బును కుతుకంబు నొక్కడెస( • బొందుచు మూలగయుం గరంగ నా
హనుమని నీ యపారమగు • నంబుధి నెట్లు తరించి తీవనఙ.

మ॥ జననీః రామ పవిత్ర పాద సరసీ • జాతంబు లుల్లంబునం
దపిశాంబున్ జపియించు ధీవరులు మా • యా సాగరంబుం దరిం
చిన చందంబున మీకృపా మహిమచే( • జేకూరు చేవన్ దరిం
చిన వా(డీ కపియన్న శంకయె మదిం • జెందంగ( జింతించుమున్.

ఉ॥ కదుకొను నాటిము త్తెముల • కంటెను వెన్నెలకంటె మిన్నయౌ
రదనరుచుల్ చెలంగిన ధ • రాసుత మారుతి(గాంచి నాయనా।
పొద(దవు నీవు దొడ్డది స • ముద్రము దా(ట(గ నెట్టులయ్యె నె
మ్మదిని తపోబలంబుననొ • మంత్రబలంబుననో వచింపుమా.

హనుమ స్వస్వరూపముం జూపుట

తే॥ అనుడు( గేల్మోడ్చి హనుమంతు( • డంబరంబు, దా(క( బెరి(గి మహీము( బోవ( • దలదగుబునొ
యను భయంబున వెనుక దై • తనదు రూపు, తో(ప( జూపె జానకి కం) • తొల(గి పలుప.

తే॥ పొగడ(దగు గురుత్వము పంచ • భూతములకు(
గలదొ? కపి వరేణ్యునియందు • గలదొ? యెందు
గ(దు? నిజము హూహింపంగ( • గలమె? యనుచు
ద్రోపులాడంగ( దగిన దా • రూప మహిమ

క॥ పెరి(గిన బంగరు గిరి గు, రరుపుల ఖద్యోత వితతి • తనరె న(గన వా
నరవరు రోమంబులతో, గురుతరగతి మెఱసి యుక్ష • హాటము గరమున్

క॥ కనులను జ్ఞానంబును దడ, చిన రూపము గొన్న హనుమ • చెవి కుండలముల్
ఘనముగ గ్రహముల వెలి(గెడి, దినకర శశధరుల తోడ • దీకొని నిలిచెఙ.

చ॥ జగముల( గొల్చి నిల్చిన భు • జంగము తల్పుడె యొప్పలోడ( గీ
డగు నొక వానరంబని య • నాదరముం బొనరింపరాని య
క్షగ శిఖరాణి( బోలు కపి • చంద్రుని యున్నతి(గాంచెనేని లో
కగురుత యొక్కవానికె స్వ • కంబుగ( గాదని యెంచి సిగ్గిలున్

తే॥ అన్నిలోకజాలములందు • సన్నిధిగల, సన్ని ప్రాణుల గాంచె నా • హనుమ నపుడు
పొసఁగఁ బైలోకములనున్న • పుణ్యగుణుల, సందులను దన కన్నుల • నతఁడు గాంచె.

తే॥ పరవి పెరిగిన మారుతి • పాపియుగళి, సంచలింగా లంక సంభ్రమంబు • నందు మునిగెఁ
గొరలి ప్రబ్బెఁ దెల్లని యశో • ధూమము మిఁడ, మీఁద వెలిగి మెఱయుచు • మిట్టఁబడియె.

చ॥ గరితలమిన్నయైన జన • కాత్మజపుత్త్రి వాయుపుత్త్రుఁ డ
చ్చరణ సరోజ యుగ్మమును • శైలము గానఁగలేక సోఁడు రీ
తిఁగ యని యుత్సహించి సుబ • లీ! భవదీయ మహోగ్రరూప బం
ధురతను చూడఁగా బడియు • దున్ వడిగా నుపసంహరింపుమా.

తే॥ అయ్య! నీయనంతాకృతి • నరయఁదగిన, సత్త్వమొందదు జగ మున • సంహరింపు
మనుచు జానకి విభు పరి • ష్వంగ సౌఖ్య, సమ మనము గాంచి పరవశ • త్వము భజించె.

తే॥ అంతఁ జిత్తమునుచు సమీ • రాత్మజుండు, వెంటనే చూడఁదగు నొక • పిన్నరూపు
దాల్చి వినతుఁడై యాయమ • దాసి నిలువ, నిట్టులను మణి దీపంబు • నెనయు సీత.

సీ॥ పవన జవన వీర! భువిఁ గులాద్రులతోడఁ • బ్రిదులక తలను ధ • రించి తన్న
లీల స్వర్గముఁ జెం • లించి మెత్తిలిపన్న, లోకంబు లన్నింటి • జోక మోచు
శేషుని దాపలి • చేల నీడ్చినపన్న, పనధిని సదచియే • వచ్చిరన్న
భవదీయ మహిమకు • ఫలసంచి మగు గొప్ప, పనికాదు లజ్జనే • పాముకొలువు

తే॥ నీజలధి దాఁటి వచ్చుట • యేమిగొప్ప, విభుని కరుణాయు యశమును • పెక్కు కల్ప
ములు తిరంబుగ నెలకొనఁ • బూనిసేయ, నీవ యొక్కండవై యుంటి • నియతచరిత.

సీ॥ ఈలంక నీపేర్మి • కేదు మున్నిలల, నవల నుండమియుఁ ద • క్కువయె గాదె
ఇట్టిదే విజ్ఞాన • మిట్టిదే నీమాన, మిట్టి దేహము ని • ట్టిదియె వమము
కార్యంబు నిట్టిదే • వీర్యంబు నిట్టిదే, తెల్వి యిట్టిదె యిల్లె • తెల్విఫలము
తలఁపు నిట్టిదె నీతి • మెప్పు నిట్టిదె మతి, గెలుపు నిట్టిదె యిల్లె • కీర్తిగరిమ

తే॥ ఎల్ల సుగుణముల్ నీకిట్టి • వే యటన్న, నింక లోకపాలకులయి • యెసఁగుమిందు
నజహరామరాదుల సద్గు • ణాళియందు, హీనులే యగుదురు కదా • మారునీయ!

సీ॥ మెఱుపుకోటులు మేని • మీఱిన బలమొందు, కర్బురావళి వృద్ధిఁ • గాంచినప్పు
డమ్మహాపీడన • కనుజుఁడొక్కఁడు తక్కఁ, దోడు లేదను చింతఁ • దోఁగుచుండు
వీడి నాశంక • వీచెఁ బ్రాణాపద, కొదువలేదని తృప్తి • పొడమె నిపుడు
నీయట్టిమహిమాఢ్యు • సాయమబ్బినమీఁద, నీరక్కసులు లంక • యేమియగునొ?

తే॥ ఇంక నేమరలించిన • నెగ్గులేదు, నన్ను నలఁచిన రాక్షసా • న్వయము తూలె
నేఁడె చెలఁగిపోవె నాభయ • నేఁడె గంటి, యశమె గాక నింద యునాకు • నబ్బునేమి?

సీ॥ అనియిట్టు లామోద • మున నాడు జానకి, పాదంబులకు మ్రొక్కి • పావనియను
నమ్మ! రాముని దాసు • లగు కపివర్యులు, కడలి యిసుక కంటెఁ • గలరు హెచ్చు

వారలలో నొక్క • వనచరుండను భవ. దాజ్ఞలఁ దలమోచు • నడియఁ దేను
ఏడుపదుల వెల్వ • లెట్టిపో గది సము. ద్రంబందు నీరు మొ • త్తమ్మ నొక్క

తే॥ చేతఁ ద్రావంగఁ జాలునే • సేనకెల్ల, రాక్షసుల లంక కానంగ • రాకపోవు
కతన నింతవఱకు నిల్వఁ • గలిగెఁగాక, తెలియు పిమ్మట నింకను • నిలుచు నేమి ?

సీ॥ కమలాప్త పుత్త్రుఁడం • గదుఁడు మైందుఁడు ద్వివి. దుఁడు నీలుఁడునుకుము • దుండు నలుఁడు
వృషభుండు శంఖుండు • వినతుండు గవయుండు, శరభుండు ధూమ్రుండు • జాంబవంతుఁ
డుగ్రుండు కుముదాక్షుఁ • డురుబలుఁడగు శత. బలి గవయాక్షుండు • పనస కాంబ
దధిముఖ గంధమా • దనులు దుర్మర్షణా. దులు సైన్యనాయకుల్ • దుర్జయులును

తే॥ రామ బాణము వలెనె కార్యంబు గొంద్రు, జగములెల్ల నొక్కటిచేయఁ • జాలువారు
వారి లెక్కింప దానవ • వర్గమెల్ల, సలుగకైనను జాలదు • జనని ! నిజము.

## 6. చూడామణి పటలము. (89)

తే॥ దుఃఖితయు రాము ప్రాణముల్ • దొరయుచదియు. శ్రీసమానయు నగుసీతఁ • జెఱ వెడల్చి
కొంచుఁబోవుచే తగుకర్జ • మంచుఁ దలఁచె, నట్టి హనుమ కుసమ సెప్పె • నైతియగునె?

తే॥ బంటు వార్తను వినుము కో • పంబు వఁదు, రావణుని గెల్చు టరిది కా • ర్యంబుగాదు
నిన్ను నీపతి కడఁజేర్చి • నెమ్మమీఱ, మీపదంబుల భజియింతు • సేపు గనుము.

చ॥ అతి మృదురోమముల్ గల మ • దంసముపై వసియించి నెమ్మదిఁ
వెతవిడి నిద్రపొ మ్మనిల • వేగముతో నెడ నిల్వకేగి నీ
పతి గల మాల్యవంతి మునఁ • బన్నిన వ్రాలెద నీకు భద్ర మ
బ్బుత భవదీయ సేవకుని • బో డిమిఁగాంచుము తల్లి ! లెమ్మ కఁ

ఉ॥ దైత్యులు కాంచి యడ్డు దఁ • దప్పను కార్యమె యందువేమొ సం
స్తుత్య బలంబుతో నరుల • దోర్బలముల్ నశియింపఁ గూల్చి నా
యత్యురుకోప మార్చికొని • యప్పుడ కేటఁదనంబు గాంతు సం
ప్రత్యయ చ ంచు మమ్మరొ ! భ • వత్ప్రతి గాంచియు సై పనేర్తునే ?

చ॥ పెలుచన లంకతోడఁగొని • వే చనుమన్నను కెంగించి యేఁ
జాలుకన నొక్కచేతఁ గొని • చుట్టిన దైత్యుల నొక్కచేతఁ బెఁ
బలమున నుగ్గుచేసి రఘు • నాయకు పాదసరోజ సన్నిధిం
దొలఁకక డించువాఁడ నిది • దొడ్డగు కార్యము కాదు చేయఁగన్.

చ॥ పరలుచు లోకమోహనుని • మందట మీయమృతంబుఁ బోలు సుం
దరి దితిజేంద్రుపైచు చెఱ • దప్పు నుపాయము లేక మిక్కిలిం

టరిపరి రీతులన్ మనసు • మాఁడఁ దపించుచు నున్నదన్న నా
వెరవరి దౌత్యమేమి యొవ • వించినదో ? పచియింపు మమ్మరో॥

ఉ॥ గాయములేని పీనభుజ • కాండముతో నటకేగి శాత్రవ
స్వీయ బలంబు నేఁపఁబచి చెప్పఁగ నెట్లగుఁ? దోదికొంచునే
నాయమఁ దేవలే డిపిటి। ప్రాణము మాత్రము గాచుకొంటి మీ
నాయికఁ గాంచి పల్కు జత • నం బొసఁ గూనద యంచునా? యటన్.

ఉ॥ రక్షితసాలమైన నగ • రంబును కాలిచి బూదిచేసి యీ
రాక్షస వర్గముం బద క • రంబులలో నలిగాఁగఁద్రొక్కి నే
యీ క్షణమందె సర్వము న • దీశుని పొట్టను పెట్టి రావణుం
దక్షతఁ జంపుమన్న వడిఁ • ద్రమ్మెద నాజ్ఞ యొసంగు మమ్మరో॥

ఉ॥ శ్రీరఘు వీర శేఖరుఁడు • చెల్వుగ నిప్పుడె నిన్ను గూడి మున్
గూరిన శాపమెల్ల విడి • కోరికలోదఁ బ్రసన్న విస్ఫుర
చ్ఛ్రీమతోఁ జెలంగి మఱి • చెన్నటి దానవ వంశమెల్లఁ బో
కారిచి లోకజాలముల • కష్టములం దొలఁగించు టొప్పగున్.

ఉ॥ ఇందుల కొక్కయద్దు వచి • యింపఁగఁ దగ్గది లేద యట్టి భా
గ్యేందిర నాకు లభ్యమగు • నిమ్మల నీవు దలంచి లేని రా
ముం వగఁజేరి దుఃఖములఁ • బోకడపెట్టి సుఖింతువన్నః న
న్నుం దయఁజూచి మాఁపువయి • నూల్కొన నెక్కుడు యంచు మ్రొక్కినన్.

తే॥ పూన్కి యుక్తవాక్యంబులఁ • బొసఁగఁ బలికి, తల్లికద నిల్పు లేఁగనాఁ • దనరి నిలుచు
హానుమఁ గాంచి నిర్దుష్ట వా • క్యముల మృదుల, ఫక్కి నిట్లనిపలికె నా • పద్మగంధి.

శా॥ అన్నా! నీకిది దుష్కరంబగునె ? యో • గ్యత్రౌఢి నీశక్తికిన్
మన్నింపందగు భంగి నెంచితివి సా • మర్థ్యంబు మెచ్చయ్యె నీ
కిన్నన్ దిక్కట లేరు లేమి యిన ము • గ్ధాత్వంబుచే నిట్టి నీ
యన్నాగం బసమంజసం బనుచుఁదె • ల్పం బూనితిన్ మారుతీ!

ఉ॥ అంబుధి మధ్యమందు దను • జాపళి క్రన్ననఁ జుట్టు ముట్టి క్రూ
రంబుగ నస్త్రశస్త్రముల • రాయిడి చేసిన వారితోడ ఘో
రంబుగఁ బోరెదో? మఱియు • రక్షణచేసెదొ నన్ను? రెండు నం
తింబునఁ గష్టమే యొసఁగఁ • దప్పును కర్జ మొకండ వౌటచే.

చ॥ మఱియొకమాట రాఘవు న • మంచిత కార్ముకవిద్య యాధికం
బొంచయును చాప మాఱడిని • పొందును పక్వపు బోగిరంబుఁ గు
ర్కుచముల దొఁగిలించుకొనఁ • గోరిన రీతిగ నొప్పు గార్యమున్
వెఱవరియైన నీవును ప • విత్ర మనంబున నిట్టు లెంతువే ?

శా॥ ఘోరా యోధసమందు రాఘవు మహా • కోదండ పాండిత్య మే
పారన్ వేల్పులు చూచుచుండ, నను చౌ • ర్యప్రౌఢి సాధించుచుం
గారాగారమునందు కూర్చిన మహా • కష్టాత్ము కన్నుల్ సమి
ద్ఘోరంగంబునఁ గాకముల్ పొడువ సం • తోషించి వీక్షించెదన్.

ఉ॥ రాముఁడు లక్ష్మణుండును దు • రంబునఁ గార్ముక హస్తులౌచు స్వ
స్థేమముఁ జూపి దైత్యుల వ • ధింపఁగ ముక్కఁడిఁ బోలి రాక్షస
స్వామిను లెల్ల దైన్య విధ • వాత్వము లొందినఁగాక నాయెడన్
రామత నంబు నాసయును ? రాజిలునే? గురుతన్ గడించునే ?

చ॥ కనకమయ త్రికూటమునఁ • గ్రాలెడు లంకయె నేను చూడ దై
త్య నికర శల్య సంచయ యు • తంబుగ నిల్వదయేని జీవితం
బును సుచరిత్రమున్ గరిమ • మున్ మహిమాన్వితమౌ సతీత్వమున్
జనులకు నెవ్విధిం దెలుపఁ • జాలుదు నీవ వచింపు మారుతీ!

శా॥ ఈ రక్షో నిలయంబ కాదు మఱి యీ • యీరేడు లోకంబులన్
శ్రీరామాస్త్రమువోలెఁ గాల్త నివృత్తై • చిందన్ సతీత్వాగ్నిచే
నారామప్రభు నేర్పినట్టి విలువి • ద్యా ప్రౌఢికి న్యూనతన్
గూరంజేసిన దాన నౌదు ననియే • కోపక్రియన్ మానితిన్

తే॥ మఱితాజిక్షమునిన్ను స • మ్మాన్యుఁడనుచు, జగము వినుతింతు; రాముపక్షంబుదక్కఁ
దక్కు మేనుదాఁకుట నాకుఁ • దగదు నీకు, రాముకీర్తికి భంగ మో • ర్వంగఁదగదు.

తే॥ ఉదరి నను రావణుఁడు తాఁకి • యుండు నేని, వానిమేన నిన్నాళులు • ప్రాణమున్నె
ప్రాణములు త్రుటిలో నీడు • ననియెవాఁడు. నేఁ గెల్లగించికొని వి • న్వివి నేగె.

తే॥ తన్నుచేర నిష్టపడని • తరుణిఁదాఁకె. నేని శీర్షముల్ తెగి యిల • పైని గూలు
ననుచు నలువ యిచ్చిన శాప • మరయ నాదు, ప్రాణముల నిన్నినాళ్ళు కా • పాడెనయ్య.

తే॥ అట్టి శాపంబు గలదని • యరసి సత్య. వంతుఁడగు విభీషణు పుత్త్రి • పరమ సాధ్వి
ప్రేమ నాయెడఁ గలదియౌ • త్రిజట చెప్పె. నాకు భయము దీర్చెడు జత • నంబుతోడ.

క॥ అది కలుగుటచే ధర్మము, వదలదనుచు నిశ్చయించి • పతి శౌర్యంబున్
మదినమ్మి నిష్కళంకత, పదిలమ్ముగఁ దెలుపనుంటిఁ • బ్రాణమ్ములతో.

ఉ॥ అప్పటినుండి రావణుఁ డ • హమ్మతి ధాత్రిఁ బెకిల్చి తెచ్చి నాఁ
డిప్పటనుంచె లక్ష్మణుఁడ • హీన గుణుం దొనరించి నట్టి యా
పచ్చని యాకుటింటివి కృ • పామతిఁ జక్షువులారఁ గాంచి నా
యొచ్చెములేని మానస మ • హోన్నతి నమ్ముము నీవు పావనీ !

ఉ॥ ఇచ్చటు వీడి యెచ్చటికి • నేగెడు దానను కాను రాము మే
నచ్చముగాఁగఁ బోలు నమ • లాంబువు లున్న సరోజ సద్మమున్

ప్రథిత భవంబునం దొడరి • పట్టను నెమ్మదినైన నెంచ నం
చధిక ముదంబుతో సనుట • యార్యునకున్ వినిపింపు మారుతీ!

ఉ॥ చిక్కులఁ బొంది యిచ్చటనె • జీవములం ద్యజియింతునేని వే
ఱొక్క భవంబునందయిన • నుత్తము వీరు పవిత్ర దేహమున్
దక్కక దాఁకు నిష్కలుషి • తంపు పరంబును కేలుమోడ్పుతో
మిక్కిలి కోరుదాన నని • మేదిని భర్తకు విన్నవింపుమా.

చ॥ సలువుగ రాజ్యపాలన మొ • నర్ప ససర్షు మతుల్ ఖచించు తా
వళములఁ దాల్పు భద్రమద • వారణ రాజముపై రహించి వీ
ధులఁ దగనేగు వేడుక కు • తూహలినై చిన నోచకుండు నే
నెలసి వృథా పచించి ఫల • మేమి? పురా కృత మిట్టులుండఁగన్.

తే॥ తన్ను గూర్చి జనంబులు • తలపమంట, దల్లి చింతయు భరతుండు • తనకుఁగాఁగ
ననుభవించు నొవ్వియునెంచి • యపటికేగు, గాని యిచటికి నెట్లు రాఁ • గలుగు నతఁడు.

తే॥ తల్లిదండ్రులకును బంధు • లతికి నాదు. కేలుమోడ్పు లందింపు సు • గ్రీవుతోడ
రాముతో నయోధ్యకుఁ జని • రాజచెదిన. పురికిఁ బట్టము గట్టఁగ • మొగిచె ననుము.

హనుమంతుండు సీతకు ధైర్య వాక్యములాడుట

తే॥ వెగడుపడి యిట్లు పలుకు వృ • ద్ధ్వజు గాంచి, తల్లి యింకను దుఃఖాన • దలఁచెదేల?
యనుచు మృదు మధురములు స • ముంజసములు. నైన గంభీర వాక్యముల • ననియె హనుమ.

క॥ స్రుక్కెడు నీవేటికనె, స్రుక్కక రాముండు ప్రతికి • వొచ్చు ససైన్యన్
జక్కని మకుటము దాలిచి, సెక్కడి మాటలివి చింత • యేటికిఁ దల్లీ!

చ॥ విడివడి పోవ మానెపుడు • వేడ్క వహించెదు కారయంచె క్రొ
త్తడితెద మించుకేనియును • తాఁకని నిన్ను గలంచు పంక్తికం
ఠుఁడు తన శీర్షముల్ ధరణి • డుల్లక పోకొను నీ విషాదమున్
వడి సనినుండి పాయుదురు • పాతకు లిట్లని పెద్దఁ బొందుచే?

ఉ॥ అన్నుల మిన్న! యెల్లరము • నక్కటికంబు విసుమంత పెంపునన్
బన్నము నొంద జేయు బలు • పాపులఁ గూల్పక మానరే మిముల్
మన్ననఁ గాచికొంచు నృప • మాన్యుని ముందటి కేగ నాత డున్
గ్రన్నన వింటితోఁ దన పు • రమ్మునకున్ మరలం దలంచునే?

క॥ భరియింపరాని వెతలం, బరితాపము నొందనీక • ప్రాభవమును మా
కిరవుగ నొసఁగిన నృపతికి, మరల న్నినొన్న నఁగకున్న • మహితులమె కదా!

చ॥ వ్రతులగు మౌనివర్యులను • వ్రచ్చి భుజించెదు దైత్యపాళి శో
ణిత పలలాంత్రరాసుల గు • ణించి పిశాచ సృగాల గృధ్ర సం

తరులు గ్రసింపఁ బంపరి ప్ర • థా విలుపూని యయోధ్య కేగనన్
ప్రతిన యొనర్చు వానికొక • పాటియె యాపని ? రాజనందినీ!

క॥ అడఁగని పగవారి చెలుం, బడు విను గైకొనక వదలి • మరలితి మేనిన్
బడులును పెద్దలు పిన్నలు, సడలి హసింపరొకొ? తల్లి! యదియొక బ్రతుకే?

క॥ క్రొత్తదియగు గృహిమణి దో, స్మృత్తులు వాఁడుటడు మున్నె • నాశిలె నంచుం
జిత్తము మవిమది మరలిన, యుత్తమ విక్రమ మదెంత • యొప్పారునొకో?

క॥ చెడిలిం జెడిలి ననుష్ఠలం, బెడఁదాసితి వేని నిశిత • విశిఖమ్ములచేఁ
దొడిఁబడ సకల జగమ్ములఁ, బొడిపొడి సేసినను కొదిమె • వోవునె తల్లీ?

క॥ మునుపే ముజ్జగములఁ గల, దనుజాంఁ బరిపూర్తు ననుచుఁ • దలపడు నతఁడో
జనకజ! నీస్థితి యెటిఁగిన, వెనుకను నెమ్మది వహించి • వీఁగునె? తల్లీ!

క॥ ఊరక రాని యమర్షము, క్రూరుల జీవములమాత్ర • గొని శాంతిలుచో
వేరేది దాని శాహంతి?, ధారుణియుం దివియుఁ గ్రుంగి • తాటి సమయదే?

క॥ లయకాల వహ్నివోలెన్, రయమున భువనముల సాగ • రముల నివుఖు చే
సియె వీడుఁగాక యడఁగునె? నియమిత రామాస్త్ర వితతి • నీస్థితి విన్నన్.

క॥ దేవారాతులఁ ద్రుంచెను, కావలముల మాన్చె సుజన • గణములఁ గాచెన్
ధీవరుల కొసఁగె సద్గతి, శ్రీవరలక్ష్మి యను కీర్తి • చెలఁగఁ దలఁపవో?

ఉ॥ నీవలనన్ జగంబులు వి • నిశ్చల వృద్ధి భజించునమ్మ! శో
కావలినే గ్రహించి శ్రమ • లంది యొకించుక కాల మిట్టులే
త్రోవుము లోక మంగళము • తూకొని చేసెడు వారె పెక్కులౌ
హాఎడు రొందువారు భువి • హాయికి నోర్చుల భావ్యమే కదా!

తే॥ రోయఁదగు లోక కంటక • రుధిర పూర, మునను ప్రేతభూతాదుల • మునిఁగి క్రీడ
సేయ దాఁగిన సురలు హ • ర్షించి పొంగు, సత్కృతిని నీవు చూడంగఁ • జాలవేమి?

మ॥ ప్రళయాంభోద తటిన్మహోరుముల ని • ర్ఘాతంబులం బోలె రా
మ లసద్భీకర బాణరాజి దనుజ • క్ష్మాపాల సైన్యంబులన్
దొలువం గాతెడు నస్రపూరము పయో • ధు ల్నిండి ఘోషింప వీ
నుల విందావఁగ నుత్సహింపుము విన • న్గ్రాన్మాళ్ళలోఁ దల్లిరో!

చ॥ కిరువులు జాఖు నట్లసుర • కాంతులు కడ్పుల మోఁదికొంచు వం
దురుచును దుఃఖబాష్పములఁ • దోఁగుచుఁ ద్రెంచిన తాలికూటువల్
గిరులయి మింటి నంటి వడి • ఖేచర లోకవిమానముల్ చనన్
దెరువున కడ్డమై నిలువఁ • దేఁకువఁ జూడఁగ నుత్సహింపుమా.

తే॥ నింగి కానఁబడక కప్పి • నిండు భూత, ములును కంకగృధ్రము లస్ర • జలధి మునిఁగి
దైత్యవనితల బాష్ప న • దంబులందు, స్నానమాడుట గాంచ ను • త్సాహముంచు

ఉ॥ వీణల మించి గాత్రములు • వెల్వడ మర్దళముల్ ధ్వనింపఁగా
జాణలు వేల్పు సానులు ప • సందుగ నాట్యము సేయు చోటులన్
బ్రీణన ముల్లసిల్లఁ గపి • వీరులు వీరరవంబు సేయుచుఀ
గ్రేణిగ మోదనృత్యమున • రేఁగుటఁ జూడఁగ నుత్సహింపుమా

చ॥ కొడిమలు మీఁట నైచ్యములు • గూరిన క్రూరుల మేలు ప్రీలఁగా
వెడలెడు రక్తవాహినులు • వే కొని పోయెడు కొండలట్టి పె
న్పడుగుల కుప్పతిప్పలు సు • పర్వులు వెక్కసమంది చూడఁగాఁ
గడలిని నిండి పొర్లుటను • కాంచఁగ నీమది నుత్సహింపుమా.

సీ॥ అవనిజా వహ్ని రామ శ • రానిలమున, నల త్రికూటమన్ కుంపటి • యందు పెరిఁగి
క్రూర దానవు లనెడి బొ • గ్గులను కాల్చ, లంకయను పైడి కరఁగుట • లక్ష్మిఁ గనుమ
సీ॥ భువన కంటకుఁడగు దశ • ముఖుని తలలు, ప్రాలి పుణ్యఫలముఁ బోలి • పావన మగు
నీ శరీరంబుఁ గాంచిన • నేత్రపంక్తి, నొలిచి కాకులు దినఁ జూడ • నుత్సహింపు.

చ॥ మును సురవైరి కోడి బిడె • ముంగొని మాఱుమొగంబుగొన్న ది
గ్ఘన గజ వాల సన్నిధి ది • గాలు మనంబడ రాఘవాంక మా
ర్గణములు పంక్తి కంఠుని శి • రంబులఁ ద్రెంచి తొలంగఁద్రోవఁగా
గుణవతివైన యోజననిఁ • కోరికఁ గాంచఁగ నుత్సహింపుమా

ఉ॥ ఖంబు చెమర్చెనేమొ యని • గాదిలి నష్టపు దల్ల పీచు శ్వే
తాంబరముం బలెన్ వెలయు • నట్టి ధ్వజావళి యొప్పు లంకలో
నంబుల వర్షముం గురియ • నల్లరి సేయుచు లేచు భూతముల్
పంబిన ధూళిలో వికృత • భంగుల నాడుట గాంచు మమ్మరో ।

ఉ॥ నల్లని రేయి ద్రిమ్మరుల • నల్లల వెల్లువలెల్ల వార్ధి జొ
బ్బిల్లి తలంబులేమి నటు • వెన్కకు మళ్ళుటయున్ సమస్తముఀ
ద్రెళ్ళ యుగాంత వేళలను • తృప్తి వహింపని మృత్యు మూర్తియున్
గొల్లగ మెక్కి త్రిక్కుటయుఁ • గూరిమిఁ గాంచెదు గాక తల్లిరో ।

ఉ॥ వేలుపు బోట్ల వంటి యలి • వేణులతో నెసరాళి క్రీడలం
దేలు సుగంధ కల్పవన • దీర్ఘికలన్ గపిమూఁక వక్ర లాం
గూలము లొండొకళ్ళ వడిఁ • గూరిచికొంచు వినోద లీలలం
బోల మునుంగు చుండుటలు • పోఁడిమిఁ గాంచెదు గాక తల్లిరో ।

ఉ॥ పెక్కులు పల్కనేల ? రఘు • వీరుని దివ్య శరాళి లంకలో
నెక్కొను దైత్య కాయముల • నిల్వక యవ్వల దుస్సి పోఁకు లె
వ్వెక్కడ నుందు రయ్యచటి • కేపున నేగఁ ద్రిలోక వాసులా
రక్కసి మూఁకలెల్ల సమ • రంబునఁ గూలుటఁ గాంతు వమ్మరో ।

చ॥ ఒకనెల తీఱు లోపల నె • యుష్మలీకంబు రపంతయేని పొం
దక సుఖియింతు పమ్మ త్వరి • తంబున నేఁ జని రాముఁ గాంచుచే
యొక తడ వంత మీఁద నిట • కొందఁగ రాఁ దరితీపు గల్గునే?
యొకి క్షణమేని భారమణుఁ • దొప్పరికించునె యింకఁ దల్లిరో!

తే॥ ప్రాణ మున్నదని వచింపు • నంతెకాని, తన శరీరము తాఁకి మాఁ • డని సుమములు
చివురులును లేవు వేలాలు • చెదరకుండు, తరువులును లేవు పల్లలం • తకును లేవు.

తే॥ తెలివి తేటలుండినఁ గదా • తిపురుపంత, మొగులు పిడుగులతోడఁ బై • దిగులుచున్నఁ
నైదుతలల సర్పము బొమ్మ • నంటి కఱచు, చున్న నెఱుక గల్గదు రాఘ • వోర్విపతికి.

తే॥ చిలుకఁబడు దధికై వడిఁ • గలఁత నొంది, యెదను లదఁబడు ప్రాణంబు • లింద్రియములు
గందనగు పైత్యమును వియో • గంపు వంత, యెంత కలదో లెక్కఁగ వచి • యింపనగునె

తే॥ ఇట్టి శోచనీయస్థితి • నెనయు రాముఁ, డుండె సుఖముగ నను మాట • యొప్పుకాదు
పలుకునపి యెల్లఁ గరితలా • మలకముగను, చూపెదను చూచెదవు గాక • సుగుణచరిత!

శా॥ తల్లీ! నిర్మలుఁడైన దాశరథి యు • ద్దండుండు సుగ్రీవు డున్
డెల్లం బారఁగ నీదువార్త విని శ్రీ • ప్తిం జెందు మున్నె కపుల్
ప్రోల్లాసంబున వార్ధిదాఁటి నగరం • బుం జుట్టి హుంకారముల్
మొల్లం బొప్పఁ నొనర్చుచుంట విని స • మ్మోదింతు నిక్కంబుగన్

శా॥ దేవీ! లెక్కడరాని వానరులు ప్రో • ద్దీప్తిన్ దగన్ రేపె లం
కావాటిన్ వడిఁజేర మధ్యమున నా • కారంబునం దార్ఢ్యపై
శ్రీవిష్ణుంబలె నా భుజంబులపయిం • జెన్నారు రామప్రభున్
సేవింపారఁగఁ గాంతుగాక కను లు • న్మేష స్థితిం జెందఁగన్.

ఉ॥ అంగదు మూఁపుమీఁద నుచ • యాద్రిపయిం గనుపట్టు బాల భా
నుం గనులీల లక్ష్మణుఁ గ • నుంగొని మోదము నొందెదమ్మ! పో
రుం గొన వాన రేంద్ర నికు • రుంబము నాయితమై చెలఁగు నీ
యంగదయుం దొలంగు నరి • యూటయు నీఁగు వియోగముం జెడున్.

ఉ॥ ఈమెయి నీవు పల్కఁ గడు • విచ్చిన మాసములోనె వచ్చి శ్రీ
రాముఁడు నీ చెఱన్ విడుగ • రం బొనరింపఁడయేని నిందచే
రాముఁడె రావణుండగును • రావణుఁడున్ మఱి రాముఁడే యగున్
శ్రీ మహిళామతల్లి! కొద • చెందెదవేల? వహింపు నెమ్మదిన్.

తే॥ తొదరి మోదకరిములు ని • రుష్టములును, పౌరుషోచితములు నగు • పలుకు లాంజ
నేయుదాఁడఁగ నుప్పొంగి • నెమ్మది గొని, యుర్వితనయ యిట్లని పల్కె • నుత్సుకతమ

## సీత యాన వాళ్ళ తెలుపుట

శా॥ అయ్యా! యేగెదుగాక వైళముగ శ్రే • యః పాళి నిన్నొందుఁ గా
కయ్యె విఘ్నములం దరించెదవుగా • కార్యందు శ్రీరాముతో
నెయ్యం బారఁగ నానవాళ్ళదరు వా • నిం బ్రీతి వాక్రుమ్ము మా
యియ్యాఁకం దొలఁగించు భారమది నీ • దే కాదె ప్రాభంజనీ!

ఉ॥ ముందటఁ జిత్రకూటమున • ముక్కఁడి కాకము వాఁడి ముక్కుతో
డం దగ నాయురమ్మునఁ గ • డంగి పుటుక్కునఁ గాటుసేయ నేఁ
గుందఁగఁ జూచి నెత్రుగని • కూర్మివిభుం డొకపూరిఁ గొంచుఁ బ్రేఁ
పొందఁగ బ్రహ్మ మంత్రమున • నుగ్రత నేయుడుఁ గాకి భీతిమై.

చ॥ కొదుకుచు సత్యలోకమున • కుం జని ధాతయు రొప్పి త్రోలనా
ప్రదరము వెంటనంట వడిఁ • బాఱుచు శంభుని దాసి యాతఁడుం
బదరఁగ మళ్ళి దిక్పతుల • వల్లను రక్షణమొందలేక యె
య్యదియును దోఁప కేద్చు నెద • నాత్మల వేల్పులు పిచ్చలించుచున్.

ఉ॥ ఇంద్రసుతా! జయంత యిటు • లేల చరించితి నీతిమాలి ని
న్నింద్రుఁడె కాఁడు సర్వభువ • నేంద్రులు చేరియుఁ గావనేర్తురే!
రుంద్ర యశస్వి శ్రీరఘువ • రున్ శరణంబని చేరు మా దయా
సాంద్రుఁడె కాచు నిన్ను రభ • సంబునఁ బొమ్మని పల్కెనాతఁడున్.

చ॥ భయమునఁ బాఱివచ్చి రఘు • వర్య! భవత్పద పంకజంబులే
దయఁగల వంచు నే నభయ • దానము వేఁడితి నన్ను సత్కృపా
శ్రయుఁడు క్షమించి వానిదగు • చక్షు వొకందు గ్రహించి యస్త్రమా
పయి నుపసంహరించుటలు • పావని! నాధునకున్ వచింపుమా.

తే॥ నీ చరణములే శరణముల్ • నిఖిలనాథ!, యనఁగ దొసఁగు మన్నించితి • నవనియందు
కాకి రెండుకన్నుల కొక్క • కంటిపాప, యుండు నీవల్ల ననుటయు • నొగి వచింపు.

తే॥ మ్రొక్కి సెలవంది కాకంబు • పోయె దివికి, సురలు పువ్వుల వానలు • కురిసినారు
దీని సౌమిత్రి సుంతయుఁ • దెలియఁడయ్య, యింపు పలుకులతో వచి • యింపు మిదియు.

ఉ॥ ప్రేముడిఁ బెంచు నాచిలుక • పిల్లకు నెవ్వరిపేరు పెట్టుదున్
శ్రీ మహితా! యన న్మగులఁ • జిర్నగవార మదీయమాత స
త్ప్రేమ మయాత్మయౌ కయిక • పేరిడుమా యని నాఁడు పల్కె నా
యామెత గూర్చు వాక్యముల • యాదరమున్ వినిపింపు మారుతీ!

ఉ॥ ఇన్నియుఁ బల్కుమీఁద వచి • యింపఁగఁ దగ్గది యొందు లేద యం
చెన్ని ధరించు వస్త్రమున • నింపుగఁ గట్టిన మానికంబు పై

నున్న జగంబు క్రింది జగ • మొప్పఁగఁ గల్గిన కాంతి సంతతిన్
గ్రన్న జయించు దాని నటఁ • గైకొనె మారుతియున్ భ్రమింపఁగన్.

తే॥ హనుమ యచ్చెరు పాటొంది • యరయ సాగె. సప్తలోకంబుల తమంబు • సమసిపోయె
రవియు భయపడ కీ నగ • రంబు చేరె. నేమి? యని దైత్యులును శంక • నెనసినారు.

ఉ॥ శోకము నొందు జక్కవయు • స్రుక్కుట పీడె ముడింగియున్న ప
ద్మాకరమందు పంకజము • లన్ని యెలర్చెను సూర్య కాంతముల్
తూకొని నిప్పు లుమ్మెనని • దుఃఖముతో ముకుళించెఁ గల్వలున్
వే కనుపట్టె సయ్యెడ ర • విప్రభఁ దోఁచెదు చిన్నె లన్నియున్.

చ॥ మృదువగు కేశపాశమను • మేఘముపై గ్రహరాజుఁబోలి య
మ్మదిర మనోజ్ఞ సంహసన • ముంబలె రాగమునొంది రాగ సం
పదగల రామపాదముల • బాగున వెల్గు శిరోమణిం గుణా
స్పదయగు సీత చూపెఁ గనె • వాయుసుతుండు ప్రమోదమందుచున్.

చ॥ వెదకుచు వచ్చి జీవముల • విండగ నిచ్చిన పుణ్యమూర్తి। నా
కిది యొక కంటిపాప పలె • నింబుగ నుండుఁ జిరంబు పల్వలో
విదులక చుట్టియుంచితి న • భిజ్ఞగఁ గైకొను మంచు సత్యవా
క్ప్రదయగు సీతయిచ్చెఁ గడు • భక్తిని గాదుపు పట్టి చేకొనెన్.

ఉ॥ కైకొని వస్త్రమందు దుసి • క్రమ్మక యుండఁగ ముడ్చి వీడికోల్
కైకొని మ్రొక్కి ముమ్మఱు వ • లంగొని చాఁగిలి లేచి దీవనల్
కైకొని ధీరవాక్యములు • క్రమ్మఱఁ బల్కి మఱిన్ మఱిన్ నుతుల్
కైకొని యుబ్బి గంతులిడి • గంధవహాత్మజుఁ డట్లు క్రమ్మఱెన్.

## 7. వనభంగ పటలము. (60).

చ॥ వనమును గూర్చి యుత్తరపు • వైపునకుం జననెంచి దొడ్డ రూ
పును ధరియించినట్టి కపి • ముఖ్యుఁడు స్వల్పకృతిం బొనర్చి యేఁ
జనుట వివేకలక్షణమె? చయ్యన నచ్చటికేగి రాఘవుం
డును ముదలించు వాని కొకఁ • డున్ సరి పల్కమి దూత లక్షమే?

ఉ॥ వీపునఁ గాలుసేతులనె • యెల్లర నీచులఁ ద్రొక్కి చంపి లం
కాపురి వార్ధి నూఁకి జన • క ప్రభు పుత్త్రిని గొంచు రాఘవ
శ్రీ పదపద్మ సన్నిధిని • చేర్చనయేని తలంప నెవ్విధిన్
లోపములేని యుత్తమ గు • ణుండగు దూతుఁడ నౌదు నిద్ధరన్.

ఉ॥ వంచకుఁడైన రావణుని • వాలముచే దశ మస్తకంబులున్
మించిన చేతు లిర్వదియు • మిడక్కఁగ నుక్కఁగఁ గటి కారలో

నుంచిన వాడఁగాను గడు • నుద్ధతిఁ దాఁకి జయింపలేదు మా
ప్రాంచిత రామ భానుజ ప • రస్పరమైత్రి ఫలించు పెట్లగుఁగా॥

చ॥ బలయుతమైన యీ యసుర • వర్గముఁ గాడ్పడఁజేసి కూల్చి దో
ర్బలు దశకంఠుఁ బట్టికొని • క్రచ్చుగ మోఁది యతండు కన్నులం
బులుకునఁ జూచుచుండ మయ • పుత్త్రి శిరోజములం గదించి వె
ల్వెలఁగొన నీడ్చి తెచ్చి చెఱ • వేయుట దోసముఁ గూర్చు కార్యమే॥

ఉ॥ వీరల హింస చేసి పృథి • వీభరముఁగా రఘువీరు భారముఁగా
దీఱ సడల్చి దూతకృతి • తీరుగఁ బూర్తి యొనర్చుటే తగం
గారియ మంచు భావమున • గట్టి యొనర్చి దితి ప్రజాతతిన్
బోరొనరింప రేఁపు విధ • ముం దలపోసె మనంబు లోపలన్.

తే॥ కడఁగి యిప్పుడే యివ్వనిం • గాడుపఱుతుఁ, బఱుచు పెనుదొని చెవిఁబడఁ • బలల భుజాలు
కోపులై యెదిరింపంగఁ గూల్చువాఁడ, విదియ తగిన యుక్తి యనుచు • నెంచె మదిని.

చ॥ పొదివిన దైత్యులన్ మరలి • పోవఁగ నీయక కూల్తుఁ గూలి రే
నెదురఁగ రావణాసురుఁడు • నేపున దుస్సహ సైన్య యుక్తుఁడై
కదలును వచ్చెనేని కడు • కావరముం జెడ మస్తకంబులన్
జిదురలు చేసి నాకసి న • శింపఁగ నెమ్మదినంది మశ్చెదన్,

చ॥ అని తలపోసి రేవగలి • కాధ్యులు త్రిమ్మరు మేరుశైలమున్
జెనయు భుజాగ్రఖండు మును • చెన్నుగఁ గొమ్మన భూమినెత్తు నా
ఘనకిటిఁ బోలి దొడ్డ యడ • గైకొని వేలకువేలు కావలిన్
గనిన యశోకికా వని న • గంబులఁ గాళ్ళఁ ద్రొక్కె ద్రెంచఁగన్.

తే॥ విఱిగెఁ జీలెను వ్రాలెను • పెల్లగిల్లె, నడఁగెఁ బొడియయ్యె మడఁగెఁ బె • ల్లవిసె నెగసెఁ
జెదరె మందెను మాడెను • ప్రిదిలెఁ బ్రేలె, బొగ్గులగుచు ఛిన్నాభిన్న • ములగ రాలె.

తే॥ కొన్ని వేళ్ళతో లేచెను • కొన్ని కాలెఁ, గొన్ని మొగుళులలోఁ జేరెఁ • గొన్నిచీలె
కొన్ని మున్నీటఁబడిపోయెఁ • గొన్ని తేలెఁ, గొన్ని దేవలోకముఁదాఁకెఁ • గొన్ని తూలె.

తే॥ చుట్టి విసరిన మబ్బుల • సుడిసి కొన్ని, దిక్కరుల కాకు మేఁతగా • దిగువ వ్రాలె
నడుగు పట్టి వీచిన కొన్ని • యాకసంబు, దాఁటి యింద్రు నందనము ను • త్రమ్మ చేసె.

తే॥ వాలి యలలచే జలధి క • ల్లోల మయ్యె, దైత్యుల విశాల సౌధముల్ • ధరణిఁ గూలెఁ
గులగిరులు తుమురయ్యెను • కుసుమచయము, పట్టు దప్పి రిక్కలతో డఁ • బడి యడంగె.

చ॥ పొడవగు వేళ్ళతో నడరు • భూజములన్ వడిఁ బెల్లగించి త్రొ
క్కుడుపడి లోకముల్ ప్రిదుల • గోఁటున వైచిన కొన్ని దిక్కరుల్
పిడులకు నందియీయఁ దమ • బెట్టిదమౌ రదనాంతరంబునన్
బెదఁకుచు వ్రేలు తుండముల • వీఁక ధరించిన రీతి భాసిలెన్.

ఉ॥ క్రూరుని పంక్తికంధరుని • కోపుల వృక్ష వనంబులోనివా
సౌరభ పుష్పసంచయము • లక్కుల పర్వతమందు దేవతా
వారములుండు స్వర్గమునఁ • బద్మదళాక్షులు మూఁగి వచ్చి యిం
పారఁగ నొప్పునుండఁ గదు • మాఱిరి యొండొరు మించి వేడుకన్.

తే॥ కనక రత్నమయంబులై • క్రాలు తరులు, బిక్కటపు మించులం బోలెఁ • దిరుగుచుండెఁ
గొన్ని సూర్యకాంతులఁ బోలెఁ • గొన్ని నడుమఁ, దాఁకిరాలు రిక్కలవలె • ధరణిఁ గూలె

తే॥ పక్షులును జంటి యీఁగలు • భ్రమరములును, మొగ్గలుఁ జివుళ్లుఁ దేనెయుఁ • బూలుపండ్లు
కదలిఁబడ మీఁదఁ గ్రుంగుచు • మిడిసియాడెఁ, బచ్చి చెట్లంతలోఁ బడఁ • బచ్చడయ్యె.

క॥ చెదరిన పూవులఁ దాలిచి, లసపుల గంధంబు పీచి • జలధులు వేల్పుల్
సుదతులతోఁ గ్రీడించు ప్ర, మదావన సరోవరముల • మాడికి నొప్పెన్.

మ॥ హనుమంతుండు పెకల్చి వైచు మణిహే • మాంచత్ప్రభా వేదులన్
ఘన ధూళి వ్రజముం బొవచ్చు పెనుపె • క్కంజొచ్చి నిండారుటన్
జనముల్ దాఁటియె పోవఁగాఁదగు వనం • జాల్పం బ్రమవ్వేళఁ గా
లి నడన్ దాఁటఁగఁ దగ్గదయ్యె వనఁ జా • లెన్ జూక్కి కబ్రంబుగన్.

తే॥ గ్రీష్మ భానుని పోలి య • గ్రిమమరీచు, లడర మింటి కెగసి యుర • వడిని మరలు
తరులవలస దానవుల సౌ • ధములు తుమురు, లయ్యె నశనిచేఁ గుధరంబు • లవియునట్లు.

తే॥ హనుమ పెకలించి వైచిన • యగచయంబు, క్రిక్కిఱిసి మబ్బువలెఁ బోఁవ • గినుకచేత
రావణుని వనమెల్ల స్వ • ర్గంబుచేరఁ, బంపు క్రియదోఁచె నప్పటి • యతని చెయిది

ఉ॥ తేనియ తుంపురుల్ చెదర • దిక్కఱి పక్షులు రంపు సేయఁగా
సూనచయంబు నిండుకొన • శోభిలు రత్నమయావనీజముల్
మానుగ మింటఁ గ్రిక్కిఱిసి • మంజుల కాంతులు కత్తులట్లు సిం
గాణులరీతిఁ గ్రాలి పడి • గాఁ జనె మేటి విమాన పంక్తినాన్.

ఉ॥ వారఁత రాజముం జెనయు • వాయుకుమారుఁడు చుట్టివైచు భూ
మీరుహముల్ సుడింబడుచు • మింటను నిల్వక క్రమ్మఱిల్లి పెన్
వారిధి వ్రాలుచుండుటలు • వ క్రిలి తో యదముల్ పయోధిలో
నీరము నానఁగా దొడఁగి • వింధుగ వ్రాలిన లీలఁ గన్పడెన్.

ఉ॥ పాపముచేసి మధ్యమ భు • వంబున జన్మముఁ గాంచి జ్ఞానులై
తాపములన్ జయించి విను • తంబగు ముక్తిని పొందు వారి య
ట్లేపున నూడ్చి పైకెగుర • నేసిన కల్పకజాల మద్దు స్వ
ర్గోపరి భాగమేఁగి మఱి • యొందెను మున్నటి స్వస్థలంబులన్.

తే॥ గుఱిగ మణికుట్టిమంబులఁ • గూలఁదన్ని, చదిపి చవికలు దీర్ఘికల్ • చదును చేసి
కుడ్యములను క్రీడాద్రులఁ • గుదియ ద్రొక్కి, చేయ దుస్సాధములనెల్లఁ • జేసివైచె

తే॥ సాల సర్జకాదులఁ ద్రోచి • పూలతోడఁ, జంపక శ్రేణి గెంఁకి వ • జ్జను గలట్టి
చూత సాలంబు లూడ్చియ • చ్చోటఁ జెలఁగు. ఫలతరూత్కరం బెల్లను • పాడుచేసె

ఉ॥ కంతు వసంతు మోముల వి • కాసము లెల్లఁ గృశింప నా హనూ
మంతుని పాదముల్ దగుల • మంజుల పుష్పవనంబు తారు మా
ఱెంతయు నొందఁ జందన మ • హీజము లింధన భంగిఁ గాల న
య్యంతర భాగమెల్లఁ బొగ • యై నివుఱై కనెఁ గాడు పోలికన్.

క॥ రొద సేయుచు భ్రమరంబులు, చెదరఁగ భూజములు గలసెఁ జేద్వడి మంటన్
మదవతుల నృత్యశాలలు, కదిసిన విరి లతలతోడఁ • గాలెఁ బదడుగాన్.

చ॥ తలరెడు పూలకొమ్మలు ల • తావితతుల్ పికముల్ రహించు క్రొం
దలిరులు గల్గు మావులును • తావులఁ జిమ్మచు నల్లిబిల్లిగా
నలమిన తీఁగలం జెలఁగి • యందము చింద నమర్చు ద్వారముల్
పులుగులతోడ గుల్మముల • పుంజములున్ జెడె నుగ్గు నూచమై

ఉ॥ వైచు ప్రవాళ వల్లరులు • వారిద పంక్తిని మించు లట్లు చు
ట్టేచిన కొండలంబడి ర • హించె మహీధ్రము వంటి యేనుఁగుల్
మోచిన మోము పట్టములఁ • బోలి హిరణ్మయ చూత శాఖికల్
వే చని యందు దంతులకు • వేడుక యోగిరమయ్యె నయ్యెడన్.

తే॥ పిట్ట లఱచు శబ్దంబులు • వృక్ష చయము, విఱుగు సవ్వడి మారుతి • పెలుచఁజేయు
సింహనాదంబు పెనురొద • సిం దరించి, యండగోళంబులం దాఁటి • యవలికేగె.

క॥ కూలెను పాటల కుజములు, వ్రీలెను వర గోఁగులును ద్వి • రేఫ రవంబుల్
మాలెను విహగ రుతంబులు, గ్రాలెను రోచనముగాఁగఁ • గడలిం బడుచున్.

క॥ అడఁగెం బొదవగుమేడలు, మడఁగెం బందిళ్ళు లతలు • మఱి వృక్షంబుల్
పడియెం గావేరీనదిఁ, జెడియెం గంగాజలంబు • చేరఁగఁ దేఁకుల్.

క॥ అందము చిందెడు కొలఁకులు, చందనముం గలిపినట్లు • చెడెఁ బంకముగాఁ
బెందరువులు కూలిన యా, సుందర మొక పూలతోట • చందంబయ్యెన్

ఉత్సా. సిందువార వారమేగి • చెదరి చేరె వారిధిఁ
చందనములు త్రివ్వమంచు జరగ • దైత్య సౌధముల్
పొందు మేల్కవాటములను • పొడిచి విఱిచె నుగ్గుగా
నందు రక్కసీంద్రు జడిసి • యఱచి పఱచి యేడ్వఁగన్.

ఉ॥ ఆకసమందు మించి వెలుఁ • గారెడు రిక్కలఁ బోలి నందన
ప్రాకట వృక్ష పుష్పములు • పైఁబఱపై విఁసిల్లెఁ దింత్రిణుల్
వ్రేకనఁ జుట్టి చుట్టి కద • లిం దిగబాఁదఁగ శంఖ కీటముల్
వ్యాకులమంది ముత్తెముల • నయ్యెడ రాల్చుచుఁ బాఱె భీతిమై

తే॥ ఆకసమునకు పీచిన • యందమైన, కొమ్మలం గల్గు మణిమయ • ధ్వజము లచటఁ
దివిరి దైత్య వినాశ దు • ర్దిన నిమిత్త. మైన యింద్రధనువు వోలెఁ • గానఁ బడియె

మ॥ చతురంభోధులలోఁ బడన్ వినరు నా • చాంపేయ ఘర్మి తితుల్
చితుకం బాయుచు రాలుచుండుటలు పీ • షింపన్ దిగం జొచ్చుచున్
సిత జీమూత వితానముల్ జలములన్ • సేవించు వారాశి నా
తతరీతిం బ్రసరించు భాసురతర సం • తానంబునా భాసిలెన్.

తే॥ ప్రాఁకులం బ్రిప్పివైపఁ బు • రంబునందు. లాయములు రథశాల లా • లాన శాల
లాటపట్టులు పానశా • లాదికములు. నేలమట్టంబులై పేరు • మాలిపోలె

తే॥ ప్రాఁకులను కొండలను తారు • మారుఁగాగ, వైచుటంజేసి బంగారు • ప్రహరులెల్ల
జీలిపడ మేడలగ్గిచేఁ • బిటిలి పెటిలి. యతల కుతలమై పురమెల్ల • నదలు గుడిచె.

చ॥ అపనిజకై వగం బొగుల • నట్లుడికించితి విష్టు నారు శా
త్రవులగు వారు సవ్వఁ బ్రమ • దావన నాశము సేయుచుండ గా
రవమునఁ గాంచు చుంటివని • క్రాఁగి చిరాకు గడించునంచు దా
నవపతి కిర్కి దాఁకొనెన • నన్ హరిణాంకుఁడు డాఁగెఁ బైదెసన్.

చ॥ కనకము రత్నరాజి రవి • కాంతములున్ శశికాంతముల్ మణుల్
మునుకొని పెల్లు ప్రాఁకులుగఁ • బొల్చిన యావన వృక్ష సంతతుల్
హనుమఁడు పెల్లగించి కకు • బంతరదేశములం బడంగ వై
చిన కలసన్ జగంబు విల • సిల్లెను పట్ట పగంటి చాడ్పునన్.

చ॥ మెకములు భీతిమైఁ జెదరి • మిక్కిలి భ్రాంతి వహించి యార్చుచున్
గకవిక చెంది ప్రాలె నెఱ • కల్ గల పక్షులు కొన్ని పాఱెఁ గొ
న్ని కదలిఁ జెట్లతో నడఁగె • నిచ్చలు పాటిన వెల్లఁ గొంత మే
రకుఁ జని తత్తఱిల్లి ధర • వ్రాలెను పక్షములన్ విదుర్చుచున్.

ఉ॥ పువ్వులతోడ భాసిలిన • భూజములన్ హనుమంతుఁ డుగ్రుఁడై
ఱివ్వున వీవ నత్తరుల • వ్రేలెడు గూఁడులతో విహంగముల్
త్రెవ్వక కొన్ని చేరినవి • దివ్యపదంబు నతం డనుగ్రహం
బువ్వున నూనెనేని మఱి • యున్ దగనెట్టి ఫలంబు గూర్చునో!

తే॥ రాక్షసులు కాచుచున్న యా • రామమందు, శ్రమలనొంది తపించు భూ • జాతయున్న
వృక్షమొండు మాత్రము నిల్చె • విలయవేళ, విష్ణుఁడు పరుండు వట వృక్ష • విధము దోఁప.

ఉ॥ మిక్కిలి కాంతిగల్గు నొక • మేటి శిరోమణి భూమిజాత తా
నిక్కడ నాసవాలుగఁ బ్రి • యేశున కొందఁగ నిచ్చి పంచె నిం
కొక్కటియేని భూషణము • నొందద యంచుఁ దలంచి సాగరుం
డక్కటికంబుతోఁ బవిచె • నన్నవిధంబునఁ దోఁచె భానుఁడున్

చ॥ ననిచిన యవ్వనం బటులు • నాశముచేసి మరుత్సుతుండు పొ
ల్పున విలసిల్లె నొక్కఁడయిఁ • బోఁడిగ లోకములెల్ల గొల్చి ని
ల్చిన జగదీశు పోలికను • క్షీర మహోదధి మధ్యనొప్పు మం
ధర నగముం బలెం బ్రళయ • దాహ రుషానల నేత్రు కైవడిన్.

శా॥ ఈలీలన్ వనమెల్లఁ గూల్చి హనుమం • దేపారు నవ్వేళ దై
త్యాలోలాక్షులు లేచి హా యనుచు న • త్యంతంబుగా నుల్లముల్
వ్రీలన్ మేరువువోలె నిల్చి నతనిన్ • వీక్షించి వీఁడెవ్వఁడే?
బేలా! కాంచితి వేమె? యన్నఁ గని పృ • థ్వీజాత దానిట్లనున్.

చ॥ కొడిమెలు సేయు రక్కసులు • కూడని మాయలు చేయుచుండ నా
చెడుగరులే యెఱుంగ మఱి • చెప్ప సమర్థులు గాక యన్యులున్
నుడువ సమర్థులే? మనుపు • నూల్కొని దైత్యుఁడు జింకయై కసం
బడ వలదంచు లక్ష్మణుఁడు • పల్కిన సత్యమ యంచుఁ గోరితిన్.

చ॥ అని జనకాత్మజాత పలు • కాడఁగ ఱొమ్ములు మోఁదికొంచు న
వ్వనితలు నేలయుం జదలు • వారిధులున్ వడఁకొందఁ బాఱఁగా
హనుమయుఁ జెంత స్వర్ణమయ • మై పొలుపారెడు హోమ మండపం
బును గని దీనిఁ గూల్తునని • పూనికఁ జేతులు సాఁచి పట్టుచున్

సీ॥ కనులఁ జూడను గాదు • కాలువెట్టనుగాదు, స్తంభముల్ లెక్కింపఁ • వశముగాదు
విసులందు జీఁకటుల్ • నెఱయవు ధరణియుఁ, గడఁగి మోయుటయన్న • గాని యయి
యాకాశమంటు హే • మాద్రియు సిగ్గిలి, మవినొచ్చి పుండగు • మాడ్కి బెరిఁగి
క్రమముగా వర్ధిల్లి • కళల సంపాదించి, దుర్గంబుఁబోలు కాం • తులను కురియు

తే॥ శీతకరుఁ దాఁకు కందను • చీఁకటులను, వారి కనునట్లు వింశతి • బాహునాజ్ఞ
బ్రహ్మదేవుండె స్వయముగా • బంగరు గొని, మానుగాఁ గట్టినట్టిదా • మండపంబు.

సీ॥ స్తంభంబులెల్ల ర • త్నమయంబులగుఁ జుట్టు, ప్రక్కలు మొత్తమ్మ • స్వర్ణతార
మయములు వెనుక సం • ప్రధిత మహోపల, మయములు రవికిని • మండనములు
దశకంధరుఁడు మున్ను • తారాద్రి నెత్తుట, విన్న మారుతి యది • వెలితి పఱుప
మేరువునే తోఁడి • మీఁదికెత్తిన యట్లు, దీర్ఘ బాహులతోడఁ • దివికి మెత్తి

తే॥ లంకపై వైచె మేడలు • క్రుంకె నిప్పు, మిణుఁగురులు లేచి కొన్నింటి • నదరి కాల్చెఁ
బూఁడి ప్రగ్గిరి కొందఱు • పొలసుదిండ్లు, చెడుగరులకు వచ్చెడునవి • చెడుగులేకద!

సీ॥ అయ్యశోక వనంబు • నరసి కాపాడెడు, షడృతుదైవతములు • సాశ్రుపూర్ణ
ముఖపద్మముల వస్త్ర • ములతోఁ దుడిచికొంచు, దుఃఖాగ్ని మనసులఁ • ద్రొక్కి కాల్ప
వ్రీలి నెత్తురుకాఱు • పెను దేహములతోడఁ, దపఁబడి పెనఁగు పా • దములతోడఁ
బురమెల్ల గగ్గోలు • పొరయ రోదించుచుఁ, బరుగున రావణా • సురుని దఱిసి

తే॥ చరణములఁ బడి దానవ • సార్వభౌమ! వనము నేఁడు కాపఁగ లేని • వారమైతి
మొక్కపెనుకోఁతి యూరాపు • మూఁడ్చి విఱుప, నగ్గిఁబడు వృక్షముంబోలె • నవియెఁ ద్రుటిని.

కవిరాజ. పలుకఁగఁ దేలికయౌ పని గాదిది • పాద కరంబులతోఁ గసవున్
నలుసులు దూసియులే కఱుసట్టు లో • నర్చి మహా క్రతు మండపమున్
బెలుచ నగల్చి వెసన్ విసరెం బుర • పీఠుల మేడలు కొన్నియ పో
విలువ సమస్తము నాశమొనర్చె ప • నేచర పుక్కట! యిక్కరణిన్.

చ॥ అసవిని రావణుండు పరి • హాసముతో నొకకోఁతి చొచ్చి యా
కనక తరూత్కరంబుఁ గడఁ • కన్ విదళించి మహాగ్ని శాల భూ
మిని పడఁద్రోచి గొప్ప కడి • మి న్నగరంబును కాడుసేసెనే?
దనుజుల పేర్మిమెచ్చఁదగుఁ! దప్పి వెడంగులు నిట్టు లుందురే?

చ॥ అనవుడు వారలిట్లనిరి • యయ్యరొ! యా ప్లవగంబు మేను మో
చిన ధరణి న్నుతింపఁదగు • శిష్ట గణార్చితులౌ త్రిమూర్తు లం
దున నొకఁ డీతఁ డన్న నది • తోఁచును న్యూనతగాఁగ నక్క పీం
ద్రుని కడిమిన్ గణింప నెవ • రుం బలియేమిఁకఁ గాంచ నేర్పడున్.

ఉ॥ వారణి చీలి యానెఱియ • దందడిఁ గంధి జలంబు నిండ ది
గ్వారణముల్ సురాసురులు • కక్కురి విక్కిరిగాఁగ దైత్యనా
రీ రమణీయ గర్భములు • వ్రీలఁగ రోదసి బూరటిల్ల న
మ్మారుతి హుంకరించె దశ • మస్తకుతో నటు వారు పల్కుచో.

## 6. కింకర వధ పటలము. (61)

చ॥ కులగిరి గహ్వరంబున న • ఘోర మహాశని పాత ఘోషమున్
జలనిధి మోషణంబు శివ • చాప విదారణ భీషణారవం
బిల సరిపోలు నారుతి స • మిద్ధ మణీమయ శీర్షక స్ఫుటా
కలిత దశాస్య మస్త దశ • కం బవరన్ వడిఁ జొచ్చె వీనులన్.

మ॥ చిఱునవ్వించుక యొవ్వలేమి యలమం • జింతించి యాకోఁతి యం
బర వీధిన్ మఱి యెట్టులుం జనని రే • వన్ జట్టుముట్టాడి దు
ర్భరమౌ పోరొనరించి యేని త్వరగా • బంధించి తోతెండు పొం
డురవౌ సేనలతోడ నంచు సుభట • వ్యూహంబులం బంపఁగన్.

తే॥ శూల కుంత తోమర భిండి • పాల ముసల, పరశు పట్టిసాదులఁ దాల్చి • కఱకుపోఁకు
మూఁక లయకాలమున వార్ధి • పొంగి లేచు, కరణి నదరి బయలుదేఱెఁ • గపిని పట్ట

సీ॥ అలంబుపేరు వి • న్నంతి మద్యముకంటె, నతిశయోత్సాహంబు • నందువారు
అడవి కంటెను పరమైన వారలు పెను, ఘోషచే జడధికి • గొప్పవారు

గిరికంటె నున్నత • వర దృఢ దేహులు, యశమున నాకస • మందువారు
దేవదానవకీర్తి • దీధితులను తమ, హుంకృతి చేతనే • యూడ్చువారు
తే॥ స్వల్పవైరంబు నిర్లక్ష్య • పరణి విడుట, యాపదలకు మూలంబని • యరసి దాని
కోఁతి వలనఁ దీర్చుకొనఁగ • గుండిసిగ్గు, పడిన హృదయంబు గలవారు • బాహుబలులు.
సీ॥ కత్తులు గలవారు • కవచముల్ గలవారు, వీర చిహ్నంబుల • వెలయువారు
వసుధ నడఁగ ద్రొక్కు • పదములు గలవారు, కడలనంటెడు కేలు • గలుగువారు
గగన మంటెడు మస్త • కంబులు గలవారు, కాళ్ళతో మలలను • గదపువారు
పిడుగుల కంటెను • పెదబొబ్బ గలవారు, వారి కరుల మ్రింగు • నోరివారు
తే॥ క్రొన్నెలంబోలు కోఱలఁ • గొఱలువారు, గుణకిణాంకిత భుజులు మా • ర్గణ నివిద్ధ
పాద పాణి వక్షఃఫాల • భాగులైన, వారు దివ్యభూషణముల • వఱలువారు
ఉ॥ కేల గదాది సాధన వి • కీర్ణ మయూఖము లెండగాయఁగా
లీఁగఁ బోవలేమి నడ • లించుచు బొండని త్రోవ ముందు వా
రేలాకా సాగరంపు బయ • లీదుచు నూకుచుఁ ద్రుళ్ళి నేఁకున్
వ్రాలుచు నట్టు వ్రాలుటకు • వైనము లేక శ్రమంబు నొందుచున్
ఉ॥ సాధనముల్ తటిత్తులుగ • జాపము లింద్ర శరాసనాలుగాఁ
గ్రోధముతోడి యూరుపులె • ఘోరమరుత్తుగ మేనులెల్ల ధా
రాధర పంక్తిగా నదరి • రక్కసి మూఁక యుగాంతకాల పా
థోధరపాళి తారసిలు • తోయమునం జనుదెంచె నత్తఱిన్
చ॥ సురుచిర భూజయి క్రమయి • శోభిలు నివ్వని నెల్లఁగూల్చి భా
స్వర మఖ మండపంబు నొగిఁ • బగ్గము పాడుగఁ జేసినట్టి దొం
డరియగు కోఁతియచ్చె విక • టంబుగ నున్నది నిర్జరారి పి
స్ఫురదురు శౌర్యముఁ బున య • శోవిభవంబుల గాల్పనే యిఁకన్ ?
మ॥ అని యంపిల్లుచు నాయుధ ధ్వనులు శిం • జారావముల్ సింహ గ
ర్జనముల్ దంతుల ఘీంకృతుల్ తురగహే • షల్ గూడి పెన్ మ్రోఁతయై
తనరన్ భర్జనంబులఁ గపిం • బట్టుంతు కొట్టుండు చం
పినఁ జంపుండని యార్చి రయ్యమర వి • ద్వేషుల్ వడిం బోవుచున్
సీ॥ వీధులలోఁ జన • వెరవెంతగానక, యెగసి యింటనె పోవ • నెగడు వారు
బొమలు వింధుల నొక్క • పోలికగా వంచి, పొగయు నిట్టూర్పులు • పుచ్చువారు
ఒకరి నొండొకరు త్రో • చికొని ముందేగుట, గని వీరుఁడేఁ యని • కనలువారు
లంకలోఁ దమకుఁ బో • లఁగఁ జాలినంత తా, వమరదే యని పెద్ద • యఱచువారు
తే॥ తూణములనుండి యమ్ములు • దూయువారు, నొఱలనుండి కత్తులనూడ • బెఱుకువారు
నెఱసి చోటింత లేక క్రి • క్కిఱియువారు, కుటిలదంతముల్ పటపట • గొఱుకువారు.

సీ॥ అల్పతపస్వులొ • నహులు • వోరఁగలేక, పాఱుచో నవ్విన • వారువీరు
ధనదుని కీర్తి పాఁ • తలవేయ నలకను, పాదొనరించిన • వారు వీరు
దురము సేయుట లేక • దురద పుట్టిన కేలఁ, బోరుగోరి తిరుగు • వారు వీరు
పూర్వయుద్ధంబుల • ముక్కాఁకలం దీఱి, వీరమద్దెలఁ గొన్న • వారు వీరు
తే॥ కొండలం బట్టెఁ జలియింప • కుడువారు, సమరదోహలులు కృతాస్త్రు • లమరవరులఁ
బెక్కుసారులు గెల్చిన • వీరవరులు, పుడమి నడుమ విఱుగునట్లు • నడచినారు.

ఉ॥ కొండలఁ ద్రోయఁ దన్న వడిఁ • గుంభిని గూలఁగఁ ద్రొక్కఁ దన్న మా
ర్తాండుని నేల కీడ్వఁ దన • వద్దములన్ వెసఁ బిండుఁ దన్న నొ
క్కండొకఁడే సమర్థుఁడయి • క్రాలు మరుత్సమ వేగవంతు లు
ద్దండబలుల్ రణక్రమ వి • దగ్ధులు సాహస శౌర్యధుర్యులున్
ఉ॥ పాచరజమ్ము స్వర్గపుర • వాసుల కన్నులుగప్ప శౌర్యమే
మోదము తోడ రూపమును • పొందిన చందము దోఁప మత్త నా
గాదన సంఘముం బలెను • వ్యాఘ్ర కదంబమువోలె నీల మే
ఘోచయ మట్లు దైత్యులు మ • హోద్ధతి నేగిరి బాణవేగులై.
చ॥ మిడుఁగులు కన్నులం దురల • మిక్కిలి యూర్పుల ధూమమొప్పఁగాఁ
దొడిబడు నాయుధంబుల ద్యు • తుల్ మిఱుమిట్లు గడింప రక్కసుల్
పిడుగులఁ బోలె నార్చుచును • వీఁకున నుబ్బుచు గంతులేయుచున్
సుడిసిరి చూచి పాడగు న • శోక వనంబు కాద్పడన్.

ఉ॥ భానుఁడు పూర్వచర్య మదిఁ • బాఱఁగ భీతిలి మింటఁ దాఱఁగా
మానుగ రేఁగి పర్విలిన • మారుతి కాహళ తూర్య శంఖ భే
రీ నినదంబు మ్రోఁగ విని • రేఁగి నిశాచరు లాజి సేయఁగాఁ
బూనిక నెచ్చు చండతలు • పోలునటంచుఁ దలంచి మోదిలెన్.

చ॥ వనమును గూల్చునే లగిన • పద్ధతియంచుఁ దలంచె మున్నె యా
పని యనుకూల మార్గమును • పట్టుటచేఁ బెనుపోరు గల్గె నీ
దనుజుల తోడ నియ్యదియె • తాఁ దలపోసిన వైనమౌట నె
మ్మనమున మోదమంది హను • మంతుఁడు వారలఁ గాంచెఁ దేఁకువన్.

చ॥ పగటనె రాత్రి తోఁచు చెలు • వంబగు నల్లని సోఁకుమూఁక యా
పగతుఁడు వీఁడె వీఁడె వెసఁ • బట్టుఁడు కొట్టుఁడు కట్టుఁడంచుఁ దెం
పుగ నటుచొచ్చి వాఁడిమియుఁ • బోఁడిమి వెల్వడ నార్చిరెల్ల భూ
గగన ధరాధరంబులును • కంధియు లంకయు బిట్టు కంపిలన్.

సీ॥ జలనిధి బెడిదంపు • టులివు కీడ్పడ శంఖ, భేరీరవములు గా • వించువారు
గుహలఁ బోలిన నోళ్ళ • రహిఁ దెఱచినవారు, పొగరేఁగు చూపులనె • గడువారు

భుజగేంద్రు మెడయును • భుజము లొక్కటిగాఁగ, నడఁగంగఁ బదమిపై • నడచువారు
బహువిధాయుధ మహా • ప్రభలు వంశాటవి, నలమినగతి వెల్గ • నడరువారుఁ

తే॥ గసిమసంగి యాలము సేయఁ • గడఁగినంతఁ, బావనియు నొక పెనుపాప • పంబు మిత్రు
పగిదిఁగని కేలఁదాలిచి • వాలి కదలి, నడిమి మందరమన వారి • నడుమ నిల్చె.

ఉ॥ కొండల ప్రీల్చునట్టి పిడు • గుల్ సహితంబు వడంకు వోటు దో
ర్దండ బలంబునం దరు వ • రంబున రక్కసి పిండుఁ దాఁపఁగాఁ
గొండల వాఁగులం బలెనె • కొండలఁబోలు భుజాలు వ్రచ్చి యం
దుండి మహాస్ర ధార లిల • నోడిగిలం బడి చచ్చి రుక్కఱన్.

తే॥ కొండఅతనిపైఁ గైదువుల్ • గూర విసరి, పొట్టలవియఁబండ్లునువోవ • మొగము లగలఁ
ద్రొక్కఁబడి రక్తమాంసముల్ • దుక్కిగాఁగఁ, జదిసి రూపఱఁ జచ్చి రా • స్థలము నంద

చ॥ ఒరపిడిచేత రాఁజిన మ • హోజ్జ్వల వహ్ని యెసంగి వెంద్రుకల్
చుఱచుఱఁ జూఁడఁ గఁరములు • స్రుక్కఁగ గన్నులువోవ మూఁషలున్
విరవిరవోవ పీఁపులును • ప్రీలఁగ నిట్టటు వోవలేక దు
ర్భరమగు తాపముం బొరసి • పాసిరి కొందఱు జీవితంబులన్.

క॥ అక్కునఁ దన్నఁగ నెత్తురు, గ్రక్కుచు తొమ్ములను పగుల • ఁగరములు విఱుగన్
స్రుక్కుచు విలవిల వోవుచు, ముక్కుచుఁ గొందఱు నలంగి • ముగిసిరి సోఁకుల్.

ఉ॥ పొందుగఁ జెంతఁ గానఁబడు • భూధ్రము మీఁదికి వైవ నందుచేఁ
గొందఱు నాకలోకమునఁ • గొందఱు గుహ్యక పట్టనంబునన్
గొంచఱు వ్యోమమందు మఱి • కొందఱు సందరమందుచేరి యే
చందమునన్ నివర్తిలఁగఁ • జాలక యీల్గిరి పోవు త్రోవలన్.

తే॥ కాళ్ళు చేతులు విఱిచి య • క్కడనెవైవ • తెక్కలూడిన కొండల • రీతిఁబడిరి
తివిరి వాఁలంబునం జుట్టి • త్రిప్పివిడువ, గిరగిరం దిర్గిఁ దుస్విఁ బొం • గరములట్లు.

ఉ॥ కొందఱ ఖడ్గముల్ విఱిగెఁ • గొందఱు చాపగదాదు లుక్కఱెన్
గొందఱు బాహువుల్ తెగియెఁ • గొందఱు మోములు నల్గి రూపఱెన్
గొందఱు పండ్లురాలె మఱి • కొందఱు కాళులువోయె మధ్యముల్
కొందఱు కుక్కె నెమ్మికలు • కొందఱకుం బొడియయ్యె నయ్యెడన్.

ఉ॥ కొందఱు చర్మముల్ చినిఁగెఁ • గొందఱు వర్మము శీర్ణమయ్యె వే
కొందఱు మేలు చీలె మఱి • కొందఱు దేహము లయ్యె నజ్జుగాఁ
గొందఱు మస్తముల్ చిదిసెఁ • గొందఱు కాయము లయ్యె బజ్జిగాఁ
గొందఱు గాత్రముల్ మునిఁగెఁ • గొర్కిత్తగ నొత్తిలి పాలు నెత్తుటన్.

సీ॥ కాలఁ గొందఱు రాఁచి • కేలఁ గొందఱుఁ దాఁచి, వాలుతోఁ గొందఱు • వైచి వైచి
చూపులఁ గొందఱుఁ • దాఁపులఁ గొందఱు, రాపులఁ గొందఱు • వ్రాల్చి వ్రాల్చి

ఘోరం గింకర పఙ్క్తముల్ మడిపెనా? • ఘోరాటమున్ మానెనా?
పాఱం ద్రోచ్చెనా? యేమి యయ్యె? ననుచుం • బ్రశ్నింప నవ్వారలున్.

తే॥ వారు బెగ్గిలి పాఱిన • వారుగారు. ప్లవగ మని యలక్ష్యంబున • వదలలేదు
తెలిసి కల్ల సాక్ష్యఁ బిచ్చు • ములుద కాలము. మాదిక్కుఁ గోఁతిచే వారలు • మాఁదిరనుడు.

మ॥ తనయాజ్ఞన్ దరిఁజేరి సేవలను బాం • దం జేయు దిక్పాలురం
గని లజ్జించుచు రావణుండు వన ర • క్ష దళులం గాంచి యీ
రిన చందం బిది యంచెఱుంగక విచా • రింపంగఁ బ్రాల్మాలి నో
రను వెవ్వడదియెల్లఁ బ్రేలెదరె దు • ర్వ్యాప్రింతాత్ములై ముంగలన్.

తే॥ అనుడు వా రదయిన నేమి • యనఁగలేర. వడఁకుచు న్నిల్వ కోఁతి యీ • పగిదిచేతఁ
మీరు విన్నదా? కన్నదా? నీరునముల. • కంతయును దెల్పఁగోరెద • ననఁగ వారు.

ఉ॥ ప్రక్క కొదింగి నిల్చి భయ • భావమునం దనువుల్ కుదించి నేఁ
డక్కటఁ నేమి సెప్ప దను జాధిప! కోఁతియొకండె కింకరుల్
క్రిక్కనకుండఁ జావ నొక • వృక్షము కైకొని త్రిప్పి త్రిప్ప య
మ్మక్కట సమస్తముం జదిపి • యచ్చట నున్నది పాఱ దెయ్యెదన్.

## జంబుమాలి వధ పటలము.

మ॥ వనపాలోక్త విధానము న్వినిన దే • వద్వేషి కోపించి క్ర
న్నన బిట్టూర్చుచు జంబుమాలిఁ గని సై • న్యశ్రేణితో నేగి కో
తిని గర్వం బడఁగించి పట్టుకొని వే • తెమ్మిట్లు నా మ్రోలకున్
ఘన మోదంబును నాకుఁ గూర్పు మిది నీ • కార్యంబనన్ దైత్యుఁడున్

ఆ॥ మ్రొక్కి లెక్క లేని • మూఁకలో నన్ను నీ, పనికిఁ దేర్చి పంపు • భాగ్య మొదవె
ధన్యుఁడైతి ననుచు • దైత్యు కోపంబె రూ, పొందెననఁగ నేగె • యుద్ధమునకు

మ॥ తన సైన్యంబులతోడఁ బంక్తిముఖుఁ డాం • దం బంపు సైన్యంబుతో
జనకుం డంపిన సేనతోడను సుహృ • త్సైన్యంబుతో నేగి నేఁ
డని సేయంగల భాగ్యమబ్బె నను న • త్యానంద వృత్తిం బ్రహ
స్తుని పుత్త్రుండగు జంబుమాలి నడచెన్ • దోషాటు లగ్గింపఁగన్

సీ॥ పిడుగుల మొగుళులఁ • బెనచి ప్రాణమువోసి, నిలిపెనా నొప్పు న • నేకపములు
ఉఱుములు మెఱుపులు • నొక్కటిగాఁ జేయఁ, బరఁగిన వననొప్పు • నరదములును
గాలిని నాలుగు • కాళ్లుగా నొనరించి, ధరనిల్పె నన నొప్పు • హరి చయములు
వజ్రంబు వినుము హ్రూ • ద్వపువులు గాఁగొని, క్రాలిన వననొప్పు • కాల్బలములు

తే॥ గుహలనుండి పులులు వచ్చు • కోపుదోఁప, ఖడ్గ శర శరాసన తూణ • ఘనగ దాది
సాధనంబులు మెఱయంగ • జంబుమాలి. సైన్యములు సాగె మేదినీ • చక్రమదర.

తే॥ చిఱుకటారు లీఁటి యలుసు • సిదము లంబు, దంబు నొరయంగనైన రం•ధ్రములనుండి
కాఱు జలములు రజముతోఁ • గలిసి వ్రణము, లందు గాఱు ర క్తంబునా • నతిశయిల్లె.

తే॥ నేమి రవములు శంఖధ్వ • నియుఁ దురంగ, హేషణములు వివిధ వాద్య • ఘోషణములు
కింకిణుల విండ్లరుతులు ఘీం • కృతులుమిగులఁ, గలిసివేల్పుల పలుకులఁ • గలఁతపఱిచె.

తే కనకమయమైన లంకా న • గరము ప్రిదిలి, యెగురు ధూళిపైఁబడఁగొండ • లెల్లస్వర్ణ
గిరిని బోలెను తక్కిన•పుర వరములు, నాక లోకంబు బోలి వి • న్నాణమొందె

తే॥ రక్కసులసేనఁ బదివేల • రథములుండె, వాని కినుమడియై యుండె • వారణములు
వానికిమ్మడియై యొప్పె • వారువములు, వానికిబ్బడి యయ్యె గా • ల్బలములెన్న.

ఉ॥ అందఱు నాఱితేఱిన మ • హాహవ యోధులు మాయలందు పే
రందిన వారు నేత్రముల • యందు మహోగ్రత చూపువారు చే
వం దనరారువారు తత • వక్షములం గవచంబు దాల్చినా
రెందును సాటిలేని విజ • యేందిరఁ జేకొని వారు నిచ్చలున్.

తే॥ వారణారోహణక్రియా•ప్రధితు లస్త్ర, శస్త్రవిద్యాప్రవీణులు • చతురమతులు
వ్యూహ నిర్మాణచతురులు • సాహసులును, నిరృతివంశ్యులు తరణి స • న్నిభులువారు

తే॥ రథగజాదిరోహకుల శి • రంబులపయి, నెగిరిపోవు మనోవేగమె• నయు వార
లాశ్వికులు వారి గుఱ్ఱమ్ము • లట్టివయగు, వివిధ గతులనెఱింగిన • జవన హరులు.

చ॥ అరయఁగ జంబుమాలి చతు • రంగ బలంబులు చుట్టిరాఁగ ని
ర్జరులు భయంపడం గనులు • చంద్ర మిడుంగులు లట్లు వెల్గఁ బె
న్నరదము మీఁదఁ గొండవలె • నాతఁడు గ్రాలఁగఁ గంకటంబు పే
రురమునఁ గారు చిచ్చువలె • నుజ్జ్వలమై వెలయన్ వెసం జనెన్.

చ॥ రణమొనరింప రక్కసులు • రారొకో? యేలొకో తామసంబు ప
ట్టణమున నున్న వీరుల క • దంక నశించెనో యింతకం చవా
రణగతి మారుతాత్మజుఁడు • క్రన్న నశోక వన ప్రధాన తో
రణ ముఖసీమ దానవుల • రాకఁ బ్రతీక్షణ సేయఁగాఁ జనెన్.

చ॥ స్ఫటిక శిలా హిరణ్మయ వి • భాసుర సౌధ విశేష కాంతి చీఁ
కటులఁ జెదర్పఁగాఁ జకచ • కిల్ గల రత్న మయూఖ జాలకం
బటనట వన్నెచిన్నె లెస • లాఁరగ మారుతి యందుఁ దోఁచెఁ జొ
క్కటమగు వేవెలుంగు నడు • కంధిని భాసిలఁ దోఁచు రీతిగన్

చ॥ పిడుగుల తోడ మేఘములు • వ్రీలఁగ సంభ్రమ కొందలింప ము
ప్పదరిన దంచు పర్వత గు • హాంతర సీమల సర్పముల్ విసం
బెడలఁగఁ గ్రక్క రక్కసు ల • హీనభయంబు భజింప వేల్పు పిం
డడలఁగ నాంజనేయుఁడు మ • హారవముం బొనరించె నయ్యెడన్.

తే॥ దిగ్గజములు విభ్రాంతిఁ బొం • దెను సముద్ర, దద్దరిల్లె ఋక్షంబులు • ధరణిఁ రాలెఁ
బర్వతంబులు భూమియు • బ్రద్దలయ్యెఁ. జలఁగెగఁ దలియు హనుమం బా • హాస్ఫలింప.

తే॥ అంత దైత్యులు కదలి పె • ల్లార్చి పేర్చి, పెంటలును రక్తవాహినుల్ • పెరిఁగివారి
నాఁటి పెట్టుట పిలప నా • హనుమఁ జేర, ననుపు డోఁపక పిక్కులి • యడిఁ పడిరి.

తే॥ జంబుమాలి సైన్యము విధ • జనము చేసి, రెండు ప్రక్కలఁ జంపి యా • దండ తాను
రథికుఁడై దాయ హనుమ వా • రలనుగాంచి, సంతసింపఁ బూరించె ధ • జంబు లంత

చ॥ అమరిన దీప్త దీప శిఖి • యందము నొంది వెలుంగు నూర్ధ్వ పుం
డ్రముగల ఫాలమే మొదటి • రాణువగా నిఖరాజి నిట రో
మములు చెలంగు బాహువులె • మధ్యమసేనగ వాలు వెన్క సై
న్యముగఁ బొసంగఁ బావనియు నాయితుఁ డయ్యె రణంబు సేయఁగన్.

ఉ॥ కాహళముల్ చెలంగ నెస • కంబుగ వాద్య నినాద మొప్ప మా
యాహవ దోహలుల్ బహు వి • ధాయుధ వర్గము నాంజనేయుపై
నోహరి సాహరిన్ పయిచి • రుద్ధతి నాతఁడు చూచి లోక వి
ద్రోహులు కుంపఁ దూర్చె నొక • దోరణ గంబముతోడ నన్నిటిన్

ఉ॥ దోరణ గంబమున్ సమర • దోహలుఁడై కొని తాను దిగులబల్
పోరట గానలేక వెలఁ • బొందుచు గుంపులు గూపుచున్ విడం
బాఱుచుఁ దాఱుచున్ మరలి • పైకొనుచున్ దిరుగాడు విద్విష
ద్వీరులఁ గాల సద్మమున • విందులుగాఁ జనుసట్లు మోఁదుచున్

తే॥ ఏయుసవి క్రమమ్మునవి యగు • నాయుధముల, నెదమ చేత నలంచు గుదికరమున
వీరు సాగింప నంజనీ • పుత్త్రికుండు, దొరలె రథములు గజములు • తురగములును

తే॥ మోఁదుదిన్న యేనుంగులు • మీఁది కెక్కి, ములసు దంతములను త్రొక్కు • ములను చెవులఁ
గాళ్ళ మద జలంబులను ఘీం • కారములను, కినుక లెల్లను వో గొట్టు • కొనియె నపుడు

తే॥ వీరు లెక్కివచ్చిన రథ • వితతి నొగలు, ప్రక్కలును శిఖరములు న • క్రములు కింకి
ణులఁ సుధ్వజములు వారువ • ములను నలఁగి, మహిని చెదరి పడియె హనూ • మంతుచేత

ఉ॥ కొన్నిటి కుత్తుకల్ దెగియెఁ • గొన్నిటి పొట్టలు వ్రీలెఁ బ్రేవులున్
గొన్నిటి కీఁగెఁ గొన్నిటి య • కుంఠిత వేగము క్రుంగెఁ గాళ్ళు పోఁ
గొన్నిటి ముచ్చలే విఱిఁగెఁ • గొన్నిటి మొక్కలు వ్రస్సె నుగ్గుగాఁ
గొన్ని నశించెఁ • గొన్నివడెఁ • గొన్ని యడంగెఁ దురంగ బృందముల్

ఉ॥ కొందఱు పిహ్వలించుచును • కొందఱు కుందుచుఁ గొంద ఱేడ్చుచుం
గొందఱు దిగ్భ్రమం గొనుచుఁ • గొందఱు పోఁచుఁ గొంద ఱార్చుచుం
గొందఱు పాఱుచుం బొరలి • కుప్పలు గూలుచుఁ జచ్చుచుండఁగాఁ
గొందఱు దవ్వునుండి కపి • కొంకుచుఁ బాఱిరి తిర్గి చూచుచున్

ఆ॥ కరులచేతఁ గరుల • హరులచే హరులను, కాల్బలముఁతోడఁ • గాల్బలముల
స్యందనములతోడ • స్యందనంబులఁ గూల్చెఁ, గదనమందు హనుమ • కపిమసంగి.

ఆ॥ కాళ్ళు తలలు తునిఁగెఁ • గంధరంబులు తెగె, భుజము లూడిపడియె • నురదయయ్యె
మెదడు నెత్తు రురలి • మదగజావళులందు, మునుక వేసి యట్లె • మునిఁగిపోయె.

తే॥ దనుజవరులను వక్రదం • తములతోడఁ, గరులతో విండ్లతోడ ఖ • డ్గములతోడఁ
గడిమితో గర్జనలతోడఁ • గజకుతోడఁ, నలగఁ ద్రొక్కి చంపెను మరు • న్నందనుండు.

చ॥ మిడుఁగులు పుందుగాఁ జెదరి • మేఁగ జరించెడు వాయుపుత్త్రుఁ డా
సిడముల చెంత నేనుఁగులఁ • జెంత రథంబులచెంత గుఱ్ఱపుం
దడముల చెంతఁ ఖడ్గ సము • దాయముచెంత మఱేడఁ జూడ న
క్కడఁ గనవచ్చె నచ్చెరువు • గాఁ గనువారల కుగ్ర వేగుఁడై.

తే॥ కరుల తలలపై వీర వ • క్షములమీఁద, వారువముల వీఁపులపయిఁ • దేరులపయి
విలయకాలాశనియొ నాఁగ • వెలసి దుమికె, హనుమ నజ్ఝునజ్ఝుగ నవి • నవసిపోవ.

మ॥ జగతిన్ నిశ్చలరీతి వర్తిలు నృపా • జ్ఞాచక్రముం బోలె ము
జ్జగముల్ పొంపిరివోవు సజ్జనుల వి • జ్ఞానప్రభం బోలె బా
డిగకున్ దేహము నొప్పగించు ధనచే • టీ చిత్తముం బోలె నా
శుగపుత్త్రుం డెటఁ జూడఁ దానమయి సం • శోభిల్లె రంగస్థలిన్.

మ॥ భగవద్భక్తులు సర్వదా హరిని సం • భావించి సారూప్య మొ
ప్పఁగ సాధించెదరన్న యర్థమును సం • పూర్ణంబుగాఁ జూపుచున్
గగనంబందున ధాత్రియందునను ది • గ్భాగంబులన్ ముందరన్
దగ డెందంబునఁ గానిపించెను మరు • త్సంజాతుఁ డయ్యైయెడన్

మ॥ ధ్వజరాజద్రథ పంక్తి రథ్యములతో • దాచేత మత్తద్విప
వ్రజమున్ వేఱొకచేత గుఱ్ఱముల ను • గ్రక్రోధులై పోరు పు
ణ్యజనాళిం బర సంప్రఘాతముల భ • గ్న ధ్వంసముల్ జేసి య
క్కజుఁడై పేర్చె యుగాంతకాల లయరే • ఖం బొల్చు రుద్రుండనన్

తే॥ చక్రఖడ్గతోమర పర • శ్వధరథాశ్వ, గజ లసచ్ఛత్ర కేతన • కాండమెల్లఁ
గుప్పలై కూలి నెత్తుటఁ • దెప్పదేలె, పూచి విలసిల్లు పెను జల • పూరమట్లు

తే॥ దొరకు నాయుధములఁ గొని • తొడరియేయఁ, దెగినతలలును కొండలఁ • బగులు తలలు
నెగురుతలలు నొండొంటికిఁ • దగులు తలలు, తటపటాయించె సంగర • స్థలమునందు.

తే॥ జముని కరణి విజృంభించి • జంబుమాలి, కుపితసింహంబు కరిఘటం • గూల్చుత్రోయ
మిగిలి యున్న యూధపమట్లు • మెఱసి తేఁ, వంటి కన్నుల నిప్పుకల్ • వఱలఁ దాఁకె

ఉ॥ పీనుఁగు లడ్డదిడ్డముగఁ • బెంటగఁ గూలిన సంగరస్థలిన్
జానుగ స్యందనం బరుగఁ • జాలని తీరు నెఱింగి వేఱుగాఁ

## ప్రహస్తుని యుద్ధము

తే॥ తనదుదండనాథుఁడుతన • యెదుటఁబొలియ, నలసుమాలిసూనుండుప్ర • హస్తుఁడలుక
వింటి నెక్కువెట్టి గుణంబు • వీనులదర, మొరయఁజేసి హిడింబుపై • మోహరించె.

ఆ॥ భుజములుబ్బఁ బ్లవగ • ముఖ్యులు బెగడొంద, విల్లు గుణ్ణుపడఁగ • విస్తరించి
యంపవాన గురియ • నగచరుల్ మొగతప్పి, యోర్వలేక వెనుక • కొదిగినారు.

ఆ॥ శరము లొదలివింద • నెరవ హిడింబుండు, విహ్వలింప సేన • వీఁగుటయును
క్రని కపర్దిపోలెఁ • గనలి నీలుఁడు ప్రహ, స్తుని యెదిర్చి పేరు • కొనుచుఁ బిలిచి.

ఆ॥ ఒకఁడు తెచ్చుచున్న • యొక తిట్టగొని చేవ, చూపి యొడిసి వైవ • నోఁకు మూక
ఏఱచి విఱుగ నచట • బయలయ్యె దానిఁబ్ర హస్తుఁడమ్ములేసి • యడఁచివైచె.

ఆ॥ మరల నీలుఁడొక్క తరువును గొనివాని, విల్లు పడిగ తేరు • విఱుగఁగొట్టి
వారువములఁ జంపి • సారథిఁ జదియించి, సింహనాద మొదరఁ • జేయునంత.

తే॥ విరథుఁడైన ప్రహస్తుండు • వీఁక చెడక, ఒండముంగొని లంఘించి • ధరటికి దిగి
పరిధి వీడిన భానుని • పగిది మెఱసి దుర్నిరీక్ష్యుఁడై నీ ని • తొడరి తాఁకె.

ఆ॥ ఔడు గఱచి కనుల • నగ్నులు గ్రక్కుచుఁ, దాఁకు దనుజవీరు • నాఁకపఱచి
వానిఁబట్టి యెగుర • వైచె నాకసమున, కమరులడలి కాంచి • యవలఁబాఱ

ఆ॥ వైవవాఁడు మెలఁకు • వను నొవ్వకుండఁగ, ధరకు దిగుచు సురలు • తత్తళింప
దండముగొని మోఁదె • గండని నీలుని, నేత్రములను నోట • నెత్తురొలుక

తే॥ మోఁదఁ జలనమందక కపి • ముఖ్యుఁ డదరి, వాని దండ మొడిసికొని • పాఱవైచి
నేఁటితోఁ దీఱితని త్రావు • నెత్తురెల్లఁ. బొళుకుబొళుకని క్రక్కంగఁ • బొడిచె శిరము,

తే॥ శోణితము గ్రక్కుచును ప్రహ • స్తుండు కదఁక, చెడక నీలునివక్షంబుఁ • బొడువనతఁడు
కినుక నట్లచేయఁగ నిర్వు • రును పదలక, పోరి రెచ్చుతక్కువ లింత • పొందకుండ.

తే॥ వాలమున నీలుఁడవ్వల • వాని యొడలు, కదలనీయక చుట్టి వ • క్షంబు పగుల
గాఢముష్టిఁ బొడువవాఁడు • కందరాద్రి, పగిది వదనంబు దెఱచి జీ • వముల వీడె.

తే॥ సైన్యనాథుండు పడఁగని • చదల వేల్పు, లెలమిఁబాడి విరులు గురి • యించినారు
రక్తరోమముల్ వికృతదం • ష్ట్రిలు జ్వలించు, మబ్బుద్రిమ్మరు లుడ్డాది • మరలినారు.

తే। దక్షిణద్వారమున కేగు • దనుజవితతి, నేఁచి యేడాటలాడించి • యేకు నదుల
నీకు ద్రావించి దళవాయి • నిహతుఁజేసి, యంగదుం డార్వ హతశేషు • లచటువిడిరి.

తే॥ పోటుబంటుల మేటిదు • ర్ముఖుఁడు రేఁగి, పశ్చిమద్వారమున గాడ్పు • పట్టి చేతు
లనెడి జమువాతఁ బడిపోయె • ననుచరులును, మరలలేదొక్కరైనను • పురముత్రోవ

తే॥ అంత నాలుగు దిక్కుల • యందు జరుగు, దురముగాంచి రా నరిగిన • దూతలేగి
దశముఖునితోడ జరుగువృ • త్తాంతమెల్లఁ, దెలియబల్కి రేకతమునఁ • దేటపడఁగ.

క॥ వడి ధపదాఘాతగ్రసము, నడఁబోరిన సైన్యముఖ్య • నాయకుఁడు ప్రహ
స్తుఁడు తన బలములతో భువిఁ, బడియెను పిట్టీపములు ది • వంబున కరిగెన్.

క॥ శూలకరులు దనుజులు కొం తాశముతో నడచి దక్షి • ణద్వారమునన్
వాలికొడుకుచే ధారిణి, పాలై రని నడపు మన సు • పార్శ్వం దీల్గన్.

తే॥ ఉత్తరపు గవఁకున రేగి • యున్న వజ్ర, ముష్టియును పదపుటితట్టు • మొనయు దురు
ఖుండు నేఁబదివేల్వ ల • కుంరితబలు, లదరి పెనుపోరు గావించి • యడఁగినారు.

ఆ॥ మంటపైచి ఘృతము • మాడ్కి నవ్వార్తలు, ప్రభుని మనము మిగుల • రగులఁజేయ
నుండియుండి యేమి • యును దోప కెడనెడ, వేఁడి యూరుపులను • విడుచుచుండి.

ఉ॥ తూరుపు వాకిటన్ సమర • దోహలు సైన్యపతిం బ్రహస్తుతోఁ
బోరిన వీరుఁదెప్పఁ దది • పోలఁగఁ దెల్పుఁడి యన్న వారలున్
గౌరవకీర్తులన్ దిశలఁ • గప్పిన నీలుఁడు వహ్నిపుత్త్రుఁ డం
గారము పూరిఁగాల్చిన ర • కంబున సేనల రూపుమాపఁగన్.

మ॥ విలయాదిత్యునిభంగి రేఁగి సమరో • ద్వేగంబు చూపించి బి
ట్టలుకం దాఁకి ప్రహస్తుఁ డుగ్రతర బా • ణాసారముం గూర్ప మాం
సల దమ్యంబు జడిం జరించుక్రియ రో • సంబార నీలుండు ని
శ్చలరీతిన్ జరియించె నిర్వ్వరకు ము • ష్టాముష్టి యయ్యెం దుదిన్.

ఉ॥ అంత దురంత దుస్సహ మ హాశనిఁ బోలిన నీలు ముష్టిచే
నంతకు నింటి విందయి ప్ర • హస్తుఁడు వోయెఁ దదీయసేనలో
నింతకు మేము దక్క మఱి • యెవ్వరుఁ గ్రమ్మఱలే దనంగ దు
ర్దాంత పరీత రోషుఁడయి • రావణుఁ డాశలు మండఁ జూచుమన్.

ఉ॥ వింటిరె వింతవార్త యిది • వీనులఁగాల్చె మనస్సు మాడ్చె వే
గంటిని గెల్చినట్టి రణ • కర్కశు నొక్క ప్లవంగుఁ దాఁజిలో
గెంటెనె ? యెల్క పిల్లి హతి • కిం గనకాద్రి ధరిత్రి దొర్లెనే ?
మంటను గొల్వు మిద్గు తొక • మాత్రముగాఁ దలఁపంగ రాదెటన్.

## రావణుఁడు రణమున కేఁగుట

చ॥ అని యొకకొంత చింతిలి ద శాస్యుఁడు బాణ కృపాణ పాణులన్
గని రణభూమికిం బదఁడు • కంటు సమస్తము దీర్చికొంద మే
నును తగ వత్తునంచు వడి • నూత్న కలాప మలంది మేలి భూ
షణ కుసుమాంబరాదుల భృ • శత్వరఁ దాలిచి యెక్కెఁ దేరిపై.

సీ॥ ఆకేరు వేయి హ • యంబులఁ గలయది, శరనిధి యంతటి • పరపుగలది
సురలోక మంతటఁ • దిరిగినయది యింద్రుఁ, దోడి నొచ్చిన యప్పు • డొసఁగినయది

యిష్ట దేవత రుద్రు • నెలమి ధ్యానించి డా, పలిచేత నున్నట్టి • ప్రథిత ధనువు
శింజినీ రవ విశే • షంబున యముని యా, యుష్కాలమును గూడ • నూడ్పఁగలది

తే॥ మఱియుఁ గేల ధరించిన • మహిత సాధ, నములు దిగధీశ దార్ఢ్య వ • శములఁ దాఁకి
మొక్కవోనివి తొడిఁగిన • బొందడంబు, వజ్రమయమై యభేద్యమై • వఱలిన యది.

తే॥ వీవఁబడు చామరములచే • విరిసి వార్ధి, నీరు నురుగుగట్టఁగ రజ • నీచరుండు
రమణ ముత్యాల గొడుగు శి • రమునఁ గ్రాలఁ, బూర్ణ శశిక్రిందఁగల జల • ముచముఁబోలె

తే॥ పటహములు మ్రోఁగె వానర • బలము కలఁగి, పరవ నిర్జరుల్ చెమ్మట • పట్టి సుడల
సండభిత్తిక లగల శం • ఖాది సమర, వాద్యములు మొరసెను జీవ • భయదరీతి.

క॥ వీరులు హరులును కరులును, తేరులఁ గ్రిక్కిఱియ నడచు • దితిజుల నడుమన్
వారిధులు పొంగి చుట్టిన, మేరువుక్రియ రావణుండు • మీఱి వెలింగెన్.

తే॥ ఏడుతంతుల వీణ రూ • పెసఁగు ధ్వజము, విలయకాలుని నాలుక • లలినిగ్రాల
దనుజ వారాశి నేఁటికి దాఁటఁగలిగె, ననుచుఁ జూడవచ్చిన సుర • లడలిపాఱ.

తే॥ కనులకోపాగ్నిచేఁ బొగల్ • గ్రమ్మె నల్ల, సోఁకుమూఁకల యెట్లని • జుంజురైన
పెంద్రుకలు తెల్లఁబాఱ దా • పించు బంధు, సంఘములు గాంచి మిక్కిలి • సంతసింప

క॥ అరదంబుల భటకరముల, ద్విరదంబుల మీఁది సిడము • తెట్టువ లొరయఁగా
మరుదంబు శైవలిని ఘన, శరదంబులఁ గల జలంబు • సమయఁగ వచ్చెన్

తే॥ పూని వాఁడియాయుధములు • మోచికొనుచు, వేలకొలఁది పిశాచముల్ • వెంటరాఁగ
గంటలులియఁ దేరులు వెంటఁ • గదలిరాఁగఁ, గదనరంగంబునకుఁ బంక్తి • వదను కరిగె.

తే॥ రావణుఁడు గొప్పసేనతో • రణము సేయ, వచ్చెనని రామునకుఁ గపి • వరులు దెలప
భూమిజకు నేడు కారా వి • మోచనంబు, గలుగునన్న యామోదంబు • గాంచె నత డు.

## రాముఁడు రణ సన్నద్ధుఁ డగుట

తే॥ కర్మముల యెల్లఁగాంచిన • ఘనుఁడు దివ్య, దృష్టిచేఁ గాంచుటకు ముఖ్య • దృశ్యమైన
రామచంద్రుండు నారచీ • రము దిటంబు, గాఁగఁ జుట్టె మధ్యంబునఁ • గత్తిఁ జెక్కి

తే॥ జగములం గొల్వఁజాఁచిన • చరణములను, పసుకు నొక పడఁటిగ జేము • పాదములను
భక్త హృదయంబులను వెల్గు • పదములందు, చెలువు పనిగల పీరము • ద్దెలు ధరించి.

తే॥ ఒత్తుగాఁ జుక్క లలరిన • యుప్పరంబు, పగిది వెలుఁగొందు కవచంబు • బిగువుగా నఁ
దొడిగె శ్రీవత్సమలరు న • య్యెగను లక్ష్మి, యెడయు కతన నొవ్వ దనుచు • నెంచెనేమొ!

తే॥ శర్మద కరాంబుజములకుఁ • జర్మ కవచ, మెనయఁజుట్టిన యొప్పిద • మెంచిచూడ
నీవి మ్రాఁకుఁ గొమ్మల నెద • మీయకుండ, నల్లత్రాఁచు చుట్టిన లలి • నుల్లసిల్లె

తే॥ రేలఁబగళుల నొక్కచే • రీతి వెలయు, తామరలఁ దేఁటులుండు చం • దముననొప్పి
శ్రేణులై యొత్తుగా నున్న • వ్రేళ్లకంత, గోధికాచర్మ కవచంబు • గూర్చినాఁడు

తే॥ బహుళపద్ధతుల్ గలిగిన • భాషలందు, సారితేఱి కావ్యంబులు • ననుసరించు
సుగుణులగు కవీంద్రుల పద • పద్ధతులను వీడి, వీల్చు నక్షయ తూణముల్ • దాల్చినాఁడు.

తే॥ మొగులునం దోఁచు మెఱుపును • బగిది మెఱయు, పీతపట్టంబు నడుమను • వెలయఁగట్టి
మలయు లేఁగాంతి గల వన • మాలతోడఁ, దులసిమాలయు రణమాల • తో ధరించి.

తే॥ సకలలోకంబులును చరా • చరచయములుఁ, దాను వేఱుగానున్న ప • ద్ధతియు నిట్టి
దనుచు నూహింప మనము స • మర్థులమొకొ? యతఁడు చేకొన్న విల్లు వే • దగునె తనకు?

తే॥ సురలు నరులును మోదించి • విరులు చల్ల, గొప్ప వానరసేనతోఁ • గూడి రామ
విభుఁడు పాలకడలితోడ • వెన్నుఁ డరుగు, దెంచి ప్రత్యక్షమైన రీ • తిగను దోఁచె.

తే॥ ప్రళయవేళను రుద్ర రూ • పంబునొంది, జగములను నాశమొనరించు • పగిదినొప్పి
విపుల సేనాముఖంబున • విల్లుదాల్చి, నిలిచియున్న లక్ష్మణుని స • న్నిధిని చేరె.

తే॥ అంత దక్షిణ దిఙ్నాథుఁ • డగు యముండు తనదుకృత్యంబు త్వర నెడ • గొనక నడప
నుభయసేనలు కలసి యొం • డొంటిఁ దాఁకె, వనధి వనధి యెదిర్చిన • వైన మడర.

తే॥ అన్నిదెసల దంష్ట్రిల కొంతు • లలమికొనియెఁ, బడియెఁ గనక రాసులపోల్కిఁ • గపిశవములు
దనుజ కుణపముల్ సెలచెట్టు • లనఁగనొప్పె, వింత వానకురిసినట్లు • వెలసె దురము

తే॥ తెగియెఁ దలలు ప్రేవులు జాఱెఁ • దేరు లురలె, గెడసె ఖురువులు కరులును • మడిసె సమర
మేదినియుఁ బీనుఁగులచేత • మిట్టయయ్యె, నెల్ల దెసలకు నెత్తురు • టేళ్ళు పాఱె.

క॥ ఘోరాకారులు వానర, వీరులు హస్తములఁ బొడువ • విటలాటముగా
వారువము లురలె రాక్షస, వారముల యురమ్ము లగలెఁ • బడగలు విఱిగెన్.

క॥ తత సేతువు తెగు లలి శో, ణిత వాహిని విరియ దనుజ • నేత యదరి యు
ద్ధతగతిని శింజినీ టం, కృతి యొనరుప బెదరి చెదరెఁ • గీశచయంబుల్.

క॥ పిడుగు బెడిదంపు మ్రోఁతకు, నడఁగి యొదుఁగు సర్పరాజి • యనువునఁ బ్లవగుల్
పడి రేడ్చిరి పాఱిరి తడఁ, బడిరి వడఁకి రురలి రాస • నదలిరి భీతిన్.

క॥ నిర్దయు డగు దనుజేంద్రుని, దుర్దమ గుణరవము దినము • దూఁటింపఁగఁ ద్రా
సార్దితులై రసురులె యన, నిర్దేశములేల ప్లవగ • నిచయము పాటుల్?

తే॥ ఖేచరులు పరులిడి తల • దాఁచుకొనిరి, లక్ష్మణుండును ప్లవగ • వల్లభుఁడు దనుజ
పతి విభీషణుఁడును తగు • పగిది యరయ, నిలిచి రితరులు పాఱిరి • నివ్వెఱపడి,

చ॥ అవనిఁ బెకల్పఁజాలిన బ • లాఢ్యుఁడు రావణుఁ డీడ్చు శింజినీ
రవమునఁ బ్రహ్మాండ వివ • రంబును తల్లడమందె భీతిమై

దివిజులు కల్పకాల సము • దీర్ణ మహాశని యంచుఁ బాఱి రీ
పవిది నరామరాదులకు • బాధలుగూర్చుట తారకాణగాన్.

క॥ చండగతిఁ బడెడి పిడుగన, గొండనొకటి వైచెఁ ద్రొద్దు • కొడు కద్దానిన్
మండెడు కినుకను దశవద, నుండొక బాణమున నుగ్గు • నూచము చేసెన్.

క॥ అందులకు భానుసూనుఁడు, డెందంబున రోసి వసుమ • తీ గర్భము వ్రీ
లం దరు వురవడిఁ బెకలిచి, యందికొనియె హస్తమున న • హంకృతితోడన్.

క॥ చేపట్టిన పెను కుజమును, తూపులచే రావణుండు • తునుకలు సేయన్
గోపంబున సుగ్రీవుఁడు, దీపించుచు నొక్కగిరిని • తేఁకువ వైచెన్.

క॥ దాని నొకమ్మునఁ దునియలు, గానేసి పనాటులెల్లఁ • గలఁగుచుఁ బఱవన్
బూని విలు గుడుసువడ నొక, బాణపు మొదలంటి తూఱ • భానుజు నేసెన్.

క॥ ఆనే దియమ్ము చొర సు, గ్రీవుండు కలంగెఁ గలఁగి • కీడ్పడు మున్నే
పాపని తత్స్థితి యెఱిఁగిన, కైవడిఁ జని యడ్డుపడియె • క్షణకాలమునన్.

చ॥ తెలిసిన మూర్ఖ! కీశ జగ • తీపతి క్లేశము తీఱునంతలో
పల నను దాఁకి వీఁక బహు • భంగుల సంగరముం బొనర్తె ముం
గల? నని వాయుపుత్త్రుఁ డడు • గంగఁ గృపాణత మున్నుపీడినన్
చలనఱి వెండిఁ జచ్చుటకు • వచ్చితివే యని రావణుండనెన్.

ఉ॥ శైలమొకండు మారుతి వె • సంగొని వైచిన దానిమీఁది మే
ఘాలియు మాఁడి నింగి కెగ • యంగని పంక్తి ముఖుండు సాయక
జ్వాలలచేత బూది సలు • పన్ మఱియొక్క నగేంద్రమెత్తి యు
ద్వేల బలంబునన్ విసరి • వేసె దిశల్ వడి రింగు రింగనన్

తే॥ పిడుగుకంటెను వడిగాఁగ • వెడలి శిఖరి, దనుజు నమ్ముల నొకలెక్క • గొనక మీఱి
వాని భుజములఁ దాఁకి శా • పంబువోలె, బాహుపురులతో నదియును • భగ్నమయ్యె.

ఉ॥ ఇంచుకనొచ్చి రావణుఁడు • హేలగ వేఱొక శైలమెత్తి తా
టించఁగనున్న వాయుజుఁ గ • డింది బలంబున నారి లాగి పా
టించి యురంబుగాఁడ నిగి • డించిన నొవ్వక గాడ్పుపట్టి యం
కించి కుజంబు వైచి యడఁ • గించెను సారథి పంచజీవముల్.

తే॥ మఱొక చోదకుఁ డంతలోఁ • దఱిసి నడప, నసురనాథుండు వందసా • యకములేసి
ఎరియ మోదుగువలెఁ గశే • బర మొనర్ప, సుంతనొచ్చి కర్వలిపట్టి • సొమ్మసిల్లె.

ఉ॥ ప్రేలుచు ఱాలు ద్రుమాఁకులను • వీచుచు గోళులతోడఁ బండ్లతో
నాలము సేయు క్రోఁతులని • యక్కటికన్ మదినూని వీడుచో
నేలిద మింత యయ్యె నిఁక • నే ధనువుంగొని యాజి నిల్వఁగాఁ
దూలక మీరు ప్రాణముల • తో జయముం గొని యేగువారలే?

చ॥ అని వికటంబుగా నగి యు • గ్రాంత పలాహతి భంగిఁ గ్రమ్మ మా
ర్గణ గణ వర్షముం గురియఁ • గాలి సమీర మహోరిశాద్రి మా
డ్కని కలగుండు వొందుటను • రీతులు పర్విడ లక్ష్మణుండు నా
ఘన శరపాళి వీనిఁ గడి • కండలు సేసెను నంచు దాయుచున్

## లక్ష్మణు యుద్ధము

మ॥ లయ కాలాంబుద ఘోషణంబు క్రియ శీ • లన్నారి మ్రోయింప దు
ర్జయ సంతాపము లొంది మాయలను దు • ర్వారంబుగాఁ గొన్న దు
ర్నయ దైతేయులు సింహగర్జనము నా • రన్విన్న మత్తేభ సం
చయ భంగిం గదు విహ్వలించితి రహో • త్సాహంబు చల్లాఱఁగన్.

మ॥ తన సైన్యంబులు తీరుగాంచి యమ నే • త్ర భ్రూనిభంబైన ల
క్ష్మణ బాణాసన రావముల్ విని మదిన్ • జంకొంద కీ నీచుఁడున్
మనుజుండే యని నవ్వి రావణుఁడు త • న్మాణిక్య దీప్తి ప్రభా
జనకంబుల్ ముకుటంబు లున్నతములై • సాఁగన్ బడిన్ గర్జిలెన్.

చ॥ పడి మెఱు వానచినుకులొక • పద్ధతి లేక యుక్రాలులీల నొ
త్తడిగల లక్ష్మణాశుగత • దంబము తేరుల గుంపుమీఁదఁ ద
త్తురుపయిన్ మతంగజ వి • తానముపై దనుజ వ్రజంబుపై
నడర రణాంగణంబు రుధి • రాశయమై కనుపట్టె నెల్లెడన్.

తే॥ కరుల మదజల ముఖములఁ • గాఁడినట్టి, నెలలు వెనుకటి కాళ్ళలో • వెలలి యరుల
వక్షములఁ దొల్చి శిరుల • యక్షములను, విఱిచి నిలువక యటనుంటి • వెలికినేగు.

తే॥ పగలు రేఁపినకరులు వా • ద్యములు సమయ, వ్యూహమమరిన యసుర సం • దోహమదరి
మొనసి కైదువుఁను లోక • పుణ్యఫలము, వంటి శ్రీరాము తమ్ముని • పైనివైచె.

ఉ॥ వైచి విరోధి మానవుఁ డ • వార్య పరాక్రము దానవేంద్రుపై
నేచుఁచు డాసెనేని మన • కేటికి జీరములంచుఁ బల్కుచున్
దాఁచక యిచ్చుచుండెడు న • దారుని చుట్టును మూఁగు పేదలౌ
యాచకులట్లు దానవు ల • హమ్మతి లక్ష్మణు చుట్టుముట్టఁగన్.

చ॥ ఎడపడకుండ దానవుల • నేసి సురారుల వాఁడికైదువుల్
వడిఁ బడఁద్రుంచి తప్పిపడు • వాని ఛరించె సుమిత్రపట్టి; యు
గ్గడువుగఁ బ్రాణము ల్గొనఁగఁ • గాఱుఁడుఁ జీఁవఱనొందె రక్తముల్
కదలివి చేరనీక యన • కట్టగ నేర్పదె నాజిఁ బీనుఁగుల్.

ఉ॥ త్రుంగెను వీరమస్తములు • త్రుంగెఁ గరంబులు వ్రేళ్ళు పాదముల్
త్రుంగె నురంబులున్ గటులు • త్రుంగెను శూలములున్ నరాజులున్

ద్రుంగె శరాసనంబులును • ద్రుంగె శరంబులు బాణ యూణముల్
ద్రుంగెను తక్కు-కైదువులు • ద్రుంగెను దానవ శౌర్యసారముల్.

ఉ॥ ద్రెవ్వె శతాంగ సంఘములు • ద్రెవ్వెఁ దురంగపు దీర్ఘ కంఠముల్
ద్రెవ్వె మతంగజాంగములు • ద్రెవ్వెఁ బదంబుల వీరమద్దియల్
ద్రెవ్వెఁ బ్రసూనమాలికలు • ద్రెవ్వె హిరణ్మయ వజ్రవర్మముల్
ద్రెవ్వె ధ్వజ ప్రజంబులును • ద్రెవ్వె సముత్సుకతా విరావముల్.

చ॥ తరమిడి సంగరావనిఁ బ • దాతి వితానము గూల దానిపైఁ
దురగ నికాయముల్ తునిసి • తూలఁగ వానిపయిన్ మదేభముల్
దొరల మదేభరాజిపయి • దొంతరలై పెనుతేరు లర్లఁగా
శిరములు వానిపైఁ బడఁగఁ • జీఁకునేని మెదంబు లేదటన్

చ॥ వడివడి లక్ష్మణుండు శర • పంక్తుల నెత్తుట కూర్చు టీస్చుటల్
విడుచుట యేదియుం దెలియ • లేక నిలింపులె మిట్టిచూచి రా
విడిచిన బాణముల్ దనుజ • వీరుల మేనులఁ జొచ్చి పోక విం
గడముగఁ గానరైరి మఱి • కాంచిన దప్పటి పింగువానులేఁ

చండకోపు లసురులేయు • శక్తి శూల, పరశు పట్టిన కుంత తో • మర గదాది
వివిధ సాధనములు భిన్న • భిన్నములయి, పడియెఁగాని తప్పినది త • న్నడఁగలేదు.

చ॥ సమర ధరిత్రిఁ జేరిన య • సంఖ్యములైన మదేభముల్ తురం
గమములు కేతన స్ఫురిత • గాంగ రథంబులు వ్యాఘ్ర ఖడ్గ సిం
హములను తక్కు- జీవములు • నమ్మలఁ గూలెనకాక నుంత స
క్రమమున నిల్చినట్టివియుఁ • గ్రమ్మఱినట్టివి లేవ యయ్యెడన్

మ॥ తనవారల్ తలలూడి కాళ్లుతెగి హ • స్తంబుల్ సగంబై రణా
వనిఁ గూలం బెఱవారు డాఁగి పఱి పో • వం బంచబంగాళమై
మొనయన్ నిల్వమి లక్ష్మణుండు విజయా • మోదంబుతోఁ బేర్చుటం
గని రక్షోధిపుఁ డకులం దనసహా • యోగ్ర క్రోధముం జూపుచున్.

మ॥ జవనాశ్వంబులఁ బూన్చినట్టి రథమున్ • సంగ్రామ రంగంబునం
దవలీలం బఱపించి బిట్టులుక డా • యంబోవ నిర్భీతి రా
ఘవు తమ్ముండును గాంచి యోరి జగదొం • గా! యింక నేమార్ప నీ
కవునే? యంచు నిశాత బాణములచే • నంగంబు నొప్పింప గన్.

ఉ॥ ఏసిన తూపులెల్ల శప • యించిన సంచునఁ దాఁక సోఁకు బా
ణాసన మెక్కు-పెట్టి కొన • లంటఁగ నీడ్చి శిలీముఖంబు లు
ద్భాసిత రీతిగాఁ బఱపి • తచ్ఛరముల్ నడుమన్ హరింప ని
ల్లే సమరాన నిల్వమని • యేపున లక్ష్మణుఁ దేసెఁ దూపులన్.

తే॥ వర్షముంబోలెఁ బఱపిన • బాణచయముఁ, దొలఁగఁజేసి సౌమిత్రిని • తూణమందు
శరము లెత్తనీయక చేసి • మెఱసె ధర్మ, మెల్లఁజదివియు మఱచు లం • కేశ్వరుండు

## హనుమ ద్రావణ ముష్టియుద్ధము

ఉ॥ అత్తఱి సౌమ్మదేఱిన మ • హాబల నందనుఁ డదువచ్చి దు
ర్మత్తుఁడ! నీచమాయలను • మానుము పందువుగూర్తు విప్తు నీ
కెత్తిన కాలదండమిది • యేత్తెఱ గల్గిన వాఁడవేని నీ
చిత్తము వేఱువంకలటుఁ • జేర్చక చూడుము నన్ను రావణా!

చ॥ గెలిచితి మూఁడులోకముల • గెల్చితి దిక్కులనెల్ల వ్రేల్మిడిన్
గలఁచిలి వింద్రుకీర్తి కల • కాలము చెల్లద యొక్కతీరుగా
నలఁచెదఁజూడు నేఁడిట వి • నాశము తప్పదు నీకు నంచు న
గ్గలికముతోఁ ద్రివిక్రముని • కైవడి లాయుచుఁ గేలు సాఁచుచున్.

శా॥ చాపాద్యాయుధవిద్యలెల్లను విశే • షస్ఫూర్తి సాధించి తీ
వేపారంగ భుజంబు లిన్ని యలిశా • యిత్వంబునం బొంది దో
ర్వ్యాపారాంచిత సత్త్వముం గలిగి వి • క్రాంతిన్ విజృంభించి న
న్నేఁప న్నిల్చితి విల్వు మన్నిటిని మా • యింతున్ వెసన్ ముష్టిచేన్

చ॥ పలుకులచే ఫలంబు గను • పట్టదు దిగ్గజ శంభుశైలముల్
బలువిడి నోర్చు ధీర! యొక • పాటిది కింగిరి కోఁలి ముష్టికిన్
న్నిలుతువె, నిల్చితేని విను • నీ పిడిపోటున కిత్తు తొమ్మి నీ
బలమున కోర్తుఁ గాని మఱి • వాఁడిమి చూపఁ దలంప నీయెడన్.

చ॥ అనవుడుఁ బంక్తికంరుఁ డని • లాత్మజు పల్కుల సన్నుతించి నీ
గొనములఁ మెచ్చఁగూడుఁ బలు • కుల్ మగపాడికిఁ దగ్గయట్టి నీ
యనువున నీవుగాక మఱి • యన్యుఁడు నాయెదురన్ వచించునే?
ఘనమగు నీదు కీర్తికి జ • గంబులె కొల్వఁగఁ గొల్తకోంబలా!

చ॥ అసదృశ వీరపుంగవుఁడ • వాయుధ మొక్కటి లేక దైత్యులన్
వసమఱఁ జంపినాఁడవు త • పంబునఁ బొందిన చాంఖడ్గముల్
దెసలు భ్రమింపఁబట్టి పెను • తేరున నెక్కిన నాదు సన్నిధిన్
మసలక పల్కి నిల్చిన ఘ • నుల్ వినువోలెడు వార లుందురే?

చ॥ క్రతుభుజు లాదిగాఁగఁ ద్రిజ • గంబులఁ దిక్కులు దక్క నెవ్వరున్
బ్రతుకకఁగఁ గోరువారు బవ • రంబున నన్నెదిరించి నిల్తురే?
కొతుకక నిల్చి వక్షమునఁ • గ్రుమ్ముమటంచు వచించి తిట్లు ధీ
రత నివి పల్కఁగాఁ దగిన • ప్రజ్ఞలుగావు మహాబలాత్మజా!

తే॥ చేతు లిరువది కీర్తి గాం • చినవి కలవు, శయము లోకరెండె నీకుఁ గే • సరి కుమార!
కలుదులాడితి జయమింత • కంటెఁ గలదె? పగిలి నీతోడఁ బోరుట • తగవుకాదు.

తే॥ దిక్కులం గెలిచిన కీర్తి • తెలుఁగుమాయ, నింతకంటె వేఱొండునా • కింక గలదె?
బాలు వజ నేలంబెట్టి • కాలరాచి, నట్టిపైరి నామున్నిట్టు • లాడుచుండె?

ఉ॥ పగ్గెలు పల్కినాఁడ విటు • పల్కుట సాజమె మాటెఁ గాలమున్
స్రగ్గిన మాఱుపల్కినఁ బో • సంగెడు లాభములేదు ఋట్టుచే
సిగ్గిలి నిన్నెదుర్ప నిక • సించుసనుంటి జగంబు చూడఁగా
మ్రొగ్గక వచ్చి నీదు పిడి • పోటునఁ గ్రుమ్మము తొమ్ముమూపెద॥

తే॥ అసురవిభుఁ డిట్టులాడ మే • లనుచు హనుమ, లీలఁ దేరిపై కుఱికి నే • త్రాల మిడుఁగు
ఱురల సరులతోఁగ వచంబు • నొదలు పొడిగఁ, బడఁగ వక్షమ్ముఁ బొడిచెను • వజ్రముష్టి.

తే॥ కొండ లిసుకయై రాలిన • కొమరుదాల్చె, పెరుఁగువలెనై మెదడువచ్చి • వెలికినుఱికెఁ
దలలు పదియును మెడలపై • నిలువలేక, వ్రాలె నసురుల జీవములు • వ్రాలెఁదోఁడ.

ఉ॥ జాఱెను వీరసాహసము • జాఱె గుణంబులు జాఱె ఖడ్గముల్
జాఱె మసస్థిరత్వమును • జాఱె జయాశయ మున్నుత్సుకత్వమున్
జాఱె శరీర దార్ఢ్యమును • జాఱె దెగింపును జాఱె దేజమున్
జాఱెఁ బరాక్రమంబు దను • జ ప్రభు తొమ్ముస నిప్పు జాఱఁగ॥

తే॥ ముష్టిపోటునే నురముగ్గు • ముక్క విఱిగి, నాటియుండిన దిజ్మన • నాగదంత
ములను దశవదను యురంబు • వలెనె వాని, వీఁపునన్ దుస్సి పుటుకున • వెలికివచ్చె.

చ॥ చిరిఁగిన కంఠటంబున ఖ • చింపిన రత్నచయంబు రిక్కల
ట్లురవడి దిక్కులం బడచె • నుల్లమునందలి ప్రాణవాయు సం
చరణము తగ్గ రావణుఁడు • శైలము తల్లడమందు భంగి ని
బ్బర మొకింత లేక గరు • వంబు చెడం బలియించె మిక్కిలిన్.

చ॥ అమరులు సంతసిల్లి కడు • హర్ష రవంబులు సేసి స్వర్ణ పు
ష్పములను చల్లి దీవనలు • పల్కిరి రక్కసు లీర్ష్యనొంది రు
ల్లముల ముదాతిరేకమున • లంగలు వేయుచుఁ గీశరాజి పం
క్తిముఖుని కీర్తి మాసెనని • కేకలు వైచెను మైగగుర్పుతోన్.

తే॥ వహ్ని నైజ గుణము ప్రాణ • వాయు గుణము, ననుభవించి యెఱింగిన • ఘనులు, వేఱు
తనువునం జొచ్చి క్రమ్మఱఁ • దమ తనువునఁ, జేరుకరణి రావణుఁడు మూ • ర్ఛిల్లి తెలిసె.

తే॥ తెలివినొంది యూరుపుపుచ్చి • తెరలి నోట, మాట రాక యుఱిమిచూచి • సాటిలేని
మేటిమగని మారుతిఁగని • మిడుకకింక, మద్బలంబును చవిచూడు • మా కపీంద్ర!

చ॥ జగతిఁగలట్టి సర్వబల • శక్తులు నీయెడఁగల్గు! నీవ పో
మగల మగండవౌదు హను • మంత! కృతాంతుని చూచివచ్చితిన్

దుగినఁడె వచ్చి నీవు భయ • దుఃఖములొందెదవన్న సుఖతయున్
బెగడని యేను నీవలస • భీతి నెఱింగిలి సంచలించిలిన్.

ఉ॥ నిక్కము నన్ను గెల్చిన సు • నిశ్చల విక్రమ శాలివైతి: వే
ఱొక్కటియేల? నిల్వుము స • ముల్కట మక్కర ముష్టి ఘాతముల్
దక్కక పైఁచి టీపముల • దార్చిలిపేనియు నింతదాఁక ని
న్నక్కటలో నుతించిన న • మస్తము నిశ్చయమంచు సమ్మెదన్.

చ॥ అనుదు మరుత్సుతుండు బిడి • యంబును బొందెద నీవు జీవివై
ననుగని మాటలాడు కతి • నన్ జయమొందినవాఁడవే చుమీ
మొనసి మదీయ ముష్టి హతిఁ • బొంది మరింపక నిల్చి నా బలం
బును వినుతించు దిట్టరిని • మున్నొకసారియుఁ జూడ నెచ్చటన్.

ఆ॥ అప్పుడీర్చికొనుము • యని బొమ్మ చూప ద, శాననుండు పెదవు • లంటఁ గొఱికి
విడుదకేలు మిగులఁ • బొదవుగాఁజాఁచి పా, వని యురమ్ముఁ బొడిచె • బద్ధముష్టి.

ఆ॥ విలయమందుఁ జెదని • విజ్ఞానమతి జగ, త్ప్రాణసుతుఁడు పంక్తి • వదనుబలము
మునుపుగన్న రజత • ఘాధ్రంబుకై పడి, వాని పోటువలనఁ • బల్లటిల్లె.

ఉ॥ తూఁగ వాయుసూతి ఐవి • యూలెను ధర్మము తూలె సత్యముం
దూలెను సద్గుణావళియుఁ • దూలెను కీర్తియుఁ దూలె వేదముల్
తూలెను నీతియున్ దయయుఁ • దూలె దపంబును యూలె భూమియుం
దూలెను బంచభూతములు • తూలెను తూలె సమస్త సత్కృతుల్.

క॥ అక్కడఁగల కపివరు లపు, డొక్కొక రొక్కొక్క నగము • నొగిఁదెచ్చి వడిన్
రక్కసుఁజేనిపై బయ, లెక్కడిఁ గనరాక మూసరి • యేసిరి కడిమిన్.

క॥ బలసంపన్నులు ప్లవగులు, విలయాబ్దముభంగి నింగి • పిక్కటిలఁగ న
ద్రుల వైవ వియచ్చరు లొ, త్తిలి చెచ్చెర నవ్వలికి నొ • దింగిరి భీతిన్.

తే॥ మింటఁ జోటు లేకొంచొంచు • గెంటికొనుచు, నవ్వలికిఁబోక నిలిచె నా • యద్రిచయము
తరణి మఱుఁగయ్యె జగముల • నిరులుమ్రింగె, రక్కసులు తగ్గిరని సురల్ • క్రమ్మిరవల.

తే॥ కొండ లొకటిపై నొక్కటి • కూలి విఱుగ, మిడుఁగుఱులు లేవ మెఱుపులు • మెఱయఁ బిడుగు
లట్లుదాఁకి శిలావృష్టి • యట్లు రామ, భద్రు దివ్యాస్త్రవర్షంబు • పగిదిఁ గురిసె

తే॥ కర్బురుల పెనుసైన్యంబు • కలఁగి చెదరి, మలఁగె మింటిరిక్కలలో వి • మానపంక్తి
రాలె మిడుఁగుఱుచే నద్రి • క్రాఁగి మీలు, తేలి సోఁకుల కనుగ్రుడ్లు • లీలనుండె.

ఉ॥ లోకము నేఁడె తూలెనని • లొగ్గడిఁ గల్గిన రావ మేల్లెడం
ద్రాఁక గ రావణుండు విని • పట్టని రోషభరంబునన్ సురా
స్తోక యశోవిభూతులను • చూఱలు వెట్టిన దొడ్డవిల్లు బిం
బాకృతిఁదోఁపఁ దూపు లొల • యం బఱపించి చెదర్చె నన్నిటిన్.

ఉ॥ అమ్ములు విండ్లు తుండ్లుగ హ • యమ్ములు ప్రమందఁగ వారణమ్ము ల
ప్పమ్ములుగాఁగ సింహ శర • భమ్ములు వ్యాఘ్రము లా రణస్థలిన్
దమ్ముగఁజేసి కుప్పలుగఁ • దార్కొను పర్వతముల్ కుజంబులున్
దుమ్మయి గాలిలోఁగలియఁ • దూఱె దశాస్యుని యంపవానచే

క॥ ఔరా: తీరగు శరసం, చారము: గిరి యొకటి లక్ష • శకలము లయ్యెన్
సౌరగు కర లాఘవ మ, య్యారే: యని విప్రిచికొనిరి • హస్తము లమరుల్

తే॥ పంక్తిముఖుచేవ పగ్గము • పాడుచేయ, హరులు వైచిన గిరులఁ ద • చ్ఛరము లడరి
త్రుంచి యన్నిదెసల వార్ధి • ముంచివైచె, నేల నెత్రు గప్పెను మేల • ధూళిగప్పె.

క॥ వానరులతోడ నేఁడే, మానిసు లిర్వురను రూపు • మాపెద ననుచున్
దానవవిభుఁ డుగ్రుండై, పూనెం బది యొడమ కేలఁ • బౌరిఁ బదివిండ్లన్
పది దీర్ఘ బాహువులతో, బది ధనువులవంచి పదులు • పదులుగ నమ్ముల్
వదలి దశదిశలు కదలియుఁ, గదిరి శరమయముగఁ బంక్తి • కంఠుఁ డొనర్చెన్

క॥ పౌలిసెను కపిసైన్యము కు, ప్పలుగా నాకుప్పలపయి • ప్రాలె వనదముల్
పౌలికలను రక్తమయమై, వెలసెను సాయంతనంపు • విన్ను విదమునన్.

సీ॥ నిలువంగ లేఁడయ్యె • నీలుండు నడవలేఁ, డయ్యె నలుఁడు లేవఁ • డయ్యె గజుఁడు
కొలుఁ గానఁగలేదు • గవయుఁ డంగదుఁడును, జీవించునా యను • స్థితి భజించె
చలియింపలేఁడయ్యె • జాంబవంతుఁడు కొఱ, మాలి పడియె గంధ • మాదనుండు
గువ్వరీతి ముడింగి • కుడికిలె శతబలి, పనసుని మెడ లూలి • పడుచునుండె

తే॥ మఱియుఁగల గొప్పవీరులు • నెఱఁకులంటఁ, దెఱ మాసిరి కూలిరి • తికమకపడి
పాఱి రదిగని సౌమిత్రి • భయదరోష, భీషణాకృతిలో విజృం • భించి నడచి

తే॥ రావణుఁడు వైచినట్టి శ • రప్రకర్ష, మడఁచి వాని యహంకార • మడఁగఁ బది శ
రాసనమ్ములఁ బదితూపు • లేసిత్రుంచి, దనుజు లదరంగ సింహ నా • దమ్ముచేసె.

తే॥ వేలుపులు వాలి మోదించి • కేలుతట్టి, విరులు చల్లిరి మునులు దీ • వించినారు
ధర్మదేవత యుత్సుక • త్వమున నాడె, మెచ్చె లంకేశ్వరుండు సౌ • మిత్రి నేర్పు.

తే॥ మేలు సంగరోత్సాహంబు, మేలువిద్య!, మేలు రణకార్య పద్ధతి! మేలు తెంపు.
మేలు కర లాఘవంబును! మేలు నేర్పు! మెలనుచు మెచ్చె ముక్కుపై • వ్రేలుచేర్చి.

ఉ॥ దండకలో ఖరాదుల మ • దంబు నడంచిన రాఘవుండు నా
ఖండలు వ్రేల్మిడిన్ రణ ము • ఖంబున గెల్చిన నాసుతుండు ను
ద్దండ శరాసనంబు బెడి • దంబుగఁ దాల్చిన యేను దక్క బ్ర
హ్మాండమునందు లేరు సమ • రావని నీ సరివచ్చు దిట్టరుల్

## రావణశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

తే॥ అనుచు వింటిచే గెలుపంగ • ననుపుగాఁగ, బంపు వీనిని విమువరా • దంచు నసుర
ధాత యొసఁగిన శక్తి హ • స్తమునఁ గొనుచు, వైచె లక్ష్మణుపై నెల్ల • వారు బెగడ.

ఉ॥ వైచిన శక్తి లక్ష్మణుని • వాఁ నికాయములెల్ల లింగాఁ
బూచిక లట్లు త్రుంచుచును • పోయి యురమ్మున నాటె దాని పై
గాచిక శక్తిఁగన్న గుణ • గారి యురమ్మున వ్రాలి మూర్ఛిలెన్
మోచిన చింతలోఁ గపుల • మున్చిరి రాల్చిరి సోఁప యుబ్బుమై

తే॥ ఎల్లసురలును దమసొమ్మ • కొల్లపోయి, నట్లు వెలవెలపోయి ర • వ్యాహితమున
మునులు విసిగిరి ధర్మ చిం • తనమునందు, ధరణి ఠరిగెను మార్వదెఁ • దరణికాంతి.

తే॥ దీని కిలఁడు జంకఁగ లేదు • త్రెక్కలేదు, మూర్ఛపోయినాఁడని వ • ముఖు దెఱింగి
యితని మేను గైకొని లంక • నేగెదనని, క్రూరచిత్తుఁడై దిగివచ్చెఁ • దేరినుండి.

తే॥ బాహు లిర్వదింటను కవ్వి • పట్టి మున్ను, రాజగిరి నెత్తుటకు సిగ్గు • మీఱ నిపుడు
మేరుగిరి నెత్తఁబూనిన • తీరువోలె, నెత్తె బలమెల్లఁ జూపి సం • ధ్లింకఁజెచి.

తే॥ తాను పిరంబయండను • జ్ఞానగరిమ, మానసున్న హేతువున రా • మానుజుండు
శివ నగంబును చరియింప • జేసినట్టి, హస్తముల నెత్తరాని వాఁ • డయ్యె నపుడు.

తే॥ దశముఖుఁడు కదలిఁ బోనెను, వరముఖ హస్తంబు లబ్బి • లింగఁగుఁ బోలెన్
దశరథ సూనుఁడు సాగర, శిల వసఁదగు శిలిని పోలి • చెలఁగెం జూడఁగా.

తే॥ ఎత్తయత్నించి కదలింప • నెమ్మిపడక, యూర్పువిడుచు పేశొక్కఁ చో • నున్న హనుమ
కని కటాలున వచ్చి రా • వణుని గెంటి, యవ్వలికిఁ గొనిపోయె రా • మానుజన్మ.

ఉ॥ పావని జ్ఞానులం పడక • పావనుఁ • దొటను లక్ష్మణాఖ్యుఁ డా
త్రిపదుఁదాటవే మమెమఁ ద్రేమమంబును పొద్దదాల సం
భావిత భక్తిచేతఁ బసి • పావను తల్లి వహించు కైవడిం
గైవడిఁ గొంచుఁ బోయె • రఘు కాంతుని సన్నిధికిన్ రయంబునన్.

## రామ రావణ ప్రథమ యుద్ధము

తే॥ జానకీవిభు దాసి ల • క్ష్మణుని వింటు, నంత నరఁడును తెలివంది • యంరి లేచె
రాముఁ డప్పుడు లయకాల • భీము భంగి, నదరి రావణుతోఁ బోరు • నడప నడచె.

తే॥ దంతిమీఁ దికి లంఘింపఁ • దలఁచు సింగ, మట్లు రాముఁడు వచ్చుట • యసురవిభుఁడు
గాంచి రాఘవు నెదుటికిఁ • గనక రథము, పోవనిచ్చె సుశ్శాహంబు • పొదలుచుండ.

క॥ రణకోవిదుఁడగు దానవ, గణనాథుఁడు తేరిమీఁద ఁ గ్రాలఁగ సమరాం
గణమున రాముఁడు నేలం, గనఁక నిలుచు టనుపెఁ యనుచుఁ గదలె హనుమఁడున్.

। తనకు మున్నొసంగిన గంగఁ • దలను దాల్చి, పావనుండైన శంభుండు • పాపివిత
మలయుచోఁ బదచారియౌ • మామఁ గాంచి, యూరకుండుట తలఁపంగ • మేరయౌనె?

॥ అసమరీతి రణముసేయ • నసుర తేరి, పై వెలయ నేల నీవుంట • పాడిగాదు
సేవకుఁడనగు నాభుజ • శిఖరియందు. కూరుచుండుమ యని వేఁడు • కొనియె హనుమ.

। మంచిదని రామవిభుఁ డెక్కె • సంచితముగఁ, గొండపై నెక్కుసింగంబు • కొమరుదోఁప
గనిన బిడ్డను మోచిన • జనని పగిది హనుమ యలరె సురాలి దీ • వనలు చేసె.

। అలత్రివిక్రమ రూపంబు • నరసియున్న, హనుమఁ డతి యానందంబు • నందఁగాంచి
శ్రీహరికి వాహన శయన • శ్రీలఁదాల్చు, గరుడి లజ్జించె శేషుండు • శిరము వంచె.

ఉ॥ మారుతి క్షీరవారిధి క్ర • మంబున నొప్పె రఘూద్వహుండు నా
క్షీరపయోధిశాయి యనఁ • జెన్నగు నన్నను యోగ నిద్రకుం
దారఁడు; వాయుసూతి శ్రుతి • తండము వేదశిరోర్థ మా ధరా
జారమణుండనంగఁ దగు • సామ్యము చొప్పడు నిశ్చయంబుగన్.

। మఱియుఁ జూడంగ నాహను • మంతుఁ డొప్పె. సకలలోకమూలంబగు • ప్రకృతినాఁగ
రామభూపాలుఁడొప్పెఁద • త్ప్రకృతి శక్తి, కరయ మూలకారణ విరా • ట్పురుషుఁడనఁగ

॥ వనజజాండంబు లెల్ల గ • ర్భమునఁ గొన్న. దాశరధికిఁ గావలయు ష • ద్ధతులఁ దిరుగు
మారుతి భుజాగ్రదేశంబు • మేరుశిఖరి, నెనసె నన్న న్యూనోపమ • మే ఘటించు.

॥ ధర్మదేవత మోద స • ్తనముచేసె, ఋషులు కేలెత్తి దీవన • లిచ్చిరారు
బ్రహ్మరుద్రాది దేవతల్ • రణము చూడ, వచ్చి ఓంట మూఁగిరి రఘు • వరుఁడు కదియ.

॥ సంగరోన్ముఖుఁడగు రామ • చంద్రుఁడపుడు, కేలఁగోదండగుణము లా • గిన రవంబు
దివియు భువియు సపస్తంబు • తివిరి క్రుంగు, రుద్రమూర్తి సేయు మృగేంద్ర • రుతముఁబోలె.

॥ యక్షులును రాక్షసులును బ్రా • ణా నిలములు, వీడకున్నను నిలుకడ • యూడి నాల్క
లెండఁ గలఁగిరి మలఁగిరి • యండచయము. నెలవు దప్పె బ్రహ్మాదుః • తలలు నాడె.

॥ విద్రుమ వర్ణముక్ • విలయాగ్ని నిచములు, జలధి నీటిని ద్రావఁ • జాలినవియు
దిక్కులఁ గొలువంగఁ • దివురునవియు మింటి. మంటిని తొలువ స • మర్థములయి
యదరు నేదమ్ముల • నసురవిభుండేసె, వాని నేదమ్ముల • వనజ నయనుఁ
డేదేసి తుండ్లుగా • నెడలించి యొక్క సా, రిగ నైదు తూపుల • మొగిఁ దొడింగి

॥ పరప దశకంధరుఁడు నైదు • శరములేసి, నడుమనేత్రుంచి మఱి • పది తొడుఁగులంట
నీడ్చి విడువంగ సూర్యకు • లేశ్వరుండు, విశిఖ దశకమ్ముచే వాని • విఱిచివైచె.

॥ దగ్గఱగనున్న రావణు • దండువైచు, నాయుధమ్ము లన్నిటిని పె • క్కమ్ములేసి
వెండి వైచినఁ దొడిచేసి • వీరమస్త, కావళుల నొక తిట్టగాఁ • ద్రోవుచేసె.

తే॥ సైన్యనాధులేసిన యస్త్ర • జాలములను, రాఘవాగ్రజుమ్మల వాన • రాపళిపయిఁ
జెదరనీయక తొలఁగించి • శిత శరముల, సంగరతుల మస్తములు దు • ల్లంగనేసె.

చ॥ ఘనతర రామబాణముల • గంటెను దెందమురంబెఁ దొందరన్
జను హనుమానుఁ డీధర నె • నంగెడివాఁ డనుసంటలో నభం
బునఁ గనుపట్టు రావణుని • ముందరఁ దోఁచు నెదంద యద్ద్క న
ద్దనుజుల కన్నులందు బెడి • దంబుగ వెక్కసమై కనంబడున్.

ఉ॥ ఆడఁదొడంగె నట్టలను • వందఁగ వేదురిలోఁ బిశాచముల్
పాడఁదొడంగెఁ గంకములు • ప్రబ్బి వియత్తలమెల్లఁ జుట్టి ప్రో
పాడఁదొడంగెఁ దీనుఁగుల • యంగములం గొని నెత్రు రోయధిం
గూడఁదొడంగె రాహు శిత • ఘోర శిలీముఖ రాజి పర్వఁగన్

తే॥ చక్రములు ఖండములయియ • క్షములువిఱిగి, ఖరుపు లురలి ధ్వజంబులు • కెరలి కేరు
బారు లెడసి చార్మాలుగఁ • బడియెఁ గరులు, తుండములు తెగిపడెఁ గొండ • పిండులట్లు

తే॥ బండ్లువోవ విండ్లునుపోవఁ • బండ్లువోవఁ, గరులువోవ హరులువోవఁ • గంకటములు
పోవ శౌర్యంబుపోవ గ • ర్వరులు తుదకుఁ, దలలువోవఁ గూలిరి రణ • స్థలమునందు

తే॥ సుతసుమధ్యలు రణభూమిఁ • బతుల తలలు, కపుల హరుల తలలు నౌక • కరణినుండి
దెలియనేరక తచ్ఛిరం • బులను చేర్చి, కొనుచు నేడ్చి యేడ్చి యపటఁ • గూలినారు.

చ॥ అడఁగెను సింహనాదము ల • హంకృతు లాఁగెఁ జిరాకు చూఁపులున్
మడఁగెను ధూళియున్ డిగియె • మందటిలెన్ బహుళాయుధా టపం
బుడిగెను టంకృతుల్ కదచె • నుత్కట ఘీంకృతులీఁగె హేషలున్
ముడిఁగెను సైన్యముల్ దనుజ • ముఖ్యుఁ డొకండయి నిల్చె నాజిలో

తే॥ నాల్గు విధముల సేనలు • నలఁగి చనిఁగి, యొడుదుడుకుగాఁగఁ గొండల • వడువుదోఁప
నున్న శవరాసులను జూచి • యుడికి యసుర, వరుఁడు బుస్కొట్టసాగె న • ప్పంబుపగిది

తే॥ నారి నాకర్ణముగ లాగి • ఘోర శరము, లేసి రాముని భుజముల • గాసిపఱుప
నతఁడు చిఱునవ్వుతోడ సు • రాంతకు ధను, వైదు తుండ్లుగ విఱిచె నై • దంబకముల

తే॥ వేఱువిల్లందుకొని యెక్కు • వెట్టునంత, రామవిభుఁ దదియును త్రుంచి • రాక్షసేంద్రు
పవన జవన తురంగమ • పంక్తిఁ గూల్చి, సారథిని చంపివైచె ని • ర్జరులు పొగడ.

తే॥ అసురమఱియు వేఱొకటైదు • వందికొనెడు, నంతలోనదుమన త్రుంచి • స్యందనమును
గొడుగు తోడధ్వజము తోడఁ • గూల్చివాని, దృఢతనుత్రాణమునుగూడఁ • ద్రెంచివైచె.

తే॥ వేఱువేఱు తేరులు వచ్చి • చేరుచుండ, నెక్కనీయగ నదుమ మా • యించుచుండె
రాఘవుఁడు, రావణుఁడును • రౌద్రమూర్తి, యయ్యె మృత్యువు నటియించు • నాజియందు

తే॥ రత్న ఖచితమ్మలైన శీ • ర్షకములపయిఁ, బదిఁకోరిలఁ బఱప భా • స్వరునిమీఁది
కెగయు హనుమనికైవడి • నేగి విశిఖ, దశక మవ్వాని దోర్చె నం • సంభ్రమునఁ బడఁ

తే॥ మణుల కాంతులు దిక్కుల • మలయుచుండ, జలధిఁబడిన దైత్యేంద్రు శీ • ర్షకములపుడు
నిగుడు చండ ప్రభంజన • నిహతిచేతఁ, గూలు మేరువు శిఖరాల • లీలఁ దోఁచె.

క॥ రామని విశాత బాణము, లా ముకుటములఁ గొనిపోయి • యబ్ధిని విడుటల్.
ధామనిధిఁ గొంచు రాహువు, దీమసమున జలధిఁ ద్రోచు • తెఱఁగున నొప్పెన్

క॥ అపజయ మెన్నఁడు నెఱుఁగని, కృపణుఁడు మకుటముల నీఁగి • కీర్తియుఁ జెడఁగాఁ
దపన నిశాకరు లలఁని, యపకృష్టాహర్నిశముల • యనువున నొప్పెన్

తే॥ మకుటములఁ గోలుపడు దశ • మస్తకుండు, ప్రతిభటాఖిల గురుత ను • న్నతుఁడెయ్యెనఁ
బ్రవిమలాత్మకుఁడైన సు • కవి శపింపఁ, బ్రథితకీర్తిని కోల్పోవు • ప్రభువుఁబోలె.

ఉ॥ క్రిందికిఁ జూచు కన్నులును • కీడ్పడు మోమును రిత్తకేలు ప్రే
లం దిగి యూడమట్టి యన • లంబు శరీరమతోడ నున్న దై
త్యేంద్రు డధర్మచారులకు • నిట్టిదె పాటని లోకులెల్లఁ బ
ల్కం దలవంచి నేలపయిఁ • గాలను రాచుచు నిల్చె నచ్చటన్.

తే॥ అట్లు నిలిచిన రావణు • నరసి ధీర, వరుఁడు సుగుణుండు రాముండు • వట్టికేల
నున్న వాడఁని చంపంగ • నుల్లమందు, తలఁప కిట్లని పల్కె నౌ • దార్యఫణితి.

ఉ॥ ధర్మపథంబు ద్రొక్కక య • ధర్మవిధంబున సంచరించు దు
ష్కర్ములు వేల్పులైనను య • శంబు జయంబును గాంచ శక్యమే ?
దోర్మద ముజ్జగిల్లెనె ? వి • ధూత బలుండవు నిన్ను చంప నీ
యర్మిలివారిఁ గూడుకొని • యందుము సౌఖ్యములెల్ల నేటిఁకే.

శా॥ నీవంశస్థులతోఁ గుమారకులతో • స్నిగ్ధాళితో వెందియుం
జేవంగల్గిన సేనతోఁ దొడరి యు • ద్రేకంబుతో నెల్లి ర
మ్మీ వేళం బెనుపోరునం దలసి నీ • యేపుం బ్రపూర్ణంబుగా
నావంకం గనిపింపవైతి వది గా • నంగోరియే వీడితిన్

మ॥ సమరోత్సాహము గల్గునేని కడఁకన్ • సైన్యంబుతో రమ్ము ప్రా
ణములం దాఁపఁ దలంతువే జనక క • న్యం దెచ్చి యొప్పించి రా
జ్యము నీతమ్మునకిచ్చి కొల్వు మతనిన్ • జాకుంటకున్ వేఱు మా
ర్గము లే దెన్ని విధాలఁ జూచినను ని • క్కంబిద్ది లంకేశ్వరా ?

మ॥ దురమే సేయఁదలంతువేని బలసం దోహంబు చేకూర్చుకొం
చిరవారన్ శ్రమదీర్చికొంచు వది నా • యత్రంబుగా రేపె నీ
శిరముల్ నాశరపాళి కాహుతిగ న • ర్పింపంగ రమ్మింక ని
ల్వరమున్ లేదు నిజంబు మాయలును చె • ల్లంబోవు రక్షోధిపా !.

తే॥ నేఁడుకాంచితే గాలికి • నెగయు దూది, పింజలట్టులు నీసేన • విఱిగి కలఁగి
కూలుటలు నేఁటికేగి రే • పాలమునకు, రమ్మనుచుఁ గరుణాళుఁడై • రాముఁడనఁగ.

## 14. కుంభకర్ణ వధ పటలము. (363)

సీ॥ దిగ్గజంబుల పోటు • లివిరి యోర్చిన యొమ్ము, కైలాసమెత్తిన • ఘన భుజములు
జగడాల తపసి మె • చ్చఁగఁ బాడు నాల్కయు, శివుఁడిచ్చు కత్తియు • శీర్షకములు
శౌర్య సంపదయును • సంగరస్థలి వీడి, త్రిజగంబు లేలిన • దితిజ విభుఁడు
తలయెత్తనీని యు • త్తలపాటుతో భంగ, పాటుతో బిడియంపు • బరువుతోడ

తే॥ భటులఁ గన్నెత్తి చూడక • పట్టఁ జేరు, సుతులఁ బ్రేమను కాంచక • సతులఁ గనక
పరవి యున్న సేననుగూడఁ • బాటిగొనక, వెంటవచ్చు వారలను భా • వింపకేగె.

తే॥ కమలవదనల కనులు ఖ • డ్గములపోల్కిఁ, గష్టములె కూర్చెసుతుల వా • క్యములు రామ
బాణములవలె నొంచెఁ జె • ల్వల పయోధ, రములు తన భుజములవలెఁ • బ్రమద మిడవు

తే॥ మంత్రములు తెల్పువృద్ధులు • మందయాన, లైన భార్యలు సైన్యనా • యకులు బంధు
హితులు ప్రతిమలవలె నిల్వ • దితిజవిభుఁడు, దంతివలె నేగి చేరె నం • తఃపురంబు

తే॥ అచట నొక పైఁడిపీఁటపై • నమరి చింత, యించుకంత కుదించి యో • చించి పిదవ
గంచుకిని పిల్చి వేగ వే • గరులఁ దోడి, తెమ్మనుచు నాజ్ఞయిడ వాఁడు • తీవ్రగతిని.

తే॥ వెడలి వాయువేగుఁడుమరు • తుఁడు మనోగ, తియుమహామేఘుఁడాదిగాఁ • దెలివి గలుగు
దూతల నసంఖ్యజనములఁ • దోడితేర, వారలకు రావణుం డాజ్ఞ • వఱలఁజేసి.

తే॥ ఏడుదీవులయందు మ • హీధరములఁ, జక్రవాళంబు మీఁదను • సర్వభువన
మందుగల రాక్షసుల వడి • నరుగుదేర, నాజ్ఞ దెలిపి తోతెండని • యనిపి వారి.

చ॥ క్రమముగ నాజ్ఞమోచి యుడి • గంబులు సేయు త్రిలోకవాసులన్
దమవిభు భావమిద్దియని • తత్పరతన్ గమనింపలేక డెం
దములఁ దపింప రామ కర • దారుణ వేదన నోర్వలేక నా
గము తనసెజ్జఁ జేరుక్రియఁ • గర్బురనాథుఁడు చేరె శయ్యకున్.

ఉ॥ సుందరియైన జానకి వ • సుంధరపుత్త్రిక నిండియున్న యా
డెందమునందు నిండుగ బి • డెంబు గదల్కొనఁ దోడఁ జింతయున్
గ్రందుగఁ జేర నించుకయుఁ • గట్టిఁడి కూరుకురాక లోపలన్
గుందుచు భంగపాటు వెలి • గొల్పఁగ గొప్పగ నిశ్వసించుచున్.

ఉ॥ పాటిన వేలుపుల్ నరులు • పల్చన నవ్వుదురంచు శాత్రవుల్
మీఱఁగ నవ్వ వారనుచు • మెట్టుకు సిగ్గు వహింపఁబోఁడు లం
కా రమణుండు సీత నగుఁగా • యని మిక్కిలిగాఁ దపించె నౌ
నారులు నవ్వ సైఁపనగు • నా మగవారికి విల్వరంబునన్?

ఆ॥ అంత నసుర తాత • యగు మాల్యవంతుండు, వృద్ధ మేను విల్లు • విధము వంగ
రావణునకు నగు ప • రాభవంబును విని, వచ్చి కూరుచుండి • వానివజ్జ.

ఉ॥ వాని పరిస్థితిన్ దిగులు • వాఱ నెగాదిగఁ జూచి చూచి య
క్షీణ తపోనిధీ! కడిమి • చేడ్పడ ముమ్మరమైన ఘోరునం
దూనితి నోటునంచు దిగు • లొంది కృశించెదె? యేమియయ్యె? నా
మానవు లెట్టిరో? తెలుపు • మా విన నామది తత్తఱించెడిన్.

ఉ॥ మనసును మేను కన్నులును • మండఁగ శర్కరయైన ద్రాక్షయై
నను రుచి గానలేని వహి • నాలుకయెండఁగ దైత్యనాథుఁ డి
ట్లనియెను తాపసాకృతుల • నందిన మర్త్యులతో రణంబు కూ
రెను మన వంశగౌరవము • ప్రీలెను నాస్థితి గోడిగంబుగాన్.

## రావణుఁడు మాల్యవంతునకు రాముని పరాక్రమాదులు తెలుపుట

క॥ తాతా! రుద్రుఁడు మొదలుగ, నాతత లోకముల వార • లందఱు పెలుచన్
నాతోడైన సుమిత్రా, జాతుని బాణముల కాగఁ • జాలరు వింటే.

చ॥ సమరమునం దగణ్యమగు • సైన్య కదంబము రూపుమాపుచో
దమధమునూన్చి మోటమిని • దార్చెడుచో నులిమట్టి యుండలన్
డమకముతోడ సుంధరకుఁ • దౌలఁగ నేసిన నాఁటి లీల చం
దమునన యుండె గాని భయ • దస్థితిఁ దాల్పఁడు రాముఁ డయ్యెడన్.

ఉ॥ రాక్షససేన దట్టమయి • క్రాలిన లక్ష్యము దప్పకుండు రా
మాక్షయ బాణసంఘము శ • తాంగ తురంగ మతంగజాదులన్
బక్ష శిరోధి మధ్య కర • పాదములన్ వడిఁ ద్రుంచుఁగాక యే
క క్షణమైన నేమెడను • గాఁడుచు డుయ్యక యందు నిల్చునే?.

ఉ॥ రాముని చేతినుండి ప్రద • రంబులు వెల్వడు పిమ్మటన్ జగ
త్ప్రేమముఁ జొప్పఁగాని వెను • ద్రొక్కవు కల్పము దాఁటవచ్చుఁ ద
ద్భీమ శరప్రఘాతములు • వీదవు దిక్కులఁ గాల్చు మాఱు ప
ల్కేమనఁ గాల్చు వైర మెద • నెంచినఁ గాల్చు లయాగ్నిఁ గాలుచున్.

ఉ॥ మేరువుఁ జీల్చుమన్న వడి • బంటిని రంధ్రము సేయుమన్న నీ
ధారణి వ్రచ్చుమన్న జల • దంబుఁ జెదర్పుమయన్న వారిధిన్
నీరముఁ ద్రావుమన్నఁ దన నిస్తుల సాయకపాళి శక్తికిన్
నేరుపుగాఁగ దోఁప వవి • నిల్చునొ నిల్వవొ వాని ధాటికిన్?.

ఉ॥ అమ్ముల నెత్తికొంట గొన • యమ్మునఁ గూర్చుట యేయుటల్ విలా
సమ్ముగఁ దోఁచెఁ గాని కెల • నంబుగఁ గాంచెడు వేల్పులేని స్వ
ల్పమ్మును గానరైరి కర • లాఘవమున్ శర లాఘవంబుఁ బ్రా
ణమ్ములఁ గ్రోలఁడీ చనుఁడ • నం దన సైన్యము వోలె వెల్వడున్.

క॥ ధరణీశ నాధువి శర సం. చరణమ్ములు సురివి వాక్య • చరణ గుణాలం
కరణ ధ్వనులం గలిగియు. విరమణములు లేని విబుధ • వినులికి నెక్కెన్.

చ॥ భవుని త్రిశూలముగా మఘపు • వజ్రము వెన్ను ని చక్ర మాజిలోఁ
జవి గవినాఁద భేదము ని • జంబుగ నెక్కువ యున్నదయ్యః రా
ఘవ శరవేగమున్ సయింపఁ • గాకయె క్రుంగిలి నేనుగాక వే
తెవ రిఁకఁ దచ్చరాలిఁ గను • తెత్తికనం గల వారి రీధిన్?

తే॥ రుద్రు బాహాష్టకంబు విం • ద్రుని భుజద్వ. యంబు విష్ణుని బాహు స • హస్రకంబు
వితని యొక వ్రేలి బలిమికి • నీఁడు రావు. తారఁజాలపు లాఁకి యు • థార్ద మిద్ది.

తే॥ వీరు లెందఱేనియు నుగ్ర • విక్రమైనఁ. గా ర్తవీర్యుఁ బోలినవారు • కారు నిజము
అట్టి యర్జునుఁడును రాము • ననుజు పాద. ధూళికిని బోల్పసాటి కాఁ • జాలఁడయ్యః

చ॥ త్రిపురములన్ దహించుతఱి • శ్రీగళుఁ దూనిన విల్లు దాని ముం
దెపుడును పేద్కఁ కేని ధరి • యింపఁగ నొప్పదు దానికొక్క వే
ఱుపమితి పల్కలేము క్రతు • లొక్కెడఁ దప్పినఁ దప్పఁగాక యా
తపన కులేంద్రు చాపము ప • దల్చు శరంబులు తప్ప నేర్చునే?

సీ॥ వెలుఁచో న్నాగమో • ములవేల్పుఁ బోలును. వెనరుచోట సహస్ర • శీర్షుఁబోలుఁ
బగఱఁజేర యుగాంత • భైరవుఁబోలు నా. చిలుకుల పనులు వ • చింప నరిది!
నా బలగర్వ ంల్ • నశియింపఁ జేసిన. నన్నె వేఱొక సాక్ష్య • మెన్న నేల?
వాఁడు పట్టినవిల్లు • పడమటిదో? తూర్పు. దో? దక్షిణంపుదో? యుత్తరపుదో?

తే॥ మూలలందలివో? విశాల • భూమిఁ గలదొ?, ఒంటిదో సమస్తంబును • మేవినదియొ?
యెఱుఁగఁజాలకుంటిని కుడి • యెడమలఁదు. నిక్క మేవంకనుండెనో • నేర నిఁకను.

మ॥ వసుధాధీశుని వాహనం బనిలుఁడో • వైశ్వానరుండో విభా
వసుఁడో కాలుఁడొ కావలెం దెలియఁగా • వచ్చుం బ్లవంగంబుగా
వెస నక్కోఁతి యొకెర్చు చేత లరగ • ద్వేష్యుండుఁ గావించునే?
యసమానోన్నతి నొంద దద్దియన నా • యజ్ఞత్వముం దెల్పదే?

చ॥ కదనకలంబుఁ జేరి యెఱుఁ • గంవగు నక్కఱలేదు గౌరవా
స్పదయగు ధాత్రి కీడయిన • జానకి రాముని మేనుగాంచి భీ
తిదమగు వాని వీర విహ్వ • తింగని యుండుట మన్మధుండు నే
మొదలుగ నెల్లవా రతివ • ముందఱఁ గుక్కలు గాక యన్యులే?

క॥ నాశము గలిగెడి వేళను. శ్రీశ విరించన మహేశ్వ • రేంద్రాదులచే
నాశిల్లక యుత్తమ వసు. ధేశు నొకని వైరిగాఁగ • నెనసితిఁ దాతః

చ॥ అనవిని మాల్యవంతుఁ డను • నన్నః వచించితి మున్నె నీకు నేఁ
జనవున వానిఁగైకొనవు • చాలఁ జిరాకుసు గొంటి వా యకో

పనుఁడు విభీషణుండు తెలు • పన్ వినకుంటివి కారణంబు లు
న్నను పరికింప కుంటి విఁక • నాతరమా వివరింప శ్రేయముల్?

చ॥ కటువుగఁగాఁగ నున్నను సు • ఖంబులం గూర్చెడు పద్ధతుల్ విశం
కటగతిఁ జర్చచేసి యొడి • కంబుగ నిక్కపు బంధులాడ నొ
క్కటియుఁ జెవిం గదింపక ము • ఖస్తుతి చేసెడు మూర్ఖ వాక్కులం
బటిమగ విన్న నీ గతిని • పాదొనరించుచు నుంటి సర్వమున్.

తే॥ అనుడునవ్వలనున్న మా • యావిమిన్న. యగుమహోదరుఁడెడసొచ్చి • యతనినుజిమి
చూచినొచ్చిన ప్రభు నిట్టు • లేచఁదగునె?. యనుచునుత్సాహకరముగా • నాడఁదొడఁగె

ఉ॥ మేలు దలంచి మంచిదని • మేవడిగొన్న యనంతరంబు గె
ల్పే లభియింపనిమ్ము మతి • యొద్దమిచే ననువుల్ త్యజింప నో
టే లభియింపనిమ్ము తమ • యెన్నిన పట్టున నిల్చుటే మహా
శీలుల లక్షణంబు వెను • చెంగిన నిందయు రౌరవంబగున్.

తే॥ అల త్రివిక్రముఁడును త్రిపు • రాంతకుండు, వోరి యోడిరి వైభవ • స్ఫూర్తి చెడఁగఁ
జంచలీకృత కైలాస • శైల? నరుల, తోడి పోరున కీవు వె • న్నాడుదేమి?

చ॥ గెలిచిన వార లోడెదరు • గెల్చెద రోడినవార లొక్కచోఁ
గలిమిగలారు క్రుంగెదరు • కల్మి వహింతురు లేనివారలన్
బలమున కొక్కయెల్ల కను • పట్టునె? యల్ప తపః ఫలంబుచేఁ
దొలఁకెడు రామలక్ష్మణుల • దొడ్డగఁ బల్కెదు బట్టు పోలికన్

ఉ॥ సీతను పీడితేని యొక • చెట్టయు రా దటు వీడకున్న చో
పీతముగాఁగ జీవముల • నీఁగిన నీఁగఁగవచ్చు వేఱు సం
పాతము గల్గునే? సిర • బంధుర గౌరవ మింకిపోవఁ జిం
తా తలిమంబుపైఁ బొరలి • తాపము నొందినఁ దప్పిపోవునే?.

ఉ॥ ఊరక యిట్లు మున్వెనుక • లయ్యెల లూఁగుచునుండ లంకలో
బొరులతోడ మమ్ము ఫల • పావపబృందము వోలె రాము చిం
దారద మొప్ప నార్పడె? జ • లార్ణవమందొక కొంత నీరమున్
సూరుఁడు త్రావ నంతయును • శోషిలె నంచడలంగఁజెల్లునే?.

మ॥ మును ముమ్మూర్తులు వేల్పులోడి పఱవన్ • ముల్లోకముల్ నీమహా
జ్ఞను పాలించుచునుండగాఁ దృణముపై • నట్టాడు ప్రాలేయముం
జెనయంజాలని మానవాధముల వా • సిం బెద్ద కొండాడి నీ
యనుఁగుందమ్ముని కుంభకర్ణు బల గ • ర్వాదుల్ డిగం బూన్చెదే?

తే॥ కుంభకర్ణు రప్పించి సం • రంభ మొప్పఁ, బంపుదేని యతనిఁ గాంచి • పాఱి డాఁగు
వారు; నిలిచినచో వారి • ప్రాణములను, తీసికొని రాఁగలండు దై • తేయ చంద్ర!

ఉ॥ నాపుడు రావణుం డతని • నర్మిలి మెచ్చి కుమార! మైథిల
శ్రీ విలసిల్లఁ బల్కితివి • ప్రేమకు మేలయియుఁ గల్గనేయీ రి
క్షో వన పాలకుండ వని • సొక్కక సమాహితచిత్తుఁ డయ్యెః వి
ఘ్నావలి వచ్చునేమి నడు • మంతరమందు వినాశవేళలన్?

## కుంభకర్ణుని మేలుకొలుపుట

మ॥ ఇది మేలంచు వచించి రావణుఁడు మీ • రింపారఁగా నేగి యె
వ్విదమైనం దగఁ గుంభకర్ణు నిదురన్ • వేలోరి రోద్రెండనన్
బదఁడంచున్ యమదూత లట్టు లసుర • వ్రాతంబు నిద్రాళు నిం
టి దరిన్ వాకిట నిల్చి లెమ్మనుచుఁ దా • టింపంగ వాద్యంబులన్.

ఉ॥ లేవని కుంభకర్ణుఁ గని • లెంకలు లోనికిఁ జొచ్చి వేఁకువన్
గ్రేవలఁ బోయి తోమర వ • రిష్ఠ గదావళ మస్తకంబుపైఁ
జేవ యెలర్ప మోఁదియుఁ గృ • శింపని నిద్దుర గాంచు దానవున్
సేవకు లంతఁ గన్గొని వ • చించిరి చీఁదఱ యగ్గలింపఁగన్

ఉ॥ నిద్రాదేవికి ముద్దుకూన! విను ని • ర్నిద్రుండు కాలుండు నీ
నిద్రాభంగము చేసినాఁ డలుపమా • నిద్రాళుతన్ వీడి పె
న్నిద్రం బొందుము కాలమందిరమునన్ • నిండారు ప్రేమంబుతో
భద్రంబుల్ సమకూర్చె నగ్రజుఁడు నీ • పాండిత్యమున్ మెచ్చుచున్.

మ॥ కొలువేకుండిన దానవాళి బ్రదుకుల్ • క్షోభంబులం బొందఁగాఁ
గొలువిం జేకొని నెత్తి గోఁకికొను మూ • ర్ఘుంబోలె మీయన్నయి
క్కొలగాముల్ పొనరించి దీర్ఘమగు కూ • ర్కు న్నీకుఁ జేకూర్చె ని
క్కొలయౌ నిద్ర యిఁకేల లెమ్మనుచు ర • క్షోవీరు లంకించుచున్

ఉ॥ నొచ్చిన కేలు లెక్కలిగ • నొవ్వఁగఁ గొట్టియు మేలు కాంచమిన్
గ్రచ్చుఱఁ బోయి రావణుని • గాంచి ప్రభూత్తమ! తమ్మునియ్యెడన్
జెచ్చెర లేప మావలనఁ • జెల్లదటంచు వచింపఁగా నతం
డెచ్చుగ దంతిమూఁకలఁ బ • యిం బఱపించుచు లేపుఁ డీయెడన్.

తే॥ వారణములు త్రొక్కినను లే • వకయయున్న, మీకుఁగల నేర్పులంజూపి • మేలుకొలుపుఁ
డనుచు వేవురు మల్లర • ననుప వారు, ప్రభునిచింత వీతఁడు తీర్ప • వలఁతి యనుచు.

చ॥ తలఁచుచు నిద్రలేపఁ జని • ద్వారముతీయఁగ వాని శ్వాస మ
త్యలఘువుగాఁగ వీవ జను • లందు దగుల్వడి లోని కేగుచున్
వెలి కరుదెంచుచుం దగులు • వీడమిఁ జేతు లొకళ్లొకళ్ళు వి
ట్టలముగఁ బట్టికొంచును ది • టంపు బలంబున దాఁటి రంకిలిన్.

తే॥ పడకయను వారినిధినుండి • పైకిలేచు. తనరు నిడుపైన మేనిపైఁ • దనరి యలము
బాడబాగ్నికీలలో యనఁ • బరఁగు నిడుపు. పేగుపైన రోమంబులుఁ • బెంఁగువాఁడు

తే॥ దెసల గెలిచిన దశకంఠు • నెంతమునరు. లంక చండ మయూఖుఁడు • జాలవేఁదఁ
డదఁగి యుండఁ దగిన గుహ • లనఁగ నిద్రఁ గప్పు పిడని లోఁతగు • కనులవాఁడు.

తే॥ వారణంబుల చరియించు • పర్వతగుహ. వంటి దోనముల్ గల ముక్కు • వలలువాఁడు
కొండ చిలువలు నిద్రింపఁ • గూడునట్టి. పెద్ద శ్రవణ రంధ్రంబులు • వెంయువాఁడు.

తే॥ ఐన కుంభకర్ణుని గని యన్నగారు. పిలుచుచున్నారు మిమ్మని • విన్నవించు
సేవకులతోఁడ జనె దశ • శీర్షుఁడున్న. మందిరమునకు నగరాన • గ్రందుపుట్ట.

తే॥ పెద్దకొండ పరుండిన • విధముదెలియఁ. జాఁగి తమ్ముఁడన్నకు మ్రొక్కె • వేగయెత్తి
గ్రుచ్చి కౌఁగిలించుకొనె ర• క్షోవిభుండు. కొండ కొండను తడవిన • కొమరుదోఁప.

తే॥ ప్రక్కఁగూర్చుండనిడుకొని • రత్నమద్య. ఘటఘటలుకొన్ని చెప్పించి • కాంక్షనొసఁగి
పలల మిచ్చి తెల్లని పట్టు • వస్త్రములను. రత్నభూషణముల నపా • రముగఁ బెట్టి.

తే॥ ఇంద్రుఁ డైరావతంబుతో • నీగిపాఱు. వేళఁ దప్పి జాఱిపడిన • వీరపట్ట
మమర పాఁధాగమున లం • కాధినాయి. కుండు తమ్మున కర్మిలిఁ • గూర్చికట్టె.

తే॥ మెఱపుకైపడి మేనెల్ల • మెఱయుచుండఁ. జెంగిర మలందిన గజంబు • చెలువుదెలుప
మొగులుఁబోని దేహంబున • బుగులురావి. చందనముపూసెఁ దనదు హ • స్తములతోడ

తే॥ విసము కసిమసఁగినరీతి • విస్ఫురోవ. యొరయు నిల్చిన తమ్ముని • యురమునందు
భవుఁడు ప్రేమతోఁ గౌఁగిన • పహిన్నఁబోలి. పెలుఁగు కపచంబు దొడిఁగెను • విబుధవైరి

ఆ॥ ఎడమకన్ను బొమయు • నెడమ భుజంబును. కంపమొందఁ గుంభ • కర్ణుఁ డంత
నన్నఁగాంచి సంగ • రాలంకరణమేల. సేసె దనఁగఁ బంక్తి • శిరుఁడు తెలిపె.

క॥ నరపతి సుతు లిరువురు వా. నర సేనలతోడ వచ్చి • నగరమ్మును పెం
పఱ ముట్టి యెప్పు డెన్నఁడుఁ. బొరయని విజయమ్ము గొనిరి • పోరిగొను వారిన్.

## కుంభకర్ణుఁడు రావణునకు హిత ముపదేశించుట.

ఉ॥ నావుడుఁ గుంభకర్ణుఁడు ఘ • నంబగు యుద్ధము సంభవించెనే?
పావనియైన జానకికి • బన్నము లంకను నీఁగలేదొకో?
దేవ మనుష్య లోకముల • దీపిత రాక్షసకీర్తి మాసెనే.
యీవగ దాపరించెనె స • మిద్ధ కులంబునకున్ వినాశముల్ ?

చ॥ సమరము దాపెనే? యిదియు • జానికి కోసమె సంభవించెనే?
కమలదళాక్షిపైఁ జెడుగు • కామము వల్దని మున్నెయంటి నే
త్రముల విసంబు గల్గిన పృ • దాకువుఁ బోలిన ధాత్రిపుత్రి పైఁ
దమి విడకుంటివో? విడక • తక్కుటయున్ విధికృత్యమేయగున్.

చ॥ వసుమతిఁ గెల్లగించి సుల • భంబుగ నెత్తఁగవచ్చు లోకముల్
కసిగొని మ్రింగవచ్చు ఁఘు • కాఁతుని సంగరమందు గెల్వ మా
ననమున నెంచుటల్ జనక • నందిని మేను పరిష్వజింపఁగాఁ
బొసఁగునటంచు నెంచుటను • బోలును రాక్షస వంశ భూషణా!.

చ॥ గెలుపును గల్గునే ? మరియుఁ • గీవ్పుడుఁగాక పులస్త్య ధాత్మ స
త్కులమున మేలిమిన్ జెడఁగఁ • గోరి యొనర్చితి భూగుణంబు చే
జల గుణమున్ విభిన్నమగు • జానున నుత్తమ వంశ కీర్తి నీ
వలన నశించె సర్వమును • పాడుపడెం బలుభంగులం గటా!

క॥ ఇచ్చితి జయము మఘవునకు, గ్రొచ్చితి పల్లంబు బందు • గులకు స్నీకున్
దెచ్చితి పలువగలఁ జెడుగు. వచ్చితి వానిచ్చఁ దొలఁగు • పద్ధతి గలదే?

తే॥ మంచి ధర్మపద్ధతుల క్ర • మించిచేసి, వన్నె మున్ను గూర్చితి బల • భాగ్యములకు
నట్టి ధర్మంబు నీవయి • యడఁచివైచ, నంచితంబుగ నెవ రుద్ధ • రించువారు?

చ॥ త్రికరణశుద్ధి యుల్లసిలి • దీన శరణ్యత ధర్మ వర్తనల్
ప్రకట పరోపకారమును • భాసిలు పుణ్యుల మ్రోలఁ గ్గ బూ
టకములఁ బాపమందును వ • టారి తనంబు వహించినట్టి మో
అకులు జయింపనేర్తురె ? లో • అంగును ధర్మ మధర్మ పీడచే.

చ॥ మఱియొకమాట విన్నఁ గదు • మంచిదెయౌ వినవేని లెస్స యొ
డ్డాలకములేల ? యున్నది • యోధిని దాఁటిన కోఁతి, సీతయుం
జెఱపడె వాలి వక్షమును • చీల్చిన బాణముకదు దైత్యులం
గొఱపడకుండఁగా మనముఁ • గూడితి మేది కొఱంత యెన్నఁగన్ ?

శా॥ సీతాదేవిని వీడి రామ పద రా • జీవంబులన్ వ్రాలి ప్ర
స్ఫీత ప్రాభవ మొందు నీయనుజు సు • స్నిగ్ధుండవై కొల్చి త
చ్చేతోమోదన రీతి వర్తిలుము , నీ • సేనాతతిం బంపి త
ద్వ్రాతింబుల్ నశియింపఁ జింతిలుట భా • వ్యంబౌనె? లంకేశ్వరా!

తే॥ పేర్చి రోషముఁ బూర్తిగాఁ • గూర్చికొంచుఁ, గదనసంగంబునకుఁ జని • కడిమిఁజూపి
శత్రుల జయింపటో లేక • సమయుటొ తగుఁ, గాక యిది యుక్తమగు నెలం • కాపురీశ!

తే॥ అనిన విని రావణుండు ని • న్నక్కటపడి, పిలుచుకొన్న భవిష్యత్తు • దెలుపఁగాదు
వెడలి యల్పమానవులఁ జ • క్కడఁపఁగాని, నీహితములెన్న! తెలిసె న • త్యాహితంబు.

క॥ విడిచితివి పౌరుషంబును, కుడిచితి వుదరంబు నిండఁ • గుదురుగ నింకన్
నడువుము చల్లనియెడ కటఁ, బడి నిద్దురపొమ్ము రేలు • పవళులు ప్రీతిన్.

తే॥ మానవులకుఁగేల్మోడ్చి న • మస్కరించి, గూనిమానిమన్కులకు మ్రొ • క్కులనొనర్చి
బ్రతుకు మనుగడ తిండికై • బ్రతుకునట్టి, నీకు సీతమ్మనకుఁ దగు • నాకుఁ దగునె ?

శా॥ ఓరీ సేవక! సాయుధంబగు బలం • బొండించి చెప్పింపు ము
ర్వార ప్రోద్ధతి దేవ నాగ నర వి • ద్యాధర్ల నొక్కొక్కరిన్.
జేరన్వచ్చి మనుష్య వానరులచేఁ • బెల్పాటు గాకుండఁగా
బోరన్ రండని యెల్లవారలకు దె • ల్పంగ ముట్టీయాజ్ఞచే.

చ॥ అని పయనంబుకై తొడఁగు • నన్ను పదంబుల ప్రాలి శూలమున్
మినమిసలాడఁ గైకొని క్షి • ముంపుము గెల్పునె పొంది వత్తు నే
నని పచియింపఁజాల విధి • యూర్పుచు గెంటుచు నుండెఁ జావు త
ప్పని సరి చత్తునేని జన • పాలుఁ బంచిన పీడు మేలగున్.

తే॥ ఇంద్రజిత్తుఁడును లక్ష్మణు • నిసువుచేతఁ, బడుట నిక్కము సేనయో • పవనధూత
భూతియగు, బావిఫలముఁ • గొందు దెలుఁగు దప్పచేసి యంచితరీతిఁ • జలుపుమన్న!

క॥ నను గెలిచి రేని పిమ్మట, నిను గెలుచుట నిజము, విచన • నెమ్మి దలఁచి సీ
తను వీడనుట పెదఁగగుఁ, బనిగొని విడువెన్న సీ త • పశఫల మన్నా!

తే॥ నేర్చి నేరక తొలినుండి • నేఁటివాఁక, నేనొనర్చు తప్పులు గను • వేని సైఁపు
మన్న! నీయెదుటికి వచ్చు • టరిది యింక, సెలవె' యని కుంభకర్ణుండు • వెలలఁబాఱె.

తే॥ నిలుచు రావణు కన్నుల • నీరు కారఁ, నెత్తురును చిందె నచ్చటి • నెమ్మి బందు
గులను మిక్కిలి తపియించి • కులుకలినారు, కుంభకర్ణుండు పోయెను • కోటదాఁటి.

తే॥ శూలధారియై చను మహా • శూరులోడ, వెడలఁగాక సైన్యంబని • విభుఁడు పలుక
దనుజ బృందంబు వెడలె వా • ద్యములతోడ, మింట సురవంతలల దూళి • మేవుకొనఁగ.

తే॥ స్యందనములపై మాతంగ • బృందములును, గాలిబంటుల కేలను • గ్రాలు కేత
నమ్ము లాజిని లేచు న • జమ్ము దివిని, మైపడవ వానిఁ దుడుచు • లీలనొప్పె

తే॥ ఆయుధంబు లొండొంటి రా • యంగ లేచు, నిప్పుకలు వీరుల కనుల • నిగుడు మిడుఁగు
ఱులను మిక్కిలి వెలువడి • యలముకతన, వేఁడిచేత జీమూతముల్ • మాఁదిరాలె.

చ॥ కరులు తురంగముల్ రథ ని • కాయము పంపిడియై కదల్కొనన్
ద్వరపడి ముంగల న్నడచు • దండును వెన్కల నేగు సేన క్రి
క్కిఱిసి కుదించి మధ్య నిబి • కింపఁగ లోపలి మూఁక నేలపైఁ
జరణము లూనలేక యెల • సంబున వే చనె నంతరంబునన్.

ఆ॥ వేయి శరభములును • వేయి సింగంబులు, వేయి భూతములును • వేయి కరులు
కట్టఁబడిన దిగిభ • గణమీడ్వలేని తే, రెక్కి కుంభకర్ణుఁ • డేగుడెంచె

ఆ॥ పరశు చక్ర భిండి • పాల గదాసి తో, మర నిషంగ చాప • దర ఖరోగ్ర
ముసల శూల శస్త్ర • ముద్గరాదులఁ దాల్చి, దనుజసేన నడచె • ధరణి యదర.

ఆ॥ వరుస వరుసలగను • వడివడి చేనూని, యంది యిచ్చు రాక్ష • సాలి మద్య
పాత్రములను పక్వ • పఱచిన మాంసంబు, నినుచు బండ్లతోడఁ • జనియెవెంట.

సీ॥ పెక్కండ్రు పనివాండ్రు • వేవేగ బడిబడి, యిరుగేల వారి యం • దిచ్చుచుండ
గుహను చొప్పించు నం • గున నోట నించుచుఁ, గుంభకర్ణుఁడు రణ • క్షోణిఁ జేర
వీని యీకొలపని • వానర వితతితోఁ, బూర్తియై నిలుచునో • పొదవుకొనునొ?
వీని కడుపునిండఁ • బ్రాణివర్గము లెల్లఁ జాలియుండునె యను • శంకపొడము

తే॥ చరణ మించిన చోటెల్ల • శవ మయంబు, వీని మూలాన సమవర్తి • వేఱుక్రొత్త
దారి మెఱిఁగెనుయముఁడె ప్ర • త్యక్షమయ్యె, బాఱుబెట్లనియమరులు • పరుగు లిడిరి

తే॥ సర్పరాజు శిరమునుండి • జాఱి భూమి, తోడ మేరువు వచ్చిన • తోయ మొప్ప
కనక రథమెక్కి వచ్చు నా • ఘన రీరుఁ, గుంభకర్ణుని శ్యామలాం • గుండు కాంచె.

తే॥ ఘన పతాకయందున వీణ • గానరాదు, సింగ మున్నది వాని వి • చిత్రతనువు
చిత్తవేగముతోడఁ జూ • చినను పూర్తి, కాదు రాక్షసరూపుఁడీ • ఖరుఁ డెవండొ?.

చ॥ ఒక్క భుజంబుఁదొట్టి మఱి • యొక్క భుజం బగుదాఁకఁ జూడఁగా
విక్కము కొన్నినాళ్ళు పయ • నించును కాళ్ళు జనించినట్టి గ
ట్టొక్కటి యిట్లు వచ్చెనొకొ? • యుద్ధము సేయఁగఁ గోరివచ్చు పెన్
మొక్కలుఁ డంచెదం దలఁపఁ • బోలదు ఘోర శరీరుఁ డెవ్వఁడో?.

మ॥ ఉదయాద్రిన్ మొలతెంచు భాను కిరణో • ద్యోగంబు మట్టాచ్చి పె
ల్లిదమౌ చీకఁటి నించు వీని తనువున్ • లెస్సం బరీక్షించి నె
మ్మది భీతిల్లి ప్లవంగముల్ దెసలకుం • బర్వెత్తె నీసైన్యమున్
జెదరం దోలఁగ రావణుండు గొను నా • భీల క్రుధారూపమో?

## విభీషణుఁడు రామునకుఁ గుంభకర్ణు నెఱింగించుట

మ॥ అని శ్రీరాముఁడు ప్రశ్నసేయ విని లం • కాధీశు తమ్ముండు ప
ల్కెను మాయన్న కృతాంతతుల్యుఁడు లయో • గ్రుం బోలు వాఁడంబుజా
సను గన్నాతఁడు యోగనిద్ర మదిలోఁ జాలింప దైత్యాళి నీ
ల్గను, వేల్పుల్ మరణింతు రీయసుర కూ • ర్కున్వీడి కన్విచ్చినన్.

తే॥ లేప రేని కల్పముదాఁక • లేవకుండు, విదురపోతు గాలికి మించి • కదలువాఁడు
యమునకు యముండు హరిహయు • నాజిఁ దఱిమె, రోషశీలుండు కుంభక • ర్ణుఁడనువాఁడు.

సీ॥ పైనున్న యింద్రుండు • పడకుండఁ జౌదంతిఁ, దేకుఁవ గిరగిరఁ ద్రిప్పినాఁడు
శ్వాసనుఁబట్టి నలంచి • సారంబు దీయంగఁ, బిడుచువాఁడు జలధి • నడచువాఁడు
చేవకుఁ దగు దృఢ • చిత్తంబు గలవాఁడు, బ్రహ్మచే వరములఁ • బడసినాఁడు
శూలిని మెప్పించి • శూలంబు గొనినాఁడు, సురల పీఁపువలె సదా • చూచువాఁడు

తే॥ ప్రబలి తాటియాకుల గాలి • పడగవోలెఁ, దిరిగినాఁడు జగంబులఁ ద్రిప్పినాఁడు
ఇంతదాఁకను నిద్రయం • దీతఁ డుంట, వలన జీవించియున్నది • ప్రాణి వితతి

తే॥ పాడితెరువు గాదిది సీని • పలసమనసు, బ్రాణహాని నిశ్చయమని • యన్నతోడ
రెండు మాటలు పలికె సీ • తండు దాని. వెడఁగు దైత్యుండు పెడచెవిఁ • బెట్టినాఁడు.

తే॥ సాధ్యమైనంతపలుకుసు • సామమనెనె. హితము బోధించి యదకింత • యేని వినమి
విసుగుచెంది మృత్యువు శిరో • వీధి నిలిచె. ననుచుఁబల్కి నీయెదుటికి • నరుగుదెంచె

తే॥ అని విభీషణుఁ డాదప • నాటవిభుఁడు. వీనిఁ జంపిన రాఘవుఁ • గానఁబడదు
వచ్చునేని చేర్చికొని య • వ్వల పలసిన. పనుల గావింత మిది నీకుఁ • జనునకాదె?.

తే॥ అనుడు నతనియొద్దటఁ • బోవ నర్హుఁడెవ్వఁ. డనుచు రాముఁడు పల్క న • యిట్లైన నేగి
కలుపుగోలుతనంబునఁ • బలికి వచ్చు. నేని తోడ్తెత్తు ననె రావ • ణానుజుండు.

తే॥ మంచిదని రాముఁడన దైత్య • మాన్యుఁ డేగి. యలనిశాకను విని మోద • మందుకుంభ
కర్ణ పాదముల్ తన మస్తకంబు సోఁకఁ. జాఁగి మ్రొక్క నతఁడు నెత్తి • కౌఁగిలించె.

## విభీషణ కుంభకర్ణుల సంభాషణము

చ॥ కనుల ముదశ్రుబిందువులు • గాఱ శిరంబును మూరుకొంచు మె
ల్పైన నురమానఁ జేర్చి యొడ • లుం బలుమాఱులు దువ్విదువ్వి స
జ్జన తిలకాగ్రగణ్య! శుభ • సంతతులెల్ల నొకండ వొంది తం
చును ముదమందు నాతలఁపు • కోషిల వచ్చితివేల యజ్ఞతన్?

ఉ॥ నీ వభయంబు నొందుటయు • నిర్జరులేనియుఁ జెందరాని సం
భావిత సౌఖ్యముల్ చెపని • పద్ధతిఁ గాంచుట వీనులారఁగా
నే విని పొంగి పోయితి గు • ణీ. జమువాతను చిక్కియున్న మా
తావున కేలవచ్చి తమ్ము • తంబుమరోసి విసంబుఁ గోరితే?

చ॥ చెడి కృశియించుచున్న కుల • శిష్ట గురుత్వము నీ కతంబునన్
వొడి బడకుండ వర్థిలను • బొల్లిటి కైవడి నంచు మోదపుం
బడర వహించు నాతలపు • లాఱిడి పోవఁగ నాల్కయెండ ని
య్యెడ కిరుదెంచితేల మది • యెంతయుఁ దాపము నొంద నక్కటా!

మ॥ తన ప్రాణంబులు వోవునట్టి దశ యు • త్పాదిల్లినన్ లోక పా
వనుఁడౌ రాఘవుఁ డాశ్రితావళిని త్రో • వన్ సాహసింపండు ము
న్నె నశించెన్ మరణంపుభీతి యిపుడా • నిత్యాత్మ సేవించుటన్
జననోద్విగ్నత వోయె నింక నెడియో • సాధింప నీ వచ్చుటల్?

సీ॥ సద్ధర్మమూర్తి శ్రీ • జానకీనాధుని. కలిసి సేవించు భా • గ్యంబు నోచి
పాపకారణములై • పరఁగు నజ్ఞానంబు. నన్యథాత్వము సంశ • యంబు ననెడి
మూఁడు దుర్గుణముల • మూలంబుతోఁ ద్రెంచి. భవదోషముల నెల్లఁ • బాఱఁదోలి
నిర్మలమూర్తివై నెగడు నీవింకను. పరదారలను గోరు • దురిత మతుల

తే॥ బంధువులఁగాఁ దలఁతువే? • బ్రహ్మవలన, నీతి ధర్మంబు జ్ఞానంబు • నిర్మలతయు
నమృత జీవితమును బొంది • యన్న! తుదకు, మన కులాచార వాసన • మానవేమి,

మ॥ దనుజధ్వంసి ధరాత్మజాధిపుఁడు కో • దండంబు నెక్కుంచి హె
చ్చిన కోపంబున మాకుఁగా నటఁ బ్రతీ • క్షించెన్ దదీయానుజుం
డును కీశాళియుఁ జంపనెంచిన యముం • డు న్నిల్వఁ ద్రోవంగనే
రని మా దుర్విధి కాచియున్నది కుమా • రా! యేల నీవచ్చుటల్?

తే॥ నీవు రాము శరణుచొచ్చి • నిలువవేని, రాక్షసుల మేము రామ శ • రవ్రజమున
నాశమొందంగ నుదక దా • నమ్ము సేయ, నొక్కఁడైన లేకుండుట • యొప్పునయ్య?

ఉ॥ లంకకు నీవు వచ్చుట క • ళంక వహించిన దైత్య వంశముల్
గ్రుంకినమీఁద నెమ్మదిఁ గ • కుత్థ్స మహాన్వయుతోడనే సుమీ
శంకిల నేల? యక్షయ య • శస్కర సంపద లందుమయ్య! నా
కంకిలి పల్కఁ గింకఁ జను • మా యన నన్నకుఁ దమ్ముఁ డిట్లనున్.

చ॥ పెదఁగగు నాయెడం గరుణ • వీ దని రాముఁడు నీవు వచ్చినన్
విడువఁడు ప్రేమఁజూపుఁ బిగ • వీడు భవాంబుధి దాఁటఁజేయుఁ బెం
పడరఁగ నాకొసంగిన వ • మస్తము నిచ్చెద లంకతోడ నా
యెడఁ గరుణించి రమ్ము శుభ • మింతకు మించియు నున్నె చూడుమా?

ఉ॥ తప్పుకొనంగరాదు నయ • ధర్మవిశారద! పాటి దాఁగఁగా
నెప్పు గనంగరాదు మర • ణించుట నిక్కము రిత్త చావఁగా
నొప్పునదేది? సత్పథమ • యొందఁగఁ దగ్గది నీకు నింతఁగాఁ
జెప్పెడి పాటి వాఁడనె? వి • శిష్ట గుణాకర! యెంచి చూడుమా.

చ॥ చెడుగులె యెల్లవేళలను • చేయుచునుండిరయేని వారు తోఁ
బొడమిన వారలంచు బుధ • పుంగవులందును బంధులంచు నె
ద్దడి పడి యోర్వనౌనె సతి • తంబును ధర్మ పథానువర్తికిన్?
బొడవగు నింట దీపమని • ముద్దిడ మూతిని కాల్చుకుండదే?

ఉ॥ ఉత్తమకార్యముల్ మిగుల • నోర్పునఁ జేయఁగ నిండ యబ్బునే -
క్రొత్తగు దుఃఖజాలములఁ • గూర్చును సంస్కృతియందు నవ్వులన్
బొత్తులఁ దల్లిదండ్రులను • పుత్రుల భార్యల వీడువారు పె
న్వృత్తిని ధర్మమున్ విడరు • వారికి నవ్వియ యిచ్చు మోక్షమున్

చ॥ చెడు గొకరుండు సేయ నటు • సేయని వాడను వానితోడ నే
యడఁగుట మేలొ? కీడొ? వెర • వాడ వివేకిత గల్గువాఁడ నే
నుడువుము కన్నతల్లి నెటి • నూఁకుటచేఁ గద భార్గవుండు చ
క్కఁడఁచె, భీష్ముండు బ్రహ్మతల • నక్కట! త్రుంచె దొసంగు గల్గటన్.

ఉ॥ ఆఱడి యొందు నారకము • సందడఁగందగు చెడ్డ కార్యముల్
పీటఁడి చేయువాఁ డనుచు • విజ్ఞులు చేయుదురే? శరీరమ్ము
దాఱని పుండునందు చెడు • సంగముఁ గోసి తొలంచి కారష్యం
దూఱిచి మాన్పఁగాఁదగును; • తోయధి వింగువ గల్పు బొప్పునే?

ఉ॥ అన్నను గావఁదగ్గ వెర • వారయ లేద యధర్మ వృత్తముం
గ్రన్నఁ దొలంతు మన్న నది • కాదిఁక దిక్పతులెల్ల నవ్వఁగా
బన్నము బొంది ప్రాణములఁ • బాయఁగవచ్చును రౌరవంబునం
బెన్నిక నుండవచ్చు మఱి • యేది యొనర్పఁగ వచ్చుఁ దెల్పుమా?

ఉ॥ లోకములెల్ల గెల్చితివి • లోఁగొని పాలన సేయలేదు భూ
లోకమునందు విద్వరను • లోలతఁ గొల్చితి నేఁటిదాఁక న
త్రాఁకలిపోర నాయువును • యౌవనమున్ వృథగా గతించె నేఁ
డీ కరణిన్ ద్యజింపఁదగు • నే యనువర్గ మధర్మవృత్తికై?

చ॥ నెసరున రాఘవుండు కిరు • ణింపఁగ నిద్రయు వీడి సౌఖ్య భా
జనమగు జీవితంబుగొని • సార్వజనీనముగాఁగ రాజ్య పా
లన మొనరింప నర్హుఁడవు • లభ్య పదంబిది కూడివచ్చె నా
మనవిని వ్యర్థ పుచ్చక న • మంచితరీతి ననుగ్రహింపుమా.

సీ॥ ధర్మ సంస్థాపనా • ర్థంబు విష్ణువు రాముఁ, డై జనించెను భాస్క • రాన్వయమున
నాదిదేవుఁడె యీయ • నపవాదు గల్గునే?, యెల్లిదమౌనె? రా • యిడియు నున్నె?
నీచుల పద్ధతుల్ • నీఁగి విబుధ సంఘ, నియమముల్ గొని నీవు • నెగడుదేని
రాక్షసాన్వయ మహా • వృక్షంబునకు వేఱు, పురువు దశాస్యుండు • పొలియు పిదప
తే॥ నీ కుమారులతోడను • నా కుమారుల, లన్న కొడుకులు సౌఖ్యంబు • లరయువారు
మన పులస్త్య వంశంబు ని • ర్మలినమగును, తెలియవే యింతమాత్రంబు • ధీరచరిత!

సీ॥ మునులు ప్రేమింతురు • దనుజ విరోధులౌ, సురలు ప్రేమింతురు • సూ డడంగు
శాత్రవులే నీకు • జగతి లేకుందురు, పెండెలు పుట్టెడి • వేళయందు
పూలు త్రుంచుట దొడ్డ • పురుషాల పనియౌనె, జానకీపతియె నై • సర్గికమగు
కరుణచే నాయెడఁ • గల ప్రేమచేత ని, న్నర్థించి పిల్వ న • న్నంపినాఁడు
తే॥ రాముఁ జేరుటె మేటి క • ర్తవ్యమగును, కాన ధర్మంబుఁ గడపక • కడఁకతోడ
వచ్చి మేలొందుమని వాని • పాదములను, వినమితుండయి పట్టె వి • భీషణుండు.

ఆ॥ శిరము భూమి సోఁక • నెరఁగి కాళులు పట్టి, కొన్న పిన్నతమ్ముఁ • గ్రుచ్చియెత్తి
యక్కు చేర్చి కనుల • నస్రముల్ రాల్చుచుఁ, గుంభకర్ణుఁ డిట్లు • కుదురఁబలికె.

చ॥ జల లిఖితంబు వంటి సుఖ • సంపద లందఁగఁగోరి యెల్లవే
ళలఁ దగఁబెంచి పోరికి న • లంకృతిచేసి జయేచ్ఛచేత న

న్నెలమిని పంపు నన్నుకు వ • హించిన ప్రాణము లీయకుండ శ
త్రులకడఁ జేర నాకొసరు • దుఃఖముఁ దీర్తువయేని పొమ్మఁక.

తే॥ చెడని ధర్మమార్గము చిరం • జీవితయును, ధాత వరమునఁ బడసిన • తండ్రి! నీవ
జగములకుఁ బ్రభుండవు నీకె • తగినదదియు, సమర మరణంబె నాకు య • శస్కరంబు.

ఉ॥ యోచనలేని మొక్క ప్రభు • వొప్పమిసేయుఁ దలంచెనేని యా
లోచన సెప్పి దిద్దు టది • లోకమతంబు వినండయేని వీ
రోచిత వృత్తినుండి విభు • నోరెము మెక్కిన వాక లాజిలో
దాఁచక ప్రాణముల్ విడుట • ధర్మము; వీడుట కీర్తి మార్గమే?

చ॥ చెలువుగ దేవదానవులు • సేవలుసేయఁగ మూఁడు లోకముల్
బలిమిని గెల్చినట్టి రిపు • వారణ సింహాను రామబాణ ని
ర్దళిత తనూజ బంధు హిత • తండముతో మరణించుమండఁ ద
మ్ములనాకరేని తోడ్పడక • పూర్తిగ నీఁగుట భావ్య మౌనొకో?

చ॥ ఎదురొక యింతలేక విజ • యేందిర నెల్లెడఁ గొంటచే భయం
బెదగొనియున్న శాత్రవులు • హేళనసేయ సుమా మహేశ్వరుల్
పొదలు నగంబు నెత్తిన ప్ర • వృష్ట భుజంబులు కాలపాశ బ
ద్ధ దళ భజింపఁ గొంటెగఁ గృ • తాంతుని సద్మము సేరఁ బాడియే?

చ॥ బలితపు రాగికోటలను • భాసిలు పట్టణ సం దుర్గ౩ం
బెలిసి మదగ్రజాసువులఁ • దీసిన విద్విషు సంస్తుతించుచున్
గలనిని మార్గణాహతిని • కాయలుగాచిన ఖొమ్మతో వడిన్
వలకదజేని దుర్మదముఁ • బాపిన యేసును మొక్క నేర్తునే?

సీ॥ హనుమంతు నంగదు • నర్కసుతుని వీర, మనుజులౌ రామల • క్ష్మణుల నీలుఁ
గాయలు కనరుల • కై ప్రాంకులాడు వా, నర యుక్షపరులను • సుఖముచేసి
ప్రాలేయహరుఁడై న • భాస్కరుకై వడిఁ, గదన సంగంబునఁ • బొదలువాఁడ
హాలాహలముఁ గన్న • యమరులపెలె హరి, సేయు దెలకు • జెదరిపాఱఁ

తే॥ గదలి నీతిదప్పు నగ్నియు • గాలి పఱవ, విలయమంప జగంబులు • విహ్వలింప
శూలమును కేలఁగొని దాటి • గాళిపడగ, పర దుర్గం చిరిగెనఁ జూపు • మెమరులేక.

తే॥ కలఁగి పాఱక సమర ర • గంబునందు, నిబుడ దా రెట్టివారైనఁ • జెలగివైతు
నాదు పలుకుల మన్నించి • వాదు విడిచి, భాను కులు స్నేహంబు గా • పాడుకొనుము.

ఉ॥ తమ్ముఁడ! యేగు మాజి తుది • దాఁకిన పిమ్మట రామువేఁడి త
త్సమ్మతి సంగరస్థలిని • చచ్చినవారికి శాస్త్రయుక్తి నీ
తమ్ముగ నౌర్ధ్వదైహిక విధానముల న్నెఱవేర్చి మమ్మపే
రిమ్మన నారకంబునకు • నేగఁగనీయక యుద్ధరింపుమా

తే॥ కాకమానదు కాగఁల • కర్మ ఫలము, నిలిచి కనువిచ్చి కాచిన • నిలువఁబోదు
కలరె నీకంటె విజ్ఞులు • ఘనులు? చింత, సేయవలదు మాయెడఁ; జిరం • జీవి వగుము.

చ॥ అని మఱి చేరఁదీసి ప్రియ • మారఁగ డిగ్గఁగవుంగిలించి మైఁ
బుణుకుచుఁ దేప తెపలుగఁ • బొంగెడి భ్రాఁతిని బాష్పపూర్ణవీ
క్షణములఁ జూచిచూచి పెలు • చందెగె నేఁటికి సోదరత్వమి
ట్లని పనపంగఁ దమ్ముఁ డద • లాఁపఁగనేరక వ్రాలె నన్నపై.

ఉ॥ నోరు మొగమ్ము దెంపము క • నుల్ వడినెండె శరీర జీవముల్
రాఱి తపించె నిర్వ్వరకుఁ • దక్కక వాదు పెరుంగ మేలు చే
కూరదటంచు నగ్రజుని • కోరి యనుజ్ఞను వేఁడి సేనలుం
బేరిమిఁ గేలుమోడ్పఁగ వి • భీషణుఁ డయ్యెడనుండి క్రమ్మఱెన్.

ఉ॥ చౌర్యము గల్గు మమ్ముఁ దన • జాతి గుణంబులు వీడి వేద వి
ద్వర్యుఁడు మా విభీషణుఁడు • బాల్యము సైతము ద్రోసెనంచు నే
చర్యయు లేక క్రుంగిన వి • చారముతోఁ గనుఁనీరు రక్త సాం
కర్యము నొంది వెల్లువలు • గా నటనిల్చెను కుంభకర్ణుఁడున్.

ఉ॥ వచ్చి విభీషణుండు రఘు • వర్యుని పాద సరోజ యుగ్మమున్
మెచ్చిన భక్తి మ్రొక్కి ధర • ణీశ్వర! చావఁదలంచువారికిన్
నచ్చునె ధర్మచింతనలు? • న్యాయము సౌమ్యము నేర్పుచూపి పె
న్మచ్చిక చేసితిన్ మనసు • మాఱదు వోదు కులాభిమానమున్.

తే॥ అంచుఁబలుకంగ శిరము పం • కించి రామ, చంద్రుఁడనియె నీయెదుటనె • జాలిమాలి
యాజి నీయన్నఁ జంపు ట • నర్హ మనుచు, మంచిదేయంటి; విధికిని • మాఱుగలదె?

## కుంభకర్ణుని యుద్ధము

తే॥ అనుచు మెల్లన ననుమంద • నసురసేన, వనచరావళిఁదఱిసి వో • రునకుఁ దిగువ
నెగసినట్టి రజము నింప • నీకరాశి, ఘోష మడఁగె దద్విధము కా • కుత్థ్సుఁ దెలిఁగె

ఉ॥ పాఱెఁ దురంగముల్ కరులు • పాఱె రథంబులు పాఱెఁ గొండలుం
బాఱెను నెత్రు వెల్లువలు • పాఱెఁ గబంధము లెల్లచోటులన్
మీఱి నటించె భూతములు • మిక్కిలి గంతులు వైచెఁ దెక్కెముల్
తాఱెను కంక గృధ్రములు • తారె వియత్తల మెల్ల నిండుచున్,

సీ॥ ఎమ్ములు మెదడు మాం • సమ్ము రక్తము క్రొవ్వు, నలినలిగాఁగ దా • నవులు పడిరి
శిరములు భుజములు • తరులును గిరులును, పొడిపొడిగాఁ గపుల్ • కెడసి పడిరి
విసిరి రక్కసు • లేసిరి వనచరుల్, విసరిరి దనుజులు • విసరె హరులు
నలఁచిరి దైత్యులు • నలచిరి ప్లవగులు, తిట్టఁ దిట్టిరి కొట్టఁ • గొట్టినారు

తే॥ చీల్పఁ జీల్చిరి చెలగంగఁ • జెలగినారు, క్రుమ్మఁ గుమ్మిరి కొఱుకంగఁ • గొఱికినారు
హెచ్చుతక్కువ లేకుండ • నెసక మెసఁగ, రణము సల్పిరి ఖేచరుల్ • భ్రాంతినొంద.

ఉ॥ వానను తోలు గాలియును • వాయుపుత్రుఁడున కోర్చి వానయున్
మానగు తారకాణగ స • మంబుగ, బోరెడు పోరుగాంచ శ్రీ
మానిని నిర్జరేంద్ర పుర • మార్గముఁ ద్రొక్కఁగనీని శూలముం
బూనిన కుంభకర్ణుఁడు స • ముద్ధతి వచ్చె సమిద్ధరిత్రికిన్.

॥ విలయవాతంబునందు జీ • మూతభ్రమించు, ననువుదోఁపధూళిని దగు • లొక్కనియనెత్రు
టేఱులం జక్రముల వార • ణేంద్రములను, తగులుకొని నేలఁగూలెను • తరుచరాళి.

౨॥ శైలముల్ వైచుచు • స్యందనాగ్రమునకుఁ, బఱతెంచు వానర • ప్రతతిఁ బట్టి
మొనసయొండొకటితో • మోఁదునతన్నును, నల చును బ్రింగును • నపలి యుమియుఁ
ద్రెంచును చీల్చున • త్రిప్పి యెగురవైచుఁ, బిడిచి రక్తము మేనఁ • దడవికొనును
నేల నడఁచివైచి • కాల రాచును నీట, ముంచును నిప్పున • నుంచుఁ గ్రుంచుఁ

తే॥ పేరుసకుఁ గొట్టు జలనిధిఁ • జేరవైచు, దిక్తటంబులఁ దవులంగఁ • దివిరివైచుఁ
బొదల ప్రాఁకులఁబడవైచుఁ • గుదియవైచుఁ, బర్వతంబులఁ బడవైచుఁ బాఱవైచు.

ఉ॥ ఖేచరపాళి భీతిఁ గలఁ • గెన్ మలఁగెన్ దొలఁగెన్ వియత్స్థలిన్
వేచెను కంకగృధ్రములు • పీనుఁగులం దిన మూకమూఁకలై
మోచిన కొండలెల్లఁ బొలి • వోయెఁ గృతాంతుఁడు సాధ్వసంబునం
జూచెను కుంభకర్ణుఁడు వ • సుంధర, గోఁతులఁ జక్కడంపఁగన్.

చ॥ విసరుట కొక్క ఱాయియును • వృక్షముఁ జిక్కదు నేఁడె తెచ్చుకొం
దెనకమునన్ ఘటంబు లద • యించెను రండని వానరౌఘముల్
వెసఁ గొని తెచ్చి కొట్టినవి • వేసిన ఱాలు గిరుల్ కుంజబు ల
క్కనపడకుండ దైత్య భుజ • కాండము లోర్చె నహోయనన్ సురల్.

ఆ॥ విసరుఱాలు మట్టి • పెళ్లలుఁ దమగిరుల్, నుగ్గునూచ మగుచు • ప్రగ్గిపడఁగ
వైవ నెవియులేక • వానరుల్ సంద్రీల, కిఱచి దాసి త్రుళ్లి తెలిలినారు

ఉ॥ కొండలు గుంపుగూడి యొక • కొండను ప్రాలెడి పిట్టలెట్టిలన్
చందమునంది వానిపయిఁ • జయ్యన నెక్కుచుఁ గేలనొవ్వఁగాఁ
గందఁగ గ్రుద్ది ఱక్కి పెడ • కాటులు వైచు ఫలంబులేక చే
యం దగ నెట్టియుం గనక • యంటట బాటిరి మూఁకమూలకున్

తే॥ సీలుఁదొక గొప్పమఁ సప • లీలనెత్తి, నిప్ప లురలంగ గిరగిరఁ • ద్రిప్పివైవ
శూలమున దానిఁ దొడిచేసి • లీలనవ్వెఁ, గుంభకర్ణుండు వానరుల్ • కుతిలపడఁగ.

తే॥ అవల నొకగిరివైచియు • వ్యర్థమైనఁ, గపులుగలఁగుదురని శతాం • గమున కెదురు
నడచి పిడుగును మించిన • పిడికిలిగొని, కుంభకర్ణుని పొడిచెను • కుతలమదర.

ఉ॥ చేతుల కాలునొచ్చె తన • చేఁతలు వ్యర్థముగాఁగ నీలుఁడు
ద్ఘాతముసెందె కూలఁ దన • దాపలికేఁగను తాఁచె దైత్యుఁ డా

ఘాతముచేత నీలు డసు • కాండము తల్లడమందె నాయుధో
పేతుఁడుగాని కుంభున • వ్రేయఁడు నిర్జరవైరి పాడిమై.

చ॥ అదిగని యంగదుండు రథ • సారథియంబున వార్ధినుండి బె
ట్టిదమగు కొండఁదెచ్చి పుర • డించి నిశాచరుఁ డీల్గెనంచు స
మ్మదమున వానరాధిపులు • మానుగ గంతులు వెట్ట వైచె న
ప్పుదియుఁడు రాఁచె దానిఁ • దన వామభుజంబున దైత్యు లార్వఁగన్.

తే॥ తాఁప నక్కొండ మురిక్కలై • ధరణిఁ బడియె, నేది తెరువని హరులు వెం • పేది పఱవఁ
బెరిమె ముందుంచు పాదంబు • వెనుకఁదివక, యక్కసును తానుగా నిల్చె • నంగదుండు.

తే॥ కుంభకర్ణుఁ డంత నమోఘ • ఘోరనిశిత, వజ్రదండ మెదమచేతఁ • బట్టివైచెఁ
బ్రాణములు వీడఁగలఁపని • పలికి దాని, నంగదుడు పట్టుకొనె వేల్పు • లభినుతింప.

తే॥ పట్టిన దండముఁ ద్రిప్పుచు, దిట్టండగు కుంభకర్ణు లీపి • యసులుఁబలన్
నెట్టన గొనియెదనని పిడు, గట్టులు మిడుఁగుఱులు నెదర • నతనిం దాసెన్.

చ॥ కదిసిన వాలిపుత్త్రకుని • కర్బురవర్యుఁడు గాంచి వావఁగాఁ
బదరెడు వానరేంద్రుఁడవొ • వాలిసుతుండవొ? లంకయందు ని
ప్పు దపులఁబెట్టి రాక్షసుల • పొంకమడంచిన వాయుజుండవో?
కొదుకక తెల్పుమా? యనఁగఁ • గోరిక నంగదుఁ డంత విట్లనున్.

మత్త॥ వాలపాశముతోడ రావణుఁ • బట్టి దిక్కులఁ ద్రిప్పు నా
వాలిపుత్త్రుఁడ రామభృత్యుఁడఁ • బంతమారఁగ నిన్ను నా
వాలమందునఁ జుట్టి రాఘవు • పాదసన్నిధిఁ జేర్పఁగా
లీల వచ్చినవాఁడ నం చద • లించి పల్కఁగ దైత్యుఁడున్

చ॥ మఱుఁగున నిల్చి నీజనకు • మ్రందఁగఁజేయు మహోపకారికిం
బెరసిన సూడు దీర్చి మఱి • మేలొనరింపవయేని లోకు లె
బ్బెఱికముతో హసింపరె ప్ర • వీణతఁ జేసితి మంచికార్యమే
తెలుఁగరు లైన శూరులు ను • తింపరె దీనికి నిన్ను? బాలకా!

మ॥ వడి నీలావును వానరుల్ పొగడ నన్ • వాలంబుతోఁ జుట్టి వెం
బడిఁ గొంపోవఁగఁ గాదుగాని సుమనో • వక్షస్థలుల్ గ్రుమ్మి వె
ల్వడు శూలాగ్రమునందు గ్రుచ్చికొని వ్రే • లన్ మింటిపై కెత్తి ని
న్నదరన్ లంకకుఁ గొంచుఁబోవుటకె నీ • యభ్యాగమం బర్భకా!

ఆ॥ అనుచు మఱిమిచూచి • యా కుంభకర్ణుండు, చేత వ్రేయ నూఱు • చిదురలగుచు
వజ్రదండ మవనిఁ • బడిన నంగదుఁడును, కినుక వాఁపలేక • కేలుసాచి

ఆ॥ పొడిచి కూల్తు ననుచు • మెడవంచి దుముకింగ, నసురవరుడు శీర్ష • మదరఁగఁ బొడిచె
వాడిపోటుతోడ • వాలిపుత్త్రుఁడు సోలి, నేలఁగూలె నాంజనేయుఁ డడ్డె.

ఉ॥ వెండియుఁ గుంభకర్ణుఁడు క • పిప్రభు పుత్రుని ఱొమ్ముగాఁడఁ జే
నుండిన శూలమున్ విసర • నుజ్జనసేసెదు నంతలో నగం
బొండు వహించి వాని శిర • ముగ్రత మోఁదుచు సింహనాద ము
ద్దండతఁ జేసి వాయుజుఁడు • దాశరథి స్తవ, మాచరింపఁగన్.

క॥ తలపై మఱియొక టిలవలెఁ, జెలఁగు మలను చేతఁగొనుచుఁ • జిందఱతోఁ గ
ర్వలిసుతు ఱొమ్మున సమ్మెట, వలెఁ దిగులన్ వైచి దనుజ • వర్యుం డార్చెన్

ఆ॥ అపుడు కీశవీరు • లంజక యంగదుఁ, గొనుచుఁ బోవ గొప్ప • కొండఁ గొనుచు
హనుమ కుంభకర్ణు • నదటున నీక్షించి, పన్నిదంబు చఱచి • పలికె నిట్లు.

క॥ వైచెద నీపై దీనిని. నీచేవయు నెల్లవారు • నియతి నెఱుఁగఁగాఁ
దోఁచితివేనియు నీతో, నేచి దురము సలుప కివలి • కేగెదఁ జుమ్మీ.

క॥ అన విని దనుజాధీశ్వరు, సనుజుఁడు రదనముల కాంతు • లడరఁగ నగి నీ
పెనుమల నను సోలించిన, నని గెలిచినవాఁడ వగుదు • హనుమా! వినుమా!

చ॥ అనుటయుఁ బిన్ననవ్వు నగి • యాశుగపుత్రుఁడు నీవు చేవ గ
ల్గిన దనుజుండవేని లెమ్ము • కింపక నిల్వుము నిల్వలేనిచోఁ
జనుము రణస్థలిన్ విడిచి • చయ్యనఁ బ్రాణముతోడ నంచు వై
చినఁ జలియింప కాళ్ల నిలి • చెన్ భుజమొందఁగఁ జూపి దైత్యుఁడున్.

చ॥ తిరుఁగయి నిల్చి బాహుల వి • దిర్చిన నమ్మల పేయి వ్రయ్యలై
ధరణిని రాలఁ గాంచి నయ • దాంతుడు మారుతి వీని చేవకుం
బరిమితి లేదు రాఘవుని • వాఁడి శరంబులె చీల్పఁజాలుఁ గ
ర్బురుని భుజాంతరంబు నని • పోయెను దవ్వుగ వీడి యాస్థలిన్

సీ॥ దెబ్బది వెల్లువ • లుబ్బఁ దాఁకి చ, చ్చినవారు పోవ శే • షించియున్న
వానరు లందొక • రేనియు నిగులక, క్రూరుని శూలమున్ • కొట్టునందు
కెదయుదు రని దొక • గడియలో జగములు, కలఁగుచుం డమరులు • తలఁగినారు
తాఁకినవారిలో • దర్పించి గెలిచిన, వారు నొప్పించిన • వారు లేరు

తే॥ కపిసరంగంబునం గుంభ • కర్ణుఁ డడరి, యొక్కొకకపికారణయైన రే • కుండఁజేసి
బట్టబయలుగ విహరించి • పౌరుషమునఁ, గీర్తికిం గ్రొత్త చనమును గ • ల్గించె నాఁడు.

తే॥ దుష్టముండగు కపిపీడ • మర్దనుండు, కుంభకర్ణుండు తిరిగిన • గొప్పబయలు
మున్నగస్త్యుఁడు త్రాగ నాఁ • జెన్ను తఱిగి, యడఁగినట్టి పయోరాశి • ననుకరించె.

మ॥ యమదంష్ట్రీకరుఁ డైన దైత్యుడు మహా • హంకారుఁడై కీశ బృం
దము చావంగని రామలక్ష్మణుల యు • ద్ధక్రీడఁ గాంక్షించి రం
గముసందే కలరా? యెటేగిరి? మఱో • కన్గొం డున్నదే లంక? ద
ర్పమునన్ రాకొకొ? యంచుఁ దా భుజము లా • స్ఫాలించుచుం గ్రాలెన్.

## లక్ష్మణ కుంభకర్ణుల యుద్ధము

తే॥ తరులు గిరులును బాలును • తగ్గిపోయెఁ, గోరిమూఁకయు సగముపైఁ • గ్రుంగిపోయె
ననుచు ఖచరులు చింతింప • వినిచిరాకు, గొనుచు సౌమిత్రి తన్ను పే • ర్కొనుచుఁ దాఁకె

మ॥ రణరంగంబున నిల్చి లక్ష్మణుఁడు ధ • ర్మం బెక్కు గావించుచున్
గుణరావం బొనరించె నూడిపడ ర • క్షోవార కంఠస్థలీ
గుణ సంఘంబులు కర్ణభేరు లగలన్ • క్షోణీధరంబుల్ ప్రతి
ధ్వానముల్ సేయఁగ భూతజాలము మహో • త్కంపంబునం బొందఁగన్

చ॥ పరపిన లక్ష్మణ ప్రదర • వారము నింగిని భూమిఁ గప్పుచున్
దెలిపి యొకింతలేక కదు • తీవ్ర దురంత రుషా క్షుధార్తమై
యెలుకలలోద నోట పడి • నిగల ముమ్మరముఁ బోయిపోయి య
మ్మొలకుల రక్తమున్ వెగటు • పుట్టఁగఁ ద్రావెను పెక్కు క్రక్కుచున్

తే॥ తలలఁ ద్రెంచుచు నవ్వల • దాఁటెఁ గొన్ని, తలల నొందిన రీతిని • తనరి కొన్ని
కడలకుం గొనిపోయెను • కరుల దూసి, యసురులం దూసి యవ్వలి • కరిగెఁ గొన్ని.

తే॥ మెఱుపుగుంపుల కైవడి • మెఱయు పైఁడి, మొనలతూపులు పఱచి య • మ్మొనను గలుగు
దనుజ ముఖ కంఠ భుజ భుజాగ్ర • శిర మహోరు, జాను జంఘా చరణ పృష్ఠ • సమితి నఱకె.

సీ॥ మొదలనుండిన వారి • మోములఁ దూఱి పె, న్కలఁగలవారి వీఁ • పులను దూసి
భేరుల కన్నులఁ • దూఱి కాహళములఁ, నాళంబులం దాటి • కాళెపట్టు
వారి చేతులఁ ద్రుంచి • వారణ కంఠముల్, తఱిఁగి శేరులఁ గూల్చి • నఱకి హరులఁ
జూచిన కన్నులఁ • జొచ్చి యేలిన కంఠ, ములఁ ద్రెంచి కడుపులఁ • గలఁచి వ్రచ్చి

తే॥ దంతములు రాలవాహ • స్తములు ద్రెళ్లఁ, గాళ్ళువిఱుగఁగన్నులు వోవఁ • గరులు గిరుల
కరణి దొరలించి సౌమిత్రి • కాండవయము, లెల్లెడం దామయై యిట్టు • లేపుమీఱె

ఉ॥ నేలను నింగిపై జరుగ • నేర్చిన వాదవముల్ నిరంతర
జ్వాలలు గ్రక్కుచున్ వెడలు • బాణ పరంపర నాట బమ్మెరం
గూలెను కొన్ని పట్టికొని • కొన్ని మడంగెను చాపకట్టుగాఁ
దూలెను కొన్ని నెత్తుటను • దోఁగుచు వ్రాలెను కొన్ని ధాత్రిపై

ఉ॥ పెక్కు శిలీముఖమ్ములొగిఁ • బెక్కు విధమ్ములఁ దాఁకి నొంపఁగా
బ్రక్కలను రథ్యపాళి రథ • చోదకు లీల్గిరి స్యందన స్థితిల్
గ్రక్కున రక్తవాహినుల • బ్రబ్బి రథమ్ములఁ బ్రోచుచుండఁగా
నొక్కటఁ బోపుఁ బోవ వాక • యోజయుఁ దెన్నును లేక యయ్యెడన్.

విధిని బోలిన నారాచ • వితతి గ్రుచ్చు, కొన్నవియుఁ ద్రెంచినవియును • కూల్చినవియు
రక్తఘటమువంటివి రక్త • సిక్తమైన, తలలు మస్తిష్క పంకంబు • పొలుపుదాల్చె.

॥ పొడిచి త్రోచిన • వడువునఁ బడిన తలలు, తుదుములం బడుఁ జల్లుల • తోయమొందె
సర్వ లోకనాయకుని వి • జయ మహోత్స, వమున కుంచిన మొలకల • పాలికలన.

। శరములఁ నొసఁగులఁ దగులం, గిరగిర వడిఁదిరిగి కరులు • గిపెట్టుచు వా
నర సైన్య మసుర సైన్యము, నరయక యరిగినదె పోక • యై యెడచొచ్చెన్.

ఉ॥ ఆమని మీనకేతనుని • యందము నొందిన సుందరుండు శ్రీ
రాముని తమ్ముఁడేయు ప్రద • రమ్ములు త్రుంపఁగ యామినీ చర
స్తోమము లేసినట్టి పలు • తోయము లందిన కైదువుల్ రజం
బై మహిరాలె రిక్కలు ర • యంబున రాలిన చెన్నుదోఁపఁగన్.

। కలకుటమ్ములు శ్రేణులై • కరుల హరుల, తలలఁ దూఱి తోఁకలడుస్సి • యిలనుగూల్చి
సిడము లూనిన దడములఁ • జెండి యరద, ములను దొలిచి జర్రిన న • వ్వలికినేగె.

మ॥ తలఁగించున్ సుఖదుఃఖ సంచితముఁ ద • త్త్వజ్ఞాన మంచాడు పే
ద్దల వాక్యంబునఁ బాపముం దొలఁచు ఖ • ద్దస్ఫార వీరత్వమన్
లలితార్థం బుపలక్షణా విధిని సం • లక్షింపఁగా నయ్యె దై
త్యులకు న్నాక వరాంగనా సుఖ విభూ • తుల్ మించి చేకూరుటన్.

ఉ॥ పాపులు రక్కసుల్ భయద • వాత్యవలెం జెల రేఁగి రాఁగ నా
తూపులు వహ్నిగుచ్ఛముల • తోయమునం బురడించి పైఁబడం
గోపులుగాఁగఁ గూలిపడి • కుత్సితులెల్లరుఁ జేరుచుండఁగా
నేపున నిండకుండు దివి • కెచ్చుగఁ బల్కు నొకండు గల్గునే?

ఉ॥ ఒక్కరి పాదముల్ మఱియు • నొక్కరి చేతులు వేఱు పొట్ట లిం
కొక్కరి శీర్షముల్ దొరకు • నొక్కొక యంగము లక్ష్మణాస్త్రముల్
చిక్కిన యంతవ ట్టరులు • చిక్కని యెద్దడిచే వడిం గొనెన్
ఒక్కొకచోట యాచకుఁ డొ • కొక్క పదార్థముఁ గూర్చుకై వడిన్.

ఉ॥ కొందఱి ముక్కులన్ మఱియుఁ • గొందఱి వీనులఁ గొందఱంఘ్రులన్
గొందఱి దీర్ఘహస్తములఁ • గొందఱి కన్నులఁ గొన్న బాణముల్
పొందిక విద్యయున్ ధనము • భూస్థలిఁ బెంచు కవిప్రకాండ సం
క్రందన వాగ్విరాజిత ని • రంకుశ ధార విధాన వర్తిలెన్

చ॥ అనువుగ ధర్మదేవతకుఁ • బ్రాణముఁ బోలిన లక్ష్మణుండు గు
ప్పిన విశిఖాలిచే నసుర • వీరులు దాఁగి క్షణంబు నిల్చినన్
గనఁబడు బిత్తియే యని క • కావికలై పరుగెత్తి సంగ రా
వని విడిపోయి రవ్వలికి • వారని నెత్తుర్చుటేఱులం బలెన్

మ॥ సపరోర్విన్ మరణించినట్టి జనమున్ • సౌమిత్రి దోర్వీర్య దు
ర్దమ పాండిత్యముఁ గన్నులారఁ గని యం • తం గుంభకర్ణుండు లో

కమలం బెన్నఁ బరాంబుజం బయిన శ్రీ • విరయుండు సౌమిత్రియే
సమతం బొందని మేటి ధన్వులని యి • చ్చంబల్కెఁ బల్తోయముల్

తే॥ గాలియెదఁ దలకంబె పే • గంబుగలది, జయ విలక్షణ సింహ ధ్వ • జంబుగలది
అన్నిదిక్కుల కేగును • పైఁ బేరు. ఎదిగఁ దోలించి లక్ష్మణు • డదుపువచ్చె

క॥ అసురుఁడు రథ స్థితుండయి, వసుధనుఁగని నేలనుండి • వియ్యము సేఁదల్
పొసఁగదని వాయుసూనుఁడు, కొసరి నిలిచి రసభుజములఁ గూర్చుండుమనన్

తే॥ కాదనసింగము గిరినెక్కు • కొమరుఁబోలె, నెక్కె సౌమిత్రి వానరు • నెలమి విజయ
నాదములుచేసి రసవిబు • మోదిలిరి. వానరు మూఁపు రథముగాఁ • దనుపుమీఁద

తే॥ వెండికొండపై బంగరు • కొండయట్లు, హనుమమూఁపుపై లక్ష్మణుఁ • డలరుసంతఁ
గడిమికిం దగు విలు కుంభ • కర్ణు డూని, యెక్కువెట్టి గుణధ్వని • యెసఁగఁజేసె

ఉ॥ రాముని దమ్ముఁడీవు మఱి • రావణు తమ్ముఁడ నేను ఇంట సం
గ్రామము చూడ వేలుపులు • గాంచను వచ్చిరి ధర్మవృత్తిన్
హోమిక మీఁద గొప్ప బ • లాతిశయంబులు వెల్లడింపుమున్
భీమగలిం డువంబు జవ • వింపుము వీరులు మెచ్చునట్లుగన్

ఉ॥ మా కులనాశనా జయిని • మానిని ముక్కును గోసినట్టి పీ
రా! లక్ష్మణా! యాచెలి స • హోదరి గొప్ప గణించు హస్తమున్
గాకులు మెక్కఁద్రుంచె న • ఖండ పరాక్రమశాలి వైనచో
లోకుల మెప్పుఁ గావి మను • లోపములేదని కాఱు నాడఁగన్.

చె॥ బలమె శరీర మందె నన • ధాటిని లక్ష్మణుఁ డల్లనవ్వి సీ
పలుకులకున్ సదుత్తరము • బాణము లిమ్మనిగాక ప్రల్లదం
బులకు నె సెక్కసంబులకు • బ్రువంగ నుత్తరమీయ మీకలెం
బలుక గ నెవ్వలే పనుడు • దాఘ రుషా కలితాత్ముడై వడిన్.

ఉ॥ విన్నుల నివ్వెరల్ పొరఁగ • గాఢముగాఁ బరికించి ఖేచరుల్
మిన్నగిలెం నెడిల్లు మరి • మేదిని కొండలు పిండియయ్యె నం
చెన్ని దలంగ విండఁ బదు • నెన్మది తూపులు గూర్చి యేయఁగా
నన్నియు నేసి కూల్చెఁ గమ • లాప్తకులుం డవలావ ధీరుఁడై

తే॥ అంతఁ గుంభకర్ణుని నిద్ర • దాంతకంబు, బ్రహ్మదత్తంబు బహుళరూ • పకమునైన
ఘోరశర మభిమంత్రించి • కూర్చియేసెఁ, జముఁడవయైన మరలింపఁ • జాలదనుచు.

తే॥ కన్ను మేసి దూరంబడి • కాండవృష్టి, గురియఁ గాంచిన సౌమిత్రి • కాండకవడి
సరిసి యొక దివ్య శరమున • నజికిపైవఁ, బెక్కు రూపులతో నది • పుడమిఁబడియె

ఉ॥ వాఁడిమి వేగముం గలుగు • బాణములం బదిరెంట మారుతిం
దోఁడిమి తగ్గనేసి యిరు • ముల్కుల లక్ష్మణు నొవ్వఁజేయుచున్

వేఁడిమిమీఱ నూఱులుగ • వేలుగ నొక్కొకసారి గూర్చి యా
తేఁడి మెలంకువం గనిన • దిట్టరి కప్పె క్షణంబునన్ దిశల్

చ॥ దిశలను గప్పు బాణవిత • తిం బ్రతి బాణములేసి లక్ష్మణుం
డసమునఁ దూల్చి నెవ్వడి ర • థాంగములన్ విఱుగంగఁ గొట్టి క
ర్కశ విశిఖంబులం బరపి • రథ్యములైన పిశాచ వాజి సిం
హ శరభ వారముం జదిపి • యయ్యసురోత్తముఁ గొట్టె నొవ్వఁగన్.

మ॥ పరివేషంబు నశించి నట్టి తెఱఁగై • భగ్నంబుగాఁ గూలె న
య్యరదం బప్పుడ చచ్చె సారథియు ని • ష్వాసంబు నింద్రాయుధ
స్ఫురణంబుం మదిఁ గొల్పి త్రుంగె విబుధుల్ • పూరించి రథ్యంబులన్
శరముల్ త్రుంచెనొ • మంత్ర మోః యనుచు నా • శంకించి రప్పట్టునన్.

మ॥ విరథుండై విగతాస్త్రచాపుఁడయి య • ప్పేడఁండు దైత్యానుజుం
డురు కోపంబున రేఁగి లక్ష్మణు నను • వ్యూహంబు నేఁ డాని సం
గరముం బూర్తి యొనర్తునంచుఁ గొనియెం • దర్పించి ముల్లోకముల్
పరఁగన్ గెల్వఁగ నిల్పు చిహ్నమనఁగా • భాసిల్లు శూలంబొగిన్.

క॥ వనధిపలె రేఁగి రావణు, ననుజుఁడు లంఘించె ధరణి • యదరఁగ వానిం
గని సౌమిత్రియు మారుతి, ఘన భుజములనుండి దిగియె • గరువం బెలయన్.

తే॥ తమ్మునకుఁ దోడుగాఁ బోయి • దశముఖుండు, పంపు-సేనకు వినుమడి • పంపనపుడు
తత్ప్రతన సాయుధంబయి • తరలివచ్చి, యల సుమిత్రా కుమారు ము • న్నలమికొనియె.

క॥ వానరులు కలఁగఁబాఱఁగ, దానవ చక్రంబు వచ్చి • తలపడఁ గని రా
మానుజుఁడు చొచ్చి కలఁచుచు, మానక యెనరేఁగె మారి • మసఁగిన కరణిన్.

ఉ॥ మోదుగువంటి కేశచయ • మున్ నయనంబులు నొప్పుచుండు క్ర
వ్యాదుల శీర్షముల్ కరుల • హస్తములున్ దురగాంఘ్రులున్ రథాం
గాదులు దొర్లుమండ రుధి • రాపగలెల్ల శవంబు లడ్డ క
ట్టై వగులంగఁ ద్రెంచికొని • యంబుధిఁ జొచ్చెను వ న్నె మాఱఁగన్.

తే॥ చక్ర తోమర శూలాది • సాధనములు, యామినీచరుల్ వైవ రా • మానుజుండు
నడుమనే కూల్పఁ దున్కలై • పడిన వాన, విజిగి కూలిన కైదుపుల్ • పెక్కులయ్యె

తే॥ హార కుండల మకుట కే • యూర కటక, వితతి లక్ష్మణ సాయక • విద్ధమగుచు
ఖండ ఖండంబులై మింటి • కరకునెగసి, యినహిమాంశు బుక్షతతిమా • ర్కొనివెలింగె.

క॥ సిడములు వింజామరములు, గొడుగులు కేడెములు పీలి • గొడుగులు విండుల్
సుడిసెడు నెత్తురుటేఱులఁ, బడ సీఁదెదు భూతగణము • ప్రక్కలఁద్రోఁచెన్.

## సుగ్రీవ కుంభకర్ణుల యుద్ధము

తే॥ లక్ష్మణునెదు దానవ సేన • లడఁగు టెగుల, ముమ్మరంబగు పోరిట్లు • మొనయుచుండఁ
గుంభకర్ణుఁడు గని కిన్కఁ • గొప్పరింప, భానుసుతుఁడు వానికి నడ్డు పడియె, గడిమి.

తే॥ అసురభుజములు విఱిగిన • వని తలంపఁ, దగిన తీరున ఘన పర్వ • తంబుపైవ
దానిసుఁడి ఘాతుకి జాలు • నేనుఁగులను, సేనలోని యేనుఁగులు భం • జింపఁ దివిరె

తే॥ కొండచిలువలు పెక్కులం • దుండి జాఱి, మదకరులఁ గవ్వికొనె నట్టి • మలను పట్టి
కరతలంబున నక్కుంభ కర్ణుఁడుంచు, కొనియె దాన రాకాసుల • గుంపుమనియె

తే॥ అలవిలేని బలు దు రావ • ణానుజుఁడు, కోఁతివేఁడ! నీపైచిన • కొండ యిదియె?
యనిపరిహసించి పిసికి యు • ప్పనుచునూఁదె, వేల్పు లదిగని మిక్కిలి • వెఱగొనంగ.

తే॥ భానుసూనుఁడు మఱియొక • పర్వతంబు, ఫైదకుచ్చఁద రావణుతమ్ముఁ • దుమటుతోడఁ
జంపుమనఁ దపస్వుల శాప • సరణివడరు, తన త్రిశూలమ్ము గుఱిచూచి • తాఁకవైచె.

ఉ॥ పొంచిన వారలెల్లఁ గపి • కొంతుఁడు ద్రుంచెను ద్రుంచెఁ గాపరే
యంచును మొత్తువెట్ట పడి • నాశుగపుత్త్రకుఁ డడ్డువచ్చి యే
తెంచు త్రిశూలముం దిగిచి • కేఁకువ జానువునూఁది వంచి కా
వించెను తుండ్లుగా, నిడుమ • ద్రీల్పని దాసుఁడు దాసుఁడే భువిన్?

తే॥ జానకీదేవి సౌందర్య • మాని రామ, విభుఁడు మిధిలలో శివునిల్లు విఱుచునాఁడు
పుడినట్టి రావమె వాఁడు • పుట్టె గాడ్పు, పట్టి దైత్యుని శూలంబు • పట్టి విఱువ.

మ॥ తన శూలంబు వృధావనంగ హనుమ • ద్దార్ఢ్యంబు చింతించి నీ
ఘన బాహాబల మన్ని చోటుల నహో • ఘనంబై మహాకార్యముల్
పొనరించెం దగియుండ నప్పటఁ డివై పొల్పారుచున్నావు నీ
కెన లెవ్వారలు? పోరు దేని విను నీ • యిష్టంబ కావించెదన్.

తే॥ అనిన కుంభకర్ణుని గని • హనుమ పలుకుఁ, గలఁకు గావింపనని తొల్తఁ • బలికి పిదపఁ
బోరు నీతోడఁ బూనుట • తీరుగాదు, నలదటంపుఁ దొలంగి యు • వ్వలికిఁ జనియె

క॥ శూలము విఱుగఁగఁ బెర కర, వాలము లేకయును కలఁత • వదక నిలిచె హిం
సాలాలసుండు వానిం, దూలఁగఁ గపిరాజు వాడిచె • దోర్బల మెసఁగన్.

క॥ నొవ్వక దానవు తమ్ముఁడు, నవ్వి మదము నేఁటితో న • ణంగు ననుచుఁ దా
నువ్విళ్లఁ గేలం జాఁచుచు, నవ్వాలికిం దోవనీక • యుద్ధముపట్టెన్.

క॥ ఇరువురు వలయాకృతిగాఁ, దిరుగుచు దొరకుచును దొలఁగఁ • ద్రిక్కుచును పర
స్పర ముష్టుల నోళ్ళను నె, త్తురు గ్రక్కుచు నొలపులేక • త్రుంగని కడిమిన్

క॥ అదలించుచు హుంకృతులం, గదలించుచు బలిమిఁ బోరు • కడఁకం దనుజుం
డడిమెను సుగ్రీవు నలం, డెడ నొవ్వఁగ నొలసి సత్త్వ • హీనుండయ్యెన్.

ఆ॥ దురము ముగియు నేఁటి • తో నాయకుఁడు లేని, సేన చెదరు ననుచు • చింతచేసి
వైశ్రవసుఁడు ప్లవగ • పర్యుని గొని లంక, దెసకు నడచెఁ గపులు • దిగులువడఁగ.

తే॥ ఒకటఁ దల్లిసి డేగ త • న్నుకొనిపోవ, నడలు పక్షిపిల్లలవలె • హరిగణంబు
బెగ్గలించుచుఁ జేతుల • పిసికికొనుచు, నూర్పుపుచ్చుచు నేడ్చె దై • న్యాలు చెలంగ

తే॥ చెమటపోసి నాలుక యెండ • నమరులెల్ల, విన్నఁబోయిరి మనసుల • విసిగికొనుచు
నెడఁద లెరియంగ నుత్సాహ • మదుగుపట్టఁ, గ్రుంగి తపియించి కుమిలెఁ బ్ల • వంగకులము.

తే॥ మనసు నుడికించు కోపంబు • గొనిన కుంభ, కర్ణు డప్పుడు రాహువు కరణి నుండె
భాస్కరసుతుండు గ్రసియింపఁ • బడిన చంద్రుఁ, బోనివాఁడయి తేజోవి • హీనుఁడయ్యె.

తే॥ దానవుని కక్షిమేనిపై • భానుసూను, మేను తగ్గుచు హెచ్చుచు • మేషమఁదు
దాఁగుచును వెలివడుచును • డాలుచూపు, కలువతేని బింబంబనఁ • గానఁబడియె

క॥ తనతో దుర మొనరింపన, యని పంతము లాడినట్టి • హనుమానుం డో
దనుజన్మఁ బ్రతిఘటింపక, వెనుచనియెను మనసు పెక్కు • విధములఁబోవన్

క॥ వనచరవిభుఁ దనమూఁపు వ, యినుంచుకొని కుంభకర్ణుఁ • డేగుచునుండన్
మనకింకఁ బ్రభుఁ డెవండని, యినకులు పాదముల వ్రాలి • యేడ్చిరి ప్లవగుల్

తే॥ నీల నీరద శ్యాముఁడు • నిప్పుకంటె, నెఱ్ఱనైన కన్నులతోడ • నిషధిఁ దొడిగి
ధనువు సజ్యంబు గావించి • త్వరితగతిని, త్రుటిని పఱతెంచి నగరి వా • కిటికివచ్చె.

క॥ నానెయ్యుని నా ప్రాణము, జానునఁగొని కోటదాఁటి • జరగిన మోసం
బౌనని రాఘవుఁ డమ్మల, వానం గుప్పియించి వాని • పథ మరికట్టెన్.

క॥ శరములు గగనము గప్పఁగ, మఱుఁగయ్యెను దిక్కులెండ • మలయదు లోనన్
జరుగఁగలేవయ్యె వియ, చ్చరములు సైతంబు దాఁటి • చని దుర్గమ్ముఁ[illegible].

తే॥ నెవ్వఁడిం జను నయ్యూమి • నీ చరుండు, తెరువు విడుపక కప్పలు • తీప్పలగుచుఁ
గడకు నిండిన బాణదు • ర్గంబు చూచి, దీని దాఁటంగ నపదని • తిరిగి కాంచె

తే॥ కాంచి పద్మాకరము కాలుఁ • గేలు మొగము, కనులు కలుగఁ బూచి సొబగు • ధనువునూని
నడచి వచ్చెనా యన నొప్పు • నలువుకాని, బురుష మోహను శ్రీరాము • జూపుఁగాంచె

ఆ॥ మూసియున్న నోరు • పొగల వెల్వడచెను, పెదవు లదరెఁ బొమలు • వికృతి నందెఁ
గనులు నిప్పు లుమి సె • గర్జనమునఁ గొండ, లగల మాఱుమ్రోఁగె • సనిని వడఁకె.

ఉ॥ వాలి కబంధులం జెనయు • వాఁడని యెంచి కపీంద్రుఁ గాప గాఁ
బోలును నన్నెదిర్చితివి • పోడసఁ గీరితి రాదటంచు నే
మ్రాలుపలేదు నీయనుజు • మారుతి వానరనాధు; నిన్నె యీ
యాలమునం జయించి యశ • మందఁగ నారయుచుంటి నెల్లెడన్.

చ॥ వెదరుచునుండ నీబలము • వీఁగి దిగంతము దాఁకఁబాఱె వే
యొదిఁగెను నీదుతమ్ముఁడు మ • హోద్ధతితో నెదిరించి వాయుజుం
డదరెను వాలిపుత్త్రుఁడు • సంకిలినొందెను చేవదక్కి మూ
ర్ఛ దొరయు వీని నెత్తుకొని • పోఁగఁగ వచ్చితి నీవు దిట్టవై.

చ॥ వనచరుఁ గావఁగాఁ దలఁచి • వచ్చితిరేమొ? మదీయ భాగ్యమే
గొని యిటు తెచ్చెఁ గావలయు • గొబ్బుగ నిన్ను నలంచి యన్నకుం
జెనకిన వేదనం దొలఁగఁ • జేసెద దివ్యులు చూచుచుండఁ గోఁ
తిని గొనియున్న పట్టు విడఁ • దీసిన సీతయు వీడు బంధముల్.

చ॥ అనవుడు రాఘవుండు దర • హాస వికాసిత సుందరాస్యుఁడై
యను దనుజాధమా! వినుము • పాణిహితుం గొనిపోవు బాహువుం
దునుకలు సేయనేని ఘన • దోర్బలమేటికిఁ? జాపమేటికిన్?
మొన వెనుదీయు వాఁడనయి • ముట్టను వార్ముక మింత యేటికిన్?

తే॥ అనుచుఁ గుంభకర్ణుం డంప • యాఁకఁ ద్రోవఁ, బూన రెండమ్ములను నొసల్ • పొడువనేసె
నుదుటి యమ్ములతో నెత్తు • నొసలితోడ, దైత్యుఁ డరుణోదయముఁ బోలి • తనరె నపుడు

తే॥ ఫాలమున శోణితమ్ము ప్ర • వాహమట్లు. కాఱఁ దడిసి చల్లనగాఁగఁ • గపివరుండు
నిదుర మేల్కొన్న చందానఁ • గదలి లేచె, దిమ్మదిరుగంగ దైత్యుండు • సొమ్మసిల్లె

మ॥ నొసట న్నాటి వెలుంగువాని రవిసూ • నుం దొప్పవీక్షించి యి
య్యసమాస్త్రంబులు రామ సాయకములం • చాత్మన్ విలోకించి చు
ట్టిసలారంగని సర్వలోకములకున్ • హేత్వర్థమై యున్న శ్రీ
వసుధాధీశ్వరుఁ గాంచి జేయనుచుఁ జే • వం బొంది యా వెంబడిన్,

తే॥ అసురమానంబు లజ్జయు • నడుగుతోడ, నూడ నాసికయును చెవి • నూడఁబీఁకి
కొనుచుఁ గపిరాజు మింటిత్రో • వను బిరాన, వచ్చి తనవారలకు మోద • మెచ్చఁజేసె.

క॥ రవణించెఁ గపి సమూహము, రవణించె మహాద్రులంబు • రాశియు మొగుళుల్
రవణించెను వేల్పుగమి, రవణించెను పాడివేల్పు • రంజిల్లు మదిన్.

క॥ వచ్చిన వానరనాథుని, హెచ్చిన మోదమున జాన • కీశుఁడు కాంచెన్
గ్రచ్చఱ మైథిలి చెఱవిడి, వచ్చిన తఱి నొందునంత • పండుగు నొందెన్.

తే॥ నొసలు పగిలించి ప్రక్కల • దుసికిలిచన, రాముఁడు శరంబులేయఁగ • రాక్షసుండు
చేవచెడఁగ సుగ్రీవుండు • చెవియు ముక్కు, నూడఁగొఱికి కొంచేగెఁ గా • కున్నఁ దరమె!

తే॥ దనుజ ననుజుండు తెలివొంది • వనచరుండు, కరతలమున వాఁడవ్వాలి • కరుగుటయును
చెవియు ముక్కుఁబోవ్వ కుటింగి • చింతనొంది, చెలియలిఁ దలంచుకొని చాల సిగ్గునొందె

తే॥ నిష్ఠురమువోలె నొడల శో • ణితము వెడలఁ, గుంభకర్ణుండు ధాతుయు • క్క్ష్మాధరమొండు
వృష్టి గురియంగ నీఁదతో • వెల్లువలను, బయలు వఱచిన చందానఁ • బరిఢవిల్లె.

తే॥ పరపతిని కోరి వంచన • పఱచినట్టి, చెల్లెలికి ముక్కుచెవు లూడె • సిగ్గుచెందఁ
బరసతిని గోరి వంచన • పఱచువాని, తోడులకు నట్టు లౌటలో • దోసమున్నె?

తే॥ తనకుఁ గలిగిన దుస్స్థితిఁ • దలఁచుకొనుచు, రోసి దైత్యుండు చెంతఁజేరా • కాసుఁ, గను
నిక్కుఖచరులఁగాంచును • ముక్కుఁగాంచు, మునుపుగొన్న వాసినిగాంచు • భూమిఁగాంచు

## రాముఁడు కుంభకర్ణుని కూల్చుట

చ॥ చెలియలి ముక్కుపోయె నని • చింతిలు జేష్ఠుఁడు కాంచుమున్నె నా
చెలియలు తగ్గ యన్నవని • సిగ్గఱి దగ్గఱి చూచుమున్నె నా
చెలువఱు మోము రాముఁడు హ • సించుచుఁ గాంచెడు మున్నె వారికిన్
జెలువఱఁ గర్ణనాసికలఁ • జెక్కెదఁ గాకని యాగ్రహోగ్రుఁడై.

చ॥ వడి నొక వాలు పల్కయును • వారక కైకొని చేగ చాల దం
చెదముగఁ బాఱవైవ నుడు • బృందము రాలెను ఖేచరాళి పే
రెడఁదలు ప్రేవులుం గలఁగె • నేచిన యీసునఁ గర్ణ నాసికల్
వడవడ నెత్రు జార్చె బహు • భంగుల దైత్యులు పల్లటిల్లఁగన్

తే॥ మూఁడువేల పిశాచముల్ • మోచితెచ్చు, వజ్ర ఖడ్గంబు వలకేల • వారుకొనియె
వేయి భూతముల్ మోచిన • విపులఖేట, కంబు నెడమచేతం గొనెఁ • గనలు తొనఁక.

తే॥ కొండఁబోలిన కుంభక • ర్ణుండు కేడె, మెలమి నంకించి వైచి చ • క్కులను రాల్చెఁ
గాల నేలను తాఁచి పా • తాళభోగి, శిరములను ధరణియుఁ గ్రుంగఁ • జేసెఁ బెలుచ.

క॥ వీచిన ఖేటక ముఖమున, లేచిన పెనుగాలి కపుల • లేపి దెసలకుం
ద్రోచిన లోఁతగు కడలియు, నేచిన మిట్టయ్యె ఖచర • బృందము పఱచెన్.

క॥ ఇతరు లెఱుఁగుటకు మున్నె, మతిమంతుఁడు రామవిభుఁడు • మరలంగొట్టెన్
శితశరమున నదియు మహా, ద్భుతముగఁ బలలాశి హస్త • మునకే మరలెన్

క॥ వాలును నడుమనె క్రమ్మఱఁ, గాలుం బోల్చనుజవరుఁడు • కొలం దన్నన్
గాలికిఁ గలఁగిన జలనిధి, పోలికఁ గపిసేన కలఁగి • పొనుపడి చెదరెన్

క॥ పోరున నెదురై పడు కపి, వారంబును ద్రుంచి రక్త • వాహిను లడరన్
గూరిచి తిరిగెడు వాలును, శ్రీరాముఁడు విఱుగఁగొట్టె • శిత భల్లమునన్

ఆ॥ పాఁప తేని యుచ్చి • పంకంబు గావింప, దాలుపోయె నదను • డాయదింక
వీని నిపుడ చంపు • విడువకుమని ప్రోత్స, హించె జాంబవంతుఁ • డినకులేశు.

క॥ వానర సేనానాశము, దానవ విజయంబు బలము • దర్పము భూజా
జాని గని యముని నేఁడే, వీనియెదుట నుంతు ననుచు • వీఁకం దాఁకెన్

తే॥ వాఁడివడిగల పదుమూఁడు • బాణములను, రాముఁ డేసెను రణవిశా • రదుఁడు కుంభ
కర్ణుఁ దవ్వాని గ్రద్దయీఁ • కల విధమున, రాలి పడఁగొట్టె దన కర • వాలుచేత.

తే॥ బలిమిఁ దొరకిత వేసంగి • భానుఁబోలు, తీక్ష్ణ శరముల రాముఁడు • తివిరియేయ
నవియుఁ దునుకలై చెదరంగ • నసుర కొట్టెఁ, జేతివాలంపుఁ బిడితోడ • హేతులెసఁగ.

కం॥ దరహసిత వదనుఁడై శ్రీ, వరుఁ డొక బాణమ్ము లాగి • బలిమిని పిడన్
గరుడుఁడు సర్పముఁ ద్రుంచిన, కరణిని ద్రుంచె నది • వాని కర ఖడ్గంబున్.

తే॥ విలయవహ్ని యాఱఁగ నూర్పు • విడుచు కుంభ, కర్ణుఁ డప్పుడు తనచేతి • ఖడ్గమల్లె
యున్నదన వేఱుఖడ్గంబు • నూని ముగిసె. ముగిసె రాఘవుఁడని యెదు • రుగను నడచె.

తే॥ చేతఁబటి పటక మున్నె • శిత శరమున, నరిగ కరవాలు రెండును • విఱుగఁగొట్టి
కంకటము చొరఁగ్రూరాంబ • కంబులేసి, యొడలు చలియింపఁజేసె న • ప్పుడమి తేఁడు.

కం॥ చారులచే జరుగు సమా, చార మెఱిఁగి రావణుండు • సత్వరమున దే
వారులఁ బెక్కురఁ బంపెను, వారక తమ్మునకుఁ దోడు • పడ నవ్వేళన్

తే॥ దానవుని చంప నిదె మంచి • తరుణమనుచు, మదిని రాముఁడు తలఁచిన • యదనునందె
వచ్చె సేనయుఁ; జెడుగులు • వచ్చినపుడ, వచ్చి తోడ్పడు సత్కర్మ • ఫలములట్లు.

తే॥ నాల్గు విధములొందినపను • నాల్గుకోట్ల, బలమువచ్చి దానవుని కా • పాడఁ దొడఁగె
వడిగ రండని రాముడు • వారిఁ బిలిచి, తాఁకె మేను పూరింప ను • త్సాహగరిమ.

తే॥ కాలమితియుఁ గాలుఁడు బహు • కష్టములను, మూఁడు మూలహేతువులె ము • మ్మొనలుగాఁగ
మూఁడులోకంబుల జయింప • మూలమైన, శూలమును కుంభకర్ణుఁ డ • చ్చుగ ధరించె.

సీ॥ మండలీకరణ కో • దండుఁడై రాముండు, భండనమున వీడు • భల్లములకు
ఆట్టలు నటియించు • టా కాదనుచ మ్రాని, మొద్దులనుచుఁ గొండ • బ్రద్దలనుచు
నమరులు తలఁపంగ • నాడెఁ గబంధముల్, శిరముల కుప్ప ల • చ్చెరువు నించె
వ్రయ్యంగబడనివి • రక్తంబుచే నీద్వఁ, బడనివి తలలతో • వెడలునవియు

తే॥ విరిచియున్న వియును తూలి • నిలుచునవియు, జీవములతోడ దురమునఁజెలగు • నవియుఁ
బాఱిపోవునవియుఁ గానఁ • బడవు వెదకి, చూచినను మందునకు రణ • క్షోణియందు.

తే॥ మొగము లగలంగఁ బ్రేవులు • దిగఁ బడంగ, రదనములు వ్రీలమావటీం • ద్రకునుమించి
సుడిసి కూలునవియె కాక • చూడఁజూడ, మదముతోఁబోవు హస్తుల • మ్మహిని లేవు

తే॥ చక్రములు వ్రీలఁ దెక్కెముల్ • జాఱ నిరుసు, లూడ ముఖభాగములు సొంపు • వీడ హరులు
గూల రక్త మేదో మాంస • జాలమందు, మునిగినవి కాక తిరుగు స్యం • దనము లేదు.

చ॥ పదములు కంఠముల్ తునిసి వ్రస్సిన పొట్టలతోడ హేషలుం
గుదివడ హత్తి పీనుఁగుల • కొండల కొమ్ములఁబట్టు నెత్రు పె

ల్లివముగఁ బాఱఁగా సుదుల • లీనములై పరుగాడుఁ గాక యొ
ప్పిదముగ సంగరస్థలిని • వెఱ్ఱి తురంగము లేదు చూడఁగన్.

ఉ॥ రాముని యస్త్రనైపుణి తి • రంబు నిరూపణ చేయు చెట్లగున్
వేమముతో రణంబుగను • నిర్జరులన్ గలనం గనంగలే
కామెత సేయఁ జూచి రసు • రాలికి స్వర్గమునందు. భర్తలన్
ప్రేమను రోయ కాంతలు • వేసరి కాంచిరి నెత్రుటేళ్లనే

మ॥ లపనుం గాంచిన మంచుపోల్కిఁ జెడియెన్ • దైకేయ సైన్యంబు వే
లుపులన్ మిక్కిలి యుల్లసిల్లి సురల్ • దుఃఖింపఁగన్ లోక సం
తపనుండౌ దనుజేంద్రు తమ్ముఁడొకఁడై • దర్పంబుతో నిల్వఁగాఁ
గృప యేపారఁగ రాఘవుండు గని ప • ల్కెం బెంపు దీపింపఁగన్

మ॥ వినుమా సాయుధసేన గూలె ననిలోఁ • బెంపేది యొక్కండవై
కను మేలున్నదె? మా విభీషణునకుం • గారంపుఁ దోఁబుట్టువౌ
టను గావించెద జీవదానమును వి • టం జేరెదో? క్రమ్మఱం
జనుదెంతో? మఱి యిప్పుడే రణమునం • జత్తో వివేచింపుమా!

ఉ॥ తక్కులు వీడలేక పిన • తమ్మునిచేఁ బిలిపింప రాక లోఁ
జిక్కితి కాలు నానతికి • జీవితకాలము రాజ్యభోగముల్
దక్కనివయ్యెఁ దెల్పు ఫల • దంబగునే భువి మూర్ఖబుద్ధికిన్
దక్కక నీమదిం గలుగు • దానిని దెల్పుము రావణానుజా!

చ॥ అనవుడుఁ గుంభకర్ణుఁ డను • నర్కకులంబున నుద్భవించి పెం
పును జయ శీలముల్ నయము • వోఁడియుఁ బాడియుఁ గల్గు మీరు మా
యనుజకు ముక్కు గోసితిరి • యట్టులె నాకు నొనర్చినార లే
యనువున నీ మొగంబు గొని • ప్రాణముతోడుత నుండుఁ జెప్పరే?

శా॥ మాచే వేల్పులు దుస్థితిం బొరయ ద • ర్మాసంబు పాటించుచున్
నీచత్వంబిది సీత వీడుమనుమన్ • నీతుల్ ప్రసంగించియున్
నాచే నన్నకు నొవ్వికూడదను వి • న్నాణంబుతో వచ్చియున్
మీచే విల్లయి వెందియున్ మరలఁగా • నేరఁ ద్రపాహీనతన్

శా॥ మీ మస్తంబుల దీర్ఘ బాహువుల భూ • మిం గూల్చి మాయన్నకుం
బ్రేమంబారఁగ సీత నిత్తు ననుచున్ • ధీరంబుతో వచ్చి సు
త్రామాదుల్ కని కేరడింప వినమ • ద్వక్త్రంబుతోఁ జెల్లెలిన్
సోమింపం దనుజేంద్రు సన్నిధికి న • శ్రుల్ గార్చుచుం బోదునే?

శా॥ ఈవిట్లాడఁగనేల? ధీరుఁడవు గా • వే? మానముం బొందవే?
సేవాధర్మ మెఱుంగవే? యలుపులం • జిత్తంబునన్ మెత్తురే?

నావాక్యంబులు విన్మ మీశరములన్ • ఖండించియుం బిమ్మటన్
దేవారాతి పురంబుఁ జేరఁదగునే • తేజో విహీనుండనై?

మ॥ అనుచున్ శూలము దా కరంబునకు దా • నంకించుచున్ ధాత్రి క
ద్దునఁ బ్రేపుల్ పెఱింటురీల పలచే • ఘూద్రంబుఁ గైకొంచు రా
మసకున్ సూటిగవైవ నాతఁడును దు • మ్ముం జిందనీకుండఁగాఁ
దునియల్ చేసి త్రిశూలమున్ శకల సం • దోహంబుగా వ్రీలిచెన్.

మ॥ కడిరిం ద్రావఁగ మిన్నుగూల్చ ఘన ని • ర్ఘాతంబులం గాల్పగాఁ
బుడమిం జీల్పఁగ మేరువుం దొలవఁగా • భూలోకముం దాఁటఁగా
నదర న్నేర్చిన రామబాణతతి యా • ర్యానాయకుండిచ్చు మై
తొడుగున్ వ్రీల్పఁగఁ జాలదయ్యె మదికిం • దొడ్డయ్యెఁ దచ్చిత్రముల్

ఉ॥ రాము నమోఘ బాణములు • రాజ కిరీట నభేద్య వర్మమున్
స్థేమము పేతఁ దాఁకియును • చీల్చని హేతు వెఱింగి యంత సు
త్రామనుతుండు రాఘవుఁడు • రౌద్రమహాస్త్రము మంత్రయుక్తమై
భీమబలంబునం దిగిచి • ఛేదిలనేసెఁ గవుల్ చెలంగఁగన్.

క॥ ఆ పగిది మఱుపు వెదఁగాఁ, గోపంబున నినుపకట్ల • గుదియంగొని యా
టోపమున రావణానుజుఁ, డేపడఁచెద నంచుఁ గాలి • నిలకుం దాఁచెన్

తే॥ పరవిననివేయిపదునవి • పరఁగవేయి, తొలుచునవివేయి పొడుచుచుఁ • బొలుచువేయి
యిషుపు లీలీతి ముసర వె • క్కడక భీమ, బలుఁడు తిరిగెను తర్జన • భర్జనముల.

తే॥ వీనిచే దండముడిన • సేన బ్రదుక, దనుచు నొక పెట్టఁ బదియమ్ము • లంటనేసి
తుండములు సేయవాఁడు మా • ర్తండుడాలు, గలుగుడాలును కత్తియుఁ • గదఁకఁ దాల్చి.

తే॥ జడియఁజేయఁగఁ గోఁతుల • దడముకలఁగి, పిక్కబలముచూపిన రామ • విభుఁడుకాంచి
దనుజు బాహాదండం బడి • దంబుతోడఁ, దెగిపడఁగనేసెఁ బ్లవగులు • త్సేకమొంద.

తే॥ తుదకుదుష్కర్మములు నించె • దుఃఖములను, ముదమునిండించె సత్కర్మ • ములు నిజంబు
లంకకును రావణునకు బ • లంబు పేరి, చేయితెగ రాక్షసులు కాంది • శీకులైరి

తే॥ తెగని చేతితోఁ దెగిన చే • తిని భరించి, గర్జనముతో నసురవైవఁ • గపులు దావి
క్రిందఁ బెక్కండ్రు మడిసిరి • కికురుమనక, దుష్టుచెంత నెట్లుండిన • దోసమె కద?

చ॥ కడఁకను రాముఁ డక్కపి ని • కాయముఁ గాచుచునుండఁ గాలుఁడే
కడిగొనఁ జూఱలాడుక్రియఁ • గ్రందుగఁ గూలుట గాంచి సైన్యముల్
మడియును వీనిచే నిమిష • మాత్రములోనని త్రుంగకుండఁబై
నదరిన చేతికంపెఁ దెగి • నట్టి కరంబున కల్కి రెల్లరున్

ఉ॥ తక్కిన వానరుల్ చెదరి • తాఱఁగ దూఁకెడి రక్త నిర్ఝరుల్
మిక్కిలి పిన్గులం దిగువ • మింటఁ జరించు సురాళి భీతిమై

లంకఁగల • ధీరులఁ దక్కినవారు దిగ్భ్రమం
క్కసుండు రఘు • శేఖరుమీఁదికి దాఁటె గ్రద్దనన్.

యిగూడఁ దును • మందగు సంచు సురాళి కోరఁగా
సున్న జము • బిమ్మిటిదీఱ విజేత రాఘవుం
న్ దనుజు • హస్తముఁ ద్రుంచి పయోధిలోపలన్
వో యనెడు • మాడ్కిఁ బడం జనఁ గొట్టెదిట్టయై.

, భుజమే కవ్వముగ వేలు • పులు మును జలధిన్
ొను నా, రజమగు మల యనఁగఁ గలఁచి • రాయిడి చేసెన్.

క్షములతోడఁ, బరుగువాఋటచే రాము • పంపు సేఁత
• చెనసెఁ గుంభఁ కర్ణు భుజము మందరగిరి • కరణినొప్పె.

ఁ దొల్చి తమ్మటముగాఁ • గావించి మేఘంబుఁ గొ
ముండు కడఁకన్ • మ్రోఁగింపఁగా లేచు పెం
కర్ణుఁ దొగి మే • దోమాంస చర్మాస్థు లొ
మ్మగఁ జేయ వానర నికా • యంబుం గలంచె న్వడిన్

.ఎవ్వై యొక్కటఁ బంచభూతములు త్రుం • గంజేయఁగా రాని పె
న్నరుషం గైకొని ఘోరమై యమరి ప్రా • ణోత్క్షేపముం జేయు వాఁ
డురు కుప్య ద్యముఁ బోలువాఁడు రిపు ధై • ర్యోత్సాహ సంహారి యా
సురవిద్వేషి పదంబొకండు తునిమెన్ • సూర్యాన్వయుం డయ్యెడన్

తే॥ దంతములు రిక్కలంబోలెఁ • దనరివెలుఁగఁ, గ్రొన్నెలంబోలి వెల్లనై • కోఱ లలర
నెత్తురున నెఱ్ఱనగు నోరు • నిగుడఁదెఱచి, యొంటికాలను దాసెను • కుంటు చనుర

తే॥ ఒంటికాలితో నాకస • మంటఁ బెరిఁగి, ప్రక్కవారిని నోటితోఁ • బట్టి మ్రింగి
వాత్యవలె సుడియుచుఁ బైకి • వచ్చువాని, రెండవపదంబు రఘువరే • ణ్యుండు నఱకె.

చ॥ కరములతోడఁ గాళ్లుతెగి • కాశ్యపి క్రుంగఁగ దొడ్డకొండ వై
ఖరిఁ బడు కుంభకర్ణు ఘన • కాయమునందున రెండువేల యం
పఱ వడిఁ దూఱిపోవ నొక • మాత్ర చలింపక నోటనొక్క భూ
ధరముఁ బెకల్చి యూఁదె భయ • దంబుగ వానరసేన నీల్గఁగన్.

కే॥ పెద్దకొండను నాల్కతోఁ • దద్దయెత్తి, పొలికలను మాఁడఁగా శ్వాస • బలముచేత
విసరివైవ రాముఁడు కేలు • విదిరిచికొనె, వీని బలమపారంబని • వింతనొంది

మ॥ దనుజుం డంతటఁ జింతనొంది యవురా • దైత్యారి విద్విద్దె నే
ర్పునకున్ వేవురు రావణుల్ గలిగినన్ • బొందారఁగాఁ జాల రే
నును కాల్సేతులు కోలుపోయితిఁ దుదిం • దోడ్పాటు సూపంగ నే
యనువుం దోఁప దిఁకేమనంగ నగుఁ దు • ష్టాశా మహారోగమున్ ?

తే॥ అన్నకీర్తి దోడుపడు నాన • యడుగుపట్టి. దిక్కులకుఁ బాఱు ప్లరు • దిక్కుచూచి
ఎదుట నిలిచిన శ్రీరాము • నెనఁగఁ జూచి, కుంభకర్ణుఁ డిట్లని పల్కె • గోప ముడిగి.

మ॥ ఒరి పారావత పక్షికై యొడలి మాం • సోత్కర్ష భాగంబు ను
త్సుకతం గోసి శిరాజుసం బిడు యశో • ధుర్యాన్వయంబున్ బొం
దిర నొప్పారిన రామచంద్ర! విను దై • తేయాపధర్మంబు ల్రా
వ్వక మీ పాదము లాశ్రయించు నసురుం • బాలింపుఁడీ దేవదేవన్.

ఉ॥ క్షత్రియ రూపమునం గొని జ • గంబున ద్రుక్కిన సత్యధర్మముల్
ధాత్రిని నిల్పఁబూనిన స • దాశనదేవ! మదీయ జాతికిం
బాత్రములో సధర్మములఁ • బాల్పడకుండిన నాదు తమ్ము నీ
పుత్త్రునిగాఁ గృపం దలఁచి • పోషణసేయఁగఁ గేలు మోడ్చెదన్.

ఉ॥ విన్ను జయింప నెంచు రణ • నీచరనాయకుఁ డీ విభీషణు న్
బన్నగఁ జెట్టఁగోరు పగ • వాఁడని యెంచినవాఁడు తమ్ముఁడం
చెన్నక చిక్కనేని వధి • యింపఁగలం డవధానబుద్ధి మెఁ
దిన్నగఁ గాపుమంచు మఱి • తేటకు వేఁడి నమస్కరించెడన్.

తే॥ దుర్గుణుండు రావణునకు • దొరకి నీకు, వీడు తమ్ముని హనుమంతు • నియతితో నీకుఁ
దోడుగానుంచి సతతంబు • వీడనీక, యుండునట్లుగఁ గృపసేయు • మో గుణాఢ్య!

మ॥ వినువీధిం గను దివ్యులుం బసులుచౌ • విగ్రుందు పీడంచు వే
డ్కను వీక్షింపకమున్నె నీశరమున • గంఠంబు ఖండించి పృ
థ్వివి త్రోపాడక సాగరంబునఁ బడన్ • నేయింపు మీ యిద్దియే
విను నేఁగోరు వరం బటంచుఁ గరుణా • నిర్నిద్రుఁ బ్రార్థింపఁగన్.

మ॥ వరముం గోరఁగఁ ద్రోవరాదని యొకే • భల్లంబునం ద్రుంచి త
చ్ఛిరమున్ సంద్రమునందు ద్రోచి మునుఁగం • జేసెన్ రఘుస్వామి యా
శరధి నీరము నాల్గుదిక్కులకు హో • చ్చన్ లేచెఁ దర్వాత నా
చెరమల్లిండ మునింగి కాడ్పులఁ జెనా • శీర్షంబు శైలంబు నాన్.

క॥ పాడిరి రంభాదులు సుర, లాడిరి వీడిరి భయంబు • నవనీ జనముల్
కూడిరి ప్లవగులు రాఘవు, వాడిరి రక్కసులు తోడు • పాడగు కతనన్.

## 16. మాయా జనక పటలము. (95)

మత్త॥ కుంభకర్ణుఁడు సంగరస్థలిఁ • గూరు సక్రమ పద్ధతిన్
రంభఁ గూడఁగఁబోయె నయ్యెడ • రావణుం డొక వంచనా
రంభుఁడై కడు కావరంబున • రామ లోఁగొన నెంచి సం
రంభ మొప్పఁగఁ జేసె మాయల • రాశి యొక్కఁడు తోడ్పడన్.

తే॥ పంక్తిమస్తకుండు రహస్య • భవనమందు, కూరుచుండి మహోదరుఁ • గూర్మిఁజూచి
నేఁడు సీతను బొందినా • నెగులు దీర్చు, కొను నుపాయమొక్కటి దెల్పు • మనుచుఁగోర.

ఉ॥ ఎంచి యుపాయమొండు వచి • యించెద జానకి రాముగాఁగ మ
న్నించి పరించునట్లు జత • నించెదఁ జూడు మరుత్తుఁబిల్చి కా
వించెద నానికిన్ జనకు • వేషము వానిని కట్టి తెచ్చి చె
ప్పించెద నంతమీఁదఁ జెలి • తప్పక నిన్ను గ్రహింపదే ప్రభూ!

చ॥ అని యతఁడాడఁ బంక్తిముఖుఁ • డావట వానిఁ గవుంగిలించి నీ
వనినదిలెస్స వాని వడి • నప్పటికిం గొని తెమ్మటంచుఁ దాఁ
జనియెఁ గుల ద్వయంబునకు • జానగుదివ్వె పతివ్రతా మణిన్
జనకజ నిట్లు లోఁ గొనఁగఁ • జాలెదనంచు విమోహచిత్తుఁడై.

తే॥ మకుట పంక్తులు లేయెండ • మలసికాయ, నిరుఁదోలు నంగదముల • దరుల మెఱయు
సరులు కటిమల నెలయేటి • సరణిఁ దోఁప, మదగజంబు సిగ్గిలఁ బంక్తి • వదనుఁడరిగె.

ఉ॥ దీపము వేఱుదీపమును • దెచ్చెడు లీలల నొప్పు చంచలన్
ద్రోపుడు సేసి మేఖలల • తోడఁ గృశత్వము నొందు మధ్యముల్
తీపకు సంచలింపఁగ మ • దించు పయోధర భారవేదనన్
దాపున దేవకన్యకలు • తత్పరతన్ వడిఁదేర దీపముల్

ఉ॥ రాగముతోడ మాట లధ • రంబు ప్రవాళముతోడ స్త్రీల మే
ల్బాగులనెల్ల నొక్కయెడ • లాలితరీతిని దెచ్చి బ్రహ్మ సం
యోగము గూర్చె నా నలరు • నుర్విజ కొక్క జెడందగూర్చ సు
ద్యోగము సేసి దైత్యవిభుఁ • డుగ్మలిఁ గాంచి మనంబు చల్లఁగాన్

చ॥ అట నొకపైఁడి పీఁట నల • రారి వెలందుల నొంటకన్ని దో
స్తటములె లేమలంబడె నె • సంగఁగ దాపలి యూరు పీరి మీఁ
దటఁ గుడికాలు సేర్చ యడి • దంబు నొఱం దగిలించి రావణుం
డిటులను వేఁడికో లెడఁద • నేచి మొగంబునఁ బొంగలింపగన్

ఉ॥ ఎన్నడు నీమలెంకనయి • నీడితి సత్కృప యుప్పతిల్లు నిం
కెన్నఁడు భానుతోఁజనక • యుందుఁడు వేఱయి యుల్లసిల్లు నిం
కెన్నఁడు మారబాణముల • యేపు లడంగు మదీయ భాగ్యమా!
మన్ననసేసి కావు మను • మానము మాను మనంబు లోపలన్

ఉ॥ పంచితుఁడైన యేను చెలి • వాలకమై విష యుక్తమౌ సుధన్
బెంచి భుజింపఁ గోరితిని • మీఁదట నాఁటికి నాఁటికెంతో క్షీ
ణించి మనస్సు సర్వమును • నీఁగెను నీపయిఁ జింతనంబు చా
లించి మరింప జంకెదఁ జ • లించెద మాటికిఁ దత్తఱించెదన్.

ఉ॥ సోలిలి నోడిలిన్ శరణు • నొచ్చితి వేఁడితిఁ గాపుమంచు నా
పాలిటి భాగధేయమయి • పంతలఁ గూర్పఁగనేల ? చల్లనౌ
గాలియె కాల్చెఁ బుష్పములు • కాటులు వైచెను చందనం బహిం
బోలెను ఇష్టముల్ తెరిసెఁ • బోడిమి నెయ్యవి సేయఁజాలవో !

ఉ॥ కోరిన స్త్రీలనెల్ల నొకి • కోమలి జేసి యభిఖ్య లెల్ల నీ
పేరుగఁ జేసి నా కనుల • వేతౌకచోటికిఁ బోకచేసి యా
మారుని రేఁచి తన్నిశిత • మార్గణ ఘాతములెల్లఁ గూర్చి న
న్నారసి యేల కాడ్పఱతు • వో శరణంబని వేఁడుచుండినన్.

ఉ॥ శంకరుఁ డాదిగాఁగలుగు • సర్వజనంబులు భీతినొంద న
ల్వంకల గెల్చి లోకములఁ • బాలనసేయు వలంతి నేను మీ
నాంకుని కగ్గమై యొకిప • రాంగికిఁ బయిం దలకొన్న ప్రేమయే
దింకఁగఁ జేయ నాదగు కి • డింది మగంటిమి పొచ్చె మొందదే !

ఉ॥ వాడి కృశించు జీవములు • దాధల నొందుచుఁ బెక్కు నాళ్లగా
నాదిక నొందఁ గుక్క బ్రదు • కంచు వచింపదె లోకమెల్ల వె
న్నాడక ? పండిత ప్రభుల • నంగడ కల్ పదియంచుఁ జెప్పి రే
నోచక పల్కవాఁడ నెత • మో వెయియో యని యంబుజాననా !

మ॥ పరఁగన్ ధర్మమె ప్రేమచే నొసఁగు సౌ • భాగ్యంబు! మజ్జన్మ సం
తరణీ! నాయభిమానముం జెఱుప నీ • కారుణ్య సంపత్తి యే
కొఱయున్ లేని శవంబు పోల్కి నయితిన్ • గుంభస్తనీ యింక నీ
వరదివ్యౌషధ సేవచే బ్రతుకఁగా • వాంఛించితిం బ్రోవవే.

మ॥ నిజమూహింతము దార పెన్ వలపునన్ • రేరాయనిం బొంది భా
వజ సౌఖ్యంబులఁ దేలదే ? చెడిమె నే ? • పాపాల పాలయ్యె నే ?
త్రిజగన్మోహిని ? నా మనోరుజల వే • తీర్పంగదే ! వేరు మం
దు జగంబందునలేదు నీవె గతి వా • దుల్మాని ప్రార్థించెదన్.

క॥ అనుచు దశాస్యుఁడు వక్షం, బును బాహువులిర్వది పది • ముకుటంబులు భూ
మినిచేరఁ జాఁగిలంబడి, యెను మడఁతుల కేరికేని • యెదలు ద్రవింపన్.

## సీత రావణుని దూషించుట

వ॥ మృదుశీలాత్మక సీత లేడి పులి బా • రింబడ్డ యట్లై కడుం
బెదరెం గంపము నొందె భ్రాంతుపడియెం • బెగ్గిల్లెనట్లయ్యు వీఁ
డదయుండై నను చంప వచ్చిన నరే • యాఁగాక మద్భావముల్
మది నే దాఁపగఁ జాలనంచుఁ దృణమున్ • మాటొడ్డి తానిట్లనున్.

శా॥ నీ చేష్టల్ కడునింద్యముల్ కృపణముల్ • నిక్కంబు దుష్టాత్మ! యీ
నీచోక్తుల్ వచియింపఁగాఁ దగవు దు • ర్నీతుల్ చెడం ద్రోచురా
నీ చుట్టాలును నీవు నేఁటిదనుకన్ • నిత్రాణ్ని నా నుండఁగా
నాచెన్నారు పతివ్రతాత్వ ఫల ము • న్నన్ మండనా? మాఁడనా?

మ॥ తరుణీ ధర్మము నేను కాచి ఫలమే? ధర్మంబు స్థాపింపఁగా
ధరణీభారము మాన్ప రామవిభుఁ డు • ద్దండించియున్ లాభమే?
పరివారం బదినోట్ల నీకుఁ గలుగన్ • విడ్డూరంపుం బల్కులన్
భరమయ్యున్ విననుండఁగాఁ బలుకవో! బాధింపవో? చంపవో?

మ॥ తపనున్ వెన్నుని కార్తికేయు శివు ధా • తన్ జిష్ణుఁ జండాంశు ని
ష్ప్రభులంజేసి జయించినాఁడనని ప్ర • జ్ఞల్ పల్కుచున్నావు నా
తపముల్ పండిన పండుఁ శ్రీ రఘుకులో • త్తంసంబు దుర్వార బా
ణ పధి న్నిల్వఁగ లేక పాఱితివి మా • నంబొందు నీ కున్నదే?

శా॥ బన్నంబందుచుఁ బస్తులం బడి యశో • భావంబు పోనాడి నా
న న్నగ్గాడి నికృష్టవై నిలుచు దా • నంగాను నిర్దుష్ట భా
స్వన్నానాగుణ భూషణుండగు రఘు • స్వామిన్ మహా వాంఛతోఁ
గన్నారం గను భాగ్యమబ్బ నను వే • డ్కం దాల్చితిం బ్రాణముల్

శా॥ ధీరోదాత్తుఁడు లక్ష్మణుండు రణ ధా • త్రిన్ నిన్ను వెన్నిచ్చి యీ
సారిం బాఱఁగనీక యడ్డి నిలుచున్ • క్ష్మా భర్త నీ శీర్షముల్
వీరత్వంబునఁ గూల్చ నీయనుఁగులన్ • వేఁటాడి యేకైక దో
స్సారుండై వెలయంగఁ గాంచు ఘనకాం • క్ష న్నిల్పితిం బ్రాణముల్.

మ॥ కరుణాజీవము కంజనేత్రములు జో • కంగల్గి హస్తంబులన్
శరముల్ విల్లు ధరించి యెల్లర హృద • ధ్వాంతంబులన్ లాగు క
ర్బుర బృందారక వనాంతక ప్రబల జీ • మూతంబు గాకొందు గాం
చి రహింబొందదు మానసాంబుజమునన్ • సీతామయూరం బొగిన్

మ॥ కడఁకన్ జానకి యిట్లన న్నమలి క్రిం • గందగ్గ కోపంబుతోఁ
పుడమిం దాఁచుచుఁ బంక్తికంధరుఁ డను నో • పూఁబోఁడి! న్ గెల్చి నీ
బెడఁగుల్ పాపిన మీఁద రాఘవునితోఁ • బ్రేమంపు జీవంబు లో
క్కఁడుగా వాదెదుగాక యంచు నగె ని • ర్ఘాతంబు చందంబునన్

చ॥ నరసుర నాగ తాపసులు • నా క్రుధకుం గుఱి యైన వార లె
వ్వరు మని వారు? వెన్నునిగ • భావన సేయుము నీవు మోదమున్
బొరయుము నుండు మానవుఁడు • పూర్తిగ నీమది నాటియందుచో
మురియలు చేసి తీరుదును • ముగ్ధవు నా బలమున్ గణింతువే?

ఉ॥ కోఁతులు నాఁడె గట్టినవి • కోటను నట్టుగ ముట్టడించె దృ
గ్వీలిగఁ బోరె రక్కసుల • గీటడఁచెం గొలఁ యేమి యంచు నీ
చేతములోన నమ్మదము • చెందెదవే? శలభంబు లగ్నిలోఁ
గాలము నెంచు రీతిఁ బడ • వా? మతి నాదు ప్రతాప కీలలన్.

మ॥ వని సౌధమునందు రాజకులమున్ • సంపూర్తిగాఁ బట్టి బం
ధనముల్ సేసియె తెందు లప్పనె దలల్ • దర్పించి ఖండించి లెం
కని యాదేశ మొసంగి పంపితిని దై • త్యప్రాకరమున్ దద్విధం
బున సీతండ్రి వసించుచుండు పురికిం • బుత్తెంచిరిం గోమలీ!

చ॥ అని యసురేంద్రుఁ డాడ జన • కావని నాథుని పుత్రి సన్ను వం
చనమున నిట్లు సేయు గుణ • శాలికిఁ జేయఁగ రాని దుండునే?
జననిని చంపు పాపికిఁ బ్ర • జల్ సౌరకాయలు గారె? యంచు న
గ్నిని పడి త్రుంగి ద్రక్కు కర • ణిం దపియించెను నిశ్వసించుమన్.

చ॥ సన్నిటులార్చి త్రిప్పు విధి • సమ్మన బంట్లని మిమ్ము త్రిప్పఁగాఁ
బన్నఁగఁ గష్టజాలములఁ • బాల్పడఁ జేసెదు మీ రలంతులే?
అన్ని యధర్మముల్ మదికి • న్యాయముగాఁగనె మీకుఁ దోఁప నే
మెన్ని ఫలంబు నుంల వహి • యించునె? దుష్టుల కేవి ధర్మముల్,

సీ॥ అన్ని కన్నులందు ని • రంతర ధారఁగా, బాష్పము ల్గార్చుచుఁ • బరితపించు
నగ్మలి యెదుట మ • హోదరుండు మరుత్తు, జనకునిగాఁ జేసి • వెనుక కీడ్చి
చేతు లిఱియ గట్టి • చేసపడఁ దెచ్చి ని, ల్పఁగఁ గాంచి సీత కే • లను విదిర్చె
నేత్రముల్ మోఁదికొ • నిమె నిప్పు ద్రొక్కిన, విధిని పాదంబులు • విహ్వలించె

తే॥ మానసంబు శరీరంబు • మాడ్కి వేఁగె, ...లను పడియెను పొంపలె గొం • తెత్తియేడ్చెఁ
బలవరించెను వడఁకెను • కళవళించె, నేమి సేయంగఁ గలుగు న • య్యగుపఁబోఁడి?.

ఉ॥ హా యను దైవమా యను మ • హాపద రాదగునా యనున్ వశం
బా యను ధర్మముం జెడియె • నా యను సత్యము మాఁడి బూది యా
నా యను మాయలే బలిసె • నా యను నాపద నుంచి ముక్తి లే
దా యను లోకమెల్ల విల • యంబు భజింప శపింపునా యనున్.

మ॥ జనకా! నాకొఱకై యనేక దురవ • స్థల్ నీకుఁ బాటిల్లెనే?
నను గన్నందుల కిద్దియా ఫలము? ధ • న్యత్వంబు ప్రాప్తించె! నే
మనుదానన్ మనుదానఁ గాను బహుదుః • ఖవాప్తి బంధువ్రజం
బునకుం గూర్చినదాన నాయభిజనం • బున్ మెచ్చవచ్చుం గదా?

ఉ॥ పెట్టి భుజించినాఁడవు వి • వేకముతోఁ గ్రమ ధర్మ పద్ధతుల్
నెట్టన యాచరించితివి • నేర్చితి శత్రుల రూపడంపఁగన్

బట్టుగఁ బెక్కు జన్మములు • పాపము ముట్ట నొనర్చినాఁడ వీ
కిట్టని బాధలొందఁ బరి • కించితిఁ గన్నులు కాలిపోవమిన్

క॥ పలువిధముల నీరీతిం, బలవించుచు సొమ్మసిల్లి • పడుమఁ బొరలుచున్
దలఁకుచుఁ దలరుచుఁ గుసరిం, బలెఁ గరుణాంబుగను మరలఁ • బలవర మొందెన్.

తే॥ పాడి దప్పని వార్ధివ • వంశమందు, పొడమఁ నీవు పుత్రికలకుఁ • బుట్టినింటి
వారు చేయంగఁదగు కార్య • పద్ధతులకా, రామిఁ జూడ గోపియొ యిటు • రాక తండ్రి!

ఉ॥ మాయల మండిపింబగుచు • మ్రాల్చు చెఱఁ బురుడించు సంస్కృతిం
బాయఁగిలేక యార్తులయి • ప్రార్థన సేయఁగఁ గాచువాఁడు నా
రాయణు డంద్రుఁ విజ్ఞులు ద • రాస్థలి నా చెఱఁదీర్చి ప్రోచు వా
రేయెడలేరు నాకొఁకు • నెయ్యిన నీ చెఱఁ దీర్చు టెవ్వరో?

చ॥ వెకుగుటతోడఁ జేసిమిని • చెందెను వైరము దీనికంటె నీ
కడిమిని వీరనాకమును • కాంచిన మేలగు; రాజులందు గా
ఢపి వను పేరుతో సడిని • మీకిటి వియ్యాని సన్ను పుత్రిగాఁ
బడయు ఫలమ్ము మెమ్మ! సుత • పట్టిని నెవ్వరు మంది రీగతిన్?

చ॥ పలుపులచేతఁ గట్టుపడి • భారము మోయుచు దుర్ని మోఁదులం
బలువుగఁ బొంది పంకమున • మగ్నత నొందు వృషంబువోలె నే
నలయుచు నందఁ బట్టువడి • నెప్పుడె చావమి విక్రయించితిన్
నలువుగ మిమ్ము నారకము • నం బడి క్రమ్మఱ నాకుఁ గల్గునే?

చ॥ వెఱవడి శత్రునాశమును • చేసి ముదంబును బొందుదానవా?
గుఱుతుగ రామపాదములఁ • గోరికఁ సేవ యొనర్పుదానవా?
వెలపని బొటనై వెకుగు • చేసితిఁ దండ్రి కులంబుఁ గూల్చితిన్
గొఱవిగఁ గాల్చితిం బతి య • కుంఠిత వంశ విశేష కీర్తులన్.

చ॥ వనమున జీవితేశునకు • వారని వైర మొకండు కూర్చితిన్
జనకుఁడు బంధితుం డయిన • జానుగఁ జూచుచునుంటెఁ బాతకం
బున విలయంబులే కలిగెఁ • బుట్టిన యింటికి మెట్టి నింటికిన్
బనుపడి జీవితంబు నెడఁ • బాయ! నిఁకెవ్వరి కొంపఁ గూల్పనో?

చ॥ క్రతువు లొనర్చి నన్నరుదు • గాఁ గని పెంచిన తండ్రి బాహావుల్
కుతిలపడంగఁ గట్ట భువిఁ • గూలి యవస్థలఁ బొందుచుండ ని
శ్చితమతిఁ జూచు నేను రఘు • శేఖరు జీవితనాధు నిట్టి దు
స్థితి గనకుండఁ ముమ్ముగనె • జీవములన్ విడఁజాల నేమొకో?.

సీ॥ జనములారా! వృద్ధ • జనులారా! సోదరు, లార! జనకు దుర్వి • చార మెఱుఁగ
రేమి? నావలె మీకు • నిడుమలు గల్గెనే? రా రే? మరణించి • నారలేమి?

మేరువు నెక్కి స్వ • ర్మేదినిఁ బట్టిన, నందించి యీలంక • యందు దొరఁగ
సుకరంబు గాదు ల • క్షక వారు చంపిన, వంచనల్ చేసిన • వార్తఁ దెలుపు
తే॥ వారలెవ్వరు గలరు మీ • వలన వేయు. హనుమయొక్కఁడున్నాఁడె? య • త్నైనఁదెలియ
వచ్చుఁ దెలిసియుఁ జేయంగ • వచ్చునేమి? త్రిప్పి దుర్విధి యిట్లు వే • ధించు మంద

చ॥ జనకుని దెచ్చినట్టి నెల • జాణ రసంబున మేనువాదఁ జి
క్కిన సుగుణాఢ్య నచ్చరతఁ • గీడ్పడఁ జెప్పుటలోన శంకయుం
దనుకనె? యట్టులైన గుణ • ధాముఁడు రాముఁడు చాలకాల మె
ట్లను బ్రతుకంగఁ జోఁ దనుజ • లుం బడిచత్తురు గుండె వ్రీలఁగన్.

ఉ॥ సేతువుగట్టి లంకఁ బరి • చేసి యనేకుల దుర్నిశాటులన్
ఘాతకులన్ వధించెనని • పల్కిన వార్తల నాలకించి నా
చేతమునం బ్రమోదమును • చెందిరి దుర్విధి యిట్లుచేసె వి
ఖ్యాత తపోవ్రతంబులకుఁ • గల్గిన సత్ఫల మిద్దియే సుమీ!

చ॥ అని పలవించి రావణుని • నర్మిలి ప్రాణము సొమ్మసిల్ల రా
వణుఁడును లోన సంతసిలి • వారిజలోచన దుఃఖ మోర్వఁ జా
లనిదయి తండ్రి జీవితము • లం జెడనీయక కోరి కాచి తా
నును సుఖ మొందునంచు మది • నూల్కొన జానకిఁ గాంచి యిట్లనున్

ఉ॥ సుందరి! నిన్ను పొందఁదగు • చొప్పులకై తలఁపంగరాని యి
ట్లందుల నుంచినాఁడ మగు • వా! యవి యెల్ల క్షమించి నన్ను నీ
కుం దగు బంటుగాఁగఁ గయి • కొమ్ము విదేహ ధరాధినాథుఁ జం
పం దలపెట్ట నా భయము • మానుము నమ్ముము నా వచస్సులన్.

ఉ॥ వంతల పాలుసేయు వల • వంతకు దాపుదువేని చెప్పెదన్
జింతలఁ బాపి నీ జనకుఁ • జేర్చెద నింద్రుని సింహపీఠిపై
సంతసమంచి కోరిన జ • యంబునఁ గొన్న సమస్తరాజ్య మొ
ప్పింతును కాలఁ జూపు పని • వేడ్క శిరంబునఁ జేయు చుండెదన్

చ॥ వలసిన లంక నిచ్చెదను • వారని సేవధులెల్ల నిచ్చెదన్
లలిత విమానమిచ్చెదఁ గ • లంగక యిచ్చెదఁ జంద్రహాసమున్
దలఁపునఁ గోరె డెయ్యెది ము • దంబున నయ్యవి యెల్ల నిచ్చెదన్
గలికిరొ! డెంద మిచ్చెదను • కాదన నీదగు డెంద మిచ్చినన్

చ॥ పవడముఁ బోలు నోట నొక • పల్కు ప్రియంబుగఁ బల్కితేని నేఁ
దవిలి మహేంద్రు శిక్షక ము • దగ్రత దివ్యలు గొల్వఁ దెచ్చి శా
స్త్రవిధి విదేహనాయకు శి • రంబున నుంచెద సర్వ దిక్పతి
స్తవముల దేవ కామినుల • దాస్యముఁ గూర్చెద మేల్మి నించెదన్.

సీ॥ తండ్రిఁగన్న తండ్రికిని • తండ్రి విరించెయె వచ్చి కూర్మి నీ
తండ్రి కోరు కోరికల • దాఁపక యిచ్చు యముండు దాస దా
సుండయి సేవసేయు సుధ • సోదరి లక్ష్మివి నీవి కానిచో
నిందు మనంబుతో సిరియె • నీకును దాస్యము సేయు నమ్మమీ

తే॥ తండ్రికిం గూతుఁరైన మా • త్రాన ఫలమె? పొందదగు మేల్మిజనకుండు • పొందవలె?
ఒరఁగఁ ద్రైలోక్య రాజ్య సం • పదల నొసఁగి, యీవును సుఖింపుమనసీత • యీసడించి.

శా॥ ఈ సౌభాగ్యములెల్ల నొందఁగలవాఁ • డింద్రుండె నిక్కంబు లం
కా సామ్రాజ్యము నా విభీషణుఁడె వీఁ • కంబొందు విష్ణ్వంశమై
వాసిన్ భాసిలు రాము బాణముల నీ • వక్షంబు భేద్యంబు నా
కా సర్వేశుని పాదపద్మములె సే • వ్యంబుల్ జగన్నాశకా!

క॥ బెడిదములగు రామాస్త్రము, లదర యురముఁ జీల్చి యొడలి • నంతయుఁ బెను జ
ల్లెడగాఁ బొడుచుచు ధర్మముఁ, గడు నేర్పంగలవునీకుఁ • గర్కశ హృదయా!

తే॥ కాకిములు వంచువులతోడఁ • గనులు వొడిచి, తోఁడగలవు; నీ వక్షమ్ము • దోయజాక్షు
శరము లగలింపఁగలవు పి • శాచ సమితి, తినఁగలదు నీ శవమ్మును • తృప్తితోడ.

తే॥ క్రూర దంష్ట్రాయుతంబైన • ఘోరమస్త, కములు కలనరాఘవసాయ • కములవలనఁ
ద్రుంపఁబడియె రమ్మనుచు మా • రుతి వచించు, వార్తనేఁట జేపట విన • వచ్చు నిజము.

ఉ॥ మాత సుమిత్ర వీర వర • మాతగఁ జేసిన లక్ష్మణాస్త్రముల్
నీ తనుజాతు ప్రాణముల • నీఱుగఁ జేయఁగ వాని మేను సం
ప్రీతిని కుక్కలీడ్వ ననిఁ • ద్రెళ్ళతె పుత్రక! యంచు నీవు దుః
ఖాతురఁ దౌచు బోలుటయె • ఘర్మిలి నే వినఁదగ్గ పల్కగున్.

ఉ॥ క్రూరుఁడు రావణుం డటులు • కోమలి పల్కట లాలకించి పె
న్నీరసయెత్తి దంతముల • నీడిచి గీఁటుచు సీతపైఁ జడన్
దారున లేవఁగా నెమరు • దాసి మహోదరుఁ డీమె తండ్రియే
తూఱి వచింప సమ్మతిలుఁ • దొందర యేలని క్రిమ్మటించెడున్

తే॥ చచ్చినట్టులుండిన మాయ • జనకుఁ దపుడు, మెల్లఁ దలయెత్తియిట్లను • తల్లి! వీరి
వేఁడికోలును త్రోపంగ • నాదికేని, కులముతో నన్ను గూల్చిన • కొలయగుఁ జుమీ!

చ॥ సిరియును లోఁగి పెక్కురను • వెంచదె యమ్మపిగొడ్డు పోలికన్
వెరవిఁడి! నీకునై యసురు • వీడుమ నుంటివి బంటవై వృథా
మరణము నొందనేల? మది • మన్ననచేసి సురేంద్రనాథుఁడై
పరఁగిన వీనిఁ జేకొనుము • పాలనసేయుము ఘమ్ము మేలగన్

చ॥ కరుణను నన్ను నారుఁడు • గగ్గులకాడుగఁ జేయకుండ ని
బ్బరమునఁ బ్రోచి యగ్గలపు • భాగ్యములన్ సమకూర్చి నీచెలిన్
విరియఁగఁ జేసికొంచు ఘన • విశ్రుత సౌఖ్యము లెల్లవేళలం
బొరయుమ యంచు నయ్యలరుఁ • బోఁడి పదంబుల వ్రాలె గ్రక్కునన్.

చ॥ చెవులకు హస్తముల్ కదియఁ • జేరిచి జానకి విశ్వసించి యె
క్కువ దిగులూని దఃఖమును • కోపముఁ బైపయి నగ్గలింప మై
రవులఁగఁ దండ్రియేని తన • ప్రాణము లెచ్చుగ విచ్చగించి యీ
పవిదిని పల్కఁ డియ్యది సు • బద్ధము గాదను నిశ్చయంబుతో.

## సీత మాయాజనకుం ఉదరుట

చ॥ తగవు నశింప శీలము కొం • దంబడ క్షాత్రము కూలిపోవఁగా
జగతిని నిందమోప ఘన • సత్యము చావఁగ సచ్చరిత్రముల్
తెగులుగొనంగ గౌరవము • తీఱఁగ బుద్ధియు మాఁదఁగా నిటుల్
లెగిలి వచించు నీవు నొక • తండ్రివె? ధూర్తుఁడ వౌదు దుర్మతీ!

చ॥ కులము నశించినన్ గతులు • గూలిన నాపద లెన్నివచ్చి త
న్నలఁచిన గుండె వ్రయ్యలయి • నం దలవోయినఁ బాడిపేరుముల్
వెలఁగ మానముం జెడఁగఁ • జేరును లోకులు తూరుపెత్త రా
జులు మనువారె? స్వీయకుల • సూనను యారయ నీవుఁ దండ్రివే?

చ॥ జనకుని యట్లు తోఁప వొక • శ్వానము నీవి నిజమ్ము తండ్రివై
నను రఘురాము వింటికి ఘ • నమ్ముగ దీవన లిచ్చి యాతఁడే
నిను విడిపించునేని చెలి • నీఁగుము తక్కెనయేని చావు మ
న్య నియతి లేది యంచుఁ దగ • నాడక యీగతిఁ గాఱులాడెదే?

ఉ॥ నీవును నీదు చుట్టములు నీ • సకలంబును మాఁడి బొగ్గులై
పోవునుగాక నీతి పథ • మున్ మతిఁదప్పి చరింపనేర్తునే?
శ్రీవరుఁడైన రామవిభు • సేవకురాలగు నేను నీచనై
జీవములుండ రావణుని • చెంగట మానమువోఁ జరింతునే

ఉ॥ రామ విభుండు దక్కనను • రాగముతో నను డాయువారు ర
క్షోమరులైన దీపశిఖఁ • జొచ్చిన కీలములట్లు మాఁడరే?
యేమని యెంచితో నను? మృ • గేంద్రుని గూడిన సింహి యెన్నఁడేఁ
బ్రేముడిఁ బాడుగుంటలఁ జ • రించెడు నక్కను గూడియుండునే?

ఉ॥ క్రూరబలుండు రావణుఁడు • కోమలి పల్కు కఠోర వార్తలన్
దోరపుఁ గిన్కతోడ విని • తోయలి! నీవు తలంచినట్లె యె

ప్రాఁరము కాఁగఁబట్టి దెస • లారకపోవదు వీనిఁబట్టి నీ
వారయుచుండఁ ద్రుంతునని • యత్తఱి ఖడ్గము వేగ యెత్తుదున్.

ఉ॥ చంపఁగ లేవు నన్నితనిఁ • జంపఁగఁజాలవు విన్ను నీవునుం
జంపుకొనంగలేవు భువ • నంబులఁ గూల్పఁగలేవు రాముఁడే
చంపెడువాఁడు నీకు మొగి • సాయపడంగం నీదుబంధులన్
ఇంపటలెల్లఁ బూత్తిగ దొ • లంగఁగ నన్ గొనువాఁడు కీర్తితోన్.

చ॥ అని ధరజాత పల్కుతఱి • నద్దము వచ్చి మహోదరుండు పా
వనతర దేవభోగి యొక • పట్టున నీకయి వేఁడెఁగాక యీ
జనకుఁడు నీకొనర్చిన దొ • సం గొక యింతయు లేదు వీనిఁ జం
పిన వెనుకైన నంత పల • వింపదె నీకు నధీనయౌ తఱిన్ ?

చ॥ అని మొన రామభద్రుఁ దెగ • టార్పుము సర్వము నీకుఁ జక్కనౌ
నని వచియింప దైత్యవిభుఁ • డప్పని మాని తొలంగె నంతలో
వనచరు లార్చుటల్ విబుధ • వర్యుల కేకలతోడి చప్పటల్
విని మదిలోఁ గలంగె రణ • వృత్తము తత్తఱపాటు గూర్పఁగన్.

తే॥ ఇన కులేశుల గుణరావ • మెక్కుఁడయ్యె, నమర వానర కలకల • మతిశయించెఁ
గుంభకర్ణుని సైన్యంబు • గూలనాతఁ, డొంటిపై యుండెనని దైత్యుఁ • డుమ్మలించె.

## రావణుఁడు కుంభకర్ణ మృతికై విలపించుట

ఉ॥ తెక్కలు గట్టికొంచు నెస • రేఁగి వడిన్ వడి వచ్చి దూత లా
రక్కసి తేని కర్ణ విద • రంబుల డాసి మహా రణంబునన్
మొక్కలులైన వానరుల • మొత్తము మొత్తముగా వధించి పై
నుక్కఱి రామబాణముల • నుర్వరఁ దమ్ముఁడు కూలె గా యనన్.

తే॥ పరిధి గల భాస్కరుంబలెఁ • బైఁడి సరుల, చే నలంకరింపఁబడిన • శీర్షకములు
జగతిఁ బడఁ బెల్లగిలిన వృ • క్షంబు పగిదిఁ, గూలె రావణుఁ డవ్వార్త • కుములఁజేయ.

తే॥ ఉర్విఁ బుట్టకఁదొట్టి వి • యోగ దుఃఖ, మెన్నఁ డెఱుఁగని లంకా మ • హీశ్వరుండు
తనకునై ఘోర రణమునఁ • దమ్ముఁ డిలిగె, నంచు వినినంత గొంతెత్తి • యంగలార్చె.

సీ॥ త్రిదశ పద్మాకర • మద గజేంద్రమ! యింద్ర, వరకీర్తి పూర్ణేందు • వారిదంబ!
అబ్జజపౌత్ర! శూ • లాయుధహస్త. యీ, చెడువార్త నే డు నా • చెవుల వ్రీల
విననయ్యె నిన్నంపి • వెనుక నా ప్రాణముల్, గాచికోఁ దలఁచిన • నీచు నేను
నీ స్థితి విన్నచో • నిర్జరనాథు డై, రావణ మెక్కి స్వ • ర్గంబు చొరఁడె?

తే॥ విమతి నన్ను నీవే యిట్లు • విడిచి పోవ, నెవరెవరితోడఁ బుటర • హింపువారు ?
యెదుటి కేతేర భీతిల్లి • యొదుఁగువారు, చూచి తొమ్మైపైఁ జేతు యం • చుకొని రారె ?

తే॥ స్నాన మాడెడి ఎటి సీకు • స్వర్ణశిఖరి, మదమ రుద్దికొనెదు చిన్న • పడికె యగును
అట్టి నిన్నొరి మనుజుని • యలుగు కూల్చె, ననెడి మాటయే నామది • కలతగూర్చె

తే॥ కూల చిత్ర పత్రంబులు నోకి మొదలి, పైని రోమంబునేని రా • ల్పంగలేదు
అల్ప మనుజుని మృదుల సా • యకము త్రుంచెం, గుక్క సింగంబు నెదిరించి • కూల్చె నౌర!

సీ॥ తోడబుట్టువు మురుక్క • త్రుంగ మారీచుండు, త్రుంగ లంకయుం బట్టు • గ్రుంగ భీమ
బలుండు తమ్ముండు గ్రుంగ • బ్రదుకుచు నొకచెలి, సౌందర్యమున కానం • జెందినాండ
సినపులనైన నా • ఎని తమ్మునైన నే, నాని నైనను గపి • నాధునైన
నంగదునైన మ • హాబల సుతునైన, జాంబవంతుని నేని • చంపి తనుచు

తే॥ విసంగ నోచనైలి నిదేటి • వింతచావు, రాలు తేలెను బెండ్లు నీ • రమున మునిగెం
నేమి చెప్పంగంగలదింకం • దామసింప, కరుగుదేరంగం దలంతు ని • న్ననుసరించి

చ॥ అతిపలు కౌశలోత్తమల • యానిల మెయ్యన వీవ సూన సం
గత లలిమంబున న్నిదుర • గాంచెదు నోవరు ప్రేతి భూత సం
తతులు నటించుచుం గటు రు • తంబులు సేయు దురంబునన్ రజో
యుతమగు భూమి శయ్య నెటు • లొందితి నిద్దుర మేను వ్రాల్చెదన్.

తే॥ దిక్కులంమున నీవు కీ • ర్తిని రహింపం, జేయ మమవాని భోగముల్ • చెందుచుంటి
నీవు వోపంగ నేనెట్లు • నిలుచువాండ? వత్తు నీవెంటం దామసిం • పను నిజమ్ము.

తే॥ అనుచు ఉక్కలి పలవించి • తనదు కీర్తి, కారణుండెల్ల రిల్లైలుం • గంగం జేసె
నిల లసనోడు చలియింపం • జెంగలించి, మేనం బులకలు గ్రమ్మంగ • గ్లాని విడిచె.

తే॥ గాత్రి షుప్పొంగెం గాంభీర్యంబు • కడకుం జనియె, మనసు తెలివొందె జీవముల్ • మరలివచ్చె
నకిమె సేవసేయంగందగు • శీలచరిత, సిత యెలమికిం బొలిమేర • క్షితిని గలదె?

తే॥ కాంతు ఫలిత రూపము కుంభ • కర్ణ ఘోర, తనువుగాంచి భీతిల్లి త • త్తఱిలి యవలం
గెడపెం గుంభకర్ణుండను • నుడవు విన్న, సీత పూరించె వేడొక • సీత యసంగ.

తే॥ లోకములం గూల్తు లోకపా • లురను ద్రుంతుం, జావకున్నం ద్రిమూర్తులం • జావకుండు
మంచు దిన్న గీర్వాణుల • బందివైతు, నని చిరాకు మిక్కలి యొందె • నసురవిభుండు.

మ॥ తనువున్ వీడిన నాదు తమ్మునకు ను • ద్దామక్రియన్ రామ ల
క్ష్మణ రక్తంబునం దర్పణంబు నొగి ము • మ్మాఱుల్ మనశ్శాంతికై
యొనరింపంగలవాండ నంచు సమరో • ద్యోగంబునం బోయె రా
వణుం డాదోటును వీడి మంత్రులు సఖుల్ • వంటించి వెన్నాడంగన్.

తే॥ కాకి కంక గృధ్రంబులు • కలయ దిరుగు, పొలికలనం గుంభకర్ణుండు • పొలిసె ననుచుం
గుంది యాజనకుని వేఱు • బంది నుంచుం, దంచు నేగె మహోదరుం • డార్తి మెయిని.

తే॥ పూలు తావియు లేక దు • వ్వటలు లేక, యొంటి తిరియైన కేశంబు • లొప్పు సీత
కడకుఁ గడఁకతో త్రిజటయన్ • కాంత వచ్చి, యూఱడించుచు నిట్లని • తేఱఁ బలికె.

తే॥ నీ జనకుఁడంచు నీదు స • న్నిధికి వచ్చి, మలసి నతఁడు మరుత్తుఁడన్ • మాయలాఁడు
నిక్కమది యని నమ్మకు • నీరజాక్షి! దనుజ మాయలు పెక్కులు • తలరనేల?

తే॥ త్రిజట పల్కులయందు మై • థిలికి నమ్మ, కంబు గల్గుట నామె దుః • ఖమ్ము వీడె
సందియము వీడె మనసునఁ • గుండె వీడె, నెప్ప టట్టుల రామూర్తి • యెదురుచూచె.

## 12. అతికాయ వధ పటలము. (276)

తే॥ ఉగ్రమై వెల్గు విలయాగ్ని • యుడుకునట్లు, మండుకోపంబుతో రావ • ణుండు కొలిచి
యిరుకెలంకుల వచ్చు మం • త్రులఁ జూచి, రౌద్రమూర్తియై యిట్లు వా • క్రువ్వఁ దొడఁగె.

తే॥ అనువుగలవారు పగఱయు • క్కడఁచువారు, బలియుఁడని పంప శాత్రవ • బలమడంచి
మరలి రాలేక యూరక • మరలివచ్చి, నిలుతురేల? సిగ్గిలరె? యా • వలికిఁ బొండు.

చ॥ గతిమొకయింత లేక ప్లవ • గంబుల డంబుగఁ గూర్చుకొన్న దు
ర్మతుఁడమ చంపివత్తుమని • మాఱట రుద్రులఁ బోలె నేగి పెన్
జతనముతోడఁ దమ్మునకు • సాయము సేయక పాఱివత్తురే?
యతగులు మీరు ప్రాణముల • నంటి చరింతురె యెల్లకాలమున్?

చ॥ మునుపు జయించితిన్ జగము • మొత్తము నేలితి శౌర్యసంపదన్
గొనకొని మీరు నాదు మఱుఁ • గుం గొని గౌరవ సౌఖ్య కీర్తులం
గని చరియించినా రిపుడు • కార్యము గల్గిన మీబలంబు వం
చన మొనరింపకుండ నను • జాశము లిచ్చియుఁ జెయు టొప్పదే?

తే॥ అంతకర్హుల మేముకా • మందురేని, యట్లు చెప్పుడు నేనేగి • యముఁడు లేక
ప్రాణమానఁదగిన శక్తిఁ • బరపి నరులు, వీఁపు చూపఁజేసెద భూత • వితతి యదర.

తే॥ మఱియునొక్కమాట యరుదైన • మరమునందు, గెలువ గోరిన నేగుడు • చలముమీఱ
నిలుగుచే నిజంబని మీరు • తలఁతురేని, ఫలవ దెయ్యది మీకోర్కి • తెలుపుఁడనుడు.

తే॥ బ్రహ్మకోపించినను జయిం • పంగరాని, శూరు డతికాయుఁ డప్పుడు ని • ష్ఠురతతోడఁ
గోపమును సిగ్గు మల్లడి • గొనఁగఁ బలికె, రావణునితోడఁ దన పరా • క్రమము మెఱయ.

ఉ॥ జంకిన జంకనీ నరులు • జంభవిభేదియు నిర్జరావళుల్
జంకిన జంకనీ యజుఁడు • చక్రియు రుద్రుఁడు తక్కువారలున్
జంకిన నీవు నీకయి వె • సన్ బిడియంబు వహింతుగాక నే
జంకితినంచు నెంచుటయుఁ • జక్కటికాదు భవన్మనంబునన్.

తే॥ దానవులయందు ఘనబల • దర్పితులను, గెలిచి గెలుపును నీకుఁ గ • ల్గింపలేదె?
నీవును వడంకఁ బోరిన • నిర్జరులను, ద్రుంచి సారెనాఁ ద్రిప్పి యా • డించలేదె?

ఉ॥ దైత్యపు కేలనుండి ధరఁ • గూల నలంపఁగఁబడ్డ యట్టి దం
బేపల సాయకంబులఁడు • నీవును గద్దరి దుంపులొద్దుఁడున్
దేవల సత్త్వకీర్తులను • దీని నెఱుఁగని యా విభీషణుం
డో దనుజేంద్ర! నాకు నేము • లో! తలపోయుము నీమనంబునన్.

తే॥ నీదు తమ్ముని ప్రాణముల్ • నీవు నేయు, వానితమ్ముని జీవముల్ • ద్రాఁతిదీసి
రాము వడఁకింపఁజాలిన • ధీమ రేయుము, నేయ నేని నీ కొడుకనఁ • జెల్లుటెట్లు?

క॥ ముమ్మరముగఁ బోరి ప్లవం, గమ్ములఁ ద్రుంగించి దళము • గాంద్ర నలఁచి వీ
రమ్ముల నిడుపురు నరుల౦, రమ్మ లిటియుఁగట్టి తెచ్చి • ప్రాణం గనుమా.

క॥ బంటుఁతోఁ బొమ్మందువా, యొంటరిపై బొమ్మటంచు • నో సెలవిమ్మా
వంటింప కేగి వారల, దంటతన మడంతు ననిన • దనుజేంద్రుండున్.

క॥ ముదమంది లెస్స పలికితి, వి విసమ్ముస లక్ష్మణాఖ్యు • ఖండించినచోఁ
బవపడి మఱునాఁడే నే, సదమద మొనరించు రాము • చంద్రు మిరమునన్.

ఆ॥ మూఁడుకోట్ల క్రొత్త • మొన రథ గజ హయం, గములు లోదరాఁగఁ • గదన తలము
సేరఁ బొమ్మటంచుఁ • జీరి దీవించుము, నెలప మలిశయింప • నెలవొసంగి.

తే॥ విశ్రుతుల కసాధ్యులు మహా • నిష్ఠుర బల, ఘనులు కుంభ నికుంభులు • కంపనుండు
తేరి రక్షకులుగ వచ్చు • వారు పవన, జవన హయ శతాంగంబుపై • సరగఁజనుము.

తే॥ తేరు లొకవేయి యొకకోటి • వారణములు, కోటి వారువములు తోడఁ • గూడి వచ్చెఁ
గదలుమన నతికాయుండు • ముదమునంది, కార్ముకము పూనిపసిఁడి కం • కటము దొడిఁగె.

తే॥ కరినరావముల్గల వీర • గణము బలయ, వివిధ సాధనముల కాంతి • వింత గొలుప
వీధులెల్లఁ గ్రిక్కిఱియంగ • వెడలె దండు, పాదరేణువుల్ రోదసిఁ • బరవి నిండ.

సీ॥ గిరిదరీ సుప్తకే • సరులు మేలుకొనంగ, గజ బృంహితంబు ల • గ్గలముగాఁగ
కపి నికాయంబుల • కర్ణభేరులు వ్రీల, భేరీ రవంబులు • బోరుకొనఁగ
జీవసంతతి గుండె • చెదరంగఁ బంచధా, రాగత హయహేష • లలమికొనఁగ
స్రుక్కి శేషు నొడలు • మిక్కిలి బడలంగ, స్యందన నేమి ని • స్వనము లులియ

తే॥ కాలిబంటుల ఘనఘోర • గర్జనముల, దారణస్థితి గగనంబు • బూరటిల్లఁ
బాదవిక్షేపముల భూమి • పల్లటిల్ల, నడచె వడిగాఁగ దైత్య సై • న్యంబు లవిక.

తే॥ మున్ను మదగజంబులు వడిఁ • బోవుచుండ, వెంటఁబడి పోవుచుండెడు • పిడుగునాఁగ
ధ్వజము లొలయు శంపాయుత • వారిదములు, కదలుచుండెను వెనువెంట • గములు గట్టి.

తే॥ అంకుశము పోటుగొన్న సా • రంగములకుఁ, బ్రక్కలఁ బాఱు మదతోయంబు • పాఱుకతన
దారి బురదయై దిగఁబడఁ • దత్తడములు, నేనుఁగులు నేగె నక్కట • నీఁదుపోల్కి.

తే॥ భానుతోడఁ బరిధి యేగు • పగిది నడచె, స్యందనంబులు తోయద • చయమువోలె
నడచె వారణములు నేల • నడవవయ్యె, బయగు వాలుచు నుండెడు • తురగసమితి.

క॥ గిరి సముదయములు నడచిన, తెఱఁగునఁ దఱచగుచుఁ బెద్ద • కేరులు నడవన్
గరువంబున నతికాయుం, డిరవుగ నని సేయఁదగిన • యిక్కువ చేరెన్

క॥ శ్రీరామ మదగజేంద్రము, వీరవిహారంబు సలుపు • పృధివిని గని పె-
వ్వేత్తై పదములు ఱిఁగిన, వీరుని పినతండ్రిఁ గాంచి • విలపించెఁ గడున్

క॥ ఇది యమ్ములచేఁ దిప్పయి, పౌవలినయదిగాదు దిగిభ • ముల తనువు నీ
రదమును శరనిధియును గా, దిది తండ్రి శరీరమనుచు • నేడ్చెం బెలుచన్.

తే॥ అకట యిట్టి దుస్థితిఁ జూడ • నరుగుదెంచి, నాఁడ నుసుఱులతో నున్న • నరుల మున్నె
తునుమ కుండుటచే నింత • దొసఁగువచ్చె, నూరకుండుట నాకింక • నొప్పుగాదు.

క॥ అని కినిసి యిట్లు కావిం, చిన రామునితమ్ము నిల్లె • చెలగి చెలగి రా
ముని దుఃఖము గనినం గద, మన యంగద నీఁగు ననుచు • మదిఁ జింతించెన్

తే॥ మహిషుఁడను దూతఁ బిల్చినా • మాటగాఁగ, లక్ష్మణునికడ కేగి యీ • లలినిపలుకు
తమ్ముకై దురపిలు తన • తండ్రినెగులు, దీర్ప నతికాయుఁ డాజి కే • తెంచెననుచు.

తే॥ చింతచే మదికలఁగి కృ • శించుచున్న, తండ్రి నిండుసభను రాము • తమ్ముఁ డాజిఁ
గాళ్లు తెగి యురలంగఁ బాఁ • గాంచునట్లు, శపధములు పల్కి వచ్చెను • సరగ ననుచు.

తే॥ దురిత మిదియని తలంపను, వరశూరుల కిదియె ధర్మ • పద్ధతి యనుచుం
దెఱఁగొప్పఁ బలికి యతనిని, దురమునకుం దెమ్ము పొమ్ము • తోరంపు వడిన్.

క॥ నరులును యుయుత్సువులు నగు, నిరువుర వడిఁజేరి కలన • నెదిరెంచెదు వా
రిరువుగ జము నోటంజొరఁ, జరుగిడు వారనుచుఁ దెలియఁ • బలుకుము మహిషా!

క॥ వానిఁ గొని తెచ్చి విడిచితి, వేని ముదమునంది నీకు • నిచ్చెదఁ బ్రతిగాఁ
జీనాంబరములు మేలగు, మాణిక్య విభూషణములు • మహియు నొసఁగెదన్.

క॥ సౌమిత్రిఁ దోడితెచ్చినఁ, బ్రేమంబున ఖచర నాగ • విద్యాధర కాం
తామణుల నిత్తు నీవల, కీమహిఁ ద్రావని సురాదు • లిచ్చెద నీకున్

క॥ రవిమండలముంబోలిన, యవి వేల్పులు కాన్కవెట్టి • నవి యక్షేశుం
డవిరళముగ నిచ్చినయవి, తివిరి యొసఁగువాఁడ రత్న • దివ్యద్భూషల్.

సీ॥ దానవారలఁ దుమ్మె • దలు మూఁగు మదగజం, బులు నూఱువేలు నీ • కెలమినిత్తు
రత్న కాంచనమయ • రథములు పదివేలు వన్నెవన్నెల వారు • వముల నిత్తు
ధనరాశి నించిన • ఘనశకటంబులు, కోరికమీఱఁగాఁ • గొసరకిత్తు
దాసదాసీ జన • తండంబు లొకవేయి, వలసినచోటఁ గా • వలసినంత

తే॥ నేల యేలంగనిచ్చెద • నీవుపోయి, లక్ష్మణుని దోడితెమ్మ నీ • సూక్ష్మమతిని
దగిన నె జగునఁ బలికి క • ర్తవ్యమెట్లుఁ, జెదరయుండఁ జూడుము పొమ్మ • శీఘ్రగతిని.

తే॥ అనుడు మహిషుఁడొంటరియయి • యరిగియెదురు, వచ్చు రాముని గనినంత • వానరవరు
లలుక లేవ నుత్సాహంబు • గొలుపునర్థ. మొందు గలదని మహిషాసు • రుండుపలుక.

తే॥ రాయబారియై వచ్చె వి • రాయుధుండు రేఁగవలదని వారి వా • రించి విభుఁడు
వానిఁగని నీవువచ్చిన • పని విశేష. మయ్యేనేని తెల్పుమ యన • నసుర చూచి.

తే॥ మా ప్రభుఁడు చెప్పఁబంపిన • మాటయొందు. ?లయు లక్ష్మణులోఁ బల్క • వలయుననిన
వినెద వాక్రుప్పుమని రాము • విభునితమ్ముఁ, డనుడు మహిషాసురుండును • వినివెనిట్లు.

శా॥ నిన్నే ఘోర రణంబునం జెనర న • న్వేషించుచున్ వచ్చి యిం
దున్నాఁడం బ్రతియెద్దు శౌర్యమది నీ • కున్నేని వే రమ్మ తం
డ్రిన్నొప్పించిన నొవ్విదీటు నిను గం • డ్రింతుం దురంబందు మీ
యన్నం బిమ్మట నొంతుఁ బంతమిది ప్ర • త్యగ్రంబుగాఁ జేసితిన్.

మ॥ అనినన్ రాముఁడు నవ్వి యిట్టులను దై • త్యశ్రేణితోఁ బోర నా
యనుజుం డెప్పుడు సజ్జుఁడై యలరు దై • ర్యస్ఫూర్తి శోభిల్ల నా
నిసకా దాతని తండ్రి వచ్చినను మ • న్నింపన్ రణంబిమ్ము ర
మన్మహా మానము శౌర్యమున్ భుజ వల • వ్యాపారము ల్లగినన్.

మ॥ అన నాలోఁ దనె పంపుఁడంచు మహిషుం • డాడంగ మేలంచు ల
క్ష్మణుఁ బ్రేమంబునఁ గౌఁగిలించికొని రా • మస్వామి పొమ్మన్న స
ద్గుణభూషుండు విభీషణుం డనియెఁ గా • కుత్స్థాన్వయా! యుత్తలిన్
మనతోఁ గూడియె తమ్ముఁ డాదనుజుఁ జం • పం దగ్గ కార్యంబగున్.

సీ॥ సత్యవిక్రముఁడగు • సౌమిత్రితోన యు, ద్ధంబుసేయఁ బ్రతిజ్ఞఁ • దాల్చినాఁడు
తపమొనరించి వి • ధాతచే వరములు, గాంచి వేలుపుల జ • యించినాఁడు
కైలాసమెత్తిన • ఘనుఁడు మేరువునెత్తఁ, బ్రేమతో వీనిని • పెంచినాఁడు
వలయు సాధనములు • పనిలేక యే కేలఁ, బాలవెల్లిం జిల్కఁ • జాలినాఁడు

తే॥ విలయమునను నశింపక • వెలయుచుండు, ప్రథిత దిగ్గజములఁ ద్రోచు • బాహుబలము
తోడఁ జక్రవాళంబునే • త్రోవఁజాలు, దోర్బలము సమానమె? దశ • త్రోయజాక్ష!

తే॥ చిరము పాలాక్షుతోడను • దుర మొనర్చి, శూల మతఁడు వైవఁగ దానిఁ • గేలఁబట్టి
యావు విడిచిన శూలమా • యిది? యటంచు, నుల్లసములాడె నెఱఁకుల • నుచ్చి పాఱ

తే॥ పగలు లోకంబు వేల్పుల • నగరిఁగాల్చు. తఱిని విష్ణువు వైచు సు • దర్శనంబు
నిష్ఫలముగా నొనర్చిన • నేర్పులాఁడు, వీని సామాన్యుగాఁగ భా • వింపరాదు.

తే॥ అమరులేసిన వివిధ ది • వ్యాస్త్ర సమితి, పంబి రాకుండ నుగ్గునూ • చంబుచేసి
వారి పామర్థ్యముల వ్యర్థ • పఱచినట్టి, చండ కోదండ విద్యా వి • శారదుండు.

తే॥ శంకరుని శిష్యుఁడనితర • సాధ్యనవ్య, మహిత శస్త్రాస్త్ర విదుఁ డధ • ర్మంబు దక్క
వేఱెఱుంగఁ డసురుల • వీఁక దాఁకఁ, డసమ కీర్తికాముఁడు మాయ • లాజిఁ గొనఁడు.

సీ॥ మాయా విశారదుల్ • మధుకైటభులు తొల్లి, సురలోకమును చొచ్చి • చూఱలాడి
విబుధుల హింసించి • విధివశంబున నొక్క, దినమున శ్రీరమా • ధిపునిగాంచి
సమరమిమ్మనికోరి • సమ్మతింపఁగ వారు, బహురూపములఁ గొని • వచ్చిపోరఁ
జక్రియు వారితోఁ, జాలకాలంబు మ, ల్లాడంగ వారలు • హరినిగాంచి

తే॥ మమ్మెదిర్చి పోరివచ్చిన • మహితధైర్య, శాలి జగముల నీవలెఁ • జాలువాఁడు
లేఁడు మే మేడులోకాల • లీలమ్రింగి, క్రక్కఁగల బలియుర మాజి • కర్కశులము

తే॥ ఇరువురను మమ్ము డీకొని • యిన్నినాళ్లు, పోరితివి మెచ్చితిమి నీవు • కోరు వరము
నొసఁగువారము కోరి మే • లొందు మనినఁ, జక్రి కోరె వారల గెల్చు • సరవిఁ దెలుప.

ఉ॥ సీతొడయందు చత్తుమని • నిర్జరవైరులు తెల్పినంతఁ గం
జాత విలోచనుండు భువ • నంబు సమస్తము నొక్క యూరువం
దే తెఱఁగొప్పఁ జేర్ప నసు • రేంద్రులు వేర్పడి లొంగినారు త
ర్వాత గదాప్రహారమున • ద్రుందిరి లోకము లుల్లసిల్లఁగన్.

మ॥ మధు మేధస్సు ధరాతలంబు నెఱయం • బర్వంగ నిద్దాత్రి త
ద్భూధవే మేదినియయ్యె ధర్మపథమున్ • ద్రిక్కాఁడకున్నట్టి య
మ్మధువే యప్డుఁ గుంభకర్ణుఁడగుచున్ • మాఁడెన్ భవత్సన్నిధిన్
మధుతమ్ముం డతికాయుఁడయ్యె రఘురా • మా! దీన చింతామణీ!

ఆ॥ తగ విభీషణుండు • దైత్యుల చరితంబు, తెలుప నిట్లు మోముఁ • దేటపఱచు
మొలకనవ్వుతోడ • జలజాతనేత్రుండు, పలికె జలద నినద • భాషణముల.

సీ॥ కోటిరాక్షసులైనఁ • గూడ సురాసురల్, వచ్చి లక్ష్మణుఁదాఁకి • బ్రదుకువారె?
యితఁడు కోపించిన • నేనేల హరియేల? హరుఁడేల? యింద్రాము • రాదులేల?
దివ్యాస్త్రములుఁ దప • స్తేజోబలంబులు, సౌమిత్రి కినుకకుఁ • జాలునవియె?
కేల విల్లందిన • నీలోకములనెల్ల, క్షణమున నివుఱుగఁ • జలుపఁగలఁడు

తే॥ మేదినీసుత మాటలు • మీఱలేక, తొలఁగిపోవుటచేఁగదా • దుష్టరాక్ష
సుండు నేటికి జీవించి • యుండువాఁడు, కాకయున్న నాఁడే జముఁ • గాంచువాఁడు.

చ॥ తొనకక పొమ్ము నీవితని • తో నతికాయు శిరంబు తూపుతోఁ
జని గగనంబుదాఁకి పడఁ • జయ్యన గ్రద్దలు కాకులుం దినం
గనియెదుగాక కింబువులఁ • గంబులతో నెదిరింపఁ బోలునే?
దనుజుల గెల్వవచ్చినది తక్కక యెవ్వరితో నెఱుంగవే?

మ॥ తలఁపఁగా రుద్రుఁడో చక్రపాణియొ సుమి • త్రానూనుఁడో కాక యి
య్యల నెవ్వా రతికాయుఁగూల్పఁగలవా • రెన్నంగ వేవేల సే

సలుదైత్యానుజుతోడ రాఁ బదిపె నిం • కం జంపువాఁ డీతఁడే
గెలుపుం గాంచెడు వాఁడు సీతఁడగు శం • కింపంగ నీకేటికిన్ ॥

తే॥ కదలుమన రాఘవునకు ల • క్ష్మణుఁడు మ్రొక్కి, దీవనలుగొని చనతోడ • ధీరులైన
కపివరులు విభీషణుఁడును • కదసి నడవఁ, గదలి యతికాయుఁడున్న రం • గంబుఁజేరె.

తే॥ దక్షిణపయోధిమీఁది ద • త్తరపయోధి, వచ్చి చొచ్చినలీరునఁ • బ్లవగసేన
మోహరించిన సోఁకుల • మొగ్గరమును, చీల్చుకొని చొచ్చి యురవడిం • జెంగలించె.

తే॥ వచ్చినెత్తురుచేఁ దేమయై • పంకమైన, తలము సింహనాదమ్ములు • చెలఁగ రేఁగు
సైన్యఘట్టన దుక్కయై • సరగలేచి, రజమునింగి నెట్టనచేసి • ప్రబ్బుకొనియె.

తే॥ శంక కాహళ దుందుభి • స్వనము లెల్ల, వీర సింహనాదములతోఁ • జేరి యవల
శింజినీధ్వనితోడను • చెలఁగి జలధి, నోరుమూసికొనఁగఁజేసె • ఘోర కలఁగి.

ఆ॥ రక్కసులు నశింప • రక్తంబు సెలయేళ్ళ, మాడ్కిఁ బఱవ నాకు • బ్రాఁకులట్లు
కేతనములు త్రుంగఁ • గీశులు కొండల, నెక్కుపోల్కిఁ గరుల • నెక్కినారు.

తే॥ శాఖలనెడు దంతమ్ములు • క్షౌద్రమనెడు, మదజలంబును విలసిల్లు • క్ష్మాధరంబు
లనెడు నేన్గుల వైవఁగ • హస్తిహస్తి, ఘోర చండమై మదకరుల్ • పుడమిఁగూలె

తే॥ గట్టిగాఁ బట్టెఁ బొడిచెను • కఱచె రెక్కెఁ, ద్రుంచెఁ గపివికాయంబులు • తురగములను
రక్తపూరంబులో మెదల్ • వ్రాలఁ గాళ్ళ, పైకిఁ దిరుగఁ దన్నుకొనుచుఁ • బడియె హరులు.

తే॥ వనచరాఖేటమున మద • వారణములు, వాత్యచేఁ దూలు వారిద • పంక్తులట్లు
తూలిప్రీలిన దంత సం • దోహమందు, ముత్యములు పటపట రాలి • పుడమిఁ జెదరె.

తే॥ వజ్రపుం గంబములఁబోలు • పాదహతులఁ, గేలఁ గాలపాశముఁబోలు • వాలహతుల
దానవగణంబు లురలెను • తత్కఠోర, కుంతఘాతంబులం గపి • కులము దొరలె.

తే॥ చేతులకుఁ జిక్కు మ్రాఁకులు • శిలలుపాము, లేనుఁగులు గుఱ్ఱములుగద • లీఁటెలు రథ
శకలములు విసరుటచేత • సాంద్రమగుచుఁ, బరవెఁ గాంతారమట్లు పై • భాగమెల్ల.

క॥ వనచరవీరులు వైచిన, పెనుగిరితరు లంబరమునఁ • బెల్లుచెవన రా
శిని దిగు మొగుళుల వడువున, దనుజబలముమీఁదఁబడి స • దమదము సేసెన్.

తే॥ పాటి యావలావలకును • జాటిపడిన, పాఱుఁబోతు రాకాసుల • పరశు ఖడ్గ
ముద్గరాదిసాధనముల • మురియఁజేసి రుధిరపూరంబులం బడఁ • ద్రోచినారు.

తే॥ వీరులగు వానరులు రక్త • పూరమందు, యీఁదులాడుచుఁ దిప్పలై • యెలయుకరుల
నెక్కి రవియు నీద్వఁగఁబడి • యేటిపేనిఁ, జేరి దరిగానలేక గా • సిల్లినారు.

తే॥ కాళ్ళ విఱువనీకిద్దు ర • క్తప్రవాహ, మందు పొదుగుకోలల నూని • కొండతేగ
వారితోఁకలఁ దక్కిన • వనచరాళి, పట్టికొని యీఁదు చవ్వలి • పట్టుచేరె.

తే॥ సోఁకులను విజృంభించి మ • సుండి శూల, ముద్గరాదుల మోఁదంగ • మొగపు దక్కి
దిక్కులకుఁ బాఱ నదిగని • లక్ష్మణుఁడు, కసలుగొని వారి కుత్సాహ • గరిమఁ గూర్ప.

క॥ జము నుద్యోగంబునకుం, దమయన్నమ్మనకుఁ దోఁడు • తనరిన తన చా
పము గుణమును బలువిడి లాఁగి మహారావంబు లేపెఁ • గీడ్పడ జగముల్.

తే॥ పంచభూతముల్ తమ తొలి • ప్రకృతియందు, లీనమైనను బ్రహ్మయీ • ల్గినను విలయ
కాలమందును నాశంబు • గానకుండు ప్రణవముంబోలె నాధ్వని • పరిఢవిల్లె.

తే॥ వాఁడితూపులువిడువంగఁ • బడియెఁ బడిన, యమ్ములసురుల పెనుమేను • లందుమఱిఁగెఁ
గుణపములు సందులేకుండఁ • గుప్పలుపడె, వానినుండి రక్తముపాఱి • వార్ధిఁజేరె

తే॥ కరుల కరముల ఖురపుల, కాళ్ళఁద్రెంచి, రథిక శిరములఁ ద్రుంచి వ • ర్గములు పెంచి
వివిధచిత్ర రూపంబులు • వెలయఁజేసె, లక్ష్మణాస్త్రముల్ విధిపోల్కి లాఘవమున

తే॥ విండ్లు తుండించి శక్తుల • విఱుఁగఁ గొట్టి, గవచములఁ జీల్చి విపుల వ • క్షములఁ దొల్చి
గుజ్జముల వ్రాల్చి కేరులఁ • గూల్చిఁ యేనుఁ, గులను పీనుఁగులం జేసి • కోల లడరె.

తే॥ దంతిదంతముల్ తెగి నభోం • తరముచేరి, విదియచంద్రుల పగిదిని • వెలయుచుండెఁ
గరములూడినయవి రక్త • శరధినుండి, భూమిఁ బైకెత్తెడు వరాహ • మూర్తినెసఁగె.

తే॥ రెండు నెల రేకలను నోటఁ • ద్రెంచికొనుచుఁ, గుండలములను రిక్కల • గుంపుతోడ
గగనమండలమే డిగు • కరణిఁ దోఁచె, రక్కసుల తలల్ వడఁగ ధ • రాతలమున.

తే॥ రథికబృందంబు మరణింప • రథములురలి, పడియెఁ బదవి చెడం గర్మ • ఫలముచేత
మింటనుండి యొడ్డగిలంగ • మంటఁజాఱి, పడు విమాన సమూహంబు • పగిదిఁదోఁప.

తే॥ పీడఁగారాని సుఖదుఃఖ • వితతిఁద్రెంచి, యమరలోకంబు గైకొంటి • మని తలంచి
యధిక కౌతుకంబున నొడ • ల్లాడె సనఁగి, నట్టలాడెను రణభూమి • నిట్టలముగ

తే॥ ఒక్కపదివేలు మరణింప • నొక కబంధ, మూడుసను శాస్త్రసూక్తి స • త్యంబమైన
నాఁడు కోటికి నెక్కుడై • నర్తనంబు, చేసె సౌమిత్రి చాతురి • చెప్పఁదరమె ?

క॥ కరి భట తురగాదుల నె, త్తురు సెలయేళ్ళట్లుపాఱి • తోయధిఁజొచ్చెన్
అలవఱలై యతిముఱిమై, పఱిపఱియై యున్న పరియుఁ • బలుచంబాఱెన్

సీ॥ గొలుసులలోఁ దగు • ల్కొన్న కాళులతో ద్వి, పమ్ములఁదోలు క • బంధవితతి
తురగంబులు నటింప • నొరలక వానిపై, రీవి నర్తించు మొం • డెముల గుంపు
తలలూడినను గుఱి • తప్పక యెప్పటిఁ, బ్రదరంబుఁను వీడు • రథిక చయము
పరుగులెత్తుచునుండ • శిరములు తెగిపోవఁ, బరుగు పీడని వీర • భటకులంబు

తే॥ సీత పేరిటిమృత్యువుఁ • జెడఁగఁగోరి, తెచ్చుకొన్న దైత్యులు తండ్రి • తెరఁగొడుకు
మడియ నల్లుండు గూల హ • న్మందుచావ, నన్నదమ్ముల ఉరలఁ • దాము నడఁగినారు.

క॥ శరములఁ దునుఁగుచుఁ ద్రుళ్ళెడు, శిరములఁ గవ్వికొనిపోవఁ • జేరిన గ్రద్దల్
చరణాయుధములపోల్కిఁ, జరియించెం గొంచుఁబోవ • సాధ్యములేమిన్.

క॥ వేల్పై కోల్పై యగ్ని, జ్వాల యిమియ లక్ష్మణాఖ్యు • శర సంచయ మా
భీలంబై పడుచుండఁగఁ, గాలభటుం డిపుడు వీఁడె మెఁ • గాఢల లీపుల్

క॥ మేరువుఁ గదలింపంగల, వీరులు జ్వాల దర్పములను • విగళ ఘన తసూ
ధారులయి దివికి దుముకఁగ, వారిం గని పొంగినారు • ప్రమదంబు సురల్

సీ॥ దారుకుండనువాఁడు • దర్పించి తేరు పో, నించి లక్ష్మణు నెది • రించి నిలిచి
శరవృష్టి గురిసి యం • బరమెల్లఁ గప్పిన, వాని సన్నింటి నె • వ్వడిగఁ ద్రుంచి
సౌమిత్రి ఘోర ని • శాత శరంబున, వాని శిరము ద్రెంచి • వసుధఁ గూల్చె
కాలుండు కులిశుండు • కాలజంఘుడు మరు, త్తుండు మాలియను నైదుగురు రేఁగి

తే॥ పాశ శూల పరశు భిండి • పాల ముసల, ముద్గరాదుల వైవ నా • పురుషపుంగ
వుండు వానినన్నిటిఁ దగఁ • ద్రెంచి వారి, తలల నొక్కొక్క యమ్ముచేఁ • దఱిఁగివైచె.

సీ॥ అదిగని రోషించి • యతికాయు సేనాధి, పతులు వారణ కదం • బంబు రేఁచి
పరిగొని కైదువుల్ • పఱపి వానరాళి, నటునిటు పోనీక • యాఁచి నలఁప
వనచరుల్ చేతిక • త్తి వానిఁ గొని వైవఁ, బొలసుదిండుల లోనఁ • దూఁడినారు
సౌమిత్రి శరములు • సారంగ యూధంబు, సవరికిఁ జననీక • యలఁచి కొట్ట

తే॥ నంగములు పెక్కుతుంట్లుగాఁ • ద్రుంగిపడఁగఁ, జదికిలంబడె నొక కొన్ని • వచ్చెఁ గొన్ని
దిరిగె గిఱ్ఱునఁ గొన్ని మ • త్తిష్కపంక్తి, మంద యొఱవలుగాఁ గూలి • యడఁగెఁ గొన్ని.

తే॥ ఒక్కతొడుగున వెడలు మ • హోగ్రశరము, లొక్కపెట్ట సామజముల • నుర్విఁ గూల్చె
మావతుల జేల్చెఁ జౌదోఁ • మహిని దుల్చె, రక్షకుల మాల్చె బంట్ల బీ • రముల వ్రాల్చె.

తే॥ కైదువులు విఱిగెను యోధ • గణము తఱిఁగె, కంకగృధ్రజంబుకముల • కవు దీఱె
మా వటీంద్రఁ గోల్పోయిన • మదగజములు, కలఁగి యొండొంటితోఁ బోరు • సలుపసాగె.

ఉ॥ కొన్నిటి పాదముల్ తునుఁగఁ • గొన్నిటి తుండము లైదు తుండ్లుగాఁ
గొన్నిటి వాలముల్ తెగఁగఁ • గొన్నిటి ప్రేవులు జాఱఁ గన్నులం
గొన్నిటి కీఁగఁ గొన్నిటికిఁ • గ్రొవ్వు దిగంబడ వచ్చు దంతులు
గ్రన్ననఁ జచ్చుదంతులను • గా బహు భీకరమయ్యెఁ జూడఁగన్.

తే॥ కరిఘటలు గూలుచుండ రా • క్షసబలమ్ము, లించుకయుఁ బయిలోఁదక • యెదము లేక
యాయుధంబుల వైచుచు • హస్తివితతి, ననువుగా నడ్డుగొని పోరె • నగ్గలించి

తే॥ శరదములు భాస్కరుని గప్పు • చందమొంది, సామజంబులు లక్ష్మణు • సరవి ముట్ట
శక్రధనువుఁ బోలిన శరా • సనమునుండి, యతఁడు కురియించె బెడిదంపు • టంపవాన.

సీ॥ మోములు చీరి వీఁ • పులు వ్రీలఁ దుండముల్, పఱియలై ధారణిఁ • బడియెఁ గొన్ని
పొరలుచు దొరలుచుఁ • బెరలుచు ఘీంకృతుల్, నెఱపుచు ధాత్రి పై • దెరలెఁ గొన్ని
అర్ధ చంద్రాస్త్రంబు • లలమిన ఫాల భా, గములతో మేదినిఁ • గదచెఁ గొన్ని
వవధిలోఁ బడెఁ గొన్ని • వనమునఁ బడెఁ గొన్ని, పర్వతముల మీఁదఁ • బడియెఁ గొన్ని

తే॥ ఘోరశరములు కన్నుల • గ్రువ్వ స్వపర, భేదమెఱుఁగక తమవారి • విఱిచె గొన్ని
లక్ష్మణుఁడు దంతులంగూల్చు • లక్ష్యశుద్ధి, లాఘవము వేల్పులకును తె • ల్పంగఁగాదు.

తే॥ ఏనుఁగుల కళేబరముల • నెనఁగు నెత్రు, టేఱు లాపీన్గు తిప్పల • మీఱలేక
కరులవీరులఁ దేరుల • హరుల నెల్లఁ, ద్రోచికొనిపోయె నిలువక • తోయనిధికి.

తే॥ లక్ష్మణాస్త్ర చయంబుచే • లక్ష కరులు, గడియలోఁ గూలఁ దెలిసి లం • కా విభుండు
మిగిలియుండిన కోటి యే • నుగులఁ బంపె, నతనిమీఁదికి వీరస • మతిశయింప.

తే॥ ప్రాణములతోడఁ ద్రాణయు • నధికమదము, గలవి యగు సామజంబులు • కవిసియతని
మీఁది కుఱికిన దొంటియు • మిగులలేదు, డాయఁగాలేదు డాసియుఁ • బాయలేదు.

తే॥ ముప్పదాఱు యోజనములు • పొలసివచ్చు, కరిఘటలు రాఁగ లోకంబు • గజమయంబ
యయ్యెనని వేల్పులనిరి వి • హాయసంబు, ధూళిమయమయ్యె భూమి వి • ర్ధూళియయ్యె

తే॥ శాకినీ ఢాకినీ భూత • సంచయంబు, తుదియు మొదలును గనరాని • మదగజేంద్ర
రాశిఁ గని మునుమిడక తూ • ఱంగ దొరకు, వానిఁగొనిపోయెఁ గొండల • పగిది మోచి

క॥ ఒకశరమున కొక కరి లె, క్కకురాఁ బదివేల కరులఁ • గడిమిం ద్రుంపన్
గిరు లదరె మొగుళు ఁదలెను, శరనిధులుం గలఁగె దిగ్గ • జములును వడఁకెన్.

తే॥ గుణ రవములేచెఁ బర్వత • గుహలయందు, నిమర సెందు సింగంబులు • యెదలు గలఁగఁ
బిడుగు లదరిన వడవున • విశిఖవితతి, పడియె వేదండ తండ కుం • భంబు లగల

శా॥ ఆవేశన్ దనుజేంద్ర నందనుని సై • న్యంబెల్ల నొక్కుమ్మడిన్
వేవే కేకలువెట్టుచున్ మిగుల కుం • భివ్రాతమున్ రేఁప రా
ద్రావేశంబునగాంచి వీరవిహృతి • వ్యాపార లోలాత్మకుం
డైవచ్చెన్ వయిశంబ కేసరి ఒతుం • డా లక్ష్మణాస్త్రంబనన్.

మ॥ నరసింహుం డిత డంచు కాంచిన సురల్ • నక్తంచరుల్ భీతిలన్
హర కోదండ విభంజ నాంఘ్రియుగమున్ • హత్తించి చిత్తంబునన్
హరిదండంబున బోని తాళవిటపిన్ • హస్తంబునం దాల్చి హుం
కరణం బొప్పఁగ జేసె దానవుల కు • త్కంపంబు నిండారఁగన్.

మ॥ యముఁడన్ భూతములన్ మొగుళ్ళు నొకరూ • పై వచ్చెనా నొప్పి శై
లములం గూల్పఁగ వాలు వజ్రమును లీ • లన్ వాలి సంహార కా
లమునన్ రేఁగెడు రుద్రుమాడ్కి రిపు వి • క్రాంతి క్రమాభీలుఁడై
చమరెన్ గాలను గేలఁ దాళమున నా • సారంగ యూథంబులన్.

సీ॥ త్రొక్కుటచేఁగొన్ని • ఒక్కుటచేఁగొన్ని, కాలనుగొన్ని మోఁ • కాలఁగొన్ని
వాలమ్మునంగొన్ని • తాలమ్మునంగొన్ని, ఫాలమ్మునంగొన్ని • కేలఁ గొన్ని
నలఁచి కొన్నింటిని • మలఁచి కొన్నింటిని, విఱిచి కొన్నింటిని • కలఁచి కొన్ని
యూడ్చి కొన్నింటిఁ దో • లూడ్చి కొన్నింటివే, చీల్చికొన్నింటి మై • నల్చికొన్ని

తే॥ త్రుంచికొన్ని పెంటుచుఁగొన్ని • గ్రుంచికొన్ని, యొక్కటొక్కటిపై వేసి • యొక్కకొన్ని
హుంకృతింగొన్ని సమయించి • యుత్సహించెఁ • గేసరిసుతాఖ్య సార్థక • మై సనంగ.

తే॥ నేలకుం దాఁచికొన్ని వా • ర్నిధినిఁగొన్ని, లంకలోఁగొన్ని దెసలకుఁ గ్రుంకఁగొన్ని
ప్రేవుప్రోవు లుఱులఁగొన్ని • ద్రిప్పికొన్ని. సదమదముసేసి చన రేఁగె • శ్వసనసుతుఁడు.

తే॥ వాలముసుకొంచు చిలుప నా • పంచుపంచి, మావటీంద్రలోఁ గరుల నం • బరము సేర్చి
విలయకాల రుద్రుండను • ఠీఁకఁ దనరి, శవమయముచేసె నా రణ • స్థలముఁ ద్రుటిని.

తే॥ కలఁచిమాంసమేదోస్రపం • కంబునందు, పెక్కుగజములఁ గడిమిమైఁ • ద్రొక్కివైచె
మిగత లెస భాగమసుచు సౌ • మిత్రి వాని, ఘోరసాయక రాజిచేఁ • గొందివైచె

తే॥ అన్ని దెసల నేస్తులు పీస్కు • లగుచు నురలఁ, జిక్కి రక్కసుల్ స్రుక్కిరి • స్రుక్కకుండు
వార లిఱుకుకొనిరి లక్కు • వారు వెన్ను, చూపుచును చూచుచును పాఱఁ • జొచ్చినారు.

## దేవాంతకుండు హనుమచేఁ గూలుట

తే॥ అసురులట్లొటఁ గన్న దే • వాంతకుండు, తేరుఁ దోలించి కిన్కమై • మారుతిపయి
వాఁడి యమ్ముల నురమ్మునఁ • గాఁడనేసి, సింహనాదంబు దనుజులు • చెలఁగఁజేసె

క॥ పావని యొకతరువుంగొని, వైవఁగ నసురుండు దానిఁ • బఱియ లొనర్చన్
దీవరముగ మఱియొక గిరి, వైవ నతఁడు దాని నడుమ • భగ్నము సేసెన్

తే॥ గరుడుపూడ్కినదాటున • నదరమునకు, దాఁటి మారుతి దైత్యుని • ధనువు నూడఁ
దీసికొని రెండుగాఁగ భే • దింప వాఁడు, మరల హనుమని గొట్టెఁదో • మరముతోడ.

తే॥ తివిరి యనుమఁ దొడిసి పట్టి • త్రిప్పివైవ, దానిచే సారథియుఁ దేరు • ధరణిఁ దొరలె
యవల శూలంబుఁగొన్న దే • వాంతకు శిర, మూఁడఁబెఱికివైచెను కపు • లుల్లసిల్ల.

చ॥ అది తన కన్నులారఁగని • యా యతికాయుఁడు రౌద్రదృష్టితో
నదలిచి తేరుదోలుమని • యామున మారుఁతిఁదాఁకె సేనలున్
జెదరిసవెల్ల నిల్కడను • చెంది పదంపడి వచ్చె దైత్యుఁడుం
బదరుచు నాంజనేయుఁగని • పల్కె బయోధర భీషణధ్వనిన్.

మ॥ అసమాన ప్రతివీర నిర్మథన బా • హా దక్షు మా యక్షు ని
వ్వసుధన్ రాచి పయోధిదాఁటి చని సీ • ప్రాణంబు దక్కించుకొం
టి సమిద్ఘోరతలంబునన్ గడిమిమై • డీకొన్న దేవాంతకున్
పెసఁ దున్మాడితి వద్దిగాంచి యని గా • వింపంగ విచ్చేసితిన్.

శా॥ నేఁడే మృత్యువు దాపరించె వినుమా • నీపాలికిన్ నిక్కమీ
నాఁడే పూని వధింపకున్న మఱి యే • నాఁడున్ సమీపింపఁ బె
క్కేడాగోడము లాచరించితివి ని • న్నేడాటలాడింపకే
వీడంజాలను పాఱిపోక నిలుమా • వీరుండవే యైనచో,

ఉ॥ మేరు సమాన ధీరుడు స • మీరసుతుం డతికాయు వార్తకుం
గేరుచు నవ్వి వీరుఁడవు • క్రించుఁదనంబు లిఁకేల ? నామెడన్
గ్రూరత చూపఁగాఁ ద్రిశిరుఁ • గూడ సహాయత గోరుకొమ్ము నీ
యారసముల్ ఫలింపవని • యెల్లిదమాడఁ ద్రిశీర్షుఁడున్ వడిన్.

చ॥ తెరలక నిల్వుమం చరుగు • దెంచి రుమత్సుతుఁదాఁక నాతఁడున్
దురమొనరింప మీరె వలఁ • తుల్ వెడఁగుల్ చపలాత్ములంచు సం
బరముగఁ బల్కి దానవుల • పాలి యముండగు వాయుసూతి భీ
కరగతి వచ్చెఁ దానరుగు • గాలికి వారల నాల్క లెండఁగన్.

ఆ॥ వచ్చి వాని తేరి • పైకి లఘించి చే. వమెయి వానిఁబట్టి • వసుధఁద్రోచి
కాలరాచి ప్రతిన • పాలించి పడమటి. గవనుచేరె సేనఁ • గాచుకొఱకు

మ॥ త్రుటిలో దాఁటె నిఁకేమిచేయనగు నీ • దుష్టాత్మ నంచార్త సం
కటుఁడై యయ్యతి కాయుఁ డస్త్రువులు వే • కాఱంగ నిశ్చేష్టుఁడై
కటముల్ కేలువడంక నిల్చి యితఁ డు • గ్రక్రోధుఁడై నిల్వఁగా
కటలాక్షుండు నెదుర్చ జాఁడని ని • ర్ఘీతిం బ్రశంసించుచున్.

మ॥ ఒకకార్యంబును పూని వేడుకఁ దెదన్ • యోచించుచున్ నిల్కగా
ళ్ళకు మెచ్చన్నియగాదు లక్ష్మణు నన • ల్ప స్థైర్య శౌర్యాదులం
బ్రకటోగ్రాజిని గానఁగోరి యిటు లొ • ప్పన్ వచ్చితిం దేరు ని
ల్పక పోనిమ్మని తూణయుగ్మ మొకరే • వన్ దిద్దుచుం గ్రన్ననన్.

అతికాయుఁడు లక్ష్మణుచేఁ గూలుట

శా॥ నేడుధ్వానము వార్ధి ఘోషమును గ్రే • జింపన్ ధనుర్నాదముల్
జీమూతధ్వనిఁ గ్రిందుసేయ దెసలం • జేవ్రాటుగా శంఖ భే
రీముఖ్యస్వన మొత్తరింప నిరథా • గ్రి న్నిల్చు నక్తంచరున్
భీమప్రోద్ధతి లక్ష్మణుఁడు చెంకెన్ • వేల్పుల్ ప్రశంసింపఁగన్.

తే॥ త్వరితగతి వాసి వాలి పు • త్రకుఁడు దనుజుఁ, దనపమున నుండ నిల విల్చు • టనువుగాదు
క్రించుఁదన మైన నాపైర • హించి యెక్కు, మనుచు వేఁడఁగ సౌమిత్రి • యనుమతించి

తే॥ వానిభుజములపైఁ దన • పదములుంచి, యెక్కినిల్చె; వెన్ను ని మోయు • నెక్కిరింత
యూడితనికంచు వేలుపు • లిచ్చ మెచ్చి. విరులు కురియించి పొగడి దీ • వించినారు.

తే॥ వాలికొడుకు పెందేరేగు • వలని కేగుఁ, బెరుగఁ బెరుఁగు వింటికి నేగ • వింటికేగు
నడఁగ నడఁగు వెల్లేగిన • నట్టు లేగుఁ, బ్రభుని హృదయం బెఱింగి త • త్పద్ధతిఁ జను.

తే॥ అంగదుని నేర్పుఁగని వాన • రాధిపతులు, సంతసించియార్చిరి సమ • స్వాహ మెసఁగ
కరిఘటలమీఁద రథ తురం • గముల మీఁదఁ, గురిసె లక్ష్మణసాయక • కుంభవృష్టి.

తే॥ మురజములు మ్రోసెరథనేమ • మ్రోఁగెఁ దురగ, హేషలెసలారె శింజినీ • ఘోషమడరె
కరుల ఘీంకృతుల్ హెచ్చె శం • ఖములు మొరసెఁ, గ్రందెఁ దర్జన భర్జన • గర్జనములు.

ఉ॥ కూలెను వారణంబులును • గూలె రథంబులు గూలె నశ్వముల్
గూలెను కాల్బలంబులును • కుప్పలు తిప్పలుగాఁగఁ గాయఁడున్
సోలెను తద్రణస్థిరిని • చూడఁగలేక సుమిత్రపట్టి దృ
గ్జాలము పోపుచోటులను • సాయకబృందము పోయి నాటఁగన్.

మ॥ అతికాయుం గని లక్ష్మణుం డనియె వి • ల్లమ్ముల్ తగంబూని ద
ర్పితబుద్ధిన్ సమరంబు సేయ నిటకున్ • వేవచ్చె యిట్లుంటకున్
గతి యేదో తెలిపింపుమా యొకఁడవై • కయ్యంబు గావించెదో?
పృతనావారము గూలఁ దంత్రి పగిదిన్ • భీతుండవై పాతెదో?

మ॥ అన ధీరుం డతికాయుఁ డిట్లను సై • న్యంబెల్ల నాకేల? నీ
వును నేనే యసి సేయువార మట వే • ల్పుల్ తిక్కువారున్ రణం
బును వీక్షించుచునుండ నాకిది సి పెం • పున్ సొంపు శోభిల్లఁగా
నిను గూల్పంగలవాఁడ నందులకెగా • నేఁడిట్లు పిల్పించుటల్?

ఉ॥ రాముఁడె కావనిమ్ము త్రిపు • రద్విషుఁడే నిను కావనిమ్ము సు
త్రాముఁడె కావనిమ్ము సిరి • రాయనితోడుగ లోకసత్తకం
బోమగనిమ్ము నీయసువు • లుద్గతి నొందును నేఁడు ఘోర సం
గ్రామము నందు నిక్కమని • గర్వమయిందయి యొత్తె శంఖమున్

చ॥ అదివిని లక్ష్మణుం డదియ • హాసము చేయుచు నీవు పల్కు బె
ట్టిదు లిటరారు గెల్చినను • దింపక నేనొకరుండనే చుమి
పదర [illegible] గెల్వఁ బెరి • [illegible] గెల్చి [illegible] నా
యెదుటను నిల్వుము చూచ మ • హేషువు వక్షము నాటసేయఁగన్

చ॥ ఎదురయియున్న కాలునకు • వేగ గుణంబు దగిల్చి దైత్యుఁ డా
ప్రదరము నంతయంబునను • వ్రయ్యలుచేసి సహించి కాచుకా
మ్మదరక యంపఁ గ్రూరగరు • లాగ్నులు గ్రక్కు శిలీముఖంబులన్
బడియును నూరుగాఁగఁ దన • వారలు సంతసమంద నేయుడున్.

తే॥ వాని శరముల నడుమనే • వ్రక్కలించి, లక్ష్మణుం డేసె నాఱుకో • లలఁ గుబేరు
నోర్చి వెలసిన యతికాయుఁ • డుగ్రుఁడగుచు, నన్నిటూపులతో వాని • నడఁచివైచె.

మ॥ పురుషశ్రేష్ఠుఁడు లక్ష్మణుండు గుణ మా • పూర్ణంబుగా లాగి రౌ
ద్ర రసావేశము మీఱి తోఁపఁ బది నా • రాచంబులం జొన్పి మై
మఱువుం జించి నిశాతసాయకములన్ • మైసోలఁగా నేసి య
త్తఱిఁ దక్షీవల రూపుమాపె నొకఁడుం • దక్కంగ నీకుర్వడిన్

ఉ॥ వెంటనె కేఱివాఁడు తన • వీరకదంబము రూపుమాయుటన్
గంటికి బర్వఁగాంగ నెద • గానక యమ్ములు పర్వి నిండుటల్
మంటలు గ్రక్కఁ గాంచి బహు • మాత్రముగా శరవృష్టి ముంచి ము
క్కంటి యుగాంతవేళ నెస • కంబుగ నేచినమాడ్కి రేఁగఁగన్.

ఉ॥ ఆకసమెల్ల నమ్ములది • గంతము లమ్ములు భూమినమ్ము ల
య్యూఁకలమేన నమ్ములు స • ముత్కటమై యెటఁజూడ నమ్ము ల
స్తోకముగాఁగ నిండి వడిఁ • గ్రోవఁగ సాగెఁ బరస్పరంబు ని
శ్శ్రీ ములయ్యె సగ్ను లద • రెన్ గగనంబు ధరిత్రి శైలముల్.

చ॥ మునిఁగిన తోకఁముఁక తుది • ముట్టకయే తలయెత్తనేర్చునే?
కనిసిన లక్ష్మణుం డితని • గెల్చునె? యీయతికాయుఁ డంత్యకా
లునికడ నేర్చెనో కొల సి • లుంగులు కూర్చుట? వీని నేర్పు నే
మనఁదగు? నంచు భీతిలి వి • యచ్చరు లేగిరి దవ్వు దవ్వుగన్.

ఉ॥ అంగదు బాహులందు మెద • యందును వక్షమునందు నంప పిం
జం గటి గానరా బహుళ • సాయకముల్ పడి నాటి లక్ష్మణుం
ముంగలి గానరీక శర • ముల్ నిగిడించి దరంబునొత్తి మిం
టంగల వేల్పుమూఁకలు వ • డంక నొనర్చె మృగేంద్ర నాదమున్.

తే॥ సెల యనంగ నంగదుమేన • సెలలు గ్రుచ్చి, సెలయుటలు లక్ష్మణుండు వీ • క్షించి రౌద్ర
మూర్తియై శరవర్షంబు • మునర వాని, ధనువు విఱిచి సారథిని ర • థ్యములఁ జంపె

ఉ॥ వేఱొక తేరిపై కుఱికి • వేఱొక విల్లు ధరించి తాఁకు నా
కారి కుమారుపై రఘు వ • రానుజుఁ డగ్నిశరంబు నేయఁగా
మాఱుగఁ గర్బురుం డనల • మార్గణమేసి సహించుకొమ్మ పొం
గాఱఁగనీయకంపు దుర • హంకృతి నార్చెఁ గపుల్గలంగఁగన్.

ఉ॥ హెచ్చును కుంద గానఁబడ • నీయక రెండును పోరుచుండఁగా
హెచ్చిన లక్ష్మణాస్త్రము ల • హీనజవంబున దైత్యు వక్షముం
గ్రుచ్చుచు వీపునవ్వెడలఁ • గుప్య దుడంచిత సింహమో యనన్
రెచ్చి సురారియున్ దిటవు • ప్రీలక మాఱొనరించె జేపమై

చ॥ మఱియును లక్ష్మణుండు శిత • మార్గణముల్ వెసనేసి వాని ముం
దఱ గలవారి పెక్కఁగల • దైత్యులు చూడఁగదిగ్గయట్లు విం
డఱలుగఁ జేయఁగా నసుర • ధైర్యము వీడక బాణవర్షముం
గురియుచునుండె వానరుల • కూటము దగ్గఱఁ జెంగకుండఁగన్.

తే॥ అపరిమితముగాఁగ • నస్త్రంబులను వారి, విడుచు రాముతమ్ముఁ • వీసులకడఁ
జేరి వీని శమనుఁ • జేర్పుము బ్రహ్మాస్త్ర, మునన యనుచు ననిలుఁ • దవిపె నల్ల

తే॥ పంచిపని యంతిసించి ల • క్ష్మణుండు కడఁగి, తొడిగి మంత్రపూర్వకముగ • ద్రుహిణశరము
నేయ నది యుగ్రుఁడగునతి • కాయు శిరము. మింటఁగొనిపోయె నంతకు • నింటికడకు

క॥ దిష్టములు తొలఁగెనని సుర, లిష్టంబున విరులు గురిసి • యెసఁగిరి చింతన్
దుష్టులు దైత్యులు పాఱిరి, శిష్టులుఁ గీశవరు లుల్ల • సిల్లిరి మిగులన్

చ॥ జయము గడించి లక్ష్మణుఁడు • సమ్మతి నంగదునుండి క్రిందికిన్
రయమున డిగ్గె నాతని ప • రాక్రమలాభముఁ గాంచినట్టి ప్ర
త్యయమున నింద్రజిత్తు నికఁ • దప్పక నాశమునొందు నన్న ని
శ్చయమున నవ్విభీషణుఁడు • చాలఁ బ్రశంస యొనర్చె నయ్యెడన్.

## నరాంతకుఁ డంగదుచేఁ జచ్చుట

ఉ॥ సుందరవక్షుఁడైన సుర • సూదన పుత్రకుఁ డీల్గెనంచు నీ
చందిన గంధిలంబగు వి • శాల సుపక్షముఁ జూచికొంచు వి
ల్లందముగాంచి పొంగుచు న • యంబున నెచ్చటికేగెదింక నీ
యందము చందము న్నిలువ • వంచు నరాంతకుఁ డగ్గలించుచున్.

చ॥ మిడుగురు లఱలఁ దుమిఱు • మిట్టులు గొల్పుచు రాలఁ గిన్కయుం
దొడిఁబడి లేవ ధారణికి • దూఁకి సరాజియు ఖేటకంబుఁ బెం
పడరఁగఁ దాల్చిరాఁ గపు ల • గౌఘము వ్యోమము గప్పవైవఁ బు
ప్పొడివలె దూదిపింజలటు • పోఁడిమిఁ దూల్చుచు దాయవచ్చినన్

చ॥ కని యొక వృక్షరాజముఁ బె • కల్చి కరంబునఁ బూని వాని నం
దనుఁ దెసరేఁగి రామ విభు • దారుణ సాయకమట్లు తాఁకెఁ దాఁ
కిన క్షణమందె యంగదుని • కేలధరించిన వృక్షముక్క సరా
లునఁ దెగనేసె నొక్క త్రుటి • లోనఁ బరుల్ గనలేని నెవ్వడిన్.

తే॥ అంత రిక్తహస్తుండయి • యంగదుండు, వెనుక కేగుట పాడికా • దని తలంచి
పైకి లంఘించి చేరిచి • పట్టె వాని, కాలు గేలడిదంబును • కదలనీక.

ఉ॥ పట్టినవాని సాహసము • పట్టుగ వేల్పులు కాంచి చేతులం
దట్టుచు నార్చి రంగదుఁడు • దారుణముష్టి వధింపకే వెసం
బట్టెము లాగి కొంచుఁ దెగ • వాఱఁగ దేహము నిట్ట నిల్వునం
బట్టుగఁ జీల్చిపైచెఁ గను • పడ్డ సురారులు విహ్వలింపఁగన్.

## ఉన్మత్తుఁడు నీలునిచేఁ గూలుట

తే॥ పిడుగులనె మ్రింగఁజాలిన • బెట్టిదుండు, పేర నున్మత్తుఁడను వాఁడు • పెలుచరేఁగి
తప్పఁద్రావి యుమ్మెతదిన్న • మెప్పె పగిది, మత్తుఁడై మత్తకరి నెక్కి • యొత్తరించె.

సీ॥ గాలిగాకున్న నీ • లీల వేగమ దేడ ?, జలధి గాకున్న నీ • శబ్దమేడ ?
శమనుండె గాకున్న • జనహింస యెటులగుఁ ?, బిడుగు గాకున్న నీ • చెడుగుగలదె ?
కోపమేరూపు గైకొనక యీ వడియేడ ?, జలదంబుఁ గాకున్న • స్తనిత మేడ ?
అల గజాసురుఁడె గాఁ • దైన భీకర మేడ ? నడగొండగాకున్న • నడచుటేడ ?

తే॥ అనుచుఁ గనుగొన్న వానరు • లడలి బడలి, ఒడిసి బెడిసి పడుచు లేచి • కడల దాఁకఁ
బరుగువాఱ విజృంభించి • పరుగుదొడఁగె, మత్తుఁ దున్మత్తుఁ డెక్కిన • మదగజంబు.

తే॥ వానరులువైచు పర్వత • పంక్తులెల్ల, మావఁతుల యొడి సెలలకు • మాఱుగావు
కపులువైచు పెండరువు లీఁ • గలను దోలఁ, బనికిరావయ్యెఁ జెరకుగాఁ • బనికివచ్చె.

సీ॥ కాళ్ళక్రిందంబడి • కనకసమైనవి, వాలంపువ్రేటున • నీలిగినవి
తుండంపు విసరునఁ • గొండలఁబడినవి, కొమ్ముల క్రుమ్మునఁ • గూలినవియు
నై మలమనుకులు • సౌమిత్రిశరముల, దనుజు లొందినపాట్లు • తప్పకొందఁ
గాంచి నీలుఁడు పెను • కాంతాళమున నొక, సాలవృక్షముగొని • లీలఁద్రిప్పి

తే॥ కొనుమరాఁగ నున్మత్తుఁడు కోలదైదు, పరపి సాలమ్ము ఖండించి • వైవ వేఱు
కొండయొండు నీలుఁడు గుడి • గూడ నేయఁ, దునుకలుగఁజేసెఁ బదునైదు • తూపులేసి.

తే॥ మరలనొక కొండపెదకంగ • మరలునంత, మరలనీయక నాగంబు • మందరమును
చుట్టినట్టులా నాగంబు • చుట్టెనీలు, నట్టు లిట్టులు కదలనీ • యక కదిండి.

ఉ॥ సాహసమున్ బలంబు వ్యద • సాయము కౌతుకమున్ దిటంబు ను
త్సాహము ధైర్యముం గడిమి • సర్వ మడెంగన యంచు సేన సం
దేహము నొందుసంతఁ గపి • ధీరుఁడు దారుణముష్టి దేవ సం
దోహము మేలు మేలనిన • తుటి పొసరింపఁగ వ్రచ్చె శీర్షమున్.

తే॥ నేలకుం దాటి నీలుండు • నిలుచునంతఁ, దొరలునెత్తుట నేనుంగు • పూవిపోవ
మింటనిలిచి యున్మత్తుండు • మించియర్ధ, చంద్రసాయకంబులను వ • రముగ గుప్పె.

తే॥ నీలుఁ దూడఁదీసిన వజ్ర • నిభ విశిఖముల, నపరసేయ నాటుచు నొక • యమ్మునేత
వానినెడఁచివేతొకతూపు • తోన నీలు, నురము నాటఁగనేసి వి • ట్టూఱ వియంత.

తే॥ వేఱు దంతిపైనెక్కి యమ • ప్పారవచ్చె, వచ్చినం గని నీలుడు • వానిమీఁది
కెగసి వింటితోఁడను వానిఁ • దిగిచి యిభము, ముందునుంచె నుంచఁగ • నది • ముమ్మరించి.

తే॥ క్రుచ్చి కొమ్ములతోఁ గాఁడఁ • ద్రొక్కి చదుము, తోడనెత్తి విసరివేయు • దుండగీఁడు
తప్పి చావక కోపంబు • చటమటింపఁ, దంతిగజంబును జాచెచిం • పఱుచేసె.

తే॥ అంత నీలుఁడున్మత్తును • రోషరిమున, బలిమిఁ బొడుచుచుంగ నెత్తుక • దొలుకు దొలుకు
మనఁగఁగ్రక్కుచుగ్రుడ్లు మం • దునకునుఱుక, విలవిలందన్ని కొనుచును • బృథివినొఱఁగె.

## బలమిత్త్రుఁడు ఋషభునిచేఁ జచ్చుట

సీ॥ అన్నచావుం గని • యత్యుగ్రహంబున, బలమిత్త్రుఁడను మహా • బలుఁ డొకండు
మృత్యువె తన్నీడ్వ • మించి యసత్యంబు, లింపె ఘనంబైన • యొంటిరోద
సరభసమునఁ బిశా • చములు పూన్చిన తేరి, పైనెక్కి ఖగములు • భయమునొంద
నఱచుచుఁ బిడుగుల • రెలుఁగున వడివడి, గిరములేయుచు వన • చరులఁ దఱుమ

తే॥ ఋషభుఁ డెదిరించి వాని హుంక • రించి నిలుపు, మనుచు నదలింప దైతేయుఁ • డాలిగొనుమ
నీవు పిన్న వాఁడవు చేవ • నిన్ను గెలిచి, వలుగు దొడ్డ పేరెయ్యది • తొలఁగుమనుచు.

తే॥ మంతు కెక్కిన యాహను • మంతుఁ దిలుపు, రాములమ్ముని పిలుపుమా • రణజితులను
చంపు పిదప మీపైఁ గోప • గింపఁదగును. పొమ్మపొమ్మన ఋషభుండు • పోలఁ జూచి.

చ॥ పీనుఁగులన్ భుజించి మను • పీనుఁగులం గొని నోటి క్రొవ్వులో
మానుగ గెల్వవచ్చితివె? మందుఁడ! రోగమునొంది మందు నుం
తేనియు రోయకుండు మతి • హీనుఁడ! లక్ష్మణుఁడేలరా? మరు
త్సూనుఁడు నేల? నన్గెలుచు • దోర్బలముండినఁ జూత మవ్వలన్

ఉ॥ పాఱక నిల్వుమంచు వెఱ • పాఱక పల్కఁగఁ గాంచి దైత్యుఁడున్
పాతెదవంచు నెంచితివి • పాఱక ధీరునిమాడ్కిఁ గాఱులన్
మాఱుగఁ బల్కుచుండిన న • మానుషలీలల నాటలాడెదన్
మోఁకుఁ బోకుమంచు విలు • మోపును బొమ్మలు లీల వంచుచున్

సీ॥ పది తొమ్మ నాటంగఁ • బరపి పదింట దే, హంబెల్ల రక్తమ • యంబు సేయ
ఋషభుఁడు కడుఁ జెలం • రేఁగి రక్కసు పేరు, బలిమిమై జలధిలోఁ • బడఁగవైవ
బలమిత్త్రుఁడును నీటఁ • బలక్రిందుగాఁ బడి, యిఱుగక కలనికి • నెగసి రాఁగ
నెగడెదవే యని • నిశి నెదిరించిన, పగలు నా ఋషభుండు • వానిఁ బట్టి

తే॥ బాహుబలమున నలఁపంగఁ • బచ్చిరక్త, మొదల నవరంధ్రముల వెలు • వడియె, వాఁడు
మిడుక కట్టలే జీవముల్ • వెడలఁ బడమిఁ, బడియె విల్లందిన నగంబు • పడిన పగిది

## సుగ్రీవుఁడు కుంభుని చంపుట

మ॥ కినుకన్ వేతొకచోటఁ జేపమెయి సు • గ్రీవుండు కుంభుండు త
త్ర్పా రంగమ్మున కే వినూటన మహా • ద్భుతంబు సేకూర్చుచున్
దనుజుల్ వేల్పులు వానరుల్గని ప్రమో • దంబుం భయంబొంద వీఁ
కను పైపై విజిగీషులై పెనఁగి రా • కంపింప భూభాగమున్.

క॥ కేసరులఁ బోలి కిట్టుచు, మాసరముగ రుధిర మడర • మలయుచు గాసిన్
వేసరక వీరగుణములు, భాసురముగఁ బోరి రుగ్ర • బల దర్పములన్.

క॥ కుంభుఁడు దండము ద్రిప్పుచు, నంభోరుహ మిత్రసూను • నడిచె నతఁడు సం
రంభమున నొక్కఁ దరువున, స్తంభింపఁగనేయ రెండు • ధర విఱిగిపడెన్

క॥ సహియింపక చంపెద నని, మిహిరసుతుం డదను పొంచి • మీఱి నిలువ శే
ని హితము కోరిన నీలుఁడు, మహీరుహము నొండు తెచ్చి • మానుగ నిచ్చెన్.

క॥ దానిఁగొని పూన్కిఁ దోడస, వానరనాయకుఁడు వాని • వక్షము పగులం
గానడిచె బలముకొలఁదిని, దానవతతి కలఁత చెంది • తడఁబడి పాఱన్

క॥ దెబ్బదినిన కుంభుఁడగిని, గుబ్బతిలన్ వజ్రహతిని • కూలు నగము నా
గొబ్బునఁ బడెనని వానరు, లుబ్బినతఱి లేచి దనుజుఁ • డుఱుకుచు నెదలో.

క॥ భుజములపైఁ గొట్టిన నం, బుజమిత్ర సుతుండు నొచ్చి • పోఁడిమి మై బా
ణ జవంబునఁ బలిమిమిగతు, భుజువైరియురంబు ముష్టిఁ • బొడిచెం బెలుచన్.

క॥ అలపును సొలపును గానక, గెలుపోటము లేర్పఱించి • కించిత్తైనం
దెలుప నశక్యంబగు క్రియఁ, జలమున విజయాభిలాష • జగడించి రొగిన్.

క॥ పిడికై మదగజములు రెం, డెదయక పోరెడి విధాన • నిరువురుఁ బెలుచన్
బొడుచుచుమఁ బొడువుచునుమి నెద, విడుపెంతయు లేకయుండ్రి • విజయశ్రీకై.

క॥ ఆమ్మాడ్కిని ముమ్మరముగఁ, గ్రొమ్మెన సమరమ్ము జరుగఁ • గమ్మరి దిమ్మెన్
సమ్మెటపోటన దనుజు ను, దమ్మును కపిరాజు గ్రుమ్మె • వ్రయ్యలుగాఁగన్

తే॥ అపుడునారక్కసుండు న • న్నాలిగొందు, వా యసుచునవ్వు సుగ్రీవు • నైదుతలల
పాముబోలిన హస్తమ్ము • వనినోటఁ, జొచ్చి యసువులెడల నాల్కఁ • బుచ్చివైచె.

## నికుంభుని హనుమంతుండు చంపుట

తే॥ అన్నగతిగాంచిన నికుంభుఁ • డాగ్రహించి, పదరి దెబ్బతిశని కపి • కాంతుఁ గదియ
నంతవానికి నంగదుఁ • డడ్డపడియె, నిరువురకు ఘోరముగఁ బోరు • జరగె నపుడు.

క॥ శూలముగొన్న నికుంభుని, వాలిసుతుఁడు తాఁకెఁ దాల • పాదపకరుఁడై
నీలగిరిపైకిఁ గాంచన, శైల మ్ముఱ్ఱరపడిని దూఁకు • చందము దోఁపన్.

క॥ శూలము దనుజుం డెత్తఁగ, నాలో నంగదుఁడు మడియు • నని జడియుచు వా
తూలసుతుఁ డేచి జ్వాలా, మాలా భీలాగ్ని కరణి • మండుచుఁ దాఁకెన్.

క॥ తాఁకి మరుత్సుతుఁ డమరా, నీక ప్రభు వజ్రమనఁగ • నెగడిన ముష్టిన్
రాకాసి నికుంభుని తల, జోకం గడుపునకు డిగ్గఁ • జొప్పించి చనెన్.

క॥ ఓగిలిన దనుజులకుఁ గపులఁ, దగిలెడి సత్త్వంబులేమిఁ • దత్తఱపడుచున్
దిగులూని పఱవ వెనుకం, దగిలి కపీశ్వరులు సదమ • దము చేసిరొగిన్

క॥ పరుగిడి గవని నరుగు తొం, దరచేఁ ద్రొక్కుళ్లవడుచు • దనుజులు పెక్కం
డ్రుఱలిరి శిబిరములకుఁ జని, కెరలిరి పెక్కండ్రు పుండ్లు • కెలయుట కతనన్.

క॥ నోరెండఁగ నిలువఁబడెడి, సిరిందని పేఁడి యునుపు • పిగినవారల్
దారి గనలేవిక్రియఁ గ, స్నిరొలుకఁగఁ గుబ్బు యూమి • సీ సంచారల్.

క॥ వింగికెగసి చని యసుషల. ప్రుంగఁగ సటసుండి మలల • కోపునఁబడు వా
రంగము లవియఁగఁ బ్రేవులు. లొంగ ధరసు వ్రాలు నపక • దుఃఖ పెక్కంద్రున్.

క॥ పరిచితులఁగాంచి దయ సీ. శరములఁ బీయుఁడని వారు • సదరింప ననూ
త్కారము విడుచువారలు మం. దిరముల బంధు రు గుర్తు • తెలియనివారల్.

క॥ హరు లరలఁగఁ దడఁబడుచుం. గరులు దొరల ధరఁజేఁబడుదుః • గాలెడు మలల
ప్లైరిసెడు నరదంబులలోఁ, దిరుగుడుపడి విచ్చపడుదుఁ • దెరలెడి వారల్

సీ॥ గాయమ్ములొందిన • కాయమ్ముల బరుపు. మోపెఁగాఁజాలక • మూర్ఛవారు
వానరవేషులై • దానవు లరుదేరఁ, దమివారె మోఁదఁగా • సమయువారు
కనువిచ్చి యిందుల • కడ దిగువారు చు. ట్టల లల మిమ్మని • తెలుపువారు
త్రాగి చచ్చినవారు • త్రాగ సుంకించి య. ట్లే తేఱిచూచుచు • నిలుగువారు

తే॥ పుత్త్రులను మోచికొని పడిఁ బోవువారు. ప్రాణములు ప్రోవలో విడఁ • బాటవైచి
కనులు చెడ దారిదప్పి త్రొ • క్కటము పడుచు. నడవలేక యట్టులె పడి • ముడుఁగువారు

క॥ ఆ తెఱఁగుగాంచి పాఱిన. దూతలు తడఁబడుచు వడిగఁ • దోలెంచి సురా
రాతి పదంబులపైఁ బడి. యేతీరునఁ దెలుపుటనుచు • నేడ్చిరి పెలుచన్.

క॥ జరిగిన దేమని రాక్షస. వరుఁ డడుగన్ వారు మీరు • పంపిన సేనన్
మరలిరి కొంద ఱనంగా , తెఱఁగు వడదు వీదు సుతులు • తీఱిరి దేవా !

తే॥ అనుడు బాష్ప ప్రవాహ మ • నర్గళముగ. విడిచి దుఃఖంబు మానంబు • వీర మధిక
చింత కరుణ పదము కిన్క • చిక్కుగొనఁగ. రావణుఁడు భంగయుత వారి • రాశిఁబోలె

చ॥ కదలనుగాంచు వేలుపులఁ • గాంచును వచ్చిన విందఁ గాంచుఁ జే
యడిదముఁ గాంచు నిగ్గలిక • హ స్తముల న్నల చున్ ముఖంబు చే
ద్పడ వడినూర్చు నేడ్చు నగు • వందురు సిగ్గిలుఁ గుందుఁ గూలు బ్రా
న్పడు వెగడొందు బెందువడు • వావిడుచున్ వనరుం గుమారిలుణా.

చ॥ పుడమిఁ బెకల్చఁగాఁ దలఁచు • వ్యోమముఁ గూల్చఁ దలంచుఁ బ్రాణులన్
బొడిపొడి సేయఁగాఁ దలఁచు • బోటుల నెల్లరఁ ద్రుంపనెంచుఁ బె
న్జిడిముడిపాటుగాంచు మఱి • చేష్టలుదక్కును పుంటిమీఁద నీ
ప్పిడిన తెఱంగునణా మది వ • హించును పొక్కును తోలు బెగ్గిలున్

## ధాన్యమాలిని రావణు నిష్ఠురోక్తులాడుట

ఉ॥ అప్పట నున్న వారు పలు • కాడక యూర్పులుపుచ్చ కెద్దలో
ముచ్చిరుచుండ నచ్చటికి • మూర్తి వహించిన దుఃఖమో యనన్

వచ్చిన ధాన్యమాలిని స్వ • భర్తృపదంబుల వ్రాలె గ్రక్కునం
బొచ్చెములేని ప్రేమమయుఁ • బుత్త్రకుఁ గోల్పడు కుందు నోర్వమిన్

ఉ॥ గాజులు హారవల్లులును • కంకణముల్ మొరయంగ పుల్ల వం
కేజ సుగంధి వక్షమును • కేలఁ దొడింబడ బాఁదుకొంచు వి
స్తేజపు మోముపైఁదుఱుము • శీర్ణతనొంది పడంగ జాలికే
భాజనమైతి నంచు ధర • పైఁ బొరలాడె భుజంగికైవడిన్.

చ॥ ఇతరులకేని దుఃఖమది • యెట్టిదొ నేరని కోమలాంగి దుః
ఖితయయి సర్వలోకములు • కీడ్పడఁ గ్రుంగినరీతి నెంచుచున్
బతి వదనంబు గాంచుఁ దన • పట్టిని మ్రింగితివంచు నేడ్చు నా
వెత లుడుపంగ నేరు పృథి • విం గలరంచుఁ దపించు నార్తిమై.

మ॥ బలవద్వీరుల దోర్బలం బని నడం • పన్ లేవా ? నీ వీర్యమున్
జలధిం బూఁడెనొ ? నీబలంబు చెడెనో? నాపల్కు లిం కేవి నీ
నులఁ జొప్పింపవొ ? సమ్మతింపవొ వినఁజ ? గూయిన్ విచారింపవో ?
కలఁకంబాఱిన కంటిపాప మరలం • గాన్పింపవో ? కానవో ?

మ॥ పురుహూతుం బవరంబునం గెలుచు స • త్పుత్త్రుం గనెన్ ధన్య యీ
తరుణీరత్న మటంచు నెల్లరును స్తో • త్రం బొప్పగాఁజేయఁగా
గరువంబొందినదాన నాకొడుకు లో • కంబెల్ల హాహా యనన్
నరుఁ డొక్కండు వధించెనే ? విధియు దు • ర్న్యాయంబు పాటించెనే ?

చ॥ కడచెనె మున్నె యక్షుఁ డతి • కాయుఁడొ యిప్పు డడంగె వీరులున్
మడిసిరి కుంభకర్ణుఁడును • మ్రందెఁ గుమారులలో సజీవియౌ
కొడుకొక యింద్రజిత్తె యిఁకఁ • గూలును రేపట నంతమీఁద నొ
త్తిడి యొకరుండవే కడిమి • దిగ్విజయం బొనరింప కుందువే ?

తే॥ గిట్టినట్టి సోఁకుల బ్రతి • కింపఁగలవె ? బుద్ధిచెడి కామివగు నీవు • పుడమిమీఁద
బట్టగట్టుక యింకను • బ్రదుకఁగలవె ? పిరవలన ముగిలియున్న • చెట్ట గలదె ?

చ॥ అనుపమ నీతిశాలి సుగు • ణాకరుఁడైన విభీషణుండు ప
ల్కిన పలుకుల్ గణింప కవ • గీర్ణ బలాఢ్యుని కుంభకర్ణు నా
తనయుని శత్రు ఘాత శర • తండము పాలొనరించి నెమ్మదిం
గని పయి రాజ్య మేలుదువె ? కాకులు గుబులు కూయుచుండఁగన్.

చ॥ అని పలురీతులం బలికి • యన్నువ పిట్ట విధంబునన్ విలా
పన మొనరించి క్రేపు నెడఁ • బాసిన ధేనువుభాతిఁ గుందుచున్
వనరెడు ధాన్యమాలినిని • నాక శుభాంగులు కేలమీఁద నొ
య్యనఁగొని రాణివాసమున • నాదటఁ జేర్చిరి కుస్తరించుచున్

తే॥ లంకలోఁ గల యసురుల • ల్లరును స్వేఁదు, పుష్పఁ జల్లిన చందానఁ • బొగిలినారు
వేల్పు చెలులును నెసరున • వెక్కినారు, తిప్పినాపరిచింది లె • శ్రంగనేల?
తే॥ కోసలము పీడి రాసుఁ • గౌసలేయు, దేగుతటి ననించిన దుఃఖ • మెనసె లంక
నగరమందు గల్గిన దుఃఖ • నావ మపుడు పుష్పమును వార్ధి ఘోషంబు • పోల్కి నెగడె.

## 18. నాగపాశ పటలము. (300)

తే॥ తలకు నొక వేసముగ దైత్య • తరుణు లేడ్వఁ, గాంచి కారణ మెఱుఁగక • కళవళించి
యింద్రజితుఁడు శంకించి దై • త్యేంద్రుఁ బడుగ, నడచె సురపతి నళవి చం • దమున నపుడు.

మ॥ దెసలం గెల్చిన రావణుం డిపుడు కీ • ర్తిం బూర్తి గోల్పోయెనో?
అసువు ల్వీడెనొ? మున్ను వచ్చి పిర దా • హం బొప్పఁగాఁజేయు గా
ద్పు సుతుం డంబుధితోడ లంక నిపు డు • న్మూలింప యత్నించెనో?
అసమానంబగు దుఃఖ మొందుటకుఁ గా • ర్యంబేమి పాటిల్లెనో?

ఉ॥ ఏమి ఘటిల్లె నేఁడు వచి • యింపుఁడి యం చెదురైనవారలన్
వేమరు ప్రశ్న సేయఁ బు • వించి పదంఁడిరి కాని తెల్పమిన్
దామది సంచలం బుమి • దారుణవేగముతోడఁ బోయి క
న్నా మెతగాఁగఁ గాంచె మది • యంతట నెమ్మది చెంప రావణున్

ఉ॥ కాంచి కలంకి దేటి కిర • తంజములన్ ముకుళించి యీ తిట
స్సించిన దుఃఖ కారణము • తేటపడం దెలుపుందియన్న న
క్తంచరు నాయకుం డనుఁ గృ • తాంతుఁడు నీయనుజుం గ్రహించె ని
ష్కించితులై కుంభుఁడు ని • కుంభుఁడు సయ్యతికాయులోఁ జనన్.

మ॥ వర ధానుష్కుఁ డు మేఘనాదుఁ డటఁ ద • ద్వార్తన్ వినం గన్నులం
గురు కోపాగ్ని విస్ఫులింగములు గ్ర • క్కున్ వాతెఱన్ మాకొనన్
దురపిల్లన్ పిడిలించు హస్తములఁ గుం • దున్ దూపిలన్ గర్జిలన్
సురుగం దిక్కులు చూచుఁ జంపె నెవఁ డం • చుం గాలఁ దాఁచున్ భువిన్.

ఉ॥ రాముని యమ్మ డుం బ్లవగ • రాజు మరుత్సుతుఁ డంచుఁ దెల్పఁగా
నేమని పంపినాఁడవు న • రేంద్రుల శక్తి యెఱింగియుండి యు
ద్ధామ బలుండనై పనను • దాల్చిన నంపక వారిఁ బంపి నీ
వే మఱచుట గూర్చితివి • ద్వేషులు చంపి రనంగఁ జెల్లునే?

మ॥ సమరాకేయుని నామ తమ్ము నవిలోఁ • జక్కాడు క్రూరాత్మ ర
క్తము తద్రంగమునందు తద్ధరణియే • త్రావంగనీకున్ననో
సమరాధీశున కైదుమార్లు బల శౌ • ర్య స్థైర్యముల్ పీడి యు
... ... సోమనుఁ గాలునాఁడ నగుదున్ • దెత్యేంద్ర చూడామణీ!

ఉ॥ క్రూర నగౌకసావళి న • కుంఠిత శూరతఁ గొందికొంది సా
మీరి శిరంబు వ్రచ్చి కసి • మీఱఁగ లక్ష్మణు కాలుసేతులం
గోరికఁ ద్రుంచి చిత్రవధఁ • గ్రొవ్వక తక్కిన సమ్ముఖంబునన్
మోరల నెత్త జంతు సుర • ముఖ్యులు మిక్కిలి నవ్వకుందురే ?

చ॥ కడలిని దాఁటి జానకిని • కాంచి వనంబును పాడుచేసి నీ
కొడుకును నేలరాచు నొక • కోఁతిని దూతయటంచుఁ జంపకే
వెడఁగరి పోచు వీడితివి • వీడుట యింతకుఁ దెచ్చె బంధులం
గొడుకులఁ గోలుపోయితివి • గోడివడెన్ సుఖ జీవితాయువుల్.

ఇంద్రజిత్తుఁడు శపథ వాక్యము లాడుట

మ॥ ఇఁకఁ జింతించియు లాభమేమి ? మఱి ని • న్నేమన్న మేలేది ? వా
రిక యాలోచన చేసియున్ ఫలమె ? సంగ్రామంబునం దిమ్మ సం
ఖక సంఘాతము పాలుచేసిన గుణ • భ్రష్టాత్మ సౌమిత్రిఁ జం
పక లంకాపురిఁ జేర నేబ్రదుకు నం • భావింపఁ జిత్తంబునన్.

శా॥ నాగాస్త్రంబును ఖడ్గ పాశుపతముల్ • నాణెంబుగాఁ గామమున్
భోగంబుల్ గొని కాలముం గడపు నా • ఘోరం దదస్త్రంబు లు
ద్యోగ ప్రోద్ధతి నాకుఁ గానివయినన్ • దుర్మృత్యువుం గొందు నీ
రాగ ప్రక్రియ సర్వమున్ విడిచెదన్ • బ్రాయోపవిష్టుండనై

మ॥ అతికాయ ప్రియజీవ హారకు షప • ర్వాదు ల్గనన్ సంగర
క్షితిలోనుండి వియత్ప్రధాన యమరా • ద్గేహంబునం బ్రీతిమై
నతిథి ప్రక్రియ లందఁగాఁ బనుపకే • వ్యర్థుండనే యైన నీ
సుతుఁడం గావిఁక విల్లు మోఁతకొఱకో ? • శోభాకృతిం జూపనో ?

చ॥ అని శపథంబులాడు సుతు • నక్కునఁ జిక్కఁగఁ జేర్చి రావణుం
డనునయ మార విట్టులను • నయ్యవు నీకు నసాధ్య శౌర్యముల్
పనిగొని చూచినం గలవె ? • వారని పుత్త్రక చింర దీక్ష నీ
వనిఁ బగఱన్ వధింపఁగల • వంచు హృదంతరమందు నమ్మితిన్.

తే॥ అనుచుఁ బలికిన లంద్రికిఁ • దనయుఁ డెఱఁగి, తూణములు వజ్రభేద్య కవచ • బాణ ఖడ్గ
దృఢ శరాసనాదికములు • తీరుగాఁగఁ, దాల్చి బయలుదేదెను భయ • దంపు రీవి.

తే॥ కమలజుఁడు చింత యించుక • గలుగకుండ, వజ్రగిరిగొని కావించి • వజ్రి కిచ్చె
నాధనువు వాని గెల్చిన • యదనునందు, మేఘనాదుండు గొనియె న • మోఘగరిమ.

తే॥ ఇంద్రుఁజెఱనుంచినప్పుడె • యింద్రజితుఁడు, కడఁకఁగైకొన్న వే నిషం • గములుగూడఁ
దఱుఁగుఁగాక యంబుధి యవి • తఱఁగిపోవు, యమునిగుహఁబోలి నట్టి వా • యంపదొనల

తే॥ తొల్లి యమరు లొనర్చిన • దురమువేళ. గొంద విలుకాఁడు నలుప త • క్కుఁగలట్టి
యధికు లొనఁగిన పెక్కుడి • వ్యాయుధముల. నప్పుడు దైగొనె రావణి • యనువుకొలుకు.
తే॥ పొలుచు క్రొత్తలంకాపురిఁ • బోలినయది. శరభములువేయి వేయి శే • నరులుపూన్పఁ
బడినయది వేల్పులరు థంగ • పఱుపరాని. దైన కీరెక్కి దైత్యేంద్రు • నగ్రసుతుఁడు
తే॥ కనక రథమన్నఁజాలునే? గరుడునడను. వృషభమునడను భయదిమ్మై • వెంట నడచెఁ
గాక యొక్కనాఁడును ముట్టి • గంబులందు. ముందునడచిన యదికాము • పొడవు కీరు.
తే॥ చతురతం జూపి బవరంబు • నలిపి వజ్రి. బలముగ్రుంగ బంధించిన • వలఁచివచ్చె
వచ్చెనని పిశాచాదులు • వలచియాడు. గుఱుతుపద్ధ చెక్కుంబుచేఁ • గొలువు కీరు.

చ॥ బలయుత కాలకేయ వర • వాహిని గగ్గులకాడగా వడిన్
వ్రాలఁచిన చక్రముల్ త్రివళ • నాయపు పృష్ఠము గాయమొందఁగాఁ
జలిపిన మొగ్గలం గలిగి • జానగు కేరది దిగ్గజంబులన్
గలఁచుచుఁ బాఱఁదోలినది • గా వివరించుట గౌరవార్హమే ?

తే॥ అఖిలసురుల వీఁపుల గాక • యాననములఁ. గనని యింద్రజిత్తట్టి స్యం • దనమునెక్కి
కీరు లొక వేయి చుట్టిరా • వీరసమర. దోహలత కీటమోమునఁ • దోఁప నరిగె
తే॥ వానితో నడచిన సేన • వరుసలెక్క. పెట్టి తెలుపంగఁ దరమౌనె • వినుతచరిత
విదుఁడు వాల్మీకి నల్వది • వెల్వలనుచుఁ. దెలిపె వేవేరు లెక్కించి • తెలుపువారు ?
సీ॥ ధూమ్రనేత్రుఁడు రణ • దోహలుండగు మహా. పార్శ్వుండు కేరి కా • వలియొనర్ప
ఛత్రంబు పైనొప్ప • శంఖాది రవములు. భూనభోంతరముల • బోరుకొనఁగ
లక్షకేరులు చుట్టి • రక్షయై రా వాని. కినుమడి గజములు • వెనుక నడవ
మోహరించిన గుఱ్ఱముల గుంపు వెంటరాఁ. గాలిబంటులు ముందు • గాఁగ నరుగ
తే॥ వీరవర్యుండు లంకాధి • విభుని కొడుకు. శస్త్ర విజ్ఞాని మాయా వి • శారదుండు
దురము లం దారి కీజిన • దోర్బలుండు. జిత దిగీశుండు సంగ్రామ • సీమఁజేరె.

మ॥ అతికాయుండు వధింపఁగాఁబడిన ప • ల్కాలించి కోపంబుతో
దితిజాధీశుఁడొ గోత్రభిద్జితుఁడొ యే • తెంచెన్ రణ క్షోణికిన్
గృతహస్తుల్ రణకర్కశుల్ రిపులఁ గా • రింపగ నౌనంచెదం
గుతుకంబారఁగ లక్ష్మణుండు నిలిచెన్ • ఘోరాహవ క్ష్మాస్థలిన్.
శా॥ వీరశ్రేష్ఠుఁడు లక్ష్మణుండు కని దో • ర్వీర్యోద్ధతిన్ భూరి తూ
ర్యారావంబులతోడ వచ్చె నెవఁడా • హంవీరుఁడన్నన్ మహో
దారుండైన విభీషణుండను మహా • త్మా! ధీరమల్లుండు పా
కారిం గెల్చిన శూరుఁ డింద్రజితుఁడన్ • ఖ్యాతాభిధానుం డిలన్.

ఉ॥ వాహిని నాయకుల్ ప్లవగ • వారము రక్షణసేయ నెల్లరన్
వ్యూహముగాఁగ నిల్పి బల • యుక్తిని పోరుటమేలు నేఁడు నం

దేహములేదు విగ్రహము • తీవ్రతరంబగు నిర్ణయించి ని
ర్వాహక పద్ధతి న్నడప • భావ్యమగుం దలపోయ లక్ష్మణా:

సీ॥ కీర్తిభూషణ! మన • కీశ నాథుండును, జాంబవంతుండు కే • సరి సుతుండు
వాలిపుత్త్రుండును • నీలుండు తదితరుల్, నీతోడ నిలువంగ • నిర్ణయింపు
లెక్కలేని సురలు • ప్రక్కబలము గాఁగ, నిలిచిన యింద్రుండు • నిలువలేక
యమృత బలంబున • ననువుల దక్కించు, కొని బైటఁబడి బ్రది • కెను విజమ్ము

తే॥ వాసవుని రెట్టలం గట్టు • వాఁతలిఁకను, మాయలేదు మాయవు హను • మంతుఁగూడఁ
గట్టినాతండు తగ వాని • కార్ముకంపు, విద్దె నేర్పును వర్ణింప • వీలుగలదె?

తే॥ అనుచుఁబలుకంగ లక్ష్మణుఁ • డనుమతించె, నంతమతిమంతుఁడగు హను • మంతుఁడెదను
చింతచేసి సౌమిత్రిపై • జిష్ణుజితుఁడు! వచ్చెనవి పదటంబున • బయలుదేఱె

తే॥ శమనుఁడును కనుల్మూయంగఁ • జాలియున్న, దనుజ సేనా భయంకర • త్వంబు గాంచి
యింద్రజితుని సాహసకార్య • మెఱిఁగి గాలి, వోలికనె వచ్చి చేరెను • గాలికొడుకు.

తే॥ అచ్చటనె మున్నె యుండినాఁ • డంగదుండు, తక్కు దళపతు లచటికి • దాసివారు
సేనలం ద్రిప్పఁ గపిరాజు • చేరినాఁడు, వరుసలుగఁదీరి నిలిచెను • వనచరాళి

క॥ కోపావేశము పొంగఁగ, నేపారుచు నెదుర నెదుర • నేగెడి సేనల్
దీపించు రెండు జలధులు, కోపున యత్నించి తాఁకు • కొమరై తోఁచెన్

క॥ కనులు మనను గలిగిన ఫల, మను సంపూర్తిగనె నేఁడు • పొందఁగనగు నం
చనువుగ స్వర్గము బీడుగ, వనితలతో నిండి రమర • వర్యులు నింగిన్.

తే॥ రెండువాఁగు లొండొంటితో • రెచ్చితాఁకు, నెడల వీరగర్జనలు ఘీం • కృతులుహేష
లబ్జఘోషముల్ వివిధ తూ • ర్యమ్ము లదరి, వేలుపుల మూసికొనఁజేసె • వీనుదోయి.

క॥ పట్టుఁడు కట్టుఁడు కొట్టుఁడు, తిట్టుఁడు నఱకుండు తినుఁడు • త్రెంపుఁడు పొదువుం
డిట్టలముగ నేయుం డను, గట్టి రవము శింజతో జ • గము వదఁకించెన్.

క॥ తగులుటచే నంగంబులు, పగులుటచే మేన నుచ్చి • పాఱుటచేతన్
నొగులుటచేఁ గూలుటచే, నెగులునఁ జలియించె ధాత్రి • నిలుకడ చెడఁగన్

తే॥ మునల ముద్గరాదులచేత • మురియు తలలు, ఖర కరానులంచేఁ దెగిఁ • దొరలు తలలు
కదనరంగంబు నిండంగఁ • గపుల వపువు, లురలె నటియించె విలవిల ధరణిఁదన్నె.

క॥ పచ్చడియగు మస్తకములు, విచ్చిన మేనులను నెత్రు • వెల్లువలం దా
కచ్చుగ మందెదు నదవిని, పచ్చి విటపములను వోలి • పఱపైయుండెన్

తే॥ కఱకు రాకాసులంబట్టి • కాలఁదన్ని, కేలనెత్తి నేలకుమోఁది • తోఁక లొలిచి
మెడలు కొఱికి త్రోచియు రాచి • నడుము విఱిచి, యతిశయోత్సాహ మంది పె • ల్లార్చెఁ గపులు.

చ॥ ద్రుమముల రాముతూపు తొలి • తూపరముంచిన దేదుచెప్పెఁ; లో
కమునఁ బ్రసిద్ధిచెందిన న • గమ్ములు నేడె; యడంచి మోఁదుటల్
తెమలక యుప్పుటల్ తలఁపు • తీపగు నా ఋషభుండు పైచు వృ
క్షములకుఁ బర్వతంబులకుఁ • గాంచఁగ లెక్కయెలేదు భూస్థలిన్.

చ॥ కరులను శేరులన్ హరుల • గల్గి భుజంగముఁబోలి క్రూరులై
వఁఅలిన రేయి ద్రిమ్మరుల • వర్గములెల్ల వశించు నేఁడనం
దరువుల త్రిప్పిత్రిప్పి బడి • దిఁబుగఁ జంపెను జాంబవంతుఁ డ
ద్రిరః మదియొందియుం బులును • తింత్రిణిపీడునె? దేవహొన్నదే

మ॥ కరి పారీనములన్ దురంగమ తరం • గంబుల్ చలత్స్యందనో
త్కర నౌకల్ బహుళాయుధ ప్రకర ప • త్న్య గ్రాహముల్ గల్గ క
ర్బురవార్ధిన్ బనసాఖ్య మందర మెుగిం • గ్రోఘహి పాశంబుతోఁ
దరువంజొచ్చె జయేందిరా వర సుధా • ద్రవ్యానుభోగాప్తికై.

సీ॥ వనదంబులం జీల్చి • కొని యూర్ధ్వలోకముల్, దాయు సంపాతి జ • టాయువులన
మైందుండు ద్వివిదుండు • మలసిరి దేగలు, పారువఁబుల జంపు • పగిది దోఁప
గవయుండు కొలఁకును • కలఁను గజంబునా, దనుజసైన్యంబు ను • ద్దవడిఁ గలఁచె
నిల్చిన కాలు గ • దల్పక కేసరి, దైత్యేభ కుంభముల్ • త్రవ్వుచుండెఁ

తే॥ గపికులేంద్రులు కదన మీ • కరణిఁ జలుపఁ, బాణినట్టికోతులు వచ్చి • పోరఁదొడఁగె
నిర్జరారుల సైన్యంబు • నిలుకడ చెడె, నింద్రజిత్తదిగని కోప • మనుమడింప.

## ఇంద్రజిత్తు వానరులపైఁ గసిమసఁగుట

తే॥ బాహులుప్పొంగ దిక్కులు • పర్వతములు, చెవులుపడ నాస్త్రమోయించి • చింద మొత్తి
వేలుపులు జగములు కపుల్ • వెగడు పడఁగ, సింహనాదంబు పేసె ను • త్సేక మొప్ప

తే॥ అశమలను సిగ్గిలఁగ మ్రోఁగు • నహి విషాభ, శరము లెన్ని యంచెన్నంగ • నెఱుకపడని
యట్లు మిటిమీటి పరిపి వి • యత్తలంబు, నవనితలమును బాణమ • యంబు చేసె

క॥ కపివరు లేసిన తరువులు, నుగలంబులు విఱిగి పొడిగ • నుర్విని రాలెన్
గపుల తల లెగసి పడియెం, దపతపమని ధరణిమీఁద • చందడి యగుచున్.

క॥ మిటిమీటి వెసలు శరములు, కుటిలల నురముల నొదళ్ళఁ • గూరుచు దుయ్యన్
దత బలులగు వనచరవతు, లతిశ్రమము నొంది తూలి • పవనిం బడుచున్.

తే॥ ఒక ముహూర్తకాలములోన • నొక్క వెల్వ, చితికి చెదరి పీభత్సమై • చెదుట తోడఁ
గొండలందేరఁ బోయిన • కోఁతుల తల, లపల పుల పైచుప మేసు • లువ్వెఁబడియె.

తే॥ తలలు త్రెంచిదాఁటిన బాణ • తతులు ఫణుల, కరణిఁ బాతాళమునఁజేరె • ధరణియెల్ల
మిట్టపల్లము సమమను • మేరలేక, బట్టబయలుగా రక్తంబు • పఱచె వడిని

చ॥ తొలఁగని చూపుచోఁ గనులఁ • దూఱుచు నిల్వఁగ బొమ్మ గ్రుమ్ముచుం
దొలఁగఁగఁ దాఁటుచోఁ బదులఁ • ద్రుంచు చదల్చిన నాల్కలూడ్చుచుం
దొలఁగిన వీఁపు గ్రుచ్చుచు వి • దుర్చు శరీరములెల్ల వ్రచ్చుచున్
దలఁచు నెడందపైఁ బడుచుఁ • దార్కొనె నింద్రజి బాణ సంహతుల్.

మ॥ శరవర్షంబున మధ్య నేర్పడిన దృ • శ్యశ్రేణి నొందైన వి
ద్దరులున్ రీతిగఁ జూడలేరయిరి నా • రాచంబులంగూర్చి యే
యు రుతుల్ దక్కఁ వినంగలేరయిరి మృ • త్యు క్రూర భీతిన్ వనే
చరు లల్లాటముతోడఁ బాఱుటలె కాం • చంజాలి రంతంతటన్

మ॥ ఎదురైనట్టి వనేచరుల్ తునకలౌ • టీక్షించి యుత్సాహులై
యెదిరింపంగలవారు లేమిఁగని లం • కేశాగ్రసూనుండు దు
ర్మదుఁడై యూరక విల్చె దూరగతుఁడౌ • మార్తండపుత్త్రుండు బె
ట్టిదుఁడై సాలముకందు చేకొనుచు ము • ట్టెన్ వానరుల్ మోదిలన్

మ॥ తమసేనం జెదరించుచుం దొలఁగు నిం • ద్రద్వేషిఁ దా డాసి ప్ర
య్యని రక్షవిధిఁ జుట్టుఁ గ్రమ్ముకొను క్ర • వ్యాదుల్ భయభ్రాంతులై
వెనుకం ద్రొక్కఁగ సాలమున్ విసరెఁ ద • ద్వీర్యంబు మేలంచుఁ బా
టిన శాఖామృగ పూగముల్ మరలి పే • ర్చెన్ సంగరోద్వృత్తిమై.

మ॥ తన చుట్టుంగల సైన్యముల్ చెదరుటన్ • దైత్యేంద్ర పుత్త్రుండు రేఁ
గిన కిన్కంగని మేలుమేలనుచు నా • ల్గింటం బదింటం బలం
బున సాలంబును వక్షము న్నొగులఁగా • మూర్ఛిల్లఁ గా నేసి చే
తి నగంబున్ బలుముక్కలై యెగురఁ గ • త్రించెన్ బ్రకర్షమ్ముగన్.

ఉ॥ అయ్యెడ వాయునందనుఁడు • హాలహలంబు విధాన రేఁగుచున్
జయ్యన నప్పళించుచు భు • జంబుల నెట్టెదురం గడంగి యీ
కయ్యము దీనితో ముగియుఁ • గాః యని వేలుపు లార్వ రక్కసుల్
బ్రుయ్యఁగ నేసె నొక్కగిరి • భూతము లార్వఁగఁ గోఁతు లుబ్బఁగన్.

మ॥ ఇభజి ద్విక్రముఁ డింద్రజిత్తు నగి భూ • భృద్రాజమున్ దూల్చి యా
రభటిన్ మారుతిఁ గాంచి యిట్లను శర • వ్రాతంబుఁ బాటింపకే
రభసంబార శిలా ద్రుమంబుల సమి • ద్రంగంబునం గెల్తువే
ర! భళీ! చంపకమాన విన్నన జగ • త్ప్రాణాత్మజుం డిట్లనున్.

మ॥ వెరఁగా! మాకడ నున్నవారలు ధను • ర్విద్యా ప్రవీణుల్; మలల్
పదుకుల్ ప్రాఁకులతోడఁ బోరుటకు నేఁ • బ్రాప్తించితి న్నీకు; నీ
కదు క్రౌర్యంబును నేఁట రేపట నడం • గంబాఱుఁ గ్రొవ్వేలరా!
కడఁక న్నేర్చిన కొన్ని పద్ధతు లిటం • గావించెద న్నిల్వరా.

శా॥ నాతోఁ బోరెదొ? లక్ష్మణ ప్రభునితో • నాణెంబుగాఁ బోరెదో?
నీ తండ్రిం దలదన్న వచ్చిన జగ • న్నిత్యాత్ముతోఁ బోరెదో?
నీతంత్రమ్ములు సాగవింక ననిలో • నిర్విణ్ణత న్నిల్చి పైఁ
ప్రేతాధీశుని చూడఁబొ మ్మిదియె ప్రా • ప్తించు న్నిజం బియ్యెడన్.

మ॥ అనుడున్ శక్రజితుండు రోషమున నౌ • రా! ప్రల్లదీఁడా? వృథా
చనఁ డీ రావణి నాదు తమ్ము ననిలోఁ • జక్కాడి దర్పించు ల
క్ష్మణు నాజిన్ ఎధియింతు సన్న ప్రతినన్ • సాధింపఁగాఁ బూనినాఁ
డను నాతో నెదిరించుటన్న నిలఁ జె • ల్లం గల్లఁ బారాడుఁహా?

మ॥ విలు చేఁబూని యొకండనే నిలిచి మీ • నిర్వీరులన్ మిమ్ముఁ గా
కులకుం బారఁ జేసెద న్నిజము మీ • కున్ శక్తి లేదేని వే
ల్పులఁ బాతాళ నివాసుల న్నరులఁ బ్రా • పుం గూర్చుకొం డాజి మీ
తలలం ద్రెంపక గెల్పుగైకొనక నా • తండ్రిం గనం బోదునే?

తే॥ అనుచు విలుగొని దెబ్బది • యమ్ములేయ, మేన గుత్తులుగా నవి • మేవుకొనఁగఁ
గొండవలెఁ జలింపక వాయు • జుండు నిల్చి, కేల నొకగిరి గొని పక్కి • గేలిగాఁగ.

చ॥ మదకరు లెన్నియేని యొక • మాత్రపు సింగముద్రోల నిల్చునే?
ఎదరక లక్ష్మణుం డిటకు • వచ్చెడు దాఁకను పోరుదేని నీ
ప్రదరము రాకమున్నె యిది • వ్రచ్చును నీయురమున్ వలంతివే
నదరక కాచికొమ్మనుచు • నార్చుచు వైచె దళంబు ఘూర్ణిలన్.

చ॥ అలవు జలంబు గల్గిన మ • హాబల నందనుఁ దేసినట్టి య
మ్మల పొలదిండి పక్షము న • మాంతముగా వడిఁదాఁకి వ్రయ్యలై
పలపల రాలె దిక్కులను • వహ్నిని గ్రాఁగిన యుక్కుఁదుంప దా
కలి పయి వ్రేయు సమ్మెట వి • ఘాతమునం బఱివోపు కైవడిన్.

తే॥ అత్తఱిని మాయియగు నింద్ర • జిత్తు రేఁగి, హనుమ తొమ్మన భుజముల • నంటిదూసి
పోవ విషలిప్తమైన తూ • పులను వేయి, పరపి దాయనీయక చలిం • పంగఁ గొట్టె.

తే॥ పవనుఁ దదరి కలంపఁగాఁ • బైఁడికొండ, లోపల నెకలగుండ్లైన • కోపుదోఁప
వెడలి మేనిపై రక్తంబు • వెల్లిగాఁగ, ఇంచుకంత సోకిరి యో • చింపనంత.

తే॥ నీలుఁ డెదనొచ్చి జ్వాలలు • నింగినంట, సురపతిని సూటిగా వైచె • నొక్కకొండ
నడుమనే దానిఁ దుండ్లుగా • నఱకివైచి, శక్ర విద్వేషి వికటహా • సంబు చేసె.

ఉ॥ ప్రాణముతోడనున్న పెర • వానరు లాసలు వీడఁగా సువ
ర్వాణులు భీతినొందఁ గపి • వాహిని నాథుని దేహ మొత్తెడన్
బాణ విపాత ఘాతమున • వారక రక్తము గ్రమ్మ నాతఁడున్
ద్రాణ యొకింత లేక • ధర • వ్రాలె నడుంకుచు విహ్వలించుచున్.

చ॥ ఎడపక లక్ష్మణుండు దలుఁగు • లేయ మరంబుల నాటె వాహులన్
బుడమిని రాల్చె రక్తమున • ముంచె గజమ్ములఁ గ్రుచ్చె వాజులన్
గెడపెఁ బదాతి వర్గమును • కేలును కాళ్ళను ద్రుంచెఁ గాలుకై
వడి లయకాల రుద్రుపడిఁ • బార్థివ నందనుఁ డేచె నాజిలోన్

చ॥ మితిచెడి కూలు పీనుఁగుల • మేకొని లెక్క యిడంగ నిర్జరుల్
మతిఁ దలపోసి కాదనుచు • మాని శిలీముఖ వృష్టిఁగాంచి యి
వ్విితమును చూడఁ గాదనుచు • వీరుని కార్ముకమందు సప్త మా
రుతములు సప్తమేఘములు • రూఢిఁ జెలంగు నటంచ్రు వింటగన్

తే॥ ఒక్క యేనుఁగు మోమున • నొక్కకోల, యొక్క గుఱ్ఱము మోమున • నొక్క యలుఁగు
ఒక్క కాల్బంటు రొమ్మున • నొక్కశరము, గాఁగఁ వెలిసె లక్ష్మణ పృష • త్కమ్ములవల

ఉ॥ పుట్టుకతోడ గొప్ప యురు • వున్ బొలదిండియుఁ గల్గి తెక్కలుం
బుట్టినపాటఁ గంకముల • బోఁడిమి లక్ష్మణ బాణరాజముల్
నెట్టన యొక్క యొక్క రజ • నీచర సంస్థిత గాత్రమందు ము
క్కొట్టఁగ వ్రాలియుండె మఱి • యొక్క నిశాచరు బోల్కి యొందఁగన్.

తే॥ ఇంద్రజిత్తు రోషమున నటో • రెసఁగ జేయు, ముప్పదైమవెల్లువలక • పులు మరించె
లక్ష్మణాస్త్ర జాలమున నా • లమునఁ గూలు, ననుచు శవములలో నవి • యడఁగిపోయె.

ఉ॥ చేతులు త్రెవ్వి కాళ్ళు తెగి • చింపలు పందలు యయ్యె బొంపిపాల్
మూతులు వోయి యాంత్రములు • ముందట జాఱి బలంబు లాచిక
క్షేతులు మాలి యాయుధ వి • హీనములై పడఁ దక్కు నిర్జరా
రాతుల పాఱి రాసలకుఁ • బ్రాణము తీపను పల్కు నిల్పమెన్

తే॥ సీరువట్టిన చేతిలో నిలిచినట్టి, మందరమువలె నొకఁడేని • మాట తోడు
లేని మేఘనాదుడు తత్త • రించి బొమలు, ముడిచి తేరిపై లక్ష్మణు • మొనయవచ్చె

ఉ॥ మారుతి గాసి వీడు రథ • మధ్యగతుండయి యుండ నేల నీ
వారట మెప్పు చూపదుమ • దంపగితుండవు గమ్మ నీవనం
గౌరవలీల లక్ష్మణుఁడు • గాడుపుపట్టి భుజంబు నెక్కి బ్రం
దాఁకు పుల్లసిల్ల జల • దవ్వయమో యనఁ దాఁకి రిద్దఱున్.

ఉ॥ కాళిక బోలి యొక్కరుఁడు • కాలుని బోలి యొకండు ఘోరి ఘా
గోళము దద్దరిల్లఁ గుల • గోత్రము లల్లలనాడఁ దంప్రుతుల్
మేళన మొందగా విశిఖ • మేదుర నాదము పిక్కటిల్లె న
వ్వేళ ముఖమ్ములం గొఱికె • భీకర లీలల నమ్మ లమ్ములన్.

క॥ పిడుగులఁ బోలిన బెడిదపుఁ, దొడుగులు మఱి తొడుగు లేయ • దుడుఁగుమరాలన్
దొడిఁబడి జగములు వడఁకుచుఁ, గడలి నడిమి నావవోలెఁ • గళమంచెన్

క॥ అరదంబును మావులియును, బోరివిరిఁ దిరుగంగ బంక • పూర్తిగ నదరెన్
శరములు గ్రమ్మటచేఁ, బెలి, యరు లక్ష్మణుఁ డింద్రజిత్తు • నమరుల కరయన్.

చ॥ కర శర లాఘవంబు లొక • కైవడి నందవు నేమమున్ మహో
ద్ధురమగుఁ జోరు లీరు బవిలు • దుస్సహమౌఁ గనఁ జాలమంచు ఖే
చరులు వచింప నేత్రిగతి • చర్యడు సైతము శంబగూరె నే
కరణి వచింపనౌ జరుగు • కార్యము లిట్టివ యంచు గట్టిగన్

చ॥ జరిగిన దొక్కచే నెఱుఁగఁ • జాలరు యేసు ఘటిల్లె నెవ్వరీ
కరణి దురంబు పూర్వము జ • గంబునఁ గాంచిరి మున్ను లే దనం
తరమును గల్గఁబోదు కను • దమ్ములు తెప్పలు లేనివయ్యెఁ గాం
చు రుటము గానమైలి మని • గ్రుక్కిరి పేల్పులు వారిఁ గానమిన్.

ఉ॥ వేలకొలంది భల్లములు • వీరుఁడు రావణి మీఁది యేయఁగా
వేలకొలంది భల్లముల • వేగమ లక్ష్మణుఁ డేసి త్రుంచురున్
వేల ఫణీంద్ర బాణముల • వెంటనె రావణి యేసె మాఱుగా
వేల ఫణీంద్ర బాణములు • వీకున లక్ష్మణుఁ డేసి త్రుంచుఁదున్

తే॥ లక్ష యమ్ముల నింద్రారి • లాగి యేయ, లక్షతో వాని నడఁచెను • లక్ష్మణుండు
కోటి తూపుల రావణి • కూర్చి పరపఁ, గోటితో వాని సౌమిత్రి • కొట్టివైచె

సీ॥ కంకపత్రమ్ములఁ • గలుకు రక్కసుఁ డేయఁ, గంక పత్త్రములె రా • ఘవుఁడుఁ వైచె
నర్ధచంద్రాస్త్రమ్ము • లసుర యేయఁగ నర్ధ, చంద్రాస్త్రములనె ల • క్ష్మణుఁడు వైచెఁ
గోలలఁబోలిన • కోలలతం డేయ, నీకందు నట్టివే • యేర్చి యేసెఁ
బాణల మొనలున్న • ప్రదరంబు లమరారి, యేయ నట్టివ యేసె • నృప సుతుండు

తే॥ తమ్మి మొగ్గలఁ బోలు న • స్త్రములు దైత్యుఁ, డేయ నట్టివ సౌమిత్రి • యేసి త్రుంచె
వజ్ర ముఖ బాణములును క్ర • వ్యాదుఁ డేయ, నట్టివే యేసి యడఁచె రా • మానుజుండు.

సీ॥ త్రిశిరశ్శరంబులొ • త్తిలి యిద్ద తేయంగ, నవి తాఁకి పొడియయ్యె • నంబరమున
నంజలి యనెడి సా • యకములు నిరువురు, వేనవే లేయంగ • విఱిగె నవియుఁ
గుంజర శ్రవములన్ • పింజకోలల నిర్వు, రేసి రయ్యవి తాఁకి • యిల నడంగె
రావియాకులఁ బోలి • రాజిల్లు తూపుల, నిరువు రేయఁగ నవి • యెడలి దొరలె

తే॥ నిట్టులేయుచు విఱుమచు • నెసక మెసఁగ, లోకములె యంపగములకు • లోనుగాఁగఁ
జేసి యార్చిరి పొంగిరి • చెలఁగి రుబ్బి, రదరి రఁటరి రొప్పిరి తని • వందరైరి.

ఉ॥ రావణి కల్ప మేషములు • హ్రాదినులం గురియించి ముంచు నా
కైవడి నేసి వాఁడి గొర • కల్ వడిఁ గర్కటి వ్రీలునట్లు ల
ప్పావని మేను జేసి నర • వర్యుని కంకటమందు గ్రుచ్చె బా
ణావలి వేనవేలుగ వి • యచ్చరు లందఱు విచ్చలింపఁగన్.

తే॥ హనుమ యొదలి ర క్తముగాంచి • యమరులెల్ల, వింద్రజితు చేయి మించిన • దంచునెంచి
వదనములఁ ద్రిప్పికొని కేలు • విదిరిచికొని, వెగడుపడి రీకఁ దేకై క • వీరుఁ దనుచు.

మ॥ రణ పాండిత్యము మీఱఁ గ్రూర విశిఖ • వ్రాతంబులం గూర్చి ల
క్ష్మణుఁ డశ్వంబులఁ గూల్చి దైత్యు సిదమున్ • ఖండించి కేరించి రా
వణి మైమర్వను చించి సారథిని చం • పంగొట్టి వెన్వెంటనే
గణనాతీతములైన బాణములఁ ద ద్గాత్రంబు భంజించుడున్.

క॥ సారధి గూలినఁ దెక్కెము. వారువములు పడిన మేను • వ్రస్సిన రణ దు
ర్వారుండై లంకేశ కు, మారుఁడు చలియింప కిట్లు • మదియించె మదిన్

మ॥ నరుఁడే యీతని సాటి; కాదయినచో • నారాయణుండే యగున్
గిరిశుండో౯ బరమేష్ఠియో౯; దృఢమతిన్ • గీశాళితో దిగ్గి మా
పురిలో మమ్మెదిరించి నిల్చి మనుజున్ • మున్నెన్నఁడుం గాన మ
చ్చెరు వీసాహస మీచణత్వము రణ • స్థేయత్వ మీ ధీరమున్.

తే॥ అనుచు వేతాక కేరెక్కి • యసురవరుఁడు, నిప్పు లురలంగ నిట్టూర్చి • నేయి పోయు
నిప్పుపగలె మండి మిక్కిలి • నెగడి క్రూర, విశిఖతతి దండడిగ గుప్పె • విన్నునింద

తె॥ శ్రేణులై కుప్పలై పాఱ • శితశరములు, లక్ష్మణుం డేసి వానిఁ దో • లంచి వేయి
నారసము లింద్రజితు మేన • నాటనేయ, వాఁడు వడిఁ గ్రుచ్చె సౌమిత్రి • ఫాలమందు.

తే॥ నొవ్వ కించుకంతయు లక్ష్మ • ణుండు వాని, ఱొమ్ము రంధ్రమ్ములదర నూ • ఱమ్ములేసి
నొంప మేఘనాదుఁడు మేను • కంప మొంద, నొఱఁగెఁ దేరిపై సుంత వి • ల్లూఁతగాఁగ.

తే॥ కాలుఁడే యదాటునఁదూఁకు • కరణితోఁప, హనుమపురజించి యింద్రజి • త్తరద మవనిఁ
గ్రుంగ వారువంబులు నలి • గులిగఁ గూలఁ దన్నెవాఁడును వేఱు స్యం • దనమునెక్కె

తే॥ ఇంద్రజితుఁడు పెక్కగు తేరు • లెక్కుచువడిఁ, గూల్చుకొనుచుండెఁ గాని యొ • క్కొటియుఁగాచి
కొనిరణంబు సేయఁగ లేక • కామఁ లచుండె, గడియలో వేయిపమలు • మడఁగిపోయె.

క॥ దేవత లనుమని లక్ష్మణు, దీవించిరి విరులు గురిసి • తేట మొగములన్
ద్రోవయి రాదిరి పాడిరి, పైవస్త్రము లార్చి రధిక • పరితోషమునన్

తే॥ అంత నింద్రజిత్తునకు న • త్యంత హితులు, సమసుఖాన్నపానులు వెస • శత సహస్ర
సంఖ్యగల రక్కసులు మి త్తి • సరస కీడ్వ, వచ్చి చేరి రచ్చటికిఁ గా • వరముతోడ.

తే॥ హ స్తిపకులును రథికులు • నాశ్వికులును, కాల్బలంబులు కేల ధ • ద్గములు గదలు
దాల్చి గర్జలతోడ వా • ద్యములు నిగుడ, ఖడ్గదీప్తులు కెలఁకులఁ • గ్రమ్మవచ్చె

తే॥ శరభసింహ వారణ పిశా • చముఖ ధ్వనులు, శింజినీ రవములు దెసల్ • చెలఁగ బరవెఁ
బుడమి శవముల మయమయి • యదరు కతన, స్యందనములవేఁ బెందూళి • క్రందుకొనదు

ఉ॥ జీవము గొందునంచు మొగి • వేయఁగఁ దక్కిన వానరావళుల్
రావణిఁ జుట్టుముట్టి బవ • రంబునఁ జచ్చిన వారి శీర్షముల్
వావురముల్ శతాంగములు • వారణ తుండము లందినట్టి వే
వేవియొ తెచ్చి వైచి శర • వృష్టి నడంచిరి మించి యార్చుచున్

ఉ॥ అంతటఁ బ్రాభవ స్థితియు • హర్మ్య నివాసము విద్రవీడు ధీ
మంతుఁడు పోరుచున్న చెడు • మానిసిదిండుల నొక్కఁడేని కా
న్పింతమ యన్నఁ గాని కర • ణిం బరిమాఱుప నింద్రజిత్తు దు
ర్దాంత రుషా పరీతుఁడయి • తార్కొనె నోర్వఁగరాక గ్రక్కునన్.

తే॥ సేనలం జొరకొని యంద • శిఖరమంటి, నట్టి రక్తజలధి యీద్వ • ననువు దప్పి
రక్షణము చేసికొను చక్ర • రక్షకులకు, ధూమ్రనేత్రు మహాపార్శ్వుఁ • దొడరి కాంచె.

తే॥ పీనుఁగులు కొండల బలెఁ • బెరిఁగియుండ, జలదములు దాఁటలేదు భా • స్కరరథంబు
దాఁటలేదు పక్షులుగూడ • దాఁటలేదు, పిలుచు నిల్వున వారలు • పిలిచిరట్లె

తే॥ వారి మోములఁ గాంచి రా • వణియుఁ గదిసి, వింత! మన సేన నలువది • వెల్లువలను
లక్ష్మణుం డింతలోన న • గ్గలపుఁ గినుక, నాశ మొనరించుటలు కాంచి • నారె మీరు.

తే॥ అనుడు వార లింద్రారి! నీ • వంతకంటె, నెక్కుడగు కపిసేన మా • యింపలేదె?
సముఁద వట్టి సంగ్రామమే • సలిపితయ్య. చింతయేల యటంచు వ • చించునంత

తే॥ ఇంద్రజి ల్లక్ష్మణులు వెండి • యేపుమీఱి, పోరఁదొడఁగిరి సౌమిత్రి • మేరమీఱి
వేలకొలఁది శరములేయ • విబుధవైరి, వేయుకొలఁదిఁ దున్మచునుండె • వివిధగతుల.

తే॥ ఐదుపది నూఱు వేయి ప • దాఱువేలు, ముమ్మరముగఁ గోలల నేసి • మూర్ఛదేలి
పోర వచ్చిన వానర • వీరవరుల, మరల దశకంఠ సూనుండు • ధరణిఁద్రోచె.

తే॥ వనచరేంద్రుండు ముస్సగు • వారు సోలి, పడఁగ నెదుట నిల్చిన సుర • వైరి తూల
వెదురుటడవిఁగాల్చెడి జాత • వేదు కరణి, మండు శరముల గుప్పె ల • క్ష్మణుఁడు కడిమి.

తే॥ ఇంద్రజిత్తు మూర్ఛిల్లె న • హింపలేక, కొమ్మలంబలె నిల్చునో • కులు నిరువురు
దాఁగియుండిన రాకాసి • దళము కొంత, తోడుగాఁ బోరఁదొడఁగి రు • త్సుకతవిడక

తే॥ రథగజాదికములు లేసి • రాక్షసాలి, మీఱి త్రుటి మాత్రలోన సౌ • మిత్రి కురియు
బాణవర్షంబున మునింగి • ప్రాణములను, విడిచినారు కొందఱు పాఱఁ • దొడఁగినారు

తే॥ నీరుపట్టుచేఁ గొందఱు • నీరదముల, కెగసి నీర్వావి ప్రాణములఁ • దగిలి నీరు
చొరఁగఁ జచ్చిరి కొందఱు • దొరకకుండ, నాల్క లెండఁగఁ జచ్చిరి • నవసి నవసి.

మ॥ శరసంఘాత విదారితాంగులగు దో • షాచారులం గొంద ఱ
ప్సరముం జేరి వికీర్ణ కేశలయి సౌ • మ్ముల్ దాలఁ జింతార్తిమైఁ
బరిచర్యల్ పొనరించు కాంతలఁ బరి • ష్వంగమ్ము గావించి త
ద్వర జీవమ్ములతోడఁ జేరి రసుల • స్వర్గీయ తల్పమ్ములన్.

మ॥ శర విర్గాత విశీర్ణ పక్షులు విశా • సందారులం గొంద ఱు
ద్ధుర వేగంబున విండ్లు సేరి హితులన్ • దుఃఖంబుతోఁ గాంచి యా
చరణాబ్జంబులఁ జుట్టుగొన్న సుతులన్ • సాఁకుండి యందాంధ్ర బా
లుర మోముల్ తనివారఁ గాంచుతఱిఁ గా • లుం గాంచి రంత్యస్థితిన్.

శా॥ ఈసౌమిత్రి విజృంభణంబు క్షణమి • ట్లేయున్న వెయ్యేల లం
కా సామ్రాజ్యము నాశమొందు నిజ మిం • కన్ మేఘనాదుండు వి
శ్వాసుండౌటకు మున్నె డాఁగుఁడు గిరి • ప్రాగ్భారమందంచు వి
శ్వాసాత్మీయుల శాడి కొందఱు గత • శ్వాసాత్ములై రయ్యెడన్.

చ॥ నెఱఁకుల నాటియున్న శర • నిర్గత శోణిత దిగ్ధ దేహు లు
క్కుఱి యిలు సేర బంధులు స • యంబునఁ దూపుల మార్పఁబూన వి
ల్లురివినఁ జత్తుమంచుఁ గడు • నూర్పులు పుచ్చుచు మార్పుచెంది చే
మిరి యిరుపాలఁ బోలె నిర • మించిరి సర్వము మౌనులంబలెన్.

ఉ॥ తేరులపై వడిం జనక • తేజులమీఁదను పోక కాల్నడం
బాఱక దంతిమూఁపులను • పాఱక సిగ్గున లంకలోనికిం
జేరక యందు వెల్పల వ • సింపక ప్రాణములందు తీపిచేఁ
దాఱిరి కొందఱా శవ వి • తానము క్రింద నొదింగి యూర్పుచున్.

చ॥ కురిసిన చోటనే కురియు • క్రొమ్మొగులుంబలె లక్ష్మణుండు దు
ర్భరముగ నాయముల్ నలఁచి • రావణి జంపుదు నంచుఁ గత్తళం
బరవర సేసి వాని వివ • శాత్ముఁగఁ జేయఁగఁ దేఱుదాఁక సం
గర మొనరింత మంచుఁ గలు • కావలి వారలు డాసి యుగ్రులై.

చ॥ అరదములన్ గడించి పొలు • పారి ప్రభంజన సూను లక్ష్మణుం
గుఱిగొని బాణజాలముల • గుప్పఁగ లక్ష్మణుఁ డాగ్రహించి చి
చ్చులు పిడుగట్టి నారసము • లొక్కట నూఱుల నేసి తేరులన్
ఖరువులఁ దేరి చోదకుల • ఖండము ఖండము సేయు నంతటన్.

చ॥ విరథులు వారు పెన్ గదల • పీఁకను కైకొని మారుతాత్మజా
దరమిడి మోఁదఁబోవఁగ ను • దగ్రత నాతఁడు వాని లాగుడున్
వెరవున వీన పీఁడు కడు • పీఁగి వధించున యంచుఁ బాఱి రి
ద్దఱుఁ దిను సన్న మేని యెడఁ • దం దలపోయక ప్రాణ రక్షకై.

ఉ॥ కాలము తిఱమిన్ మఱియుఁ • గాలున కింతయు జార తోఁపమిన్
గాలియుఁ జల్లఁగాఁగఁ దమ • కాయములం జెనకంగ విద్దురం
దేలి శ్రమంబు నీఁగి మిహి • తేఁకువ చేవయు వొంది వాలముల్
వోలఁగఁ ద్రిప్పుచుం గపులు • మూర్ఛలఁదేఱిరి లేచి యుద్ధతిన్.

తే॥ గవయ గంధమాదన గజ • ద్వివిద మైంద, పనస జాంబవ దంగద • ప్రముఖులెల్ల
వేలుపుల భద్ర వాక్కుల • వినుతిసేయఁ, దరుల గిరుల మోచికొని తె • చ్చిరి కడంక.

తే॥ అంద ఱొక్క మొగినిపైవ • నసురవరుఁడు, ప్లవగ వీరులఁ గని కోప వివశుఁడగుచు
వింతయే గద మీచేవ • లేవు లనుచు, నవ్వి ఖండఖండములుగఁ • ద్రెవ్వనేసె.

క॥ విసువక కోఁతులు తాలను, విసరుచు ముసరుటను గాంచి • విల్లును శరముల్
మసలని తోడుగ నిలిచిన. యసురుని యెడ సదయుపగిది • వడఁగ్యనినుండున్.

క॥ శ్రుతులును స్మృతులును సత్యము, తత ధర్మము లెవని మహిమఁ • దలపించునొ త
త్పతి నెఱుఁగని వెడఁగుల యెద, వితమున విరు లన్ని దెసల • విరివిగఁ గ్రమ్మెన్.

ఉ॥ పాతిక కాష్ఠలో నితని • ప్రాణము తీసినఁ దీఱువచ్చుఁ గా
కీతటి తప్ప దానవుల • కిమ్మగు కాలము వచ్చు వచ్చుచో
నాతఁడు మింట సంచరిలు • నట్లయినం గెలుపొందువాఁడు సు
మ్మీ! తడ వేల యంచనుగ • మించి విభీషణుఁ డాడు నయ్యెడన్.

క॥ తనుచుట్టిన ప్లవగులపై, హనుమనిపై లెక్కలేని • యంపగముల నే
సిన రావణిఁ దునుమఁగ న్యం, దన మొక నారనముతోడ • ధర బడఁగొట్టెన్.

## ఇంద్రజిత్తు నాగపాశముచే లక్ష్మణాదుల బంధించుట

చ॥ రథమును లక్ష్మణుం డొక శ • రమ్మునఁ గూలుచ నంతలో వియ
త్పథమున కేగి వీరి నహి • పాశముచేఁ బడఁద్రోయ జీవముల్
వ్యథగొని వీడు వారలని • యారసి రావణి మబ్బుఁ జేరె దు
ష్ప్రథితునిచే విఁకెయ్యది మా • సంగునొ యంచమరుల్ పడంకఁగన్

క॥ విల్లును తూణీరంబులు, పెల్లగు కోపంబు క్రౌర్య • విధులుం గల యా
ప్రల్లదుఁడు మింటఁ జీకటి, నల్లని మేఘములలోఁ గ • నంబడకుండెన్.

తే॥ పంక్తికంధరసుతుఁడు త • పఃఫలమున, వరబలంబునఁ గులగౌర • వంబువలన
మంత్రబలముచేత నణువు • మాడ్కి సూక్ష్మ, గాత్రుఁడై కానరాక మే • ఘముల నడఁగె.

తే॥ అబ్జభవునైన హరినైన, నభవునైనఁ, గట్టిత్రోచిగా కూరక • క్రమ్మఁతిలని
భుజగ పాశంబు నభిమంత్ర • పూర్వకముగఁ, గేలఁగైకొనె వంచనా • శీలుఁడంత

తే॥ అచటి వానరులును మాయ • నరయలేక, కదనమున జంకి పాఱెన • కాఁదలంచి
యుబ్బియార్చి గంతులువైచి • రుత్సహించి, లక్ష్మణుఁడు నళ్లెయెడఁదఁ ద • లంచి నవ్వె.

తే॥ జరుగునది కనలేక ల • క్ష్మణుఁడు హనుమ, మూఁపునుండి ధాత్రికి దిగి • చాప మంగ
దుని కరంబున నిడి షేనఁ • దూణియున్న, శరము లూడఁగఁదీసి వి • క్రాంతి గొనియె.

క॥ రావణి నాగాస్త్రంబును, తీవరమున వదలె వదల • దిశలెల్లను శే
షో విలసనముగఁజేయుచు, నోపగ వడిఁ జుట్టె లక్ష్మ • ణవి బాహువులన్

మ॥ సకల ప్రాణు లెదిర్చినన్ మనమునన్ • జంకింతయున్ లేని య
య్యకలంకాత్ముఁడు లక్ష్మణుం డిటియఁ ద్రో • యంగట్టు నిక్కట్టు వం
చకు మాయాబల మంచెఱుంగక యుదం • చత్పత్త్వ హీనస్థితిన్
వికటా టీల రణస్థలిన్ గగనమున్ • వీక్షించె వే పల్మఱుల్.

శా॥ ఈమాయల్ పొనరించు దొంగను త్రుటిన్ • హింసించి బంధింతు వాఁ
డే మార్గంబునఁ బోవువాఁడనుచు • సుగ్రేశుండు సామీరి వే
వ్యోమప్రేక్షణుఁడైన యంతట దశా • స్యుఁ వాలి వాలంబు ప్రో
ద్దామ ప్రక్రియఁ జుట్టినట్టులు తద • స్త్రంబంటి చుట్టెన్ వెసన్.

తే॥ క్రూరదంష్ట్రలుగల పృదా • కువులు తక్క, వనచరులఁగూడ బంధించి • వైచునంత
బాహుబలముక్కి యేమియుఁ • బాలుపోక, భ్రాంతి నొందిరి సమర భూ • భాగమందు

ఉ॥ బంధితులైన కీశలోక • పట్టున లేచుచు వ్రాలు చుగ్రులై
కంధిని గాంచి కంధరముఁ • గాంచుచు వాలము నేలమోఁది పా
ణింధమమేచఁ గాంచుచు గ • ణించుచు లక్ష్మణుతీరు దుఃఖులై
యంధుల వోలె నుండిరి ర • ణావని నేమియుఁ దోఁపకుండుటన్.

క॥ ముదుఁగుదురు సత్త్వహీనత, నదుగుదురు విభీషణుఁ గని • యరయఁ బ్రతికృతిన్
మదుఁగుదురు నదుము విలువక, యుడుగుదు రసువుల్ చలింప • సుగ్రేశులై.

ఆ॥ సంకటంబు దీర్ప • చతుర లెవ్వరు గాలి, కన్న కొడుకు బ్రదికి • యున్న వాఁడె?
యనుచుఁ గలఁగి మలఁగి • మనువంశ్యుఁ డీస్థితిఁ, గవిన నెంత చింత • గాంచునొక్కొ?

ఆ॥ అనుచుఁ బనవుచుండ • సంబరమున నింద్ర, జిత్తు నిలిచి చూచి • శితశరముల
వైచి కట్టువడిన • వానరవీరుల, నొంచి కూల్చె నేమి • యెంచఁగలదు?

ఆ॥ కరువపైన వ్రాలు • కరి మొగుళులు మహా, వాతమునను వ్రీలు • వైన మొప్పఁ
దూపులొడలఁ జొచ్చి • దూసిపోవఁ బ్లవంగు, లురలి సోలి నేల • దొరలి నారు

క॥ శరములు వేలకొలఁది తన, శిరమున నురమునను నాటఁ • జింతింపక యా
కరువలి కొడుకు సుమిత్రా, వరపుత్త్రుని స్థితికిఁ జాల • వగఁజెందె మదిన్.

క॥ తక్కినవీరులు బాణము, లుక్కఱ జేయంగఁ గూలి • యుర్విని గాత్రం
బొక్కెడ నమ్ములు మిక్కిలి, స్రుక్కించిన నంగదుండు • సోలకయుండెన్,

తే॥ గచ్చకాయలవలె మేను • గదుములైనఁ, గారుచిచ్చునఁ గాలు కాం • తారమట్లు
మనసు మేనును మండఁగా • మలసెఁ బ్లవగ, రాజు రక్తార్ద్రఁబొడము మా • ర్తండుఁడనఁగ.

చ॥ అనమ ఫణీంద్ర పాశమున • నర్దితుఁడై యొదలెల్ల దొడ్డ నా
రసములు గ్రువ్వ నొచ్చియు భ • రంబగు కష్టములోర్చి సంసృతిన్

విసివియుఁ ద్రోవఁజాలిన వి • వేకము దార్ఢ్యము గల్గి కర్మలన్
వసమయి యాత్మ చిక్కువడు • బాగున లక్ష్మణుఁ డుండె నయ్యెడన్.

సీ॥ శరములు కిరణ సం • చయముగా నొలు మై, యెదలఁ గాతెడి నెత్తు • రెండగాఁగ
దెసలఁ బేరిచిన రా • క్షసులను చీఁకట్లఁ, జెలఁగిన లక్ష్మణ • జలజ హితుఁడు
ఉదయాచలేంద్రంబు • పదురున విలసిల్లె, సామీరి భుజ నభ • స్థలిని బొలిచి
విషధరాక్రాంత స • ద్బింబంబుతో మింటి, నుండి మంటఁ బడిన • యొజవుదోఁచి

తే॥ సోలెఁ దక్కిన వీరులు • స్రుక్కిపడిరి; యిషువు లొడలెల్లఁగప్పిన • యింద్రజిత్తు
దుస్సహంబైన బాధతోఁ • దూలిపడుచు, నోట నెత్తురు గ్రక్కుచు • నొచ్చి క్రుస్సి.

ఉ॥ చెప్పిన యంతవట్టు పవి • చేకుతె నామది సంకటంబు వోఁ
జెప్పెడిదేమి రేపె యవ • శిష్టము పూర్తి యొనర్తు నేఁటితోఁ
దప్పకతీతె లక్ష్మణుఁడు • తత్ప్రతినావశి మాపెనంచు విం
బొప్పఁగ గెల్పు దెల్పు బహు • శోన్నత రావ మెసర్కనం జనెన్.

ఉ॥ ఈనెలు క్రమ్మిన ట్లతిశ • యించిన యమ్ములవాన నించు రా
ట్పూన పయోదముం దఱిమి • చొక్కపు రావణియన్ విధుండు లం
కా నగరంబు సొచ్చి పుర • కాంతల మేటి కటాక్ష వీక్షణా
మూన పయోజ తోరణ వి • నూత్న కృతస్థలిఁ జేరె వెంబడిన్.

తే॥ రత్న దీపముల్ కైకొన్న • రాజముఖులు, స్వరయుతంబుగ విజయంబు • పాడుసఖులు
ముందు వెనుకల రా దళ • ముఖసుతుండు, తండ్రియున్న శుద్ధాంతసౌ • ధంబు పేరె.

తే॥ చేరికై మ్రొక్కి జరిగిన • తీరుదెలిపి, చింతవిడు మలసితి శ్రమ • కొంత దీఱఁ
బిదప వచ్చి విశదరీతి • విన్నవింతు, వెలవె యని వడివడిఁ దన • నెలవు సేరె.

## విభీషణుఁడు లక్ష్మణు నవస్థం గని దురపిల్లుట

మ॥ అటఁ జింతాకులుఁడై విభీషణుఁడు కా • ర్యాలోచనంబంది చి
ల్కుటచే నైన వధింబలెం గలఁగి వీ • ల్పుం దెల్వియుం దక్కి య
క్కట క్రూరాత్ముఁడు చంపఁదయ్యె నను లో • కఁబందు దుఃఖంబు లా
రటపెట్టం గడు నింద పాలయితి నౌ • రాయంచు దూపిల్లుచున్.

మ॥ చని కట్టంబడి యున్న లక్ష్మణుని రా • జ ద్రాజభక్తిన్ నమి
త్తున జీవంబుల నప్పగించు కపి సం • దోహంబులం గాంచి యే
మన లోకుల్నను నేమిగాఁ దలఁతురో • ప్రాణంబులన్ మేనఁ బూ
నిన పాపంబున నిందపాలయితిఁ జ • న్నే? యంచుఁ గుందె న్మదిన్.

శా॥ చెంతన్ వర్తిలి సంచుపొంచి వధముం • జేయించినాఁ డందురో?
వంతంగూర్పఁగఁ దోడితెచ్చి వధియిం • పంబూనెనా యందురో?

పొంతంబెసెఁ బ్రహారంబు నలువఁగా • ముఖ్యంబుగా నందుకో,
చింతింపంగలవారు తోఁచు కరణిన్ • చిత్తంబులన్ మానవుల్.

శా॥ ఘోరంబొచ్చిన యింద్రజిత్తు నపుడే • పొంగెల్ల వే తూలఁగన్
దేరున్ సారథి గుఱ్ఱముల్ దొరలఁగాఁ • ఛేద్రించి మర్దించి మ
ద్వీరత్వంబును చూపనైతి నని మి • త్రిం బొందఁగా నైతి వే
పారం బింలిలి యేమి? నాకరణి ప • శ్చాదుద్బుద్ధియుం గల్గునే?

మ॥ దురమందీ కపిసేనతోడ గెలువో • దుఃఖంబొ చావో ముదం
బొ రహిం బొందుచు నా తలంపు వికటీ • భూతంబు చేయింప కి
ట్లరికింగాన శరణ్యమైన పతికిన్ • వ్యర్థుండనై ధాత్రిలోఁ
గొఱవిం బోలిన వాఁడనైతి నిరు వాఁ • గుక్ నష్టమై క్రుంగఁగన్.

మ॥ అనుచున్ వ్యాకులితాంతరంగుఁడయి శో • కాక్రాంతుఁడై దిక్కుతోఁ
చని దీనస్థితు నవ్విభీషణుని తా • పంబెంతయుం గాంచి వా
రని చింతం బరిహారపద్ధతుల నా • రంజేయ సాధ్యంబె? యం
చనలుం దేగి వచించె రామునకు నా • ద్యంతంబు వృత్తాంతమున్

చ॥ కుమిలి తపించి లోన మటొ • కొంచు నెఱుంగక పల్కు కపులన్
నిమిషము లేక చూడకయు • నీరుచు కార్పక కిన్కతోడ లో
కములను కాల్ప కాచ కలఁ • గం బలవింపక రాఘవుండు చి
త్తమునఁ దలంచె లక్ష్మణుఁడు • తప్పక జీవిమె యంచు ధీరతన్.

చ॥ కలఁగక రామచంద్రుఁ డిఁకఁ • గార్యము వేతొకరుండు లేదటం
చలఘుమతిం దలంచుచు ర • యంబున లేచి గమించి వేగ రే
వెలఁదుక పీలిచీర తడి • పీడఁగఁ బిండఁగ నిండెనన్న యా
నలువునఁ గప్పి కప్పు కద • నస్థలి జేరె మనస్వి రీకృతిన్.

ఉ॥ చేరి యిరుల్ తొలంగి విల • సిల్ల ధనంజయ కాండ మేయ వే
దోరెను చీఁకటుల్ పగటి • తోయము నొందె రణస్థలంబు పెం
పార యుగాంతవేళ నిట • లాక్షునిచే భువనంబులెల్ల నే
తీరు భజించు నట్టి పగి • దిం గనుపట్టె సుదుష్పహంబుగన్

తే॥ దుర్గి కావాస యోగ్యమై • దుష్టగంధ, మైన రణరంగమునఁ గుఱు • పాద్రి పొంత
రుధిర పంకిలాంతర గతా • యుధ పరీత, దేహుఁ దమ్ముని కాంచె ధా • త్రీ విభుండు

తే॥ కాంచి పైఁబడి తనదు వ • క్షంబడంగఁ, గౌఁగిలింగొని విట్టూర్చి • కనుల నీరు
గార్చి రవియొద్ద జలధార • గార్చు కారు, మొగులనఁగ నొప్పె రఘుకుల • పుంగవుండు.

ఉ॥ పుట్టియుఁ బుట్టు వొందని ప్ర • ఫుల్ల సరోజదళాక్షుఁ డూర్చు నీ
ర్వట్టఁగ నేడ్చుఁ గుందుఁ బ్రవ • రంబుల నూఱ్చును లక్ష్మణా యనున్

ముట్టను ముక్కురంధ్రముల • బుద్ధి కలంగఁగ నోలు దూపిలన్
గొట్టుచు నున్న విప్పుడును • గుండె లటంచు ముదం బెదం గనున్.

ఉ॥ మేచక దేహుఁ డక్కునకు • మేనొఱఁగించుచు దువ్వు వ్యోమముం
జూచును నేలఁజూచు విలుఁ • జూచు భుజంగమ పాశ బంధముం
జూచు సురేంద్రవైరి చను • చొప్పును చూచు జగంబుఁ గూల్పఁగాఁ
జూచుఁ గడింది నొడు కలి • చున్ మహనీయుల పల్కులం గొనున్.

తే॥ నెఱిఁ బ్రమాణంబులం దాఁటి • నిల్చినట్టి, రామవిభుఁడు వానర నిక • రమునుగాంచు
విధివిగాంచు నమ్మలఁ గాంచు • వింటిఁగాంచుఁ, దహతహంబొందుఁ జిత్తంబు • తత్తరింప.

ఉ॥ పిల్చి వచించియుండిన వి • భీషణ! యప్పుడె నాగపాశముం
దాల్చిన చేతులన్ శిరము • ధారణి డుల్లఁగ నేయకుందునే?
కాల్చితి నామనంబు పని • గానక పాదొనరించి తివ్విధిన్
నిల్చఫలంబె ప్రాణములు • నీఁగిన పిమ్మట దేహ మున్నసన్.

ఉ॥ రాముని పల్కులన్ విని క • రంబు వడంకు విభీషణుండు సం
గ్రామ భయంకరా! వినుము • రావణి వీరొనరించువేళ నీ
ప్రేముడి తమ్మునే గెలుపు • వేఁడెన కాఁ దలపోయుచుంటి మీ
బూమియ నాగపాశ బల • ముం గొని పుట్టినవయ్య! వింటివే

సీ॥ అతికాయు మస్తక • మట్టకు నెడఁబాసి, నట్టి లక్ష్మణు డుద • గ్రాస్యుఁ డిటకు
పుత్రకారణ రోష • మున వచ్చువాఁడని, తలఁచి యుద్యోటనే • నిలువనంత
నలువది వెల్వల • దళముతో నింద్రజి, యే తెంచి రణమున • నేపు మీఱి
నలువది వెల్వల • బలిముఖ సైన్యంబు, గంద్రించి త్రోచి ల • లక్ష్మణుని గదియ

తే॥ నతఁడు నల్వదివెల్వల • పృతనఁగూల్చి, వేయి కీరుల నిఱిని త • ద్విక్రమంబు
చావు వఱకును తెచ్చి య • స్త్రము లసంఖ్య, ములుగ గుప్పించి శోణిత • మొలుకఁజేసె.

తే॥ దడము లవిసెను నొచ్చి యొ • క్కఁడుగ నిలిచెఁ, దప్పెనేని మాయలు పేయు • దనుజుఁ డనుచుఁ
దమ్మ నెచ్చరించితి నంతఁ • దమ్మినంటు, చరమగిరిఁ జేరెనునువుగా • నిపుణమీఱె.

తే॥ మాయియగు నింద్రజిత్తు వ్యో • మమున డాఁగి, నాగపాశంబుచేత సై • న్యములతోడ
లక్ష్మణుని కట్టివైచె జా • లంబుచేసి, బద్ధులైనారు వీరు చా • వంగరేదు

తే॥ పెనచికొనియున్న పాశంబు • వీడునేని, వీరు లేవఁగలరు స్వల్ప • విశిఖములకు
జీవముల వీడువారె? రా • జీవనేత్ర! పాపములు ధర్మమును గెలు • వంగఁగలవె?

తే॥ అనుచు రాముఁడీ పాశంబు • వరుదుగాఁగ, నెవ్వఁడిచ్చె దీనికిఁ బ్రతి • కృతియుఁ గలదె?
తెలిసినంత తెల్పుమ యనఁ • బలుకు నా వి, భీషణుండు సద్గుణ గణ • భూషణుండు

తే॥ బ్రహ్మయాగ ఫలంబుగాఁ • బడసె దీని, శంకరుఁడు కోరి జగమున • జయమునొందె
భవునిగూర్చి చేసిన తపః • ఫలముగాఁగ, నతఁడె వీనికి నొసఁగె నె • య్యంబుకతవ.

తే॥ దీనిచేఁ దొల్లి యింద్రు బం • ధించివైచె, దీనిచేతనే మన హను • మానుఁగట్టె
నిర్జరుల స్వర్గపాలన • సీఁగినదియు, దీనివలనన సుమ్మి వై • దేహినాథ!

తే॥ పట్టినట్టి వారల ప్రాణ • వాయువులను, పీల్చికొనికాక యూరక • వీడిపోదు
అజ హరాదులకును త్రోవ • నలవికాదు, తక్కువారల సంగతి • తలఁపనేల?

మ॥ అన నైరాశ్యముచెంది రాఘవుఁడు రో • షాక్రాంత చేతస్కుఁడై
కని యీ పాశము నిచ్చి నాతని శిరః • ఖండంబు గావింతునా?
మును లోకంబులఁ గాల్చి బూది జలధిం • బూడ్పింతునా? లంక నీ
వనధిన్ ముంతునా? యేమిచేసినను పా • పంబింత చేకూరునే?

చ॥ వరముల నిచ్చి యీభుజగ • పాశము నిచ్చిన వారె వచ్చి సం
బరమునఁ గాతురేని తగు • మన్ననఁ గాంతురు కావరేని శం
కరుఁడు పురంబు లేర్చిన తొ • గం ద్రిజగంబు లొనర్తు బూదిగాఁ
బురహరుఁ డగ్గమైన సుర • పూజ్యుఁడు ధాతయు నడ్డు నిల్చినన్.

శా॥ నా తమ్ముండె మృతిం భజించిన భువిన్ • మన్నింప నాకేది? వి
ఖ్యాతిం గూర్చునదేది? నిందయని ప • ల్కుందగ్గదేదీ? జగ
త్పూతంబై తగు ధర్మ మేది? కన మ • ర్త్యుల్ దివ్యులున్ నాయెడన్
భ్రాంతిం జేరి భజింపుచున్న ప్లవగ • వ్రాతంబుతో సాటియే?

మ॥ అని రోషాకులితాత్ముఁడై పలికి మా • యన్నిచుఁ దొక్కుఁడు చిం
తను కల్గింపఁగ నాగ్రహించి జగముల్ • నాశంబు గావించుటల్
మను వంశేంద్రులకున్ హితంబె యని సం • భావించి నిట్టూర్చు ముం
దున మాయిన్ పెను గోయి యయ్యె ననుచుం • దూపిల్లు సందేహిలున్.

తే॥ రెండు తుండంబు లున్నవే • దండ మొందు, తోత్రమునకు భయంబంది • తూలి తలరు
సరణి రాముఁడు ధర్మపా • శమ్ముఁదడవి, నన్నుఁ జంపదో యిదియని • విన్ననొందె.

## గరుడుఁడు రాఁగా నాగపాశము వీడుట

తే॥ ఈస్థితి యిఁకెట్టి పరిణతి • నెనయునొక్కొ, యని వియచ్చరుల్ చింతించు • నవసరమునందు
ప్రక్కనే యున్న గరుడుండు • భ్రాంతివలనఁ, గరఁగి చీఁకటిలో నటఁ • గానవచ్చె.

సీ॥ కలఁగని హృదయంబు • కలఁగుటచేఁ జింత, తగని డెందంబున • నొగులువాఁడు
లంకేశు గాంచిన • లరి జగంబులఁ గాంచు, వడువున కారాట • పడెడువాఁడు
పక్ష మారుత వేగ • బలమున దిగ్దంతి, నేత్రముల్ మూయంగ • నెగడువాఁడు
తన మేనికాంతి భూ • తల వియత్తలములఁ, బట్ట పగలు చేయ • వఱలువాఁడు

తే॥ దూరదర్శిచక్షువులతోఁ • దోయజాక్ష, మేనుగాంచియుత్సాహంబు • మీఱువాఁడు
కదలి తరఁగలు చెదరఁ జేఁ • కటులు బెదర, వచ్చువాఁడు నభశ్చరుల్ • మెచ్చువాఁడు.

సీ॥ పాపజాతి కలంగఁ • బాఁపజాతి వలంగ, దర్శన స్పర్శనో • ద్ధతి గలాఁడు
అరులు గిరులఁ దూఱ • విరులు దరులఁ జేర, బలుపు చెలువు మేనఁ • గలుగువాఁడు
అలరు ఉత్తుక మేను • వెలరు కుత్తుక జాను, గలుగు వెలుఁగుతోడఁ • జెలఁగువాఁడు
గుణ భూషణముల భా • షణ భూషణముల స, న్మణి భూషణమ్ముల • మలయువాఁడు

తే॥ ఒడలివలన వెన్నెల లెండ • లొలయుచుండఁ, గనకగిరిమీఁది భానుని • కరణి నొప్పి
శీర్షమున రత్నమకుటమ్ము • చెన్నుగులుక, పైన కేయుండు జానకీ • జాని దాపె

సీ॥ కాల మేఘములీలఁ • గ్రాలు మేనినిగాంచి, చిరము నమస్కృతుల్ • సేయకుంట
ధ్వజముపై నుండి స • ర్వ జగంబు లనువొందఁ, గావించు వినుతులు • గానకుంట
వాహనమై లోక • వంద్యత్వము చిరమ్ము, మఱచిపోవఁగఁజాలి • మలయుచుంట
తల్లిని పాసిన • పిల్లకై వడిఁ జాల, కాలంబు ప్రభుఁబాసి • క్రాఁగుచుంట

తే॥ తలఁచి తలఁచి మెత్తనగ జి • త్తంబుకరఁగ, లోక మూలకారణ రమా • లోల! వరద!
బ్రహ్మరుద్రాది దేవతా • వంద్యనామ! రామ! చింత యేలనుచుఁజే • రంగవచ్చె

తే. మాయ జగమిది సర్వంబు • మాయ నీవు, మాయకాఁడవు నీదగు • మాయ నెఱుఁగ
నెవరు వలఁతు లీమాయ ని • న్నేమి సేయు? విశ్వజనక! విశ్వేశ్వర! విశ్వసాక్షి!

సీ॥ ఆద్యమై కాంచి మ • ధ్యమ్మయి పోషించి, యంత్యమై పరిమార్తు • వరయ జగము
లన్నిట నుండు వి • ష్ణాపి యొనర్తువు, నరుఁడవై యొరులచే • వరముగొందు
నీసములగఁ గమ • లాసన రుద్రులఁ, జేసి వారలతోడఁ • జెలఁగుచుందు
తలఁపున సృష్టింతు • తలఁపున విలయంబు, నెనఁగింతు నీవు ల • యింపకుందు

తే॥ నిట్టి పద్ధతి యిసుమంత • యెఱుఁగఁగోర, సంధులంజేసి చీఁకటి • యందు నిలుతు
వహహ! జాణతనంబొ? పి • న్నాటయేమొ? యరసి పలుకంగ నేరికి • నైతిగాదు.

సీ॥ జీవిత మొసఁగుదు • చెదక నైజస్థితి భావియం దంపవు • వాంఛగొనవు
దొరకనిత్తువు కొన్ని • దొరకనీయవు కొన్ని, దొరకిన యవికూడ • నోఁతు కొన్ని
పసిబిడ్డ నేర్పించి • పండిచ్చు కరణి దుఃఖింపఁజేయుదువు సు • ఖింప నిత్తు
వాహారమగుదువు • ప్రాణంబు నగుదు దో, బూచులాడుచునుందు • తోఁచకుందు

తే॥ కానఁబడుహంరూపుఁడనుచునే • కంబయనుచు, నందరానివాఁడంచుమా • యావియంచు
జ్యోతియంచు నానందమ • యుండవంచు, శ్రుతులు బహువిధంబులుగ వా • క్రుచ్చుచుండు.

సీ॥ ఆస్తికు లౌనన • నాస్తికుల్ లేదన, నెనఁగు నేర్పులకు దా • వి త్తువేల?
బహుళశంకలకుఁ దా • వలమిత్తు వదియేల? మాయలతోడనే • మలయుటేల?

పలువిధ మతములు • ప్రబలనిచ్చుట యేల? జనులు తన్నెఱలాఁడఁ • గనుటయేల?
పాపంబులను తొల్తఁ • బండవిచ్చుట యేల? మొలకలో గిల్లుట • తెలియవేల?

ఆ॥ మొలవ నిచ్చు టేల? • మొదుర నిలుపుటేల? క్రమముఁబొంది చదువుఁ • జదువనేల?
తెలిసి తెలియకుండు • నొంచాటు బ్రదుకేల? స్పష్టపఱుపకట్లు • చంపుటేల?

సీ॥ మఱచిన తెలఁగేలఁ • మఱవని వెరపేల? యెఱుగకుండుటయేల, • యెఱుఁగుటేల?
వదలియుండుటయేల? ఏదలకుండుటయేల? • యంటియుండుటయేల? యంటమేల.
ఒక్కరూపంబేల? పెక్కురూపములేల? తినుటేల తిండికై • తిరుగుటేల?
పుట్టించు టదియేల? పొలియించు టదియేల? నడుమఁ జిక్కులు పెట్టి • నలఁచుటేల?

తే॥ దేహమును పొందుటేల? యీ • త్రిప్పుటేల? ధర్మ సంస్థాపనమునకో? ధరణి జనుల
కెల్ల నాదర్శనమునకో? యేమితెలియు? నీదుమాయలు కల్లలో, నిక్కువములొ?

సీ॥ కర్మఫలంబుల • కై జన్మ మొనఁగెదు. కర్మల సంటక • కదలువారి
కానంద మొసఁగి ల • య్యానసంబుల నుందు. మునులకు మొదలి ము • మ్మూర్తులకును
జ్ఞానులౌ వారిక • జ్ఞానులౌ వారికి, నెల్ల వారికిఁదెల్ల • మెఱుఁగఁబడవు
పెనఁగిసవారు చ • చ్చినవారు తివి దుఃఖ, మొందువారలయందు • నుందువనట

తే॥ యిప్పు డిచ్చట నీయొద్ద • నెఱుఁగనయ్యె. వెదఁగు వెదఁగు వివేకి వి • వేకమీవు
నీది స్థిరగుణం బెయ్యదో? • నిశ్చయముగ, నెఱిఁగి కొఱలేక యెఱిఁగింప • నెవరి తరము?

తే॥ కార్తికేయకిందము నొల్వఁ • గదఁగునంత, లోన నేమియు లేకుండు • జానుదోఁప
నీ వవతరించియును నిజ • మెఱుఁగనీవు, నీదు మాయలఁ దెలియంగ • నేరమయ్య!

తే॥ అని నుతించుచు నగుచుండు • తనువుదీప్తిఁ. దమముఁ దొలుచురాఁగాంచి • దాశరథియు
వింతవాఁడెవఁడని చూచు • నంతలోన, వచ్చి చెంగట నిలిచె స • ప్పక్షి తొలఁక.

* చ॥ నిలిచినయంత నాగములు • షేమ్మనిగా ధనిమున్ గుణంబు ని
ర్మల యశమున్ గలట్టి విభు • మన్ననఁ జెందిన వారి యంగదల్
తొలఁగిన చందమై కిలుప • తూఁటికి సన్నని దారమంతయుం
దెలియఁగరాక మాయమయి • తీఱె జగంబులు సంచిసిల్లఁగన్

క॥ ఎఱికల కరువలిచేఁ దమి, పఱగుటయేగాక మేనఁ • బ్రబ్బిన యలుఁగుల్
తొఁగెను దద్దులతోడను, నెఱి చెలివరి కంటఁగట్టు • నింపయుఁ బోలెన్

తే॥ క్రూరంయ్మ లధర్మ లిం • ద్రాదులందు, మందునకు నొక్కఁడే నును • బొందలేదు
క్రొత్తస్పష్టిలో జీవుల • కొమరుదాల్చి, వానటులు లెచి యుత్సాహ • వంతులైరి

* ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగములు తిరువెన్ళ్తెయ్ నెల్లూరున నుదారుండగు జటప్ప తమ్మని శరరాముని గాంచిన యాచకులయు బందులయు ఆఁకలివలె తొలఁగినవి. అనిమూలము.

ఉ॥ వీతివిదుండు రాఘవుఁడు • నెమ్మది లేచి నమస్కరించు వి
ఖ్యాత చరిత్రు లక్ష్మణుని • గాఢముగాఁగఁ బరిష్వజించి యి
ట్లీతఱి బాముగూర్చు విధి • యే తొలఁగించె నటంచు వానర
వ్రాతముఁ బ్రాణముం బలెఁ గ • రంబున దువ్వుచుఁ బల్కెఁ దార్క్ష్యతో.

మ॥ స్థిర దోషాకరు లీల నొప్పు నభ రా • జింబొల్చు పుణ్యాత్మ! దు
ర్భర దుఃఖాంబుధినుండి కేల్చితి తపః • ప్రాప్తోత్థ పుణ్యంబు నాఁ
గరుణామూర్తివి నీకుఁ బ్రత్యుపకృతిం • గావింప నేముందుమే? స
త్పురుషుల్ ప్రత్యుపకారముం గొనఁగ సం • తోషింతురే యెయ్యెడన్?

శా॥ ఏమిం దోఁపక వేఁగుచున్న యిటకీ • వే తెంచి మా ప్రాణముల్
ప్రేమన్ వెండి యొసంగి కాచుటలతో • విజ్ఞోపచారోక్తులి
ట్లామోదంబుగఁ బల్కుచుంటివి మహా • త్మా! దీవికిన్ సాటిగా
మేమేకానుక లీయఁగాఁగలము? మా • మేరల్ మహాల్పంబులౌ.

శా॥ సందేహించుచునున్న ప్రాణముల ని • చ్చంగూర్చు పూజ్యాశయా!
ముందెన్నండును చూడలేదు చెలిమిం • బొల్పార దొక్కండు మా
యందుంగై కొనలేదు నీకుఁ గొఱయే • యందంబునన్ లేదు మా
చందంబారసి తెల్పు చేయఁదగు క • ర్జం బెద్దియే నున్నచో

మ॥ అను శ్రీరాముని ప్రేమపూర్ణ విమల • వ్యాహార మాలించి య
వ్వినతాపుత్త్రుఁడు కేలుమోడ్చి యనఘా! విద్విద్వధానంతరం
బున వత్తున్ మన ప్రాఁత చుట్టఱికమున్ • మోదంబుతోఁ బూర్తిగా
విన వాక్రుచ్చెద వీడుకోలె యనుచున్ • విచ్చేయుదుం గాంచుచున్.

చ॥ పిలుపక వచ్చి జీవములఁ • బ్రీతి నొసంగె నుదారుఁ డీతఁ డే
వలనను మాఱు మేలు మన • పాల గ్రహింపఁడు లోకమందు పు
ణ్యులు తమయంత వచ్చి జని • నొవ్వులఁ దీర్తురు గొప్పలాభముం
దలఁచియొ వారిదంబు జన • తా మన తాపము పావుచుండుటల్?

చ॥ అని రఘురాముఁ డాడఁగ మ • హాబల సూనుఁడు దేవ! లక్ష్మణుం
డని మరణించె నంచు విధి • లాధిప నందన కుందు నొందుఁగా
వున విజయోద్ధతి న్నిదురఁ • బొందిన రక్కసిమూఁక భీతిలన్
గొనకొని సింహనాదము న • కుంఠిత రీతి నొనర్తమా యనన్.

మ॥ ధరణీజాపతి మంచిదే యనఁగ స • ప్తద్వీపముల్ సప్త సా
గరముల్ సప్త కులాచలంబులు కలం • గన్ సప్త మేఘంబులున్
బరపై తాళల రాల్ప దిక్కులగలన్ • బ్రహ్మాండ భాండంబు సం
దఱగా వానరవీర సంతతి మహా • ధ్వానంబు గావింపఁగన్

మ॥ అతిలంకాద్రి ధరాత్మజాతి మదిలో • నారాటముం గూర్చఁ ద్ర్యం
బరు పక్షంబునఁ గాఁడు మాయశరముల్ • వక్షంబుఁ దొల్వంగ స
జ్జరి నెట్టం బొరలాడు పంక్తిముఖుఁ డా • శబ్దంబు నాలించి యిం
చుక యోచించి నిజస్థితిం దెలియఁగాఁ • జూచెన్ విలోలాక్షుఁడై.

మ॥ జనరాజన్ బడలూని ధర్మమును సం • స్థాపించి దుష్పాప వ
ర్తనులం గూల్పఁగఁ గంకణంబు గొను శ్రీ • రామున్ మనంబందు చిం
తన గావించుచు నున్న సీతయును సీ • తాదేవిపైఁ బ్రేమ ని
ల్పిన మాధుండును తక్క నిద్రించి రీ • విం గాన మాలంకలో

మ॥ ఆ శబ్దంబును విన్న రావణుఁడు కో • పావిష్టుఁడై లేచి యా
కీశవ్రాతము లక్ష్మణుండు నవిలోఁ • గీడొంది రన్నట్టి సం
దేహం బెంతటి సత్యమో యనకులా • ధీశాన శింజాన మా
కాశం బంటెను వాన రావళుల పె • న్గర్జా వినాదంబుతో.

తే॥ రామ కోదండ మొసఁగె వి • స్ఫారరవము, లక్ష్మణుఁ ధను వందగో • శముఁ బగిల్చె
హనుమ గర్జ ప్రళయభేరి • యగలఁజేసెఁ, దరణిసుతు గర్జనంబు రో • దసిని నించె.

తే॥ అంగదుం దార్చుచుండె నీ • లాది కేశు, లుత్సుకత్వంబుచేఁ జేయు • నుగ్రరవము
బ్రహ్మగోళంబులోన వె • ల్వలను నిండెఁ, బాళమున నుండి వారు వీ • ద్వడిరివిజము

క॥ అనిలేచి పంక్తి కంఠుఁడు, చనియెను వడి నింద్రజిత్తు • సదనంబునకున్
మునువెనుకల ఖడ్గులు దీ. ప నికరములు వట్టి దనుజ • వనితలు నడవన్.

తే॥ చేలములు జాఱుచుండఁగఁ • గేలఁబట్టి, నెఱి కురులు వ్రేల మత్తెక్కి • నిద్రకనులు
వ్రాలఁ దడఁబడు నడకలతో • వచ్చినారు, మధ్యమధ్యఁ దూఁగుమెఁ దటి • న్మధ్యలపుడు.

తే॥ మద్యపానంబు చూపక్క • మధ్యఁ గలలు, కినుల బరువును తోఁచితోఁ • పలివిధమ్ము
పాట లందెల కొలఁది శ • బ్దమ్ముగలుగఁ, దడఁబడుచు నడచిరి దేవ • తరుణులపుడు.

తే॥ మొగులుసకునల్పుగల్పించి • పొగలునించి, పూలతుఱిమినట్లుండు కొ • ప్పులును నీల
నయనములును కెంపెవవులు • నొరు గలుగు, పడఁతు లూఁగుచుఁ దూఁగుచుఁ • బడుచుఁ జనిరి

సీ॥ మధురసాలామృత • మాధుర్యములఁ జేర్చి, కలుకుల పలుకులు • గాఁ గదించి
హరిణ నేత్రావృద్ధిబలు • లందలి సౌందర్య, ములఁ దీసి సోగ క • న్నుల సమర్చి
తక్క సుందర వస్తు • తతినుండి కొన్నట్టి, మురువున నవయవ • ములు సృజించి
చిత్రసృష్టిగ బ్రహ్మ • చేసిన చెలువలు, దశముఖు నిరుదెస • దవిలి రాఁగఁ

తే॥ ప్లవగ భీకర రవములు • చెవులఁ బడుచుఁ, బిడుగు రొద విన్న భుజగుల • వడువుగాఁగఁ
సింహ గర్జనమును విని • చిదగొదవడుఁ, వారణంబుల చందము దైత్య • వరులు పొంద

తే॥ త్వరగఁ జని పెద్దకొడుకు పా • ర్శ్వంబు చేరి, గాయములనుండి పీచూరఁ • గ్లమము నెంది
సింహఘాతంబుచేఁ జేవ • చెడిన గజము, చెలువునను బెగ్గిలెడి యింద్ర • జితునిగాంచె.

ఉ॥ లేచి నమస్కరించు దిట • లేక కరంబులు శక్తిహీనతం
దోఁచు విధంబునన్ వినతి • తో మెలమెల్లన మ్రొక్కు పుత్రకున్
జూచి యిదేమి చాల శ్రమ • నుక్కితి? వేమి ఘటిల్లెఁ? జెప్పుమా
దాఁచక యంచుఁ బల్కుబు లె • దంగొని వేఁడఁ గుమారుఁ డిట్లనున్.

చ॥ కవచము పట్టు వీడినది • గాటపు తొమ్మనఁ జెప్పరాని లా
ఘవమున దూసిపోయినవి • కాండచయమ్ములు చేరమీటి దా
నవకుల చంద్రః మిక్కిలిగ • నల్లయు వెల్వడె మేనుసోలె మా
య వలన లక్ష్మణుండు మృతి • నందకయుండిన నేమియౌదునో?

చ॥ హరిహయుఁడున్ హరుండు హరి • యర్కుఁడు మున్నగువారు సేయు సం
గరముల నింతగా నలయి • కం గొనలే దిపు డాడునట్టి దీ
న రవము మున్నొకప్పుడుఁ గ • నంబడ దమ్మనుజేంద్రు బల్మి య
జ్జరే! వివరించి తెల్పనొక • చాపముతోడిది గాదు నాయనా!

చ॥ అనుజుని శక్తి యిట్టి దగు • నగ్రజు శక్తి తలంచి చూడఁగా
మనకది తెల్పఁగా వలఁతి • మాత్రము గాదు వయిన్ మతేమిగాఁ
జనునొ వచింపఁగాఁ దలఁపు • చాలదు చూచెదుగాక గెల్పమే
మనకగు నంచు నిక్కటలు • మా పొరపాటగు మాను నాయనా!

ఉ॥ వానరవీరులం దనిమి • వారక లక్ష్మణుఁ గూల్చి గెల్పమున్
నేను గడించుటల్ వినుము • నిక్కము మాయను నాగపాశముం
బూనుటచేతనే, యిఁకను • భూమిజభర్త యొకండ విల్చెఁ బైఁ
గా నగు కార్యమెల్ల జరు • గందగు నంచు వచించు నంతటన్.

ఉ॥ రావణుఁ డిట్లనున్ గుణ వి • రావము లక్ష్మణు వింటినుండి పై
తావులు బ్రద్దలౌ నటులు • తార్కొనె వానర సింహనాదముల్
మేవుకొనెం దివంబు రణ • మేదినిఁ బుట్టిన గొప్ప ఘోషముల్
నీవు వినంగలేదొ యన • నివ్వెఱఁగొంది కుమారుఁ డిట్లనున్.

ఉ॥ వారలు నాగపాశమున • బంధితులైరి మొగంబులందు తే
జో రమ దిందెఁ బావక య • సుప్రజ మోఁదుట సత్యమౌ కొకో?
యేరికి దానిఁ దప్పికొన • నిమ్మగుఁ? దప్పిన దైవశక్తికిం
దూఱు ఘటిల్లదే? యనుచుఁ • దూఱి తలంచుచు నుండు నంతటన్.

ఆ॥ వేగు లరుగుదెంచి • విభునకు మ్రొక్కంగ, నాతఁ డాత్రపడుచు • నడుగునంత
వారలిట్టు లర్థ • వంతమౌ వాక్కులఁ, బలికి రధిక నయము • భయము గదుర.

ఉ॥ పాశ విబద్ధులై శర వి • పాటిత దేహులునై రణంబునం
గీశులుఁ దమ్ముఁ దుండఁ బరి • కించి యలంగి తపించి యేడ్చి పీ
తేశుఁడు మిక్కిలిం గినిసి • యిత్తఱి లోకములెల్ల నొక్కటన్
నాశ మొనర్తునంచు జత • నం బొనరించుచు నుండుసంతటన్.

చ॥ గరుడుఁడువచ్చె వాని యెస • కంబగు రాకను గాంచి నాగముల్
తురతురఁ గట్లువీడి చిఱు • తున్కలుగా నశియించె వారి ము
ష్మరమగు మేనిగాయములు • మాసెను మున్పటికంటెఁ దేటయున్
దిరము బలంబు గల్గి యటు • లేఁకువ నార్చిరి వార లయ్యెడన్.

ఉ॥ నాపుడు రావణుం దనియె • నాదు కుమారుని నాగపాశ మీ
రేవను వైనతేయుఁడు ష • టిల్లఁగ నాశిలెనేమి? వానికిం
గావర మింతగల్గెనె? వి • కావిక లయ్యెను నా ప్రయత్నముల్
నా విధులిట్టులై వెలుఁగ • నా గరువంబును మంటఁ గల్పనే?

సీ॥ పదునాల్గు లోకంబు • లుదరంబున నడంచి, పీడుచుండు ననెడి • వెడ్డుకీర్తి
పడసిన వెన్నుండు • బవరంబు నాతోడ, నొనరించు నాఁడు భీ • తిని వహించి
జగములన్నియుఁ బెక్కు • సార్లు చుట్టిననాఁడు, డాఁగురించి కదలి • డాఁగునాఁడు
అల్ల వైకుంఠంబు • కొల్లవెట్టిననాఁడు, నాశరమ్ము లురమ్ము • నాటునాఁడు
తే॥ జరియలును పీఁపు బాహువుల్ • నెటఁకులంటఁ, గ్రుచ్చి తఱిమిననాఁడు నీ • గ్రుడ్డిగరుడి
చూడదో? శక్తిలేదో? పి • చ్చుకలమీఁది, కేగెనో! నాఁటి కిడిమి నేఁ • డెఱుఁగదేమొ?

తే॥ కాఁగలది కాకమానదు • కడచి బ్రమకు. వారి నెట్లయినం జంప • వలయుఁగాదె?
యీవ తగుదు చేయుము తార్క్ష్యుఁ • డీల నొంద, ననుడు మేఘనాదుఁడు తండ్రి • కనియె నిట్లు

తే॥ నేఁడు మాత్రము శ్రమనీఁగ • నిలిచి యెల్లి, వెడలి బ్రహ్మాస్త్రమున మనో • వేదనంబు
నీకుఁ దొలఁగింతు ననిపల్కి • నిర్జరారి, మంచిదని చేరెఁ దన తల్ప • మందిరంబు.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ రా మ.

# కం బ రా మా య ణ ము

## యు ద్ధ కాం డ ము :: ఉ త్త ర భా గ ము

### 19. సేనానాయక వధ పటలము. (102)

తే॥ మిన్నులము పెదబొబ్బలు • విన్న దైత్యు, లదరి శంఖ భేర్యాది వా • ద్యములు చెలఁగ
సమర కౌతూహలంబు డెం • దములఁ బొదమ, నసురవిభుఁ జేరి యానతి • యడుగునంత.

తే॥ బవరమున కీవునమ్మహా • పార్శ్వుతోడఁ, బొమ్మధూమ్రాక్షయను దశ • ముఖుని గాంచి
విన సహింపక దూతలు • వీరుచేయు, చేఁత లించుక వినుఁడని • చెప్పిరిట్లు.

చ॥ రథములు వోవ వారణ తు • రంగములెల్ల నశింప రాక్షసుల్
క్రుధగొని వోరునేసి యనిఁ • గూలఁగ నింద్రజి యొంటి నిల్చచో
వ్యధగొని లక్ష్మణాస్త్రములు • వచ్చెనదో యిదో యంచుఁ గొంకుచున్
బధము దొలంగి వావిడిచి • పాఱినవారలుధీరులే యనన్.

తే॥ క్రూరకర్మంబులను జంకు • గొంకు లేక, చేసి యలవాటు పడినట్టి • చేయిగాన
దశముఖుం డదివిని ఘోర • దానవహ్న, కరణి మండుచు వారలఁ • గట్టఁబనిచి.

### రావణుం డింద్రజితుని చక్రరక్షకుల ముక్కులుగోయ నాజ్ఞాపించుట

తే॥ వీరి సేవ యిట్టిది యంచు • నూరివార, లెఱుఁగ నాసికగోసి యూ • రెల్లఁ ద్రిప్పి
విఱువుఁ డంతియచాలును • వేఱవలదు, పొందనఁగఁ గింకరులు కోయఁ • బూనసంత.

ఆ॥ వలదు వలదటంచు • వారల కడ్డంబు, వచ్చి యాఁపి పంక్తి • వదనుఁ గాంచి
యేమి సేయఁ దలఁచి • తిది ధర్మమే? యంచు, మాల్యవంతుఁ డనియె • మఱియునిట్లు.

చ॥ గెలిచినవార లోడుటయు • గెల్వనివారలు వెండి గెల్చుటల్
తలఁపఁగ నైజమై పొసఁగు • ధారుణియందు మనంటిమిన్ సదా
చలనములేక నిల్పుకొనఁ • గాలినవాఁ డొకరుండు కల్గనే?
వలపులఁ గూర్చుచుండు జయ • పంకజగేహిని దాంతచిత్త యే?

తే॥ పరబలం బించుకేనియు • నరయవలదె?, తొల్లి నిర్జరసేనలు • వెల్లివిరిసి
వచ్చి యొడవె? యంతతో • వాసవుండు, జతనమును మానుకొనియెనే • జగమునందు?

చ॥ పరుఁడుఁడు కంపితాంగుఁడయి • పార్థివ వీరుని చేరవచ్చి తా
శరణమునొంది దీపముల • జానుగ నిల్చికొనంగఁజాలె నీ
పురుషులు చూడ లెక్కకును • వీల్పఁగఁజాలినవారె? ఘోర సం
గరమున వారితో నెదురఁ • గా వశమే? యిది నీవెఱుంగవే.

క॥ పొలిసె నలువది వెల్లువల్ • కలనియందు. వీరు ముప్పురే ప్రాణమ్ము • లార నిలుపు
కొన్న వారు గావున వీరి • కన్న నెవరు. ప్రథన చాతుర్యమును బయ • ల్పఱచినారు?

చ॥ చెడియెను నాగపాశమును • చేడ్పడి యర్ధమకంబె హెచ్చుగా
మడిసె బలంబు నీవు నని • మానవనాథుల నేర్పు పెంపు ను
గ్గడువుగఁ గాంచివచ్చితివి • గాదె కుమారునితోడ నుండమిన్
బెడుగుగ నెంచి ముక్కలను • చెక్కెదె? యియ్యది యుక్తకార్యమే?

తే॥ లక్ష్మణుని పేరుసెప్ప నీ • లంకలోని, జనులు తమతలపుల మూసి • కొనెడివారు
ఎవరినాసిక గోసెదో • యెంచిచూడు. జగము కలదాఁకఁ గోసిన • సమయునేమి?

తే॥ దూతయై వచ్చినట్టి వా • యూలసుతుని. ధాతకోడి మ్రొక్కినవారు • నోఁకులందు
పెక్కురున్నారు వారలు • ముక్కలొంది. యున్న వారలు కోయక • యుంటివేల?

ఉ॥ సీతను వీడమిం గలుగు • చిక్కులచే మనవీరు లెందఱో
యీతల శత్రురాజి వధి • యింపఁ బ్రతిజ్ఞలు చేసిపోయి రా
రీతిగఁ జేసివచ్చు నొక • రిం గనమింతకు రామలక్ష్మణుల్
సీతలఁ బ్రొక్కి విల్చి రిఁక • నెవ్వడి నెల్లర ముక్కలూడ్చెదే?

చ॥ అనవిని వారు దెందముల • నంటిక యించుక మాని కేలు మో
డ్పును గడియించి దైత్యకుల • ముఖ్యుని గాంచి క్షమింపుదేవ! మా
మనమిఁ నెందు రోసినను • మాయలు మోసము లేదు సంగరం
బున ఘటియించు దుస్థితులఁ • బూర్తిగఁ దెల్పెద మాలకింపుమా.

మ॥ విరథుండై శివయుందు శక్రజితుఁడే • విస్ఫూర్తి కేతెంచి శం
బర మాయల్ పచరించి ప్రాణములతో • బైల్పడ్డవాఁడయ్యె మా
తిరముల్ సెప్పఁగనేల? దేవ! యిఁక ధా • త్రీనాథ శీర్షంబులన్
జరణాబ్జంబులచెంత నుంచెదము ని • చ్చల్ నీవు మోదింపఁగన్.

ఉ॥ పంపుము పంపి కేని యన • పద్య రణంబున నేఁట రేపటన్
చంపిసి యుంచొ చంపఁబడి • చచ్చిర యంచునొ వినుగాని వం
శంపు గురుత్వమే చెడఁగ • జాతిరి రాతిరి పారిరంచు నీ
చంపు వచస్సులన్ వినఁగఁ • జాలవు మన్ననవేసి పంపవే.

చ॥ అని శపథంబు సేయఁటయ • నాయుధపాణుల బంతి వెల్వలన్
దనుజ వరేణ్యుఁ డంపె రథ • దంతి తురంగిము లన్నితోడుగా

సమువుచు యజ్ఞశాత్రవున • హర్పతి శత్రుని మాల్యవంతుతో
ఘనుఁడగు వజ్రదంష్ట్రుని వి • కాయముఁ గాయఁగఁ బంపు నంతటన్.

ఆ॥ నింగి మ్రింగె ధూళి • నిర్జరేంద్రులు కనుల్, గప్పు సేన మేర • గాంచలేక
కనులు మూసికొనిరి • కరముల నెవరికి, నైతిగాక యుండె • నరసి తెలుప

తే॥ కాళ్లు గలిగిన కొండల • కరటినొప్పి, హస్తిమటలపైఁ దెక్కెంబు • లలల వీవఁ
గైదువులు జలచరముల • గతిఁ జలింప, నేమి రవముతో సేన వా . ర్నిధిని బోలె.

క॥ శరనిధికై వడి భేరులు, మొరసెను కిరు లిరులతో న • ముగ్రముతో మ
చ్ఛరికముగొని గీపెట్టెను, హరులును సకిలించె మిత్తి • యరచినభంగిన్.

క॥ నగగంధ్రు నడచు జడుమున, నడవక సిడి లెక్కఁగొనక . నాగంబులు పై
జడదముల జలముఁ జిల్చుచు, నడుగిడక యె నిలుచు నడచు • నామిక తోడన్.

తే॥ కైదువులకాంతి భూష ణ • కాంతితోడఁ, దురగ వారణ స్యందన • స్తోమములకుఁ
గల యలంకార కాంతితోఁ • గలిసి పరవి, దనదిశల నున్న యిరులను • తఱిమి చంపె.

తే॥ వచ్చు సేననుగని ధరా • వరుఁడు కినిసి, దనుజవమువులో వచ్చెదు • ఘనుఁడు శక్ర
జితుఁడొ కాఁడొ తెల్పుమ యన • శిష్టగుణ వి, భూషణుఁడు విభీషణుఁడు రా • మునకు నని

మ॥ గుహలోనుండి జ్వలాగ్ని రేఁప వెలువన్ • ఘోషించుచున్ దుష్ప్రయా
వహ రోషంబున విప్పులం గురియుచున్ • బాలేందు రేఖా సమో
న్మహ దంష్ట్రా పమలొప్పఁ దూరములు క్ర • న్నందాల్చి కై వింటితో
బహుళాభీలత వచ్చునతఁడు మహా , పార్శ్వుండు రాజోత్తమా !

క॥ జ్వాలాభీలములగు క్రూ రాఁస నేత్రాలతోడ . నలరారుచుఁ జె
న్నాలుక నార్చుచు వడి వా, తూఁగతిన్ వచ్చువాఁడు • ధూమ్రాక్షుఁడగున్.

ఆ॥ వదరుబోతు ఖూల • పాటి యూటల నీది, యా యటంచు డాయ • నరుగువాఁడు
కాళులొప్పు కొండ కరటి వచ్చెదువాఁడు, వజ్రదంష్ట్రుఁ డనఁగఁ • బరఁగువాఁడు.

క॥ పెదవులఁ గొఱికెడు నాతఁడు, నెది గాలిని గెలుచు తురగ • మెక్కినవాఁడు
న్మదుఁడు రణవయవ రూపుఁడు, సదసద్జ్ఞ విహీనుఁడగు పి • శాచుఁడు రాజా !

ఆ॥ వనధికంటె రవము • వహ్నికంటెను వేఁడి, గలుగువాఁడు రసము • గలుగువాఁడు
సూర్యశత్రు వనఁగ • శోభిల్లువాఁడు త, త్ప్రాంతగతుఁడు యజ్ఞ • వైరి యధిప !

ఉ॥ ఎఱ్ఱని శాలి సస్యముల • యెన్నులఁబోలు తురంగ సంఘముల్
బిఱ్ఱుగఁ గట్టువాఁడు రణ • భీకర కర్ముఁడు నెట్టి కార్యముల్
వఱ్ఱుగఁ జేయఁగాఁ దగు వి • విః ఫలయుక్తుఁడు దూరదర్శియున్
గొఱ్ఱున కూలినెత్తెడి య • కుంఠిత సత్త్వుఁడు మాల్యవంతుఁడౌ.

తే॥ హనుమ యెదిరించె ధూమ్రాక్షు • నంగదుండు, మాఱుకొనియె మహాపార్శ్వు • మాల్యవంతుఁ
జెనకె నీలుండు పనసుండు • మొనసితాఁకె, మాయయగు పిశాచుని రణ • క్ష్మాతలమున

తే॥ సూర్యశత్రుని మార్కొనె • సూర్యసుతుఁడు యజ్ఞశత్రుఁ డీడాడె రా • మానుజన్ము
వీరుఁడగు వజ్రదంష్ట్రుండు • బారిసమరు, చన్న ఋషభుని ఢీకొనె • నుత్సహించి.

ఆ॥ దనుజ నాయకులును • వనచర నాయకుల్, కదనమందు దాఁకి • కసిమసంగి
యొకరి నొకరు గెలువ • నుత్సహించుచుఁ బోరి, రుగ్రగతుల వేల్పు • లుపరి బెదర.

ఆ॥ అట్లు పోరుచున్న • యయ్యెడఁబడిలోన, నాఱువెల్లువలను • హరిచయంబు
నడఁచె మిగిలినట్టి • నాలుగు వెల్వల, వెదకి లక్ష్మణుండు • వేఁటలాడె

తే॥ కలిసినట్టి చందంబునఁ • యుదధి, రక్తజలధిమే యిదియను • రాణనొప్పె
ముత్తెములు గురిగింజల • పొలుపుదాల్చె, మత్స్యములు పగడంబుల • మాడ్కినలరె.

తే॥ జలధియెల్లను రక్తమై • వెలుఁగుచుండ, పలువిధంబుల రత్నముల్ • పద్మరాగ
సరణిఁ గనుపట్టఁ గుంభిమ • స్తముల కుత్తు లందుగల ముత్తెములు నొక్క • యంగమయ్యె.

తే॥ ముమ్మరంబగు పోరిట్లు • మొనయుతఱిని, మాఱుకొన్న చీఁకటులను • మదగజములఁ
దునిమి నెత్తుటఁదోఁగి యె • ఱ్ఱనయి లేచె, ననఁగ భానుండు తోఁచె బూ • ర్వాద్రిమీఁద.

తే॥ రాక్షసాంధకారముఁదోలి • రామరవియు, నిరులఁ దోలిన తరణియు • నిరువు రొప్ప
జగము తమమను పేరు నా • శంబు నొంద, నుల్లసిల్లిన గతిఁ గాంతి • యొప్పుమీఱె.

తే॥ తమము తొలఁగ రుధిర సాగ • రమును కరులు, తెప్పఁదేలిన జలధియుఁ • గప్పెక్కైన
కుణప గణములు మితిమీఱి • రణతలమున, నచ్చెరువుగఁ దోఁచెను భీతి • పిచ్చలింప

వ॥ ఉదయ గిరీంద్రమందు రవి • యొప్పఁగ నెత్తురు వెంచఁజొచ్చెనన్
మెదడుల పంకియం దొదిఁగి • నిక్కలి చుక్కలు తెక్కలున్న యా
ప్రదరములన్ శిలీముఖ వి • వారము వ్రాలఁగఁ జచ్చు వాఁడవా
పదసిములన్ జలేజములు • వరక పూచిన చంద మేర్పడెన్

తే॥ కరులు హరులును తేరులు • కలిసిపడిన, తలము విలయవాయువు వీవఁ • గలఁగఁజాలి
యంబువములు పత్త్రంబు • లమరపథము, లురలి ధరణిపై కూలిన • యొప్పుదోఁచె.

తే॥ విరియు కురులతో దనుజసుం • దరులువచ్చి, యలమికొనఁ దమపతుల మే • నులు రజోర్వి
వల్లు లలమిన పెను వృక్ష • వాటి కూలి, యున్న తెఱఁగునఁ గానంగ • నొప్పెనప్డు.

తే॥ తమకు కౌనులు పీనస్త • నములు రక్త, దీర్ఘ కుంతలములు గల • తెఱవలు తమ
వరుల మస్తముల్ గొన కటఁ • దిరుగుచుండు, భూతములఁబట్టి పిచ్చిరి • పొదము కినుక.

తే॥ ప్రియుని యవయవములఁ గూర్చి • పెట్టి యొకతె, గుండెలను వ్రేష్ఠలను నక్క • గొనుచుఁబోవఁ
దఱుము త్రాణయులేక సం • తాపమంది, కూలి జీవంబులను పాసి • కూడెఁ బతిని.

చ॥ పెటుల భుజంబులం గొనుచుఁ • బాఱెడు నక్కలఁ గాంచి దీన వా
క్యవి తతుల వేఁడియున్ విడక • పర్విడ వెంబడినేగి క్రైదువుల్
బతికిలఁ గూలునట్లు పడిఁ • గ్రుచ్చుకొనం గదునొచ్చి యేడ్చుచున్
వెతగొని ప్రాణముల్ తమకి • వీడిరి చేడెలు కొంద ఱయ్యెడన్.

తే॥ కుణపరాసులలోఁ దగు • లొక్కకొన్ని పతుల, గాత్రముల వెదకుచునుండు • కలువకంటు
లదవులం దమనంటులు • విడిచిచనఁగఁ, దిరుగులాడు నాఁడునెమిళ్ల • కరణి నంద్రి.

తే॥ మడిచియున్న యొడలతోడఁ • గెడసియున్న, చెలువులంగనిజారత్వ • చిహ్నములమ
ముఱఁగుపఱుచుచున్నారను • మౌగ్ధ్యబుద్ధిఁ, గినుకగొనిరి కొందఱు గోల • వనితలచట.

తే॥ పతులమేనుల గుఱుతిడ • వలనుగాక, జీర్ణ కపచంబులం దీసి • చెటలపఱుఁ
దమ నఖక్షతములఁ గని • తలరి తలరి, పనవి కొందఱు జీవముల్ • పాసినారు.

తే॥ అశ్రుపూరిత నయనలై • యంబుజాస్య, లొక్క కొందఱుపతుల రో • యుచుఁ గదంకఁ
బీనుఁగులనుండి వెలువడు • వెల్లులందు, పడి మునింగి జీవంబులఁ • బాసినారు

—: ధూమ్రాక్షుండు హనుమంతునిచేఁ గూలుట :—

క॥ హనుమయు ధూమ్రాక్షుఁడు ముం, దునకు వెనుక కదరి యడఁగి • తూఁకొనుచును పై
కొనుచును సములై పోరిరి, వినుద్రిప్పురు లెల్లఁ గాంచి • విస్మయపడఁగన్.

క॥ అసురయు నిరువది తూపుల వెస మారుతి తొమ్మదాఁక • వీడిన నతఁడున్
విసిగి కసిమసఁగి పైఁబడి, పసచెడ నద్దనుజు తేరు • భగ్నము చేసెన్.

క॥ తే రవియ వింగి కెగసిన, వీరుని కైనున్న విల్లు • విఱిచెను రామ
క్ష్మారమణు తమ్ముఁ డురవడి, మారుతియును వాని నీడ్చి • మహికిం దార్చెన్.

తే॥ ఈడ్చి కదలి దాఁటినకాల • నెగసి తన్ని, విప్పు లుమిసెడు శిరమును • త్రిప్పిత్రిప్పి
యీడ్చి కదలిలోఁబడనూకి • యుబ్బరించి, యార్చె వానరావళులు మే • లనుచుఁ బొగడ.

—: మహాపార్శ్వుఁ డంగదునిచేఁ జచ్చుట :—

క॥ కోపము కన్నుల మిక్కిలి, దీపములవిధాన మండఁ • దివిరిన పొగలున్
ధూపములఁబోల నొదవిన, తాపములను లెక్కగొనక • దర్పితమతులై.

క॥ సాహసముమీఱ విజయో, త్సాహంబున నొకరికొకరు • తగ్గక శర సం
దోహమున గిరుల నమర, ద్రోహి మహాపార్శ్వుఁ డంగ • దుండును పోరన్.

క॥ కరిపై నుంత విసరుగతి, ఁ రవింశతి నంగదుని భు • జము నాట విశా
చరుఁ డేయ రేఁగి రాక్షసు, నరదముఁ బైకెత్తి తిరుగ • నవనికి వైచెన్.

తే॥ ఎరధుఁడై వింటి నావల • విసరివైచి, మొనసి కుప్పించి దైత్యుఁ డ • మోఘమైన
శూలముం గొని ప్లవగరా • ట్సూను వక్ష, మునకు సూటిగా గుఱిచూచి • పూనియేసె.

క॥ మది సాధారణ శూలం, బది గాదని యెంచి రామ॥నృపవరుఁడు మహా
ప్రదరంబునఁ దు త్తుము త్తై, చెదరిపడఁగ నేసె సురల॥చిత్తము లలరన్

తే॥ శ్రీరఘుప్రవరునకు జే॥జే యటంచు, నంగదుండు మహాపార్శ్వు॥నరఁచి త్రొక్కి
పదములం బట్టి మిక్కిలి • వంగటింపఁ, జెలఁగి నడిమికి రెండుగాఁ • జీల్చి వైచె.

## నీల మాల్యవంతుల యుద్ధము

తే॥ మాల్యవంతుండు నీలుండు • మాఱుపడక, కదన మొనరించుచుండఁగఁ • గాంచిసురలు
తొల్లి యింద్రుఁడు పం క్తి వ • క్త్రుండు పోరు, సరణి నున్నది యని విరుల్ • చల్లినారు.

తే॥ నీలుఁ డొక్క శైలము వైవ • మాలియన్న, విల్లు విఱిగె వాఁడును విల్లు • విడిచి వాలు
పలక గొని యదలించుచు • నిలువుమనుచు, నేలకుం దాఁటి యుక్కున • నీలుఁ దాఁకె.

ఆ॥ వారలట్లు పోరు • వడిఁగాంచి యెడసొచ్చి, ఈధర మొక్కఁడెత్తి • కుముదుఁడేసె
నుగ్గునూచ మగుచు • భగ్గున మండుచు, నసుర కీరు గూలె • నంతమీద.

తే॥ వృక్ష మొక్కండు నీలుండు • విసర దాని, మాల్యవంతుండు వాలున • మాల్చివైచి
నీలు తలఁద్రెంప నెత్త నా • కేలుతునిఁగి, నేలఁబడఁగూల్చె సౌమిత్రి • నిశితశరము.

తే॥ శంపవంటి ఖడ్గముతో భు • జంబు తెగియుఁ, గ్రమముచెడక దురము సేయు • కఱకుసోఁకుఁ
గాంచి యిది యర్ధరథుతోడి • కయ్యమనుచు, నవల బోరక సౌమిత్రి • యవలికేగె.

తే॥ ఘనభుజుని రామునొద్దకుఁ • జనుచునున్న, లచ్చుమనుఁ గాంచి యమరులు • మెచ్చిపొగడి
రెవ్వ రీరీతి వీరత్వ • మెనఁగియున్న, సమరధర్మంబు పాటించు • చతురులనుచు.

తే॥ యజ్ఞశత్రుండు వచ్చిరా • మానుజన్ము, నిలిపి పాఱకుమని శర • ని కరమేయ
నాతఁడొక వాఁడియమ్ముచే • నక్కవగుల, నేసి, కూల్చి యవ్వల రామ • నృపుని చేరె.

తే॥ యజ్ఞశత్రుఁడు విలుప్రీల • నవనిఁ గూలె, గిండుమీఱి కాలంగేలఁ • గ్రతువులందు
జార్చుశిలలు లేవయ్యెవై • శ్వానరుండు, స్వేచ్ఛగాఁ గుండములయందు • వెలుఁగసాగె.

తే॥ తనదు జనకుని మున్నొక • తడవ యడ్డ, గించి పేరొందు రవిశత్రు • గీఁటడంచి
తండ్రికిం దగు పుత్త్రుఁడన్ • తరము గాంచె, సూర్యపుత్త్రికుఁ డారణ • క్షోణియందు

## ఋషభ వజ్రదంష్ట్రుల సమరము

తే॥ అగ్గలంబుగఁ దనతోడ • నని యొనర్చు, వజ్రదంష్ట్రుని పెనుకేరు • వసుధఁగూ-
హరులు సారధియును చది • యంగ నొక్క, భూధరేంద్రమ్ముఁగొని ఋష • భుండు వైచె.

తే॥ తెరు చదియఁ గార్ముకమును • పాలవైచి, దండముంగొని నేలకు • దాఁటి పిడుగు
కరణి వజ్రదంష్ట్రుఁడు వాని • శిరము మోఁదెఁ, జచ్చెఁ జచ్చెన యని కపుల్ • పిచ్చలింప

తే॥ వ్రేటుగొన్నట్టి ఋష్యధుఁడు • పీఁచ చెదఁగ, మరణవేదన నొందుచు • మఱఁగుచుండ
హనుమఁ డెదనొచ్చి యార్చెను • ససురులంటఁ, బొదువవాఁడునుదంగానఁ • బొదివికొట్టె.

తే॥ కొట్టె చను వజ్రదంష్ట్రుని • గూర్చిపట్టి, దండమును లాగికొని వాని • పండ్లు రాలఁ
గొట్టె శిరమును మోఁది యా • క్రూరుపేరు, వ్యర్థముగఁ జేసి శమనుని • పాలికనిపె.

## పిశాచుని యుద్ధము

తే॥ పనసుఁ దేయఁగ బెవ్వనఁ • బలుకువాఁడు, మేనిఁజీఁకఁ బిశాచుండు • మిగులఁ గినిసి
తోమరముఁ గొని పైపైని • తుంగభుజుఁడు, నెత్తి రొలుకుచుఁ బనసుండు • నేలఁ బొరలె.

సీ॥ జలదమం దున్నాఁడొ? జలధిపై నున్నాఁడొ?, నేలపైనున్నాఁడొ? నింగిఁగలఁడొ?
వేలకొలంది గు • ర్రాలు పాటెడి నన్న, వడుపున వానిల • త్తడియు ఒరిగె
నేలఁ గాలూనక • చేరిఁ దిరుగాడుఁ, గంటిచూపులకందెఁ • గ్రన్న నేగు
నెదకంబె పడిపేగు • నెచటనో గడదను, నంబిలో డాయుచుఁ • జెంత నిలుచు

తే॥ గరుడుకన్నను పడినేగు • తురగముపయిఁ, దిరుగుచున్న పిశాచుని • పైప్రశక్తి
నొఱగిరూలెఁగుప్పఁగ ప్లవం • గోత్కరంబు, తత్కృతముగాంచి యటసుమి • త్రాసుతుండు

ఉ॥ చండతరోగ్రుఁడై యనల • సాయకమున్ బలువింటఁ గూర్చి యు
ద్దండ భుజాబలంబు తెగఁ • దార్చి పిశాచుని ఘోర శీర్షముం
జెండిన యంతఁ జేష్టదక • చేఁగల శూలము వీడకుండ నా
మొండెము మున్నుచేయు కొలఁ • బూని నటించెను కొంత సేపటన్.

తే॥ క్షేమవార్తలు సీతకుఁ • జెప్పుకరిణిఁ, దుమ్మెదలు రొదచేసెను • దిమ్మపుట్ట
ధర్మదూతలు చేరిరి • దక్షిణమున, నసుర దూతలు లంకకు • నరిగినారు

ఆ॥ అరిగి విభుని చేరి • యంజలి ఘటియించి, విజయవార్త దెలుపు • పేలఁబేమిఁ
జింతతోడ జవము • చేవయుఁ గల మన, సేన మడిసె ననుచుఁ • జెప్పినారు.

## 20 మకరాక్ష వధ పటలము (38)

క॥ చారుల వార్తలు విని లం, కా రమణుఁడు సంతపించి • కాలాహి క్రియన్
దోరంపు టూర్పు పుచ్చఁగ, నారసి మకరాక్షుఁ డిట్టు • లనియెం గడిమిన్.

మ॥ అనిలోఁ దంష్ట్రి ఖరున్ వధించిన మహా • హంకారులం ద్రుంపఁగా
నను పంపం దలపోయ కుంటివి తగ • న్నా శౌర్యముం గాంచవో?
యనుపంగాఁ గలవంచు నోర్మితివి చిం • తావాప్తి నీకేల? భూ
జనులా నన్నెదిరించువారు? సుమన • స్సంఘంబులున్ లెక్కయే?

ఉ॥ కన్నుల నీరు ధారలుగఁ • గార్చుచు నేడ్చుచుఁ గన్నతల్లి దా
ఖిన్నత నొంది భర్త నడఁ • గించిన వాని శిరమ్ము త్రొక్కఁగా

కెన్నఁగ సూత్రముం దొలఁగ • నేనని పంతము పూనియున్న దా
జన్నియ పూర్తిగావలదె • సాధ్వికి వీరకుమారుఁ డుండియున్

చ॥ పనుపుము నన్ను వీరి కవి • ప్రాంజలియౌ మకరాక్షుఁ గాంచి యా
దనుజ వరేణ్యుఁ డిట్టులను • ధైర్యమె తోడగుఁగాక నీచిరం
తనమగు వైరముం దొలఁగ • దానవవైరుల మస్తకంబులం
గొని యిటు తెమ్ము పొమ్మనుడుఁ • గోరికమీఱఁగ వాఁడు పొంగుచున్.

చ॥ విలుగొని తేరునెక్కి కడు • వేడుక వాహిను లైదుకోట్లు చం
డ లలిత రీతిఁ దన్నొలయ • డంబుగ దానవనాథుఁ డంపు వె
ల్వలు మఱి యిర్వదిం గదిసి • వారిధి పొంగిన భంగి దోఁపఁ గా
హళములు దుందుభుల్ చెలఁగ • నమ్మకరాక్షుఁడు పోయె నుద్ధతిన్.

శా॥ రాజద్రీతిని చక్రరక్షకులుగా • రక్తాక్షుఁడున్ శంఖుఁడున్
తేజోవంతులు తోడరా నుడుగణా • దీర్ణంబలెన్ వాహినీ
రాజిం దన్మకరాక్షుఁ డొప్పెను రజో • రాగంబు పర్విల్లె ది
గ్రాజా ల్గన్నులుమూయ వేలుపుల మా • ర్గంబు న్నిరోధించుచున్.

తే॥ ధ్వజపటంబులు రవి కర • ప్రతతిఁ గప్ప, మదకరుల శీకరంబులు • మలయుచుండఁ
గదలు దానవసేనచేఁ • గపిచయంబు, శ్రమము పూర్తిగాఁ దొలఁగె నా • సమయమందు.

తే॥ గీఁకలును సకిలింపులు • ఘీకలొలయఁ, బణవ కాహళ దుందుభి • స్వనము లలియ
సింహనాదంబు లెల్లెడఁ • జెలఁగి యుండ, గోళములు నిండ జీవులు • గొవరువోయె.

ఉ॥ వాఁడియు వేఁడియుం దొగడు • పాడియుఁ బోఁడియుఁ గల్గు సైన్యముల్
వేడుక వాడుకల్ విడిచి • భీకరః చూపుచుఁ బోరు సేయుచున్
వీడక వాడుకన్ బలుపు • విండ్లనుకిండ్లను పూని యేయఁగా
నీడువ సాగె రక్తనదు లీడిగిలంబడు వారణంబులన్

ఉ॥ వానరులేయు శైలముల • వారక చేతులఁబట్టి వెండియున్
దానవులేయ మేఘములు • తారకలన్ భువిరాల భూతముల్
పీనుఁగులన్ భుజించు పెను • వీఁకను గేకలువెట్ట భూమిపై
వానర సైన్యముల్ తలలు • వ్రయ్యఁగఁ గూలెను కుప్పతిప్పలై.

చ॥ దనుజుల కేలనున్న యడి • దంబులు లాగి తదీయ శీర్షముల్
తునుమఁగ వారికేఁగల • తోరపు మార్గికులఁ బట్టితంబులన్
దనుజులు లాగికొంచు జెడి • దంబుగ తీవ్ర్వసఁ బోవవైచుచున్
వనచర వార వక్షముల • భగ్నము సేయుచుఁ బోరుచుండఁగన్.

## మకరాక్షుఁడు రామునితోఁ బోరి మడియుట

మ॥ మకరాక్షుం డెదురైన వానరతతిన్ • మాయించి తత్సైన్య నా
యక గాత్రంబుల యంత్ర నిర్గళిత ఘో • రాశ్మంబులంబోలు సా
యక జాలంబుల ద్రుల్చుచున్ బహుళ క్రో • పాటోప మేపారఁ బా
వకలీలన్ రఘుచంద్రముం గదిసి గ • ర్వస్ఫూర్తిమై నిట్లనున్.

చ॥ సమరమునందు నాజనకుఁ • జంపిన యప్పటినుండి నీతలన్
దుమురుగఁ జేసి నాకుఁగల • దుర్దమకోప మడంపనుంటి; మా
నము చెడునంచు భీతిగొని • నాయెడ వైరము పూనరైరి యా
సుమనసులుం ద్రిమూర్తులును • సూటిగఁ బూనితి వీవు మానవా!

చ॥ అనపుడు మందహాసరుచి • యాననమందునఁ దోఁప రాఘవుం
డనుఁ గసిదీర్చుకోఁ గడఁగి • యక్కఱతోడను వచ్చినాఁడవా!
జననములోన వీరులకు • క్షాత్త్రము వచ్చుట సాజమేకదా!
మొనసితి యుక్తవాక్తతులఁ • బూర్వవిరోధము మాన్పుకొమ్మనన్.

మ॥ అనలజ్వాలలు కన్నులం బొడమ నీ • హంకారమున్ మాన్తుఁబో
మ్మని యంతన్ మకరాక్షుఁ డుగ్రుఁడగుచున్ • జ్యారావముం జేసి క్రొ
న్నన నిస్సెక్కవిఁదుర్చించి కాక కసి మా • నంబోవదంచున్ మహా
శని శిల్పాపగ పెక్షముం గురిసె ర • క్షఃపాళి యగ్గింపఁగన్.

మ॥ జలజాతేక్షణుపై మరుత్సుతునిపై • సౌమిత్రిపై మార్గణం
బులు నూటాఱుల నేసి దుస్సహ తర • ప్రోత్తేజుఁడై సంగర
స్థలి నారాచ మయంబుగాఁ బఱపి గ • ర్జానాద గంభీరుఁడై
జవముం జేవయుఁ జూప రాముఁడు శరా • సారంబుచే మాన్పుచున్.

చ॥ ఒక విశిఖమ్ము రాక్షసుని • యుక్కఱ నక్కున నాటనేయఁగాఁ
డపికలాడి వాఁడు కను • దమ్ముల నిప్పులు రాల్చి లోక వి
షకు యశు రామచంద్రు కవ • చమ్మునఁ దూఱఁగఁ బెక్కు వాఁడి సా
యకముల నేసి యార్చెను వి • యత్తలమందలి వేల్పు లల్కఁగన్.

ఉ॥ రాముఁడు మందహాస రుచి • రస్థితి మోమునఁదోఁప సంగరో
ద్దామ కఠంబునం దిగిచి • దారుణ బాణము లేసి సారథిన్
నామ మడంచి రథ్య చర • ణాస్థ ఖురంబులఁ ద్రెంచి చాపమున్
సాముగఁజేసి వక్షమునఁ • జయ్యన నాఁటగఁ జొన్ప నంతటన్.

చ॥ అరదము చాపముం • జెడఁగ నమ్మకరాక్షుఁడు సొమ్మవోక నె
త్తురు వడి గ్రక్కుచున్ ధరణి • దూఁకక మింటికినేగి మేఘ సం

వరణ శరీరుఁడై విలయ • వర్షము దాపురమయ్యెనో యనన్
విరివిగ రాల్చెఁ జిచ్చులకు • పిడ్గులు ఱాలును గాలి వానగన్.

చ॥ పిడుగులు లెక్కలేక పడ • భీకర వాయువు వీవ మేఘముల్
మిడుకులఁ జిందఁగా సమర • మేదినిలోఁ గల వానరావళుల్
మిడుకుచుఁ బోరలేక తమ • మేనులు చిందఱ వందరై పడన్
మడిసిరి తక్కువార లని • మాని పలాయితులైరి భీతులై.

ఉ॥ పాఱిన దిక్కులం బొగలు • వాఱి కనుంగవ గానరామి ను
క్కాఱఁగ మేఘముల్ గవిసి • యంతట నిప్పులవాన ఱాలతో
మీఱఁగ వానరుల్ మడియ • మేదృఢ రాముఁడు గాంచి పీని కీ
తీరు వరమ్మచేనొ? మఱి • తెక్కలిమాయనొ గల్గెఁ జెప్పవే!

చ॥ అనుడు విభీషణుండు కరు • ణాకరు రాముని గాంచి దేవ! యీ
దనుజున కీ బలంబు ఫల • దంబుగ వాయు సముద్రరాజు లి
చ్చినయది యన్న రాఘవుఁడు • చేదృఢ దానిఁ దదస్త్రపాళిచేఁ
బొనుపడఁజేయ మాయలును • పోయెను వార్ధివి వైచు వింగువై.

క॥ అదిగని మకరాక్షుడుతో, యదము నెనయు రూపుగొని వి • యత్పథమందే
యొదిఁగి వనచర కదంబము, గుదిగ్రువ్వఁగ శూలములను • గుములుగ నేసెన్.

చ॥ అగపడకుండ డాఁగు మక • రాక్షుఁ గనుంగొను చొప్పుగాన కే
వగఁ దెలియ్యంగ వచ్చునని • వారిజనేత్రుఁడు చింతతో మదా
శుగ హతి నొల్కు నెత్తు రొక • చోఁ గనుపడ్డది యిద్ది మాయచే
గగనమునందు దానవుఁడు • గల్గిన తావని నిశ్చయించుచున్.

ఆ॥ ఒక్క వాఁడియమ్ము • నొగిఁగూర్చి పఱవఁగా, వాని శిరము తునిఁగి • పసిధఁ బడియె
నొడలు పుడమి దొరలు • చుంచిన యంత న, మ్మాయ స్వప్నమట్లు • మాసిపోయె.

## రక్తాక్షుఁడు శంఖుఁడు నల పనసులచే నంత మొందుట

తే॥ మకర నేత్రుండు తెగిపడి • మడియఁగాంచి, రథముపై గ్రీష్మభానుని • వాజనొప్పి
శరదముంబలె శరములఁ • గురిసి గాలి, వీఁకవచ్చు రక్తాక్షుని • వాఁకె నెవఁడు

ఉ॥ తాఁకి శిరోత్కరంబులు ౨ • తావితయై చన సాలసాలముం
గైకొనివీచి త్రోచుచునా • గ్రక్కున నేఁగుఁ గాంచి యుర్వపం
బైకొను సింగమో యనఁగ • ఖాటిలి దూఁకఁగ దైత్యుఁ డుగ్రుఁడై
పీఁకెను తుంప్లుచేసి పెను • వీకున నార్వ నలుం డదాటునన్.

ఉ॥ బొమ్మను వంచి నక్క తల • క్రుంచి గుభాలున రక్తనేత్రుని శీ
ర్షమ్మున దూఁకి నాసికను • చక్కలం జెవులందు వేఁడి ర

స్త్రమ్మును గొప్పవృ బైలుపడఁ • గాఁ బెనుముష్టిని దాఁచి కాలితోఁ
గ్రిమ్మని ద్రొబ్బె నేలటుఁ బు • రందర ముఖ్యులు మెచ్చి యుబ్బఁగన్.

ఆ॥ కొండమీఁదఁ బడిన • కొరడు విధంబున, నలుఁడు రక్తనేత్రు • తలను దుమికి
చదియఁ బొడువఁ గన్న • శంఖుండు లయకాల, రుద్రుభంగిఁ బొంగి • క్రుద్ధుఁడగుచు.

చ॥ నిలునిలుమంచు దదల్చి నలు • నిక్కనఁ దాఁకఁగ నేగఁ గాంచి పే
రలుకను దాఁటుచుం బనసుఁ • డా సురవిద్విషు నడ్డగించెఁ జే
యలుఁగులు తొమ్మిదింట నుడి • యన్ వడి శంఖుఁడు గొట్ట నేతిచే
వెలిఁగెడి యగ్నిపోలెఁ గపి • వీరుఁడు మండి చనెం గుభాలునన్.

చ॥ పరువిడి తేరితో నసుర • బాధ బలంబున నెత్తె నెత్తినన్
సురుఁగక శంఖుఁ డిమ్ముగ వ • సుంధరకుం దిగుసంత వానిపై
నరదముపైవ వాని యొడ • లయ్యెడ ఘట్టని వ్రచ్చి క్రొత్త నె
త్తురు ప్రవహింపఁగా నుసుఱు • దోరెను వేలుపు లుబ్బి యార్వఁగన్.

ఆ॥ చక్రవర్తి సుతుల • శరములచేతను, హరుల నఖర శైల • • తరులవలన
నసురబలము చెడ ని • రాయుధులగు దూత, లరిగి రమరవైరి • కంత దెలుప.

## 21. బ్రహ్మాస్త్ర పటలము, (231)

మ॥ అనిలోనన్ ఖరపుత్త్రుఁ డీల్గుటయు ర • క్తాక్షుండు శంఘాఖ్యుఁడున్
దనుజానీకముతోడఁ గూలుటయు నా • దైత్యేంద్రుఁ డాలించి యిం
ద్రుని గర్వం బడఁగించు పుత్త్రు నిటకుం • దోడ్తెండనన్ లెంకి లు
వ్వున నేతెంచి తదాజ్ఞఁ దెల్ప నతఁడున్ • బుద్ధిన్ విచారించుచున్

ఉ॥ పోయినవార లాగతిసె • పోయిరొకో యనఁ జారు లోప్రభూ!
పోయిన వారలెల్ల మఱి • పోయిన వారలె గాక నీపలెన్
గాయముతోడ లంకకును • గ్రమ్మఱి నట్టిఁ లేరు సుమ్మనన్
హా యని లేచి యింద్రజితుఁ • డంతకుపోలిక వచ్చె నుగ్రుఁడై.

ఉ॥ వచ్చి దశాస్యుఁ జేరి గరు • వంబున వందన మాచరించి నీ
వెచ్చెర నంపు సేనలు న • శించెన కాయని విన్నవాఁడ నా
మచ్చరులైన రాఘవుల • మస్తకముల్ ప్లవగాళి శీర్షముల్
గ్రచ్చుఱఁ దెత్తు మోదమును • గాంచెద నీవును నేత ముండటన్

చ॥ అసురుల కోర్కులెల్లను హ • తాశలు గావుత నేఁడు పోయెదన్
దపకక యుండుమా యనుచు. • దంచిరి యాజ్ఞను పూని వేయి సిం
గములు వహించు తేరిపయిఁ • గ్రాలుచు వెల్వడె వెంబడిం దురం
గమ రథ దంతి సద్భట ని • కాయము లవ్వది వెల్వ లేగఁగన్.

జేవిధి గెల్వఁగూర్చు; నని • నేతురో, నిల్తురొ, చత్తురో, వడిం
జేవ దొఱంగి పాఱుదురొ; • చిందఱ నేఁ గొనుసట్టి వేళకున్.

చ॥ నిలువుఁడు నిల్వు డంచు నదరి • నివ్వలు రాలఁగఁ జూచి కంకటం
బొలయఁ ధరించి తూణముల • నొవ్వఁగఁ దాల్చి వీరకంకణం
బులు గల కేలఁ గార్ముకము • పూని శతాంగమునెక్కి శింజినిం
బలువుగఁ గూర్చి టంకృతి సు • పర్వ భయంకర లీలఁ జేయుచున్.

ఉ॥ చిందమునొత్త ఖేచరులు • చిత్తములన్ జడుపొంది గోప్పయా
క్రందు దురంబు నేఁటికి భ • రంబుగఁ గల్గెను వేల్మి విమ్మ మం
బొందుటచేత లక్ష్మణుని • భూరి శరంబున నింద్రజిత్తు నేఁ
డొందును చావు నంచు మది • నబ్బురమొందిరి చూచువేడుకన్

ఉ॥ వాని గుణధ్వనిన్ విని ప్ల • వంగులు లావును విస్మరించి చే
నూనిన పర్వతంబులు త • రూత్కరముల్ దిగజాఱఁ దాలిమిన్
లేని కతంబునం బడుచు • లేచుచుఁ బాఱిరి కల్పవేళ ఝం
ఝూనిల వేగ ఘాతమున • నంబుధి నీరము విచ్చుచందమై.

ఉ॥ కాలుని జీవితంబునకుఁ • గాలుఁడు రావణి లేచి యోరి వా
తూలసుతా, ప్రతాపనిధి • తోఁచఁగ నాడుచు దొడ్డచేతలన్
జాలు ధరించి విల్చితి దు • ర • బొనరింపఁగ మేలు మేలు నీ
చాలిక సాహసంబును ప్ర • శంస్యము లోఁతక నిల్వుమీ వెసన్

ఉ॥ వీరుఁడిటుల్ వచించి బలు • విల్లు ధరించి యెసంగ నప్ఁ డనీ
దారకుఁ డూనియున్న వసు • ధాధరమున్ వడిఁద్రిప్పి వైచె నిం
ద్రారి మహోజపంబున ని • యత్ స్థలి జివ్వున వచ్చు శైలమున్
దూరమునన్ విశీర్ణమయి • తూలఁగఁ గొట్టెను వాఁడి కోలలన్

చ॥ మఱియొక శైలముం గొని య • మానుష సత్త్వము పెల్లడింపమున్
గిరగిరఁ ద్రిప్పు మారుతిని • కేలు పదంబు లురమ్ము కిరముం
శిరము శిలీముఖ ప్రతతి • చే నొగిలించె వియచ్చరుల్ నిశా
చరు కర లాఘవంబు గనఁ • జాలక యద్భుతమందు నయ్యెడన్.

క॥ ధరణీధర నికటంబున, నిరులం దొలఁగించు నెత్రు • పెఱుపున బాణో
త్కర కిరణంబుల మారుతి, తరుణారుణ తరణి నవలెఁ • దద్దయు వెలసెన్.

క॥ హనుమంతుడు సోలఁగఁ గినుకం, గొని యంగదముఖ్యు లెదురు • కొనిరి విపక్ష
త్తనయుం డనటికిరా వ, చ్చిన వారలఁ గాంచి యసుర • ఒడిమడుపడుమున్.

ఉ॥ శక్రజితుండు పల్కె నొగిఁ • జావఁదలంచి యెదిర్చె నేనియున్
విక్రమధామమైన హరి • వీరత దంతుఁ గూర్చు గాని దు

క॥ బలిముఖ సేనావీరులు, మలలు తరులు గొనుచు మాఱు • మలయఁగ దారిం
దిలకించి రాఘవుఁడు వెస, శిల నుండఁగఁగోరి పలికెఁ • గారణఫణితిన్.

ఆ॥ క్రూరుఁ డింద్రజిత్తు • ఘోరాస్త్రములు పేర, సాగునేని మీర • లాఁగలేరు
చోటు మాఱ విడిచి • చూచుచునుండుఁడు, విమతు లొందుమార్పు • వింటినేర్పు.

ఆ॥ అనిన రాము పలుకు • లాలించి కపివరు, లల్లెనిలిచి రంత • నధిపసుతులు
నిశిత విశిఖ నిచయ • నిర్ఘాత వర్షంబు, కురిసి రమరవైరి • కోటిమీఁద.

మ॥ త్రుటిలోఁ దమ్ముగవించు నా దనుజ సందోహమ్ము నాశమ్ము నెం
దుటకై చూపిన రామ లక్ష్మణ ధను • ర్దోర్దండ పాండిత్య సం
ఘటనం బేమని చెప్పవచ్చుఁ గనక • క్ష్మాభృ ద్ధనుర్ముక్త ధూ
ర్జటి బాణ త్రిపురాసురాలిక్రియ నా • శంబయ్యెఁ దత్సైన్యముల్.

—: తన సైన్యముపాటు నింద్రజితుఁడు కాంచుట :—

చ॥ శవములు కుప్పలై పడెడు • చందముఁ దెల్పఁగవచ్చుఁగాని వీ
రు పడిరి వారు కూలిరని • రూఢిగఁ జెప్ప నశక్యమైన రా
ఘవుల పరాక్రమ క్రమము • కంటికితెప్పలు పెట్టకుండ నా
హవమునఁ గాంచుచుండె నమరారి శరాసన మూని కీరిపై.

చ॥ కరులు మరించె నంచుఁ దుర • గంబులు గూలినవంచు స్యందనో
త్కరములు నుగ్గులయ్యె నని • కర్బురవర్గము నీల్గెనంచు నా
యపదము పోవఁ ద్రోవ గన • దంచు నభస్స్థలి నంటు ప్రేత భూ
ధరములఁగాంచి హా యని వి • షాదు గడించుఁ దపించు చూపఱున్.

చ॥ సమరము సేయుచున్న నెఱ • జాణలొ యిద్దఱె చుప్పవారొ ని
క్కముగ వచింప నాఱువది • కోఁదగు వెల్వలు, శాపశక్తిచే
నమరవిరోధి సేనల ల • యంబొనరించిరి చాపశక్తిచేఁ
దమకుఁ బొసఁగింపలేద యిది • దోర్బలమో? మఱి యింద్రజాలమో?

మ॥ శరవర్షమ్మును గాంచు రక్తనదులం • జక్కంగఁ జూచుం గళే
బర శైలమ్ములఁ గాంచుఁ గూలిన కరి • వ్రాతంబు వీక్షించు నా
ద్రాఘిమాంగంబై పడు వాజిరాజిఁగని ని • ట్టూర్పున్ రఘుస్వామి సుం
దర బాహా ద్వయిఁ గాంచు దానవ మహాం • తంబున్ విలోకించుచున్.

చ॥ శిరముల కొండలం గనుచు • చెండిన మొండెములన్ గణించుచున్
గొఱకులపోల్కి నఱ్ఱలిడు • కోలలఁగాంచు వరించువారలం
బొరిబొరి గాంచుఁ దేరుల వ • మ్ముద్ధత దంతుల వాజులన్ భటో
త్కరముల వేయిటం దొలచి • దాఁటు శరాళిగ పద్ధతిం గనున్.

చ॥ అఱువది వెల్లువల్ పయిచు • నమ్ములు చక్ర గదాసి కుంత తో
మరములు ఫెళ్లఫెళ్లమని • మ్రగ్గుచు వేణువనంబు గాలు వై
ఖరిగొని తారసిల్లకయె • కాడ్పడుచుండుట దైత్య సైన్యముల్
ధరణిని వ్రాలుచుండుటయుఁ • దక్కక రావణి కాంచె నాజిలో.

చ॥ కడుపులు మోఁదికొంచుఁ జని • కాంతులపైఁ బడి దానవాంగనల్
తడఁబడ నేడ్చుచుండు విన • దంబు వినెన్ రదపంక్తి గీఁటుచున్
బుడమి శిరంబు లూడిపడ • మొండెములాడుచు నుఁటఁజేసి య
క్కడ దిగ వీలులేమిఁ బయిఁ • గ్రాలు ఖగంబులఁ గాంచె నయ్యెడన్.

ఉ॥ సింగము లెట్టు లట్టడరి • చెచ్చెర నాజిఁ జరించుచుండు నా
ఋంగద మారుతాత్మజుల • యాశుగపద్ధతిఁ గాంచలేమి నిం
దంగద వాయుజుల్ బహు స • హస్రగణంబులు క్రుమ్మరంగ ని
ల్వంగను చోటులేదు నరు • లం గన నిద్దఱొకో కలారనున్.

ఉ॥ మోదరవంబు సేయు సుర • ముఖ్యులఁ గాంచును వారి కేల విం
పాఁడిగనున్న పుష్పముల • నారయు స్వీయ భుజంబులం గనున్
జాడుగఁ జూచు మేర గనఁ • జాలిన పీనుఁగు తిప్పలం గనున్
వేసుఱుగన్న వానిక్రియ • వీక్షణ సేయును దిక్కు లన్నిటిన్.

తే॥ లెక్కకును మీఱి కూలిన • రక్కసులను. కోరి కాంచియుఁ బాఱిన • కోఁతిమూఁక
శక్రజిద్భృతి కలఁకయుఁ • జాఱకునికి, దురము వొసరించు నాసతో • మరలదయ్యె.

## -: హనుమని సింహనాదము :-

ఉ॥ బృందములైన యాఱుపది • వెల్వలు నాల్గువిధాల సైన్యముల్
క్రుందఁగ రాఘవేంద్రుల ప • రాక్రమ పద్ధతిఁ గాంచి యంజనా
నందనుఁ డుల్లసిల్లి జిత • నంబున బాహువు లప్పళించి యా
నందముతోడ భీకర ని • నాదమొనర్చె రిపుల్ దిగుల్గొనన్.

ఉ॥ కొందఱు గుండియల్ వగులఁ • గొందఱు గూలలు వ్రీల ధాత్రికిన్
స్యందనమందునుండి దిగఁ • జాఱిరి కొందఱు కేలఁ గైదువుల్
క్రిందికి జాఱ విహ్వలతఁ • గీడ్పడి వ్రాలిరి లంకలోని వా
రెందఱొ నెత్రుగ్రక్క గతి • యించిరి మారుతి సింహ గర్జనన్.

ఉ॥ కోఁతి యొకం డొనర్చు పెను • కూఁతకు జంకిన పందలార ! మీ
చేఁతలు తెల్లమయ్యె నిఁకఁ • జెప్పెడిదేమి ? నశించినారలే;
ఱేఁతకు మించి లోఁతుగల • దే ? యని రావణి ముందువోవఁగా
బ్రాఁతిగలట్టి కొందఱొగిఁ • బ్రాపుగ వచ్చిరి ధీరచిత్తులై.

శరాసన యుత హస్త • సముదయంబు, త్రెవ్వి రక్త హ్రదంబులఁ • దేలియాడ
ములతో జలధి సంచ • రించుచుండు. చొఱ్ఱమీలు ప్రకాశించు • చొప్పుదోఁచె.

నారాచములు త్రుంచి • త్రోయుచుండఁ. గెరలి పడు గొడుగులును చె • క్కెమ్మలడిద
ం రక్తవాహినిలోన • మునుఁగుచుండు. పలు వగల జల పక్షుల • పగిదిఁదోఁచె.

ష్మలమ్ములు విండ్లు • కైదువులును. సిడము లింధనములుగాఁగఁ • బడసి వీర
షా దృశాగ్ని సుడికి • పక్వమైన. ప్రేతములఁ బ్రీతితోఁ దినె • భూత గణము.

చక్రముల్ విఱుగంగఁ • గూలెఁగొన్ని. త్రాళ్లు తెగ గుఱ్ఱములుజాఱి • రక్త పంక
ములఁగెను సారథుల్ • గ్రుందఁ గొన్ని. పయిగులిడె నరవము లిచ్చ • వచ్చు పగిది.

చుండు మణుల కాంతి • నెనసి రక్త. పంకమునఁ బూఁడి యెఱ్ఱని • ప్రభలుచిమ్మ
కాయముల్ మారుతి • రాఁజఁబెట్ట. మండు లంకలో భర్మ హ • ర్మ్యములఁబోలె

డు హనుమంతుని. ప్రేరేఁచుచు నపుడు బాణ • వృష్టిం గురియన్
పొడిపొడియై భువిఁ. దీఱగ రావణికి నొక్క తేరే మిగిలెన్

కములఁ బూన్చిన రథ, ములు రథికులతోడఁ గూడఁ • బుయిలోడిన వా
ని కుత్సించుచు నో. టిలక దనుజ విభు సుతుండు • టెక్కునఁ బలికెన్

ఇరువురు కూడి పోరెదరొ ? యేపున నొక్కరె వత్తురో ? చమూ
త్కరములతోడుతం దొడరి • కాలుని ప్రోలికిఁ బోవఁజూతురో ?
యిరవుగ విచ్చగించినది • యేదియొ తెల్పిన నట్టి తీరునన్
ముర మొనరింతు నంచలుక • తో నన లక్ష్మణుఁ డంత నిట్లనున్

అడిదమొ కార్ముక మ్మొ మఱి • యాయుధ మెయ్యది యిమ్మొ వానిచే
నడిఁగొనిరమ్మ నిన్నెదిరి • ప్రాణము తీయఁ బ్రతిజ్ఞ చేసితిన్
జెదు తెరువైన మాయలిఁకఁ • జెల్లవు నిక్కపు వీరమున్నచో
బడిబడి డాఁగ కెచ్చటికిఁ • బాఱక నిల్వుము నీచ! నావుడున్.

జనకుని తమ్ములం దొలుతఁ • జంపిన రాముని వెన్కఁ జంపెదన్
మునిమెద నిన్ను మున్నుగనె • దోర్బల సంపద మీఱ నట్లు లేఁ
కెనకి వధింపనేని దశ • శీర్షుని పుత్త్రుఁడ నైతినన్న యా
ఘనతయు నాకుఁ దక్కునె ? జ • గంబులు దీనికి నమ్మతించునే ?.

నాశరముఁలఖున్. లక్ష్మణముగఁ జేసి నిన్ను • లలిఁ గూర్పనిపో
రించునె నన్నున్. లక్ష్మణ నామంబు సార్థ • లక్ష్మం బగునే ?

వెల్వల సైన్యము. లఱిముఱి గావించు మీర • లడలుచుఁ జూడన్
డెబ్బది వెల్వలఁ. గొఱవడు మీ జీవములను • గ్రోలెద నవలన్.

ఉ॥ కాను ఖరుండు దూషణుఁడుఁ • గాను త్రిశీర్షుఁడుఁ గుంభకర్ణుఁడన్
గాను జగంబు గెల్చు దశ • కంఠుని పుత్త్రుఁడ వీరసింహుఁడన్
మానవులార ! తమ్ములటు • మా పినతండ్రులకున్ ద్వదీయమౌ
శోణితమందు తర్పణము • శుద్ధిగఁ జేయఁగఁ బూని వచ్చితిన్.

ఉ॥ నాపుడు లక్ష్మణుం డను మ • నంబునఁ దక్షిణ చింత మానికే ?
చావఁగనున్నవారికిని • చచ్చినవారికి నెల్లవారికిన్
నీవొనరించు వాఁడటు • నీకు విభీషణుఁ డున్న వాఁడిటన్
జీవన తర్పణంబు దయ • సేయఁగ దద్వ్యసనంబు మానుమా.

సీ॥ అనుడు మనసు మండ • ననురేంద్ర సూనుండు, పాలకడలిఁబోలి • పరవియున్న
యగచర వరులపై • సంగదుపై మారు, రాత్మజుపై లెక్క • కడఁగరాక
చిటచిటఁ బెటపెటఁ • జిటిలఁచుఁ టోవు మా, ర్గణముల నేసి సం • గ్రామ భూమి
శరమయంబుగఁ జేసి • సౌమిత్రిపై రామ, విభునిపై బెడిదంపు • విశిఖ తతుల

తే॥ నాటనేసి గర్జించె న • ప్పాట వాని, కార్ముకము మండలాకృతిఁ • గాంచియుండెఁ
గేలుదోయి వడింగాంచి • ఖేచరులును, అనిమిషాక్షంబుగాం గెం • నదిమికొనిరి.

తే॥ లక్ష్మణుండు ప్రత్యస్త్ర బ • లంబుపలన, వాని శరవర్ష మడఁగించి • వ్యర్థపరచె
వెడఁగువాని యసత్యవా • గ్బృందములను, ప్రాడ్వివాకుండు నేర్పున • బ్రాల్చు పగిది.

ఉ॥ ధర్మము కాని హేతువు ను • దారుఁడు రాముఁడు గౌరవించుమన్
గార్ముక మెత్తఁడయ్యె దశ • కంఠకుమారుని పైని ; లక్ష్మణున్
వర్మముబోల్కిఁ గావ నెడఁ • బాయక ప్రక్కన నిల్చియుండె దు
ష్కర్మము సాధుకర్మమును • సంగడిసంగము నాశ్రయింప గన్

ఉ॥ వాఁడి శరంబు లొండొకటి • వారక తాఁకి జ్వలింపుచుండుటన్
మాఁడెను శైలవర్గములు • మాఁడెను చాల్పగఁ గైచి మేదఱన్
మాఁడెను సాగరంబులను • మాఁడెఁ జరాచర జీవరాసులన్
మాఁడెను దానవావళులు • మాఁడెను వానర సైన్య సంతతుల్.

మ॥ శరవర్షంబు నడంచి లక్ష్మణుఁడు పం • చాస్యంబులన్ దెక్కమున్
ముటియల్ సేయఁ గళావిహీన రవినాఁ • బొల్పొంది యింద్రారి య
య్యాకాశంబందున నిల్చి శత్రు బల సం • హారంబు గావించుచున్
మొరయింపెం జన చింద మంగమ మటు • త్పుష్పన్ వెతారించుచున్.

శా॥ చింతంపో త్తిన వాని సంకటము వి • చ్ఛేదంబు గావించుచున్
జంపం బొప్పఁగ లక్ష్మణుండును దను • ష్టంకారముం జేయ నా
నందాశ్రుల్ తొలఁకాడఁ జిర్నగవునన్ • గాకుత్స్థవంశ్యుండు సైఁ
గం జెప్పెన్ భువనంబు లెల్లఁ బగులం • గర్జించి రవ్వానరుల్.

శా॥ జీమూతంబుల డాఁగె రావణి కడున్ • శీఘ్రంబునన్ రాఘవ
స్వామిం గాంచి సుమిత్రపట్టి యితవిం • జక్కాడకే వీడినన్
వేమం బింతయులేక వానరతతిన్ • విర్మూలమే సేయు నీ
పాముం బోలిన క్రూరుఁ ద్రుంచెదను నా • బ్రహ్మాస్త్ర యోగంబునన్.

మ॥ అని పల్కన్ రఘురాముఁ డిట్టులను బ్ర • హ్మాస్త్రంబు సంధించి యే
సిన లక్ష్యం బెదిలేమి లోకముల ని • శ్శేషంబు గావించుఁ గా
వున నస్త్రేయుట పాడిగా దొకఁడై • పూనికన్ జగన్నాశమున్
బొనరింపం దగునయ్య? మానుమన నా • పుణ్యాత్ముఁడున్ మానుడున్.

చ॥ మొఱఁగిన మేఘనాదుఁడును • భూపతి పుత్త్రుల భావనంబు లో
వెలిఁగి విరించనాస్త్రమునె • యేయఁదలంచి యధర్మయుక్తిఁ బా
గఱ యొనరింప నీకరణి • కావని యచ్చట వీడి లంకకున్
వెఱచిన చందమొంది కపి • వీరులు చూడఁగఁ బాఱె నెవ్వడిన్.

చ॥ చదలఁ బుకంబుతోవ వెస • జాఱిన రావణిఁ గాంచి వానరుల్
కదనము సేయఁజంకి తన • కాళ్ళకు బుద్ధి వచించెనంచు స
మ్మదమునఁ గేకిపెట్టి రవ • మార్గము వట్టిన కీశవర్గమున్
బదపడి వచ్చి యాడుచును • పాడుచు గెల్వ వహించె నుద్ధతిన్.

చ॥ చిలికిన పాలసంద్రము • చెన్నునఁ జాలఁ గలంక నొంది కీ
శుల రఘువర్యులన్ దునుమఁ • జూచి విధాతృశరంబు ముష్నగాఁ
దలపడి వీడ గాఁ దలఁచి • దైత్యుఁడు పోవు టెఱుంగలేక యా
జలజ హితాన్వయుల్ దనుజ • సంగతి యేమని సంగరస్థలిన్

తే॥ వాహనంబులపైనుండి • వసుధకు దిగి, తూణ కార్ముక కవచముల్ • తొలఁగి విశ్ర
మంబు గొనిరి వాటి పవిత్ర • మంబు మెచ్చి, చదలనుండి వేల్పులు పూలు • చల్లినారు.

తే॥ కపుల కోలాహలము వింటిఁ • గలఁత వెట్టు నచట నుండుటకును విఘ్న • రారి తొడఁగి
నలువశర మేయుటకు సహ • నంబుసేయ, లేవివాసక్కై వడిఁ గ్రుంకె • భానుఁ డపుడు

తే॥ అగ్గలిక బవరము వేసి • యలసియున్న. దళములకు వలసిన యంత • కుడుపు లేదు
కడుఁకఁ దెప్పింపుమా విభీ • షణ? యటంచు. జానకీజాని చేసె నా • జ్ఞాపనంబు.

తే॥ చిత్తమని తగువారలఁ • జేర్చికొనుచుఁ, గదలి దాఁటచనియె నొక్క • గడియలోన
ధాతృకుల కలశాబ్ధి చం • ద్రముఁడు; పిదప, రామచంద్రుండు లక్ష్మణ • స్వామిఁ గాంచి.

తే॥ ఒనర దివ్యాస్త్రములను వి • ధ్యుక్తవిధుల, నర్చనముసేసి యేయుట • యంచితపగు
నరిగి వచ్చెదఁ బూజకు • నంతదనుక, సైన్యములఁ గావుమని వన • స్థలిని వీడె

తే॥ జనకుఁగని యింద్రజిత్తాజి • జరగుటయును, వారు బ్రహ్మాస్త్రమును విడు • వంగనుంట
దెలుప విశ్లేష్టుఁడై చేయ • దలఁచినట్టి, కార్యమెదియని తనుఁ దశ • కంఠుఁ డడుగ

తే॥ చంపనెంచిన శత్రులం • బంపఁ బలను. గలుగ మానరుపంచు వి • జ్ఞులు వచింత్రు
అట్లుచేయుట మానపు • లరియరాతి. నలువశర మేయఁబూనితి • నయముతోడ.

ఆ॥ వార లెఱిఁగిరేని • ప్రత్యస్త్రమున నడఁ. గింత్రు చంప నిచ్చ • గింత్రు వేల్మి
చేసి మఱుఁగునుండి • చెదు తిమోదబల జీ. వముల శమములోనఁ • బాపు టురవు.

క॥ నను వారు మఱచునట్లుగ. దనుజ నికర మంపుదేవి • తరువాతనె నా
పని తడలేు ముగియునన. సవియె మహోదరునితో ద • శాస్యుండు వెసన్.

క॥ ఘోరాకారులు త్రిశూల. ధారు లకంపనుని దొట్టి • దైత్యగణముతోఁ
బోరికిఁజని నర వానర. పీరుల జీవములఁ గొల్ల • పెట్టుము కిదివిన్.

తే॥ గొప్పమాయలు పన్ని ర • క్షోగణమున. కిమ్ముగాఁగ గాఢాంధకా • రస్తుగూర్చి
సంగరస్థలి రామల • క్ష్మణులఁ గూల్చి. నాకుఁ దోడ్పడి పెక్కుమె • న్నలఁగొనుమ.

తే॥ అనడుఁ ఎన్నెప్పుడంపునా • యనుచునుత్స. హించుచున్న మహోదరుఁ • డెక్కెఁదేరు
కొండఁజుట్టిన గౌరుల • కొమరు దాల్చి. సోఁకుమూఁక దైత్యాన్వయుఁ • జుట్టి పెడలె.

## మహోదరుని యుద్ధము

తే॥ కన్నమేరి దూరము కరి • ఘటలుపోయెఁ, బరుగువాతెఁ దేరులు లెక్క • పక్కలేక
త్రోప యశ్వమరాంబయి • తోఁచె సుభట, పఙ్గ్మా నేలయీనిన • పగిది నుండె.

తే॥ సాధనములను నిశితదం • ష్ట్రిలను భూష. ణములు వెన్నెల లెందలు • క్రమము చెడక
కాయఁ గోడెల గుంపుల • కరణి నడచె, దైత్యగణములు కలనికి • ధాత్రి యదర

తే॥ క్రిక్కిఱిసిన చెక్కెంబుల • నిక్క గగన. మెల్లఁగప్పెను గాలిక • మెల్లఁ గదలి
జలధిములు పలవల రాలఁ • గలఁచిపైచె. నజుని కన్నులఁ గప్పెను ౦జము రేఁగి

తే॥ ద్విరదపర్వతములనుండి • దిగుచునుండు. మదయురంబులుహయ ఫేన • సహితములయి
వెడలి యడవుల తరుశిలా • వితతిఁ ద్రోచి. కొనుచుఁ బాటి కలిపోయె • వనధియందు.

క॥ మెఱపులు మెఱసెను పెదవులు, గొఱుకు కఱకు సోఁకుమూఁక • కుడిచేతులలో
నెఱసిన యాయుధములు నెఱిఁ, గఱకఱ మిడుఁగుఱుల రాల్చి • క్రందుకొనంగన్.

తే॥ అసురవిభుఁడు పంపిన చతు • రంగ బల గ. ణంబు లంకాపురంబు ద్వా • రంబుమెల్ల
వెలివిడుట చూడఁ దొల్లిన • బ్ధిజలమెల్లఁ, ద్రావి తఱిచూచి వీడిన • తపసిఁబోలె.

తే॥ శంఖ కాహళ భేరికా • స్వనము వీర, వినదమును గుఱరుతి రథ • నేమిరవము
గీఁకలును సకిలింపులు • కెరలి లోక. గర్భవలె నదంచికొనె జ • గంబునెల్ల.

ఉ॥ సేనముమ్మరముగఁ గలను • చేరెఁ బ్లవగబృంచమున్
బూని యతిశయించి డాసెఁ • బోరుసేయ దైత్య సం
తానమేయు నంపగములంఁ • దరుల గిరుల నద్దుచున్
వానరాలి కివిసి కెరలి • వారి కడఁక మానిచెన్.

ఉత్సా॥ శిలలను గుఱిచూచి వైచి • చెలఁగు కపుల జాతికిన్
నలుగు రైదుగురుగ నలఁగి • నాశమైరి రక్కసుల్
కలభములు గుఱాలు గూలెఁ • గలుకు సోఁకు కైదువుల్
మలయదాఁకఁ గీశచయము • మడిసి పడియెఁ గుప్పలై.

ఉత్సా॥ పరశు శూల ముసల భిండి • పాల దండ వలయము
ద్గర ముసుంఢి కుంత ఘన గ • దా వృషత్క పాశ తో
మర వికాయములను మించి • మర్కటములు వైచు పెం
దరుల గిరుల నుగ్గుచేసి • ధటిఁ ద్రోచెఁ గీశులన్.

ఉత్సా॥ మెఱుఁగు టాయుధముల నొడపు • మీఱ వైవఁ బ్లవగముల్
కలఁకు నోఁకు మూఁక యెదుటఁ • గడఁగి నిలువ నోపమిన్
వెఱచి పాఱె రక్త నదులు • పీన్గు తిప్ప లడ్డమై
తఱుమ వీలు గాకపోయె • దైత్య జనుల కయ్యెడన్.

తే॥ సమర భూమిని మరణించి • యమరభూమిఁ, జొచ్చి వేలుపులైన కీ • శులను గూడి
చిర మభిలషించు కోర్కులు • చల్లెననుచు, నలమికొని తిరిగిరి మేన • కాదు లెలమి

తే॥ క్రూర హింసయే నైజమౌ • గుణము గాఁగ, ధర్మమార్గంబు ద్రొక్కని • దనుజవరుల
మేటి సురలుగఁ జేయ నౌ • మిత్రిశరము, కంటెఁ బావన వస్తు వౌ • క్కండు కలదె?

తే॥ విక్రమంబున నూర్మిళా • విభుఁడు దురము, సలిపి యామ్యాస్త్రమున దైత్య • సంఘములను
స్వర్గమున కంపి నచ్చట • స్థలములేక, వింగియెల్లను వారలై • విండినారు.

## ఆంజనేయుండు కుంభకర్ణుని వజ్రదండము గొని దైత్యుల నుఱుమాడుట

క॥ అమరులఁ బఱిపిన యది లో • కముల నలఁచినదియుఁ గుంభ • కర్ణునిచేతన్
సమరముల వెలయునది యగు. సువహిత దండమును వాయు • సూనుఁడు గొనియెన్.

ఉ॥ మేరు సమానధీరుడు స • మీర కుమారుఁడు వజ్ర దండమున్
దీరుగ హస్తమందున గ • దించి మహోద్ధతి విక్రమించె దు
ర్వార కృశాను రేతుఁడొ ప్ర • భంజనుఁడో లయకాల రుద్రుఁడో
వారని కోప భీకరత • వచ్చిన కాలుఁడొ యన్న కైవడిన్.

క॥ వీరుల శీర్షంబులపై, వారణ కుంభముల మీఁద • వారువములపైఁ
దేరులపైఁ జెలరేఁగెను, మారుతి యెల్లెడలఁ దాన • మలసి హరిక్రియన్.

క॥ అదరిన వారల నగ్గము, పడువారల నలఁచి త్రొక్కి • బవరపునేలన్
గదు బీభత్సం బొనరిచి, పొదవడఁచెఁ ద్రివిక్రమేశు • పోల్కిఁ జెలఁగుచున్.

చ॥ కమల శిరంబులం జెదరి • కాంతులు చిందిన మౌక్తికంబులన్
దిరమగు మేని కళ్కు వడి • జేర నభంబును దాఁకు నున్నతిన్

బిఱఁగె మరుత్సుతుండు లయ • వాయువు వీవఁగ ఋక్షజాలముల్
లిరిణి విధుండు సంతతము • తారెడి మేరుపుమాడ్కి నొవ్వుచున్.

చ॥ బలితపుఁగేల పిండమును • బాథముగా ధరియించి మేదినిన్
బలముగ మోఁదు చాద్పునను • బాఁదుచు దైత్యులు చాఁపకట్టుగన్
వలఁగి ధరిత్రిఁ దాఱఁగ గ • ణంబులుగా రథ దంతి వాజులన్
నలినలి నజ్జు నజ్జుగ నొ • నర్చి చలం బెసలార గర్జిలెన్.

క॥ నదులైన శోణితంబున, మద గటముల బురదచేసి • మారుతి కాలన్
మదయుతులం దాటించుచు, మదమెత్తిన దిగ్గజంబు • మాడ్కిం దిరిగెన్

ఉ॥ కోడెల చంద మొందిన రథ • కుంజర వాజుల మీఁద వచ్చుచున్
బోఁదిమి చూపి పెక్కురణ • ముల్ పొనరించి జయేందిరా సతిం
గూడిన వారిఁగాన్ దనుజ • కోటుల దండముతోడ మోఁది యిం
కేడది లంక లంకె యని • యేత్తెఱఁ బంపెను స్వర్గ సీమకున్

సీ॥ ధానుషత్ర కుముద నీల • పనస జాంబ, వద్గజాంగ దాములు రబా • వనిని చొచ్చి
దైత్య సేనాపయోధిలోఁ • దవిలి యీఁదు, చుండి రెఱుఁగక రమలోన • నొకరి నొకరు.

తే॥ లెక్కలేని రక్కసులను • పక్కనంత, వఱకు దుక్కిదుమారంబు • నెఱయఁజేసి
యుగ్ర నరసింహుక్రియ రేఁగి • యున్న గాలి, పట్టి యారణాస్తరి నకం • పనుని గాంచె.

హనుమంతుఁ డకంపనుం జంపుట

తే॥ గాడిదలు వేయిపూన్చిన కనకరథము, పైని విలుపూని వెలుఁగొందు • దానవుండ
కంపనుఁడు పూర్వమున జగ • త్కంటకుండు, తారకుండు కుమారుచే • దోరినతఁడు.

తే॥ ముగురు మూర్తుల మహవుండు • మొనసివచ్చి, తాఁకినను ప్రాణములఁగొను • దంట తనమూ
గలుగు నీకోఁతి కనుచు న • కంపనుండు, వీనిఁ దెగటార్పఁగా నేది • వెరవటంచు.

తే॥ అడ్డుపడకున్నచో రాక్ష • సాంతకుఁడయి, వసుమతి నదైత్యముగఁ జేయు • వాఁడు వీఁడు
చంపవలయున యనుచు న • కంపనుండు, దర్పమున నంపవానతోఁ • దారసిల్లె.

తే॥ మొగులుతో నగ్గియును గాలి • తగులుపగిది, బలముతో నకంపనుఁడు త • న్నలమునంత
వజ్రబాహుండు మారుతి • వజ్రదండ, మమరఁద్రిప్పెను దనుజ మ • ధ్యంబునందు.

ఆ॥ అసురు లేచి యేసి • విసరి పొడిచి త్రెంచు, వీరసాధనములు • విఱిగిరాల
దనుజ తనువు లిరల • దండంబు ద్రిప్పుట, హనుమ కపుడు చాల • నలవుపడియె.

ఆ॥ విలయ పవన హతికి • వీఁగని మేరువు, కరణి నిలుచు హనుమ • కఱకునోఁకు
మూఁక చూచుచుండఁ • బోకార్చెఁ దుంగమా, తంగ తురగ రథ క • దంబకముల.

ఆ॥ నేఁడు వీని సురల • నెలవున కనిపి రా, ఘవుల నోర్చి పంక్తి • కంధరునకు
జయము గూర్చి యమర • జాల కష్టమ్ముల, విలువవాఁడ ననుచు • నిక్కి యసుర.

ఆ॥ కటము లదరఁ బండ్లు • పటపటఁ గొఱుకుచుఁ, గనులఁ బొగలు నగ్ని • కణము లురల
రథము తోలఁ బంచి • రాక్షస వీరుండు, హనుమఁ జేరుచుండ • నతఁడు డాసె.

ఆ॥ పిడుగు గముల యట్లు • మిడుఁగుఱుల్ కెలఁకుల, రాల్చునవి సురాళి • రక్తములను
చవి యెఱింగి నట్టి • శరరాజముల నకం, పనుఁడు హనుమ యురము • పగులనేసె.

ఆ॥ వాతనెత్తు • రొలుక వాయుపుత్త్రుఁడు సొమ్మ, సిల్లి యించుకంత • సేపులోనఁ
దేఱి శిరితోడ • సారథిఁ జదిపిఁగా, డిదలఁ ద్రొక్కి త్రొక్కి • ప్రిదుల నలఁచె.

ఆ॥ వీనితోడఁ బెనఁగి • వింటితో గెలుపట, కడిఁది యనుచు నయ్య • కంపనుండు
విశ్వకర్మ యొనఁగు • వీరదండము కేలఁ, గొనుచు దూఁకి డాసె • హనుమపైకి.

క॥ ఇరువురుఁ గుడియెడమలుగాఁ, దిరుగుచు డాయుచును బొంచి • తెగువగు పెరవుం
బరికించుచుఁ బాయుచు బడిఁ, దఱియుచు దండములతోడఁ • దాఁకిరి పెలుచన్.

క॥ తడవిరి తట్టిరి విక్కిరి, యడఁగిరి ప్రేసిరి తొలంగి • రార్చిరి భుజముల్
మడిచిరి విడిచిరి పొడిచిరి, కడిమిని ప్రకటించి సమము • గాఁ బోరిరొగిన్.

తే॥ కల్లతోవైరముంగొన్న • గాడ్పుపట్టి, యంజనాద్రితోఁబగగొన్న • యసురయురముఁ
దాఁప దండంబుతో దానిఁ • దట్టవైచెఁ, గాని వల కేలు తునిఁగి రం • గమునఁబడియె.

తే॥ తలరియును పిఱుతివియక • దైత్యుఁడంత, నెడమచేతఁ బావనిఱొముఁ • బొడిచెఁ బొడువఁ
బోటు వజ్రగిరిం దాఁకు • వాటమగుచు, దనుజు కేల్నొచ్చె మారుతి • కినిసి రేఁగె.

ఉ॥ దండధరాభుఁడౌ హనుమ • దండధరుండయి విస్ఫుర ద్భుజా
దండ విహీనుఁడై కరము • దండ విహీనత నుంటఁ జూచి యు
ద్దండ భుజాంతరంబు భుజ • దండముచే వడిమోఁద దైత్యుఁడున్
గండలతోడ శోణితము • గ్రక్కను త్రాగుచుఁ గ్రక్కు కైవడిన్,

తే॥ పిదప నాచేతితో గూబ • లదరమోఁది, వాని వీరనాకమునకుఁ • బంపునంత
హనుమనిం గని సింగముం • గనిన హరిణ, వితతి యట్టు లసురసేన • విరియఁబాఱె.

పంచ॥ అకంపనుండు గూలఁగా సు • రారిసేన మ్రాలఁగా
అకంపితాంగులై ప్లవంగు • లార్చిపేర్చి యాడఁగా
నకాలకాలుఁ బోలి లక్ష్మ • ణాఖ్యుఁడేయు తూపులన్
వికావికల్ గడించిపాఱె • వీరదైత్య సంఘముల్.

## మారుతి లక్ష్మణుని వెదకుచుఁబోవుట

తే॥ ధీరుఁడగు లక్ష్మణుని వింటి • నాతిమ్రోఁత, వినని కతన నెవ్వరి కేమి • హీనరెనొక్కొ
కదనరంగఁబునందని • కరువలి సుతుఁ, దెడఁదఁ దలఁచి కొందలమందె • వింత్రపడియె.

తే॥ దితిజసేనలో నాగ్నేయ • దిక్కునుండి అంగదుం డేడు యోజనా • లరిగియుండె
వాని జ్వాల మండెను • భానుమానుఁ డతని కాంతి లక్ష్మణుఁ • డరయుచుండె

తే॥ ఒకరికొకరికి నాలేసి • యోజనములు దూరమయ్యెను కపులకు • దురమునందు
నీటిపైఁ బాఁచిన సేన • వెగిడ లక్ష్మ ణునకు హనుమకు మూఁడు యోజనములుండె

తే॥ లక్ష్మణాఖ్యవిగను నది • లాఁగి తన్ను పురికొల్పఁ జండమారుత • నరణిఁ జనుచుఁ
జింత వీడంగఁ దగు యుద్ధ • చిహ్నములను క్రొవ్విటిని గాంచి మారుతి • కొంత దనిసె

తే॥ దంతి దంతముల్ ఛత్రబృంద • ములు రత్న హారములు ఫేనవలెఁ ద్రుళ • నాయుధముల
కలిసి పరువిడుచుండు ర క్తప్రవాహ • ములను గాంచెను హనుమ యా • స్థలములందు

ఆ॥ ముట్టిపోరు పగఱ • మూఁకపై వైచిన శరచయంబు శీర్ష • సమితితోడఁ
జదలఁజేరి మరలఁ • జెదరి శిలావృష్టి పగిదిఁబడుచు నుండు • వానిఁగాంచె

ఆ॥ దనుజులేయు నాయు • ధములు లక్ష్మణశర క్షతివలన విఱిగి • రక్తధరవము
తోడ ఋక్షచయము • దొరల్ను చందానఁ బ్రభలతోడ నురలి • పడుటఁగాంచె

తే॥ ఎడపడక సుమిత్రాసుతుఁ డేయు విశిఖ బృందమెల్లెడఁ దామయై • బేఁకంటి
ఘన జటామండలంబనఁ • గ్రాలువాని నంజనాసూనుఁ డయ్యెడ నరసికాంచ

తే॥ మేనిపై రక్తధారలు మేపుకొనఁగ నంధతమసంబు రేయిరా జని యెఱింగి
కాలమెత్తిన దీపపుఁ • గంబములనఁ దనరి తిరుగుచున్న కబంధ • వనముఁగాంచె

ఆ॥ పీఁదవరులు మడియఁ దేరులు కరులును హరులుఁ గాళ్లు నొవ్వఁ • బరుగువాఱి
రక్షలేని రాజ రాజ్యమందలి ప్రజ వలె నశించుచుండు • వానిఁగాంచె

తే॥ అతిశయంబుగ లక్ష్మణుఁ • డడరి పోరిఁ గలనఁ గూలిన క్రూరరా క్షసుల రక్త
సాధన శరీర తతులను • సాగరవన పర్వతంబులఁ బావని పరఁగఁ గాంచె

తే॥ విలయవాయువువలె నేగి వెదకి రుధిర వాహినుల దాఁటియందక టాహ మగచె
నగలె ననఁదగు సౌమిత్రి • యల్లెనాదు విని ముదంబున హనుమ గ • ర్జనము సేసె

ఆ॥ ఎల్లవారి సేమ • మెఱుఁగంగ నగునని హనుమ డాసి వినతుఁ • డైనయంత
విజయశీలి రాజ వీరుండు సౌమిత్రి యెలమిఁ గౌఁగిలించి • యిట్టులనియె

ఉ॥ ఎక్కడ నున్నవారు కపు • లెక్కడ నుండె దినేశ పుత్రకుం
డెక్కడ వాలి ముద్దుకొడు • కెక్కడ తక్కినవారు సేనలో
నొక్కటియేని యేమెఱుఁగ • నొయ్యన మారుతి! తెల్పుమయ్య యె
య్యెక్కడ నేమియేమి ఘటి • యించె వినంగఁదలంతు నెవ్వడిన్

తే॥ రణముఁబోలెనైంద్రవ్యాక • రణము దనుజ గణమ్ము భూవరణము మేర గాంచుహనుమ
యతని పలుకులు విని యిట్టు లను దురాన నొక్కరొక్కరు గానరు సుంత యనునిజమ్ము

తే॥ తెలియఁదగును పాశుపతంబొండు • గలదు నీవు చెయఁదగుదు రక్కసుని మాయ • చేతలెల్ల
దొడరి పాశుపతమ్మునఁ • దొలఁగఁదోల నీదు సేవకులెల్లరు • విన్నగాంత్రు

తే॥ అనదు సౌమిత్రి లెస్సయౌ • ననుచు శ్రీరామవిభునిమది బ్రణుతి శరమును • నింట గూర్చి
పాశుపతి మంత్రము పఠించి • పాపులపయి నేయ నయ్యస్త్రరాజము • జేయమగుచు

తే॥ అదరి పెదరుటడిఎఁ గాల్చు • నగ్నివోలె నెదుఁబడు వస్తువులతోడ • నెల్ల దనుజ
గణము పీడకొఁ తుంపములోఁ గాల్చునై చెఁ దొలఁగఁ గాలిపోయెను కపులకుఁ గలఁగువడఁగ

తే॥ పాశుపతముచేఁ దనుమాయ • నాశమందు చెడఁగి యమ్మహోదరుఁడవి • యుఱఁగుపడయె
భ్రమము తొలఁగంగ సకలంబు వరెగు లలరి పాదుచాదుచు తిమ్మటాఁ • గూడినారు

తే॥ కపులలో నెవ్వరును నొవ్వ • గాంచకునికి శంకవిడి సౌమిత్రి హ • ర్షమ్మునొందెఁ
జుట్టి యార్చిరి ప్లవగులు • ఱువ్వకతమీఱ సురలు ఎరులును కురిసిరి పూవులేక

క॥ దూతల్లు దశకంఠునకున్ వీత్తులగుచుఁ దెలుపనతఁడు • విజయమ్ముగ యైన వి
ఖ్యాతమగు పాశుపతమున నా తెలుఁగయ్యెనని పలికె • నగుఁగా కనుచున్

క॥ తనయునకుఁ దెలపుఁడన నే • చని వారలు తెలుప నతఁడు • చకితుండగుచున్
హనుమఁడు విభీషణుఁడు రవి • తనయుండినకులజు లెచటఁ • దగిలి రనంగన్

ఉ॥ రాముఁడు సంగరస్థలికి • రాఁదొకకొండను చేరినాఁడు మా
యా మహాముండు వీడు ఎన • యయ్య ఘనాటుల శోగిరంబుకై
యామహీ దాఁటిపోయెఁ దర • మేశ్వరు వస్త్రము వీడు మున్నుగా
వ్యోమమునందు దాఁగెను మ • హోదరు డియ్యది వార్త నాపుడున్

చ॥ ఇది యదనంచు నెంచి దను • జేంద్రసుతుం డొకమట్టిఁ జేరి యా
పదపడి బ్రహ్మరక్షసులు పట్టగఁ బోర్వఁడ బావి వేలిమిన్
ఒడగులు నేయి నూవులను • చియ్యయు నల్లని మేక నెత్తురుం
జిదుముచు శాస్త్రయుక్తముగఁ • జే మొగించెను శ్రద్ధపెంపునన్

తే॥ దహనకీలలు మంచిగం • దంబుతోడ వలదిరిగి శుభసూచన • వఱలఁజేయ
సహజ దుర్గుణనిధి యగు • శక్రజిత్తు జయము మనదని కడు సంత • సమునఁ దేలె

క॥ మాయావిమేటి శంబర మాయం బచరించి గగన • మార్గమ్మున దై
శేయులె కనరాకుండఁగఁ బోయి యడఁగె మొగుళులందు • పొంచి యదనుకై

క॥ అత్తఱి మహోదరుం డొక క్రొత్త మతక మూని యింద్రు • కోలము గొని యు
న్మత్త చతుర్దంతి పయిన్ మొత్తము వేలుపులఁగూడి • మొనసెను పోరన్

క॥ దనుజు లమర వేషంబుల మనుజులతో వనచరేంద్ర • మండలముఁలతో
నని సేయఁ దొడఁగ భీతిలి కనుకని సైన్యంబులెల్ల గడగడ వడఁకెన్

క॥ వెలిగొరు నెక్కి యింద్రుఁడు, వెలలె రణముసేయ మునులు • వేల్పులు మనతోఁ
జలమూన హేతువేపని, మలఁగిరి వానరులు దిగ్భ్రి • మంబునఁ గంఁకన్
క॥ రాముని తమ్ముఁడు హనుమని, మోముంగని మునులు సురలు • మోహరమున రా
నేమి కొఱగామి జరగెనొ, సామీరీ! తెలుపఁగలవె • శక్యంబేవిన్.

## ఇంద్రజిత్తు లక్ష్మణాదులపై బ్రహ్మాస్త్ర మేయుట

క॥ అని యడుగుచుండు తఱి రా, వణి నిర్మానుషము నిష్ప్ల • వంగం బగుఁ గా
కని బ్రహ్మాస్త్రం బేసెను, కని వేల్పులు మనములందు • కళవళపడఁగన్.
తే॥ పులుఁగులట్టులు వెలుఁ గుల • యలుఁగుగములు, లక్ష్మణుని మేననాట వి • ల్వరముతప్పి
తెలివి తొలఁగంగ మత్తేభ • మిలను పడిన, చందమున సౌమిత్రిసిల్లి ఘా • స్థలినివ్రాలె.
తే॥ ఇంద్రుఁడిట్టి యకార్యంబు • నేలచేసె, వీని నేనుఁగుతో నెత్తి • వినరివైతు
ననుచు లేచిన హనుమపై • నలుఁగు లదర, నలుగులంపడి యాతండు • నవనివ్రాలె.
తే॥ కనకగిరియందు మోదుగు • ననిచినట్లు, నెత్తు రొడలెల్లఁ బరవంగ • నిశిత సాయ
కములు నాటుటచేఁ దెల్వి • కలఁకవాఱ, నెలవు దప్పి భాస్కరసూతి • నేలవ్రాలె.
తే॥ పిడుగుపాటుచే మగసింగ • ముడిగినట్లు, బొలుపుచెడి వాలిసూనుండు • పుడమివ్రాలె
జాంబవంతుని కనుల వ • క్షమునఁ బెక్కు, కోలలంట నాతఁడు రణ • క్షోణినొఱఁగె.
తే॥ వేయిశరము లురముచొచ్చి • దూయునంత, నలుఁడు సమవర్తి ముఖవర్మ • నంబుచేసె
ముదితుఁడై వచ్చి యనుఁడు కు • ముదుని పిల్వ, నాతఁ డాతని వెనువెంట • నరిగినాఁడు.
సీ॥ ఋషభుండు స్వర్గపు • రింజేరె నీలుండు, రంభతోఁగూడంగ • రాజ నేగెఁ
బెద్దనిద్దురచెందె • వినతుండు మైంద ద్వి. విదులు నాకముచూడ • వెడలినారు
కేసరి యిహమును • వేసరి వీడెను, గవయుండు భూమిని • కౌఁగిలించె
శతబలి శతమఖు • సన్నిధి కరిగె సు, షేణుండు కైలాస • శిఖరిఁజేరె
తే॥ గంధమాదనుఁ డూర్వశిఁ • గంఁయనేగెఁ, దక్కి వానరులెల్ల న • స్త్రములు గ్రుచ్చఁ
బ్రజ్ఞచెడఁగఁ బ్రాణంబులఁ • బాసినారు. వజ్రివైరి బ్రహ్మాస్త్రంబు • వైచుకతన
తే॥ దేవసుందరుల్ వ్రాలి ని • ద్రించుపోల్కి, భూమిపైఁబడ్డ ప్లవగ స • మూహమపుడు
క్రమ్మి రక్తమెల్లెడలఁబ • ర్వఁగఁ బ్రవాళ, వనముగలఁ క్షీర వారాశి • పగిదిఁదోఁచె.
తే॥ కపులు స్వర్గంబుచేర వే • లుపులు గాంచి, యతిథిపూజ లొనర్చి య • నామయంబు
లడిగి యలరించి పదపడి • యవని కిపుడ, పదఁడనుచు వేగ బలవంత • పఱచినారు.
తే॥ అర్చనంబు చేసితిరి బ్ర • హ్మాస్త్రమునకు, మీరు మరణింపఁదగినట్టి • వారుకారు
రామదాస దాసులును క • ర్మములఁగట్టు, పడక స్థిరముక్తి వరియించు • వారు నిజము.
శా॥ మాకార్యం బొనరించుపొంచె భువి జ • న్మంబందియున్నారు మీ
రా కాకుత్స్థుని తోడు వీడకుఁడు మీ • ప్రాణంబె మాప్రాణమున్

మీకే హానియులేదు రాముకొఱకై • మీ జీవముల్ వీడుటన్
మాకు న్నాయకులైతి రాకతన మా • మర్యాదలం బొందుఁడీ.

మ॥ అనివారల్ పరిచర్యచేసి రిట జ • న్యక్షోణి సౌమిత్రి కా
నన సంచారులతోడ నీల్గె ధరజా • నాథుండు రాఁడయ్యెఁ దా
మనఁగా నేర్పునెయంచు నింద్రజితుఁ డు • న్మత్త ప్రలాపంబుతోఁ
జని లంకేశున కంతయుం దెలుప నా • శంకించి వాఁడిట్లనున్.

ఉ॥ రాముఁడు చావలేదు గద • రా జయమెట్లగు నీకు నన్న ను
ద్దాముఁడు మేఘనాదుఁ డనుఁ • దండ్రి! భయంబున రాఘవుండు సం
గ్రామధరిత్రి వీడె నెటు • గాంచినఁ దమ్ముఁడు మిత్రవర్గమున్
భూమిని కూలియుండఁ గని • బోఁడిమి నిల్వఁగలాఁడె దిట్టయై?

తే॥ అని సమాధానపఱచి లం • కాధిపతిని, తనగృహంబునకేగె రా • వణి మహోద
రుండు తన యింటికేగె వీ • రుండు రామ, భూవరుఁడు వేఱుచోఁ బని • పూనియుండి

## శ్రీరాముఁడు మరలివచ్చి పౌలికలనిం గాంచుట

మ॥ కరపంకేజము లెత్తువాఱ నిలుకన్ • గల్పోక్తరీతిన్ మహ
శరజాలంబులఁ బూజసేసి యవలన్ • సంగ్రామ రంగంబు గాం
చ రహిన్ జీఁకటిఁ దోలఁ జేకొఱవిగా • శోభిల్లు నాగ్నేయమౌ
శరముం గైకొని వచ్చి కాంచెఁ గలనన్ • సైన్యస్థితిం దత్తఱన్.

చ॥ శవమయమైన రంగమున • సంశయ రోష విషాద దిగ్భ్రమల్
మివులఁగ నొక్కటొక్కటిగ • మీఱఁగఁ గాంచుచు రక్షణంబునం
దవులక యప్రమత్తులయి • తారియుఁ దాటిన కీశరాజి రా
ఘవుఁడట నొక్క నొక్కనిగఁ • గాంచె మహాకులి కీక్షణస్థితిన్.

శా॥ సుగ్రీవుం దన కన్ను దామరల వ • శ్రుల్ గాఱ వీక్షించి యీ
ప్రగ్రీవంబిటు వ్రాలఁగాఁ దగినదే • భావింపఁగా నంచు న
వ్యగ్ర స్వాంతముతోడ నవ్వలన వి • ద్వద్వంద్య భక్తావన
ప్రాగ్రీయున్ శ్వసనాత్మజుం గనియె నే • త్రంబుల్ కుమారిల్లఁగన్.

మ॥ వనధిందాఁటి నిశాచరావళుల గ • ర్వక్షోభముంజేసి యా
జనక క్ష్మావిభు పుత్త్రి సేమమును వి • జ్ఞాపించి నాప్రాణముల్
తనియంజేయుట యిట్టులౌటకో? మహా • ధన్యాత్మ! నీవశమున్
దనుజ క్రూర శరంబు దూసి చనియెం • ద్రాఁచోర్చె నాగాంతకున్.

మ॥ మును బ్రహ్మాద్యమరుల్ మునీశ్వరులు స • మ్మోదంబుతో నిచ్చు దీ
వనలున్ జానకి యిచ్చు దీవనలు ని • ర్వ్యర్థంబులై బీటఁబో

సిన బీజంబుల చందమై చెడియె నన్ • సేవించి నాకొందు విం
దను పాపంగలవాఁడనై పడితె నా • దౌర్భాగ్య సంపత్తిచే ॥

శా॥ రాజ్యాంతే నరకం ధ్రువ మ్మనెడి వా • క్యన్నెగ్గియున్ లోభినై
రాజ్యాకాంక్షను తండ్రిఁ జంపుకొని యా • రణ్యంబులం ద్రోచ్చియున్
బూజ్యుండైన జటాయు జీవముల నేఁ • బోకార్చితిన్ బ్రాభవ
ప్రాజ్యశ్రీ నను బొందునే ? యధిక దౌ • ర్భాగ్యుండ విక్రాంబుగన్

ఉ॥ అన్నను చంపి తమ్మునకు • నాదిపిరాజ్య మొసంగినట్టి యే
నెన్న సమస్తముం జెఱుప • నెంచిన వాఁడన యైతి మీకిలన్
బన్నము గూర్చితిన్ భువన • భారముగా బ్రదుకంగఁబుట్టితిన్
బన్నగ నంచు నవ్వరికిఁ • బాలఁగఁజూచె మనంబు కందఁగన్.

మ॥ వృషవరంబునఁ గోదెపూచిక్కఁ దనుపై • వీక్షింప నొప్పారు హ
ర్యృషభున్ వాలికుమారుఁ జూచి కడు స • ర్వేపించి దెందంబునన్
విషముం దిన్న విధిం దపించి యిఁక నే • విల్లంది విల్చుండి యి
వ్విషమావస్థను మాన్పలేనయితి నా • విక్రాంతులం గాల్పనే ॥

-:శ్రీరాముడు లక్ష్మణుంగని పరితపించుట:-

ఆ॥ అనుచు నవలికేగి • యట సంపశయ్యపై, వీఁగ గములు మేన • మూఁగు కరణి
విశిఖతతులు గ్రువ్వఁ • వశమతి యహివాయి, పగిదినున్న తమ్ము • నౌగిలికాంచె.

ఆ॥ ఎదఁద యుడికెనౌదలు • వడఁకెఁ బిడుగుపాటు, వలనఁగూలు తరువు • పగిచిఁ బడియె
గడియదాఁక మూర్ఛ • విడువఁ దేమెఱుఁగఁడు, కాలుచేయి పనులు • కదలలేదు.

ఉ॥ తమ్ముని కౌఁగిలించికొని • ధారణి వ్రాలిన తన్ను నెమ్మదిం
గొమ్మని పల్కువారలును • కొందఱుమందకు మన్న వారలున్
లెమ్మని పల్కువారలును • లేరొక మిత్రుఁడుఁ బ్రాణయుక్తుఁడై
యమ్మహి లేఁడ యొంటి జని • యాఁగవ నెవ్వఁడు తీర్చువాఁడొకో ॥

ఆ॥ మొండెములు పిశాచ • ములు భూతములును న, క్కలును పతుల వెదకు • కామినులును
మిగిలియుండెఁ గాని • మేనఁ బ్రాణముఁ గన్న, వాఁడొకండుఁ గాన • రాఁడు కలన.

ఆ॥ అమరసతులు వగచి • రమరులు వెగచిరి, మహితజగము విష్ణు • మయముగాన
రాము చింత గని చ • రాచర తతియేడ్చె, నేద్వకుండు నెద్ది • యిహమునందు ॥

ఆ॥ నలువ మోము వాడెఁ • దలవ్రాల్చెఁ బశుపతి, బంధుచింత దెలిపి • ఫలముగలదె •
పగయు వెక్కియేడ్చెఁ • బాపదేవత యేడ్చె, దుఃఖమయముగాఁగఁ • దోఁచె జగము.

ఆ॥ ఇంచుకంత తెలివి • నెనసి శ్రీరాముండు, కనులు తెఱచి యనుజుఁ • గాంచి కాంచి
దివముఁజేరె నింకఁ • దిరుగఁ దనుచు నెదఁ, బొగిలె నొగిలెఁ గ్రుంగె • బ్రుంగె వ్రంగె

చ॥ ధరణిఁ దృణంబుగాఁ దలఁచి • తమ్ముని కిచ్చితి దండ్రి మాయచేఁ
దెరలకయుంటె జానకియు • దెప్పరమందఁగ నోర్చియుంటి నౌ
క్కరుఁడవు నీవుగల్గిన సు • ఖమ్ము నను సమఁ గల్గునంచు నీ
కరణిని నన్ను వీడి చనరా • గాఁదగునే విను వీడియుండునే॥ ౫౬

ఉ॥ తల్లియుఁ దండ్రియుం దనమఁ • దమ్ముఁడుఁ బుత్త్రుఁడు నేనవదారి నా
కెల్లను నీవకావె॥ యెదిగ్యేగిన నీవు విభాఁడవంచు నా
యుల్లమునం గుమారిలక • యుంటి నను నమ్ము నేఁడువోయె న
న్నొల్లవ యేమి॥ కాదు కడు • నుద్ర కలా కతనొత్తు దేనెకొ॥

చ॥ ప్రణమయమైన కాలమునఁ • బ్రాణముఁ గానము చావకుంటి నా
కణఁక యదెట్టిదైన నగుఁ • గానల నన్నుభజించెకషములో
తొణ రక యోర్చి ఘోరమౌ తూఁగును మానక దీరచిత్త॥ యీ
రణభువి నేటికిటు విను • రం గొన నేటకి॥ లెమ్మా నాయనా॥

ఉ॥ ఎందకు వానకోర్చి శ్రమ • యింతయు లెక్క యొనర్పకుండఁ గో
దండము నూని కాచు గుణ • ధాము॥ రణస్థలి నొంటివిడి తె
మ్మెందుట నాయమేమి॥ నను • నూల్కొని యెవ్వరుకాచువారు॥ నా
గుండియ లెటివంచుఁ గనఁ • గోరితె॥ పంతములెంత నాయనా॥

చ॥ హృదయము జీవ మొక్కటని • యెంచిన వల్కు నిరగమైనచో
నెద నెవరున్నదట విజ • మే యగునేమి॥ విశుద్ధమూర్తి నీ
వదవను జీవముల్ విడక వెక్కుచు నుంటవి నీకుఁ జుట్టమై
వదలకయున్నదీ తనువా ప్రాణములో॥ కనరాదు నాయనా॥

ఉ॥ యాగముగాచి శంకర శ • రాసన మెక్కిడి ప్రీల్చి యద్భుటన్
భోగములొంద నౌనను కు • బుద్ధిని గొంటివి కాలకూటమున్
రాగము దానిపై నునిచి రాజును బంధులనెల్లఁ గాల్చితిన్
ద్యాగము లేమిచేసితివి॥ తక్కక మృత్యువు మీకుఁ గూర్చితిన్

ఉ॥ భూమిపయిన్ వహించు పెను • మోహముచే ననలంబు పుంటిపైఁ
బ్రామినరీతిఁ దల్లికొక బాధను కూర్చితి నంతమాత్రమా॥
రామపయిన్ వహించు ఘన రాగముచే నిటువంటి చెడ్డ వో
రాములు మీకుఁ గూర్చితిఁ గ • రంబుగ నెల్లరలో టి వా డనే॥

చ॥ మరణము నొందితివు కను మాఁపు మేనును నేను వీడెదన్
భరతుఁడు రాజ్యమేలఁ డిక • బంధులు తల్లులు దుఃఖవారిధిన్
దరలి నశించువార లిక • ధర్మముకై వెలిపొంది వింగఁగా
జరగిన దింత యొదొలవ • జన్మము నాయది యెంత ధన్యమో॥

క॥ జననీ జనకుల బంధుల, వనుఁగుల నాకొలకు విడిచి • యడవుల వెంటన్
నను వీడకుండు తండ్రీ! నిను పాసియు నిలువఁగలనె • వినుమనంబేనిన్.

ఉ॥ ఉత్తమ కామినిం బలిమి • నొక్క దురాత్ముఁడు కారవైవఁగా
సత్తమ సన్నుతంబయిన • చక్కటి వాని వశంబుచేరుచో
విత్తతి మారకుంట తగ • వే? త్రిజగంబుల వ్రాల్పకున్న నే
నెత్తిన జన్మమేల? ధరి • యించిన చాపము నేల? కాల్పనే?

క॥ ఖరునకుఁ గాకాసురునకు, విరాధునకు సప్తసాల • వృక్షమ్ములకున్
శరధికి వాలికి మాత్రమె, సరగున నా శరము తూలి • చనఁజాలినదో?

చ॥ ప్రతినను నిర్వహింపుమని • పంపితిఁ దోడుగ నుండనైతి నీ
జత విడకుందునేని దను • జప్రభుత్తుని మేని రక్తమున్
క్షితిపయిఁ జిందఁజేసి నిను • చేకొని రక్షణసేయకుందునే?
గతజల సేతుబంధనము • గాఁ దలపోసిన నేమి యబ్బెడిన్?

ఉ॥ తమ్ములు బంధులుం బ్రజలుఁ • దల్లులు నేగతి నున్నవారొ యం
చమ్మలికించుచుందురు మ • హోత్సుకతం గనఁబోదమయ్య లే
లెమ్మ యయోధ్యయందు బహు • లీలల మన్మకుటాభిషేక మి
ష్టమ్మునఁ జేయువార లది • సమ్మతమే కద రమ్ము చూడఁగన్.

తే॥ నాగపాశంబుచేఁ గట్టి • నలఁచినపుడు, ప్రాణముం దీసినపుడు నీ • పజ్జలేక
హా! సుహృద్ద్రోహ పద్ధతి • నమసరించు, నన్నుగని లోకులెల్లరు • నవ్వకుంద్రె?

శా॥ లంకారాజ్య రమన్ విభీషణుని కు • ల్లాసంబుతో విచ్చి ని
శ్శంకం దచ్చపథంబు దీర్ప కిపుడే • చావంగనున్నాఁడ నే
వంకం గల్పితి నాదుకీర్తి మఱియున్ • వంశంపు సత్కీర్తికే
యంకం బొందు గడించినాఁడ జను లా • హా యంచు నిందింపఁగన్.

క॥ అని పరిపరి విధముల వా, కొనుచు లోనఁ గుమిలి కుమిలి • క్రుంగుచు వాలిం
గన మొనరించి తను మఱచుచు, మునిఁగెన్ మైథిలి విభుండు • మూర్ఛానిద్రన్.

## వేలుపుల విలాపము

క॥ ఇనకులుని గాంచి ఖచరులు, కనుఁగవఁ గరములఁ గదించి • కళవళపడుచున్
గొవకేమి పరిణమించునొ? యని చింతాకులితు లగుచు • నారటపడుచున్.

సీ॥ సుఖదుఃఖరహిత! నీ • శుద్ధస్వరూపంబు, దెలియంగ శక్తిమం • తులము గాము
నీ యుదరంబున • నిఖిల జగంబులు, నమరియున్న తెఱంగు • నరయలేము
జరిగిన యదియును • జరుగుచున్నదియును • జరుగనున్నది సుంత • యెఱుఁగలేము
నిను వినుతించి నీ • నిర్దేశపద్ధతి, మెలఁగుట దక్కొండు • తెలియలేము

తే॥ దితిజవధచేసి దుఃఖముల్ • తీర్చుమనుచు, వేఁడఁ గరుణించి యారీతి • వెలసితీవు
ధర్మమును కాచు పూన్కిని • దాఁగి నిలిచి, మాయనాటక మాడుచు • మమ్ముకలఁతె ?

ఉ॥ కందులమైన మాకొనరు • కష్ట పరంపర దీర్తువంచు నా
నందము గూర్తువంచుఁ గడు • నమ్మికతోడను గంపెఁడాసతో
సుందరరూప ! నిన్నెపుడుఁ • జూచుచునుందు మదేమి మాయ ? నీ
చందము విస్మరింపఁ బెడ • జాడలఁ ద్రిప్పఁగ నుత్సహించెదే ?

మ॥ పరమేష్ఠి ! బహ్మాండముల్ నిఖిల జీ • వస్తోమమున్ జేసి యం
దిరవారన్ వెలి లోపల న్నిలిచి లో • నిందించుచున్ పీడుచున్
బరిపోషించుచు వేఱుగా నిలుచుచున్ • భావింప పాలిఁడు మై
నరవౌ నూలున గూఁడు గట్టు క్రియ నం • యోజింతు సర్వేశ్వరా ?

మ॥ ఇది దుఃఖంబులఁ గూర్చు లీల లనుచో • నేచింత విన్నంటు ? వి
య్యది సమ్మోదనలీలలే యగును చు • మ్మట్లంటకుం జాల, మా
పద మే మందిన నీదు ప్రేమయు దయా • భాగ్యంబు నింతారు దీ
మొదలు న్నీవయి తేఱకున్న నిట ని • న్నోదార్పఁగా నేర్తుమే ?

చ॥ కన బడుపోల్కిఁ దోఁచి • మఱి కానకయుండు నమేయరూప ! మే
దిని నవతారమొందితని • తెఁకువ నుంటిమి నీవు దుఃఖమున్
మనమున నొందఁ దాళఁగల • మా ? జగదీశ్వర ! నీవ మానఁగా
మొనయుదుగాక మేమొకట • మోతుమొ ? వి త్తుమొ ? నీదు మాయలన్.

మ॥ అజసూనుణ ఘను నంబరీషు భవుఁ బ్ర • హ్లాదుం దశాస్యానుజున్
గజరాజుం గని కాచినట్టి కరుణా • కల్యాణ వీక్షా రుచుల్
నిజ మీపాటికిఁ జూప కిట్లు లడలన్ • నిశ్చింతమై నుందుమే ?
భజనానందులమైన మాకు విమల • ప్రజ్ఞాన మీయంగదే !

క॥ పలువిధుల విట్లు వేల్పులు, పలవించిరి మనుజభావ • బంధురగుణుఁ డ
బ్జలజాక్షుఁడు తమ్మునిపైఁ, గలప్రేమమువలన మూర్ఛ • గని యట్లుంచన్.

ఉ॥ చారులు గాంచి రావణుని • సన్నిధికేగి యెఱింగి శక్రజి
త్క్రూరశరాలిచేఁ బ్లవగ • కోటిమోఁ దమ్ముఁడుఁ గూడియుండుటన్
వారకచూచి శోక వన • వహ్ని దహింప గతించె రాఘవుం
డా రణభూమియందె పగ • యాతెను సంతసమందుమా యనన్.

## 22. మూర్ఛిత రామలక్ష్మణ సందర్శన పటలము. (32)

ఉ॥ దూతలు కల్లలాడరని • దుష్ట నిశాటుఁడు రావణుండు మో
దాతిశయంబుచేఁ బురము • నందు జయంబును చాటఁబంపుచున్

నేతి వసంత మారుఁడవి • విచ్చలు ద్రవ్యముచల్లి దూతలం
బ్రీతులఁజేసి వేగ పిలి • పించి మరుత్తుని గాంచి యిట్లనున్.

తే॥ కలనఁ జచ్చిన దనుజుల • గాత్రములను, త్వరగ సంబుధిఁ బడవైచి • మరల దీవి
వారు లెఱింగిన సిరిల • నుత్తరింతు, ననుడు వాఁడట్లు కావించె • నాక్షణమున.

చ॥ దురమున రామలక్ష్మణుల • దుస్స్థితి మైథిలి కన్నులారఁగా
స్థిరముగఁ గాంచి రాక తిస • చిత్తము మార్చెదు నమ్మదంచు నా
సుర వనితావళిం బనుపఁ • బుట్టపికంబున గేలిచేయుచున్
దురితముగా విమానమునఁ • దోడ్కొనిపోయిరి వారు జానకిన్

మ॥ పతి సౌందర్యనుదప్కు నొంటొరి టిఖా • వంబందు నెక్కొల్ప క్షీ
షితముం జేయని ధాత్రిజాత పరి వి • స్ఫోమస్థితిన్ సంగర
క్షితిఁ దార్మ్యబుగ నుండఁ గాంచి తనుపు • చిత్తంబు విజ్ఞాన జీ
వితముల్ ప్రుక్కు జలేజ మగ్నిఁబడు న • ప్వఁకం గుమారిల్లుచున్.

సీ॥ విలపింప వేల్పుల , వెలఁదులేడ్చిరి హరు. సామేసనున్న యీ • శ్వరియునేడ్చెఁ
గమలవాసిని యేడ్చె • గంగ బోరున నేడ్చె. బ్రాహ్మియేడ్చెను ముని • పత్నులేడ్చి
రదయలౌ సోఁకుల • యతివలు నేడ్చిరి. జనకజ జనని మే • దినియునేడ్చె
శ్రుతులేడ్చె ధర్మదే • వత యేడ్చెఁ బాపంబు, నెల్లవారలకింతె • నెక్కుడేడ్చెఁ

తే॥ దక్కువారల యెద్పుఁ • దడవనేల ? ఎచటనుండిన వారచ్చ • టచట నిలిచి
యేడ్చినారలు వైదేహి • యేడ్చి యేడ్చి, యుల్లమెరియ నిల్వక సొమ్మ • సిల్లి వ్రాలె.

ఉ॥ చేరువనున్న యద్దనుజ • చేటిక లత్తఱి లేవనెత్తి ప
న్నీరు మొగంబునం జిలికి • నేర్పుమెయిం జలిసేవ సేయఁగా
ధారణిజాత ప్రజ్ఞెఱచి • తల్లడమందుచుఁ గంపమొందుచున్
నీరద దేహుఁ గాంచి తన • నేత్ర యుగంబున మోఁదెఁ బల్మఱుల్.

తే॥ వహ్నిఁబడిన వల్లికవలె • వాడు నుడుకు, వడఁకు విహ్వలించును వెక్కు • నడఁగు మడఁగు.
డ్రుల్ల గద్గదకంఠయై రోదనంబు. సేయు జీవంబు లురియాడఁ • జిక్కు స్రుక్కు

తే॥ పదును పొరలుఁజెమర్చు బె • గ్గడిలు నవలుఁ, దెలివిదప్పును లేచు వి • దిచ్చుఁ గేలు
దీనదృష్టుల దిక్కులు • కేలిచూచుఁ దలరు ; దపియించు మొఱవెట్టుఁ • బలవరించు.

ఉ॥ నీయెడఁ బ్రేమగల్గి విను • నిత్యము గొల్చెదువారిఁ గాచుచున్
పీయెడ వైరమూను రజ • నిచరపాళులఁ ద్రుంచుచుందు మ
న్నాయక నందనుడకిట్లు • నాశము గోరినవారిఁ జేరితే ?
నీ యవలక్షణంబు గమ • నింపఁగ నిట్టిదె ? ధర్మదేవతా !

తే॥ ధర్మపద్ధతులం గాక • తక్కుత్రోవ. లందు పోని యుత్తముల క • డింది నేగి
చూడ నిచ్చగించితె? యిది • పేడు కేమి? దుర్విధీ! నీవు దీనిచే • దొడ్డవగుదె?

ఉ॥ పాపినినైన యేను నిటు • వంటి పరిస్థితిఁ గాంచి సైఁపఁగా
నోపను ధర్మరాజ! దయ • యుంచి ననుం గొని పొమ్ము పుణ్యమా
నాపతి నన్నుఁ బాపుటలు న్యాయమె? రావణుతోడఁ జేరికే?
పాపఫలంబు నాకుఁ గుడ • పంగఁ దలంచిన త్రోవ యిద్దియే?

చ॥ తొలఁగని యంధకారమునఁ • ద్రోచుట న్యాయమె? నాధ! యో కృపా
జలనిధి! నాతపఃఫలమ! సత్యదయాపర! యిన్నినాళ్లు నీ
సిలుగు సహించియుండినది • చెన్నగు నీస్థితి గాంచు కోసమా?
తలఁగని నా దురాగతమె • తార్చెను నీకు నకాలమృత్యువున్

మ॥ అమరప్రార్థితజన్మ! ఆగమనుపే • ద్యా! దేవదేవేశ! జ
న్నము గావం జనుదెంచి యంత మిథిలా • నాథానుదేశంబునన్
ప్రమథాధీశ్వరు చాపమున్ విఱిచి నా • పాపాలపుట్టైన హ
స్తముఁ జేపట్టుట యిట్టి యాపదకు ల • క్ష్యంచౌటకా? రాఘవా!

మ॥ కడుపుం గాల్చెడువార్తకన్న కడుపా • కౌసల్య విన్నంతనే
విడుచుం బ్రాణము లంత నాయనుజులున్ • వీక్షింతురే జీవికన్?
చెడుగుల్గోరిన కైక యియ్యదియె తాఁ • జింతించి కావించెనో?
చెడితిన్ సర్వవిధంబులం జెడితి వి • స్పీ! నా భవం బెట్టిదో?

మ॥ వలదన్నన్ వెనువెంట వచ్చితిని క్ర • వ్యాదాలితో నూదు నా
వలనం గగ్గెఁ బసిండి లేడికయి ని • ర్బంధించి నిన్నంపితిన్
గెలన న్నిల్చిన లక్ష్మణుం గఠిన వా • గ్దిగ్ధంబులం గ్రుచ్చి యా
వలికిం బంపితి సర్వ మాపదలకే • పాల్పేయనే యయ్యెఁగా?

ఉ॥ పాపఫలంబుచే నడవ • భావ్యముగాని యరణ్యసీమకే
మోపిక నేగునాఁడు ప్రియ • మొందఁగఁ బిల్చి కుమార! రాఘవుం
డాపద నొందునే నతని • కన్నను మున్నె మరింపుమంచు నా
జ్ఞాపనసేయు తల్లి మడి • జాడనె కూలితె? తండ్రి! లక్ష్మణా!

చ॥ చివురులు పువ్వులుం బఱపి • చెన్నగు తల్పమునందు నిద్దురం
దవిలి త్యజించినట్టి గుణ • ధన్యుఁడ! లక్ష్మణ! నిత్యశీల దా
నవ ధను రుగ్రముక్త శర • నవ్య సుతల్పమునందు చల్లనన్
మిపులఁగఁ గూర్కి పెందమది • మేకొని త్రాలితి పేడి? నాయనా!

తే॥ మఖము లొనరించి సద్ధర్మ మార్గమునను. ధరణిపాలన మొనరింపఁ • దగిన నీవు
నన్ను చేపట్టి సత్యవా • క్యనయము ధర్మ. ఫలము కృశియింప వగలఁ బా • ల్పడితి నాధ.

తే॥ కులిశమునమైనఁ బగులని • గుండె గలిగి, పనవి ఫలమేమి ఖేదంబు • పాయునట్లు
నీరజాక్షిపైఁబడి మర • ఁచింతుఁగాక. యనుచుఁ బడఁబోవఁ ద్రిజట తా • నడ్డువచ్చె.

## త్రిజట సీత నూఱడించుట

తే॥ తన తపఃఫల రూపమై • తనరు త్రిజట. సాంత్వనంబులు పలుకంగ • సాహసించి
సకుల నవలికిఁ ద్రోసి జా • నకిని డాసి, కౌఁగిలి నెపంబునం జెవి • గఱచి పలికె.

తే॥ మాయచింతను పంపుట • మాయ జనక, నమువుటయు నాగపాశ బం • ధనవిముక్తి
యించుకేని విచారింప • కిట్లు జీవ, ములసు వీడఁ దలంచితే? ముద్దుతల్లి!.

ఉ॥ గణ్య తపఃఫలంబు కల • గన్న ఫలంబును మీరు దండకా
రణ్యమునం జరించుతఱి • రాజిలు చేఁతలు ధర్మదేవతా
పుణ్య ఫలంబునం బొడము • పూరుషవర్యుని రాము వీర్య సా
ద్గుణ్యములుం దలంప నొక • దుర్మరణం బతనిన్ జయించునే?.

మ॥ ముగుదా! రాముని మేన నొక్క విశిఖం • బున్నాట కున్నట్టి యా
పగిదిం గానవొ? నీ మఱంది మొగమున్ • భావింప మార్తాండు రీ
తిగ భాసిల్లుచునుండె లక్ష్మణుఁడు మి • త్తిం బొందలేదమ్మ! రి
త్తగ దుఃఖమ్ముల నొందకమ్మ! యిది స • త్యం; బేల సందేహముల్?

మ॥ మరణంబే భజించునేని త్రిజగ • న్మాన్యుండు రాముండు దు
ర్భరమై లోకము లన్నియుం జెడవె? భా • స్వచ్చంద్ర బింబంబులున్
ధరణిన్ వ్రాలవె పట్టుదప్పి? వుడమి • ద్ధాత్రాములు న్నిల్తురే?
స్థిరమై ధర్మము లోకముల్ నిలుపఁగాఁ • జింతింప నీకేటికిన్?

ఉ॥ నీపరశక్తిచే హనుమ • నీరసజీవుఁడు గాఁడు వ్యర్థమై
పోపదు నీసతీత్వమున • పోఁడిమి యూరక చింతసేతయున్
భావుకరీతిగాదు సుర • వర్యుల కోర్కులు రిత్తగావు రా
జీవ భవాస్త్ర పీడయు వి • శీర్ణము కాఁగలదమ్మ! జానకీ!

చ॥ మునుల నిలింపులం గనఁ ద్రి • మూర్తులఁ గాంచిన పోల్కి రామ ల
క్ష్మణులను గాంచి హస్తముల • మస్తములం దొదవించి మోద భా
వనముల నున్నవారు భయ • పద్ధతి మానుము సాగరంబు నూ
తను వడిఁజొచ్చి నీరములఁ • ద్రావుట చూడము మేదినీసుతా?

చ॥ పతి మరణింప సూత్రమును • పాయఁగనున్న సతీ మతల్లిఁకన్
హితమతి! యీ విమానము వ • హింపదు జార్చును తారకాణ లి
ప్పితమునఁ బెక్కు లున్నయవి • వేఱఁడి చందము నొందకమ్మ! నీ
పతి సుఖియయ్యెఁ గొందలము • పాయుము నమ్ముము నన్ను తల్లిరో!

చ॥ అనుడు ధరాత్మజాత హృద • యంబున నించుక శేటి యానతిం
గని నిను తల్లిగాఁ దలఁచి • కాలము ద్రోచితి నీదుపల్కు లె
ప్పును వృథగావు నేఁటి విని • పోయెడుదాఁక భరింతు జీవముల్
నిను మది తెప్పగాఁ దలఁచి • నిల్చితినమ్మ! శుభమ్ము నీకగున్.

చ॥ సతులకు భూషణంబు లగు • సాధుగుణంబుల నీటఁ గల్పియున్
బతి ముఖదర్శనాశ నను • బాధలఁ బెట్టఁగ జీవముల్ భరిం
చితి నెటులెట్టులో గురుత • చెడ్డ శరీరము వీడుటన్నఁ గ
ష్టతరముగాదు తల్లి! తిరి • గా! యని మైథిలి నెమ్మదిం గనెన్.

చ॥ స్థిరుఁడగు జీవు నివ్వసము • తిన్ విడిపించి బలంబుచేత న
స్థిరమగు దేహమున్ గ్రసము • చేఁగొని యంబరవీథిఁ గాల కిం
కరులు గమించులీల జన • కప్రభు పుత్రిని రాక్షసాంగనల్
కరముల మీఁద నుంచికొని • క్రమ్మఱినారు బిరాన లంకకున్.

## 23. సంజీవన శైల పటలము. 117.

క॥ ఇనకులుని యాజ్ఞ వినులకుఁ, జనిన విభీషణుఁడు భోజ్య • సామగ్రులు చే
కొని మరలి పాళెమునకుం, బఱచి యచట వచ్చి సమర • వసుధం గాంచెన్

తే॥ బ్రహ్మశాపంబుచే స్మృతిఁ • బడసినట్లు, వనచరావలి యెల్లను • వ్రాలి నేలఁ
జాఁపకట్టుగఁ బడియుండు • సరణిఁ గాంచి, హా! యనుచు నేమిఁ దోఁచక • యచ్టె నిలిచె.

క॥ జరిగిన సంగతి సుంతయు, నరయని దనుజేంద్రుఁ డంత • నటునట వడువున్
బరుగునఁ జని లక్ష్మణుతో, ధరణిని వ్రాలిన నృపాల • తనయుని గాంచెన్.

ఉ॥ పేర్మికుఁ బ్రాణమిత్రులు నే • రీవము ముఖ్యములంచుఁ గాదటం
చీ మహిఁ బల్కువచ్చు రహి • యుంచు పదావలిఁ గూర్చి నేర్పుచేఁ
బ్రేమకు సాటియైన దొక • పేర్మిగుణంబు జగానఁ గల్గునే?
ప్రేమగుణమ్ము మేర గని • పెట్టిరె వేల్పులు నేఁటికేనియున్?

ఉ॥ ఓరువలేని సంకటము • నొంది తపించియు నెవ్వనంబునన్
వీరికిఁ జేటు లేదను వి • వేకము నమ్మక ముందుఁజేసియే
యూరక ప్రాణముల్ విడక • యొప్పుగ శీలన మాచరించి కం
గారుపడంగఁ దగ్గ దొక • కాఱియ లేదని నిష్కరించుమన్.

తే॥ అజ శరంబుచేఁ గలిగిన • దనియు సనియు, నింద్రజిత్తుచే సౌమిత్రి • కెనసె ననియు
నతనికై రాముఁ డీకీతి • నడలి సోలె, ననియుఁ దలపోసి ప్రతికృతి • యరయసాగె.

ఉ॥ శోక నిపీడితాంగుఁడయి • శోషిలు రాముఁడు తేజువెన్కన
స్తోకమతిం దలంతమనఁ • దోడగు తమ్ముఁడు చావఁ బిమ్మటన్

డాక సహించి నిల్వఁ దటు • సాగిన ధూర్తులకే జయంబిలన్
వేరులనంచుఁ గన్నుఁగవ • చిత్తడి నొందఁగ వించె నశ్రుపుల్.

మ॥ ఫణిపాశంబు లొలంగినట్టి కరణిన్ • బ్రహ్మాస్త్రమున్ వీడు ల
క్ష్మణు నాశంబును జేయ ద్రెళ్ళపడు నీ • శాఖామృగ వ్రాతమున్
బ్రణుతిన్ జీవము లొందు ధర్మము స్థిరన్ • వర్ధిల్లు మాయావి రా
వణ దుర్మానికి రాక్షసాలికి జయ • ప్రాశస్త్యముం గూడునే?

క॥ కేటుటకు మున్నె యాపద. లీటఁగఁ దోడ్పడెడి వారు • త్రెళ్లక యెవరు
న్నారో వెదకెదఁగాకని. కోరికతో నెమకెఁ జేతఁ • గొఱవిం గొనుచున్.

ఆ॥ పెదవి మడచి కేలు • పెనవైచికొని వేఁడి. వాఁడిచూపు జంకె • వీడి మెఱయ
వారణముల కుప్ప • పైఁబడియున్న సా. మీరిఁ గాంచి కనుల • నీరునించి.

ఆ॥ అసువు లున్న వనుచు • నరసి రక్తమువెల్వ. వ్రణములందు గ్రుచ్చు • కొన్న శరము
లొక్కటొంటిగాఁగ • నొయ్యన వెడలించి. మొగుల జలము చల్లె • మొగముమీఁద.

ఆ॥ ఒడలు గగురు వొడచె • వెడవెడ నావియు. వచ్చె నావులింత • వచ్చెఁ గనులు
విచ్చెఁ దెలివివచ్చె • నుచ్చరించెను రామ. రామ యనుచు మంత్ర • రాజ మతఁడు.

చ॥ అలరును దుఃఖముం బెనఁగు • లాడ విభీషణుఁ డంజనా సుతుం
జెలువుగఁ గౌఁగిలించికొన • శ్రీరఘువీరుని యవ్యయంబు నిం
పెలయఁగఁ బ్రశ్న సేసి సుఖి • యే యను వాక్యము వీనుదోయికిన్
గెలివిడి గూర్ప జే యనుచుఁ • గేలు మొగిడ్చె మరుత్సుతుం డటన్.

ఉ॥ తమ్మునిమీఁది ప్రేమ బలి • తమ్మగు చింతఁ దపించి సోలినాఁ
డిమ్మగఁ దేల రామవిభుఁ • డేమగునో యని సంశయించెదం
జుమ్మని దైత్యనేత యనఁ • జూచుచు మారుతి భల్లుకేశ్వరుం
డిమ్ముల నున్నవాఁడె యతఁ • డెచ్చటనుండు వచింపవే యనన్.

చ॥ అతనిని గాంచలేదు మృతి • నందెనొ యేమొ యెఱుంగ జానకీ
పతి విషయంబు చూడుమనఁ • బావని భల్లుకరాజు నిత్య జీ
వితుఁడు వివేకి మేలు నొద • వింపను సేగిఁదొలంప దక్షుఁడౌ
బ్రతికితిమయ్య పోదమన • వైలమ యిర్వురు చేరి రోయుచున్.

తే॥ పోవుచుండఁగ నొకచోట • ముసలితనము. వలన నెలలునాటిన నొప్పి • వలనఁగలఁక
వలన మైకమొందియు జాంబ • వంతుఁ డిరువు. రరుగు దెంచుచుండుట నడి • యరసియెఱిఁగె

తే॥ రాముఁడో హనుమంతుఁడొ • రాక్షసుండొ. సురలొ మునులొ పగలు వోయి • తిరిగిరాదు
కాన వచ్చువారలు కావఁ • గదఁగువారె. కావలయునని నెమ్మది • గాంచె నతఁడు.

తే॥ వచ్చి చేరువ నిలిచిన • వారిఁ గనలు, తెలిసి కనలేక యెవ్వరో • తెలుపుఁ డీర
లనుడు బ్రతికితిమను విభీ • షణుని పలుకు, నవ్వడిం బట్టి యూరసి • సంతసించి.

తే॥ అవలివాఁ డెవఁడని మారు • తాత్మజుఁడను, నుత్తరము విని జయము మ • రుత్తనూజ!
మంటి మిఁకఁ బునర్జన్మంబు • గొంటిమయ్య. యనుచు మెల్లనఁ గనువిచ్చి • యతనిఁ గాంచి.

చ॥ ఒడలి శరంబు లూడ్చుకొని • యుబ్బి యెలుంగులఁ జేఁదు పావనిం
గదుకొని కౌఁగిలించికొని • కంజభవాస్త్రమయార్యు రాఘవుం
దొదరి కలంపఁజాలఁ డని • దొడ్డగ నమ్మిగ్గ గద్దునాతు నా
పుడమి కుమారిభర్త యని • పూని యొనర్చినదేమి చెప్పుమా ?

చ॥ అనుడు మరుత్సుతుండను మ • హాత్ముఁడు లక్ష్మణు పాటుగాంచి మూ
ర్ఛను మునిఁగెన్ స్మృతింగొనినఁ • గ్రమ్మఱ నేమగు నో యెఱుంగఁజా
ల ననిన జాంబవంతుఁ డను • లక్ష్మణుఁ దేర్పఁగ నే వచింతు త్రో
వను చని మందు తెమ్ము కపి • వర్గమె కాదు జగమ్ము మాల్కొనన్.

సీ॥ ఉదధిని దాఁటి తొ • మ్మిదివేల యూమడ, లరిగినఁ గాంతు హి • మాచలమ్ము
నొగి నది ద్విసహస్ర • యోజనాయతి నొప్పు, నది దాఁటి యోజన • మరుగునంత
హేమకూటము వచ్చు • శ్రీ మహితంబది, వెస దాఁటి తొమ్మిది • వేల యోజ
నము లేగ నిషధశై • లము గల్గు దానిని, కడచి యవ్వల నంత • నడవ చనిన

తే॥ కనకశైలంబుఁ గానంగఁ • గలవు దాని, పరిధియందు ముప్పదిరెండు • వేలయోజ
నాలు పిమ్మటఁ దొమ్మిది • వేల యోజ, నములు కడఁచిన నీలశై • లమును గాంతు.

సీ॥ ఆమల రెండువే • లామడల పొడవు, విలసిల్లు దానికి • వ్వలను నాల్గు
వేల యామడలేగ • లీలను గాంతువు, మందులుగల నల్ల • మలను నీవు
కాంచినంతనె మన • కడగండ్ల కడలికిఁ బారంబు గాంతువు • వాయుపుత్ర!
అందు ప్రాణము లిచ్చు • మందొంటి మఱియొండు, చెదరు సంగంబుల • జేర్చునొండు

తే॥ చెడిన రూపంబుఁ గ్రొత్తగాఁ • జేయునొండు, వికలమగు నస్థు లతుకు మా • లికయు ననఁగ
దనరు సంజీవకరణి సం • ధానకరణి, శస్త్ర సావర్ణ్య కరణి వి • శల్యకరణి

చ॥ త్రిదశులు క్షీర వారిధి మ • థించిన యత్తఱిఁ బుట్టె నోషధుల్
పదిలము గాఁగ నుంచిరట, వారలు విష్ణువు మున్ త్రిలోకముల్
పదములఁ గొల్చునాఁడు కడు • భక్తిఁ బ్రదక్షిణ మేనుసేయు న
య్యదమున దాని తత్త్వము మ • హర్షులు తెల్ప నెఱింగితిన్ సఖా!

ఉ॥ వానిని కాచువారు సుర • వర్యులు పెక్కురు వారిఁ జక్రముం
బూనిక గాచు పీవరిగి • ప్రొద్దుదయింపక మున్నె తెచ్చుచో
భానుకులేశులుం బ్లవగ • వర్గము జీవములొందు ధర్మమున్
మానుగ నాల్కొనున్ జగతి • మాఁడును దైత్యకులంబు నావుడున్.

## ఆంజనేయుఁడు సంజీవనిం దేఁబోవుట

మ॥ ఇటు విస్తారవ్యథ లుంకలో రఘుకులా • ధీశుండు తమ్ముండు సం
గదయుం దోలనాగయుంగఁ దీరుపుఁ డుషః • కాలంబు గాకుండఁ దె
చ్చెద దివ్యౌషధు లెట్టులైన యని పెం • చెన్ దేహ మాకాశ ము
ప్పుదమా శీర్షతలాతి దోఁచఁగ జగ • ద్వీరుండు సామీరి తాన్.

మ॥ గ్రహ బుక్షంబులు లోహారముల పేఁ • ర్కిందోఁచెఁ గ్రుంగారెఁ దా
రహరింఁ దాఁకి ఘనాంబర ప్రథిమ సా • ధ్యంబై భ్రమాటించఁగా
గ్రహియింపంబడగ బాహువుల్ చిరల లం • కాద్వీప మందింక నె
వ్వహిఁ దా తెంచిన పాదముంపఁదల మే • పాటిం గనన్ లేముగా.

ఉత్సా॥ వాలువంచి కేలుసాచి • వాయి మడిచి పాదమున్
నేలనూని త్రొక్కి నిక్కి • నిక్కవొడువ రోమముల్
లీల మెడను ద్రుంచి రామ • లీల సంస్తుతించుచున్
గాలి కొడుకు నింగి కెగసె • గామచారియై చనన్.

ఉ॥ అంత పయోధి ముప్పిరి • గొందని యొప్పఁగ నుప్పరంబునన్
వంతలు చిన్న చిన్నలను • పాదపముల్ వడితోడ లేచె ని
ర్వంతలఁ దూరి సంభ్రమునఁ • బడ్డది దేవ విమాన పంక్తి య
భ్రాంతసమై మహాద్రి దిగ • ఘంటల కొండపులాప్పె నత్తటిన్.

చ॥ ఒలిగిన వూరువేగమున • నుత్తర దిక్కునకున్ మహీధ్రముల్
పరిదములం గలంగెఁ దరు • జాలము కొనఁ బొందె రాపిడిన్
గమపరియుం బయోధి ఘను • డింబడఁ జిత్తములన్ వెనుంబడిన్
గుడగతి వాయుసూతి చనఁ • గోయని యార్చిరి పేల్పు లబ్బురన్.

మ॥ జలముల్ మేఘమండలి దాఁటి చంద్రపథమున్ • నందించి యుగ్రాంశు మం
డలమున్ మీటి తిరించి ఋక్షపథమున్ • దాకొంచు దద్భోగ ఘా
ములతో నద్భుత లోకము గడచి చూ • పుల్ త్రోవఁగా రావి య
గ్గలికన్ మారుత నందనుండు చనియెన్ • గాకుత్స్థ కార్యార్థియై

సీ॥ వైనతేయుఁడు వడి • వైకుంఠమునకేగు, వాఁడని కొందఱు • పలికినారు
తెలిపిట్టపై నెక్కి • సలుప స్వలోకంబు, నందువాఁడని కొంద • ఱాడినారు
శూలిగాకున్న నీ • లీల నెవ్వఁడు చనఁ, గలఁడని కొందఱు • తలఁచినారు
తలఁచిన రూపంబు • దాల్చి లీలలు సల్పు, వెన్నుఁడె యని కొంద • ఱెన్నినారు

తే॥ బాగుగాఁ జాతమని కొంద • ఱేగి వెంట, ననుసరింపఁజాలక వృథా • యాసమంది
రమణఁ జని పునరావృత్తి • రహితమైన, మోక్షపద మందువాఁడని • మ్రొక్కినారు.

తే॥ రూపమున్నది యని జ్యోతి • రూపమనుచు, జ్ఞానరూపుఁడనుచుఁ బర • మానరూపుఁ
డనుచు సర్వకారణుఁడగు • హరియటంచుఁ, బలువిధంబుల విజ్ఞులె • తలఁచినాడు

తే॥ పరవి బ్రహ్మాండమెల్ల నం • బరముగప్పె. నట్టి హనుమని పదచేత • నదరిపట్ట
శబ్దయుత వాతమున దిగి • శాన శిరము, లల్లలాడె నజాండంబు • తల్లడిల్లె.

క॥ బలి ధారవోయ జగముల, గొలువంగ హరి గొప్పరూపు • గొన మునులును వే
ల్పులు నంతసిలిన తెఱఁగున, నలరిరి హనుమని మహోద • యాకృతివలనన్

క॥ సుర సిద్ధ కింపురుష కి, న్నర విద్యాధరులు చల్లు • నసలును గందం
బిరవారి నెఱయవిరిసిన, హరిచందన మట్టుకొప్పె • హనుమంతుఁ డటన్

క॥ హిమవంతముఁ జేరఁగ నం. దమరిన తపసులును విబుధు • లలరుచు నీకా
ర్యము ఫలియించుత మని రటఁ, బ్రమథపరుని నగముఁ గాంచి • పావని యుబ్బెన్

క॥ ఈశాన్యాధీశుఁడు కై, లాసంబును గని కరంబు • లను మొగిచిన యా
కీశవరుఁ గాంచి ప్రేమ. పేశంబున నుచుకుఁజూపె • వేడుకపడుచున్.

క॥ ఇతఁడేగుచేల యను నా, సతికి హరుఁడు రామ దూత • సంజీవనికై
హితమతిఁ జనియెడు లంకా, పతి నాశము రేపుచూడఁ • బదమా యనియెన్.

క॥ హరిచక్రమువలెఁ జనియెడి, కరువలికొడు కచటు కదచి • క్షణికంబగు కా
మ రతులఁ దనిపెడు సురగణ, మిరవుకొనిన హేమకూట • శృంగము దాంచెన్.

క॥ మనసునకు జ్ఞాననేత్రం, బునకు విధికి నందికుండు • పొలముచఁ జను పా
వని ఎనియెఁ బైని భువనము, లను కొలిచెడి కట్టునా న • లరు కనకాద్రిన్

క॥ అనిమిషలేమియుఁ దోఁపక, కనుచుండఁగఁ గీశవరుఁడు • కాంచనగిరిపైఁ
జని కనె నీదీవికిఁ బే, రునయించిన జంబువుమ న • మిస్సితమతియై

ఆ॥ మేరుశిఖరమందు • సౌరైన యజపురిఁ, గాంచి దాని నడుమఁ • గనక పీఠి
నలరు నలువఁగాంచి • యలరారు మనముతో, వందనంబు చేసె • వాయు సుతుఁడు.

క॥ సురతరు వనమున భక్తులు, పరవశులై వినుతి సేయఁ • బ్రణవ రవమునన్
హరి శ్రీభూ తరుణులతోఁ, బరుఁడయి వేంచేయఁ గని ను • తించుచు నవలన్

తే॥ అంచ యీశాన్యభాగంబు • నందుకోటి, భానుసంకాశ ఘృణిభాస • మానుఁడగుచు
భక్తు లర్చించు పూజ కు • ష్టలకు నడుమఁ, గ్రాలు భవ భవానులఁగాంచి • కేలుమోచ్చె.

తే॥ చంద్రువలె వెలిగొడుగు శి • రస్సుమీఁద, వెలయ సుందరుల్ చామరల్ • వీచుచుండఁ
ద్రిదశు లలరి కొల్వఁగ నొప్పు • దేవ విభుని, గాంచి ముదమంది కేల్మోడ్చి • కదలిచనియె.

తే॥ పిదపమున్న కల్పకతరుల్ • వెలయ రుచిర, కాంతు లొప్పారు నిర్జరా • గారమైన
కనకగిరి శిఖరమున ది • క్పతులఁ గన్న, లలరఁ గని యాంజనేయుండు • హర్షమందె

ఉ॥ మేరువుదాఁటి పైశము స • మీర కుమారకుఁ డుత్తరస్థలిన్
జేరి దినేశుఁ డస్తగతిఁ • జెందమి నొక్కక్షణంబయేని రే
వాఱక యుంటఁ జేసి యది • భానుఁడు పుట్టినకాఁ దలంచి దై
వాఱిన చింత మున్గెఁ దన • పట్టిన కార్యము భంగమౌటకున్.

ఉ॥ భూపతి మూర్ఛదేఱుటకు • మున్నుగ నోషధు లిచ్చి లక్ష్మణున్
లేపగ నెంచి వచ్చితి మ • లీమస బుద్ధిని పాడుచేసితిన్
రేపడు మున్నె మారుతి జ • రీలున వచ్చున యంచుఁ గాచువా
రేపగిదిం జరింతు? నిఁక • నెయ్యదికార్యము? సర్వముం జెడెన్.

చ॥ అతుల వివేకశాలి యగు • నాహనుమానుఁడు మానసంబునం
దతితర చింతనొందియు ర • యంబునఁ దేఱి యుదీచియం దహ
ర్పతి యుదయించునే? కనక • పర్వతమున్ రవి చుట్టువంచుఁ బం
డితులు వచించు వారలవి • దెందము కుందు తొలంచె నత్తఱిన్.

చ॥ మరణములేక చింతయను • మాటయులేక సతంబు భోగమే
యురవుగనొప్పి యాలుమగ • లొక్కశరీరమ యొప్పఁ బ్రేమ మో
గిరముగ విష్ణుగోష్ఠిఁ దిల • కించుచు జీవులు సంచరించు ను
త్తర కురు భూములం గనుచు • దాఁటె మరుత్సుతుఁ డుగ్రవేగుఁడై.

తే॥ ఆటఁగపర్దియు హరి సమ • లానమందు, నెలవుకొన యోగ్యమై త్యాగి • నిశ్చలుండు
నైన ధర్మప్రభుని రాజ • ధాని పోలు, పట్టనములఁ గాంచుచుఁ బోయెఁ • బవనసుతుఁడు.

తే॥ మేరువునకంటెఁ బొడవుగ • మీఱి యజుని, పట్టముం గొనువాఁడును • భవములేని
వాఁడు నగు కపివీరుండు • పోఁడిమిని త్రి, విక్రమునిపోలు నీలాద్రి • వెలయఁగాంచె.

తే॥ ఇరులఁబోతులు చిమ్ము న • గ్గిరినిదాఁటి, జాంబవంతుఁడు తెలిపిన • శైలమును మ
హౌషధీ దీప్తులను మింటి • నధికకాంతి, మంతముగఁ జేయు చిన్నియం • బట్టికాంచె

తే॥ కాంచిదిగె దిగినంత న • క్కారువక్రుంగె, దానిఁగాచు దేవతలు దా • రటమటపడి
నిలుకఁజెంది సన్నిధి నిల్చి • నీవెవండ, విటకు వచ్చిన కారియ • మేది? యనుడు.

ఉ॥ వచ్చిన కార్యముం ద్రిదశ • వంద్యుఁడు మారుతి సాలుమూల వా
క్రుచ్చిన వారలన్ మదిని • కొంతక గైకొనిపోయి పిమ్మటన్
దెచ్చెఁ యథాస్థితి న్నిలుపు • ధీవర! యంచు నదృశ్యులౌ తఱిన్
దిచ్చు మొగంబు చెందెఁ బొడ • తెంచి సుదర్శనమున్ రయంబునన్

చ॥ ఉడుగక యోషధుల్ వెదకు • చుండినఁ గాలముమీఱుఁ గార్యమున్
జెడు నటుగాన నీశిఖరిఁ • జేకొని పోవుట యుక్తమంచు నె
వ్వడిఁ బెకలించి యెత్తికొని • వాయుకుమారకుఁ డంబరస్థలిన్
బెడిదపు దమ్మువోలెఁ గడు • వేగమ తివ్వన వచ్చుచుండఁగన్.

## జాంబవద్విభీషణులఁ గాంచి రాముఁడు పరితపించుట

చ॥ వెరవరి జాంబవంతుఁడు వి • వేకి విభీషణు డేగుదెంచి దా
శరధి పదాంబుజంబు లెల • సంబున నొత్త నెలర్చె భావపీ
వర హృదయాంబుజాత మధు • పమ్ములు సత్కరుణా స్వరూపముల్
వరదములుం బవిత్రములు • పంకజసామ్యములైన నేత్రముల్.

చ॥ కనుగవ నీరునించుచు వ • గర్చెడు వారలఁ గాంచి నీవు పో
యిన పనిమేలె? జీవము వ • హింతె? విభీషణ! బ్రహ్మపుత్త్ర! నీ
కును శుభమే కదా? సమసి • కూలె సమస్తజలంబు తమ్మితో
నొనరుపఁ దగ్గనొందు తెరు • వున్న వచింపుఁడు మీరు క్రచ్చుఱన్.

చ॥ పుడమికుమారి వల్ల మతి • పోయిన నాస్థితి చెప్పనేల? యీ
పుడమి కలంతకాలమును • పోవని నిందను మోచినాఁడఁ ద
మ్ముఁడు నను మాయజింక యిది • పోవలదన్నను నాఁడువాని ప
ల్కుఁడవక పోవుటం గద వ • హించితిఁ గూర్చితి విన్ని చెట్టలున్.

ఉ॥ రావణుఁగాంచి చేపను దు • రం బొనరించితిఁ జంపనైతి నా
జీవములైన యందఱకుఁ • జేటొనఁగూర్చితి చొప్పు తూపువే
రావణుఁ గూల్తునన్న నను • రస్తలి ధర్మముగాని పద్ధతిం
బోవకుమంచుఁ దమ్మునకుఁ • బోయితి పట్టము కీడు దెచ్చితిన్.

ఉ॥ తమ్మునితోడ మందక వె • తారకు దుర్విధి గూర్పఁబోలు న
న్నమ్ముల పూజసేయ నెడ • కంపెను సోదరులెల్ల రాజి రం
గమ్మునఁ గూలి రింద్రజితు • గండడఁగింపక లక్ష్మణుఁడు నా
కమ్మను చేరె నాపెడఁగు • కష్టము కూర్చె మహార్తి వీరికిన్.

ఉ॥ ఇచ్చట నిట్టి పల్కు వచి • యించుచు నిల్చుటపేక్షజేయమే?
బ్రుచ్చుల రావణాదులను • పోర వధించి సురాలికిన్ ముదం
బచ్చుగఁ గూర్చి వారుకొను • నయ్యది యెయ్యది లేదు వీరలన్
హెచ్చిన ప్రేమఁగూడ దివి • కేగుటయే సగుత్రోవ నాకగున్.

ఉ॥ ఏటికి సీత? రాజ్యరమ • యేటికి? నేఁటికిగీర్తి? ధర్మ మిం
కేటికి? బంధు లేమిటికి? నేటికి • శౌర్యము? సత్య మేటి కి
ల్లేటికి? వాకి లేమిటికి? నేటిక • సత్కృతు? లేల వైరముల్?
సాటి యొకింత లేవి యను • జన్ముఁడు స్వర్గము చేరు పిమ్మటన్.

చ॥ నెవరు విపిష్పలంబు గన • నెయ్యవుఁ దమ్ముఁడు లేని పిమ్మటన్
దనుజులనెల్లఁ బోకడచి • దర్పము చూపుదునేని చౌర్య వం

చనములు గల్గువాఁడనె వి • జం బగుదున్ మఱికాదయేని బ
చ్చెనటొమనాదు విత్తతిని • జీవము వీడుటె యుక్తకార్యమౌ.

ఉ॥ తండ్రిఁ గోలుపోయి పెద • తండ్రి యనందగు సజ్జటాయువున్
దండక యందు కోలుపడి • తమ్ముని మిత్రుల నక్కవాతికిం
గండగ నిచ్చి సౌఖ్యములఁ • గామినితోఁ గొనెనంచుఁ గర్ణముల్
పుండయి పుచ్చి విచ్చి పుర • పుల్ పడఁ దిట్టదె సాధులోకమున్.

ఉ॥ తమ్ముఁడు లేక సీతఁ గొని • ధారణిసేల నయోధ్యకేగుచోఁ
దమ్ముని వీడివచ్చితె సు • తా! యనతల్లి సుమిత్ర మోమునే
నెమ్మెయిఁగాంచి యేమి వచి • యింతును? రక్కసివాతఁ బెట్టితిం
దొమ్మని వల్కకుంటె నను • వుల్ విడుటెంతయు మేల కాదొకో?

తే॥ అనుచుఁ బలువిధంబుల నిట్టు • లడలుచున్న, పుండరీకాక్షు జాంబవం • తుండు కాంచి
దేవ! విలపించుచుండినఁ • దెలివి మాయుఁ, దెన్నదోఁపదు వినుమొక్క • విన్నపంబు,

## జాంబవంతుఁడు రాముని లేపుట

తే॥ అరిది సద్గుణావళులకు • నాటపట్టు, వైన నీవు విన్నెఱుఁగవు • గాని నేను
విన్న మున్నె యెఱుంగుదుఁ • దెన్నుదప్పి, సంభ్రమించిన సురల యా • పలు నశించు.

ఆ॥ కదనమందు కీశ • గణములఁ దమ్ముని, ప్రాణములను కొన్న • ప్రవర సత్య
మోఘమైన యజుని • ముఖ్యాస్త్రమనియెడు, నాతలంపు నిజము • నళిననేత్ర!

తే॥ పరఁగ బ్రహ్మాస్త్రమే యేయఁ • బడునయేని, సమరమున దేవదానవ • సమితినేని
చెలగియే తీరు విన్నెమి • చేయలేక, వదలినది యింతకంటె మో • దదము గలదె?

తే॥ ధీరుఁడగు హనుమానుండు • తెలివినంది, పనవుచోనది తగదని • పంపినాఁడ
నోషధులు గొని తెచ్చుట • కుత్తరమున, కాతఁడిప్పుడ వచ్చు నీ • లాబ్దదేహ.

తే॥ హిమగిరిని మేరువుం దాఁటి • యేగియున్న, యాంజనేయుండు వచ్చిన • యాక్షణమున
నీ మనశ్చింత లెల్లను • నీఁగు నిజము, నిముస మూఱడుమా! జగ • న్నియతచరిత!

ఉ॥ మార జితాంగ! యేను నజ • మాధవ శంభులు తక్క నెవ్వరున్
దీరుగ నోషధి స్థితులఁ • దెల్పఁగలేరు సుపర్వ దానవుల్
క్షీరపయోధిఁ ద్రచ్చుతఱిఁ • జిక్కిన వానిని విష్ణుచక్రమే
వారక కాచుచుండు నవి • వర్ధిలు నక్కురుభూమి కవ్వలన్.

తే॥ ఇందనుక నేరిచేనప్పు • డింపఁబడవు, నలువకైనఁ బ్రాణము లీయఁ • గలిగినయవి
పరఁగు సంజీవకరణి సౌ • వర్ణకరణి, యన విశల్య సంధాన క • రణు లవంగ.

తే॥ ఓషధుల నిక్కముగ వచ్చు • నుమ్మలికము, వదలు ధర్మమే త్రోవచూ • పంగ హనుమ
వచ్చుఁ దేఁగలఁ డతనికి • వలమవనవి, పనియుఁ గలదె? యోచింపుమా! భవవినాశ!

తే॥ అనుడు శ్రీరామభూపతి • యతని పలుకు. విని ముదంబందుచుండునం • తనె మహార
వం బుదీచిని పుట్టె నం • బ్రంబు పొరలెఁ. జండమారుతమేతెంచె • జవము మెఱయ.

తే॥ ఉడుగణంబులు వడిదప్పి • యరలె సూర్య. మండలము వోయి ద్విజరాజ • మండలమును
చేర నందలి జింక క్రి • శించె దగను. మొగుళు లొండొంటిఁ దేఁటుల • మొగిని తాఁకె

తే॥ వేళ్ల పూగుత్తులను విమ • వీథి కెగసె. భూధరమ్ములు బ్రమాఁకులు • మునుపటివలెఁ
గదలి లోఁబడె మారుతి గర్జనంబు. చెపె రామాదుల యెడంద • చింత దొలఁగ

ఆ॥ భువియు దివియు మేము • మఱి సాగరంబులు. తక్కినవియు నొక్క • తరుణమందె
గొప్ప రవము చేయు • కొమరున మందెను. గాడ్పుపట్టి సేయు గర్జనంబు.

ఆ॥ పాలవెల్లిఁ జిలుక • వైకుంఠు నాజ్ఞ మం. దరముఁ దెచ్చుచున్న • గరుడుకరణి
నొప్పె సురజవమున • నోషధీశైలంబుఁ. బరఁగఁ దెచ్చుచున్న • వాయుసుతుఁడు.

ఆ॥ పవనుఁడాత్రికూట • పర్వతంబుఁ బెకల్చి. తెచ్చుకరణి హనుమ • తెచ్చెఁదెచ్చె
ననుచునుండ నతఁడు • నవనికి దిగియె న. మ్మల సెభంబువంద • నిలిచె దిగక.

ఆ॥ మంద మారుతమ్ము • మందులతో వీచి. యెల్ల వారియెదలు • పల్లవింప
భానుసుతుసతోడ • వానరావళి యార్చె. నట్లుచేసె విబుధు • లలరుచుండ.

ఆ॥ విబుధ వినుతు లగుచు • విమతులై యుంకిన. కపుల మందుగాలి • కలయ వీవ
సొగసు చేవ దిటవు • నెగడఁ గాలు జయించి. నక్కవాత మట్టి • గ్రుక్కినారు.

ఆ॥ అసుర తనువు లెల్ల • నంబుధిఁబడుటచే. బ్రదుకవయ్యెఁ దక్కు • వశవఱను చి
గిర్చి ప్రాణమొందఁ • గిశుల విషయంబు. విప్పి చెప్పవలెనె • విశద ఫణితి॥

ఆ॥ అలుఁగు లూడె గాయ • ములు చల్లనై పూఁడెఁ. గలయనేత్రతార • కలు వెలించె
జగము వినుతిసేయ • సౌమిత్రి తెలివందెఁ. గూర్కునండి మేలు • కొన్నమాడ్కి.

ఆ॥ సప్త సాగరములు • సంక్షోభ మందంగఁ. గపులు సేయు వీర • గర్జనముల
లేచె లక్ష్మణుండు • లేఖుల భద్రగి. తముల లేచు శేష • తల్పుభంగి.

ఆ॥ లేచినట్టి యనుజు • రేఁచిన భుజములఁ. గౌఁగిలించుకొన్న • కంజ నయను
చింతతోడ సురలు • చింతయు జగముల. చింత తఱిగి విరిబి • చెదరిపోయె.

క॥ చెన్నుగ నాదిరి వేలుపు. టన్నులు కిన్నరుల గీతి • కా విపు లంపై
మిన్నులమె మునులు నిగమపుఁ. బన్నములు పఠించి రపని • పంతపుసేసెస్.

క॥ వేదంబులు ఘోషించెను. వేదవిదుల విజ్ఞతయును • విలసించెను వి
మ్మోదము నొందె జగము నం. భోదము లంభోధు లటిని • పొలుపుం బొందెన్

క॥ కొల తొలఁగిన యాపిప్పుట. నలువ నరము జానకీ ప • న స్పదసుకకున్
వలగొని కరుణించితనని. పలికి వినతిమై నదృశ్య • భావమునందెన్

చ॥ ఎడఁద దురంత చింత నశి • యింప మదశ్రు పరీత నేత్రుఁడై
పుడమిఁ కుమారి భర్త కపి • ముఖ్యుని వాయుతనూజుఁ గౌఁగిటన్
దడవి మదీయ పంశమును • ధారుణిలో యశమంద నిల్పి నా
యొడలిని విశ్రయించికొని • యుంటివి పేతొకఁ డున్నె చేయఁగన్.

ఉ॥ మా కుల పూర్వులెల్లరు క్ర • మంబునఁ బెంచిన ధర్మపద్ధతుల్
నాకతన న్నశింప మర • ణంబె భజించితి మేము నీవ యి
క్ష్వాకుకులంబు నిల్పితివి • ప్రాక్తన ధర్మములెల్ల నెక్కొనెన్
నీ కరుణం బదంపడి జ • నించిన వారము సుమ్ము పావనీ!

ఉ॥ ప్రాణము వోవువేళ నొవ • వంగల పుణ్యులు తామొసంగు నా
ప్రాణముతోడ వారలకుఁ • బ్రత్యుపకారముచేఁత సామ్యమే?
ప్రాణము లిచ్చు మాత్ర మన • భావ్యమె యిప్పని? మున్ దటన్ జగ
త్ప్రాణ కుమారకా! యరుల • ప్రాణము లార్చితి దూలు వోవఁగన్

ఉ॥ సోదరుమీఁది ప్రేమమున • స్రుక్కితి లోక మెఱుంగ నిట్టి యా
మోదము నీవు గూర్చుటను • ముందటి దుఃఖము మిక్కిలిన్ సుఖ
శ్రీదముగాఁ దలంతుఁ జిర • జీవివి సాయము యుక్తవేళ నా
కాదటఁ గూర్చినాఁడ వటు • లౌటనె నిల్చె జగంబు మేలిటన్.

ఉ॥ ఎల్లరు ప్రాణముల్ విడక • యిమ్మగు సౌఖ్యము లందునట్లు మే
మెల్లసిఁగఁ జేసి రౌప • యమ్ముల పంపక శాశ్వతుండవై
చెల్లుమ యంచుఁ బల్కెఁ గపి • శేఖరు లక్కట పీరనాద సో
దర్యల్లసి తాస్యులైరి పవ • నాత్మజుఁ డుబ్బున మ్రొక్కె యిట్లనున్.

ఉ॥ తమ్ములవైరిఁ ద్రిక్కి యమృ • తమ్మును తమ్మున కీయఁజాలనే?
క్రమ్మి దివమ్ము నందమృత • కుంభము దెచ్చి యొసంగఁజాలనే?
యిమ్ముగఁ జాలవెల్లి మథి • యించి సుధం గొనితేరఁజాలనే?
బమ్మను పట్టి తెచ్చి తల • వ్రాఁతనె మార్పఁగఁజాలనే? ప్రభూ!

చ॥ గురుతరమైన ప్రేరుణ • గూడిన వియ్యాది కార్యమే? యనన్
నిరవధి సత్త్వసంయుత వ • నేచర సింహమ! యెంతికెంతకే
సరుసహం డవైన నీవు కల • యంతకు నాపద మమ్ము చేరునే?
చెరసితి మేము సౌఖ్యములు • పేరిమితోనని రాముఁ డాడఁగన్.

చ॥ అతులిత శౌర్యశాలి! పవ • నాత్మజ! యిమ్ముల యింద యుండినన్.
దితిజకులంబు చావు వ • దింపనుచాలము కావునన్ యథా
స్థితి నట దీవినుంచి చను • దేరుమ వైళమ యంచు భల్లుక
క్షితిపతి పల్కెఁ బావని వి • శిష్టమతిం గొనియేగె శైలమున్.

## 24. హేపాలాన నటన పటలము (21)

క॥ ఇట విట్లు జరుగుచుండఁగ, నట రావణుఁ డుబ్బి కుతుక • మంది వినోద
స్ఫుట హేలా జనిత విశం, కట యువతీ నటన లీలఁ • గాంచుచు మండెన్

తే॥ అమరకాంతలు విద్యాధ • రాంగనలును, దైత్య వనితలు నాగ సుం • దరులు యక్ష
మధురవాణులు సిద్ధ బిం • భర సువేణు, లెల్లఁ డెందేఁపలై వచ్చి • రుల్లసిల్లి.

తే॥ రంభయును తిలోత్తమయు నూ • ర్వశియు మేన, కయు ఘృతాచియు బహువిధ • క్రమ వినత
వాద్యములతోడ లయరాగ • భావ సరణి. చెడక పాడుచు నాట్యంబు • చేసినారు.

చ॥ ప్రచలిత కుండలంబులు ప్ర • భా తిలకంబులు లోలనేత్రముల్
విచికిల దంతముల్ మధుర • పేశల క్రమ సుధాధరంబులున్
ప్రచుర మనోహరాలక వి • భాసిత తన్ముఖ చంద్రబింబముల్
రుచిరముగా వెలింగె ముఖ • రోచులు రాగము నొందుచుండఁగన్.

ఉ॥ తేటలు వాఱు చిర్నగవు • తెల్పును భూషల లేఁతయెండయున్
మూటలుగట్టు దీప గణ • ముల్ వెలిఁగింపఁగఁ జాలు మేని దా
ల్పాటులు జీరువాఱఁ గను • వారల తెల్విని వోలి మీటుచున్
బాటలుగా నిరుల్ పరుల • పాలయి క్రుంగఁగసాగె నయ్యెడన్.

చ॥ చదువులచేత సత్పథిని • చాఁగుచు భావి నెఱుంగు పెద్దలన్
ముదమున నాశ్రయింప గుణ • మున్ దెలివిం గదు విస్తరింప న
ప్పదురున మీఁదు గాన కిల • బ్రక్కలఁబైఁ బ్రసరింపఁజేయు దు
ర్మదుల పరాక్రమంబు వలె • మైకము నెవ్వడిఁ బర్వె నెల్లెడన్.

ఉ॥ నవ్వులు మించె దంతికుల • నాదెము వెల్వడె స్వేదబిందువుల్
నవ్వపుగా నెలర్చె దృఢి • మంబుగ వాతెఱలుం జలించె వే
విర్వటిలెం గనుంగొనల • నీటగు రక్తిమ విక్కెఁ గన్బొమల్
దవ్వికొనెన్ మొగంబులును • గాటపుఁ దెల్లదనంబు వారికిన్

చ॥ తలముడి లెల్ల వీడుచు వి • తంబములం దగదాఁటి వ్రేల మే
ఖలలు పటాలితోడుత ది • గంబర మానముఁగాచెఁ గేశముల్
తులువలు దుండగంబులకుఁ • దూకొన నుత్తము లడ్డువచ్చి దీ
నుల కగు బన్నముల్ తొలఁగ • నూకఁదలంచుట యుక్తమేకదా॥

తే॥ మదన మృగయుండు పొది నుంచు • ప్రదరమనఁగఁ, దగిన కన్నులతో నున్న • మగువలపుడు
స్తుతిని కలియక వెఱ్ఱి వ • ద్రములతోడఁ, బాడి రవ లయలో నను • స్వరముతోడ.

తే॥ వేణునాదంబును జయించు • విపులరవము, గలుగు చెలువల పాటల • గతులుదప్పి
కాకి యఖలుతో సుదయుంచు • కల్లుపేర్చు, తిరు తోడ్సంగ బాడిరి • తెలివిచెడగ.

తే॥ కాంచ నింద్రజాలమై యను • రదణిదోడ, భావ విస్ఫూర్తి సభినయ • పద్ధతులను
తెలుపు జాణలు నోటితో • ద్విపదము బలికి, వేరు కరములతో జూపు • వారలైరి

తే॥ ఆరుదురు పాడుదురు నవ్వి • యేడుతురును, తూలుదురునోలుదురువాల ప్రేలుదురును
పిలుగుదురు తూగుదురు • మూలుగుదురు, ప్రొక్కుదురు ప్రుక్కుదురు మీఱి • నిక్కుదురును

తే॥ మదిని గందావి సుంతయు • మఱుగుపఱప, లేక వెలిగ్రక్కినారలు • లేమ లట్టి
తెఱగుగాంచి విర్చిని జితేం • ద్రియుల రోమ, కూపముల • కోరులదరె

చ॥ భ్రమరములందలెం బలస • భావము నొందెదు కన్ను లెఱ్ఱనై
యమరెను రక్తిమంబగు ము • ఖాంబుజముల్ తెలుపొంద దైత్య వం
శమునకు భావినాశమును • జాడగ దెల్పెడిపోల్కి గన్పడెన్
ద్రుమ మొకటైన బుష్ప నిక • రుంబము వేఱుగ జూచెనో యనన్.

తే॥ యమువి కుంతంబు మదనుని • యలుగు నుదమ, గాగజెప్పిన నొప్పవి • కన్నులుగల
చెలులు హారంబులను రశ • నలను వస్త్ర, ములను గొప్పులలోపల • ముడిచికొనిరి

తే॥ మందహాసరుమల్ గల • మంచిగమన, లిట్టి గతులొందగవి మోద • మెనయుచున్న
రావణాసురు శ్రవణరం • ధ్రముల జొచ్చె, గపి సమూహంబు చేసిన కలకలంబు.

తే॥ పాట లాటలు కేకలు • వావ్యరవము, లలుప లాటల్ కౌతుకు మా • టలు కటాక్ష
ములను తక్కుచేష్టలు విరి • ముఖుల గట్టి, వలన వేడికి బుపులల్లు • వాడిముడిగె

తే॥ కట్టుగంబములందె నా • గములు సోల, వాజలం దూల నసుమల • వసిమి మాల
రామలక్ష్మణ శింజినీ • రావ మడరె, వార్ధి ప్రచ్చిన నాడటి ది • పంబుకరణి

చ॥ తరుణుల మాటముల్ ఎపి క • దంబమువోలె గనంబడంగ మం
దరము కలంప నొప్పు భయ • దంబగు నంద్రమునాగ మానసం
బఱిమఱి వెంద నిత్తచె ని • శాంతమ యయ్యు దశాస్యు మోము చం
దురునకు ద్రోపరానిదయి • తోచెను నట్ట పగ ల్విధంబునన్.

చ॥ విసవిస బంభిరాన్కృతిని • వేగులు వచ్చి దశాస్య కంఠ పు
ష్ప సరము లందువేరి పగ • వారయు ప్రాణములొంది చాల నం
తసమున నున్నవారన నె • దం దిగులొంది లతాంత శయ్యపై
మసలక మాని తత్త్తజను • మంత్ర నిశాంతము చేరె గ్రక్కునన్.

## 25. మాయాసీతా పటలము (97)

తే॥ చేరి వృద్ధులాప్తులు వింద్ర • జితుడు సైన్య, పతులు పిన జరిగినదెల్ల • బలుకునంత
మాల్యవంతుండు చింతమై • మనసువాడ, దెలిపె నిట్లు రావణునకు • ధీరమతిని.

చ॥ చెడు తలఁపూని దానవులఁ • జెచ్చెర నంబుధి వైవకున్న ని
య్యెడ ననువుల్ నిజంబుగ వ • హించియె యుందురు తప్పె నీదు దుం
దుడుకునఁ బంకజాసనుని • తూపె విరక్తిమాట వానరుల్
కడుకొని పైపయిం దొడరఁ • గా నొకయడుగు లేదు రావణా!

చ॥ కలఁక యొకింత గానని జ • గత్పతిపాలు కటాక్షదృష్టిచేఁ
జెలఁగి క్షణంబులోనఁ జని • చేవ మహౌషధి భూధరేంద్రమున్
బలిమిఁ బెకల్చి తెచ్చిన య • వార్యబలుఁడు మరుత్సుతుండె కా
వేయును తక్కువారలకుఁ • బల్కఁ దలంప నొనర్ప శక్యమే?

చ॥ మొలఁగొని పోయినట్టి యల • మారుతి పేరు ధరాధరంబు ని
శ్చలముగఁ దెచ్చి వైచిన న • దంగమె? లంకను కెల్లగించి భూ
స్థలిఁ దిరుగంగ వైచిన ని • శాచర వర్గము నిత్యనేర్చునే?
ములు చదనంబు మాని తల • పోయుట కార్యము విష్టరాంతకా!

చ॥ జగము లెల్ల నొక్కపరి • వావిఁగ మోఁదఁగఁ జాలువాఁడు సా
ధుగుణమునం ద్రిమూర్తులకుఁ • దోడుగ నాల్గవమూర్తి యంచు నెం
చఁగఁ దగువాఁడు మారుతి ని • జంబిఁకఁ జానకియున్న వాటికన్
నెగడఁగఁ జూచుటల్ తగవు • నెమ్మది నీవ తలంచి చూడుమా

శా॥ వాలిం గూలఁగఁ జేసి గొప్ప జలధిన్ • బంధించి లంకాపురిన్
గాలం బోలిన కుంభకర్ణు ననిలో • ఖండించు శ్రీరామ భూ
పాలున్ బుద్ధ్వద సన్నిధుల్ దనుజు • లా? దాఁటించి పన్నాఁడు వా
రేలా యీ యడియా... రాఘవునకుం • బ్రద్వేష సర్పించుమా

చ॥ పొలిసిరి వార్ధిఁ ద్రావి డిపి • భూమిని పేర్చి పహించఁ జాలు భూ
రులు; రణధాత్రినుండి యిసు • కల్ చనుదెంచినవారు నీవు నీ
యొఱమి సుతుండు దక్క మఱి • యెవ్వరు? గెల్చుట సున్న యట్టి యా
సలఁ బడి ప్రాణముల్ విడువఁ • జాఁగుట యెన్నఁగ బాలిశ్యమే?

చ॥ అనుటయుఁ బంక్తికంఠుఁడు భ • యంకరరీతి నవ్వి నీదు ప
ల్కనువులు మేలుమేలు పలు • కాడకు రాక్షసులెల్లఁ గూలినన్
బసుపడకుండఁ గైదువులు • వ్యర్థములైనను నాసికాగ్రమం
ననుపుగ నాని యున్న పలు • కంబుజనేత్ర నొసంగ నెట్లులన్

ఉ॥ జీవితముల్ వినాశమొగిఁ • జేసికొనన్ ధరణీతనూజ న
చ్యావిలబుద్ధిఁ దేను మది • నవ్యయ సౌఖ్యము లంపఁ గోరియే
యీవగఁ దెచ్చితిన్ బ్రదుక • విచ్చయె యున్న వినర్థకంబులౌ
జీవితముల్ భరించుము ప • సింపుఁడు నేన జయింతు నెల్లరన్

చ॥ అనుడుఁ గుమారుఁ డిట్టులను • పఙ్క్తిరథాన్వయ వార్ధిచంద్రమా !
విను మొకమాట యేను రఘు • వీరుఁడు తక్కఁగఁ దక్కువారిపై
వనజభవాస్త్రమున్ విడుదు • వాఁడను కావది వాని దేహమున్
జెనకక యే తొలంగినది • చిత్రము దీనిఁ దలంపఁగా నగున్.

ఉ॥ తీరుగఁ జర్పసేయ విది • తేలికగాదు రఘుప్రభుం డసా
ధారణ మానవుండు విన • తండ్రి వచించిన గర్వ మోహ వి
స్ఫారులు యోగు లెల్లపుడు • ధ్యానముసేయుచునుందు రా జగ
త్కారకుఁడే యటంచుఁ గొతు • కం బనిలేక యెఱుంగనయ్యెడిన్.

చ॥ అది యటులుండని ప్పురుగ • నైనది యైనది చింతయేల ? నీ
మది ప్రమదంబు నొంద నొకి • మార్గము చూతు నికుంభిలాస్థలిన్
గుదిరిక నొక్క వేలిమిని • కూరిచి పూర్తి యొనర్తు దుర్గుణా
స్పదుఁడు విభీషణుం డెఱుఁగ • భంగము సేయును యంచుఁ గుందెదన్.

సీ॥ ఐన విభీషణుఁ • డరయకుండెదు భంగి. సీత యాకృతి యొందు • సృష్టిచేసి
యువతిస్థితిం గాంచి • యున్నతి నందిన. హనుమంతు నెదుట దా • నివి వధించి
వరఁగ నయోధ్యకై • కరుగుచుంటిన యవి. వలుక వారలు భ్రమను • వడి యలంగు
వారు జానకి చచ్చె • ఫలమేమి యిందవి. తమ్ములు హితులు బాం • ధవులు పురము

తే॥ తెరలి నాశమొందున యని • మరలువారు. మరలకున్నను హనుమంతుఁ • బురికిఁ బంపి
యెఱుఁగుదాఁక దుఃఖముఁ భరి • యింపలేర. యంతలో నాను వేలిమి • నట ముగింతు.

చ॥ ముగిసినయంత వచ్చి కపి • ముఖ్యుల రాఘవులన్ వధించి నీ
కు గెలుపు గూర్తునంచుఁ దన • కూరిమి పుత్రుఁడు పల్క సంతసం
బు గలుగఁ బంక్తికంఠుఁ డమ • మోదము చూపెను మేఘనాదుఁడున్
జిగమిష మాయసీతను సృ • జింపఁగ నుత్తరువందె నంతటన్.

వానరులు లంకం గాల్చుట

మ॥ అట సుగ్రీవుఁడు రాఘవుం గని మహా • త్మా! దైత్యు లున్నట్టి యీ
పుటభేదంబు దహింపఁగావలయు నా • మోదంబు చూపింపవే
యటులైనన్ రిపురాజి వచ్చునవఁ గం • జాతుండు యోచించి కా
ల్చుటయే యొప్పని యాజ్ఞయీయఁ బ్లవగుల్ • కోలాహలోత్సాహులై.

మ॥ కొఱవుల్ చేకొని తన్మయంబుగ రజ • క్షోణి తలంబెల్ల నా
త్తరమై కన్పడనేగి దైత్యనగర • ద్వారంబున న్నిల్చి నీ
చిరి శంపాలతవోల్కి మల్కులటు లం • చ్ఛిద్రంబులై యెల్లచో
వటలెన్ దైత్య వినాశసూచకముగా • వారింపరాకుండఁగన్.

ఉ॥ లంకను కీలులేసిన య • లాతము లెల్లెఱఁబర్వి మున్ను నా
యంకుడు వార్ధిపైఁ బఱపు • నగ్ని శరంబువిధాన రేఁగి వ
ల్వంకలఁ గాల్చెఁ బెలుల ర • వంబులు దానవకోటి కూకలున్
సంకటపాటులుం దెలుప • శక్యమె? కోఁతులు పెక్కులై చనన్.

మ॥ ఒక మాఱిన్ద్రిమ్మరి మున్నువచ్చి యొగి వీ • య్యూరెల్ల దుర్వార వ
హ్నికి నాహారము సేసిపోయె నిపుడో • యున్నంతఁ దెల్పంగ లె
క్కకు రానట్టి వలీముఖావళులు లం • కం జొచ్చె వింకెట్లు చా
వక జీవించెదు వారమంచు భయ ది • గ్భ్రాంతాత్ములై రందఱున్.

ఆ॥ లోక వినుతుఁడైన • కాకుత్స్థ తిలకుఁడు, వహ్ని నుమియు బాణ • వర్గమేయ
గోపురంబు విఱిగి • కూలి త్రికూటంబు, పైనిఁబడియెఁ గపులు • ప్రమదమంద.

తే॥ మందు మలఁ గొనిపోయిన • మారుతి వడి, వచ్చి కంఠీరవ రవంబు • వఱలఁజేయ
విన్న లంక గరుడపక్ష • భీషణరుతి, వినిన నాగలోకస్థితి • నెనసె నపుడు.

శా॥ మాయాకార్య విశారదుండు జముతో • మాటాడి గెల్పొందు దై
తేయేంద్రాత్మజుఁ డుద్ధతుండయి మరు • ద్వీథిన్ మహారంభుఁడై
మాయాజానకి కొప్పు వట్టికొని భీ • మప్రౌఢి ఖడ్గంబుచే
వ్యాయామంబు వెలుంగఁ ద్రిప్పుచు జగ • త్ప్రాణాత్మజున్ డాయుచున్.

శా॥ మీరీ జానకికై దురంబు కడుఁబే • ర్మిం జేయుచున్నారు ర
క్షోరాజన్యుఁ డుపేక్షచే విడిన నీ • క్రూరాత్మ నేఁ జంపెదన్
దీరున్ సర్వము మీకు మాకు నన భీ • తిన్ వాయుపుత్త్రుండు మా
యారంభంబులు సర్వముం జెడియె నేఁ • డంచున్ మదిన్ గ్రుక్కుచున్.

శా॥ తప్పింపంగ నుపాయమేదియును చి • త్తంబందు కన్పట్టమిన్
నిప్పుం ద్రొక్కిన రీతిఁ దత్తఱిలి స • న్నీతిం బ్రశంసించుచే
యొప్పం బోలు నటంచు నిట్టులను గ • ణ్యోదారుఁ డావర్ధతుల్
మెప్పో? నీతియొ? యోగ్యమో? తగవొ? మే • ల్మిం గూర్చునో? తెల్పుమా?

మ॥ అరవిందాసన వంశ్యుఁడై సకల శా • స్త్రార్థంబుల న్నేర్చి యీ
కరణిన్ స్త్రీని వధించుటల్ పరమ దు • ష్కార్యంబుగా నేర్వవో?
ధరణీ వ్యోమములే పడంకునవి చి • త్తంబందు భావింపవో?
కరుణన్ దీనిని మాని కేని కని లో • కంబెల్లఁ గీర్తింపదే?

మ॥ కరుణాదూరత యేల? వంశ గురుతల్ • కాలుష్యముం జెందు దు
ర్భరమౌ నింద వహించు నైచ్య మబలన్ • బాధించి చక్కాడుటల్
స్థిరమౌ కీర్తి నశించు రౌరవము ప్రా • ప్తించున్ మహాపాతకం
బరవే సేయఁగ రాచపుట్టువునకున్ • యోచింపుమా రావణీ!

త్కరముల నాజిలోఁ దునుమఁ • గాఁ జనుదెంచిన వాఁడఁగామ దు
ర్మరణము తల్లి యొంప బవ • రంబున కిందఱఁ ద్రోఁడితెచ్చితిన్.

ఉ॥ జానకిఁ గానలందు కనఁ • జాలక చింతిలుచున్న రామ భూ
జానికి లంకలో జనక • జాతను జూచితినంచుఁ బల్కి స
మ్మానము నొందు నోటచె కు • మారుఁడు రావణి చంపఁజచ్చె నం
చేనె వచింపఁగా వలసె • నేటికిఁ గాల్పనె నాదు జన్మమున్?

చ॥ కడలిని దాఁటి లంక సొగి • గాలిచి సేతువుగట్టి మేరువుం
గడచి మహౌషధీ శిఖరి • నాకవమారఁగఁ దెచ్చి పీనముల్
పుడమిని లేరు లేరనెడి • భూరి యశంబు గడించినట్టి నా
యుడిగము బీఱు వోయెను వ • యోనిధి వింగుచ గల్పు కైవడిన్.

ఉ॥ సీతను కత్తిచేఁ దునుము • చెన్నటి నప్పుడ చంపనైతి న
జ్జాతముఖిన్ సమక్షమునఁ • జంపుచునుండఁగఁ జూచుచుంటి నీ
పాతక జీవితంబు నెడఁ • బాయఁగ జంకుచు నుంటి నింక నా
నీతకముల్ జగంబులు గ • ణించి హసింపకయున్నె? యక్కటా!

మ॥ అని చింతించుచు రావణాత్మజుఁ డయో • ధ్యాపట్టణం బేర్చఁగాఁ
జనియెన్ వానిని వెంబడించిన రఘు • క్ష్మాభర్త నాజాడ యే
మిని కాన్పింపమి నేమిగా వగచునో? మీఁదేమి కానున్న దో?
కనకున్నాఁడను తెల్పఁగాఁజనుచు యో • గ్యంబైన కార్యంబగున్.

చ॥ జరిగినదెల్లఁ దెల్పెదను • జానకిధర్తకు నాతఁ డయ్యెడన్
మరణము నొందునేని యట • మాఁదెడ నట్టలు కాక యాతఁడే
కరణి వచించు నానరణిఁ • గార్య మొనర్చెద రిత్తచింత నే
నొరయుట యేఁ? యంచిన-కు • లోత్తము చెంగట వ్రాలె గ్రక్కునన్.

ఉ॥ వాలి తపించి మానసము • ప్రాణము దేహము వాడ నూర్చుచున్
సోలుచుఁ దూలుచున్ మిగుల • గ్రుక్కుచు వెక్కుచు నేలఁగూల సం
శీలుఁడు రాముఁ డాతనిని • చేరఁగఁజేరి వచింపుమయ్య! యి
క్లేల తపింప? హేతువది • యెయ్యది? గొప్పది యుండు మారుతీ!

చ॥ నుడువుమ యన్న నాతఁడు కి • నుంగవ నక్రియు గ్రమ్మ మేఘనా
దుఁడు జనకాత్మజ న్నృపకి • త్రోవెన యంచు వచించి యాపయిన్
నుడువ కొడల్ గదల్పక క • నుంగవ యార్పఁ యూర్పువుచ్చ కు
గ్గడుపగు చింతనొంది యొక • కైవడి గ్రమ్మడి యుండె నత్తఱిన్.

ఉ॥ ఆ పలుకుల్ చెవింబడిన • యంతన్ కీశవరేణ్యు లెల్లరున్
రాపడి వాతఘాతమున • గ్రాఁకులు గూలియనట్లు రామ రా

మా! పరమాత్మ! యెదిగలి • మారని రాముని పాదసన్నిధిన్
దాపముచేత బెగ్గిలి వి • తానముఁ గూరిరి దారజీస్తరిన్

ఉ॥ చిత్రమువోలె సూర్యకుల • శేఖరుఁ డొక్క క్షణంబు నిల్చి సౌ
మిత్రికి మాఱుపల్కకర • మిత్రులఁ జూడక మత్తుఁ దేనియున్
ధాత్రిని సుప్తియైన మదిఁ • దాళఁగలే నభిమాన మక్కనం
దోత్రము మాటికిఁ గుప్పు నసి • దూరి ధరాస్థలిఁ వ్రాలె గ్రక్కునన్.

ఉ॥ అగ్రజు చింతఁ గాంచి తమ • కైన సుమస్మృతిఁ గాంచి కార్య మ
వ్యగ్రతనుండి యుమ్మపడి • పచ్చియు నాశము చెందఁ గాంచి వీ
రాగ్రణి లక్ష్మణుండు హృద • యంబును మేనును వాడఁ దల్లి ప్ర
త్యగ్రత పీడు త్రేపుపలె • నారటమందుచు వ్రాలె మేదినిన్

చ॥ మదిని విమర్శపైఁ బ్రతి పి • పన్న యొనర్చు విభీషణుండు త
న్నెద కుదియింప నార్తిగొని • యేమియుఁ దోఁపక గెల్పు లేమి దు
ర్మదుఁడగు మేఘనాదుఁడు ధ • రాసుత చే దనుజాళి తెల్ప నా
పద ఘటియించె నంచుఁ గర • వాలునఁ ద్రుంచెనొ యంచు జంకుచున్.

చ॥ చల్లనినీరు మోమునఁ • జల్లి పసంబులు మేను నొత్తఁగా
మెల్లనఁ గన్ను విచ్చి రఘు • మేదినినాథుఁడు చూచె లక్ష్మణుం
డుల్లము [illegible]ంప [illegible] • నొయ్యనఁ గాంచి యితండు జీవముల్
తెల్లము పీడువాఁ డసువుఁ • దేర్పఁ దలంచి సహించి యిట్లనున్.

ఉ॥ అల్పులు చెప్పరంబు తఱి • నార్తిని క్రుంగి కృశించువార ల
య్యల్పవిధంబు నీకుఁ దగు • నా? పగవారలు ఎవ్వఁ జిత్త సం
కల్పము మాని యన్వయపు • గౌరవముం దిగవాడి ధర్మపుం
బొల్పును పీడి యిట్లు దిట • ముం జెడఁ జింతిలఁగాను రాఘవా!

మ॥ అసహాయన్ బతిదేవతన్ సుజన లో • కారాధ్య వైదేహి నొ
క్కసురుం డంటి వధించె నంచు విటు శో • కాక్రాంత చిత్తుండవై
మసలం జెల్లునె? యక్ష నాగ మఖభు • క్సమ్మీంద్రు లై రేనియున్
వసుధన్ సజ్జన హింసచేయ వడి న • వ్వారిన్ వధింపందగున్.

మ॥ జగముల్ వేద్పడకుండుటా? దనుజ దౌ • ర్జన్యంబు లిట్లేచుటా?
నిగమ వ్యాపృతి సాగుటా? తగవు పు • ణ్యంబుల్ ధర న్నిల్చుటా?
తెగి సాధుల్ నశియించుటా? మనము నా • త్రింగుంది శోకించుటా?
పగవారల్ బ్రదుకొందఁగా మన ధను • ష్పాండిత్య మడ్డొంచుటా?

మ॥ త్రుటిలో లంకను బూదిచేసి దనుజుల్ • క్రోధాగ్రోపుతోఁ బోవు ది
క్తటముల్ గాల్చి దివంబు గూల్చి మది శాం • తంబందుటల్ మాని త్రా

క్కటపాటొంది శిరంబు వ్రాల్చికొని దుః • ఖంబందుచుం దేవి య
క్కట ! యీపేదతనంబు వీరజగము • ద్ఘాటించి యగ్గించునే!

చ॥ పురమున విట్టి ధర్మమును • పూవియె రాజ్యమువీడి కానలం
బొరఁబడి దేవిఁ గోలుపడి • స్రుక్కుచు లంకకుఁ జేరి యిందు దు
ర్భరమగు దుఃఖమొంది పసి • వాడుచు ధర్మము ధర్మమంచు ని
బ్బరికము గొందుమేపి యుకి • వంబున కీడ్వరె కట్టి శాత్రవుల్

చ॥ వగపు భరింపలేక మసి • ప్రాణము వీడితిపేవి లోకముల్
వగతుఁడు పట్టి తెచ్చి తన • భార్యను మ్రోల వధింప రాముఁడా
పగతుని కొందిఁ కొంది కపి • వాయఁగఁ జంపెడి శక్తిలేక సి
గ్గు గొని మరించె నంచు విను • గుప్వకరింగొని విందపేయవే!

మ॥ తిగ నీపైఖరి పీఁదధర్మము సుమి • త్రా పుత్త్రకుం డాడుచో
వగలో మున్గిన సూర్యసూతి యొక స్వ • ప్నంబంది మేల్కన్ను బో
యగమై లేచి పరాకులేల వడి దీ • పాగ్నిం బతంగక్రియన్
నెగయం జూచు దశాస్యు తొమ్మఁయి లం • ఘింపంగ రండో వెసన్.

శా॥ లంకా పట్టణముం బెకిల్చి వడి నే • లంగూల్చి యిల్లాండ్రతోఁ
జంకం బిడ్డలతో సుహృజ్జనులతోఁ • జక్కాడి యన్యాయ మీ
పొంకంబంచు విలింపు లద్దుపడివం • బొంగార్చి లోకం బద్రై
త్యాంకంబై చనఁజేసి తీఅవలెఁ గా • ర్యంబిద్ది రండో వెసన్.

శా॥ ధర్మంబే యగుఁగాక యారసిన దు • ర్ధర్మంబె యౌఁగాక దు
ష్కర్మారంభుల దుంపద్రెంప కిటు శో • కస్వాంతులై యుంట స
త్కర్మం బెట్లును కాదు రండమదు మా • ర్తాండాత్మజుం డాదఁగా
నిర్ముక్తంబులఁ బోలి లేచి రతవిన్ • వెన్నంటి శాఖాచరుల్.

శా॥ ఉత్ప్రేకించుచు లేమ వానరుల యు • ద్యోగంబు వీక్షించి నం
విత్వంయుక్తుఁడు వాయుసూతి యిఁక మీ • విన్నాణముల్ చాలు దు
ర్మాత్వర్యంబునఁ గోసలంబు పయి కిం • ద్రద్వేషి దండెత్తె మీ
యుత్సాహంబులు వ్యర్థమయ్యె నవి దై • త్యాద్వేశముం దెల్పెదున్.

## ఇంద్రజిత్తయోధ్య కేగెనని విని రాముఁడు చింతించుట

తే॥ తల్లులను తమ్ములు మహార్తి • దవముచేయు, చున్న కోసలంబునకు దై • త్యుండుపోయె
ననెడు వార్త చెవింజొర • సనఘు మనము, కలఁగినది మఱి మిక్కిలి • కలఁగఁబాఱె.

శా॥ క్షీరాంభోనిధి యోగనిద్ర విడి వ • చ్చెన్నాఁగఁ జింతా మహా
పారావారము తీఁ మొంది త్రుటియుం • బంటింప కూటాడు పీ

తా రామా రఘువీరుఁడు చిత్తమునఁ గాం • తాశోకంబు సంపంబు దు
ర్వారంబై చన నిల్పె సంక్షుభిత వా • రాశిక్రియన్ గాసిమై.

శా॥ నాయీ దుర్విధి సీతతోఁ గడచి యం • తం దీఱదయ్యెం గదా?
మాయం జేయఁగఁ బూనె మాతులము ని • ష్మాత్రాన శాంతించునే?
యేయెవ్వారలఁ జేరి యింకను మహిన్ • హింసింపఁగా నున్నదో?
యీయార్తిం దొలఁగించు త్రోవ గలదే? యేమౌదునో తమ్ములన్?

శా॥ చేతో వేగ విమాన మెక్కి చను నా • చెన్నుంటి మొక్కింత కా
లాతీతం బొనరింపకుండ నెవరీ • లన్ సర్వ నాశంబుగా
భూరిం గల్పను దుష్పగుండ నగు నా • భూభార జన్మంబుచే
సీతం గోల్పడి యిందునందు జన వి • శ్లేషంబు గావించితిన్

మ॥ మరణం బింకను నాకు రాదుగద నన్ • మన్నించు నా తండ్రులన్
ధరణీజాతయు రాక్షసాళివలనం • దల్లుల్ సుహృద్బాంధవుల్
పురవాసుల్ మరణింపఁజూచినది యీ • పుణ్యంపు జన్మంబు నా
కరణిన్ మున్నెవఁ డుద్భవించె కుల ని • ర్ఘాతకుఁడుగా మేదినిన్.

మ॥ ఇట నర్తిల్లిన దేవియుం దెలియలే • కింద్రంబుఁ బొలసంగ వా
రట నాతమ్ముఁ డెటేంగి తారసిలినన్ • యామ్యాటుఁ దేహాది యు
త్కట దర్పాంధ పాశబద్ధుఁడనుగాఁ • గావింపఁ బక్షీంద్రుఁడా
దట నేతెంచునె? మంచుఁ జేయఁగ జగ • త్ప్రాణాత్మజుం డుండునే?

మ॥ అనఘా! వ్యోమమునన్ వడిన్ జను నుపా • యం బున్నచోఁ దెల్పుమా
కన నీయుస్త్రవి యుండనీ వదలనీ • క్రవ్యాదయుద్ధంబు గం
గనె పోనిమ్ము దురాత్ముఁ డింద్రజితు న • క్షంబుల్ చిరంజీవు లి
చ్ఛను చంచూపుటిఁ దోఁడి తిన్న యవలన్ • సాధింతు నన్వేచ్ఛలన్.

మ॥ అన సౌమిత్రి నిరోధియై పలుకు నా • ర్యా! సంగరంబందు మా
ర్కొని కైకేయి తనూజుఁ గట్టుటకు నా • క్రూరాత్ముఁడౌ మేఘ గ
ర్జనుఁడే కాదు త్రిలోకముల్ చెనకినన్ • జాకుండఁగా నిల్పునే?
వనుగా నెంచితివేమి యాభరతు! న • న్నా! బుద్ధి తార్మాణుగన్.

మ॥ యము నా రావణి తానె ప్రేమమున నా • హ్వానించి కొంపోయి సై
న్యముతో ధారణిఁ ద్రెళ్ళియుండుటయె పీ • వచ్చోట వీక్షింతు వి
క్కము సందేహములేల చింత విడుమా • కానున్న కార్యంబు పం
క్తిముఖున్ వాని కళత్రముల్ మిగుల దుః • ఖింపంగఁ జెందాడుచే.

మ॥ అని సౌమిత్రి వచింప వాయుసుతుఁ డూ • హాపోహముల్ సేయఁగాఁ
బనియే? మద్భుజ పీఠినెక్కుఁడు మనో • భావంబుతోఁ జేరెదన్

బనుపన్ శాత్రవులన్ పఠించి త్రుటిలో • వత్తున్ మహాసేనతో
డనె ధాత్రిం బెకలించికొంచుఁ జనువాఁ • డం దెల్పఁ దేదిష్టమో ?

శా॥ చంపన్ వచ్చిన మేఘనాథునకు భూ • సంజాత గిట్టింపు ద
ప్పింప న్నీతులు పల్కెఁ బోటి నవలన్ • విర్వేకునన్ గెల్చి బా
ధింపన్ మూర్ఛిలినాడఁ గాఁ యినచో • దేవిన్ దురాత్ముండు దాఁ
జంపన్నేర్చునె? చంపి జీవముతో • సాగఁగ వాఁడోపునే ?

మ॥ కడఁకన్ వారధి మనో జవంబున కలం • కం బొందఁ వెన్నంటి యా
దురుకం డీల్గఁగ నెత్తిపై దుముకెదన్ • దుర్దాంత విఘ్నాతమన్
వడి ముందేగి యయోధ్యఁ జేరెదను సం • భావింపఁ దేదర్హమో
తడయన్ లాభమె? యన్న దాశరథు లు • ద్దామక్రియన్ లేవఁగన్

మ॥ కవి దైత్యేశ్వరుఁ డొక్కఁడిన్నవము ని • ల్కం బొందుఁడీ దుఃఖినై
మన పేమాత్ర వశంబుగాక యపు డ • మ్మాడ్కిన్ భ్రమం బొందితిన్
దనుజుం డా ధరణీజఁ జంపుట యస • త్యంబంచు నూహించెదన్
జనసంస్తుత్యను తాఁకి వాఁడు బ్రతుకం • జాలండు విక్రాంబుగన్.

## విభీషణుఁడు తుమ్మెదయై జానకిం గాంచి వచ్చుట

చ॥ పరమ పతివ్రతం జెనక • ధర్మము గాదె జగత్త్రయంబు ? వి
బ్భరమున నట్లయైన నొక • పాట నయోధ్యకుఁ బోక చూడ న
చ్చెరువగు సన్నియుం జటిక • పేపున సత్య మెఱింగివత్తుఁ జె
చ్చెరవుల మాని యుండుఁడని • చివ్వనఁ దుమ్మెద రూపుతోఁ జనెన్.

ఉ॥ తుమ్మెద రూపుగొంచు గుణ • ధుర్యుని రాఘవవర్యు ధీర చి
త్తమ్ముపలెన్ వెసం బఱచి • తాల్మి నశోక వనంబుఁ జేరి చి
త్రమ్ము బలేఁగా వినిఃఫ్పలతఁ • దాల్చి లపించెడు రామదేవి నా
త్రిమ్మనఁ గాంచెఁ గాంచఁ గను • దమ్ములు హృజ్జలజమ్ము శాంతిలెన్.

శా॥ నా దుఃఖమ్ములు మేనితోడనె తొలం • గంబోలు నంచూర్చు రా
మా దీపాథము నోర్పుమై త్రిజట న • మ్మాన్యోక్తులం దేర్పఁ జిం
తా దాహంబును మాని వాసర మృగేం • ద్ర ధ్యాన మాలించి స
మ్మోదం బందుచు జీవముల్ నిలుపు న • మ్ముగ్ధం గనె భక్తిమై

తే॥ మాయయని దిగులును చింత • మానియున్న వి. భీషణుండు రావణి వికృ • తిలుఁ గ్రతువు
పేయఁ జనెనని బహుళ దై • న్యయు పేన. లరుగుచుండుటయును మది • నరసి కాంచె.

చ॥ క్రతువున యజ్ఞియంబులు క • రంబుగఁ దృప్తి యొసంగు మాఱుగాఁ
గుతిల యొసంగఁ జేయునని • కూర్చు నధోగతి నంచుఁ గుందుచున్

గ్రతుభుజాలెల్ల గాసిలుట • గాంచి విభీషణుఁ డింద్రజిత్తు డ
త్విశమది బొర్దదంచుఁ జను • డెంచి రఘూత్తముఁ గాంచి యిట్లనున్.

ఉ॥ దేవి సుభాన సన్నయది • తెల్పెడు వారలు మన్నవారు ని
ర్జీవితి గాదు క్రొత్తదికిఁ • జేటును కల్గనె? మాయచేసి యా
రావణి శత్రు దుర్దయ క • రంబగు వేలిమి సేయఁబోయినాఁ
డావిధిఁ బూర్తిచేసి మన యందఱఁ జంపఁ దలంచె రాఘవా!

తే॥ అని విభీషణుఁ డాడిన • యంత నేడు, జగము లేడుదీవులు నేడు • సాగరములు
చేరి ఘోషించు చందాన • నారవంబు, చేసి రాదిరి పాడిరి • చెలఁగి కపులు.

## 26. నికుంభిలా యాగ పటలము. (183)

శా॥ శ్రీరాముండు విభీషణుం దడవి యా • శ్లేషించి మిత్రంబ! యీ
మారాముల్ వివరించి కష్టముల నా • సం గాల్చ సీ టి దీ
ఘూరుం డఁజని పుత్త్రిఁ డుండెఁ బరమే • శుం గాంచె గావించు పు
ణ్యారంభంబును దిద్దు తక్కు బల దై • ర్య స్ఫూర్తి యొ ప్పొప్పవే

చ॥ అని వినుతింపఁగా శిరము • నాత డు వంచి మహీశ • యాగ సి
ద్ధిని గొనునేని వానిని వ • ధింపట దుష్కరమౌను గెల్వియున్
దనుజాలకే ఒలించు నట • దక్షత లక్ష్మణుతోడ నేగి పే
ర్మిని వెదఁజేసి దైత్యు బల • లీల వధింతు మనుజ్ఞ యిమ్మనన్.

ఉ॥ మంచిది యట్లె చేయుఁదని • మన్నన చేసి సుమిత్ర పుత్త్రి వీ
క్షించి గరాసు కైతవము • చేసి విరించి శరంబు నేయఁ గో
పించి తొలంతు గాని ప్రతి • భీషణభంగిఁ దదస్త్రమే ప్రయో
గించిన లోకజాలములు • గీడ్పడు నవ్విధి చేయఁబోకుమా.

ఉ॥ పాతకతంబు పైష్టసము • పాయక యేయున మేని వానితో
నే శమియింపఁజేయు మరి • నేర్పున మాయలు పన్నునేని త
న్నాశము ధర్మపద్ధతి నా • వర్పము ముమ్మరమైన పోరునన్
గ్లేశము దైత్యుఁడొందఁ జరి • కించి వధింపుము లావు పెంపునన్.

శా॥ రోసంబారఁగ బాణవృష్టి నొగి శ • త్రుండొప్పఁ గుప్పింప బా
ణాసారంబునఁ ద్రోవఁజేసి యరి హ • స్తాధిక్యముల్ తగ్గుచో
గాసింబొరిద నెఱంకు లంట విశితో • గ్ర స్ఫార నారాచముల్
చేసుద్దిం జతగూర్చి యేసి శమనుం • జేర్పింపుమా లక్ష్మణా!

తే॥ ఎదిరి విడుచు దివ్యాస్త్రంబు • లెఱిఁగి వాఁడు, విడుచునంతలోఁ బ్రత్యస్త్ర • వితతినేసి
యడ్డుపెట్టుము వాని యా • హవముల నాస్య, చిహ్నములచేఁ బరీక్షించి • చేయు పోరు.

తే॥ అనుచుఁ బెక్కుపాయములు వ్యూ • హములపర్మ, ములను తెల్పిజగద్భర్త • సులభుఁడైన
విష్ణుచేతి కార్ముకమిది వేడ్కఁ దీని, గొనుము శత్రులఁ గూల్పుము • యనుచు నొసఁగె.

తే॥ దీనిఘనమహిమ మగస్త్య • మౌనిమున్ను, తెలుపమనసున నాటంగఁ • దెలియుదుకద?
ఈ సహస్రశీర్షు యంబ • కొసనము వి, రించనుఁడు తొల్లి వేల్మి కా • వించిపొందె.

తే॥ తోయజాక్షుండు తాల్చిన • తూణిపిస్తె, యక్షయ శరంబు గొనుమని • యలరనిచ్చి
యలమి యుత్సాహవాక్యంబు • లెలమినాడి, పెల వొసంగెను జానకీ • చిత్తహారి

తే॥ మునులు ఖేచరులుబ్బిదీ • వనలు సేయ, సంగరోత్సాహుఁడగుచు ల • క్ష్మణుడు త్రిపుర
ముల దహింపవెడలు రుద్ర • మూర్తివోలెఁ, బ్లవగబలములతో నప్పు • పయనమయ్యె.

తే॥ పవనసూతి ప్రభృతి వీర • వరులతోడ, వెడలు మనుచుండు శ్రీరామ • విభునిపాద
జలజములు మదిలోన పె • ల్పలను తోఁపఁ, దలను దాల్చి నడచె వీర • ధర్మధనుఁడు.

ఉ॥ రాముఁ బ్రదక్షిణించి సమ • రంబునకుం జను లక్ష్మణుండు ప్రో
ద్దామక వామహస్తమున • దార్ఢ్య శరాసనమున్ ధరించి సు
త్రామ భయాపహారియగు • దక్షిణహస్తమునన్ శరంబు సౌ
రై మెఱయంగఁ బట్టి పగ • యాదలఁ దెబ్బెద నంచు వెల్వడెన్

ఉ॥ కన్నెదఁబాయకుండు తన • తమ్ముఁడు వీడి చనంగఁ గాంచుచున్
మున్ను మునీంద్రుతోడ మఖ • ముం బరిరక్షణసేయ నేగుచోఁ
దన్నను తమ్ముఁ బో విడిచి • తాళక తండ్రి వహించు తల్లడన్
గ్రన్నన నొందె జీవములు • కాయము వీడఁగ లేని కైవడిన్.

ఉ॥ కేల నలాతిముల్ గొనుచుఁ • గీకులు కొండలు కోనలున్ వడిన్
జాలుగ దాఁటి లోకముల • జానుగఁ గద్పుచుఁ దాల్చుచుండు సం
శీలుఁడు మట్టియాకుపయిఁ • జేరె యడంగిన వైనమొంది దై
త్యాలి రవంతచోట నడఁ • గారు నికుంభిలఁ గాంచి రెల్లరున్.

సీ॥ ఆ మేఘనాదుని • హోమాగ్నికుండముఁ, జక్రాయుధము వరు • సలుగఁ జుట్టి
కాపాడుచున్నట్టి • యేపున బితబాగ్నిఁ, గడలిచుట్టిన యెన • కిమున సైన్య
సమితి వ్యూహముపన్ని • చక్రవాళమునంటి, జగమెల్లఁ జుట్టంగఁ • జాలియుండెఁ
బొడవైన నల్లని • యొడళులపై నెఱ్ఱ, వెంద్రుకల్ మిన్నంది • వెలుఁగుచుండ

తే॥ రామవిభుఁడు కోపమున వా • రాశిమీఁద, పన్నిసాయక మేయ నం • బరమునంటి
కదలి మండుచుండిన మాడ్కి • గాపఁబడుచు, నుండె దానవబలములు • గంతుసేసి.

తే॥ గుణరవములేని వింట్లింద్ర • ధనువుఁబోలెఁ, జిందములు సంభ్రమముననుండు • చెన్నుదోఁచె
భేరు లలియని మబ్బుల • తీరుదాల్చె, హరులుఁ గరులును చాంచల్య • మరయకుండె.

క॥ చలియింపని జలధివలె, న్నిలిచి మొరయకుండు యామి • నీచర సేనం
దిలకించి వనచరావళి, తులకించి, రసించె మిన్ను • తూంట్లు పడంగన్.

క॥ గర్జించిన విపులసుఁ బ్రతి, గర్జన మొనరించె దనుజ • గణములు భేరుల్
గర్జించె రెండు మొయిళులు, గర్జలతో దాల సంద • రంబులఁ గురిసెన్.

క॥ కొలఁకున హంసలు వ్రాలెడు, పొలుపునఁ దళతళల కైదు • పులు వనచర సే
నలపైఁ బడెను ధరపైఁ, బలపమని తలలుఁ గేలుఁ • బలములు రాలెన్.

క॥ వానరులు దాలు మ్రాఁకుల, నూనముగా ముసర విసర • నొత్తుగఁ దలలున్
మేనులు వండ్లును కైదువు, లానకములు తునిఁగి విఱిగి • యవనిని రాలెన్

క॥ పటిశ కరవాల తోమర, శర కుంతి గదా ముసుండి • సాధనముల ని
ర్జరవైరు లేయ వనచర, శిరములు కడుపులును వ్రస్సి • చిందెను ధరపై.

తే॥ ఎవ్వరీసేన సమయుటః • యెపుడు వేల్మిఁ, జెలుచుః టిప్పని యెడ సేయఁ • జెడుసమ స్త
మని విభీషణుఁ డారాము • సనుజుఁ గాంచి, పలికి లెమ్మని తొందర • బడచె నపుడు.

తే॥ అచటి కింద్రాదులును చతు • రాననుండు, యక్ష కిన్నర కింపురు • షాదులెల్ల
వచ్చి వింగి నిండిరి రాని • వారలేవ, లక్ష్మణేంద్రజిత్తుల నేర్పు • లావు చూడ.

చ॥ రథముల గుంపు వారణ వ • రంబుల పెంపు జ్వలించు దంష్ట్రిహా
యుధముల వంపు వాద్యముల • యుద్ధతిసొంపును నోఁకు పెంపు సం
గ్రధితములైన భంగి మెగ • రంబున నిల్చిన జంపు సంగర
ప్రధనము సంపు వాద్యముల • అలపును తెల్ప నశక్య మయ్యెడన్

శా॥ సేనంతొల్చె సుగ్రీవపటి శర వృ • ష్టింగూర్చి యేపారఁగా
నానానేకప యూథముల్ రథ విమా • న వ్రాలిముల్ సుందరా
జానేయంబులు దానవ ప్రకరముల్ • సంఘంబులై కూలి లం
కా పీవృత్పథమందమేగి యమ లో • కంబందె నొక్కుమ్మడిన్.

చ॥ శరములచేఁ దువింగిన గ • జంబుల దేహ మహోదరంబు లా
దురమునఁ గొండలం దొనలి • తోయము తోఁపఁగఁజేసె రాక్షసో
త్కర శిరముల్ మదేభములు • త్రవ్విన పల్లములందు గూలి ని
ర్జర రిపు యజ్ఞ కుండమున • రాఁజిన ద్రవ్యములట్లు రాజిలెన్.

శా॥ ధూళిం బ్రుంగిన హారి సన్నకుట సం • దోహంబు భల్లూక దం
తాళుల్ త్రుమ్మఁగ మిన్ను మిన్నుమవి రం • గై వెల్గ వర్తీకమం
బోలెన్ గ్రువ్విన బాణజాలములతోఁ • బొల్పారె రక్తాపగల్
వేలన్ మీఱి పయోధిఁజేరెఁ గుణపా • ళీల ప్రపంచంబుతో

క॥ గొడుగులు కాఁడలు విఱుగం, బడమిని రక్తప్రవాహ • మున మునుఁగుటచే
నుడుపతి విధుంతుదువిచే, వడి మ్రింగంబడి వెలుంగు • పగిదిం దోఁచెన్.

క॥ తుండంబులతో మదగజ, ఖండంబులు త్రుంగి రుధిర • ఘటవింబడి యు
ద్దండగతి నడచు నౌకా, కాండంబుల పగిదిఁ దరలి • కదలిం జేరెన్.

తే॥ కుణపములఁ దినఁగోమాయు • గణము విందెఁ, గాకులును గ్రద్దలును చేరెఁ • గడుపునింప
బోరువలు వచ్చె రాబందు • పుఁగు లడరె, లక్ష్మణుని విలువిద్దియ • లావుమెచ్చి.

తే॥ చిప్పలుమియు శిరంబులు • వ్రచ్చిమఁడఁ, జేయఁ గప్పుడుటొంతలు • చేర్చి కాల్వ
వెదురుటకవులు మండిన • విధము దనర, మండిచెదెఁ గొంత వేదండ • తండమపుడు.

క॥ భల్లూక నఖములు రాక్షస, మల్లుర శిరములను గ్రొచ్చి • పలయించుట పె
న్గొక్కుం బుట్టల గములం, జెల్లగిలం ద్రోచు పగిది • విలసిల్లె నటన్.

తే॥ సింహ విక్రములగు నింద్ర • జితుని భటులు, రథిప లాధోరణులును తొ • రంగికులును
క్రమ్మి వర్షమ్ముపోలె నా • యమ్ములందు, కుప్పమ్మనమ్ములతోడనే • గూలె హరులు.

క॥ అటనటఁ దునిఁగిన యంగము, లటనటఁ దినఁగోరి పులుఁగు • లటనట బెరయం
జొటజొటమని కాఱిన నె, త్తుటఁ బుటుకున మంచి పడిగెఁ • మటుముల శిరముల్

క॥ ఒకటి వెనుక నొకటిగ పట, నకటావికటముగ వ్యూహ • మమరిన సేనా
నికటమునఁ బెటిలఁ దేరులఁ, బ్రకటంబుగఁ గూల్చె రాఘ • వశ్రేష్ఠుఁ డొగిన్.

క॥ విలయానిం హతిచేఁ గొం, దలు మొయిళులు పాటవము చె • దం దుల్లిన యా
పొలుపునఁ దఱలను మేనులు, గులగులలై వెగసి హోమ • కుండమునఁ బడెన్.

క॥ నక్తంచర శిరములు తమ, ముక్తములై సంతతంబు • మోఁదుటచే శా
స్త్రోక్తముగ నిలుపు కుంభ ము, లక్త్రు ఘటమట్లు మురిసి • లవలవ యయ్యెన్

క॥ కరి తురగ భట శిరంబుల, నరుదారఁగ పీడ్చికొని ర • యంబునఁ జని నె
త్తురుటేళ్లు యాగశాలం, దరవి మఖానలము చల్లఁ • బడి చెడ ముంచెన్.

క॥ అడిపములతోడి చరములు, పిడుగులవడువునఁ బడంగఁ • భీమఁగు లయ్యెన్
దడదడి యెనుములు మేఁకలు, కడు నాహుంతికొఱకుఁ గట్టు • కంబంబులతో.

క॥ తమ మదగజములు గూలఁగఁ, దమ మేనులు చిమఁగకుప్ప • దాశరథి మహా
స్త్రములకు జడిసి నిరుల్చా, హమున రుధిర తటినులంచ • యదఁగిరి సోఁకుల్.

క॥ పదములు శిరములు నొవ్వఁగఁ, బ్రదరంబులు గ్రుచ్చ నిలిచి • వదఁ కెడువారున్
పిదపిద ప్రేవులు వెలివడ, నదవదలై సోలువారు • నైరి సురారుల్.

క॥ కినుకగొని రణము సలుపుచుఁ, దనువులు వ్రీలంగ సోలు • తనుజుల స్కంధం
బున మోచుచుఁ బ్రేవులు పీఁ, పున వెలివడఁ ద్రోచికొనుచుఁ • బోయిరి దనుజుల్

క॥ జన్నపుఁ బాత్రంబులు వి, చ్ఛిన్నములై వస్తువితతి • చెదరఁగ నట్టల్
వన్నుగ నాడెమ ద్రవ్యో, త్పన్నంబై యజ్ఞశాల • సదమదమయ్యెన్.

క॥ గాలివలె విపము లైవడి, సాలింద్రుర కదురుగతి రు • జా సన్నిభమై
పాలంబడు వేమఱివలె, నాలంబునఁ గలఁగి దాన • వావలి పమసెన్.

క॥ తాఱుచు నొదుఁగుచు గ్రిందికిఁ, దూఱుచు వడఁగిన సురారి • తుటుములు వాఁడిం
జేఱిన లక్ష్మణశరములఁ, నాఱెన్ జరరములు వ్రస్సి • యాంత్రము లరలన్.

క॥ నరవరు శరములతో వా, నరు లేసిన తగలు గిరులు • నక్తంచర సా
గరమున గాలియు నుఱుములు, మెఱుములతో దిగిన మొగులు • మెయివడిఁ దోఁచెన్.

క॥ చెల్లాచెదరై సేనలు, త్రుళ్ళగఁ దరువాండు వీచి • దుష్టుల యసువుల్
కొల్లగొను పవనసూనుం, డుల్లసమున నింద్రజితున • కొగి నిట్లనియెన్.

## హనుమంతుఁ డింద్రజితు నుపాలంభించుట

ఉ॥ మాయ నసత్యకృత్యముల్ పెరుఁగ • మాగిలియైన దురాత్మ! నీచ! నీ
మాయలు చెల్లనేమి? జన • మాన్యను చంపకు మన్నతోడనే
కోయుదువే శిరంబు? మఱి • కోసలదేశము కొల్లలాడఁగాఁ
బోయితె పుష్పకంబుపయి, బొంకులమారి! నరాశనాధమా!

శా॥ చక్రవ్యూహముతో నికుంభిలను నీ • చా! చొచ్చుటల్ కాంతుమే?
వక్ర క్రూరతఁ గోసలంబునకుఁ జా • వం బోయి కీ • వారలన్
వికాంతిం బరిమార్చి వచ్చితివె? నీ • వేల్మిల్ కొనసల్పాగెనే?
యక్రోధంబున బుద్ధిసెప్ప విను నా • యంబేని లేదయ్యెనే.

మ॥ ఉరగాధీశుని మించి భూభరము ను • ద్యోగించు సద్ధర్మియౌ
భరతుం గాంచి బలంబు చూపి యతనిన్ • బంధించితే? సంబరా
సురు నిర్జించిన చక్రవర్తి తనయున్ • సుజ్ఞాని శత్రుఘ్ను ని
ర్భర ధైర్యంబునఁ జేరి పీడగు తను • షాండిత్యము జూపితే?

మ॥ అనల జ్వాలలఁ జిమ్ము చష్టదిశలన్ • వ్యాపించు సౌమిత్రి మా
ర్గణముల్ నీయురమున్ శిరంబు బిగువుం • గంఠంబు సంపూర్తిగా కటిన్
దునుమంగా నవరంధ్రముల్ రుధిర ముం • దో మాంసముల్ గ్రక్క లం
కను డాకొంచు నొనర్చు జాలములు ని • క్కం బేగెడి స్నేఁటితో.

మ॥ ఫణిపాశంబొ యమోఘ పాశుపతమో • బ్రహ్మాస్త్రమో మాయలన్
గనియో వెన్నుని చక్రమో యెదియొ మీ • గౌరవ్య మద్దానిఁ గై
కొని వేంచేయుఁడి చేయుఁడీ యముఁడు మీ • కోసంబు తా వేచియుం
డెను తట్టాడుచుఁ దాపసించుటలు నాఁ • డెంబొనె మీపోఁటికిన్?

చ॥ వరములు మాయలందు నెఱ • వాదితనంబు బలాత్కరించి ని
ర్జరులకడం గ్రహించిన శ • రమ్ములు దేహబలమ్ములున్ యథా
స్థిరముగ నున్నవే కద? గ్ర • సింతుమ మ్రింగుడు మన్న మాత్ర ని
వ్వెరగొని పాఱినారమె? క • వింపక మ్రుక్కుడి పక్కి యేలరా?

మ॥ నిటలాక్షుఁడు పిఠిపమందు హరియున్ • విర్భీతులై దాసి యె
ద్దిక్కటవిస్ గాచిననైనఁ జచ్చుటయె ని • ట్కంబయ్యె నీనాఁడు తా
పటి ట్రక్కల్ చలియింపకున్నవియె? మీ • ప్రాణాలకున్ ముప్పు సం
ఘటపాటుం గొని తెచ్చుకొంటి రిఁకఁ ద • ద్దిక్కుంజూచినం దప్పునే?

మ॥ వినుచుండన్ శపథంబు చేసె నిట ము • న్నే లక్ష్మణార్యుండు దా
నెను మీసేనల పేఁటలాడె విను పి • ల్పెం గాచియున్నాఁడు నీ
పొసరింపంగల పేర్మికిన్ గుణరవం • బోంకార మంత్రంబుగా
వినిపించెం దరవేల రమ్మ బలి గా • వించుం దదీయాగ్నికై.

మ॥ జగదీశుం దొసరించు ఘోర రణ య • జ్ఞంబందు కేల్వ్రంగ బా
గుగ యోచించియె విన్ను పాకృతముగాఁ • గొంపోవ సౌమిత్రి యా
జకుఁడై యాజకపాడియై వెడలె న • స్తోకానుమోదాత్ములై
వెగడం బర్విరి విప్ర మేషులును మా • విశ్రేష్ఠులున్ మింటపై

## మేఘనాదుఁడు హనుమకుఁ బ్రత్యుత్తర మిచ్చుట

మ॥ అని సామీరి పఠింప మండిపడి దై • త్యాధీశ సూనుం డనున్
హనుమా! నాకద విట్లు చప్పుడిగ వ్య • ర్థాలాపముల్ సేయఁగాఁ
జననే? సంగరమందు చచ్చి మరలన్ • సాధించి ప్రాణంబులన్
మును చావొందుట విస్మరించితిరె? మీ • ముగ్ధత్వ మిట్లుండునే?

శా॥ ఆ సౌమిత్రియె వచ్చుఁగాక ధరజా • నాథీశుఁడే వచ్చు గా
కే సంజీవని యేని మీకిమరుఁ గా • కేమైన నౌఁగాక నా
చే సంగ్రామమునందు వానర నర • శ్రేణుల్ విరుళ్లాహులై
వేసారం బడుపాటులెల్ల నమరుల్ • వీక్షింపకే యుండరే?

శా॥ చేతం గార్ముకి మొప్ప సుందరి భుజ • స్త్రేమంబు వొల్పార నీ
కోఁతుల్ మానవులున్ మనోగతులు సం • క్షోభింప నాకఁబు దు
ర్భీతిం జొచ్చిన వెంబడించి బహుళా • స్త్రింగూర్చి హింసింతునై
హూఁతల్ పెందుల మాఁకులున్ వితగఁ • బోవున్ జాపు పిక్కుంబగున్.

మ॥ క్రతువిఘ్నం బొనరించి పీరజయముం • గై కొంటిమం చుబ్బుచున్
బ్రతుకుం బొందితిమంచుఁ బ్రేలు ఘన వీ • రమ్మన్యులారా! వృథా
మతి రజ్జుల్ పదురాడు చుండఁ డిడె మీ • మస్త్రంబులీ సంగర
క్షితిపై దుల్లఁగఁజేయు నాశరము లా • క్షేపించు వాక్యమ్ములై.

ఉ॥ మీపలె నోటితో వదరి • మించి జయించెదు వాఁడు గాఁడుసూ!
రావణి రెండు మాటలు దు • రంబున నోడితి రింత సంభ్రమం

తే॥ పటహ ఢుంఢికామురజ త • మ్మట హుడుక్క, దుందుభులునుతుత్తుంభికల్ • తుడుముఢక్క
కొమ్ములును తిమిలలును సం కులును కలిసి, చెలఁక నెల్లవారి చెవులఁ • జెవుడు చేసె.

ఉత్సా॥ ద్విరద చయము మీఁద నులియు • భేరిరవముతోడుతన్
బరఁగె వాని ఘీంకృతులును • పట్టెడలమ ఘంటికల్
తురగ హేషతోడ మొరసెఁ • దోలవట్టె గజ్జియల్
విరిసె నేమి రవముతోడ • వీర కటక రావముల్.

సీ॥ శంఖ కాహళ తూర్య • శబ్దముల్ జలద వి, స్వనముతో ఢీకొవి • జయము నొందె
కరి హయ రథ సింహ • గర్జనములు పిడు, గుల ఘోషమును మీఱి • గెలుపునొందె
శ్రావ్యవాద్య ధ్వనుల్ • సంగీత రవములు, పీయూష రుచులపై • విజయమందె
వారి రవంబులు • నవ్వు లదలుప్పలు కదలి బ్రోఁతను క్రిందు • పడఁగఁజేసె

తే॥ నాల్గు సంద్రంబులంబోలి • నాల్గు తెగల, యెట్టిపోగు లేపిన ధూళి • యూడుకదచి
సైన్యవారాశిఁ గను సుర • చంద్రముఖుల, యశ్రువారాశి నొక్కట • నడఁచివైచె.

తే॥ ఇంద్ర సౌధము లనఁదగి • యెనక మెనఁగు, నరదములు వేలకొలఁది త • న్నలమిరాఁగ
గ్రహము లెల్లనుకొలువసా • గరముమీఁదఁ, జెలఁగుగ్రహరాజునానింద్ర • జితుఁడుమెలసె

తే॥ మెడయు ముక్కును కన్నులు • కడుపు కాళ్లు, ఱెక్కలును గోళ్ల తోఁకయుఁ • జొక్కపడఁగఁ
గొంచ మొగ్గరముం దీర్చి • మించి ప్లవగ, సేన నొరయ రావణియు సం • సిద్ధుఁ డయ్యె.

తే॥ జంభభేది యిచ్చిన కల్ప • జలదరవము, నెనయు వలమురి చిందంబు • దనుజవిభుని
తనయుఁ దొత్తె సుపర్వులు • తల్లడిల్లఁ, గాల కనొంది ప్రాణులు ౹కా • వికలు గాఁగ

తే॥ తద్రవము చెవిఁబడ నుప • ద్రవమువొంది, సింహ గర్జన మాలించి • చెవరి పాఱు
వారణంబులక్రియ తాత • వైచినట్టి, కుంఢ పెంచిక లట్లయ్యెఁ • గోఁతిమూఁక.

తే॥ శింజినీరవమున వాని • చెవులుప్రీలె, మనసు కలఁగె నుత్సాహంబు • మంటఁ గలిసెఁ
బరుగులిడఁ గాళ్ల తడఁబడెఁ • గరములందు, పొదలు సాధనములు జాఱెఁ • బెదవు లెండె.

తే॥ పవన సుతుఁ డంగదుఁడు రా, ఘవులు విభీషణుఁడు సైన్య • గణ నాయకులున్
రవిసుతుఁడు తక్కఁ దక్కిన, ప్లవగులు త త్తఱిలి విఱుగఁ • బాఱిరి భీతిన్.

క॥ సేనాపతులును రాక్షస, సేనలు ముందునకు సాఁగి • జీమూతంబుల్
పూనిక నలమిన యనువున, వానరులం జుట్టెఁ గడఁక • వర్ధిల్లంగన్

క॥ హనుమని భుజములపై శ్రీ, వనజదళాక్షుండు వారి • వరలెస మునిపైఁ
గొనకొని లక్ష్మణుఁ డెక్కెను, ఘన సమరోత్సాహ విధము • కడలుకొనంగన్.

క॥ వారల భుజములపైన, వీరవరులు విండ్లుదాల్చి • విశ్రుత ఖగరా
డ్గోరాజులపై రాజిలు, నారాయణ రుద్రులనఁ ద • నర్చిరి ఓలనన్.

ఉ॥ పిచ్చుక పిండులట్లు మొగి • వెల్వడు తూపుల లక్ష్మణుండు లాఁ
జెచ్చెరనేసి వాని నిర • సించుచుఁ ద్రుంచె; శిఖల్ పలల్ తరుల్
పచ్చడిగాఁగఁ ద్రొక్కె నల • వాయువుఁబోలిన బానవాళ్ల పె
న్మచ్చరి స్యందనమ్మును స • మంచిత మారుతి పాదయుగ్మదున్.

క॥ ఇరువురు తమయెడఁ గొఱఁతల, నరయంగాఁ నీక సమత • నందుచుఁ బోరన్
బెరలేక లేరు వీరికి, సౌర యని నిర్జరులు వెఱఁగు • దొరసిరి తమలో.

మ॥ శర సందోహము లంబర స్థలమునన్ • జన్నున్నవో లేవొ ని
ర్జర నేత్రంబులు చూదవయ్యె మనసుల్ • జడయ్యె లెక్కింపఁగా
బరిమాణంబున కందవయ్యె నడుమన్ • భంగించి యీఁదేనియున్
జొరవయ్యెన్ వ్రణరాజి దక్క నెదియుం • జూపట్ట దమ్మేనులన్.

తే॥ నెఱసి శింజినీధ్వని నిండు • నింగియందు, పిడుగులంబలె నెగడిన • వేఁడివాఁడి
సెలలు దెసలెల్లఁ బొగగ్రమ్మఁ • జిమ్మరేఁగె, జొక్కులును మింట వల్లనై • సురిఁగి వోవ.

చ॥ చిగుల దిశాంతరంబుల ని • దీర్ఘ మొనర్చుచు శింజినీ యుతం
బశనుల కైవడిన్ మొరసె • నంచులవేరిన విండ్లనుండి క
ర్కశ విశిఖమ్ము లుగ్రగతిఁ • గ్రమ్మెడు నెవ్వడి వ్యోమభూమియున్
పశమఱఁగా పిడుంగులలు • వ్రస్తిలఁజేసె భయంకర స్ఫురన్

చ॥ శరధియు పట్టి తున్గిపడు • సాయక బృందము నిండ వెంతియున్
శరధియు యమ్యెఁ బ్రొద్దు శశి • చందముతోఁచెను రక్తముం జెదెన్
తరువుల బొగ్గులయ్యె జల • ధంబులు మాఁడెను మండు కంపు ము
ర్భరముగఁ బిక్కటిల్లె నిరు • వాఁగుల సేనలు పాతె భీతిమై

ఉ॥ పీనుఁగులయ్యె నేనుఁగులు • ప్రేతములయ్యెఁ దురంగ జాతముల్
జానుతొఱంగి యంగములు • స్రగ్గి మడంగె శతాంగ జాలముల్
మానము తగ్గఁ దగ్గ నను • మానము వర్తిల మానవాద సం
తానము వ్రాల్చె సాయకి వి • తాన మఱల్ విసుమాన మొందఁగన్

సీ॥ కొన్ని వంగుచుఁబోయెఁ • గొన్నిపొంగుచుఁబోయెఁ, గొన్ని కూడుచుఁబోయెఁ • గొన్ని మాఁడెఁ
గొన్ని వ్రాలుచుఁబోయెఁ • గొన్ని వ్రేలుచుఁబోయెఁ, గొన్ని మెరిసిపోయెఁ • గొన్ని విరిసెఁ
గొన్ని కుడికినేగెఁ • గొన్ని యెడమకేగె, సౌమిత్రి యేసిన • శరచయములు
కొన్ని యనిలుఁ బోలెఁ • గొన్ని యనలుఁ బోలెఁ, బిడుగులఁ బోలెను • జనని బోలె

తే॥ కొన్ని ధారాధరంబును • కొన్ని ధరాధ, రంబుఁ గొన్ని రుద్రాట్టహా • సంబుఁ గొన్ని
స్వేదజలమును బోలెఁ బ్ర • వ్యాద మతుఁడు, వైచు తూపులు రణభూమిఁ • బరపువేళ.

ఉ॥ మాన్యత మీఁగు దాల్చినది • మాదవువిల్లొ? గిరీశువిల్లొ? సా
మాన్యుఁడు గాఁడు కత్తశము • క్రమాఁదు వీనిని గెల్వ శక్యమే
జన్యమునందు నాకని వి • శంకితుఁడై దనుజేంద్రసూతి చై
తన్యము దక్కి • విల్చుట యె • దం దలపోసి విభీషణుం డనున్.

చ॥ హరిహయు గెల్చి పొల్చిన ద • శాస్య కుమారుని గెల్చితీవు చి
త్తరువుగ నిల్చెవాఁడు మః • తల్లడమందె నిమేషమేని జా
పిర మొనరింప కియ్యదన • పెంపరలాడుచు యంచుఁబల్కి హే
చ్ఛరిక యొనర్ప లక్ష్మణుఁడు • సమ్మతిఁ జూపుచు నుండు నంతలో.

సీ॥ కాలునిలీలఁ గాం • తాశంబు గొనిరేఁగి, యసురపుత్త్రుం డని • లాస్త్రమేసె
లక్ష్మణాఖ్యుండు చె • లంగి నవ్వుచు వాయు, దేవతాక శరాన • దిగిచె దాని
ననలాస్త్రమును దైత్యుఁ • డరివోసి పరపంగ, దాని నాతండు న • ద్దాన నడఁచె
వారుణాస్త్రంబు బ • లారిజితుం డేయ, దన్ఫురంబున దాని • త్రాణ నణఁచె

తే॥ భాస్కరాస్త్రంబు రావణ • పట్టి విడువ, మిత్రశరముతో దాని సౌ • మిత్రి క్రుంచె
చచ్చితివ చచ్చితివ యని • మచ్చరించి, దనుజసుతుఁడు బ్రహ్మాస్త్రంబు • మొనసియేసె

తే॥ భవుఁడు మఘవుఁడు నలువతా • పసులుసురలు, తలరిసౌమిత్రికిఁ జి రాము • వాలయుఁగాత
మంచుఁ బలుక నాతఁడు విజృ • భించిమిడుఁగు, లడరఁగుప్పుచువచ్చున • య్యస్త్రముఁగని

ఉ॥ చేవ తొలంగి వీఁడు మును • చేసిన పోరునఁ గంజజాస్త్రమున్
ద్రోవఁ దొలంగియేయఁ గడ • ద్రోవఁగలేక యడంగె నంచు నీ
కైవడిఁ నిప్పుడుం దొడఁగెఁ • గావున నూరకయుంట పాడి గా
దీ వనజాత నాస్త్రమున • నే యుపసంహరణంబు చేసెదన్.

చ॥ జగము సుఖించుఁగాక యెల • సంబునఁ బోరొనరించు రావణిన్
దిగువకయుండుఁ గా కితని • దివ్య శరం బుపశాంతి నొందుఁగా
కగుత జయంబు ధర్మమున • కంచు నజాస్త్రము వీడె వేల్పులా
సుగుణ గణంబులం గుఱిచి • శూరుని లక్ష్మణు సన్నుతించుచున్.

చ॥ జగము సుఖించుఁగాక యని • వాటి వచించె దురాత్మ రావణిన్
దెగ వచియింపఁడయ్యె రణ • ధీరుఁ డితండు విరించనాస్త్రమున్
దగ నుపసంహరింపు మనెఁ • దక్కఁ బుద్ధిని చూపఁడయ్యె నీ
సుగుణ గణంబు లెయ్యెడలఁ • జూసమ యంచు నుతించుచుండఁగన్

చ॥ అనలముతోర డీకొనఁగ • హ్రాదిని వచ్చినభంగి వచ్చి ల
క్ష్మణుని శిరంబు దైత్య విశి • ఖంబు నడంచి నఖంబు సర్వమున్
బొనపడ నొక్క జ్వాలగ స • ముద్ధతి నేచిన వేఁబుతూపుచే
నణఁచె నిషాత్తవేదన వి • షంతరయుక్తి నడంచు కైవడిన్.

చ॥ వనచరు లుల్లసిల్లిరి త • పస్వులు లోకము గాచితంచు మో
దనమున గంతులేసిరి ము • దంబున వేల్పులు దేవ సుందరుల్
మనమున మెచ్చి గొబ్బున సు • మంబులు చల్లిరి బ్రహ్మయున్ శివుం
డును వినుతించి రాడిరి క • డుంగడు సంతసమంది రెల్లరున్

మ॥ బలహీనంబయి వైష్ణవాస్త్ర మడఁగెన్ • భావింప వీఁడెవ్వఁడో ?
జలజాక్షుండొకో ? యెవ్వఁడేని యగుతన్ • శంకింపనేలా? జగ
ద్విలయంబుం గలిగించు పాశుపతమున్ • వేకూర్చి యీబాలికున్
బలమాఱన్ వధియించువాఁడ నని యెం • చం జిత్తమం దుద్ధతిన్

ఉ॥ రావణి నిశ్చయంబును స • రాలున దివ్యులెఱింగి యేమిరా
త్రోవ ? జగంబు జీవ నిక • రుంబముతో నశియించునేమొ నేఁ
డీవవి వీనిచేత ? నెదు • రెయ్యది ? దీనిసహించు వారలీ
దేవతలందు గల్గరవి • దీనత నొంది కలంగుచుండఁగన్

చ॥ ఇతరు లెఱుంగకుండినది • యీడును లేనిది మున్నువానికిన్
జితమదనుండు సత్తపము • సేయఁగ మెచ్చి యొసంగు నయ్యమో
ఘ శర మహాస్త్రమున్ మది న • ఖండితభక్తి భజించి లక్ష్మణున్
మృతునిగఁ జేసి క్రమ్మఱుమ • మేవడి నంచు వచించి యేయుడున్.

సీ॥ అయ్యస్త్ర మంత గ • దాసి తోమర కుంత, పరశు ముద్గర శూల • వాల నాగ
గరళ భూత ప్రేత • కాల నిర్ఘాతాది, బహుళ రూపంబులఁ • బరఁగి పిలయ
కాలాగ్ని సప్త సా • గరములు చండ మా, రుతమును తోడరా • క్షితి మునుంగు
తఱిఁ గప్పు చీఁకట్లు • నెఱసిన వననొప్పి, సౌమిత్రి యురము ల • క్ష్యంబుగాఁగఁ

తే॥ గెరలిలోకత్రయము గిర • గిరనఁదిరుగ, కిరణిఁ దోఁపంగ సుడియుచుఁ • గడఁగిరాఁగ
వానరులు వేలుపులు మని • వరులు జడిసి, మొగిసి కనలేక కన్నులు • మూసికొనిరి.

సీ॥ గడగడ వడఁకుచు • నొడలు చెమర్పంగఁ, గని విభీషణుఁడు ల • క్ష్మణ! యిదేమి ?
దీనిఁ దొలంగించు • తెరువెయ్యదియు లేదె ? యన నుత్తరముగ హా • సం బొనర్చె
వానర వీరులు • పాదసన్నిధి డాసి, యభయ మభయ మంచు • నఱచినంత
నలుకకుఁ దలుకకుఁ • డని చేయి వీచుచు, జగము లల్లలనాడు • చందముగను

తే॥ పాశుపతమును ధ్యానించి • భావమందు, దీని నడఁపుము వేకొండు • తెగువ వలవ
దనుచు నొకశర మరివోసి • మొనసి విడిచి, త్రుటిని తన్మహాస్త్రము బలో • ద్యోగమడఁచె.

మ॥ దివిఁ గోలాహలముల్ చెలంగె ఘురసెన్ • దివ్యానక స్తోమముల్
భువి శాఖామృగముల్ మదించె వెస నం • భోరాసు లుప్పొంగె సా
ర్థవ ఘోషంబుల వించె మేఘములు ద • ర్మం బుబ్బె మోదించి రా
ఘవుఁ గాంచెన్ జయలక్ష్మి శిక్షిత కటా • క్ష శ్రీల హేలాగతిన్.

మ॥ లయకాలంబున సర్వలోకములు వై • క్లబ్యంబుగా జీవ సం
దయము న్నాశము సేయు రుద్రుని మహా • త్యుగ్ర క్రూర వేగంబు నీ
రయమై వ్యర్థముగా నొనర్చిన సుమి • త్రాపుత్త్రిక స్థైర్యమున్
దయివాఱం గని దిగ్భ్రమించి నిలిచెన్ • దైత్యేంద్ర సూనుం డటన్.

శా॥ దివ్యాస్త్రం బుడివోయె నంచు మది సం • దేహంబు గైకోక యా
త్రివ్యామందు ప్రయోగ చాతురిమ ము • గ్రంబై ప్రకాశింపఁగా
నే వ్యాపన్నత నొందనేల యని తై • నేర్పొప్ప సౌమిత్రిపై
నవ్య స్త్రేమము మీఁద నేసె నిభజి • న్నాదంబు గావించుచున్.

శా॥ సుగ్రీవాదులు వేసరిల్లక మహా • క్షోణీధ్రముల్ దెచ్చి సం
వ్యగ్ర ప్రక్రియ నున్న రావణిపయిన్ • వైవన్ విజృంభించి పం
క్తిగ్రీవాత్మజుఁ డంపఱం గురిసి త • ద్వేగంబు వారించి య
త్యుగ్రుండై కని తత్పితృవ్యుఁ బలుకున్ • సోత్ప్రాస వాక్యంబులన్.

## మేఘనాదుఁడు విభీషణు నిందించుట

శా॥ జాతి భ్రష్టునిమాడ్కి నన్వయ యశ • స్సౌశీల్యముల్ జార్చి దు
ర్ఖ్యాతి ప్రీతిని మర్త్యమాత్రుల తదం • ఘ్రుల్ వట్టి సేవించుచున్
ఖ్యాతిం బోవిచి వారి పాటలకు వె • న్కం దాళముల్ వైచుచున్
నీతిన్ మాలి చరించు నీయుశికమున్ • నేలం బడం గూల్చెదన్.

శా॥ వీక్షామాత్రన కంపమొంది క్రతుభు • గ్బృందంబు సేవించినన్
విక్షేపంబులు కూడినన్ భువన ని • ర్జైతృత్వమే యబ్బినన్
శిక్షమాన పరాక్రమ స్థిరగుణుల్ • నీత్కారముల్వేయు నీ
కుక్షిక్షుద్భవ నీచ జీవితము నో • క్రూరాత్మ వాంఛింతురే?

మ॥ జలముల్ గల్గినచోటనే గలుగు మ • త్స్యశ్రేణి దైత్యేశ్వరుం
డెలమిన్ భాసిలుచోటనే దనుజులున్ • దృష్టింపఁగా నుండ్రు వా
రలు చేటొందిన వేళలన్ బ్రభునకై • ప్రాణంబు లర్పింత్రు నీ
వలెఁ గాఁజాలరు; లంక నే యసురులం • బాలింతువో మీఁదటన్?

ఉ॥ పూర్వము వేల్పుపెద్దఁ దన • బొడ్డునఁ గాంచిన మాయి కేశవున్
గర్వము సర్వముం జెడ వ • గర్చుచుఁ బాఱఁగఁదోలి యొక్కఁచే
శర్వుని పర్వతంబు గొనఁ • జాలిన మత్పిత రాజ్యభారమున్
నిర్వహణంబు సేయుటలు • నీవిటు కోరుటకా? కులాధమా?

మ॥ అరవిందాసన వంశమందు జననం • బందంబుగా నందుటన్
సురలు న్నిన్ను భజింత్రు పుణ్యజన దూ • ష్యుండైన నీవిప్పుడో

నరులం గొల్పుచు నన్న సంపదల గ్రిం • గం జూచుచున్నావు నీ
కరయన్ మానమనంగ నున్నదియె ? మా • యంబొను మాతోడనే.

శా॥ విందం గూరిచి విందచేసి కులమున్ ? నీ చెల్లెలిం బట్టి యా
క్రందింపం దయమాలి ముక్కు సెవులన్ • ఖండించు దుష్టాత్ములన్
సందేహింపక తెచ్చినాఁడ విక జ్యే • ష్ఠభ్రాతఁ జంపించి లం
కం దైవాఱఁగ నేలుకొందువు గదా ? కష్టాత్మ ! వంశాదనా !

చ॥ గురుహిత బంధుమిత్రులను • కూలిచి కైకొను మేల్మికంటెఁ బే
దతికమె మేలుకాదె ? రణ • ధారుణిఁ గూలిన యన్నతోడనే
పొరలుచు నేడ్తువో ? ముదము • బొంది బలేః యని కేకవెట్టెదో ?
నరు గెలుపు న్నుతించెదవొ ? • నారక మందెదొ ? వంశ దూషణా ?

మ॥ పసగుల్ వాటిన కాలకింకరుల గె • ల్వంజేయువారా నరుల్ ?
తెరలన్ మందులచేత జీవములు నం • ధిల్లంగ నిల్చిందు వా
రరయన్ గెల్తురె ? యన్న సంపదల నీ • వందంగ నర్హుండవే ?
శిరముం ద్రుంపక పీడితిన్ జగము నన్ • నెగ్గించునన్ శంకమై

శా॥ భ్రాతృద్రోహివి నీ మొగంబు గనినం • బాపంబు సిద్ధించు నీ
నేతృత్వంబు సహించునే జగము ? నీ నీ • తంబు లాలించునే ?
రోఁతల్ చేఁత లటంచు మాఱు ప్రభుపు • త్తుృం గాంచి చిర్నవ్వునన్
నీతి ప్రౌఢి విభీషణుండు పలికెన్ • నిర్భీత చిత్తస్థితిన్.

ఉ॥ ధర్మమె తోడగున్ మహి న • ధర్మము తోడుగఁ గొంచుఁ బెక్కు దు
ష్కర్మము లాచరించి నర • కంబునఁ గూలఁగ జాలకుంటి స
త్కర్మముఁ జిక్కఁబట్టితిని కష్టము వీడితిఁ బంక్తిమస్తకుం
డర్మిలి నిందితంబులకు • నాస వహించిన దాఁకఁ దమ్ముఁడన్.

మ॥ కిలుద్రావన్ బరదార గోర గిలుబున్ • గ్రవ్యంబు నాశింప మూ
ర్ఖులఁ జేరన్ బెరసొత్తులం బరియఁ గై • కోఁబోవ సత్కర్ములన్
గలహింపన్ బరనిందనంబు తెలుపన్ • గావింప నింద్యమ్ములన్
ఖలులన్ దుర్వ్యభిచారులన్ విడుపటల్ • కారాని కార్యంబొకో ?

మ॥ త్రిజగంబుల్ వినుతించు తత్త్వమగు నా • దేవేశు సర్వాంగి పూ
త జగన్మాత పతివ్రతా తిలకమున్ • ధర్షించి బాధించుటల్
త్యజియింపం దగునంటి దీనవగు నా • తప్పేమి ? నీ తండ్రి య
ల్క జనింప న్నను వెళ్లఁగొట్ట నట ని • ల్వంబోలునే తెల్పుమా ?

ఉ॥ క్రొవ్వున ధర్మముం గనక • కోపము కామము వేల్పుగా మదిన్
నివ్వటిలం దలంచు మము • నిత్య సుఖంబులె యొందనిమ్ము మ

మ్మెవ్విధిఁజేని నింద యెల • యిఁక వంగ రౌరవ మందవిమ్మిఁ కే
బ్రిప్పలు సాగు దుష్కృతము • బ్రెవ్వఁక యుండునె ? ధర్మమోడునే ?

ఉ॥ జ్ఞానుఁడపన్ సుగర్ముఁడగు • సత్యవిహారుని రాముఁ జేరితిన్
మానుగ సర్వలోకములు • మన్నన సేసెదుఁ గాక నిందయే
పూని యొనర్చుఁ గాక భువిఁ • బొందుఁదు మీరలు మేలునేని కీ
డేనియు నంచు మాలమిడి • యిట్టటు నార్చుచుఁ బల్కి పిమ్మటన్.

ఉ॥ రావణి వల్కు నీతలఁచు • రాజ్యము వేలుములెల్ల నిల్చునే ?
నా పల కేలనున్న యొక • నారసమంటినఁ దీఱుఁగాక నేఁ
డావలి కెట్టులేఁగె దని • యల్కను తార్క్ష్యని బోలు బాణమున్
జాపుమ యందు పీడెఁ దగ • చాపముఁ జక్రముఁ బోల [illegible].

తే॥ కీలయనఁ బరుగని భువు • కూఁమనఁగ, వచ్చుటను కాంచి మిత్రుఁడు • చచ్చెఁ జచ్చె
ననుచుఁ బ్లవగు లాక్రోశింప • సమరులెన్న, మించి సౌమిత్రి నడుమనే • త్రుంచె దాని

క॥ తన విశిఖము తునియఁగ రా, వణి వెండియు భల్ల మొంకు • వసినేయ విభీ
షణుఁ డాఁక నీక నడుమనె, తునుకలుగా లక్ష్మణుండు • తుండించె వెసన్.

శా॥ తన్నుం జంపఁగ నుద్యమించె నను కాం • తాశంబునన్ సత్య సం
పన్నుండైన విభీషణుండు ఘన భా • స్వ ద్దండముం బూని యా
పన్నుంతైన బలారి జిద్రథము న • శ్వశ్రేణితో సారథిన్
ఛిన్నాభిన్నము చేసి యార్చెఁ బ్లవగ • శ్రేష్ఠుల్ ప్రమోదింపఁగన్.

చ॥ చెడిన రథంబుపై నిలిచి • చిండఱగొన్న దశాస్యసూతి నె
వ్వడివి సుమిత్రపట్టి పయి • వానరపాళిపయిం బితృవ్యుపై
జడిగొను బోల్కి శాత శర • సంఘములేసి రణస్థలంబు నె
య్యెడఁగను రక్తసిక్తముగ • నేర్తెఱఁజేసి మదించి యార్చుచున్.

చ॥ ముఱియని తేరులేక వెస • ముష్కరిమైన దుఃఖంబు సేయఁగా
నరిది యటంచు మానసము • నందు దలంచి క్షణంబులోన నం
బరితల వీథికేగె నను • వార్త కపీశ్వర వర్గమందు తీ
వరపడి పర్వఁ బంక్తిముఖ • భర్మ గృహంబున కేగె నత్తఱిన్.

## 27. ఇంద్రజి ద్వధ పటలము (71)

మ॥ గగనంబందు మొయిళ్ళ డాఁగె నను శం • కంబొంది మున్వోలెఁ బె
ల్లగ మాయల్ పచరించు నంచుఁ బ్లవగుల్ • మోమోడి కన్పండ న
ళగ వేగంబున మేను రక్తమయమై • స్రుక్కింపఁగా వచ్చు మె
చ్చుగు పుత్త్రుంగని రావణుండు చలిత • వ్యాపారుఁడై యిట్లనున్.

ఉ॥ పూనిన వీమఖంబు పరి • పూర్తి వహించి యొసంగదంచు నీ
మేని వ్రణంబులే తెలిపె • మిక్కిలి క్లాంతిని బొంది కంపముం
బూని ఖగేంద్రుఁ గన్న యహి • బోలిక నుంటివి కారణంబు నా
వీనులు మానసంబు విన • వేగిరపాటు వహించెఁ దెల్పవే.

చ॥ అనవుడు నిట్లనున్ దశము • ఖాత్మజుఁ డూనిన మాయలెల్ల నీ
యనుజుఁడు దెల్ప వారలొగి • యజ్ఞము విఘ్నము పేసి రంత నేఁ
గనలి పరాక్రమంబు నొడి • కంబును తెంపును చూపి పోరితిన్
వనజజ విష్ణు రుద్ర శర • వారము లక్ష్మణుఁ దోర్చె నేమనన్ ।

చ॥ అతులిత వైష్ణవాస్త్ర మొగి • నా రఘువర్యుఁ బ్రదక్షిణించి కుం
చితగతి నేగెనన్న విర • చింపఁగ వెండి మహాస్త్ర మొక్క డం
చితముగ నున్నదేమి ? కడు • చేటు మనంబునఁ గోరి కోరి యా
వితమునఁ దెచ్చుకొంటి విది • వీడునె యెన్నివిధాలఁ జూచినన్ ?

చ॥ కడఁగి విరించినాస్త్రము న • గమ్ము నశించున యన్న భీతిచేఁ
దొడగఁడు దాన నే గెలువు • తోఁ జనుదెంచితి మున్ను నేఁడు నా
కడఁకలు సాగవయ్యెఁ జాలు • కన్ స్వబలంబున నమ్మి గూల్పఁగాఁ
దొడఁగె జగంబు లొక్కరుఁడె • దోరుప శత్రుఁడు లక్ష్మణుండనా ?

చ॥ జంకితినంచు నెంచకుము • జానకిపైఁ గల యాస వీడినన్
గింకను వీడి శాంతి నవ • గీర్ణ చరిత్రులు రాఘవప్రభుల్
లంకను వీడువారు మన • లన్ క్షమియించెడు వారు నీ సుహృ
త్కింకర పుత్త్రబంధు బల • కీర్తులు మాయక నిల్చు నావుడున్

చ॥ భుజములు సంచలింప రద • ముల్ నవచంద్రికలన్ వెలార్ప దే
రజముగ నవ్వె రావణుఁడు • రాజస మొప్పఁగ నింక నీవు భూ
భుజుల వెయిన్ డురంబునకుఁ • బోవపు భీతియుఁ జింత యేల ? య
క్కజముఁగ నేన యేగి మన • కంబున వారలఁ జంపి వచ్చెదన్

ఉ॥ ఉండినవారు గెల్తురని • యుండెడువారు జయింతురంచు నీ
దండిత నెంబు నాకు మది • తంబుగఁ దోఁచెడు నంచు నమ్మ యీ
కొండిక యొంటనమ్మ మది • గోరి పొసంగ వహింప లేదు మ
చ్చండ భుజాబలంబు నెల • సంబున నమ్మియె కొంటి నీసగన్

ఉ॥ పేదతనంబు తెల్పితివి • పేరిమి వింశతి చండబాహుల సం
పాదిత కీర్తి గేయములు • పాడకొనన్ జగమందు విర్దరుల్
మోదిలి చూచుచుండ నని • బుద్బుద దేహము పాతుఁగాక యా
పైదలి వీడువాఁడ నను • వార్తయుఁ బుట్టునె నోట ? బాలకా ।

చ॥ ఇలను జయంబు నేను గడి • యింపక పోయిన రామ నామమున్
నిలుపునయేని నాయవిధ • నిల్వక పోపునె ? యాల్గు జెన్న ? దేఁ
గలదియ రాదె ? యెల్లరను • కాలము మ్రింగుచు నున్న దే కదా ?
కలిమి జయంబు దీపులరుఁ • గల్గదు కీర్తికి నాశ మెన్నఁడున్.

చ॥ విడిచితి సీతనన్న నుచి • పీనులఁ బద్ధ క్షణంబులోపలం
బొదపునఁ గిట్టి కిట్టి కొని • పోదురుగాక నిలింపు లింతయున్
జడియుదురే ? జగంబులఁ ద్రి • శస్త్ర బలంబున గెల్చి కీర్తిఁ బం
బడసిన యేను నప్పికికి • పందల పొందెదు చావు చత్తునే ?

ఉ॥ పెక్కు లిఁకేల ? పీవరిగి • వేశ్మముచేరి శరీర మెల్లెడం
దక్కక గ్రుచ్చుకొన్న విశి • త ప్రదరంబులఁ బుచ్చివైచి సి
త్రొక్కటపాటు దీర్చికొని • దుఃఖము వోవఁగ నిద్ర సేయు మే
నొక్కఁడ నేగువాఁడ నని • యుగ్రత లేమకుఁ దేను నెమ్మనన్.

చ॥ జనకుని పాదపద్మములఁ • జాఁగిలి చేతులు మోడ్చి నాపయిం
గనలకుమీ క్షమింపుమి జ • గజ్జన విశ్రుత గేయ ! యిప్పుడే
చనియెద సంగరంబునకు • శాంతిలు మే మడిదింపు దెక్కనై
నను నిలుమోపు నాదు • వచనంబుల నీకు నెఱుంగ నయ్యెడున్

చ॥ అని దిధమెక్కి పద్మజ బ • వాదు లొసంగిన యాయుధంబులం
గొని తిగ నెక్కి కోటులకుఁ • గోరికలెల్ల నొసంగి బాష్పవా
రిణములు నిండినట్టి కిడ • కన్నులఁ దండ్రిని చూచి చూచి నె
మ్మనము దృఢంబు చేసికొని • మాద్రుర మీఁదికిఁ బోప వెల్వడెన్.

ఉ॥ లంకను గల్గు దైత్యుల క • లంగుచు నిన్నెడ బాయలేము మ
మ్మంకిలి సేయఁబోకు మిదె • యందనె వత్తుము చత్తుమంచు న
ల్వంకలఁ జుట్టిరా జనకు • వాడక కన్నిడి కాపు సేరు నా
యంకులతోడ శాత్రవుల • నంతకు ప్రోలికి నంపి వచ్చెదన్.

మ॥ అని యూరార్పఁగ దైత్యకామినులు చిం • తాక్రాంతలై కాంచి నా
యన ! నీముద్దు మొగంబు చూడకెటులీ • ప్రాణాలతో నుందుమో
చనుదెంచెం గదె కాళరాత్రియయి యా • జన్మపుత్రి యీలంకకున్
జనువారల్ చనువారలే గద ! వినా • శం బిట్లు రాఁగూడునే ?

చ॥ అని విలపింప వారల క • టాక్ష పరంపర దాఁటిపోయె; మా
యను గొని దాఁగి యింద్రజితుఁ • డావలికేగెనా ? మోసచేయఁదే
మనెదు విభీషణా ! యనుచు • నాడుచు లక్ష్మణుఁడుండ వాని స్వం
దన విరవం బకాండ జల • ద ధ్వనినాఁ గవిసెన్ శ్రవంబులన్.

సీ॥ పసిఁడి కంబములతో • వఱలు చెక్కెంబులు. పిడుగులఁబోలిన • బిట్టు రవము
వరరత్న ఖచితమై • మెఱపుల కిల్లయి. ముల్లోకముల కేగ • మొనయునదియు
జలధుల గలఁగంగ • జగములు వడఁకంగ. దిగ్గజంబులు తెల్వి • ద్రగ్గి ప్రగ్గఁ
బ్లవగబలము గుండె • లవియఁ గులాద్రులా. టాడ ధూళియు రేగ • నవని వీఁగ
తే॥ శేష శిరములు చలియింపఁ • జేరెరథము. రాక్షసులగర్జనంబు ఘో • రముగఁ జెలఁగె
నింద్రజితుఁడు క్రూరాస్త్రంబు • లేసి యార్చె. లక్ష్మణుండు ప్రత్యస్త్రంబు • లంగవించె.

ఉ॥ మాయలు దుస్తరంబు లతి • మానుషముల్ గల వీని నిప్పుడే
మాయఁగఁజేయవేని జయ • మార్గము నవ్వలఁ గాంచలేవు సు
మ్మీ యను నవ్విభీషణుని • మేలి వచస్సుల నాదరించి దై
తేయునిమీఁద లక్ష్మణుఁడు • కేవలుగాఁ గురియించె బాణముల్.

చ॥ ఇరువురు నెచ్చుకుందు విన • నేర్పడకుండ గ దూపులేయఁగా
శరమయమయ్యె బెట్టిదపు • శబ్దముతో రణరంగమెల్ల వా
నరులును దానవుల్ చెదరి • నక్కిరి పల్లములందు మట్టు ల
ట్లిరువురు మీఱి మీఱి కురి • యించిరి దొడ్డగ బాణ వర్షమున్.

చ॥ నడుమనె దానవాస్త్రములు • నాశము పెందఁగ రాఘవాస్త్రముల్
తొడరి యతిక్రమించి కొని • తూఱుచు రావణి మేనిరక్తముం
గుడిచెను దానవాస్త్రములు • కొన్ని మరుత్సుతు మేనఁ బట్టలో
విడువని పోల్కిఁ దూఱ గమ • నింప నుపేక్ష యొనర్చె నాతఁడున్.

మ॥ విషముంబోలిన తూపులం బఱపి వృ • ధ్వనాదపుత్త్రుండు రా
క్షసనాథాత్మజు కొందఱంబు సురలెం • చం ద్రుంచె దైతేయు నా
రసముల్ లక్ష్యము దప్పుచున్ గుఱికిఁ జే • రంబోక ద్రుంగారుచున్
బనమాలెం గ్రథనక్రియల్ చలుపు త్రో • వన్ సత్త్వహీనంబులై

మ॥ విలువిద్దెం దన నేమపుం బలము గా • న్పింపంగ వీలుంకమిన్
బలభిద్ద్వేషి పులస్త్యపౌవి తనకున్ • వాత్సల్య సంపూర్ణుఁడై
కలనం దోడని యిచ్చు కుంతమును వీ • కన్ వైవ మౌనీంద్ర వా
గ్వల సంకాశ శిలీముఖంబున నదం • గం ద్రుంచె సౌమిత్రియున్.

ఆ॥ మేకు లూన్చినట్లు • మేన లక్ష్మణ శరా, వళులు పొదువ నింద్ర • వైరి పురం
నలఁగు లేయుచుండ • నాతని తూణంబు. తునిఁగిపడఁగ దాము • నసుజుఁడేసె
ఆ॥ తేరు గలుగ వీఁడు • తెరలఁడు లొంగఁడు. ననుచు హయుల నేసి • యనఁగకునికిఁ
బగ్గములును తెగటి • పరికించి సారధి. శిరముద్రుంచి వైచెఁ • జిత్రగతుల.
ఆ॥ ఇంద్రియముల కలఁచి • యేఁపఁ దపించు త, పస్వి మనముపోలెఁ • బఱపుఁజెలి ప
తిప్రాణాత్మ నరణిఁ • దీఁద్రించి స్వేచ్ఛను. పూనెఁ జోదకుంతు • లేని తేరు

క॥ మేఘనిభ దేహుఁడగు నా, మేఘరవుఁడు పొంచి దొడ్డ • మేఘములందే
మేఘముకైవడి శిలల న, మోఘముగా గురిసె వరము • వేఁడిమివలనన్.

తే॥ దిక్కువోఁపక వానరుల్ • స్రుక్కి శిరము లురము లగలంగ ధారణి • నురలఁ గాంచి
లక్ష్మణుఁడు త్రివిక్రము మేని • లలి నభంబు, విశిఖ కాయమానంబు గా • వించివైచె.

తే॥ వైశ్రవణి యెదిరి చుస • త్త్వము కృశించె, నల్లనైన యాకాశంబు • నడుమ నొక్క
యెఱ్ఱ మొగులునా నుండిన • యింద్రజితుని, మేనిజాడ లక్షించె సౌ • మిత్రి యపుడు.

క॥ ధనువు తునుంగకుండిన నా, ధనువుగొను కరంబు తునిఁగి • ధరణిం బడదే
యని తలఁచి త్రెవ్వనేసెను, ఘనకరమున్ గంకణాది • కముతో నురలన్

ఆ॥ విలయ మారుతంబు • వీవ మేఘంబింద్ర, ధనువుతోడఁ బడిన • యనువుదోఁప
వానిచేయి వడియె • నూనిన ధనువుతో, మణి విభూషణములు • మలసి వెలుఁగ.

తే॥ బాలచంద్రు శేషుఁడు పట్టు • పగిది నొప్పు, వ్రేళ్ళతోఁ జుట్టి పట్టిన • వింటితోడఁ
దరులు శిలలు కపులు నల్గ • దనుజుకరము, ధాత్రిఁ బడి తికపికలాడి • తల్లడిల్లె.

తే॥ సూర్యుఁ దురలక చంద్రుఁడు • స్రుక్కకుండఁ, మేరుగిరి దొరలక శక్ర • వైరి కరము
పడుటగని యంత్రముంబోలు • బ్రతుకునందు, మోహమేలని విబుధ స • మూహమనియె.

ఉ॥ అంచిత పుణ్యు లక్ష్మణుని • యస్త్రముచేత నసత్య మల్పమౌ
నంచుఁ దలంచు రావణుని యగ్రసుతుండు కలంకచిత్తుఁడున్
వంచకుఁడైన యింద్రజితు • బాహువు త్రెవ్వి ధరిత్రిఁగూల రా
త్రించరులెల్లఁ గాంచి తల • త్రెవ్విన తీరునఁ గుందిరయ్యెడన్.

ఉ॥ వానరనాయకుల్ చెలఁగి • వారక సింహరవంబు సేయుచున్
దానవసేనలం దఱిమి • దంత నఖావలిచేఁ బదాహతిన్
దీనఁగు పెంటచేసి యల • వేల్పుల లోకము క్రొత్త సంస్కృతుల్
జానుగ నిండి మెండుకొను • చక్కటి తక్కక చేసి రత్తఱిన్.

ఉ॥ నీలగళుఁడు మున్ను కరు • ణించి యొసంగిన గొప్ప శూలమున్
గేల ధరించి శత్రు సవ • గీర్ణచరిత్ర మెఱుంగలేవె నిన్
నేలకుఁ ద్రోచికాక మఱి • పీలుగనంచు మహాసటుండనన్
గాలియనంగఁ జివ్వనఁగఁ • గ్రాలి దశాస్యకుమారుఁ డేఁచఁగన్.

మ॥ పరమార్థం బగునేని రాఘవుడు స • త్యం బూఁదియున్నేని యు
ర్వర ధర్మంబు జయించునేని బలభి • త్ప్రత్యర్థి శీర్షం బిలన్
దొరలుంగాకని లక్ష్మణుండు విలస • ద్దోస్సార మేపారఁగా
శర మాకర్ణము లాగి వీడె జగముల్ • సంతోషముం బొందఁగన్.

తే॥ చక్రశూలబ్రహ్మాస్త్ర వ • జ్రములు సిగ్గు, నొందనమ్మహాశర మగ్ని • లుమియుచుఁ జని
యింద్రజితుని శిరము ద్రుంచి • యిలను గూల్చి, వేలుపుల పూఁవానలో • వెలసి మలసె.

సీ॥ తెగిన శిరంబు పై • నెగిరి పడగ మున్న, విజయ మారుతముచే • విఱిగి పడిన
పిడుగులు మెఱుపులు • బెదిదంబులగు రాల, మేఘమ్ము మ్రగ్గైపడి • మేఘనాదు
నొడలు తూలముతోడఁ • బొడుచు కొన్సృట్టియ, మ్ములతోడ బరువయి • పుడమిఁ బడియె
దంష్ట్రలనెడు విధు • ద్వయముతో గురు శుక్రు, లను బండలములలో • ఘన విశిష్ట

తే॥ కేశ పాశమనెడి రశ్మి • కిరణవితతి, తోడ రవిమండలము రాల • ధూతమగుచు
ధరణి కొఱఁగిన లెఱఁగున • దనరి వాని, తలయు దబ్బునఁ బడియె ను • ద్దండభంగి.

ఉ॥ జీవుఁడు దేహ సంస్థితివి • చెందక యవ్వలి కేగినంత నా
త్రోవనె యంతరింద్రియ త • తుల్ చనుకైవడి రాక్షసావళుల్
రావణి కూలునంత నసు • రస్థితి నాయుధరాజి పీడుచున్
ద్రోవ యెఱుంగ రాక పలు • త్రోవలఁ బోయెను దిక్కు తోఁపమిన్.

శా॥ అస్త్రాభ్యాస విశారదుండయిన హ • ర్యశ్వారి యుక్కాఱఁగా
విస్త్రింశంబగు దైత్యపాలనము వ • స్నెల్ మాసె నంచార్చుచున్
వస్త్రంబుల్ వెస వీచుచున్ సురలు పై • పశ్యంబునన్ బ్రేమమున్
శస్త్రం బూనిన జైనదేవతల యో • జం బూని రప్పట్టునన్.

మ॥ అరవిందాసనుఁడున్ మహేశ్వరుఁడు నం • బాలుండు నింద్రాది ని
ర్జరులున్ డిచ్చు మొగంబుగాక సిర వ • ర్గంబుల్ వనాటావళుల్
పెరిమిం జూడఁగఁ జాలకాలము నభో • వీధిన్ మనోమోద సం
భరిత ప్రేమను నిల్చినారలు మహా • పర్వంబు సంధించుచున్.

మ॥ అనిలో రావణిచే నిశాచరులచే • సంప్రోక్షితిం బొంది మా
లిన కీశావలులెల్ల జీవములనో • లిం గాంచి పూర్వంబు కం
టెను సత్త్వం బొదవంగ లేచిరి విరా • ద్వేయాను కంపాప్తి స
ద్గుణులం బీడ వెంబడిన్న సుజనో • త్కృష్ కల్లలౌనే ధరన్ ?

తే॥ అసుర తలగొని ముందుగ • నంగదుండు, జరగ వేలుపు లొత్తుగఁ • జల్లుచున్న
విరుల పందిరిక్రింద వా • నరుల నడుమ, హనుమపైఁ జనె సౌమిత్రి • యన్నకడకు.

క॥ రాముఁడు ఖేదంబును మఱి, పెనుపడు మోదంబు గలుగు • పృథ్వీపతి సం
తసపడఁ గేలం దలఁగొని, మునుపడ సెలవెంచు వాలి • పుత్త్రుఁ గనియెన్

క॥ చందురు కలఁకంబని నా, ఱిం వనరిన విందలొంగఁగ • గురుతర కీర్తిం
జెందితి ధర్మము కిరుబిగ, పం డలఁగని కీటు రాని , భాగ్యముఁ గలదే !

క॥ లంకాధిపతి కుమారు వి, శంకటగతి లక్ష్మణుండు • చంపఁగఁ గనిమం
దంకించి శిరము దెచ్చితి, వింకే నెత్తితిని శిరము • నెనసితి జయమున్

సీ॥ వేలుపుల్ దలయెత్త • వేదముల్ తలయెత్త, ధర్మంబు తలయెత్తఁ • దపములెత్త
మఘవుండు తలయెత్త • మౌనులు తలయెత్త, సత్యంబు తలయెత్త • సత్త్వమెత్త
జగములు తలయెత్త • జనములు తలయెత్త, దయయును తలయెత్త • నయమునెత్తఁ
బ్రేమంబు తలయెత్త • నేమంబు తలయెత్త, శాంతియుఁ దలయెత్త • దాంతి యెత్త
తే॥ సత్పథంబులు తలయెత్తఁ, సాధులెత్త, ముక్తిచింతయుఁ దలయెత్తఁ బుణ్యమెత్త
నంగదా! తలదెచ్చితి • వధిక ముదము, హత్తినాఁడవు నేఁ దల • యెత్తనమచు.

ఉ॥ ఏమగునో యటంచును జ • యింపదె ధర్మమె యంచు లక్ష్మణ
స్వామియె గెల్చునంచు విసు • వానముతోఁ దనలాక సంతత
ప్రేమను వేచు నాభరతు • పేఁకను తమ్ముశరాక వేచు నా
రాముఁడు కన్నులార నెదు • రం గనె డాయుచునున్న లక్ష్మణున్.

మ॥ పగవానిం దెగటార్చి వచ్చిన ప్రియ • భ్రాతన్ బ్రతీక్షించుచో
మిగులం గన్నుల రాలు నశ్రుపులు నె • మ్మిన్ వచ్చెనో? నెమ్మదిం
బొగులన్ వచ్చెనొ? మోవదారలొకొ? యె • మ్ముల్ గిరుగాఁజేయు జా
లి గదింపన్ వెలివడ్డ ధారలొకొ? శ్రీ • శింపన్ సుసాధ్యంబొకో?

శా॥ సంతోషామృతధారలున్ బ్రవిమలో • త్సాహంబు నుత్కంఠ వి
క్రాంత స్ఫూర్తి వెలుంగ సన్నిహితుఁడౌ • రామాంఘ్రి సాన్నిధ్యమం
దంత! ప్రీతి సమర్పణంబు సలిపెన్ • బ్రాణాంతమందైన ని
క్లాంతిం బొందని వీర లక్షణ విధా • క్రాంత ద్విషన్మత్తమున్.

మ॥ తిలఁ జూచున్ జయలక్ష్మిఁ దాల్చిన భుజా • స్తంభంబుఁ జూచున్ మహా
బలసూనం బరిగించు లక్ష్మణ ధను • ర్బాణంబులన్ గాంచు వే
ల్పుల చేష్టల్ దిలకించు లక్ష్మణుని తెం • పుం దేఱి చూచున్ ముదా
కిలనన్ మీఱిన రాముఁ డేమియు నెఱుం • గన్ లేక మౌగ్ధ్యంబునన్.

సీ॥ అనపృథుఁడును సుగు • ణాంభోధి రాముఁడు, తనపాదములకు వం • దన మొనర్చు
తమ్ముని కాలాంబు • దమును సంధ్యారాగ, మెనసిన చందాన • నిమ్ము మెఱయ
నీలాచలముమీఁద • బాలభాను మయూఖ, ములు ప్రసరించిన • పొలుపు వెలయ
తొమ్మున భుజమునఁ • గ్రమ్మిన రుధిర క, ణమ్ములు తన మేనఁ • బమ్మికొనగ
తే॥ గాఢముగఁ గౌఁగిలించి నా • కడకు జనక, పుత్త్రి వచ్చి చేరినదని • ముదము గొంటి
ధరణిఁ దమ్ములఁ గలుగు వా • దరుల కలుకఁ, దనెడు వాక్యంబు నెలకొల్పి • తయ్య నేఁడు.

తే॥ అనుచుఁ దమ్ముని స్నిగ్ధభుజములు • నలముచున్న, తూణములఁ దీసి మఱి తను • త్రాణములను
విడిచి వ్రణముల మెల్లనఁ • దుడిచియొత్తి, శ్రమము వోకార్చి తాను మో • దము వహించె.

తే॥ పురుషపుంగవ! యీగెల్పు • పౌరయుటరయ, నీవలనఁగాదు హనుమంతు • నేర్పువలనఁ
గాదు దైవంబుచేఁ గాదు • కాదు నిజము, మన విభీషణుచే నని • వినుతి చేసె

# 28. రావణ శోక పటలము (61)

తే॥ దరులు గల రక్త జలధిని • దాఁటి దైత్య, దుఃఖసాగరమును దాఁటి • దూత లప్డు
గుహను చొచ్చు మచ్చునఁ జెను • గోపురంపు, ద్వారమునఁ జొచ్చి రావణు • దరికిఁ జనుచు

క॥ ముంగిళ్ళను నిలిచిన దై, త్యాంగన లతిదుఃఖజలధి • యడుగునఁబడి క్రుం
గంగని నేఁటికి లంకయె, క్రుంగె మహాంభోధి ననుచుఁ • బోయిరి దూతల్.

ఆ॥ పండ్లు నోరు మనసు • ప్రాణంబులును కాలుఁ, గేలు వడఁకుచుండ • గిలి కుదింప
నీకుమారకుండు • నేఁటికి లేఁడయ్యె, ననిరి చారు లా ద • శాస్యుఁ జేరి.

ఆ॥ అవట నుండినట్టి • యమరులు నమర మా, వినులుఁ దిక్కువారు • నేఁడు జగమె
నాశమందు ననుచు • నడుఁకుచు దెసలకుఁ, బరుగులిడిరి పంక్తి • వదనుఁ బాసి

ఆ॥ కినుకఁ గనులనుండి • కిత్తి కణంబులు, రాల మతిమిచూచి • రావణుండు
కత్తిదూసి చరుల • కంఠముల్ తెగనేసి, కేలు వడఁక నేలఁ • గూలినాఁడు.

ఆ॥ పుత్త్రశోకవహ్ని • ముఖములఁ బుట్టి ని, శ్వాసమునఁ బెరింగి • చక్షులందు
వెలిఁగి దెసలఁ బరవి • విలయాగ్ని యే దశ, వదనుఁ జేరె ననఁగఁ • బ్రజ్వరిల్లె.

ఆ॥ ఒడలు వడఁకఁ బుదమిఁ • బడి యచలుట నేత, నవని శేషుఁ దరి • యలుగులపర
వెలలు కోపవహ్ని • వలన బాడబమె పై, కుబుక జలధి యుడుకు • నోజ నుడికె.

తే॥ తాపవహ్నియుఁ • బైపయిఁ • దనరు ప్రేమ, వనట యడరఁగ నియవది • కనులనుండి
యురలు బాష్పప్రవాహంబు • కరఁగి యుబికి, పరవి పరుగిడు తామ్రద్ర • వంబుఁబోలె.

క॥ కటకటపడి రదనంబుల, బటపట గీఁటుమను పిడుగు • వలె బెడిదముగా
నటపటపడ నిం మోదెను, తటపటమని జీవకతి యె • దల్ సుకివశఁగన్.

ఉ॥ కాలిన పుంటిపైఁ గిరఁగిఁ • గాఁచిన శూలముఁ దూర్చినట్లుగాఁ
దాళఁగలేక క్రుక్కి పెన్మ • ధంబదు సోలును లేచుఁ గ్రుంగుఁ జిం
తాబ్ధినుఁదై కలంగుఁ దస • యా! యను హా! యను విహ్వలించు ని
కేల జగంబు జీవధన • మేగిన పిమ్మట దేహమేలను॥

ఉ॥ నాయన! యింత చెట్ట యగు • నా యను నింద్ర విరోధ మింతయే
నాయను ఎన్ను పీడఁ బగు • నాయను వేల్పులు సంతసింపఁ జ
న్నాయను నేను నిల్వ గల • నాయను శౌర్యము మంటిపాలు గా
నాయనుఁ బౌరుషం బడఁగె • నాయను జీవము పాసెనాయనున్.

క॥ శూలియుఁ గిలియు నవ్వని, మాలియు నెదిరింపలేక • మలఁగినవారల్
లీలగ హేలగ గెలిగ, మేలుగ విహరించువారు • మీఁద పవముచెన్

క॥ ఖేచరుల విమానంబుల, గోచరమే కాకయుండు • గోటి కొకంటన్
నీచుల రణ విజయంబున, నేచెలఁ యీలంకమీఁద • నెగయవె యింకన్ •

క॥ దూతలు పలికిన తీరున, నాతుఁడవ యొకండు తనుమ • నరఁగితివే ? నీ
చేఁతలనే తలపోయు కి, రాతులు యమదూత లెగచి • రా నిన్నలమన్ ?

తే॥ అనుచు లేచును నాయనా • యనుచుఁ బిలుచుఁ. బడును వలవించుఁ దూలును • పుడమిఁ బొరలు
నుడుకుఁ బరితపించుఁ జెమర్చు • మఱిమిచూచుఁ. గనులుమూయును లోలోనఁ • గళవళించు.

క॥ ఒక శిరము పుత్త్రికా ! యను, నొకశిర మిఁక రాజ్యభార • మోపుదువె కటా !
యకటా వికటంబగు నను, నొకశిర మరినోట నిన్ను • నుంచితివె ? యనున్.

క॥ ఒక శిరము పోయితే ! యను, మెకమొకటి మృగేంద్రుఁ జంపి • మించెనె యను వే
ఱొక శిరము రాఁగదే యను, సుకముగ నను తడవకున్న • స్రుక్కెదుగ దనున్.

క॥ ఒకశిరము హరి గిరీశ స్వకరాయుధములకు నపయ • శముగూర్చి వికా
సిక నవ్వు నీ మొగము చూ, పక పోయితె యింకఁ జూడఁ • బనుపఁదునె ? యనున్

క॥ ఒకశిరము నీవు చన్నం, గకవికయగు నామనంబు • కష్టి చుచుఁ దో
డొకయింతలేక మలఁగును, సుకుమారా ! తండ్రిఁ దేర్చఁ • జూడవొకో ? యనున్

క॥ ఒక శిరము నిర్జరేంద్రుని, మకుటముఁ దివియంగ నరి • మగువలు సుమముల్
ప్రకటించి చల్ల వెలసిన, మొకమును పొలికలనిఁ గాంతు • మో యని పొగులున్

క॥ ఒక శిరము యక్షవనికలు, వికట భవద్ఘన రవంబు • విని తమకము కు
త్తుకలఁ గల సూత్రములఁ దడ, వికొనుట విఁకమీఁద లేక • విహరింతు రనున్

క॥ ఒకశిర మపార బలద, ర్పక ! నీ సన్నిధికి వచ్చి • వైవస్వతుఁ డం
దిక నసువులు గొనఁజాలం, డిఁక నను విడి యేజగమున • కేగితివో ! యనున్

క॥ అని యిటు వనవుచు రావణుఁ, డనిలజవంబునను సంజ • యాసమనఁగాఁ
జను పొలికలనికిఁ జని తన, తనయు కళేబరము నచటఁ • దడయం జొచ్చెన్.

క॥ సేవకులగు సుర లసురలు, రావణుతోఁ బరుగులిడిరి • రణరంగమునన్
భూవలయంబుఁ జరాభర, జీవనితతితోడ నేమి • సేయునొ ? యనుచున్.

ఉ॥ కన్నునఁ బంక్తికంఠుఁ గని • పంక పిశాచ గణంబు లయ్యెడన్
ఖిన్నతనొందినట్లు పరి • కించి ప్రలాపముసేసెఁ గొన్ని పెన్
విన్నదనమొందెఁ గొన్ని పల • వించి పదంబుల వ్రాలెఁ గొన్ని యా
పన్నతఁ గొన్నిచేరె శవ • వారిజ కాయ నికాయ మధ్యమున్.

చ॥ కొడుకు కళేబరంబుఁ గనఁ • గోట్లకొలందిగఁ జచ్చి కుప్పలై
పడిన తురంగ సంఘముల • వారణవారములన్ భటాలి నఁ
గడమల శీర్ణమైన ఘన • గాంగ శతాంగములందు నంతటన్
గడఁకను ద్రోచిద్రోచి వెద • కఁ దొడఁగెన్ దినమెల్ల నయ్యెడన్.

మ॥ హృదయావేగము నేయుచే సదయు ప • హ్నాంబోరి వర్తిల్ల నం
గదచేఁ గన్నుల సిరుపొంగి పొరలన్ • గ్రవ్యాదలోకేశుఁ డా
త్రిదశద్వేషి బలిష్ఠ బాహుక యుతో • గ్ర స్ఫార హీర ప్రభాం
గద విభ్రాజిత ఖండ దీప్త శిరముం గాంచె న్నెగుల్ డిగ్గనన్

క॥ తూణీరము కేయూరము, బాణములును రాలిపడఁగ • బన్నగమువలెన్
రాణించు కరము స్వశిర, శ్రేణిం గీలించుకొనియె • జిత్తము తరలన్.

క॥ తుది నిశ్వాసము గల దిశ, వదనుఁడు కంఠమునఁ గనుల • వక్షంబున నం
గదగొని యొత్తును మూర్ఛను, బెదవులు చలియింప నేడ్చు • విలవిలవోవున్.

చ॥ పదపడి వాని మేనుగని • పట్టఁగరాని యలంత పెంపునన్
బెదపులమీఁది పక్షమునఁ • దీనుఁగుప్పెఁ బడ బాష్పవాహినుల్
పదరి శిరంబులేని కుడు • పంబును పట్టి పరిష్వజించి మై
యదరఁగ వెక్కి వెక్కి యల • యన్ విలపించు సురుంగు దూపిలున్.

చ॥ కొడుకు సురంబు నాటెలె ల • కోయిల నూడ్చ యలంతి తుండ్లుగాఁ
జిడిముడి దీలు గా వియుమఁ • జింతిలు మూర్ఛలు మేను మూర్ఛనున్
దడవుఁ జలించి లేచి ఘన • సంబుల నొక్కట గ్రుంగసెంచు న
ప్పడయుని గూలు వంత తల • మున్కలుగాఁ దపియించు మ్రాన్పడున్.

శా॥ శక్రద్వైత్యేంద్రుని యల్క రాఘవులతో • నే తీయునో ? బ్రహ్మరు
ద్రాదిత్యావలితోడఁ జోప్పనొకో ? లో • కాంతంబె కావించునో ;
యేదారిం జనువార మంచు సుర మా • సేంద్రామిలెల్లన్ మనః
ఖేదోన్మాద విశేషితాంగు లగుచున్ • గీర్వాణులై యుండఁగన్

మ॥ దశకంఠుండు కుమారు శీర్షము సహా • ద్గాత్రన్ బరీక్షించి య
ప్పశువుల్ కైకొనిపోయిరంచు వెగచున్ • పక్షంబునం జేర్చుఁ బు
త్త్రశయంబున్ మదిపట్టి పాయము పెలా • ర్పన్ మండుచున్ మాఁడుచున్
దశ లోకుల్ పెడి బద్ధులై పగల రో • దించుం భువిం దొల్లుచున్.

ఉ॥ దిక్కరులన్ గలంచి కడుఁ • దేలిచె శంకర శైలమెత్తి పెం
పెక్క జగంబులం గెలిచి • యేప పహించిన యేను నానుతుం
దిక్కడ నేఁడు గ్రించు నరుఁ • డెక్కటి కయ్యమునందు కూల్పఁగా
నుక్కటి దీనతం గలఁగు • చుంటిని దిక్కటి బిక్కరించుచున్.

చ॥ అలకను కాల్చి యింద్రపురి • యందము ప్రాలఁగ బొగ్గుచేసి యి
య్యల నెదురెంచు లేక చరి • యించి జగంబుల నేలు నే రణ
స్థలిఁ దలఁ గోల్పడన్ దనుపు • జంబుకముల్ గ్రసియింపఁ గూలు గా
దిలి సుతుఁ గాంచి యాపిదపఁ • దిన్నది కుక్కలకూడు నానాకో ?

చ॥ కొమరునితోడ వచ్చిన య • కుంఠిత విక్రమశాలు లాజి దు
ర్దములగు రాక్షసుల్ సమర • రంగమునం దొకరేని లేక జీ
వములఁ ద్యజించినారు కపి • వర్గమునం దొకఁడేని చావఁడీ
క్రమము విచిత్రమయ్యె నని • కాంచుచు నూరకయుంటిఁ జెల్ల రే!

మ॥ సుర గంధర్వ భుజంగ యక్ష హరిణా • క్షుల్ సిద్ధ సాధ్యాంగనల్
వర విద్యాధర కీరవాణులగు నీ • భార్యల్ ప్రలాపించుచున్
వరుఁడేడీ శివమేది చూపు డనుచుం • బ్రశ్నింపఁగా నంతకున్
దురమందోర్చిన యేను వారి కెటు గాం • తున్? బల్క నోరాడునే?

మ॥ జయలక్ష్మిం గొని యింద్రసంపదల వి • చ్చం గోరినట్లెల్ల ని
శ్చయలీలం గొనిపొందితిం దుది మను • ష్యస్త్రీకి నొక్కర్తుకై
యయయో! నీవానరింపఁగాఁ దగిన యం • త్యప్రక్రియల్ నీకు నే
నయి కావింపఁగఁజేసికొంటిఁగద క • ష్టాత్ముండ దౌర్భాగ్యుఁడన్.

చ॥ అని బహుభంగులం బనవి • యాత్మజు దేహము నెత్తి నెత్తిపైఁ
గొని దనుజాంగనల్ గదిసి • కొందలమందుచు నేడ్చుచుండ లం
కను వడిఁజేరెఁ గాంచిన ఖ • గంబులు నేడ్వఁగఁ బత్తనంబె నె
క్కొనినది యాలగోడుగను • గోలల గోడుగ బాల గోడుగన్.

చ॥ కనులఁ బెకల్చికొంచుఁ దమ • కంఠములన్ వడిఁ ద్రెంచికొంచుఁ గ్ర
న్నన హృదయంబుఁ జీల్చికొని • నాలుక లూడిచికొంచు శీర్షముల్
మొనసి పగిల్చికొం చసుర • పుత్త్రుని భార్యలు పజ్వ రయ్యెడన్
మనసుల పుండ్లుగా నయిఁపు • మాలి త్యజించిరి ప్రాణవర్గమున్

శా॥ తండ్రీ! యంచును దానవాంగనలు నా • థా! యంచు దైత్యేంద్రుకో
డండ్రుం గుంపులుగూడి కట్టుకొని యే • డ్వం దక్క చెల్లెండ్రు ని
ల్లాండ్రుం బిడ్డలు జీవితాశలను రో • యన్ గుంపులై వచ్చి రె
వ్వాండ్రుం జూడగఁ దెవ్వె సంతిపురికిం • బౌలస్త్యుఁ దమ్మెందెమున్.

సీ॥ పుట్టకోపలఁ బద్మ • ముల మోఁదుపగిది ను, రమ్మెఁ గరమ్ములఁ • గ్రుమ్మికొనుచు
రశనను మోవసే • రవి సన్న కౌను పా, రిండ్ల భారమ్మున • నింట్రపడఁగ
ముడివీడి వేనలి • మడమలఁ దడవంగఁ, గన్నీరు మున్నీరు • గాఁగ నలమ
విప్పు ద్రొక్కఁగ గతి • నేలఁ బదములానఁ, బుత్త్రదుఃఖము పొంగి • పొరలి ముంప

తే॥ మృగయుఁ డిన్న హృదయయై • మేదినీధ్ర, మందు పొరలు మయూరినాఁ • గొందలించి
కొడుకు మేనిపైఁ బ్రాణముల్ • కుతిలపడఁగ, వ్రాలి మందోదరి ఘనంబు • తూలసోలె.

తే॥ కొంత సేపు కలవిడక్కి • కూలియుండెఁ, గొంత సేపు నిశ్చేష్టయై • కూడుచుండెఁ
గొంత సేపు మౌనంబుఁ • గుందుచుండెఁ, గొంత సేపు వెక్కుచుఁ బల్కు • కుదురకుండె

చ॥ తరుణి శశాంకుఁబోలెఁ బ్రసు • ఠంబుగ వర్ధిలినాఁడె వాసవున్
గరువమడంచి తెచ్చుటను • కాంచఁగ నోచిన యేను మెండెమున్
బరువుగఁ జూపఁ దాల్పదిలిఁ • బాప కలంకిత చిత్తఁ గావునన్
మురుపగు నీదు మోము గను • పుణ్యము నింతయు నోచనైతిగా

ఉ॥ చక్రిని శంకరుం జెనకి • సంకట పెట్టితి వల్లనాఁడె దో
ర్విక్రమవర్య! నీయెడరు • విన్నను వొప్పు మొగంబుఁ జూడకే
శక్రభయంకరా! మసఁగఁ • జాలుదినయ్య, యనంగరూప! నే
నీక్రియ నీదుమాత నని • యేత్తెఱ నొంటిట దీనిఁ జూడనే?

ఉ॥ కాళుల గల్లుగల్లుమని • గజ్జెలు మ్రోయఁ జరించునాఁడె సిం
గాలను పట్టి యాడ్చికొని • కాటియవెట్టుచు మేడ మ్రుంగ నే
లీలగఁ గట్టివైచి పలు • లీలలఁ దేలుచు నుంటఁ జూడ గా
జాలదునయ్య! యింక మరు • జన్మము నెత్తిన నోము నోచినన్.

ఉ॥ హస్తముచాఁచి పిల్వ గశ • శాంకుఁడు భీతిలి వచ్చి నిల్వ నీ
శస్త్రకరంబుతో నలిపిఁ • జల్లగ దువ్వుచు భీతి మాన్పి రం
బ్రస్తుతమౌ కళంకముఁ గు • రంగముగాఁ దలపోసి పట్టఁగా
నిస్తుల హస్తముం బఱపు • నీటు గనుంగొన నెంతు దాఁగదే!.

చ॥ స్కందుపటోల సుందర ని • శాచర పన్నగ యక్ష దేవ శ
తేందు ముఖుల్ విలాసముల • హేలల లోఁగొనవెంచి పుష్పశ
య్యం వతిఁవేచి విశ్వ శ్రమ • నంది సుఖంబుగ నిద్రసెందితో?
క్రందగు కయ్యమం దొనరు • క్లాంతి తొలంగఁగ విశ్రమించితో?

క॥ ముల్లోకంబుల గెలిచిన, బల్లిదుఁడగు సుతుఁడు నేడు • బవరంబున ని
ర్జెల్లిదుఁడగు నొక మానవు, భల్లంబునఁ దెగియె నకట! పాపపు విధిచే.

ఉ॥ దూది హుతాశిలో వరెనె • దుర్దమ మానవ బాణ వహ్నిఁ గ్ర
వ్యాదులు చన్నవారు చని • నట్టుల చచ్చెదువార క్రమ్మఱన్
లేదొక ప్రాణియైనఁ గబ • ళించె దశాస్యుఁడు ధాత్రిజాత యన్
స్వాదు విషంబు రేపటికి • సాధ్యమె యిట్టులు కాక తక్కఁగన్?

మ॥ మది సంతాపము పిట్లు వెల్వఱచు న • మ్మందోదరిం గ్రవ్యభు
క్సుదతుల్ చేతులమీఁద నెత్తుకొనుచున్ • శుద్ధాంతమున్ జేర నం
గవ వర్షిల్లఁగ రాతిగుండెగల యా • క్ష్మాజాతయే హేతువౌఁ
గదయం చుగ్రగతి న్వధింపఁ జనె లం • కానాథుఁ దత్యార్భటిన్

మ॥ పరుగుల్ వాఱుమనున్న రావణుని భా • వంబుఁజా విమర్శించి ని
ల్వరమౌ కీర్తి నశించునే యనుచుఁ ద్రో • వన్ డెంపు తోడన్ మహో

దరుఁ దగ్ధంబయి వ్రాఁగిలంబడి యమున్ • దైత్యేంద్ర ! కోపంబుచే
స్థిర కీర్తిం గొనిపోయి గంగఁ గలపం • జింతించెదే తొందరన్ ?

ఉ॥ కీరితి మొత్తముం భువన • గేయముగాఁ గొను రాక్షసేశ్వరా !
కోరితి లోకనాయకత • గొంటివి కోరిన కోర్కి చెల్లఁగన్
జేరితి చెంతరాని సుర • సిద్ధ పదంబులఁ బల్మి పెంపునన్
మీఱితి వెల్లభోగముల • మేకొనెదేలఁ స్థిరావనిందకున్ ?

మ॥ సురసంఘంబులపై దిగీశ్వరులపైఁ • సుత్రాముపై వాలిపై
వర దిగ్వారణరాజిపై ధనదుపై • వర్తిల్లు యుష్మచ్ఛరా
చర భీతిప్రద చంద్రహాస మొకం • జాతాక్షిఁ దుండింపఁగాఁ
బరవన్ సిగ్గిలి క్రుంగుఁగాక వనితా • ప్రాణంబులం గ్రోలునే ?

మ॥ అబలన్ గోల లతాంతకోమల ససూ • ర్యంపశ్య వైదేహిఁ గో
పబల స్ఫూర్తి గడల్కొనం దునుముచో • బ్రహ్మాదు లింద్రాదు ల
ల్పబలుం డల్పగుణుండు పీచకుఁడుఁడున్ • వ్రాత్యుండు భీతుండు మా
న బల స్థైర్య విహీనుఁడం చనరు లం • టం గేలి గావింపరే ?

ఉ॥ కాదిది రాజనీతియును • గాదు సురారి ధర్మరీతియున్
గాదిది సాధుపద్ధతియుఁ • గాదు జయాంకము కాదు మోదమున్
గాదిది యిష్టసిద్ధియును • కాదిది మేలియు విక్రమస్థితిం
గాదు పులస్త్యవంశ్యు ! కొలఁ • గాని యపప్రథ దెచ్చికొందువే ?

ఉ॥ రాముని శక్తితో నలుక • రాముని వెంది జయించి లంకనున్
రా మతియించెదో ? చెలువ • బ్రమ్మఁడిన, వారలు చింటతోడ సం
గ్రామము మానువారలను • కారు మో ? యటి పీరుభిన్మమో ?
రాముని గెల్వలేకుడిగి • రాక్షసరాజను గోలు మోసెదో ?

ఉ॥ నావుడు రావణుండు లల • నన్ వధియించుట మాని పోసి వా
లావరుఁ బాలుపైచి తను • యర్మిలి పుత్త్రి శిరంబుతోడ నా
జీవవినోది వంశజుల • శీర్షములన్ గొని కాక క్రమ్మఱన్
రావణి గాత్రి మందనుక • రంగఁలు కుంచుఁడి తైలమం దనెన్.

## 29. సేనా సందర్శన పటలము. (72)

చ॥ కొడుకు శవంబుఁ దైలమున • గుప్తి యొనర్చిరి దైత్యవైద్యుల
య్యెడ దెసలెల్ల నిండి వసి • యించుచు నుండిన రాక్షసావళిన్
గడుకొని పిల్వఁగాఁ జనిన • కర్బురదూతలు వచ్చి లంకలో
నెడ మొకయింత నిల్చుటకు • నేని కనంబడ దయ్య నాథుడున్.

ఉ॥ ఎచ్చటనున్నవంటి దను • జేశుఁడు ప్రాప్తియొనర్ప దేవరా!
అప్పుపడంగ నింటె కల • దంచు వచించుట కెట్లుచెల్లు? వా
తోచ్చలితాంబుధిప్రాకా • ముల్బణమంద జగంబు చాల కు
న్న ట్టున్న నెల్లెడం బరవి • యార్చుచునున్నది సేన మత్ప్రభూ!

క॥ పదరజము నిడి యంబర • పదమునఁ గాలూని విబుధ • పర్యులు నడవన్
గదిరిచి మితిమీఱిన మన • చపలము గిన నరుదుగాఁగఁ • జనుదెంచె విభూ!

సీ॥ కత్తులు మెఱుపుల • కరణిఁ బ్రకాశింప • మేఘసందోహంబు • మెఱయమానె
భేరీ రవమునకు • మాఱొత్తి జలదముల్ • చెలఁగి యెక్కుడను గ • ర్జింపవయ్యె
నా సేనవలె నెల్ల • నై యుండలేమి జీ • మూతముల్ వెల్లనై • ముడిఁగి మొదిఁగెఁ
జతురంగ బలమెల్ల • జలధిపై నడతెంచె • నిది నౌక యుపమాన • మరయఁగలదె?

తే॥ బలము మితిమీఱి పైపయిఁ • బరవుచుండ • నూర్ధ్వజగము లొండొంటిలో • నొదిఁగితూఱఁ
జంద్ర తారకల్ నెలవుల • జాఱ విడిచెఁ • దటప పథిలేక తనత్రోవ • దాఁటి చనియె.

చ॥ గగనము ముట్టి మేరుగిరి • కైవడి వెల్గుచుఁ దీసియున్న నా
ల్గు గవఁకుచందు చొచ్చిన య • కుంఠిత సైన్యముఁజూడఁ గాలుఁదే
జగము ఫరింవఁజాలవని • సాగరసప్తకమున్ మఱొక్కచో
మొగపడి పెచ్చుచుంచె పనఁ • బొల్పు వహించి రహించె నయ్యెడన్.

చ॥ గవఁకులయించ యిక్కటము • గాఁ జొరఁగాఁ వదవౌన యంచు దా
నవ బలముల్ విఁంఘని మొ • నర్చుచుఁ గోటను దాఁటె నన్నుఁ దాఁ
దవిరి పయోధి సప్తకము • ధారణి కొక్కటఁ జూడఁగోరు మా
నవువలె నెల్ల సేసలు గ • నంబడ గోపుర మెక్కెఁ జూడఁగన్

మ॥ పరమార్థంబును విస్తరించి నిగమ • వ్రాతంబు భాసించు పై
ఖరి దూతల్ విభజించి పల్కె రొక ది • గ్భాగంబునందుండి యే
డ్తెఱ వేఱొక్క పలంకుదాఁకఁ బరిపూ • ర్తిం బొందు సంభ్రంబునాఁ
బఱపై నట్టి చమూ సమూహముల నా • పౌలస్త్యుతో నిమ్మగన్.

ఉత్సా॥ వీరు చేఁకుదీవివాడు • వేల్మిఁ బుట్టినారు బృం
దారకులను మోహజలధిఁ • దార్చి ముంచినారు పై
వారిసములఁ దాఁకు నంత • వారు మేని పొడవునం
దారి కేటినారు మాయ • నార్చు సంగరంబులన్.

ఉత్సా॥ వీరు దబ్బదీవివాసు • విక్రమమున నంతకుం
గేరువారు విజయలక్ష్మిఁ • గేలఁబట్టువార వీ

వీరివలన స్వర్గలక్ష్మి • వీడినారు వేలుపుల్
శూరవరులు సమరమందు • శూలికేని యోడరున్.

ఉత్సా॥ వీరు బూరుగనెడు దీవి • వెలయువారు వాసవున్
బోరఁ గెలిచి పాకవైరి • పురము కొల్లగొట్టినా
రార ఖవుని వరబలమున • నధిక సత్త్వ గౌరవుల్
కారుచిచ్చువంటి కినుక • కసలు గల్గు వారలున్.

ఉత్సా॥ వీరు క్రౌంచదీవివారు • పేల్పు కాణయాచియా
మేరువును సముద్రమందు • ముంచి త్రోయఁబూనఁ బా
కారి మొదలుగాఁగ నమరు • లదరి బెదరి వీరలం
జేరి వేఁడికొనుచు నట్టి • చేఁత మాన్పి రొక్కెడన్.

తే॥ వీరలు ప్రవాళగిరి నుండు • వారు శుక్రు, నికి నిశాచరాంగనకు జ • నించినారు
కలశ వారాశి వరటివోఁ • గలఁచినారు, బలము పదికోట్లు లెక్కకుఁ • గలుగువారు.

తే॥ వీరు చిఱుగాలి సతతంబు • వీచుచుండు, గంధమాదన వాసంబు • గలుగువారు
హాలహలమున కిరులకు • నన్నలనఁగ, నొప్పువారు లెక్కకు మీఱి • యుండువారు.

తే॥ మలయమను గొప్ప మల జల • మధ్యమందు, గలదు వీరలందలివారు • నలువ వీరి
వలన జగములు నశియింపఁ • గలవటంచుఁ, దలఁచి ప్రార్థించి యచ్చోట • నిలిపినాఁడు.

తే॥ వీరు సప్తాంబుధుల కధి • కారులైన, పుష్కరదీప్వవాసులు • భూరి బలులు
సమ్మెటలు శూలములు గదల్ • చక్రములు ము, సుండులును విండ్లు ధరియించి • యుండువారు

తే॥ వీరు జువ్విదీని కల • వారలు తమ, తల్లి వినుపున ధారణి • దాఁటి చక్ర
వాళగిరియందు జముఁగెల్చి • బంధనమున, వైచి నలువ కోరికపయి • వదలినారు

తే॥ మీరు పసియింప నపని వి • స్తారమైన, చోటుపేదు పాతాళంబుఁ • జొరుఁడి యని వి
రించి పంపఁగ నందుండి • ప్రేమచేత, వచ్చు బేతాళహస్తులౌ • వారు వీరు

తే॥ నిర్భృతిపంచజల్ వీరలు • నీకు హితులు, సరకతో నుండి త్రావనె • త్తురులు లేటు
విసిగి వచ్చిరి సత్తప్ప • ధీరధరము, నెత్తువా రింబుధులఁ ద్రా • వనెనఁగువారు.

ఉ॥ వీరలు తొల్లి క్రోధమయి • వెన్నుఁడు కోఱల నెత్తునంత నీ
ధరణి మోహముంగొను క • తంబున జాఱిన శోణితంబు బం
గారముగాఁగ దానిఁగొని • క్రచ్చఱఁ జేసిన వీరఘంటికల్
సొరుగఁ దాల్చి రక్షదిశ • లన్ దమ గౌరుల నిల్పినారలున్.

క॥ ఈక్రవ్యాదులు భూరి ప, రాక్రమమునఁ గొఱఁతలేక • రాజిలుదురు పా
దక్రాంతి శేషుఁడును ని, ద్రాక్రమమును వీరి యయుగ • గ్రాలెదువారల్.

ఉ॥ కాళిక యోడునట్లు కఱ • కంఠుఁడు నృత్యము సేయుచుండఁ గాం
కాళముసొందు నామె కను • దమ్ముల వెల్వడు కోపవహ్నిలోఁ
గాలతరాకృతుల్ భవము • గాంచి రపార బలాఢ్యులెన్న బే
తాళ సహోదరాళి యనఁ • దగ్గ నిశాటులు వీరు రావణా!

చ॥ ఉరవడి వింట్లు కేలఁగొని • యుత్తరదిక్కునఁ జేరుచున్న యీ
వరబల శౌర్యవర్తనులు • పావము పుట్టిననాడె పుట్టి నా
రరయఁగ దివ్వెలుంచిన గు • హా ద్వితయంబన నొప్పు కన్నులం
బెరసిన వార లగ్గునెడ • వీరరు చంపక తల్లినేవియున్.

తే॥ వీర లుగ్ర నిటలనేత్ర • వీతిహోత్రు నుండి పుట్టినవారు మ • హోగ్రగుణులు
వార లీఁతగా మృత్యు దే • వతకు ముందు పుట్టినట్టివారలు • చండ ఘోరబలులు

ఉ॥ శూలముబం ధరించి మును • చొప్పర నిల్చిన యామినీచరుల్
శూలి పదమ్ము వక్షమున • పోకఁ గృతాంతుఁడు క్రక్కు నెత్తుటన్
బోలఁగఁ బుట్టినారలు స • మూహ బలాఢ్యులు వీర లబ్ధిలో
హాలహలంబు పుట్టుతటి • నన్నలుగా జనియించు రాక్షసుల్.

ఉ॥ వారలు వార్ధిఁద్రచ్చుతటి • వాసుకి క్రక్కు విసంబు నెత్తి నే
ర్వారఁగ నుంచు బాడబము • నం దుదయించిన ఘోర దేహకుల్
వారిద ంటు నగ్నిశిఖ • వంటి శిఖల్ గల వీరు శర్వ దు
ర్వార శరాగ్నికీలఁ ద్రిపు • రంబులు గాలఁ జనించి రందఱన్.

ఉత్సా॥ ఇందఱని గణించి తెలుప • నిట్టి వార లనుటకున్
దెందమునకు నూహయే క • డింది యగును మాయలున్
బొందు వర బలంబులున్ ద • పోబలంబు లెల్లఁ దె
ల్పం దలంప యుగములెన్ని • పట్టునో? ప్రభూత్తమా!

ఉ॥ ఒక్కఁడొకండె వానరుల • నుర్వరనాథకుమారు లిర్వురన్
జక్కఁగఁ జేయఁజాలుదురు • సంఖ్య వచింపఁగఁబూనువారలున్
గ్రక్కున వేయివెల్వలన • గట్టిగ నవ్వరె విన్న వారలున్
లెక్కయొనర్ప మానమును • లేదు జగంబున రాక్షసేశ్వరా!

మ॥ అని దూతల్ వచియింప రావణుఁడు నే • త్రానంద సంపూర్ణుఁడై
కని నాదివసలన్ వచించి తగు స • త్కారంబులంజేసి యా
దనుజాధీశులఁ దోడితెందనఁగ దూ • తద్దెల్ప సేనామ ల
త్యనురాగంబునఁ బూలు సల్లుచు తదీ • యాంఘ్రిద్వయిన్ మ్రొక్కఁగన్.

మ॥ అసురాధీశ శిరస్తతీ మకుట ర • త్నాంకూర రాగప్రభా
ప్రసర ద్దివ్య పదారవిందుఁడగు క్ర • వ్యాద ప్రభుం డంతటం

గుళలప్రశ్నముచేసి మీకతన మా • కోర్కుల్ ఫలంబందె న్డం
తసమయ్యెన్ భవదాగమంబు విజయో • దర్కంబుగా నెంచెదన్.

మ॥ అవి వాక్రువ్వఁగ వారలున్ దనుజ నా • థా! మాకు నీవుండఁగా
ఘన దోఃస్థైర్య తపోబలంబులును గ • ర్గం బొందు దుస్సాధ మెం
దు నొకండేదియుఁలేదు మీరలును దై • త్యుల్ దార మిత్రాదులున్
మనముల్ వాడి తపింప నేకొనఁగు సం • ప్రాప్తించెనో తెల్పరే.

మ॥ అన ధాత్రీజ నిమిత్తమై తన కయో • ధ్యాధీశుతో వైరమున్
జెను కయ్యంబున తత్ఫలంబు తెలుపన్ • బీభత్సగావించిరా
వనచారుల్ ! పదచారులైన మనుజుల్ • ఖండించిరా ! కుంభక
ర్ణుని వీరోత్తము నింద్రజిత్తు ననుచున్ • రోషోద్ధతిన్ నవ్వుచున్.

మ॥ మము పిల్పించుట శేషునుండి ధరణిన్ • మార్పింపఁ గా దబ్ధి నీ
రములం ద్రావఁగఁగాదు సప్తకుల భూ • భ్రంబుల్ విపాటించి హ
స్తములం దోర్పఁగఁగాదు కాయ గసరుల్ • సాపాటుగాఁ గానలన్
దమి వర్తించు ప్లవంగకోటి దునుమన్ • దైత్యేంద్ర ! రప్పించితే ।

ఉ॥ ఏపు విషణ్ణయేల యని • యేచి కరంబులు తట్ట మేలుమే
లీపని మెచ్చవచ్చె నని • హేలగ దైత్యులు నవ్వఁ బుష్కర
ద్వీప నిశాచరేంద్రుఁ డతి • వీరుఁడు వహ్ని కరంబులెత్తి మీ
కైపులు కూడవం చడఁచి • కర్బురనాథుని గాంచి నమ్రుఁడై

చ॥ దనుజవరేణ్య ! వీరల వి • ధంబును పైఁపును శాంతమూను మా
మనుజ వరేణ్యులొంచు బల • మానములం దెలియంగ వేఁడెదన్
జనవునఁ దెల్పఁడీ యనుడు • జక్కటి యంతయు మాల్యవంతుఁడి
ట్లని వచియించెఁ దేటపడ • నర్కకులేంద్రుల విక్రమంబులన్

మాల్యవంతుఁడు సేనాపతులకు రామ విక్రమాదులు తెలుపుట

చ॥ మిగిలిన విక్రమాఢ్యులగు • మీరలు వాలి నెటింగియున్న వా
రు గద కులాచలంబుల ని • రోధముగాఁ దనకాలఁ దన్ను న
న్నగచరు రామమార్గణ గ • ణంబున నొక్కఁ డురంబుఁ జీల్చి యా
శుగగతి జీవవాయువుల • జాఱుట యచ్చెరువందురే కదా !

మ॥ మదిపెంగాని విరాధుఁడున్ గడచనెన్ • మారీచుఁడున్ బేరుమా
ల్పడ నందే ఖరదూషణ త్రిశిరులున్ • స్వర్గంబుఁ బ్రాపించి రొ
క్కడ యొక్కండగు వింటితోఁ గెడపె ర • క్షస్సైన్య సంతానమున్
గడెలోనన్ రఘువర్యు బాహుబల ము • ద్ఘాటింపఁగా నేటికిన్ ?

చ॥ ఇచటికి వచ్చి మీ రడుగ • నేల? మహోదధి మండి మాఁడియుం
డచటనె త్రోవలోఁ గనరొ? • యారయరో? వినియుండరో? వృథా
వచనము లేల? పిన్నప్పుడె • భర్గునిచాపము ద్రుంపఁ బుట్టు నా
ప్రచుర రవంబు మీచెవుల • వ్రాలదొ? నిద్దుర వోయి యుంటిరో?

తే॥ లంకయెల్లలో దైత్యబ • లంబు వేయి, వెల్వ లుండిన వాసేన • వీరవరుల
రెండు వెండ్లె సంయమనివి • విందునట్లు. చేసినవి వివరంబుగఁ • జెప్ప నేల?

తే॥ కుంభకర్ణుండు మీ ప్రభు • కొడుకులును ప్ర. హస్త ముఖ్యనాయకులు మా • యావియింద్ర
జిత్తుఁడు తక్కువీరులు మృతిఁ • జెందినారు. నేఁటిదనుక నుంటి మిచట • నేను వినఁడు.

ఆ॥ మూలబలము గలదు • మున్నూఱు వెల్లువల్. దానివంతు నేఁడు • తనరుచుండెఁ
గాలవశత మీరుఁ • గనలివచ్చితి రిఁక. వారి వీరవరుల • బలము వినుఁడు.

ఆ॥ ఒక్కకోఁతి వచ్చి • యొగి లంకఁగాల్చి దా. నవుల దునిమి యక్ష • నవని రాచి
ధరణివిభుఁడు పంపు • దౌత్యంబు నెఱవేర్చి. దంటయగుచు జలధి • దాఁటి పోయె.

చ॥ కరువలఁ బేర్చి వారినిధిఁ • గట్టి దశాస్యుని త్రోఁచివైచి దు
ర్భరముగఁ బోరుసేయు కపి • వారము గట్టిన కట్ట త్రోవలో
నరయరొ? మేరుశైలమున • కవ్వల నొప్పెడు మందుకొండఁ జె
చ్చెర నొకకోఁతి తెచ్చెఁ ద్రుటి • చేపున నట్టివి వారిసైన్యముల్

ఆ॥ ఈ దురంబు గలుగు • హేమవు సేతనాఁ. బరఁగు గరితయగును • పరమసాధ్వి
మీరె గెలిచి రండు • వారె గెల్వఁగనిండు. వినిచినాఁడఁ గన్న విన్న • తెఱఁగు.

తే॥ అనుచు వహ్ని దశాస్యుని • గని బలముల. మఱియుమంత నాతికిఁ బోవ • మానుచెల?
యనఁగ పది యెల్లిదంబని • యరుగకుంటి. నమచు దైత్యుఁ డాడంగ • నతఁడు మఱియు.

మ॥ అది మాపాలికి నుంచినారలొకొ? వృ? ద్ధాచార నంవేదియున్
ముదుకం దౌ మన మాల్యవంతు పలుకుల్ • ముఖ్యంబుగా నెంచి యొ
ప్పిదమౌ తద్విధి సంధిచేసికొనుచో • బింకింబుగా నుండు న
య్యది యించెన్ జలకందనం బగును చే • యంబోవ పీమీఁదటన్.

ఉ॥ జానకి వీడినంత నవిఁ • జచ్చిన యక్షుఁడు మేఘనాదుఁడున్
దానవవీరులున్ మనకు • దక్కెడువారలె? యట్టిచేఁతయున్
మాన విహీనకార్యమగు • మానక యుద్ధముచేసి రౌద్ధతిన్
మానవవీరులం బిలుకు • మార్చుట యుత్తమకార్య మియ్యెడన్.

చ॥ అని వచియించి వహ్ని కల • యం గని లేవఁగ రాక్షసాలి నీ
వనికిఁ జనంగనేల? చని • యల్పుల రక్తము గ్రోలి క్రమ్మఱన్
గవియెదమయ్య మిమ్మటులు • గాక దురంబున నోటగాంచుచోఁ
బిమఁగు కులంబునం బొరము • పిన్నగుమే యని బాస లాడఁగన్.

## 30. మూల బలవధ పటలము (235)

తే॥ నేను నొకప్రక్క నేగి యా • నీచ కపుల, యావిద్రావెద మీర లా • యర్కకులుల
నొక్క మొగిఁ గ్రమ్మి జీవవా • యువులఁ గ్రోలి, శిరములం దెండనుచు దశ • శీర్షుఁ డనియె.

క॥ మొనగాండ్రు మొనలతో వెసఁ, జనుటంగని ముందుగాఁగఁ • జనుఁడీ యనుచున్
దన మూలబలము నంపుచు, దనుజాధీశుండు లేచెఁ • దమి మదిఁ బొదలన్.

క॥ పరికరములు నిండిన తన, యరదమ్మున నెక్కి మునులు • నమరులు కలఁగన్
వనచరులమీఁది కొకది, కుఱ్ఱన నేగెను యాతుధాన • కుంజరుఁ డలుకన్.

తే॥ వీరవర్యులు ప్రస్థాన • భేరి వ్రేయఁ, బవిచి కేకలువెట్ట మిం • టను ధరిత్రి
దెసల నిండారియున్న య • ద్దితిజ బలము, కలఁగి రేఁగిన జలనిధి • కరణి నేగె.

క॥ పరమేష్ఠియండమున సా, గర భూ భూధర పయోద • గగనచర చరా
చరకోటిఁబోలె సైన్యము, పురి యొప్పెను పొట్టవడుగు • పోఁడిమివోలెన్.

తే॥ పాడిఁగబళించి కరుణను • పంటఁగఱచి, క్రౌర్యమునఁ బాపముల నొడి • గట్టుకొన్న
వారు రంగుచే నెడఁడచే వారిదములఁ, గేశములచేతఁ గీలలఁ గేరువారు.

తే॥ జలధి జలము పాఱఁగఁ జల్లి • జలచరముల, మ్రింగి పిడుగులఁ గుండలా • కృతిగఁ దాల్చి
కంధరములొల్చి వలువలు • గా ధరించి, తిరుగుక్రూరులు యమభయం • కరులు వారు.

ఉ॥ కొండలు దమ్మ దాఁటుటకుఁ • గ్రుక్కిన జాలుగ నొప్పు వారిము
త్రుండము కాలియందెలుగ • గజ్జెలుగాఁగ భుజంగబృంద ము
ద్దండతఁ జుట్టి వాయువును • తార్క్ష్యుని నేరిచి కట్టికొంచు భే
రుండ పద ప్రపంబు పదు • రుంగొని యేగెడువారు దీరతన్.

సీ॥ అఁకలివేళ కా • హారంబు లేనిచోఁ, గ్రుంగ కేసుంగుల • [illegible]ంగువారు
వేఁకపు నీరు ల • భింపదేని మొయిళ్ళఁ, బిసిచి జలంబుల • గుడుచువారు
కొండ లెగురవైచి • ప్రచండంబుతోఁ గొట్టి, యలవున గతిదేలి • నట్టివారు
జిల యెత్తెనేని క్రొ • న్నెలఁ బట్టి తమమేని, దురద వోవంగ ప • ద్దుకొనువారు

తే॥ శిరలఁ బొడిచి చేశక్తి పీ • క్కించువారు, చెలఁగి పిడుగులఁబోలె గ • ర్జింపువారు
చక్రశూల దండ ప్రాస • సాధనముల, హరిహరాంతకగుహులఁ గె • ల్వందువారు

తే॥ ఒక్కరొక్కరు జగముల • నొడుచువారు, కలిసిరేని జగంబులఁ • గలఁచువారు
తిరిగిరేనియు జగములు • తిరుగఁబోవ, నడతురేనియు జలధులు • నడచుఁబోవ

తే॥ ఎన్ని మొగుళులు గలవన్ని • యేనుఁగులుండు, నెన్నియేనుఁగులుండు రథమ్ము • లన్నియుండు
నెన్నితేరులో గుఱ్ఱంబు • లన్నియుండు, నెన్నిగుఱ్ఱాల భటసంఘ • మంతయుండు.

తే॥ గజ తురగ సేన మణిగణ • ఖచిత కనక, భూష బాలంబులంటలై • పొలుపుమీఱఁ
గాని కైపేయకున్న దొం • డేది లేదు, స్యందనములఁ దెల్పఁగ నవ • సరమె లేదు.

తే॥ ఎల్లదిశల యాకాశంబు • నెల్లఁ గప్పు, నీరదంబుల నల్పు గా • న్పింపదయ్యె
కరుల మదజలధారల • గలియుకతన, జలదులందలి యుప్పన • సమసిపోయె

ఉ॥ మూలబలంబు సొక్కపరి • పూన్కి వెలార్చెడు కోట వాకిటల్
వీలు బిగంబు లెల్లఁ దన • పొట్ట నడంచి యనంతర స్థితిన్
గోళములోలి వెల్వడుచు • కొండిక యా వటపత్త్రశాయి రీ
లా లసితాస్య పద్ధతిఁ జె • లంగె మహామృతరీతి నత్తఱిన్.

ఉ॥ ఆ చతురంగ సైన్యముల • హావడి సైఁపఁగ లేక శేషుఁడున్
మోచు శిరంబు డొడ్డగుదు • మ్రొగ్గెను వానరబృంద మప్పు దృ
గ్గోచరమైన సేనఁ గని • కోయని భీతి నుదీచి వార్ధి వే
లాచల సీమఁ జేరె హల • హాలము గన్న సురాళికై వడిన్.

తే॥ చక్రవాళ మెల్లఁగఁ గల • జలధి తీర, భూమి వదిగాఁగ దుష్కర్మ • ములను విధియుఁ
గాలుఁడును వేఁటరులుగ దై • త్యాలి మృగము, లంబుగా నొక్క వేఁట య • య్యవని జరిగె.

ఉ॥ వీరుల సింహనాదములు • వీరణముల్ రథనేమి రావముల్
వారణ ఘీంకృతుల్ తురగ • వారము హేషలు వింట్ల ఘోషలున్
భేరుల భాంకృతుల్ చెలఁగి • భీకరలీల జగ ల్లయంబు వే
కారపుమట్లు పెంపెసఁగెఁ • బ్రాణులు తల్లడమంది కుందఁగన్

ఉ॥ ఆయుధ మత్స్యముల్ మద గ • జాయత నక్రము లశ్వవీచికల్
వ్రేయఁగ నూఁదఁగా నలవ • వెల్వడు ఘోషము కోప దృష్టులన్
బ్రాయపుఁ బొట్టమీలు రథ • రాజి నగంబులు సౌరుమీఱ దై
తేయు గభీర మూల బల • తీవ్ర మహాంబుధి లోక భీతిగన్

చ॥ అసురబలంబు వచ్చిక బ • యళ్ళను త్రొక్కుటచేత వారణ
ప్రసర మదాంబుపూరమున • బంకగఁ బంకము గాఁగ లంక వె
క్కసముగ గ్రుంగుఁగాని యెన • కంబునఁ బల్వురు నింగిమీఁద నా
ప్పెసఁగఁ జరించుచేఁత నెల • యింపక గ్రుంగక నిల్చె నత్తఱిన్.

## వేలుపు లసురబలముఁ గాంచి శంకించుట

ఉ॥ కాంచిరి వేలుపుల్ ధరణిఁ • గాంచిరి వారిధి మింటి యుచ్చ్రయం
గాంచిరి దిక్కు లెన్మిదియుఁ • గాంచిరి పెల్లగ నిండు చుక్కముల్
గాంచిరి యెల్లచోటులను • గాంచరు బీడుగ నున్న కందువన్
గాంచె మయేని భీతిలిరి • కుందిరి కంపము నొంది రక్కటన్.

చ॥ జగములనున్న యెల్లరు ని • శాచర రూపములంది కైదువుల్
మిగులఁగఁ దాల్చి సంగరము • మేకొని వచ్చిరొ ? సాగరంబులే

యగణిత యాపధారణము • నంది పితామహు నాజ్ఞచేత నీ
పగిది గదించెనో యని సు • పర్వులు భావనసేసి జంకుచున్.

ఉ॥ భర్గునిచేరి మేమొదుగఁ • బోఱుచు నిల్వఁగఁ జోటులేదయో
విగ్గ్రహమంబుసేయుటకు • నేరము ప్రాణము లింక నుందునే ?
స్వర్గమునున్న ? యీభువన • జాలము నిల్వఁగలేదు మాకు నీ
దుర్గతి వీడదేమి? కన • దుర్భరమయ్యెడి నోర్చు టెట్టులో ?

ఉ॥ వేవురు రాము లొక్కటయి • వేయు నమల్ సమరంబుసేసినన్
రావణసేన చావ దొక • రాముఁ డవిం బొనరింప నేమగున్ ?
వావిరిఁ గాంచినంతఁ దమ • ప్రాణము లిక్కఁగఁ బట్టికొంచుఁ గీ
శావలి పాఱఁగాఁదొడఁగె • నక్కట? తంద్రి? యుఁకేది త్రోవయో ?

తే॥ అనుడు శర్వుండు మీ రించు • కైన శంక, నొందఁబనిలేదు వీరల • నిందఱ విధి
యిటకుఁ దెచ్చె నాశంబు సే • యించుకొఱకు, నని సమాధానపఱచె న • య్యమర వరుల.

## వానరులు మూలబలముఁ గాంచి పాఱుట

ఉ॥ పుట్టలనుండి త్రాఁచుల స • మూహము వెల్వడఁగాంచి భీతిమైఁ
దిట్టలు తిట్టలై పసువు • దేఱెడి మూషికరాజి కైవడిన్
వి ట్టి బలీముఖంబులు త • ఓన్ నృపవర్యుల లెక్కసేయ కె
ట్టెట్టులు దోఁచె నట్టటు ల • హీన భయంబునఁ బాఱె నెవ్వడిన్.

ఉ॥ కొన్ని పయోధిలోఁ బడియెఁ • గొన్ని ప్లవంబుల రోసె సేతువున్
గొన్ని తరించెఁ గందరలఁ • గొన్ని యడంగెను కొన్ని యీఁదెఁ ది
మ్మన్నలు కొన్ని మ్రాఁకులకు • హావడి దాఁటెను కొన్ని వింగిపైఁ
బన్నుగ నేగెఁ గొన్ని వెనఁ • బాఱఁగలేక యలంగి చేర్పడెన్

ఉ॥ కట్టినసేతువే మనకు • గండము దెమ్మును వెంబడింతు రి
క్కట్టుగ యామినీచరులు • గావున దీనిని త్రెంచివోవ మి
ప్పట్టున నంచుఁ గొన్నియనె • వారలు మింటను కూడ వత్తు రిం
కెట్టని కొన్నిపల్కెఁ గొని • యెల్లెడ నిండిరి శోకులే యనెన్.

తే॥ అర్కసుతుఁ డాంజనేయుండు • నంగదుఁడును. రాము వీడకుండిరి తక్క • రాజులెల్ల
పలవసాగెఁ బయోధియుఁ • బల్లటిల్లె, నరసె సంతయు రామభూ • వరుఁడు కమల.

సీ॥ ఈగొప్ప కూటువ • లింతకాలం బెట, నుండె నెప్పుడు వచ్చె • నొదుఁగుబడిగ
వినిపింపుమని రామ • విభుఁడు ప్రశ్నింప వి, భీషణుఁ డిట్లను • వెరవుతోడ
నన్నిదిక్కులయందు • నన్నిదీవులయందుఁ గ్రిందిలోకములందుఁ • గ్రిక్కిఱించి
నెలకొన్న దానవా • నీకంబు దూతలు, చని తోడి తెచ్చి రీ • సైన్యమందు

తే॥ ముందువచ్చెడు మూఁకలే • మూలబలము. వెనుక రాక్షసబృంద మ • వ్వీటలేదు
దుష్కృతము మందరికిఁ బ్రోపఁ • దొడరివచ్చె. విధియుఁగాలంబునొనరించు • ప్రేరణమున-

మ॥ అని నాచిత్తము తెల్పుచున్న దన న • బ్జాక్షుండు చిర్నవ్వుతో
గనలుం గన్నుల కెంపు దోఁపఁ ద్రుటిలోఁ • గ్రవ్యాద సందోహముల్
దిను నప్పాటులఁ జూచుచుండుఁడు మతే • కార్యంబు చింతింపకుం
డని కీశాలికిఁ జెల్పి తోడుకొని రి • మ్మా యంగదా! నావుడున్

మ॥ అతఁడున్ వారలఁ జేరి యో గిరసలా • రా! విల్చి నాపల్కులన్
శ్రుతులం జేర్చుఁడు వెండి కొండనినఁ గీ • శుల్ కొందఱాలింప స
మ్మతి గాన్పింపక పాఱి రవ్వలకు స • మ్మానించుచుం గొంద ఱే
మతి బోధించెదు వాఁడవంచు నిలువన్ • మన్నించుమ న్నవ్వుచున్

ఉ॥ దేనికి జంకిపాఱెదరు • శీఁకువ మీరలు దెల్పుఁడన్న న
మ్మానితుఁ గాంచి వారలను • మన్నెఁడ! చూడవె! సోఁకుమూఁకలన్
బూనికఁ బోరి చచ్చి మఱి • పొందెడి దెయ్యది? యింద్రజిత్తుచే
నైన యవాంత్రముల్ తలఁప • నైనను జాలుదుమేమి చెప్పుమా?

ఉ॥ వెన్నుఁడు గట్టువిల్తుఁడును • వేల్పులు నోడిరి సోఁకుఁజేసి యు
ప్పొన్ననిచేత నాలవికి • మీఁగినవారలె వీరు! వీరలన్
మన్నియ బిద్దఁజేఁచి యని • మార్కొని గెల్చెడువార లౌదురే?
తిన్నగఁ జూడుమీ యుసుఱు • తీసని మున్వినవేమి? యంగదా!

తే॥ చిలువతాలుపుతోఁ బచ్చ • విలువతాల్పు. నలువతో నింతికొప్పుం జా • గలిసి దురము
సలిపి వెక్కువేసేండ్లొక్క • పొలసుదిండి. గెలువలేనైరి వీరలా • గెలుచువారు?

తే॥ కోఁతిగుంపు లన్నిటి నొక్క • కూళ యెఱిచి. దిండి మ్రింగుటకుం జాల • కుండు వీరి
కూటువుల నొకత్రొప్పెల్లఁ • గూడియేని. పలుకువెలఁది మగండేని • తెలుపఁగలఁడె?

తే॥ తలలు పది చెలు విరువది • కలవు పొలసు. దిండియొకిమీనికవి వెఱ • తివుచుచుండె
నిపటఁ గల పని మఱి వాని • కేమి వేయి, తలలు రెండువేల్చేతులు • గలవెచెప్పుమ?

తే॥ కుంభకర్ణుని చేవిల్లు • కూడియెత్తఁ, జేవ లేనంటి మాతని • చేఁతి లీవు
నెఱుఁగుదుప్పుడ [illegible] • విట్టువచ్చి. యంటి వినుద్రిమ్మరులకంటె • నోపఁగలమె?

తే॥ హనుమ బిరిమియు సుగ్రీవు • నలవు రామ. లక్ష్మణుల వింటినేర్పు త • లంచి చూడఁ
దమ్మ తము • గాచుకొనునంత • తరముగావు. మనలఁగాచు టెక్కడిమాట? మఱవఁదగును

ఉ॥ రాముఁడె యేలనేమి? మఱి • రావణుఁడేలిననేమి. లోకముల్
దాన నిశీలకున్నఁగన • తక్కినవెల్లఁ; భజించి దాఁగఁగా
నామిధరంబునందు ఫల • మల్ జలముల్ గుహలుండె నమ్మ నీ
వేమిటికింకఁ దిట్టెద వ • హీనగుణాకర! యాజ్ఞ యీఁగదే!

చ॥ విరవిరవోయి వాఁ డిటు • వేఁడఁగ నంగదుఁ డాలకించి య
చ్చెరువున జాంబవంతుఁగని • చెల్వుగ విట్లను సూర్యునొద్ద వ్యా
కరణము నేర్చినట్టిఁడగు • గాడుపపట్టికి నుద్ధియైన నీ
వరయఁగ గట్టులైన మతి • యజ్ఞుల సంగతి చెప్పనేటికిఁకన్ ॥

ఉ॥ పన్నగతల్పుఁడే భువన • పావనుఁడౌ రఘురాముఁడంచు మా
కెన్నఁగ బోధ సేసి వెల • యించితి మున్నిపు డిట్టి మూర్ఖులఁ
దిన్నఁగఁ జెల్పి పోఁడిమిని • దేర్పక భీతిలి సేని కీర్తిమున్
విన్ననువేమగున్ ? గుదిసి • భీరము మానుట వీరధర్మమే ॥

చ॥ అదరునఁ గీర్తి వోవిడిచి • యాఱడిపాలయి యెందువోయినన్
బ్రదుకఁగ నౌనె ? నాఁ డెదు • రస్త్రులవన్ ? సురయంచు నంబుజుడున్
విదితముగాఁగ నిచ్చినవ్ర • వీణుల మౌదును నమ్మినున్న స
ద్విదులను మోసపుచ్చ యని • వీడిన నింతకుఁ జావమేలుగా ॥

తే॥ దేవదానవుల్ చేరి మ • థింపలేని, పాలవెల్లిని చిలికిన • వాలి యొక్క
కోలనేసిన బలము ల • కోరివలెఁ, గడలిఁ గాచ్చుట మఱచితో ? • కానవొక్కొ ॥

చ॥ దనుజ బలంబు పెన్నయిన • ధర్మములేమిఁ ధర్మమున్న దెం
తనె జయమందు నిశ్చయమ • ధర్మము ధర్మము నెందుగెల్వ లే
దనుట వినంగలేవొ ? యిది • యీ మతిమంతునిరీతి ? పిచ్చివా
నినిబలెఁ బందలం గలిసి • నీవును పాఱుట యుక్తకార్యమే ॥

చ॥ అనుటయు సిగ్గుపే సవని • తాననుఁడై యను జాంబవంతుఁ డీ
వను టుచితంబయైన నిపు • డచ్చటఁజేరిన సోఁకుమూఁకలం
గనుటకునేని యాత్మ ధృతి • గాంచుటకేని పినాకికేనియున్
జనునొకొ ? యన్య వానరుల • సంగతి నెంచఁగ మోసమున్నదే ॥

ఉ॥ కాంచితి దేవదానవుల • కయ్యము మాలిని మాల్యవంతు మున్
గాంచితిఁ గాలనేమి మధు • కైటభులన్ గనకాక్ష సోదరుం
గాంచితి హాలహాలమును • కానఁగలే దిటువంటివారలన్
ఓంచి యముండునే నధిగ • ఓంచి విరోధము గొన్న పీనికో ॥

సీ॥ బలముచెంతెను నిరి • బలము గల్గినవారు, మాయల గడిదేటి • మలయువారు
కదలి యినుకకంబెఁ • గడులెక్క గలవారు, కలికంటె నెద చెడ • గలుగువారు
కృతహస్తులతికరా • కృతులు పిరంగస్న, యమదవ్యమె భయ • మందుచుండ
మనకు దిట్టతనంబు • మఱివచ్చునేమి ? యి ట్లున్న నెట్టున్నఁ జా • వున్ననైన

తే॥ పోరునకు జంకిపాఱుట • మేరగాదు, యశము తొలఁగును రౌరవ • మబ్బు నిక్క
మైన నొకమాట శ్రీరాము • నాననంబు, నెదుట నిల్చుట మెట్లు ? మో • మెత్తుటెట్లు ?

తే॥ రావణుఁడు దాపునకు వచ్చి • రణముచేసె. నేవి యూర్మిళావిభునకు • నీవుతోడు
పడకయున్న విజయమెట్లు • పడయ గలము? వనచరుల నెట్లు దక్కించు • కొనఁగఁగలము

తే॥ ఇంద్రజిత్తుపైకి లక్ష్మణు • నెచ్చరించి. పంపినదియు నీతోడనే • వాని నతఁడు
గెలిచినదియు నీవల్లనే. గెలువవలసి యున్నదింకను తోడు నీ • వున్నకతన.

మ॥ అతులోత్సాహముతో స్వధర్మమిఁగ సౌ • ఖ్యంబుల్ విసర్జించి స
మ్మతి నాతోడనవచ్చు లక్ష్మణుని ప్రే • మంగాచి సుగ్రీవు సం
గతి నీవుండి చరాచరప్రకతి దుః • ఖంబుల్ తొలఁగించి స
న్మతి ధర్మంబును నిల్పుమా యని రఘు • క్ష్మావల్లభుం డవ్వలన్.

మ॥ నీవును తమ్ముతో నిలిచి నిర్జరవైరు లొనర్చు నీవ మా
యావిధులెల్ల నారసి ర • యంబునఁ దెల్పకయున్న సాగునే?
రావణమర్దనంబు సమ • రంబున నీవకదా విభీషణా!
భావి శుభప్రవృత్తి కిల • బంధుర శక్తియు జీవగఱ్ఱయున్.

తే॥ అనిన రాఘవు ని వాక్యంబు • లాదరించి. పావనియు విభీషణుఁడు సు • గ్రీవుఁ డధిక
మోదమంది వానరసైన్య • ములను కావ. సమ్మతించిరి చనిరి ల • క్ష్మణునితోడ.

మ॥ దనుజధ్వంసి నమస్క్రియల్ సలిపి కో • దండమ్ము చేనంది శిం
జిని నెక్కించి విశాల వక్షమున ర • క్షాహతమౌ సంకటం
బును లీలన్ ధరియించి యక్షయ శరౌ • ఘోద్దీప్త తూణీరమున్
వెనుకం దాల్చి రణాగ్రమందు నిలిచెన్ • విక్రాంతి గంభీరుఁడై.

ఆ॥ నూఱుయోజనముల • దూరంబు నిండిన. సేన ముందు నిలుచు • మాసమీఁద
నసురసేనపైచు • నాయుధ వితతు లా. కసముగప్పె సురలు • కాంచి భీతి.

శా॥ రామా! భక్త భయాపహారక తను • త్రాణంబ! నీలాంబుద
శ్యామా! రాక్షసభీమ! ధార్మిక జగ • త్సంస్థాపనా! నీవు గా
కీమానంబగు దైత్యసేన కెదురై • యెవ్వాఁడు నిల్వంగ ని
చ్ఛామోదంబున నోపు? మా హృదయ వాం • ఛాపూర్తి గావింపవే!

మ॥ అని ప్రార్థింపఁగ మౌనులున్ సకల ధ • ర్మాధార సంపన్నులున్
దనుజాధిక్యము రాము నొంటియు మహా • సైన్యంబుతోఁ గాంచుచున్
గనుఁగన్ బాష్పము లొడ్డుచున్ మనము వై • క్లబ్యంబు నొందంగ రా
మునకున్ మంగళ మబ్బుఁగాతమని ప్రా • ర్థింగోరి దీవింపఁగన్.

తే॥ తక్క సిద్ధసాధ్యాదులు • దాశరధికి. విజయమగుఁగాత దైత్యాలి • విఱుగుఁగాత
నేఁటితోడఁ బాపమ్ములు • నీఁగుఁగాత. నసురి దనుజవీరులు కాంచి • యచ్చెరువున.

చ॥ నిలుకడ తప్పి వారు • నిల్వక పాఱిన శత్రుసేనలో
నిలిచి శరాసనంబుగొని • నిశ్చలుఁడై మనమీఁది కెక్కటిన్

---

గెలుపుఁగ నెంచినాఁడు తన • గెల్పునకంటెను దొడ్డకాదె? యి
ట్టులముగ మాల్యవంతుఁడు వి • డంబన సేయునె? బొంకులాడునే?

మ॥ మును దేవాళి పురారితో రథికులై • మున్నాడిరాఁ దార్క్ష్యుపై
మన సద్వంశవినాశకుండయిన య • మ్మాయావి వైకుంఠుఁడున్
ఘనుఁడై వచ్చి యెదిర్చెఁ బీఁడొరి ఘను • ష్కాండంబుతోఁ గాల్నడన్
మనపై నెత్తెఁ బలంబు సాహసము సా • మర్థ్యంబు మెచ్చొఁ గదా!

మ॥ హరులన్ దేరుల గౌరజన్ ధరభ సింహవ్రాతముల్ క్షుబ్ధ సా
గర సంకాశములై యెడర్పఁ గనుచున్ • గౌతూహల స్వాంతుఁడై
త్వరితోత్కంఠత రెండు రెండనుచు నా • హ్వానించుచున్నాఁడుగా!
ధర విల్లెవ్వఁడు విల్చి పిల్చి మరలెన్ • దర్పించి స్వప్రాణాలతో.

## శ్రీరాముఁడు రాక్షస బలముల నుఱుమాడుట.

మ॥ ఆనిగర్జించు చతుర్విగస్వమునఁ గు • ప్యద్ఘోర సింహంబు వా
రణ యూథంబులు చుట్టినట్లు బలద • ర్పోత్క్రాంతులై రాక్షసుల్
తను ముట్టంగని మేలుమేలనుచుఁ గో • దండంబునన్ శింజినీ
వినదంబుం బరఁగించె రాముఁడు లస • న్నిర్ఘాత ఘోషక్రియన్.

శా॥ మాటెన్ సాగర ఘోరలోకము మొగి న • మ్మాతంగ యూథంబులన్
దాటెన్ వేగము వాయువంబులకుఁ గ్రో • ధంబుల్ దిగంబాఱఁగాఁ
దీటెన్ వీరుల శౌర్యధైర్యముల భీ • తిభ్రాంతి నిండారుటన్
మీటెన్ దాహము నోళ్లెండె మనముల్ • మేల్క్రిందించె దైత్యాలికిన్

చ॥ తురగ పిశాచ సింహములు • దుర్భ్రమచే నడ తారుమాఱుగాఁ
బరుగులువాఱి కీడ్కొను • పాదుగఁ గూల్చె మతంగజంబులన్
వెఱగొని మావటీండ్రుఁ దమ • భీకర హస్తములోడ నీడ్చి యు
ర్వరఁ గొని మోఁది యిచ్చవడిఁ • బాఱెను క్షోభము పుట్టె సేనలో.

చ॥ కవచులు దుర్నిమిత్తములఁ • గాంచి నిశాచర నాయకాచ
ప్రచరములంటు నంటిసిలి • పాడిరి యాడిరి క్రూరరాక్షసుల్
విచలితులయ్యు రోషమున • వీఁగక పైకొన రామభద్రుఁడున్
గుచపలిమీఁద బాణములు • గుప్పెను లెక్కకు మిక్కుటంబుగన్

సీ॥ హరులపైఁ గడలపై • శరభ సింహములపై, వీరులపై వారి • కీలుపయి
శరషలపై శిరా • సనములపై ఘట • శిరములపై వారి • యురములపయిఁ
గరములపైఁ బదం • పరలుగా శరములు, గురియించ నుఱిలెను • కుంజరములు
దొరలెను వీరుల • శిరముల కరిణీసి, తుఱంగోత్కరంబులు • దురమునందు

తే॥ విఱిగి యఱిముఱియైపడు • వింధ్యవలెనె, సిడముఱనుపొడిపొడి యయి • పుడమిఁబడియె
చంద్ర రేఖలవలె విశా • చరుల కోఱ, దంతములు పలపలరాలి • ధరణిఁగూలె.

సీ॥ సుడిగాలిలో జడి • వడియైన చందాన, రామ విశాత మా • ర్గణము లొలయఁ
దుంగ మాతంగ తు • రంగ శతాంగ భ, టాంగ సంఘంబులు • త్రుంగి పడియె
నోష్ఠంబు గొఱుకుచు • నుండు దంతంబులు, కోపంపుఁ జూపులఁ • గొఱలు కనులు
కరవాలు వీడని • కరములు గర్జిల్లు, మూర్ధముల్ పరుగిడు • మొండెములును

తే॥ పాఱురక్తప్రవాహముల్ • మీఱిచునిఁగి, పడెడి యవయవంబులతోడఁ • బ్రధనభూమి
చూడ బీభత్సమయ్యె ర • క్షోగణముల, యాయుధము లొక పనియేని • చేయవయ్యె.

సీ॥ అమ్ములతోఁ గార్ముకమ్ములు తెగుచున్నె, కత్తులూనిన కేలు • కత్తిరిల్లఁ
గేలకు మున్నుగాఁ • గాళులు తెగుచుండ, నొకటిపై నూఱు సా • యకము లరుగుఁ
దురగంబులకు మున్న • ఖురములు తెగుచుండు, ఖురములతోడఁ జ • జీవులు వోవుఁ
జజీవులకు మున్న, పక్షముల్ ద్రీలును, పక్షాలతోఁ జీలు • వదనములును

తే॥ తప్పిపాఱినదొక్కఁ త • త్తడియు లేదు, శ్వాసమాప్పుటకేని రా • క్షసుల కెడము
లేమిఁదబ్బిబ్బులై వారు • రాము నొంచు వెరవు దొరకక యూరక • యుంటుచుండ్రి.

సీ॥ చనఁ దలఁపకమున్నె • చచ్చి పడుచున్న, శవ నివహము దాఁటి • చనఁగలేక
చన్న వేలకువేలు • శరములు తాకఁ నొ, క్కరథంబు నూఱు ము • క్కలుగ విఱుగు
నంబకంబులు వంచి, యనరు లంటఁగ మున్న, చచ్చినవోల్కిఁ గ • జంబు లురలు
నెనిమిది దిక్కుల • నెనసి యొక్కుమ్మడిఁ, బమ్మిన వీరులా • వలికిటోరు

తే॥ అరదములు బార దూరంబు • నరుగలేదు, వారణంబు లూరక మ్రాలి • వసుధఁగూలె
తురగ సంఘంబులును పని • తోఁచ పడిగె భటులు బలియైరి మిత్తికి • బరువు తగ్గి

మ॥ జలజాక్షుం డొకయప్రమేయ శతమై • సాహస్రమై నూఱు కో
టుల ప్రాణంబులఁ దీయునన్న నుడి నాఁ • డు న్నేఁడు సత్యంబుగాఁ.
గలనం జచ్చినవారి నెంచి విధి లె • క్కల్ తప్పు గావించెఁ బ్రా
ణులఁ గొంపోయెడి కాలుఁడెంతపడెనో? • నోపెంత దానొందెనో?

శా॥ వీరంధ్రక్రియ వారిదౌఘ విగళ • ద్విద్యుత సందోహముల్
జాఱం గాలు నరణ్యలీల శర సం • జాతానల జ్వాలలన్
సారంగంబులపై శతాంగములపై • జాల్వారు పెక్కంబు లే
దారింబోయెనొ? బూదియై శ్వసనుఁ డు • ద్దండించి కొంపోవఁగన్.

చా॥ తునిఁగిన శూల కుంత శర • తోమర సంఘము తూపుత్రోపుచే
వననిధిఁ జొచ్చి మున్గను ర • వంబునఁ ద్రావఁగ నీరు పట్టి జీ
వనచరరాశి చచ్చె నట • వందలిగట్టి పయోధి యెండఁగన్
వనజ హితాన్వయప్రభు స • వారుణ దాశ జవంబు నేమనన్?

చ॥ అరిమిన భిండనుం డయిన • యర్కకులేశు నిశాత సాయకో
త్కరము పురత్రయంబు వడి • దాహ మొనర్చిన వైష్ణవాస్త్రమున్
జెదిని వీయి దానవ ని • కాయ శిరః పద హస్త సంఘమున్
జాలము జూడఁ జేసినది • సుందర హేమ శతాంగపాళితో.

చ॥ స్వైరవచయంబుమీఁది భట • తీవ్రతరాయుధ శస్త్ర హస్తముల్
ధరణిని వ్రాలుటాముల వి • ధంబునఁ గూలుచుఁ ద్రుళ్లె నోష్ఠముం
గఱచి శిరస్సులు • కాండ పయోద హుతాశనాశముల్
పిలిచిన తిరుగఁ బడియె • దాక్షరవంశ శరాసనోద్ధతిన్.

వ॥ విడియు పయోదముల్ గురియఁ • బేర్చిన వారిధియట్లు సంగర
స్థలము రహింప రక్తమునఁ • దాటెను కేరులు మాపటీం ద్రపోఁ
బొలుచు మతంగజంబులును • పూఁడెఁ బదాతిచయంబు పూడెఁ దే
జులు పిడి పూఁడెఁ గొన్నినుడి • చుట్టి భ్రమించెను చిక్కుదోఁపమున్.

క॥ తెగి పైకెగిరిన శిరములు, ఎగురు పనెడి భీతి సురలు • తలఁగిరి దవకున్
దిగుతలలు శిలలవోలికిఁ, దగులనమచు భూజనములు • తాఁకిరి దెసలన్

చ॥ ప్రళయ పయోదధారల తె • ఱంగున రామ శరాళి పర్వ నా
కలఁకునఁ ద్రెవ్వె మస్తములు • క్రాఁగిన కన్నులతోడ ఖేచరా
వళిఁగని మేఘమాలికల • వంగిని నింగిని నిండుచున్ మహా
నిల హతిచే విమానములు • నేలను కూలు విధంబునం బడెన్.

సీ॥ కొందఱు దివ్యాస్త్ర • బృందంబుఁ గొందఱు, గదలను గొందఱు • ఖడ్గములను
గొందఱు ప్రాసముల్ • కొందఱు తోమరాల్, కొందఱు ముద్గరాల్ • కూడిపైవఁ
గొందఱు తాఁకిరి • కొందఱు దుమికిరి, కొందఱు తిట్టిరి • కొట్టినారు
కొందఱు పొడిచిరి • కొందఱు విడిచిరి, కొందఱు విసరిరి • కొంద ఱుగ్ర

తే॥ దృష్టిఁ జూచిరి కొందఱు • తెరలినారు, కొంద ఱార్చిరి డాఁగిరి • కొంద ఱుక్కుఁ
గ్రమ్మ కారుమబ్బులవలెఁ • గ్రమ్మి తుదకుఁ, బడిరి సమరస్థలము బట్ట • బయలుగాఁగ.

సీ॥ ఏసిన వేసిన • యెత్తిన పట్టిన, యాయుధముల రామ సాయకములు
విఱుచుచుఁ బైపయి • బెరసి గజావలి, నురలఁ ద్రోచు గుఱ్ఱాల • దొరలఁ దాఁచు
శిరములఁ గోయును • శరములఁ ద్రోయును, విండ్లువిఱుచు మేలు • గండ్లు పఱుచుఁ
గవచముల్ భేదించుఁ • గరముల ఛేదించు, స్థైర్యంబుఁ వోకార్చు • శ్రమముఁ గూర్చు

తే॥ బలముఁ బొలగించు శిలలను • నలఁగ దంచుఁ, దరువులం ద్రుంచు పైచిన • గిరులఁ ద్రెంచు
అహహ! యేమందు రాఘవు • నస్త్రలీల, బట్టబయలయ్యె రాక్షస • ప్రధనభూమి.

లయగ్రాహి॥

కాలుతెగి కేలుతెగి • వ్రేలుతెగి వాలుతెగి • మేలు తెగి రాక్షస శ • రాళి తెగిపోవన్
గూలెఁ గరితండములు • వ్రాలె ఖరసంఘములు • తూలె భటబృందములు • వ్రీలె రథపాళుల్
వేలకొలఁదిన్ విశిఖ • జాలములు తక్కఁగల • కీల లెగఁజిమ్మెడి క • రాళ పరిఘాదుల్
లీల నొకకేల ఘన • ఖేల గొనునోలి బల • శాలి వనమాలి తన • కోలలఁ గవించెన్.

తే॥ లెక్కలేని దోషాచరు • లొక్కపెట్ట, నొక్క నరుపైన శరవృష్టి • మిక్కుటముగఁ
గురిసి రామబాణములచేఁ • గొండలట్లు, దొరలి పొరలిరి దురమున • శిరములూడ.

తే॥ వేయికరుల చేవగలదై • తేయుల కొక, శరమువంతున శ్రీరామ • చంద్రుఁ డేసె
రక్తవాహినిఁ గూలి తి • రములఁ జేర, లేక పెక్కేనుఁగులు వార్ధి • లీనమయ్యె.

తే॥ తెగునుకొండలు వలయముల్ • తెగును గదలు, విఱుగుఁ గుంతముల్ దంతముల్ • విఱుఁగు గరుల
హరులుఁ దేరులు విఱుగు క్ష • ణార్ధమందు, రామబాణ మొకొంటిచే • రణమునందు.

తే॥ జగము లేకకాలంబునఁ • జంపజాలు, జముఁడు మంత్రులు దూతల • చరణయుగము
గలుగువారౌటఁ బడగిడి • యలసినారు, పొలియు నసురుల యసువుల • మోవలేక

ఉ॥ కుప్పలు కుప్పలై కలవఁ • గూలిన దంతులు తేరు లశ్వముల్
తిప్పలు తిప్పలై పెరిఁగి • దివ్యులమార్గము నంటుచుండినన్
డెప్పిబిసట్టు లట్టలొగిఁ • దేలి నటింపఁగఁ బచ్చపీనుగుల్
తెప్పనఁ బ్రాణమొందెనని • దిగ్భ్రమఁబాపెను జీవసంఘముల్.

ఉ॥ నల్లవిభానుఁ బోలి కిర • ణంబులు చిందెడు రాఘవుండు పైఁ
జల్లిపియట్లు రక్తకణ • జాలము పర్వ యుగాంతవేళ బా
సిల్లెడు భానుమూర్తియనఁ • జిందిన శాత్రవరక్తమందు రం
జిల్ల మునింగి లేచు ముని • సేవ్యుని భార్గవుఁబోలె శోభిలెన్.

ఉ॥ చిప్పుబ పిడ్గులట్టి రఘు • శేఖరు తూపులు క్రవ్య మస్తముల్
వ్రచ్చి నశింపచుండఁ దమ • వారలు చప్పుట చూడలేక వి
వ్వచ్చము నోర్చి యుత్సుకత • వ్రాల్పక మూఁగిన సోఁకుమూఁకలున్
గ్రచ్చుఱ నీఁగలట్లయిరి ; రాముఁడు కల్లనుబోలె నయ్యెడన్.

ఉ॥ క్రమ్మిన దానవావళుల • కంఠములం దెగనేసి వ్యోమ మం
గమ్ముల యాటలాడెఁ దగ • నచ్చసగండ్లను గ్రచ్చకాయలన్
జిమ్మెడిలీల శీర్షములఁ • జిష్ణుచ వస్త్ర విధాన నైపుణిన్
బిమ్మిన కేరులం గపుల • భగ్నమొ త్రెపు నగ్గు నగ్గుగన్.

చ॥ పలువురు ప్రాణముల్ విడిరి • పర్వరు పాఱిరి సూటి తప్పఁగాఁ
బలువురు దాఁటుచుం బొరలి • బన్నము నొందిరి కుంది కంది లోఁ
గలఁగిరి మండి మాఁడిరి వి • రాలిరి నిక్కిరి ప్రక్క రాంత్రముల్
వలనుగఁ జెక్కి రేఁచిరి • పండి రెదిర్చిరి వీరి చచ్చిరిన్.

తే॥ కవచ కుండల కేయూర • కటక మకుట, కింకిణీ హారవితతులు • కలనఁ దునిఁగి
ధారలు వారి మేనులనుఁడి • త్రుంగి యురలి, మొగులు గములందు మించుల • పగిది మెఱసె.

సీ॥ వెనుకనున్నాఁడు ముం • దున నున్న వాఁడొగి, వదనమందున్నాఁడు • హృదివిగలఁడు
తలలపై నున్నాడు • మలలపై నున్నాఁడు, కెలఁకుల నున్నాఁడు • క్రిందగలఁడు
మింటిపై నున్నాఁడు • మంటిపై నున్నాడు, కత్తుల నున్నాఁడు • కరులమీఁద
ఖురపులమీఁదను • తురుపుల మీఁద స్యం, దనములమీఁద నం • తటను గలఁడు

తే॥ నాయెదుట నాయెదుట నిల్చి • నాఁడు సీడు. కినుకలనున్నాఁడు కోదండ • కరుఁడటంచు
కలకుసోఁకులె భ్రమసి వా • చఱచునట్లు, మించి యెల్లయెడల సంచ • రించె నతఁడు.

చ॥ జలధులయందు లోకముల • శత్రుసమూహములందు పెక్కు మా
యలఁగొని కామరూపముల • నందు నిశాచరరాజి చింతనం
బుల నెదలందు వెల్వలను • పొల్పుగ నిల్చినవాఁడు మెల్పునన్
బెళబెళయంచుఁ బల్కఁదగు • పద్ధతినొప్పెను రాముఁ డెల్లెడన్.

శా॥ నానానూన విధాన ఁారముల వి • న్నాణంబుతో నుండె నీ •
భూనాథుండను బుద్ధిలేక మఱుఁగై • వీఁ యెంగదాయంచు వి
జ్ఞానానంద మయాత్ముఁడై మఱచెఁ గ • ర్తంబంచు గీర్వాణు ల
జ్ఞానావస్థ భజించి దిగ్భ్రమల నా • శంకించి రప్పట్టునన్

క॥ చండానిల వేగంబున, ఖండిత తరుకాండమట్లు • కర్పూర గణముల్
తుండములై దెసలం బడ, భండనమునఁ దిరిగె రామ • భద్రుఁడు పెలుచన్.

క॥ హయములు కరులు వీరభటులు, సరదఁబులు గిరులఁబోలె • సవపిం బెరుఁగన్
గిరినుండి గిరికి దాఁటెడు, కరణిం దిరుగంగవలసెఁ • గాకుత్స్థుఁ డటన్.

క॥ అంబరమంటెడు ధ్వజ చీ, నాంబరములతోడ గొప్ప • యంబారులతో
రం బూఁడి మునిఁగె గురుర, క్తాంబుధిలోఁ గరి ఘటలు ప్ల • వావలి కరణిన్.

క॥ తెగిన సురారుల శిరములు, నెగసి మరలఁ బడమిఁ బడెడి • వియతిం జూడన్
దగ విజయలక్ష్మి చేకొని, యెగురవయిచు జలజ వితతి • కెనయై యుండెన్.

క॥ వాలమ్ములఁ గరములతో, వాలమ్ములు గరము విఱిగె • వాలెమ్మగ జీ
వాలమ్ములుకుల కెరయై, వాలమ్ములఁ బోలు • దైత్యవర్గము సమసెన్.

క॥ ఖేటకములు తునిఁగిపడెన్, ఘోటకముల తలలతోడఁ • గూటువ లగుచున్
బాటకముల కిమ్మయి చను, హాటక కోటీర మస్త • కావలితోడన్.

క॥ క్రూరుల దంష్ట్రలు తెగి తమ, గౌరుల మేనులను చొచ్చి • కారు మొగులునం
దూఱు లపద్వాల శశిం, గేరు లలివి తోఁచెఁ జూచు • గీర్వాణులకున్.

క॥ అక్కుటిలుల పెనుకోలలు, మిక్కుటమగు కరి రదములు • మేదిని నిండన్
తెక్కురు కల్పంబులఁ గల, పెక్కురు నెల లొకటఁ జేరు • పేరిమినొప్పెన్.

క॥ అసురుల తనుగిరులందున, విసరముగాఁ బొడమి దెసల • విరిసిన రక్త
ప్రసరమున నచటి జనములు, పసరములును చనియె నెక్కి • పర్వతములకున్.

క॥ నిండె దివి జీవతతిచే, నిండెం భువి దానవ శవ • నివహముచేతన్
నిండె శరధి రక్తముచే, నిండె సురల కనులు రామ • నిపుణత్వముచే.

క॥ కయిదువులు రక్త నదముల, పయి వడివడిఁ బోయి బహుళ • వనచర వితతిన్
బయి దవిలి సరగఁ ద్రుంపఁగఁ గెయిదంబులు తఱుఁగ విఱిగి • చేడ్పడి చప్పెన్.

మ॥ బలహీనుండగు నొక్కమానవుఁడు పై • పైఁ బేర్చి దోషాచరా
వలి గావించిన వ్యూహముం జెఱచి త • త్పాండిత్యముం జూపి దై
త్యుల ఖండింపఁగఁ బండ్లు గీఁటుచును వ్య • ర్థుంబోలె నిల్చుండుటా?
యలుచం జంపెదనంచు వహ్ని కడు రో • షాయత్తుఁడై లేచుచున్.

## వహ్ని దానవసేవలఁ బ్రోత్సహించుట

చ॥ ములుకులు వచ్చి పైఁబడగ • మున్నె నిశాచరు లంద ఱొక్కపై
యలుగులపాటు నొంద కొఁగి • నాతనిపైఁ బడ సల్గి చావఁడే?
బలుధులవీల్కిఁ గానఁబడి • వప్పికి చేఁతలఁ జేయుచుందురే?
మలకలు మాని పైఁబడుఁడు • మ్రాల్పుఁడు లెండని ప్రోత్సహింపఁగన్.

పంచచా॥ చలంబుతోడఁ గర్బురుల్ వి • దారదూరులై వెసన్
బలంబు చూపి యొక్కకొండ • పైని పెక్కు మేఘముల్
జలంబు చిందు ఖాతి నైక • సాయకంబు లేసి తా
వలంబు తూలఁ దర్జనంబు • భర్జనంబు సేయఁగన్

ఉ॥ తివ్వున రామబాణములు • రేఁగుచు శీర్షము లెన్నొ చెందుచున్
ద్రెవ్వగఁ జేయ రాక్షసులు • తీఱిరి కూలిరి చాఁపకట్టుగా
నువ్వున నాడిపాడెను మ • హోద్ధతి నార్చెఁ బిశాచ సంఘముల్
ఱివ్వన నోటిలోఁ గొఱవి • కట్టలు నావల దివ్వెలట్లుగాన్

॥ రక్తసంకుల వార్ధి వ • స్త్రముగఁ దాల్చి, రక్తచందన మలఁది ధ • రా పురంధ్రి
పెద్దపెండ్లిఁ జూడఁగ వచ్చు • పేరఁటాలి, కరణి నొప్పారె నారణ • క్ష్మాస్థలమున.

॥ ఘృత సురాక్షీర దధిలవ • ణేక్షుశుద్ధ, వననిధులు రక్తమయమయి • పరఁగు కతన
సప్తపారిధులను పేరు • జాఱువీడి, యొక్క రక్తతోయధి యన • నొప్పె నపుడు.

క॥ తొడుగుట యొకపరియైనను, వెడలు శిలీముఖము లెన్న • వేలకు వేలె
వ్వాడు వధము పూర్తియగు న, వ్వాడు లేనెంచఁబోయి విల్లు • వొడవయి నిలుమన్

సీ॥ ఎత్తినవారలు • నేసిన వారు గ, ట్టించిన వా రెవరి • రించువారు
వడిగొను వా రోడి • పాఱినవారు కో, పించినవారు మ • దించు వారు
తొడరిరి యదరిరి • తొడఁకిరి పడఁకిరి, మడఁగిరి బెదిసిరి • మడిసినారు
చూడ్కులు మనసులు • చూడ నూహింపఁగఁ, దగిన యంతటి సమ • ర్థములు కావు

తే॥ తొడగినవివేయియలుగులు • వడిగఁబోయి, చంపుటయొకసహస్రముకాదు • శతసహస్ర
మట్టిదే వడి యుద్దేశ మట్టిదె యగు, దానవ శరాళి తమ గావ • లేనివయ్యె.

సీ॥ ముందుభాగమ్మున • మొగమును రెండు ప, క్షములను పృష్ఠమ • ధ్యములు గలుగు
ఘనశరవ్యూహమ్ము • కాకుత్స్థకుఁ బొందు; సూదియుఁ జొరలేని • [illegible] పన్నె
నాయమ్ము లొగినేగి • యాయమ్ములం గ్రుచ్చు, వలఁకుల దుస్సి య • వ్వలికి నేగు
నాయమ్ములకుగుఱి • యైనరక్కసులు చ, చ్చుటగాక యెటఁరి గె • ల్చుటయుఁగలదె?

తే॥ విలయకాలానలముఁబోలి • యలుఁగు లదర, నెండుటడవులఁ బోలిరి • మెట్టె యసుర
వరులు; రామబాణములు వా • గురినుబోల, వనుజగణములు తగుబా మ • త్స్యములఁబోలె.

తే॥ చండ మారుత మట్లు దా • శరథి యొప్పఁ, జెదరు మబ్బులకై పడి శుక్ర • శిష్యులుం ద్రి
విలయ కాలసాగరమట్లు • వీర రామ భద్రుఁడుండఁ బ్రాణులబోలి • వారలుం ద్రి

మ॥ మొదలై సృష్టియు పె. ర్చి మధ్యమగుచున్ • బోషించి యంతంబునై
తుది గావించు పరాత్పరుండు గనుజ స్తోమంబుకై కల్పమై
పొవలన్ దారు చరాచరంబుల విధం • బుం బొందెడి రా రాఘవుం
డుదధి ప్రోత్థ విషంబు గాఁ గనిరి మ • త్స్యోఘంబుగా రాక్షసుల్.

ఉ॥ వంచన, గూటసాక్ష్యము స • భం బలుకాడి ధనంబు గూర్చు నా
కుంచిత పీఠవర్తినుని • కుంఠిత వంశముఁ బోలి రాక్షసుల్
ప్రాంచిత ధర్మముం జెనపె • రాముడు, తాను విషాంబువై చనన్
గ్రంచర ధావి ఔమమునఁ • ద్రావిన దీనలైరి దానవుల్

చ॥ ఒక శతవాహినుల్ మగిసి • యున్నతఱిన్ జలరాశి లంకయున్
సకలము నొక్కటై సమసి • సంబుగఁ గన్పడ దానవాంగనల్
కకవికనొంది యేదియున • కానక చిత్త కలంకమొందిఁ కా
ళ్లు కుదియ నెట్లుపోక డిగు • లుం గొని కూలిరి మున్గి రందులన్.

తే॥ దాసిన సురారు లసువులఁ • బాసివారు, కుప్పలై నింగి నంటెను • కుణప చయము
ఎడిరి నెత్తురు పోలేక • యెదురు తిరిగె, వెనుకనున్న సైన్యంబు ముం • దునకు వచ్చె.

క॥ రేఁచిరి కరి శరభాదుల, వీచిరి తోమర గదాది • వివిధాయుధముల్
త్రోచిరి సేవల ముందున, కేచిరి ప్రాణంబు తీపి • యెఱుఁగక వారల్

ఆ॥ రండిరండి మీవ • రంబుల బలములఁ, దెండితెండి తెచ్చి • యిండియిండి
వాశరముల కమచు • దాశరథి వచించి, పేర్చి శితశరంబు • లేర్చి యేపె.

చ॥ తమతమ పేన లవ్వలికిఁ • దారఁగనీయక సైన్యనాథులే
తమకముతోడ నడ్డుపడి • తార్చుచుఁ జచ్చినవారి దాఁటుచున్
దుములరణంబుకై యతిమి • త్రోయుట డాయుట గాంచి నిర్జరుల్
కుమిలి త్రినేత్రుఁగాంచి యెద • కూరిమితో వచియించి రివ్విధిన్.

ఉ॥ రాణువలోన నొక్కొక్కరు • రావణుకంటెను ముమ్మడుంగు వి
న్నాణులు వారిలెక్క గణ • నంబునకందదు వంచి మించుచున్
జాణతనాన డాసి రిఁక • జానకినాథుఁడొ యొక్కరుండు మా
షోణిమి మాల్చవట్టి బల • పూర్ణులు దానవు లేమి మూఁడునో ;

ఉ॥ రాఘవుఁ దేయునట్టి ప్రద • రమ్ముల నంతరమంద త్రుంచుచున్
మేఘము లట్లు క్రమ్ముకొని • మించిరి ముంచిరి వీరలన్ మహా
మోఘముగా శపించి యసు • పుంజము తీసినఁ దీయవచ్చు బా
ణౌఘముచే జయింపఁ దర • మా మముబోఁటికి మీకుఁ దక్కఁగన్ ;

చ॥ అని వచియింప శూలి భయ • మందకుఁడయ్య సురారు లెందతై
న నగిని దూదిఁగాల్చు వయి • వంబున రామశరాగ్ని కాల్చు నే
ముముపె వచింపనే ; యమృత • మున్ గరళంబుపాడి చక్కటిన్
గొనకొని గెల్చెనేనియును • క్రూరులు రాఘవు గెల్వనేర్తురే ;

చ॥ తలఁచినచో విభీషణుఁడు • తక్క జగంబున జీవయుక్తు డై
యలుచు నిశాటుఁడున్నె యొకఁ • డాచట సత్కృపగల్గ ధర్మమున్
బొలఁచును మీరు దాఁగుటకు • భూధర కందర లింక రోయఁగా
వలవదు నేఁటితో దనుజ • వంశము మాయు నిబద్ధి నానుడుల్

చ॥ అని హరుఁడాడ బ్రహ్మయు య • థార్థమ యంచు వచింప వేలుపుల్
మనమున నెమ్మదిం గొనిరి • మానవనాథుఁడు మండలీకృత
స్వనిత ధనుఃపయోదమున • శాత శిలీముఖ వృష్టిగూర్చి వా
లిన దనుజోత్తమాంగక శి • లీంధ్ర సమూహము సృష్టిచేయఁగన్

చ॥ అనఘుని చుట్టుకొన్న దను • జావలి స్వర్గముచేరి యచ్చటన్
మనుటకుఁ జోటులే కలయ • మ్రాలిన మేనులు తత్తరింపఁగన్
దునిఁగిన యాశ్వీక ప్రతతి • తోడన దివ్య శరీరమంది పే
దినిఁ దమ గుట్టముల్ పొరలి • త్రెళ్లుట గాంతురు మింట నిల్చుచున్.

ఉ॥ అంబుధులందు శైలముల • యందు వనంబుల యం దెదారులన్
బంబిన నాకమందు శమ • పాతెదు పేరకుఁ దేటిచూచినన్

డంబుగ నట్టనన్ దిలల • దాఁచుచుఁ దేల్చుచుఁ గొంచుఁబోవు ర
క్తాంబు నదీనదంబు లన • వై కనుపట్టెను తొల్కుడిం బలెన్.

చ॥ ఎదిరిచినట్టి యోధవరు • లేత్తెఱ మాలి నశింప వాహినుల్
నదమదమంద వెస్కుఁగల • సైన్యము పాఱెను త్రోవఁజూడ నం
గదగొని వారినాయకులు • కాంచి వివేక విహీనులార! పా
ఱెదరె! బిరెబ్బలేదె! యని • రేఁవఁగ తే నులపోల్కి వారలున్.

చ॥ చెవుడు పడంగ లోకము వి • శీర్ణతనొంద మొయిళ్లు దేవతా
నివహ శిరంబు లూఁగ నప • నీధరముల్ చలియింప వైచు కై
దువులు మెఱుంగుపిడ్గు లను • తోయముగొల్పఁ దమస్సమూహముల్
దవిలి యెదిర్చెనాఁగ బల • దర్పము లెన్ దనుజాలి క్రమ్మఁ నన్.

ఉ॥ రాముఁడు రందురందని స • రాగముతో నతిధి ప్రకాండమున్
ధామమునం దెదుర్కొను వి • ధంబున నేగి పృషత్క వృష్టి గా
రాముల చూపఁ దెక్కములు • రాలె దిశాంతము లందు వాద్యముల్
భూమిని మ్రొగ్గెఁ గూలె రథ • ముల్ పవి భిన్న మహాద్రులోయనన్.

సీ॥ శకలంబులై పడు • స్యందనాంతరములఁ, దవియక కంకగృ • ధ్రములు తూఱి
బలితంబుగు ఏపే • బరసుల లాగంగ, భానుబింబము మాఱు • పాటునొంద
గ్రహగతుల్ దప్పంగఁ • గడలియు నుడియంగ, సారెకై పడి భూమి • సరగఁ దిరుగ
ధర్మంబు సమవ రి • ధనువు పిశాచము. లట్టలు గదిసి నా • ట్యంబు సేయ

తే॥ భవుడు నింద్రుండు పద్మసం • భవుఁడు మునులు, విబుధులును దిక్పతులు మోవ • వివశులగుచుఁ
బిల్లగంతులవైచి యా • వింటినేర్పు, దిట్టతనము సాహసము ను • తించినారు.

తే॥ సమసి చతురంగ బలములు • సాగరములఁ, జెరియుచుండ దుగ్ధాంబుధి • చిలుకు దేవ
దానవుల చేతులంబలె, దశిమిపాలు, కిలకు సోఁకుల కాళులు • గతుల దప్పె

తే॥ రథగజాశ్వ భటాది వ • ర్గములయందు, గాయములఁ గలిగించు రా • ఘవ కఠోర
సాయకంబు లావేస నెం • చంగఁజొక్క, లంచు కరణిని చొచ్చె న • త్యుత్కటముగ.

తే॥ సమసెరాణువల్ మిగిలిన • స్వల్పబలము, ప్రక్కప్రక్కకొదుఁగుచుఁ గొ • దక్కననుచు
వారి నవలికిఁ బోనీక • బాణచయము, వలన నొకకోట గట్టె పై • విలి విభుండు.

తే॥ బలియురైన మాలివి మాల్య • వంతునిమధు, కైటభులఁబోలి జగములఁ • గలఁచినట్టి
కవచధారులు రాముఁడు • కట్టిన శర, దుర్గమును దాఁటఁ జాలక • త్రొక్కువడిరి.

తే॥ చచ్చినట్టివార లెదుటఁ • జచ్చుచుండ, రేఁవఁబడిన వారింబలె • రేఁగి బడబ
క్రాఁచఁదెరలిన శరనిధి • కరణినొక్క, ప్రక్కకేతెంచి వహ్నితోఁ • బలికిరిట్లు.

తే॥ త్రిపురవైరి జనార్దన • త్రిదశవిభులు, మనబలము క్రుంచలేక యే • మరలినారు
ఒక్కమానవుఁ డీవేళ • నుక్కుమీఱి కలఁచుచున్నాఁడు రాక్షస • గణమునెల్ల.
తే॥ ఒక్కఁడే జగముల గెల్వ • నోపువాఁడు, వేయువెల్వల తుటుమొక్క • వ్రేలుమిడిని
గెలిచెనేమనఁగ • డింక • జెలఁగి యాఁగ, గరుడ వితతి జయించిన • కరణియయ్యె
తే॥ బ్రహ్మతోడ శివుండు గీ • ర్వాణచయము, వచ్చి సంగిని కనఁబడు • వారుగాని
కానరాఁడు వెన్నుండఁదు • గానఁజూడ. నతఁడె యితఁడగు సను సంశ • యంబు పుట్టె
తే॥ పద్మసంఖ్య బలంబిపు • పాడుపడియె. నొక్కవెల్లువ శేషించ • యున్నదింక
నేమి చింతించి రాఁగల • దేమిఫలము?. తలుపుఁడన్న వహ్నియు నిట్లు • పలుకఁదొడఁగె

చ॥ మృతికిఁ గలంగి క్రమ్మఱుదు • మేని దశానను నాన్యపద్మ మే
గతిఁ దిలకించువారము ? జ • గంబున నెట్టపకీర్తి మోచి జీ
వితమును త్రోచువార మది • వీడి యశస్కర మార్గమందు స
ద్గతి యొసపంగ నీభవము • ధన్యముగా విడువంగ మేలగుఁ.

ఉ॥ సంకటపాటునం దవల • జాఁగి మెలంకువతో మెలంగఁగా
లంకను పీడిపోవఁగఁ ద • లంచినఁ గోటకోట దాఁటలే
ముంకున నెల్ల రేకమతి • నొక్కట రాముని చుట్టు ముట్టుచుఁ
జంకెనలోడఁ జంపుదము • చత్తము యోగ్యత యయ్యెదేయనఁ.

తే॥ అన్నినదులు సముద్రంబు • నందు లీల, శలభములు దీపమునఁబడు • చందమునను
విధియె సిగఁబట్టి యాడ్వ వి • ద్విడ్గణంబు, చాసి రాముని చుట్టెఁ గ • డంకతోడ
తే॥ గోగణంబు నడుమనున్న • క్రోలుపులిని, పోలు రామువుపై నో•కు • మూఁకలపుడు
పరశు తోమర కుంత ము • ద్గర ముసుండి, వాల త్ర్యాదులను పట్టి • వైచినారు.

## రాముండు గాంధర్వాస్త్రము సంధించి విడుచుట

క॥ గాంధర్వాస్త్రము రాముఁడు సంధించెఁ దదీయ దివ్య • శరము ఫణీంద్రుఁ
గంధిని గరుడుని పావకు. గంధవహుని బోలి యదరి • కడుపడి నరిగెఁ.

ఉ॥ అక్షులుమూఁడు మోము లయి • దగ్నిశరీరము గల్గుకోల పా
లాక్షుని మేనిఁబోలి యొక • టైదయి యేఁబది నూఱు వేలనై
లక్షలు కోటులై పర బ • లంబున నొక్కని కొక్క రాము రూ
పక్షిగతంబుగా నదరి • యందఱఁ గూలిచె నొక్కవ్రేల్మిడిన్.

సీ॥ ఏడుదీవులయందు నెనిమిది • దిక్కులఁ, బాతాళమందును • పర్వతములఁ
బంక్తికంధరునకు • బ్రతినిధులై ప్రేమ. పాత్రులై దిన విశా • పతులఁ గూర్చి
హారంబుగాఁ జేసి • యక్కున ధరియింపఁ, జాలు సమర్థుల • చ్చటికి వచ్చి
మనలోన నొకని నీ • మనుజుండు గెలిచిన. రావణుసైతమ మో • ర్వంగఁగలఁడు

ఆ॥ కాన నొక్కఁడొకఁడె • కాకుత్స్థుతోఁ గ. య్యంబుసేఁత మేలొ ? యందఱొక్క
మొగినిఁ గ్రమ్మి వాని • ముంచుకొనుట మేలొ ? యనుచు వహ్ని నడుగ • నాతఁడనియె.

ఉ॥ ఒక్కఁడొకండుగాఁ జని ర • ణోత్కటు రాముని గెల్వలేము మీ
రెక్కడి వార్తలాడెదరొ ? యిప్పటి సంస్థితిఁ జూడరో ? యనన్
రక్కసులెల్లఁ గూడి బవ • రం బొనరించుటె యుక్తమంచు విం
దైక్కడి సంకులోత్థిత దెస • లెల్లను బీఁటలువాఱ నార్చుచున్.

చ॥ భుజములు దట్టుచు న్నిలువ • భూరి భయంకర లీల రాక్షస
వ్రజములఁ జంపియున్ దనివి • వారని రాముఁడు వారిఁ గాంచి య
క్కజముగ శింజినీధ్వని జ • గద్భయదంబుగఁ జేసె లోకముల్
విజపదిఁ గొల్చు సూర్యశశి • నేత్రుని శంఖవిరావమో యనన్.

ఉ॥ పెక్కురు శాస్త్రవిద్వరులు • భీకర విక్రమ యుద్ధకోవిదుల్
పెక్కురులై దివౌకసుల • వెంటఁ జరించిన దైత్యబంధులన్
మక్కుటఁ గోసినారలు ప్ర • మోద మనస్కులు కాలకాలునే
లెక్కయొనర్పనట్టి మద • లీలలఁ దేలెడివారు రాక్షసుల్

చ॥ పిడుగులు రేఁగినట్లు మద • భీషణ వారణరాజి యేచిన
ట్లడరి సమీకనైపుణి బ • యల్పడఁ బెక్కువిధాల సెయ్యెడన్
నడచిరి వారి యాయుధ గ • ణంబుల నేత్రములందు పెల్లుగా
బిడుగులు లుప్పతిల్లి గిలి • మిక్కిలి కూర్చెను ఖేచరాలికిన్

తే॥ నేమిరావంబు కింకిణీ • నినదములును, సింహనాదంబు ఘీంకృతి • శింజిని రుతి
హేషలును భుజాస్ఫాలన • హేల లాయు, ధముల రవము లేచెను బెది • దంబుగాఁగ.

తే॥ వారు రావణుఁబోలిన • వారు తాము. లీల గెలువని లోకంబు • లేదు తత బ
లిష్ఠు లాదైత్యులను రణ • నిష్ఠతోడ, జానకీజాని యెదిరించె • సంగరమున.

సీ॥ వారలు పెల్లేచి • వైచు చక్రాది సా, ధనముల నడుమనే • తునియఁ జేసి
వారి తొమ్మ్మలగల్చి • తేరులతోడఁ బ, రిధి బింబములు నాధ • రిత్రిఁ గూల్చెఁ
గైదువుల్ వట్టిన • కరములు మేనులు, మెఱుఁగులతోఁ బొల్చు • మేఘములన
భువిఁ వ్రాలెఁ దెగి శర • ములతోడఁ బడు కేలు, ఫణులు కొమ్మలతోడఁ • బడుటఁ బోలె

తే॥ వార్ధిఁ జేరె నెత్తుటియేట • వారణములు, కొండలంబలె గుఱ్ఱముల్ • కొలుచుండె
నాయుధంబులు చోటమీ • లసెఁ జలించె, ఖేటకంబులు తాఁబేళ్ళ • క్రియను పొరలె.

తే॥ వాతిహతిచేతఁ దెరల కం • బములతోడఁ, గూలు పడవలవలె నేనుఁ • గులు సిడంపుఁ
గంబములతోడ రుధిరాప • గాప్రవాహ, మందు మునిఁగె హాహాకార • మతిశయింప.

తే॥ తునిఁగి రక్తవాహిని యందు • దొరలుచున్న, శిరములందు శిరసములు • శవ్వియుండఁ
గమలనాళంబులను నోటఁ • గవ్వికొన్న, పావురంబు కూటంబుల • పగిదిఁ దోఁచె.

తే॥ పటికరాలతోఁ జేయంగఁ • బడి విఱిగిన, కీరిచక్రంబులు పయోధి • తెరల నడుమ
మెరలఁబడు పూర్ణచంద్రబింబోత్కరంబు, నాఁగ నవ్వారె గనులకు • నాణెమగుచు,

శా॥ మాయలచే జయంబుగొను • ఘూర్ణద్ధర్మ విముక్తిఁ జంపఁగా
నాయితపడ్డ రాఘవు శ • రాసన మొక్కట వంగునంత దై
తేయ శిరోమహీధ్రములు • తెట్టువలై గొనయమ్ము వంగఁగా
నీయక వచ్చివచ్చి పడి • యిట్టటు లాడఁగనీయ వింతయున్.

తే॥ పక్షములఁ జొచ్చి రుధిరంబు • వట్టఁ ద్రావు, పక్షయుతశిలీముఖములు • ప్రసవములను
పక్షములు వెలినుండఁగఁ • గుక్షి నిండ, మధువుగొను శిలీముఖముల • మాడ్కి నొప్పె.

తే॥ యోజనాయతమగు సమ • రాంగణమున, రమణ లోకైకవీరుఁడౌ • రాముఁడొంటి
మెయిని పాదచారి యగుచు • మృధము సేయు, చొక్కటాములోఁదిరుగంగ • నొప్పెనతఁడు.

చ॥ నిలిచిన వారి యెన్నెదుట • విల్చుచుఁ బోయెడు వారి ముంగలం
బొలుచుచు నెందుచొచ్చినను • బొందుగ నడ్డమువోయి రాక్షసుల్
బెండుకుఱ విల్చుచున్ వినుగు • వేసటలేక • వధించుచుండ దై
త్యులు వెఱఁగంది కంబమునఁ • దోఁచు నృసింహుఁడె యంచు నెంచుచున్.

ఉ॥ ఇప్పటనుండె నిందుగలఁ • డిప్పటఁ దోఁచె నలంగె నాకడన్
వచ్చెను వీఁడెయంచు భ్రమ • వాఱి శరంబులు కూర్చి యేరిపై
నెచ్చటనేని వైచి మఱి • యెద్దియు దైత్యులు తమ్ముఁదామె పె
న్మచ్చరమూని చంపుకొని • మాఁడిరి పెక్కురు తత్ప్రణస్థలిన్.

ఉ॥ ఒక్కఁడు రాముఁడంట యది • యొప్పునె? మూర్గురు కల్ల వేవురున్
నిక్కముకాదు లక్షయన • నేరము కోటియనంగ వచ్చునో
పెక్కురు పెక్కుకోట్లు రఘు • వీరుఁ గల్గుదురంట సత్యమో
నిక్కడనంచు నేలయన? • నెల్లెడ దానయి నిండెఁ జెల్లరే!

ఉ॥ అంతట వీరరామమయ • మై కనుపట్టు నిశాచరాళి ది
గ్భ్రాంతి వహించి యొక్కొకరు • రాముఁడు నాకడఁ జిక్కెనంచు దా
వంతము లీఁగె నంచెదురు • పద్ద సురారులఁ జంపుకొంటచేఁ
గొంత యలంత తగ్గెను క • కుత్స్థకులాబ్ధి సుధాంశుమూర్తికిన్.

చ॥ అరదములం గుఱాలనయి • హస్తులపై వనరాశిమీఁద సం
బరమున నున్నవాఁడనుచు • భ్రాంతిని యెందును బోవలేక ని
వ్వెరగొని విల్చి చుట్టుదను • వ్రేయుచు మించి వరాస్త్రమింపు కం
ధర వివిధ దేహ వేగ బల • దర్పములం గనుచుండ్రి రక్కసుల్

ఉ॥ నిండిన ఖండనస్థలిని • నీరజనేత్రు బలిష్ఠ చండ కో
దండ విలగ్న ఘంటికలు • దంధణ మ్రోఁగిన యప్పుడెల్ల వే

దంత తురంగ సంఘములు • దారుణిఁ గుప్పలు గూలుచుండు బ్ర
హ్మాండము దిద్దరిల్లు దను • డాంగన పాలికి రాలు నభ్రుపుల్.

ఉ॥ చచ్చినవారి తేరులను • చావక వీరెడి వారి తేరులం
దచ్చుగలాగి వచ్చిన • రాసముతో వడిఁగానవచ్చుటఁ
గ్రచ్చలఁ బోరుసేయు నొగి • కంబున రాఘవుఁ డొక్కఁ తేరిపై
నచ్చిన చందమొంది కను • వారికిఁ దోఁచె రణాంగణంబునన్

మ॥ ఒకకోదండమ యున్నఁ దూణమొకఁడై • యున్నన్ శరస్తోమమా
తుకమున్ మీఱుచు వర్షబిందువుల సం • దోహంబుకంచెన్ విశే
షకమయ్యెం దనకేలు వేయికరముల్ • సాగించు కార్యంబు త
క్కఁక కావించె సహస్రహస్తములు వీఁ • కన్ రెండుగా నయ్యెనో

మ॥ ఒకమోమై మనుజాకృతిం బొలుచు నీ • యుగ్రంపు దృశ్యం బన
త్యకమౌ నిక్కడ నిక్కమేర్పడె నసం • ఖ్యాకంబులౌ దైత్యసై
నిక సంఘాతము చేసినట్టి దురిమున్ • నేర్పార సంపూర్తిగా
నొకమో మేవిధి గాంచఁగల్గుఁ దలఁతె • న్నో పద్మ సంఖ్యేయముల్ :

మ॥ నిటలాక్షుండు చతుర్ముఖుండు శరముల్ • నిర్ణీతి లెక్కించి యు
త్కటమౌటన్ గణియింపలేక యిది శ • క్యంబౌనె యంచున్ విశం
కిట మోదాత్మకులై నిశాచరుల సం ఖ్యంగాంచి యీలెక్క వే
యుటయుం బోలద యంచు మానుకొని రా • యుద్దేశ మప్పట్టునన్.

ఉ॥ సేనలు వేయి వెల్లువలు • చెందిన దొక్కని కొక్క బాణ మం
చూని వచింప నైతియగు • నో యొకటొక్కటి నూఱు తున్కలై
మేనులు కూలియుంట గన • మిక్కిలి పెక్కులు వాని జానకీ
జానియె యేసెనే యని ప్రశంస యొనర్చిరి వాసవామరుల్

చ॥ గొడుగులు నాయుధమ్ములును • గుఱ్ఱము లేన్గులు రాక్షసావళుల్
సిడములు తేరులుం దెగి ప • శింపఁగ వైచిన బాణరాజి లె
క్కడఁ దరమౌనె యేటిపని యీతని లాఘవలీల గాంచుటల్
విడిచి మఱొక్కచేఁత దగ • వే యని పల్కిరి తాపసోత్తముల్.

తే॥ కదనతలమెల్ల నవయవ • ఖండసమితి, చెదరిపడియుంట యొప్పెను • సృష్టికర్త
జగములను సృష్టిసేయఁగా • జతనుపఱచి, వేఱువేఱ యుంచిన యంగ • బృందమనఁగ.

తే॥ వీరవర్యులు పదికోట్లు • ఘోరరీతి, నిధనమొంద సాధారణా • యుధము లేసి
చాపనేల దివ్యాస్త్రసం • చయము విడిచి, కూర్తమని తక్కురక్కసుల్ , కూడినారు.

తే॥ మొనసినారాయణాస్త్రంబు • మొదలువేసి, యజావి యస్త్రంబుదనుకఁ • గ • లట్టిదివ్య
శరములేసిరి వారు దా • శరథిమీఁద, నతమ వానితోడన వాని • నణఁచివైచె.

మ॥ కొని దివ్యాస్త్రము లేయుచో జగము సం • క్షోభించి పుష్పంబు ల
గ్నిని పద్దట్టులు నాశమై చనును వా • నిం ద్రిప్పలే రీఖలుల్
కనుకన్ శాత శిలీముఖంబులనె యీ • క్రవ్యాదులం గూల్తుఁ గా
కని సీతాపతి యట్టులే పలిపి మా • యంజేసె నాదైత్యులన్.

తే॥ వేయివెల్లువలైన వి • ద్వేషి సేన, మొత్తముగ రణమున జీవ • ములను పాసె
బరువు తొలఁగ వసుంధర • శిరదినుండి, సరగఁ దైకుబ్బిలేచెను • చాలవలకు.

సీ॥ వారణంబులు వేయి • తేరులు పదివేలు, వారువంబులు కోటి • వాహినీశు
లొకవేవురు నశింప • నొక కబంధములేచి, రణరంగమందు న • ర్తనము సేయు
వేయికోట్ల కబంధ • వితతి యాతిన రామ, కార్ముకమున నున్న • గంట మొరయు
నాగంట యొక యేసు • నఱగడియలసేపు, ముగియక గణగణ • మ్రోఁగుచుండె

తే॥ తలఁపు నెఱవేఱెనని సురల్ • కలఁక విడిరి, విశృంఖల నందె ధర్మంబు • నిశ్వసించెఁ
దలలు పైకెత్తె శేషుండు • తాపసులును, మహువుఁడును గుండెబరువును • మాన్చికొనిరి.

ఉ॥ పొందిన కల్మి తమ్మునకుఁ • బొల్పుగ నిమ్మన నిచ్చి వేలుపుల్
చెందిన పూర్వపుణ్యమునఁ • జెచ్చెరఁ గానకు వచ్చి యందు ని
ల్లంది సమస్తజీవులకు • నబ్బిన యాపద దీర్చినట్టి రా
జేందుని గాంచి నోరుగల • యెల్లరు మ్రొక్కిరి జే యొనర్చుచున్.

తే॥ వేలుపులు పూలు సల్లుచు • వినుతిసేయ, రాముఁ డొప్పారె నా రణ • రంగమందు
భూతములు నిండినక్కలు • పొలయుమందు, మననమందొంటివెల్చు త్ర్యం • బకునిపోల్కి.

మ॥ కదనక్షోణి విరించనాండముగ ర • క్షశ్రేణి జీవాలిగాఁ
దుదికాలంబున నెల్లజీవులను సం • తుష్టిం బునస్సృష్టికై
యుదరింబందున నుంచుకొన్న తన పూ • ర్వోదార రూపంబునే
మదనాకారుఁడు పోలెనంచు వినుతిం • పం బూని రింద్రాసురుల్

మ॥ కలఁకన్ వీడి మురారి చల్లిన దళత్ • కల్ప ప్రసూనంబులన్
గలతావుల్ తన పేదదీర్పఁ బ్రబల • క్రవ్యాద సంఘంబులన్
బొలియంజేసిన రామభద్రుఁడు సమి • ద్భూభాగమున్ వీడి ని
ర్మలుఁడై ప్రేముడి తమ్ముఁజూచు తమి యా • త్మం దన్ను ప్రేరేఁపఁగన్

తే॥ ఇచటనిట్లయ్యె నచటనా • యనుజాతోడఁ, గపులతో రావణుఁడు వచ్చి • కదఁకరటము
సేసెనేమొ? లక్ష్మణుఁడేమి • చేయఁగలిగె? ననుచుఁ బొందరగా రాముఁ • డరిగెనటకు.

ఉ॥ మర్కటనాయకుల్ రణము • మానరు మిన్నక తక్కువారిలా
యర్కజు నాజ్ఞమీఱి యిటు • లాఱడి నొందుట భావ్యమే? సమి
త్కర్కశులై విరోధితతిఁ • ద్రత్తము చత్తముగాక యూరకే
తర్కము సేయ పడిఁ • దాకొని వచ్చిరి పోరొనర్పఁగన్

## 31. రావణ శక్తి పటలము (50)

తే॥ వేయి తురగంబులం బూన్చి • వేవెలుంగు, మండలముఁగేరఁ దేరెక్కి • ఖండనమున
సురలఁగెల్చిన విల్లును • శరధిఁదాల్చి, రావణుఁడు చేరె వడి సమ • రస్థలంబు.

తే॥ మనుజులం బట్టి వధియింపఁ • దనుచు వేచి, వెల్లువల కొల్లయిడి కపి • మల్లురపయిఁ
దాన వోప విచ్చించి యా • సేననంపి, వేయి క్రేవల నరిగె న • వీరవరుఁడు

తే॥ నూఱుకోట్ల రథంబు లి • న్నూఱుకోట్లు, తురగములు పదికోటుల • కరులఘటలు
నంత కినుమడియగు సుభ • టాలిలోడ, నాఁడు రావణుఁడేగె ర • ణంబు సేయ

తే॥ త్రిజగములయందు నెవరి ప్ర • దేశమునను, కలఁపనకు రండురండని • పిలుచునట్టి
భేరి కాహళ శంఖాది • భీషణరుతి, మూలు మ్రోఁగఁగ జెలరేగె • మహితరీతి.

తే॥ వంచితాసుర విధి ఏరి • పాకటముగఁ? దనురినాథుఁడు దశకంఠుఁ • డటుల వచ్చు
తోడ ధాత్రి యుపరి నట • ద్రోహుఁడయి, వచ్చుచుండుట గాంచెను • వానరాళి

ఉ॥ కాంచి దురంబులోఁ దను ని • కాయము వీడుచు వీరధర్మమా
నంబెఁ గృతాంతుఁడున్ వడఁకు • నట్లు భుజంబుల నప్పళించి గ
ర్జించుచు మ్రాఁకులన్ గిరులఁ • జేకొని వ్యూహము తీర్చి పేర్చి లం
ఘించుచు రండి రండనుచుఁ • గేరుచుఁ గేకలు వైచె నుద్ధతిన్.

తే॥ ఉసుఱు తీయఁ గాఁబోలు న • య్యసుర సేన, వడివడిగ వచ్చి తాఁకెను • వానరులను
ఉభయులకు మధ్య నిప్పుడు • లుప్పతిల్లె, వాని నడుమనె రక్త ప్ర • వాహ మడరె.

తే॥ తుండులైన మొండెంబుల • నుండిలేచి, తలలు నింగికి నెగసె నా • తలలనుండి
నెగయు నెత్తురు చిమ్ముచు • నింగిఁ బరవ, ంబరంబెల్ల రణరంగ • మట్లు తోఁచె.

చ॥ అవపదమైన రాక్షస బ • లాంబుధి నంబులనెత్తు చేతులన్
మదజల మానివచ్చిన ప్ర • మత్త శిలీముఖ కోటి క్రమ్మఁగన్
సదమదమైంది భద్రగజ • సంహననంబులు స్రస్రవస్రవ వె
ల్లివిరుగు నెత్రుటేర్లఁ బడి • లియ్యము లయ్యె మునింగి తేలుచున్

చ॥ మగువల తొల్లి సప్పులను • మన్ననలన్ సుఖతంపుఁ జిన్నెలన్
దెగువయు దుఃఖముం దొడరఁ • దేలుత యెన్నువ చేస్కి పాడుచున్
డగవుగఁ గంకణ ధ్వనులు • లాళము వైవఁగ నేడ్చియేడ్చి యా
వగ వలదంచుఁ బ్రాణములఁ • బాసిరి భర్తలఁజేరి రయ్యెడన్

క॥ నాశము నొందెడు తుది తఱి, వాశిల్లు జగంబులట్లు • నాక్షణచే
నాశము నందని సేనకు, నా॥ మొదవె ననుచు దైత్య • నాయకుఁ డదలెన్

క॥ తరువులు శిలలే యసి ము, ద్గర హలాదికము విడిచి • దనుజుల తలలన్
దొరలింపెఁ దాళ ఫలముల, కరణిని రావణుఁడు కాంచి • కళవళపడఁవన్.

ర్భుగు దుష్టాత్ముఁ గులాపకారకుఁ గుల • భ్రష్టుఁగా విశంసించి యిం
బుగ పద్వంశ కలంకితముం దుడిచెదం • బో యంచుఁ గోపాత్ముఁడై.

చ॥ మయుఁడు బమాత్ర విస్మృతలి • మాన్యత నిచ్చిన శక్తిఁ గిన్కతో
రయమున వైచె సద్దిమొరి • ప్రాణి నెదిర్చిన ధాత నేని చం
పియె మరిలంగఁ జారినది • భీకరమై యడదేరఁ గాంచి దు
ర్భయమునఁ దప్పికో నొక యు • పాయము లేదను నవ్విభీషణున్.

చ॥ వెఱవకు మంచు లక్ష్మణుఁడు • వేగమ యడ్డమువచ్చి వాఁడి యం
పఱ పఱపన్ మునీంద్రుసకుఁ • బాపి యొసంగిన శాపమట్లు వీ
సరవడ వేఁడపుల్ మునులు • చచ్చెను చచ్చె విభీషణుండు దు
ర్భరమని పల్కుచుండ విని • రాముని తమ్ముఁ డుదగ్ర వేగుఁడై.

చ॥ మరణము నొందినన్ యశము • మాఁదదు ధర్మము నిల్చు నుత్తముల్
గురుసుఖ మందువారు తన • కున్ శరణంబని వచ్చువాని దె
ప్పరమున పీడరాదనచు • వక్షముఁ జూపుచు వచ్చె నడ్డుగన్
వెఱగొని వానరుల్ విబుధ • బృందము హాః యని పిచ్చలింపఁగన్

మ॥ అతవిం దాఁటి విభీషణుండు చనఁగా • నయ్యుర్వరఁ మీఁకి వా
లి తనూజుండు దృఢాత్ముఁడై యెదుట ని • ల్చెన్ వానిఁ ద్రోపాడి స
న్మతి సుగ్రీవుఁడు పోయె నాతనికి ము • న్వాతాత్మజుం దేగె సీ
యతికాయిత్వ మహత్త్వముం దెలుప శ • క్యంబౌనె యెవ్వారికిన్ ॥

## రావణ శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

ఉ॥ అందఱకంటె ముందునకు • నార్యుఁడు లక్ష్మణుఁ డేగి దీని నేఁ
గొందెద నుండుఁ డుండుఁ డని • కూరిమి మిత్రుల మాన్చి శక్తియున్
డెందము గ్రుచ్చి దూయ గురు • ధీరత వక్షము చూపి నిల్చె నా
పందమఁ గాంచి వేల్పులను • చయ్యనఁ గన్నులు మూసి రయ్యెడన్.

తే॥ పదరి యెచటి కేగెదవని • పట్టరాని. చండ కోపాన మండుచు • దండము గొని
రావణుని రథ రథ్య సా • రథులఁ జదియ. భీషణంబుగ మోఁదె వి • భీషణుండు.

క॥ రోషమున రావణుండు వి. భీషణుపై మాడుతిపయి • వేఁడి యలుఁగు లా
మోఘగతి నేసి బహు సం. తోషముతో మరలె విజయ • దూర్వహమతియై.

క॥ నే శరణొందిన యీ జగ. దీశుని తమ్ముండు సోల • నీవెటకు ముదా
వేశమునఁ బోయెదని యా. క్రోశించి విభీషణుండు • కోపమునఁ జనన్

మ॥ వశమయ్యెన్ జయలక్ష్మి మోద భరత • స్వాంతుండనై మీఁద నీ
పశువుం జంపిన నేమిలాభమని సం • భావించి పౌలస్త్యు డ

ద్దిశ కన్నెత్తియుఁ జూడ కయ్యనుజు వి • ద్వేషంబు లెక్కించి క
ర్కశతం జూపక వ్యోమ మార్గమున లం • కంజొచ్చె సంరంభియై.

తే॥ పట్టరాని దుఃఖంబున • వాయివిడిచి, పనవి లక్ష్మణు పదముల • పైని వ్రాలి
ఘోషణం బొనరించె వి • భీషణుండు. వనచరులు దుఃఖ జలధి • మునిఁగినారు.

తే॥ ఇతఁడు మరణింప జీవించి • యేమిఫలము? విభుఁడు రాఘవుఁ డింక జీ • వింపలేఁడు
అనుచు నెద నుడివడ నేడ్చు • దనుజరాజుఁ, గాంచి భల్లూకనాథుఁ డీ • కరణిఁబలికె.

చే॥ తలఁచిన యంతలో సకల • తామర పొందము చుట్టి యోషధుల్
సొలవక తెచ్చి యియ్యఁదగు • శుద్ధమనస్కుఁడు మారుతాత్మజుం
డిల మనపాలనుండ నిటు • లేడువ నేటికి? చూడు లక్ష్మణుం
డిలుగఁడు వంతయేటికి వ • హింపుఁడు స్థైర్యము మేలుగల్గెడున్.

చ॥ అని యనిలాత్మజాతు నర • మందలి తూపుల నూడ్చివైచి యా
యనుజుఁడు మూర్ఛ మున్గినఁ ద • దగ్రజుఁ డోర్చునె? కాంచికాంచి నె
మ్మనమున వ్రాని వ్రిమ్మరుల • వ్రగ్గుచునుండుట చూచిచూచి యా
యనువున నూరకుంట తగు • నా? సకలంబును మాకు నీవెకా,

చ॥ అని వచియింప వాయుసుతుఁ • డాతని యిచ్చ యెఱింగి యాక్షణం
బున గగనస్థలి న్నెగసి • పోయెను వారల చూపుదాఁటి యా
పనియును బోవు మార్గమును • బ్రాఁతవియాటఁ జనంగ నోషధుల్
గొని చనుదేర నాతనికిఁ • గూరునె తామసమున్ శ్రమంబులున్.

చ॥ హనుమయు మందుదెచ్చె నొక • యాటగ నోషధిమీఁది వాయువుల్
పనుపడఁ బాఱునంత స్మృతి • వచ్చెను చచ్చినవారి జీవముల్
సునువుగ నిచ్చుమందునకు • నొచ్చిన వారల నొప్పి తీర్చుటల్
ఘనమగు కార్యమౌనె, ప్లవ • గ వ్రజమెల్లను లేచె నెమ్మదిన్.

చ॥ అమరులు వానరుల్ ముదము • నందఁగ లక్ష్మణమూర్తి లేచి వే
గమున సమీరపుత్త్రకుని • కౌఁగిలిఁ జేర్చి విభీషణుండు నే
మము భజియించునే యనుచు • మన్నన నాతనిఁగాంచి పొంది బా
ష్పము లురలంగ రావణుఁడు • చచ్చె వధూనిక కల్పె ముక్తియున్

చ॥ బ్రదికితి మెల్లవారమును • పాడియె యాచరణీయమంచు నొ
వ్విదమగు శారకాణఁ గపి • వీరుఁడు మారుతి చూపె సన్న కె
య్యది యిఁక దుర్ఘటంబగు? వి • హంబు పరంబును కూర్చు కర్మలం
దెదఁ దలపంగ ధర్మమె సు • మీ జయమున్ సకలంబు నిచ్చెడిన్.

మ॥ అని భాషించుచు నందఱుం గలిసి సం • యద్భాగముం దాఁటి రా
ముని చేరం జని తత్పవిత్ర చరణాం భోజాతముల్ సోఁక మ్రొ

క్కన వారందును సంతసించి యటనొ • కృత్యంబుఁ బ్రశ్నింపఁగా
వివరెం బూర్తిగ జాంబవంతుఁడు వినెన్ • పేరుండు చోద్యంబుగన్.

ఉ॥ పావనిఁ జేరి గాటముగ • బ్రాఁతిఁ గవుంగిలిఁ జేర్చి నాయనా!
యీవొకఁ డుండఁ గానివని • యేదియు మేదిని లేదు వీరిలో
రావణుఁడున్ గృతాంతుని పు • రంబును చేరినవాఁడె నీదు మో
దాహవ జీవితంబును చి • రాయు రుదంచిత కీర్తు లబ్బెడున్.

శా॥ మోదముతోడ బాష్ప జల • ముల్ ప్రవహింపఁగ జీవుఁజేరు మై
చైదముతోడ దుఃఖము నొ • సంగి దివింగను తండ్రిరాఁగ ను
శ్పాదిలనంత సంతసము • భావము చెందఁగ మ్రొక్కుతమ్ము న
శ్యాదర మారఁగా నలమి • యంగము దువ్వుచు రాముఁ డిట్లనున్.

చ॥ ?రణమునొందు ప్రాడిరగు • చావును మానిచి కాచుపొంచె సం
గరమున నీదు ప్రాణములఁ • గాంచ యొసర్చక యిచ్చినందుచేఁ
బరమ పవిత్రమైన రవి • వంశ గురుత్వము నిల్పితయ్యొ! యా
తరుణమునందు నీకదియ • తప్పని కష్టము వత్స! లక్ష్మణా!

చ॥ కలఁగక పావురంబుకయి • కాయము కోసి యొసంగినట్టి ని
ర్మలగుణి తాతయౌ శిబిఁ గ • రం బుపమింపఁగ నొప్పితయ్య! యు
ద్వరఁ గరుణామయాత్మకులు • స్వాశ్రితపాళికిఁ జెట్ట యబ్బచోఁ
గరఁగుదు రార్తి క్రేపునకుఁ • గల్గిన ధేను వలంగుతై వడిన్

చ॥ అని వినుతించి సమ్మదము • నంది రణంబునకై ధరించియుం
డిన కవచాదు లొక్కొ టొక • టిం గడుమెల్లనఁ దీసి యాంజనే
యుని కరమందు పెట్టి యొక • యున్నత శైలమునందు విశ్లమం
బును తొలఁగించు కొం చుబును • వీరకు ముచ్చట లాడుచుండఁగన్.

## 32. వానర రణరంగ దర్శన పటలము (36)

ఉ॥ సేనలతోఁ గపీంద్రుఁడును • చేరిక విల్చి భజించుచుండఁగా
వానరు లాదటన్ సమర • భాగముఁ దక్కక కాంచి దిగ్భ్రమం
బూని వడఁకుఁచున్ బిడెము • నొందిరి కీశ కులేశుఁ డీవ యీ
దానవ సైన్యమంతయు వి • దారణ చేసితె యంచుఁ బల్కఁగన్.

ఉ॥ రాఘవుఁడున్ విభీషణుని • బ్రాఁతిగఁ గాంచి దురంబునందు దై
త్యౌఘముఁ జూపుమన్నఁ గడు • నుత్సుకులై ప్లవగాద్యులెల్ల లెం
డో ఘనులార! చూతమని • యుబ్బుచు లేచిరి రాముశౌర్య ధీ
లాఘవ లక్ష్యశుద్ధుల కొ • లంది గనుంగొను వేడ్క సందిలన్.

ఉ॥ కొంచిరి వెగ్గడిల్లిరి వ • గర్చిరి తూలిరి వెగ్గలించి రా
కుంచితులైరి గుండియలు • కొట్టుకొనెన్ దడియాఱె నోష్ఠముల్
మించిన భీతి మెల్లనన • మేను లధీనములయ్యె నంత మో
దించిరి పొంగి రుబ్బిరి మ • దించిరి తత్ స్థితిఁ దెల్ప శక్యమే ?

ఉ॥ వీరశవ స్థితుల్ గనఁగ • భీతికి సంఖ్యకుఁ జూచు పేఁతకున్
మేరకు మీఱి యున్న దిట • మీఁద విభీషణ ! యగ్రగామివై
వీరల పుట్టు పూర్వములు • విస్తరరీతి వచింపు మేము పెం
పారఁగ విన్చుఁ గొంచు చర • యంగలవారము నా నతండమున్.

తే॥ కాకములు పందిరింబోలెఁ • గ్రమ్మియున్న, రక్తపంకమౌ రణమున • రామ బాణ
విహతిఁ గుప్పలు తిప్పలై • పీల్గియున్న, వారణంబులఁ జూడుఁ డ • వారణగతి.

క॥ వడిగల రామశరంబుల, బెడిదులు ప్రాణముల వీడి • పెంటలఁ గునుకం
బడిన వడువయ్యెఁ గనుఁడీ, పుడమిధరము మీఁది నాగ • పుంజములక్రియన్.

క॥ కూలిన దనుజుల ముఖములు, వేలా పులినమ్ములందు • విరిసిన రాజీ
వాలిం బోలుం గనుఁడీ, యేలా వర్ణింప రాఘ • వేష్వాస విధుల్ ?

క॥ శరసంఘాతముచేఁ జె, న్నరదంబులు విఱిగి శోణి • తాపగలబడిన్
శరనిధుల కలములం బలె, జరగుచు నుండుటలు గనుఁడి సంతస మెసఁగన్

క॥ వారణముల ప్రాణంబుల, తో రుధిరాపగలఁ జిక్కి • దొంలుచుఁ బారా
వారమునఁ దిమింగిలముల, తీరునఁ దేలాడుచుంట • దీటగఁ గనుఁడీ

క॥ నయగతుల నట్టలాడఁగ, లయగతులం దాళముల నె • లర్చు పిశాచో
చ్చయగతులఁ జూడ నటనో, భయగతులం జెనయఁబోలు • భరతాచార్యున్.

క॥ అరివీర సముదయంబుల, సరములు యంత్రములఁ బోలె • నడచెడు కాళ్ళం
బిరిగొని తగులం ద్రోచుచు, తిరుగు పిశాచములఁ గనుడు • తెలిచి కనుండీ

తే॥ నగము తెగిన మేనులతోడ • సామజమ్ము, లొఱవలై పడియొండొంటి నొంటి కొనఁగఁ
గొన్ని పెనుగుండ్లపెలెఁ దోఁచెఁ • గొన్ని యెన్న, విరుదలల గౌరులం బలె • మెఱపెఁగనుడీ

తే॥ చండకోపము వికటహాసమునఁ జూప, మొగములెల్లను పొగలతో • సెగలు నెగయు
హోమకుండంబులం బోలి • యొప్పుచుంట, కాంచినారలె శాఖామృ • గంబులార !

తే॥ సమదగజములపై నుండి • జాఱిపడిన, చాహరంబులు వీరాస్య • సరసిజముల
నొఱగి నిద్రనొందెడు మరా • శోత్కరంబు, చెలువు చెన్నారు వానిఁ గాం • చితిరెచెపుఁడు

క॥ దంతంబులు రుధిరోద, స్వంతంబులఁ దడిసి సాంధ్య • నభమునఁ దేజో
వంతములగు బాల కళా, వంతుని రేఖా చయంబు • వడువునఁ దోఁచెన్

చ॥ ఖర ధనురాది సాధన వి • శాలము లైన రథోత్కరంబుపై
ద్విరదచయంబుపై విరిగి • త్రెళ్ళిన వీరుల కన్నుదోయి యం
దురలిన నిప్పుచే సుడిసి • యున్న పలాలము మెక్కి ఘూలిముల్
హరువుగఁ ద్రేన్చుచున్ మురిసి • యాడుచునుండుట కేటి కాంచుఁడీ.

చ॥ దిగఁబడి పాటి సంభ్రమునఁ • దెర్లిన యాతలిజ ప్రపంచిలో
నెగఁబడి పొట్టమీలు తమ • యిచ్ఛ కొలందిని పచ్చి యాటి నే
మఁగుడను కాంచి యెందును క • నుంగొన లేదివి క్రొత్తయయ్యె నే
మృగిములో యంచుఁ గ్రమ్మటి గ • మించుచు నుండుట కాంచినారలే॥

క॥ మింటం జచ్చిన శవములు, మంటం జరియించు వారి • మస్తకములపై
నొంటించి పడఁగ సోలుచు, వింటరపడు సతులఁ గంటి • శేకప్పురా॥

తే॥ వింగియందు సారంగ తు • రంగచయ శ, తాంగములయందు చచ్చిన • యసురవరుల
యొదలి నల్లమిక్కిలుపడ • నడిమిమింట, భానుఁడున్నను లేఁ బ్రొద్దు • పగిదిఁ దోచె.

తే॥ వాయు జవమునఁ జవిన దై • తేయులు తెగు, కతన మింటనంటిన రక్త • కణములెల్ల
వెల్లువంబోలెఁ దోఁపఁగఁ • దెల్లనైన, విధుఁడు సూర్యునిపోలెఁగ • న్పించెఁగనుఁడి॥

క॥ దివి భువి జలనిధి దిక్కులు, పువులును మధుపములు కర్త • ములు మాఱఁగ భూ
జ వితతి దిశంబు లన్నియుఁ, జివుకులవలెఁ దోఁచుచున్న • చిత్రము గనుఁడీ॥

మ॥ కెరటంబుల్ గజదంత మౌక్తికములన్ • గ్రేఁదొట్ట త్రోపంగఁ బెం
దరువుల్ గూలఁగఁ బక్షి సంఘములు సం • తాపించి కూయంగఁ జా
మరముల్ చెక్కెపు లాతపత్త్రములు క్ర • మ్మన్ ఫేన బృందంబుగా
దరులై పీనుఁగు లొప్పఁగాఁ బఱచు ర • క్తప్రాఁదినుల్ గాంచుఁడీ॥

మ॥ కరి యూధంబులు తీరభూములు భుజా • స్కంధాలు సర్పాలుగాఁ
దురగశ్రేణి తరంగపాళి కర సం • దోహంబు పక్రాలిగా
నరి వీరాస్యము లంబుజాతములుగా • నాంత్రంబులే నాచుగాఁ
బెరసుల్ వండలియైన నల్లమడువుల్ • వీక్షింపుఁ డిప్పట్టునన్

తరువోజ॥

కరవాలములను వా • గళ్ళుగాదున్ని, కరమొప్పఁ బలల వం • కమ్ముగా నల్ల
విరవారు పీడమ • వేదండ మహిష, వితతి పోరలుచుండ • వీరులన్ గృషిక
వరులు మస్తములను • పద్మముల్ మొలవ, వరుసఁ గలుపు దీసి • వైచిన పగిదిఁ
గెరలిన యారణ • క్షేత్రంబు గనుఁడి, కీశవర్గములార ॥ క్రేఁగంటనైన

తే॥ రాక్షసుల పెనుమేనులు • రాలుచుండ, రామ కోదండ శింజినీ • రావ మొప్ప
వవనిఁ బీటలు వాఱఁగా • నందు చొచ్చు, శోణితాపగలం బుప్పు • సుమఁ గనుఁడు॥

మ॥ భుజముల్ గ్రీవ లురంబులున్ గవునులున్ • ముంగాళ్లు ముంజేతులున్
గిజారున్ సజ్జగ దంచి త్రుంచి యట ది • గ్వేధుల్ విదారించి యు
క్కుజమై చొచ్చె రసాతలంబనుచుఁ బ • ల్కున్ వచ్చు గాకీ మతం
గజ వాహాదుల రామ మార్గణము నొ • క్కండేని వీక్షింతురే।

సీ॥ అమృతంబుతో నుద • యంబందు గజములు, పదికోట్లు మేఘముల్ • వారివిధులు
వట్టినను మదంబు • వట్టవి వజహోమ, కుందజ కరులు పం • డ్రెండుకోట్లు
ప్రాణముల్ పోయిన • రక్తంబు వట్టవ, బొగరు మానవివియుఁ • బూర్వదంతి
వంశంబు గలయవి • పదునాల్గు కోట్లను, బ్రహ్మకకుబ్బార • వహనకార్య

తే॥ మునుపకుండుటచే నూర • కున్న యవియు, నపర దిక్కరి వంశంబు • నందు వొడము
పద్మసంఖ్య యింద్రుండిచ్చు • వానితోడ, వేయికోట్లు లెక్కకురావు • పెరల యావి.

సీ॥ కలశ వారాశిలోఁ • గలిగిన వేలకొ, లందు లీగుఱ్ఱంబు • లందు గలవి
వరుణుని గెల్చిచి • తిరుణమందునఁ గొన్న • యవి నిధీశుఁడు పోవు • నపుడు విడి
పోయిన యవి కోటి • పొసర విద్యాధర, ప్రభుఁడొసంగిన యవి • పద్మ సంఖ్య
తక్కువారి లొసంగు • తత్తరుఁడు లెక్క, లేవు సైంధవముల • ప్రోవు లివ్వి

తే॥ యెల్లలోకంబులందుండి • యెల్ల దీవు, లందునుండి వచ్చినయది • యసురసేన
మూఁటబలము వచ్చినయది • ముగిసినదియు, నవి విభీషణుఁ డనఁ బ్లవ • గాలిచూచి.

ఉ॥ మిత్రవరేణ్య! యిట్టు లని • మేషవిరోధి బలంబు చూపినన్
జిత్రముగాఁగఁ జూచినను • చెందదు దీనికి నంతమెన్నఁడున్
గోత్రవిభుం గనుంగొనెడి • కోపుననున్నది చాలునిష్టసౌ
మిత్రి ధరాత్మజావిభు న • మీపము చేరఁగఁ బోదమా యనన్

చ॥ సరియన నందఱుం గలిసి • సారసనేత్రుని చెంతఁజేరి య
త్యురుతరభక్తి మ్రొక్కి నమ • కోర్పివి రాముఁడు చూపు సాహస
స్ఫురదతి విగ్రహంబులను • చోద్యముగాఁ బలుమాఱు లెంచుచున్
జరుగగనున్న కారియము • చక్కటి యారయుచుండి రచ్చటన్.

## 33. రావణ రణరంగ దర్శన పటలము. (27)

తే॥ సురలుకష్టంబులొంద వా • నరులబలము, క్రుంగఁదఱిమిలక్ష్మణుఁగూల్చి • పొంగివచ్చు
మోదమున రావణుఁడు తన • పురము చేరి, యుత్సవముచేయ మదిలోన నుత్సహించె

క॥ తనమీఁది ప్రేమవేళం, జనుదెంచి దరంబు సేయు • సంగడికాంద్రం
దనుపఁగ వివిధ పదార్థము, లనువొందఁగ వండుఁడనుచు • నాజ్ఞాపించెన్

క॥ వేలుపుల పడిగ రండని, మీలోకమునందు గలుగు • మేలి సుఖములన్
గీలింపుం డీ లంకను, జాలమ పిలవనుచుఁ బంద • శాసన మొనఁగెన్.

ఆ॥ మంచి కిల్లు మంచి • మాంసంబులును పత్త్ర, ములును చందనంబు • పుష్ప వితతి
తానమునకు నీరు • తల్పంబులును దశ, వదను నగరు చేర • వచ్చి నిండె.

తే॥ తావి సంపెఁగ తైలంబు • తలకంటి, తావినీట బోర్కాడించి • తనియ భోజ్య
వస్తువులనిడి తల్పముల్ • వలసినట్లు, సవరణలు సేయ వచ్చి ర • ప్సరస లటకు.

క॥ పాడిరి కొందఱు పొలుపుగ, నాడిరి కొందఱు వలంతు • లరుదవ పొగడన్
గూడిరి కొందఱు సెజ్జల, వేఁడిన సిద్ధులకుఁ బోలె • వెలసిన వెల్లన్.

ఆ॥ రాజసుతులు మొదలు • రాక్షసాపకీదాఁకఁ, గొలువు సేయుచున్న • కోడెకాంద్ర
కింద్రభోగ మవ్వ • డింపారఁ గలుగుట, వలనఁ గలుగు గెలివి • కలవిలేమ.

తే॥ ఇట్టు లుల్లాసమున నున్న • యింద్రవైరి, విభుని యెదుటికి వచ్చిన • వేగులపుడు
కేలు మోడిచి చెవిదాసి • మూలబలము, నమసిన విధంబు వాక్రువ్వ • [illegible]సెనారు.

ఆ॥ వడఁకుచున్న మేలు • వరటిన నాల్కలు, బెదరు చూపులెడఁద • పిదపిదమనఁ
దక్క శాతి నత్తిఁ • దడఁబడు పలుకులు, తొలఁక దూతలిట్లు • పలికినారు

ఆ॥ విజయశీల! చనిన • వేయి వెల్లువలును, రణమునందు నిరిసి • రాము నేక
కార్ముకమున నేడు • గడియలలో ప్రూలె, నిందు కుడుచు నిందు • లెవ్వరింక?

చ॥ బలిమిని దేవభోగముల • బ్రాఁతిగ దైత్యుల కిందు కూర్పఁగాఁ
దలఁచితి నీతలంపులు న్నృ • థాచనె లంకను గల్గువారె యి
య్యలఁ గల వార లౌదురు మ • ఱెఁదును లేరెవరింక వీన నీ
బలముల కంతి పక్రియలు • పాయక యీయెడఁ జేయఁగాఁ దగున్.

చ॥ మితి యొనరింపరాక యను • మేయ మునంబును పొందియున్న యా
దితిజవరేణ్యుఁ డా చరులు • తెల్పిన పల్కులు విన్నయంతనే
యతిభయ దుఃఖ కోపముల • నంది ప్రచండ తరోగ్ర దృష్టులన్
ద్రతిమనువోలి నిల్చి వెఱ • పాఱఁగఁ గాంచుచు నుండి యప్పలన్.

క॥ బలవంతులు నాకించెను, పలువురు నరు నొకని ధనువు • వలన నొకండున్
గలికమునకైన మిగులక, వలఁగిరె యిది నమ్మఁజాల • నమ్మంజాలన్.

చ॥ అనవిని మాల్యవంతుఁడను • నయ్యోది సంశయమందఁ దగ్గదే?
పవిచిన దూతలే తనుకు • పల్కుదురే? నరుఁడొక్కఁ డిందఱన్
దనుజుల నేలఁగూల్చు టది • దబ్బఱగాదు సమస్త జీవులన్
బవిగొని కల్పవేళ బలి • వారెడు రుద్రుఁడు నొక్కఁడే కదా?.

శా॥ సంకల్పంబున సృష్టిచేసి జగముల్ • సంరక్షయున్ నాశమున్
బొంకం బారఁగఁ జేయువాఁడు గుణ సం • పూర్ణుండు సర్వేశ్వరుం
డింకన్ సందియమేల యాతఁడగుఁ జా • మీ్మ యందు నీలమ్ముఁ డా
తంకం బేమియులేక పల్కిన దస • త్యంబౌనె? లంకేశ్వరా!

ఉ॥ ప్రాణులు భోజ్యమైన యొక • వస్తువు గైకొను నైజరీతి; వి
ర్వాణము గూర్చి యన్నిటిని • వహ్ని భుజించును మీఱుచో జగ
త్ప్రాణుడ కొండలం దృణము • మ్రాఁకుల బ్రాణులఁ గూలఁద్రోయు నా
త్రాణకు నొక్క మేరగల • దా వచియింపఁగ? రాక్షసేశ్వరా!

చ॥ చెలఁగుచు నింద్రభోగములఁ • జెందిన కాలము కద్దు తద్విభుల్
తొలఁగినదంట విక్రమున • దూరముగాదు ప్రతిక్రియా విధుల్
గలుగవు నీకునై లయము • గాంచిరి బంధులు శిష్టవర్గముల్
మెలఁగెడి త్రోవఁ బొమ్మనుడు • మిక్కిలి కిన్క నిశాటరాజనున్.

శా॥ సౌమిత్రిం దెగటార్చితిం గలన నా • శక్తిం బ్రయోగించి దు
ర్వ్యామోహంబున మగ్నుఁడై నమవెడున్ • రాముండు శాఖామృగ
స్తోమంబుల్ నశియించు మూలబలముల్ • శుష్కింపనీ యాడనీ
యేమైనం బవియేమి? గెల్పు తుది నా • దే యయ్యె విన్నాళ్ళకున్

ఉ॥ తోషితదైత్య హృచ్ఛశి వి • ధుంతుదు నట్టులు చాఱఁదొక్కఁడు
ద్ఘోషముతోడ మోఁకరిలి • కొంకుచు వాయు కుమారకుండు ది
వ్యౌషధులోలిఁ దెచ్చి పొలు • పొందఁగ నీయఁగ లక్ష్మణుండు త
ద్వేషజశక్తి లేచెఁ దెలి • విం గొనినారలు వాసరోత్తముల్

తే॥ అనుడు నమ్మక పెనునంది • యంబు కలఁప, గోపురము మీదికిం జని • దాషురించు
సైన్యనాశంబు సత్యంబు • సరగఁ గాంచె. వాడు కన్నులతో మది • మాఁడుచుండ.

క॥ పోరున మరణించిన యా, వీరుల వనితలు సబాష్ప • వీక్షణ లగుచున్
బోరున విలపించెదు దీ, నా రావము శ్రవణము లగల • నాతఁడు వినియెన్.

తే॥ ద్విరదముల పీద్నుకొని పెను • దరుల నొంపి, యేగు రక్తనదులలోన • నీఁదులాడు
చుండు శాకినీ డాకినీ • మండలులను, గుండె లగలంగ దశకంధ • ఱుండు గాంచె.

తే॥ జంబుకంబుల రవము లా • గంబుగాఁగ, భూత పరతలధ్వని తాళ • ములుగ రామ
బాణ విహత కబంధముల్ • ప్రాణమున్న, ట్టులు పోల్కి నటించుచుం • డుటనుకాంచె.

చ॥ కవిసి పిశాచముల్ పతుల • గాయములం దమకేలు చొన్పి క్రొం
గవుచును పెల్కి నీద్చుటను • కాంచి రుషాభర చిత్తలై సతుల్
దివిభువి దిక్కులం దటిమి • దెత్తల గ్రుడ్లను తీయుచుంట దా
నవకుల సార్వభౌముఁడు మ • నంబు దిగాలనఁ గాంచెఁగన్నులన్.

శా॥ జాతీయంబులఁ బోలి లెక్కకును హె • చ్చైచ యొప్పు రామాస్త్ర సం
జాత ప్రస్ఫుట దైత్య రక్తముఁ బిశా • చశ్రేణి యఱపొంగి యా
బూతిం ద్రావుచుఁ గ్రక్కుపోల్కిఁ దనకున్ • బ్రొయ్గిన పీచీముఖ
స్ఫీతిన్ ముందుగఁ ద్రోచు నాజలధిఁ గాం • చెన్ రావణుం డప్పెడన్.

సీ॥ దెనలు వీటలు వాటఁ • దివిరి మహోగ్రసా, దము సేయు కపినము • దయముగాంచెఁ
గువలయ మదగఁద్రొ • ద్క్కుచున ర్తనము సేయు, దైత్య కబంధ బ్బం • దంబుఁజూచెఁ
దనభీతి బొలివోపఁ • గనులు పెద్దవి చేసి, కొన్ని విలింపుల • గుంపు గనియె
గుండెలు పగుల నా • క్రోశించి గోపుర, మందుండి వివశు దై • క్రిందఁ బడియెఁ
తే॥ వివశ నట్టహాసంబుతోఁ, బెవపులెండఁ, గిముకతో మిడుంగుఱు లేచు కనులతోడ
కలుష హృదయంబుతో వచ్చి • కొలువుచేరె, రావణుండు సంగర జిత్తై • రావణుండు

## 34. రావణ రథారోహణ పటలము (35)

తే॥ భేరి బంధియందిఁ సున్న • సేనయెంత, యంత మొత్తమాయితము సే • యంగఁ బనుపు
వేగ మ్రోయింపు ప్రస్థాన • భేరి యిపుడ, యని మహోదరు వీక్షించి • యాజ్ఞయిడియె.
తే॥ భేరి విన్న వెంటనె రథ • శూరుదైన, సేన పమునాల్గు కోటులు • చేర నొకట
విజనమై లంక శూన్యమై • పేదపడియెఁ, గాపురము లేని పగిది లం • కాపురమ్ము.
తే॥ ఐహికాముష్మిక ఫలంబు • లందఁజేయు, పూజనము పర మేశున • కోజఁ జేసి
కోరువాంఛ సిద్ధిముల్ • కోరినంత, యిచ్చి రావణు డనికి నా • యిత్తపడియె.

చ॥ యిరుములతోడి నీలగిరి • సంగతి వేవురు భాస్వదుల్ వెలుం
గు రథిని దాల్చె బ్రహ్మ మును • కోరిన యింద్రుని కీయఁ దాను సం
గరమునఁ దన్ను దట్టుతటి • గాన్క గఁబుత్త్రిన కిచ్చినట్టి వ
జ్ర రుచిరమై యభేద్యమయి • రాజిలు కత్తళ ముద్ధతంబుగన్.

తే॥ మందరమ్మున వాసుకి • మలసినట్లు, పొలుచు దట్టపై నడిదంబు • వెలయఁ జెరివి
కనకగిరి జుట్టి వచ్చెడు • గ్రహములట్లు, పొనరు రతనాల కటిసూత్ర • మునుధరించి.
తే॥ గరుడి తెక్కలు విరిచిన • కిరణినొప్పు, గులుకుఁ గుచ్చెళ్ల సవరించి • మెలికపడిన
పట్టువస్త్రంబు విచ్చిన • పగిదిఁ దనరు, రజత ఫణినాగఁ జమ కాసె • రమణఁ గట్టి.
తే॥ మెఱపులంబట్టి కూర్చిన • తెఱఁగు సింహ, సముచయంబుల గర్జింపు • చందమునను
రవళిసేయుచు శత్రుల • చెవులు వ్రచ్చు, గజ్జెలం గూర్చు నందెల • గాళ్లఁ దాల్చి.
తే॥ పిడుగు మలివు విన్న • బెదరు సర్పంబుల, కరణి విన్న యంత • సరులు సురలు
వెఱచి పాఱునట్టి • భీషణ రవమొప్పు, వీరమద్దియలను • వెలయఁ దాల్చి.
తే॥ నాలుకలు చాచు పాములఁ • బోలియున్న, చేతు లిరువదింటికి నఖ • చేతులకును
వ్రేళులకును గోధాచర్మ • విస్ఫుటంబు, లైన కవచంబులను పొలు • పందఁ దొడిగి.
తే॥ పాఁపరాజును బోలిన • పాశములను, భుజములం దాల్చి కరసావ • పొనరఁ బట్టి
తఱివి రవిమండి రాలిన • కిరణరాశి, లలిని కాంతు లొలుకు కుండ • లములఁ దాల్చి.
తే॥ బాలభానుని కిరణముల్ • ప్రాగ్గిరిపయి, వ్రాలుతెఱఁగున నొప్పారు • రక్తగంధ
మలఁదినట్టి బాహులమీఁద • నర్కుఁబోలు, కుండలంబుల కాంతులు • విండి పరవ.

సీ॥ చంద్రునితోడి ఋ • క్షముల చందంబున, దారహారంబు కం • ధరను గ్రాల
ద్వాద శాదిత్యులు • వనధిపైఁ • బొడచిన. పగిది రత్నకిరీట • పంక్తి తనరఁ
బెక్కు చంద్రుల పోల్కి • విలసిల్లు ముత్యాల. గొడుగులు తలలపై • బెడఁగుసూప
సంజ పాలికలందు • శశుల నుంచినలీల, గుహవంటి నోళులఁ • గోఱలొప్ప

తే॥ ముత్తెములు కూర్చుటం జేసి • ముఖవు తెఱపు, నుదుటి వీరపట్టంబులు • మదము లొలుకు
దిగ్గజమ్ముల పటంబు • తెలఁగు దాల్చి, మూఁదలకిఁ బ్రక్కలకుఁ గాంతి • మొనయుచుండ.

తే॥ పొలయులక వహియించిన • పూవుఁబోండ్ల, పదములకు మ్రొక్కని కిరీట • పంక్తి కాంతి
భాస్కరుని గెల్చి మించిన • పగిది విరుల, తోరపుం గుప్పులమె వెలి • దోఁచుచుండ.

తే॥ స్వర్గ మర్త్య పాతాళముల్ • సరవిగెలిచి, లీలఁదాల్చిన విజయమా • లికలతోడ
చెలుల దృష్టులచేఁ జాల • చెలువుగులుకు. తుమ్మి పూమాల యురమున • నెమ్మిఁదాల్చి.

తే॥ పురికి సగడితిగా నున్న • శరధి యినుక, కాలమును మీనములు విద్య • కలిమి యుడుపు
పడవు పంచభూతమ్ములు • చెడినఁ జెడని, యశముఁ బోలిన తూణీర • మమరఁదాల్చి.

తే॥ ఒక్క మొగిమూఁడు లోకంబు • లెక్కనమువ, హింపఁగిలయదితురగ రా • హిత్యమయ్యు
తలఁపు మాత్రానఁ బోవంగఁ • దగిన కేరు, రమ్మనిన యంతవచ్చి య • గ్రమున నిలిచె.

చ॥ అమృతముతోడఁ బుట్టినవి • యర్క జవాశ్వ కులంబులోని వం
గముగ మరుత్తుచే బడబ • గర్భమునం జనియించినట్టి వ
భ్రమున జలంబునం దనల • వాయు పథంబులఁ బోవునట్టి వా
చ్చెము గనరాని యశ్వములు • చెల్వుగవేయి రథంబు లాగఁగన్.

సీ॥ కనక దిగ్గజ కింర • ఘంటికా నిభములో, గంటలు వేకోట్లు • గలిగినయది
అందంబులను విక్ర • యమునకుఁ గొనఁజాలు, వెలలేని మణులచే • వెలసినయది
మునులు సురలు మూర్ఛ • మున నోడువార లో, సంగు కైదువుల నె • సంగినయది
శూలి శూలంబు వి • ష్ణుని చుట్టుకైదువు. విఱిగిన విఱుగని • మొఱవుగలది

తే॥ విబుధులేనియు నూహించి • విస్తరింప, లేని శిల్ప నైపుణిచే నె • లింగినయది
సత్యమంటోలె మహిమకుఁ • జాలినయది, విజయలక్ష్మికి నిలయ మా • విభుని తేరు

తే॥ అట్టి తేరిని వలగొని • యసుర విభుఁడు, శాస్త్రరీతి నర్చించి యా • చక కదంబ
మునకుఁ దృప్తి యాత్రాదాన • మొనరఁజేసి, వంది మాగధుల్ సేవింప • నందుచేరె.

తే॥ ఎదల దార్ఢ్యంబుగొనియున్న • యింద్రముఖ్యు, లప్పుడవిగని వాంచల్య • మందినారు
ఇంద్రియముల గెల్చిన తాప • సేంద్రులును స, మస్త జీవులు భీతిల్లి • మలఁగినారు.

చ॥ సమరము సేయఁబూనితిని • సర్వజగంబులు మెచ్చ నేటి కు
త్ర్కమణము తప్పదింక రఘు • రామునకో మఱి నాకొ ? ధారణిన్
కుమిలి నశించు చెల్లె లవి • కూఁతురొ ? యమ్మయకూఁతురో ? యటం
చమలిన మేఘభీషణ ఘ • నోధ్వని రావణుఁ డాడె నత్తఱిన్.

సీ॥ పదికుత్తుకల మీఁద • బదితలల్ బొమిదిక, ముంతోడ రవుల చొ • ప్పున వెలుంగ
ఇరువది హస్తంబు • లిరువది కైదువు, లలరంగఁ దాల్చి వి • శ్చలత నెసఁగ
భుజవనంబులు స్వర్గ • మునవారు భీతిలఁ, బెరలి నఖంబు చీ • లికలుగాఁగ
శైలముల్ పగులంగ • నేల బీఁటలు వాఱ సూర్యుండు తన గతి • సూటిదప్పఁ

తే॥ జంద్రుఁడమృతంబు చిందించి • ప్రగ్గి యుండ, వేలుపుల విమానంబులు • ప్రీలి కూల
సింహనాదంబు గావించె • సిద్ధ, సాధ్య గణము బెదరంగ నా జగ • త్కంటకుండు.

క॥ ఘోర రణము గలిగినదను, ధీరతతో శింజినీ ర • వం గావించెన్
మీఱిన భయమున ఖేచర, దారలు దమ సూత్రములను • తడవికొనంగన్.

సీ॥ ఇన శశాంకులు చలి • యించెదు తెలుఁగు చూ, పించు పాథోరాశి • మించిపొంగఁ
గల చరాచరములు • గంధరగోళంబు, నొంద ననంతుండు • కుంది కుమిలి
శిరములు వే విడి • ర్చికొని భూమికి లేచి, వచ్చెనా నసురారి • వచ్చె ననికిఁ
గన్నులు బడబాగ్ని • కంటె మిక్కిలి గ్రాల, వచ్చిన రావణు • వైనమునకు

తే॥ ప్రాణివర్గంబు కలఁత వి • ర్థరుల చింత, పర్వతావనీ గగన వి • భ్రమణ రీతి
జలధి చలనంబు రవి సుతా • దులు గ్రహించి, యేమి కారణమని శంక • నెనసినారు.

తే॥ అండగోళమే పగిలిన • దనఁగఁ దోఁచు, గొప్పశబ్దంబు తడఁబాటు • కొంప లెరియు
కాలమునఁబుట్టు కలఁతయుఁ • గలిగెననుచుఁ, గతము నెఱుఁగక లేచెన • క్కపిచయంబు.

తే॥ సాగరములును శైలముల్ • జలదములును, స్వర్ణగిరియును నభము • జరుగు కరణిఁ
దోఁపఁ దేరెక్కి బంలి ప • త్తులఁ వాఁడు, బలముతో వచ్చు నాకల • కలము గనిరి.

మ॥ కని భూనాయక లెమ్ములెమ్ము దనుజ • క్ష్మాపాలపర్యుండు తా
నవిసేయం బమకించి వచ్చెఁ దని సై • న్యాగ్రీయ భాగంబు వా
నెను శాఖామృగముల్ భయంబునఁ జలిం • చెన్ వేలుపుల్ తెల్వి మా
లిన వారైరని యవ్విభీషణుఁ డ తె • ల్పన్ రామ భూజానికిన్.

## ౭౫. రామ రథారోహణ పటలము. (27)

మ॥ కరముల్ మోడిచి నోటఁబెండఁ దసువుల్ • కంపింప బెగ్గిలుచున్
వెరఁ దిప్పెబ్బును పొందు కీశపటుమున్ • వీక్షించి రాముండుఁ కన్
వెరఁగం బొందకుఁడంచు లేచె విబుధుల్ • వేఁడంగ దుగ్ధాబ్ధిపై
నరగేశానుకి సెజ్జ పీడు తటి ను • ద్యోతించు చందంబునన్.

ఉ॥ లేచి కృతాంతు పోలుము • లిక్కఁగఁ జెల్వు నరాజిఁ జెక్కి నా
ఖేచరపాళికిన్ భువని • కీర్తిత పూతకు సీతకున్ సదా
యేచు మహార్తియన్ జఱపి • పెంపఁగఁ జెప్ప లభించె నేఁటికిన్
జూచెద నుండుఁడీ రణము • శోధిల పద్ధతి యంచుఁ బల్కుచున్.

ఉ॥ రాముని దేహమున్ గవచ • రాజము గప్పినదంచుఁ జెప్పఁగా
నేమిఫలంబు ? భావమున • నెంచిన మాత్ర సమస్త వస్తువుల్
రామునిచేరు వేఱొకటి • రాముఁడు లేనిది లేదు సర్వమున్
రాముఁడె కాఁగఁ గంకటము • రాముఁడు కాదొకొ మాటలేటికిన్ ?

తే॥ హస్తములకు సంగుళులకు • నమరఁ గవచ, ములను తొడిగి జగమ్ములఁ • గలుగు ద్రవ్య
ముల విధంబున మితిలేని • యలుఁగులు గల, శరధి వీఁపునఁ దాల్చె దా • శరథి యపుడు.

ఉ॥ విర్జరులార ! సంగరము • నేఁటికిఁ బూర్తిని చెందు మీకు నా
దుర్జనుచే భయంబు విడి • పోరెను రాక్షసు నోర్వఁ గయ్యపుం
గర్జమునందు రాముఁ డెన • కంబున నుండఁగ మీరధంబు నిం
దూర్జిత సత్త్వఁ బాటవికి • నొప్పగ నంచు భవుండు తెల్పఁగన్.

చ॥ సురలను సమ్మతింప బల • సూదనుఁ డయ్యెడ నారథంబు శ్రీ
వరునకు నాలయుంబుగను • శక్తి నొసర్చెదనంచు మాతలిన్
బరఁగ నలంకృతుల్ సలిపి • వైశమ తెమ్మనఁ దెచ్చె నాతఁడున్
బరమ శిషందు బ్రహ్మయును • భానములం బ్రమదంబు నొందఁగన్.

సీ॥ చందురు బింబంబు • క్రింది వలపుగాఁగ, సున్న చందంబున • నుల్లసిల్లి
కులపర్వతముల యు • క్కును గల శిఖరంబు, తిక్కు సంగంబులు • ద్రఢిమగలిగి
వర్షర్తు మాన ది • వారాత్ర భూత ధ, విష్య త్కృతాంగ సం • వితతినొప్పి
తారకాహార యు • క్తంబయి యష్ట మహా నాగ పాశ నం • వానితమయి

తే॥ దెసలె ప్రక్కలుగా మేఘ • విసరమేవ, లాకలుగఁ బంచభూత స • త్త్వంబు నమరి
ప్రళయ జలధి ఘోషమె నేమి • రవముగాఁగ, నదరు నింద్రుని కేరు పు • ణ్యములసొరు.

సీ॥ నలువ పుట్టిన విష్ణు • నాభి పద్మంబును, బోలిన నాడెంపు • మొగ్గ లమరి
జగదుదటుని శేష • నయ్యె యంతటి పట, పంది వేదంబులు • యజ్ఞములును
సాగరంబులు కుల • శైలముల్ భువనముల్, త్రేతాగ్నులును పంచ • భూతములును
తపము లింద్రియములు • దశదిశన్ రేయియుఁ, బగలు గుఱ్ఱాలుగాఁ • బరిఢవిల్లి

తే॥ నిలుచు కేరివి కని మ్రొక్కి • నిర్జరాలి, ప్రభుని యాజ్ఞను వచ్చితి • రామ విభున
కవి జయము గూర్చి మమ్మును • మనుపు మనుచుఁ, బ్రసవములు చల్లి పూజించి • పంపిరంత.

చ॥ మాతలి చోదితంబయి వి • మాన పథంబున నుండి కర్మ సం
ఘాత విరోధి జ్ఞానమనఁ • గ్రాలుచుఁ జిత్రముఁబోలి వేగ వి
ఖ్యాతి యెసంగు కేరు వడి • గాఁ బఱ తెంచి మహీజ చిత్త కం
జాత దినేశు సన్నిధివి • చయ్యన వ్రాలె ఖగేంద్రు కైవడిన్

ఉ॥ అర్యము తేరుగాదు విల • యానల కాంతియు గాదు ధూమకృ
ద్వర్యము గాదజాదుల న • వారణ మోయఁ విమానమేమొ • మే

కార్యముదీర్చెద నేరు కదఁ • కం • దగ నంపి రెవండవీవు ? ప్రా
ఔర్యము గాఁగఁ దెల్పుమనఁ • జోదకుఁ డార్యున కంత విట్లనున్.

ఉ॥ ఓమహనీయ భాస్కర కు • లోదధి సోమ ! గుణాభిరామ ! శ్రీ
రామ ! నిశాచరాన్వయ వి • రామ ! పురారియు ధాత తొల్లి సు
త్రాముని కిచ్చి రీ రథము • దార్ఢ్యముచే జగమెల్ల మోచు న
ద్దాని బలంబు నొందినది • దాశరథీ ! విహరింపు దీనిపై.

సీ॥ కామ రూపంబును • కామ సంచారంబు, గలయది వెన్నుని • కడుపువంటి
వలపయి నీతూపు • పదిగళ్ల యెడ గాలి, తనులను మ్రింగఁ జా • లినది దివియు
భువి యును • భేదంబు • పోరయని దగ్నిని, జలమునం దునుమ పోవఁ • జాలినయది
సాగరంబులు భూమి • జగములు స్థితులలో, మార్పొందు నట్లిది • మాఱకుండు
తే॥ నెలవ చిలుపతాలవు వేయు • పుడును మునులు, శ్రద్ధమెయిఁ దెల్ప మఘవుండు • సాంద్రభక్తి
బంపె నింటెక్కి నీ పగ • వాని గెలువ. యనుమ నశ్వహృదయ చణుఁ • డౌనరఁ బలుక

మ॥ దనుజాధీశ్వరు మాయయో యనుచుఁ జి • త్తంబందు సీతేశ్వరుం
డనుమానింపఁగ రథ్యముల్ నిగుడ వా • క్యశ్రేణిఁ బ్రార్థించి యా
లిని వాక్యంబుల నమ్మఁడీ యితఁడు వృ • త్రద్వేషి పోఢ్యుండు నీ
యనుజన్మంబలె నుండు మాతలిచుమీ • యంచుం బ్రశంసింపఁగన్.

మ॥ అనుజుండున్ హనుమద్విభీషణులు స • త్యంబిద్ది నిశ్శంకమా
సెన దుష్కర్మము లెండ సత్కృతులు స • మ్యగ్రీతి మిట్టాడఁ బొ
ల్పొన నవ్వేల్పుల కేలు మోడ్పు లెసఁగన్ • భూదారుఁ డా తేరు మె
ల్పొన నారోహణ మాచరించె జగమం • మోదంబునం బొందఁగన్

## 36 రావణ వధ పటలము. (253)

భుజంగ ప్రయాతము ॥

జగద్దీపుఁడౌ రామ • చంద్రుండు ప్రీతిన్, నగరాతి తేరెక్కి • సం గాంచి దివ్యుల్
ఖగాధీశ్వరు న్మౌని • కాకుత్స్థుపై నా, తగాత్మంబుపై నింద్రు • సూనాలి చల్లన్

ఆ॥ తేరు నడచుఁగాక • దివ్యుల బలములు, రాముఁ గెలుచుఁగాక • రావణుండు
చచ్చుఁగాక దనుజ • జాయ లేడ్తురుగాక, యనుచు నమరవర్య • లాడుచుండ

ఉ॥ రాముఁడు తేరిపైఁ గదలె • రావణుఁ డయ్యది గాంచి మండి సు
త్రాముని మెండి కిస్కఁసు ర • వంబులు గీఁటుమఁ దేరు సంగరో
ద్దాముని మీఁదికిం జన ని • దల్చెను సారధి రేపి ఘోట సం
గ్రామము సేయు కోర్కి తన • రన్ బలపించెను గాలిపై పడిన్

ఉ॥ ఇచ్చిరి తేరు వేల్పులు ది • నేశ కులేశున కింక రాము దే
గ్రచ్చు దశాస్యునంచు మును • పాఱిన కీశులు ధీరచిత్తులై
వచ్చి గిరీంద్రముల్ శిలలు • వైచిరి రావణుమీఁద నాతఁడున్
జెచ్చెర వానిఁ ద్రుంచి యొక • సింహరవం బొనరించు నంతటన్

చ॥ చెవులను చిల్లు లేర్పడఁగ • శింజిని రావము సింహనా దముల్
దవులఁగ శంఖ దుందుభి మృ • దంగ రవంబులు కాహళ ధ్వనుల్
వివిధములైన గర్జనలు • వెల్వడ దిక్కులతో నజాండ మే
పవిలిన చందమై స్వనము • పర్వె జగంబులు చేష్ట దక్కఁ గన్.

తే॥ మాతలిం గాంచి రాముండు • మహిత చరిత ! యుత్సహించి శాత్రవో • ద్యోగవిధము
నదను నాయభిప్రాయంబు • నల్లనెఱిఁగి, కీడు నడపుము గాఁని తెలుప నతఁడు.

ఉ॥ నీతలఁపున్ దురంగముల • నేర్పును శత్రుల చిత్తమున్ రణ
స్ఫూర్తియుఁ దారతమ్యమును • సంకటపాటనుకూలపాటు మీ
నీతియుఁ బట్టుపట్టు గమ • నించి చరించినఁగాక నాదు వి
ద్యాతిశయంబు సార్థమగు • నా ? యని తృప్తుని చేసె రాఘవున్.

తే॥ ఇంద్ర రథముపై రాఘవుఁ • డేగుదెంచె, నిరువురకు మీకు ఘోరసం • గరము జరగు
నేను సాక్షినై యుండంగ • నేల? యేమి, యాజ్ఞయని మహోదరుఁడు ద • శాస్యు నడిగె.

ఉ॥ సింగము దంతిపై కుఱుకు • చెల్వున దూఁకెద రాము మీఁదికిన్
బొంగడఁగించెదన్ సురల • పొంగును క్రుంగఁగ నీవు లక్ష్మణుం
సంగరమం దెదిర్చిన వి • జంబుగ నాకు జయం బొసంగు దా
యంగునఁ జెంగలీఁక తెగ • టార్పుము వాని ననంగ నాతఁడున్.

రామునిచే మహోదరుండు కూలుట

చ॥ మరలి మహోదరుండు చను • మార్గమునం దెదురైన రాము ఘా
పరుఁగని యానృపాలకుని • పైకి రథంబును పోవనిమ్మనన్
వెరవరియైన సారథియు • పిఱికిడియై చననేల ? పంక్తి కం
ధరు లొక వేవురై చనిన • దాశరథిం జెనకంగ నేర్తురే ?

ఉ॥ వాని గభీర ధైర్యమును • వాని ముఖస్థితి సుంత కాంచుచో
వానిఁ దొలంగిపోవుటయె • వారని క్షేమ పథంబు నావుడున్
వాని మహోదరుండు గని • ప్రల్లద మాడెద వోరి నాదు కో
పానకుఁ బాత్రమై బ్రదికి • బట్టయుఁ గట్టెదవే దురాత్మకా !

ఉ॥ నీదగు కుత్తుకం గొటికి • నెత్తురు ద్రావిన దోసమున్నదే ?
పైదలిఁ బోలవాఁడవని • పల్కిన వాఁడుఁ గిముక్కు నాక పే

తా దయితుం గుఱించి యర • దంబున తోలెను వారికయ్యెడన్
మోదన భేదనమ్ములుగ • ముష్కరమైన దురంబు సంధిలెన్.

తే॥ వారుపంబులు తేరులు • వారణములు, వీరభటులును గలసైన్య • వారిరాశి
రామశర బడబా వహ్ని • ద్రావివైచెఁ, ద్రుటి మహోదరుఁడొంటియై • దొరయనిలిచె

తే॥ ధ్వజముపైఁ దేరిపై వాగె • పట్టియున్న, వోధపై వాఁడు సాయక • పూరమొదవఁ
జేసి దిక్కులు క్రీల గ • ర్జించె రామ, విభుఁడు మందహాసంబు గా • వించె నరవి.

చ॥ టిప సముఁడొక్క బాణమున • వాని శరాసముఁ ద్రుంచి రెంటిచేఁ
గపచముఁ జించి వెంట భుజ • గంబులఁ బోలిన కేలుద్రెంచి దొ
దపులఁ బడంగఁ దచ్చిరము • దారుణరీతిగ నుత్తరించె దా
నపుని తలంపు లొండయిన • నాశివ వేఱొకటయ్యె నయ్యెడన్

పంచచా॥ మహోదరుండు ద్రెవ్వఁ గాంచి • మానవాదుఁ డుగ్రుడై
యహో యటంచుఁ దేరు దోల • నాజ్ఞచేయ రాఘవుం
డాహో సమస్తసేన చావ • కున్న వాఁడు లొంగడం
బుహూత్కృతిం భజించునంత • నుత్తరించె వారలన్.

సీ॥ అత్తఱిఁ గలిగె లం • కాధినాథునకు దు, శ్శకునముల్ గొన్నియు • త్సాహ మడఁగ
నందంబులను ముంబు • నట్టు లుప్పొంగెడు, వననిధు లెల్లను • పట్టిపోవఁ
జండపాయుష్ఠ పీవఁ • జలియించు పర్వత, సరణి నా నెడమభు • జంబు లదరెఁ
బిడుగులు రాలెను • భీకరంబుగ రక్త, వర్షంబు గురిసె వా • ర్వములు వడఁకె

తే॥ ప్రభలు దక్కిన సూర్యుని • పరిధి చుట్టె, నాల్క లెండెను వింటికో • నలును విఱిగెఁ
బుష్పమాలిక లందుండి • పొలచు వీచె, గృధ్రములు వ్రాలె వీజె చె • క్కియముమీఁద

తే॥ తురగముల కన్నులందుండి • లొటుకఁగె నీరు. కరులు బురదలో దిగఁబడు • కరణి నొంచె
మనుజులా గెల్చు వారని • దనుజ విభుఁడు, వాని లెక్కింపఁడయ్యె గ • ర్వంబు కలిమి,

తే॥ విలయ వాయువుచే జగ • ద్వీధియందు, గలుగు వస్తువుల్ చెదరిన • కరణి దనుజ
విరుని రథవేగమునను వా • నరులు చెదరి, విమతులై భీతిగొని త్రోవ • విడిచినారు.

సీ॥ కిర్మీరుబు జ్ఞానంబు • కిరిణి నవిద్యయు, విష్యయు శేషుండు • విహగరాజు
రాత్రియుఁ బవలు హి • రణ్యకశిపు నృసిం, హులఁదోలె దిగ్గజ • యుగళి యట్లు
వివఁ దాదిదేవ ఁ షం • చెదిరించి పోరిరి, యుద్రాభ్యుతుల రేవ • రోషమదర
దిశకింపిరంమున • దశరథసూనుండు, రణరంగమున మహా • రంభులైరి

తే॥ వెంటమెన్నట్టి సంప్ర వి • రించులకును, కరతలంబులు కెక్కలి • కంపమొంద
రావణుఁడు శంఖమొత్తె ని • ర్జరులు బెగడ, రాముఁడును పాంచజన్యంబు • రమణనూఁదె.

తే॥ శ్రీప పంచాయుధంబులు • సేవసేయఁ, గోరి రాముని సన్నిధిఁ • గొలిచి నిలిచె
వేదములు తన్నెఱుంగని • విధిని రామ, చంద్రవిభుఁడును వానిఁగాం • చకయ యుండె

తే॥ దిక్కులును జలధులు ధరి • త్రియు నభంబు, కుల మహీధ్రముల్ బ్రహ్మాండ • గోళమదర
దాశరథికి సారథియయి • తనరుచున్న, మాతలియు నింద్రు చింద మి • మ్మడిగనొత్తె
తే॥ రావణుఁడు వడినేయు నా • రాచ వితతి, సోకుటకు మున్నె ఖేచర • శ్రీకటాక్ష
చయ మనంతమై శ్రీరామ • చంద్ర విభుని, భుజయుగళి సోఁకె నేమి కాఁ • బోవు ననుచు.
క॥ ఇరు రథములందు పూన్చిన, తురగములు పరస్పరంబు • తూఁకొని లోకో
త్కరముల మ్రింగం జాలిన, సరభస కోపమునఁ జూచె • సకిలింతలతోన్
క॥ దానవ నాథుని వీణా, గాన చణతఁ దెలుపు క్రమ • కలిత ధ్వజమున్
మానవనాథుని తేరునఁ, బూనుచు నింద్రధ్వజంబుఁ • బోరిపోరి మోఁదెన్
క॥ దనుజవిభు శింజనీధ్వని, వననిధి సప్తకముఁ గలఁచి • పైచినయది య
మ్మనుజ విభుని జ్యానినదము, వనజభవాంతములఁ గలఁచి • పైచెను తోడ్తోన్.
క॥ హనుమంతుఁ డాదిగాఁ గల, వనచరు లెదిసేయుటకును • పాల్పోవక నె
క్కొని యూరక నిశ్చేష్టత, గొని చూచుచునుండ్రి వారి • ఘోర రణంబున్.
క॥ పెరఁగంది విబుధ వరులె, వ్వరు గెల్తురొ యనుచు నెఱుఁగ • వలను పడక వి
భ్రమ చెడి యిందు నందుం, దిరుగుచు మీ దెఱుఁగలేక • తెరలిరి భీతిన్.
తే॥ రామ శరము లంబరమున • రాణనిండ, వేఁడపులు చల్లుచుండిన • విరులచే న
లంకృతంబులై రాజిల్లు • లలినితోఁచె, దుష్టులకుఁ దోడుపడునట్టి • తుచ్ఛు లెవరు ?
తే॥ వీర శేఖరుఁడగు రామ • విభుని ధనువు, పరులు తాఁకఁగ లేని రా • వణుని ధనువు
మింట నింద్ర చాపద్వయి • మెఱసి యెదిరి, నిలుచు చందాన మిఱుమిట్లు • గొలుపుచుండె.
తే॥ నాఁడు లంకాధినాథుం డొ • నర్చినట్టి, శింజినీ రావమును గొప్ప • సింహరవము
నేఁటికిం దెల్పఁబోయను • నియతినొంది, జలధములును జలధుల ఘో • షణము వించు.
తే॥ దనుజనాథుని తీక్ష్ణంపుఁ • గనులనుండి, చెదరి వెలువడి మిడుఁగుఱుల్ • చిటపటమని
నింగి కెగయంగ నందుండు నీరదములు, కరఁగి వఱపల రాలెను • ధరణిమీఁద
తే॥ కలఁగె దిక్కులు జలధులు • కలఁగె నగలు, కొలగేలును కలఁగె లం • కయుఁ గలంగె
కలఁగ దయ్యెను రాముని • కడఁక సుంత, రావణుని యట్టహాస దు • ర్లలితచేష్ట
తే॥ ధరణియందును మెఱపులు • పరవునట్లు, జలదములనుండి పిడుగులు • జాఱునట్లు
కదనమున పైచు కైదువుల్ • కాంతి చయము, ప్రక్కలం జోరఁ బఱపు • రాలుచుండె.

## రామ రావణ సమరము

తే॥ విల్లుగొని చంప గోరక • తల్లడిల్ల, రాము రథముతోఁ బైకెత్తి • బ్రమయఁద్రిప్పి
భూమిపై మోఁదిమోఁది చం • పుదునటంచు, దలఁచుచుదరు నిదానించు • దశముఖుండు.
క॥ మెఱుపులవలె దశ దిశలన్, మెఱయుచు వడినేగు సెలల • మెలపునఁ దేరిం
బరియలుగఁ జేసి వీనిం, జెఱగొందున యని తలంచుఁ • జిత్తములోనన్.

తే॥ పిడుగుచున్న పినస్సును • కొదరుచున్న, కనలు మిడుఁగుఱుల్లేచెడు • కనుల చూపు
లొయ దనుజనాథుఁడు విల్లు • వెలయ వంచి, పెక్కు మార్గణముల నేసి • విన్నుగప్పె.

క॥ ఉఱుముల నిప్పు పిడుగు జము, నెఱుకుల నాటినవి సురల • నియమంబులఁ బెం
పఱఁ జేసినవి ఫణీంద్రుని, యెఱపుం బోలిన శరమ్ము • లుక్కఱ నేసెన్

క॥ పేరుష్ణము లొలిచి యంతన్, వారక యండములఁ జీల్చి • పైకొను నంచా
ధారకిరణకొన్నువి, శ్రీ రాముఁడు చెంగవీక • చెలగె న్నడుమన్.

తే॥ జలయుతుని పని దుష్కర్మ • ఫలముచేత, నడుమఁ జెడినట్లు లంకాధి • నాథు విశిఖ
వితతి నడుమని విఱుగంగ • విసుగులేక, విలయ జలదంబు లలి శర • వృష్టి గురిసె.

తే॥ కప్పె మింటిని దిక్కులఁ • గప్పె గిరులఁ, గప్పెఁ గన్నులఁ గప్పెను • కడలిఁ గప్పె
బుడమిఁ గప్పె విజ్ఞానుల • బుద్ధిఁగప్పె, నిరులు గప్పె ఖేచరులకు • మరులు గప్పె

తే॥ కాలగళుఁడు దక్కఁగఁ బెరల్ • కనులుమూసి, కొనిరి వజ్రభిన్నములగు • కుధర సమితి
ప్రీలి పిదపక్కైపడి వాన • రాలి చెదరె, నవని విభుఁడు వారల భీతి • నడఁపనెంచె.

క॥ రామ ధనుర్ముక్త శర, స్తోమమ్ములు పరఁగు టీవి • తోయము పెరిగెన్
గామి దనుజాంబరములు దు, ష్కామ కృతఫలంబు వోలెఁ • గడపడి సమసెన్

క॥ త్రుటిలో లక్ష కొండిగ, బటుతర శరములను విడిచెఁ • బలలాశి యటం
చటుకున నడుమన విఱిచెను, చటులోద్ధత విశిఖ తతుల • జలజాక్షుంగున్.

క॥ చండ సమర పటుండగు, గండఁడు రావణుఁడు ముసల • ఖడ్గ ఘనగదా
దండ పరశు శూలాదుల, దండంబులు గాఁగఁ బఱపె • దాశరథిపయిన్

క॥ మేఘ శ్యామల దేహుం డ, మోఘ శరము లొక్కటొకటి • మొన వేయింటన్
బ్రాఘోష మొనర విఱిచెను, శ్లాఘించుచు సురలు కరత • లంబులఁ జఱవన్

ఆ॥ ఇట్లు పోరు సమత • నెనయుచుండఁగ రేఁగి, యీఁచె పోటు గొన్న • యేన్గు భంగిఁ
బంక్తిముఖుఁడు పట్టి • పదికేలఁ బది విండ్లు, పదుల పదులుగాఁగఁ • బఱపె సెలలు.

ఆ॥ రామ విశిఖ తతులు • రావణ సాయక, తండ మెల్లయెడల • దండుకతనఁ
బొరుగాంచు పెంచ • భూతంబు లాదిగాఁ, బ్రమదపాటు గగురు • పాటు మానె.

తే॥ అత్తఱిని దశకంఠుని • స్యందనంబు, మంచరమ్మొ మారుతి తెచ్చు • మందు మలయొ
మొగిఁ త్రిపురములో గంధర్వ • నగరమొక్కొ, యనఁగ వ్యోమ పథంబున • సలరినిలిచె

తే॥ పేఁపై మింట దనుజుండు • చెఱపిలేని, బాణవర్షము గురియింపఁ • బద్మమిత్ర
కులుఁడు చూచుచుండంగనే • కోఁతిమూఁక, చచ్చి చావక తెరలుచు • శంకఁ భజించె

తే॥ రాముఁ డదిగని మనసేని • శ్రమాలుచుండె, నింక నాలసించినఁ గార్య • మిమ్ము దప్పు
వాలి మకుట మస్తకముల • వసుధఁ గూల్తుఁ, దేరు మింటి కరుగనిమ్ము • సారధి! యనన.

తే॥ చిత్రమని మాతలియు నట్ల • చేయునంత, నలఘు రథమును చంద్ర మం • డలముపైకి
వచ్చు వినమండలము వోలె • వచ్చినిలిచెఁ, దేరు తేరెదురై చుట్టె • దిక్కులందు.

తే॥ వారిదంబులు దెసలకుఁ • బాఱిపోయె, రిక్కలును పలపల మని • యుక్కిరాలె
శైలశిఖరము ల్వ్రీలిగె దా • శరధి రథము, రావణ రథంబుఁ జుట్టు నా • రథనమందు.

తే॥ తిరుగు నిలుచుఁ బైకెక్కును • దిగును తగ్గు, దాపలించి వలపలించి • దాఁటుచుండ
నద్రి కూటముల్ జలధుల • నంతతంత, ములును కుమ్మరిసారె చొ • ప్పునను దిరిగె.

తే॥ క్షణములో నెటకేనియు • జరుగుచున్న, రథములం గాంచి సురలది • రాము నరద
మిద్ది రావణు రథమని • యెఱుఁగలేక, యొనరఁ దిరుగుచున్నవి తాఁకు • చున్న వనిరి.

తే॥ చక్రములు తాఁకఁ, బడని బు • క్షములు విస్ఫు, చిందఁ గాలవి శైలముల్ • చీలకుండు
దిశలు నెత్తురు గ్రక్కని • దేహిచయము, కానరాకుండె నా యుద్ధ • కాలమందు.

సీ॥ చూచుచున్నట్టి • ఖేచరులును వారు, నాకలోకమున ను • న్నార లంద్రు
చంద్రలోకంబునఁ • జరియించు వారంద్రు, మందర శైలంబు • నంది రంద్రు
పాలసంద్రము మీఁదఁ • బరఁగు వారందురు, జలధుల కవ్వల • జరగి రంద్రు
ఉత్తర పవరాశి • నున్న వా రందురు, ప్రాగ్దిశఁ జేరిన • వార లంద్రు

తే॥ వారిదంబులయందున్న • వారలంద్రు, నేఁడు లోక సంహారంబె • నెగడునంద్రు
బ్రహ్మతెనె తేరు లంద్రు తు • రంగ తతులు, కావు నిక్కంబు కడనాఁటి • గాడ్పులంద్రు.

క॥ సప్త ద్వీపములందును, సప్తగిరులయందు సప్త • జలధులయందున్
సప్త జగంబులయందును, తృప్తి గొనక యవిలుఁబోలె • దిరిగెం దేరుల్.

క॥ పుడమికి వలవగ నొప్పిన, కడలులలో దీవులన్ జ • గముల గిరుల వి
ల్లడ సొత్తులవలెఁ గైదువ, ఉడరిపిడిపై వానపోల్కి • నసురుండేయన్

తే॥ అవియు జగముల నలయించు • నలపుగలిగి, మలసి రామసాయకముల • వలననడుమఁ
దునిఁగి తునియలై ధరణిపై • దొరలెఁ గాక, వేఱుకార్యంబు గావింప • నేరవయ్యె.

క॥ గిరులపయి శరనిధులపయి, శరదంబులపయిని సకల • జగములలోనన్
దిరిగిన యరదంబులు పడిఁ, దిరిగి యరిగె లంకపైకి • దితిజులు బెగడన్.

క॥ సారథులు రేఁచి నడపిన, వారువములు పేదగొనవు • వాడవు శ్రాంతిం
గూడవు నిలువవు మేఁతయు, గోరవు చెమరింప వడఁగి • క్రుంగవు త్రుటియున్.

తే॥ ఛిదురకటఁ దంపు తేరి స • ఛేద్యగరిమ, పటలు నశని కేతనమును • పంక్తిముఖుఁడు
నిప్పు లురలెడి కన్నుల • నెగడఁ జూచి, యర్ధ చంద్ర భల్లంబున • నవనిఁ గూల్చె.

తే॥ ఆధ్వజంబు పిడుగువోలె • నంబుధిఁ బడి, మునుఁగఁ గాఁచిన యినుపక • ద్దిని జలమున
నద్ద సుడికిన పడువున • నంబురాశి, యుడికి యింకి వట్టినయది • యుత్కటముగ.

శా॥ నార ద్రహ్మముక్తైపడిన్ సతతము • న్నాశంబు లేకుండు శ్రీ
వైదేహీ విభు కేరి సాంతిఁ వద • శ్వ వ్రాతమున్ గ్రవ్యభు
గ్భూదారుండు నిశాత సాయకములన్ • గుప్పించి నొప్పింపఁగా
నాదిత్యాన్వయ వార్ధి సోముఁ డెద న • త్యంతాగ్రహోదగ్రుఁడై.

ఉ॥ తమ్ముని పక్షమందు నిశి తమ్మగు నమ్ములు నాటునాటి కం
పెమ్మదిఁ దావమొందెను వ • టిష్ఠత దైత్యుఁడ విల్లు వంచి కూ్రి
రమ్ముగ నారసమ్ములను • క్రమ్మఁగ నేయఁగ రామచంద్రు చం
దమ్మును గానలేమిఁ బ్రమ • దమ్మును వీడిరి వేల్పులయ్యెడన్

ఉ॥ క్రుంచెను కాంతు లగ్నులును • కుంభిని సంచలనంబునందె స్తం
భించెను గాలి యెండినవి • మేఘసమూహము లార్చిరెల్ల గా
త్రించరు లర్కచంద్రులకుఁ • దెర్వులు దప్పెను దిగ్గజంబులున్
వంచెను శీర్షముల్ జగము • వాడెను ఘోషము మానె నంబుధుల్.

ఉ॥ మేరువు సంచలించెను †ని • మిత్తము దెల్ప విశాఖరిక్షకున్
గారకు డాక్రమించెఁ బ్లవ • గ ప్రభు చంద్రుఁడు లక్ష్మణుండు సు
తారమణున్ రహించి కను • దమ్ములఁ గానమి బొడ్డ యూథపున్
జేరి దంతులట్లు వెతఁ • జెందిరి కందిరి యుమ్మలించుచున్.

చ॥ వనచర వర్గముం దఱి • వారధి వారిధిఁ గూర్చి కట్టుచో
వనచర బృంద ముల్ దెగు • వైనము నొందిరి రాము డంత హె
చ్చిన కినుకన్ నిశాత శర • చిత్ర మహోత్కట వృష్టిఁ జేసి యా
దనుజాని సాయకంబుల వి • దారణ చేసి వెలింగి యయ్యెడన్

చ॥ అసురులు మట్టిసిల్లఁ బ్లవ • గావలి మోదిల జ్ఞానతత్త్వ వి
త్తమగు ధరాత్మజా విభుఁడు • దానవనాథుని కేలనున్న చా
పములఁ బదింటిఁ దున్కలు స • ధంబున కేగఁగఁ ద్రుంచె శాత భ
ల్లములు పదింబదిం బఱపి • లస్తకముల్ మిగులంగఁ జేతులన్.

తే॥ కదలివోల్కి గంభీరుఁడౌ • గరుడుఁడపుడు, దనుజవిభుని కార్ముకములు • తునుఁగుచుండ
నిర్జరుల దుఃఖ నికరముల్ • నీఁగవచ్చి, తనరె నినవంశ్యు తేరి కే • తనముగాఁగ.

చ॥ క్షణమున లోకముల్ దిరుగఁ • జాలిన తార్క్ష్యుఁడు రాము తేరిపైఁ
గణఁక వహించి కేతనము • గా వెలయంగ నిఁకేల చింత లా

---

†కోసలానాంచ నక్షత్రం వ్యక్త మింద్రాగ్ని దైవతం
ఆక్రమ్యాంగారక స్తస్థౌ విశాఖామపి చాంబరే.
కోసలుల నక్షత్రము ఇంద్రాగ్ని దైవతము అగు విశాఖను అంగారకుఁ డాక్రమించెను •
కోసలుల కనిష్ట దాయకము. (వాల్మీ యుద్ధ. 103 సర్గము 33 శ్లో॥

చణుఁడె యపేక్షమై నిలుచు • చందమె చాలదె? యంచు విజ్ఞుల్
ప్రణుతి యొనర్చి సూనములు • వర్షముగాఁ గురియించి రొప్పుగన్.

క॥ పటుశరముల సీతా హృ. త్పుటవాసి సురారి కవచ • మున నచటచటం
బెటబెటఁ బెటులంగ రక్తము, జొటజొట వెలువడఁగఁ గొట్టె • సూటి శరములన్.

తే॥ దిశలఁ దాఁకుచు మేఘ పం • క్తిని చెదరు, శిఖర మొప్పు దైత్యుని వీణ • సిడము రెండు
సాయకంబుల జానకీ • జాని యేసి, నేల గూల్చెను విజ్ఞుల్ • నెగడి పొగడ.

ఉ॥ రావణుఁ డత్తఱిం గడిసి • రాముఁడు తచ్ఛరరాజి నొవ్వమిన్
భావన సేసి యూరకొన • భావ్యము గాదని యెంచి యంధకా
రావహమైన దివ్యశర • మాత్మఁ దలంచి భజించి యెత్తి ధా
త్రీవరుపై వడిం బరపె • దివ్యులు కాంచి వెఱం గలంగఁగన్.

సీ॥ అందుండి వెలువడి • సట్టి కొన్నిటి మొగం, బులు తీండ్ర చంద్ర ని • ప్పులను గ్రక్కఁ
గొన్నిటి మోములు • క్రొన్నెత్తురు వెలార్చె, సురముఖములు మహో • సుర ముఖములు
శూల ముఖంబులు • ఘటగ ముఖంబులు, విషములు నించు ది • గ్వ్రధులందు
తరణి చంద్రులఁగప్పఁ • దమమును కల్పించు, నొకచోట నెండయు • నొనరఁగూర్చుఁ

తే॥ జండమారుత మొక్కచో • సరగవీచు, వర్షమొక్కచోఁ గురియించు • పటుదలొక్క
డెసనుగల్పించుఁ బిడుగులఁ • దివిచిరాల్చు, భ్రాంతిగలిగించిముంచు సం • గ్రామభూమి.

చ॥ ఇరులు సమస్తముం బొదువ • నెల్లరు పాపఫలంబుఁ బొందు వై
ఖరిని కలంకనొంద జన • కాంతుఁడు పాశుపతంబు వేయ నా
యిరులు తొలంగె లోకముల • కెల్లను స్వప్నమువో మెఱఁగువల్
పొరసిన చందమై వెలసెఁ • బుణ్యఫలం బనుభూతియౌ గతిన్

ఉ॥ సత్యము సన్నిధిం జెడు న • సత్యముకైవడి నమ్మహాస్త్ర మా
దిత్య కులేశుచే జెడఁ బ్ర • దీప్త రుషాప్తిని పండ్లు గీఁటుచున్
దైత్యవిభుండు రామునయి • దారుణ బాణము లేసి చేసె నా
దిత్యులు బెగ్గడిల్ల జల • ధి ప్రతిమాన మృగేంద్ర నాదమున్

తే॥ వింగి వారల కీర్తుల • మ్రింగినదియు, జముని కడుపు నింపినది వా • సవుని కడలు
గూర్చినదియు విద్విడ్వ్రళా • ఘోరతరము, నైన యాసురాస్త్రము నేసె • దానవుండు.

శా॥ ఆయస్త్రంబు మహోగ్ర రూపమునఁ ద • న్మంకించు బాణౌఘముం
బాయం ద్రోచుచు రామసన్నిధికిఁ బో • వం జూచి గీర్వాణు లె
ట్లో యంచుం దపియింప రాఘవుఁడు సం • యోజించి పిర్భీతి నా
గ్నేయాస్త్రంబున నాసురాస్త్రమును గ్రుం • గించెం గపుల్ హో యనన్.

చ॥ శమనుఁడు జంకినన్ గడిటు • జంకక పార్థులఁ గ్రోలఁజాలి భూ
ధ్రములను నుగ్గుసేయుచు స • దాగతి గెల్వఁగఁ జాలు నస్త్ర బృం

చములను దైత్యవల్లభుఁడు • దాశరథిన్ వడిఁ గప్పివైచె నా
స్త్రమును గాంచి వేల్పులు భ • రమ్మగు భీతి భజించి రొక్కటన్.

ఉ॥ కొందఱు హస్తలాఘవము • గొందఱు మాయబలంబు సైర్యమున్
గొందఱు దైత్యకోపమును • కోరి నుతింపఁగఁ గొందఱింక మా
యం దులకింప వీలు గల • దా గాని కొందఱు పూర్వమెన్నఁడున్
గ్రందిగు పట్టి వియ్యమును • కానమ యంచు వచించుచుండఁగన్.

క॥ ఇన కులజుఁడు గగనము గ. ప్పిన క్రూరాస్త్రంబులెల్ల • భేదిల్ల వెసన్
ఘన శరములఁ దునిమి వెలిం. గెను తమము మడఁచిన ప్రచండ • కిరణునిపోలెన్.

క॥ అధిక తపో బలయుత సుర. మథనుఁడు బహుసంగరముల • మఱసిన గాంధర్వ
ప్రధనమున గెలుపు నొసఁగిన. క్రథనాద్భుత శిలమయ శ • రంబును పఱపెన్.

క॥ స్రుక్కిరి త్రిదశులు లోకము. లుక్కఱెనని చచ్చితిమని • యూర్చుచుఁ బ్లవగుల్
మక్కిఁ దెసలకుం బరుగిడి. రక్కాకుత్స్థుఁడును దాని • యంతర మెఱిగెన్.

క॥ భూమిని రాముని జీవిత. మే మునిఁగిన వన్ను వగిది • నెసఁగిన శరమున్
రాముఁడు గాంధర్వాస్త్రము. చేమాలిచి నడుమఁ జీల్చి • చిందఱవేసెన్.

క॥ వికటించిన మధుఁడు హిర. ణ్యకశిపుఁడు జగత్త్రియం బ • ణంచినయది పూ
ర్విక నలువ యొసఁగినది యగు. ప్రకృష్ట దండంబు నెత్తి • రావణుఁ డెసెన్.

తే॥ మునుపు తారకాసురుఁడు చే • బూని మొగములఁ, గుతిలపడదానిచేతనే • చితుకఁగొట్టెఁ
గల్పకాలంబు దనుజ జ • గంబులెల్లఁ. జేరి దొరలింప దొరఁని • చేవగలది.

క॥ అండము జలఘటముం బలె. ఖండములై కూలునని జ • గంబులు కలఁగన్
దండము చండగతిని కో. దండధరుని సన్నిధికిని • దాయఁగవచ్చెన్.

క॥ కమలాక్షుఁడు కని యా చం. డము నింద్రుని జే గనుల క • దంగక శత ప
త్త్రిము మొగ్గను పోలిన య. స్త్రము వైచి యొనర్చె వేయి • శకలంబులుగన్.

క॥ చండతరంబుగఁ గార్ముక. పాండిత్యముఁ జూపు రాముఁ • బరిమార్పని యీ
దండాట లేల యని పొర. దిండియు మాయాస్త్రమున వ • ధింపఁ దలంచెన్.

దండకము॥

పూజించి యుగ్రాక్షుఁ గీర్తించి చందంబు న్యాసంబు విద్యుక్తధర్మంబుతో సేవగా
వించి మాయాస్త్రమున్ వింట సంధించి శ్రీరాముపై నేయ నాయస్త్ర మాయా
విధిం జేసి పూర్వంబు శ్రీరామ సౌమిత్రి బాణంబులన్ ధారణిం గూలియున్నట్టి
దైతేయులన్ లేచి హర్యక్ష నాదంబు గావించి రాయింద్ర జిత్తు న్నికుంభుండు
కుంభుండు సేనానులున్ మిన్నుమున్నున్ వెసంగప్పి రా కుంభకర్ణుండు గావించి
బిట్టార్చె సంగ్రామ రంగంబునందుం దురంగ వ్రజంబున్ శతాంగోచ్చయ శ్రేణి

సారంగ సంఘంబులుం జేరి వేవెల్లువల్ శంభుచేతన్ వరంబంది ప్రాణంబులం బొంది యింబారఁగాలేచు చందంబునన్ లేచి బృందారక వ్రాతముల్ చూడ దిగ్భ్రాంతి గల్గించి మున్గెల్చు నవ్వీరులం బిల్చి మాశక్తిఁ జూడుండు మమ్మేర యోడించి నారంచుఁ బేరెత్తి రారండు ఖండాలుగాఁ గోసి పిండాలుగాఁ జేసి వేమ్రింగకే పోదుమే యంచు నిటార్భటింపంగ నాగంబులా భోగి లోకంబు నందుండి ధాత్రిన్ విదారించు కొంచిట్టు లేతెంచె నా నొప్పి భూతంబులన్ శాకినీ డాకిని ప్రేతరాసుల్ జనించెన్ దమంబందు జన్మించిధర్మంబులన్ మ్రాల్చునత్యాద్భుతులున్ ధామసత్రింబులౌ నాయుధ స్తోమముం బట్టి చిత్రంబుగాఁ గ్రాల దంష్ట్రారుచుల్ బాలచంద్రాకృతిన్ వ్రాల దిగ్దేశముల్ నిండి సింగంబులం బోలి గర్జించి చౌగంటులం బోలి వావిప్పి నానావిధాభీల జాజ్వల్య మానానల జ్వాలలం జింద వీక్షించుచున్ దూషణ ద్వేషణోద్భవణ స్ఫార దుర్భాషణంబుల్ వచించుచుండన్ రఘు స్వామి వీక్షించి యేమాయయో నీకు భావంబునం దోఁచునేనిన్ విచారించి వాక్రుత్తువే యన్న నవ్వేళయున్ దేవదేవేశ ! యీ దేవ విద్వేషి కర్మారు వేశ్మంబునన్ నూదు లమ్మంగ నేతెంచు వానిం బలెం బూని నీమీఁద మాయాస్త్ర మిట్లేసి క్షోభింపఁగాఁ జేయ భావించియున్నాఁడు నీపేరు విన్నంత నీనామ మన్నంత భావించి నంతం బటాపంచలై పోవుఁ బాపంబు లెల్లన్ జగన్నాయకా ! నిన్ను నీమాయ యేమేని కావింపఁగాఁ జాలునే ? నీదుమాయందరింపంగ మౌనీంద్రులున్ నేరరన్నన్ విదేహాత్మజానాథుఁ డౌఁగాక యీమాయ యేదేని యౌఁగాక యంచున్ విచారించి జ్ఞానాస్త్రమున్ వింట నంధించి యేయంగ ధర్మంబు త్రోవన్ జనన్ జ్ఞాన సంపత్తి నజ్ఞాన బంధంబుల న్నీఁగులాగై జగంబెల్ల విభ్రాంతిఁ బోనాడి స్వాస్థ్యంబు నొందెన్.

మ॥ గర కంఠుండు చతుర్ముఖుండును మదిం • గాలుష్యముల్ తీఱ సం
గర మందియ్యెడ లోక కంటకులకుం • గార్శ్యంబు నాశంబు చే
కుఱఁ గాక్షించుచు నుండ దైత్యుఁడు మహా • క్రూర ప్రభావ స్ఫుర
ద్వర శూలంబును నూటిగా వినరె సీ • తానాథుపై గ్రక్కునన్.

తే॥ విబుధులకు నాకులత గూర్చి • వేయిగంట, లొరనీ మొగయ వీరుల బల • యోషితలను
విత యొనర్చు శూలము లోక • భీకరముగఁ, దొడరి వచ్చుట రామభ • ద్రుండుకాంచె

తే॥ నెఱసిత్రేతాగ్నులనుమించి • మెఱసిగాడ్పు, దెసలకొదుఁగంగజగములు • దిగ్భ్రమింపఁ
గనులు మిఱుమిట్లు గొనవచ్చు • కఠిన శూల, సాధనము గని సురలును • సంచలించ.

తే॥ నీ వినాశంబు మదిగోరి • రావణుండు, వైచె శూలంబు దీనిని • సైఁచి త్రోచు
శక్తి నీకుఁగా కొరులకు • జగతిలేదు, గెలుము గెలుమని తడఁబడఁ • బలికినారు.

తే॥ పిడుగులును వచ్చువడిఁగాంచి • బిడియ పడఁగ, దన్ను మఱవక ధ్యానించు • తత్పరులకు
నాస్తికులు సేయచుండు వి • ఘ్నంబులట్లు, రామశరములు వితయయి • రాలుచుండ.

తే॥ అరసి రాముఁడు దివ్య సా • యకములేయ, నవియుడానిదాయక మున్నె • యడఁగుచుండఁ
బుణ్యశాపముం బోలె న • మోఘగరిమ, శూల మరుదేర నాతఁడు • చూచె నరక.

తే॥ వేలుపులు దిక్కుతోఁపక • వెనవడిరి, ధర్మదేవత కాళులు • తడఁబడంగఁ
దున్ను మఱచె రాముఁడు భయ • దంబుగాఁగ, వదరె శూలమనుచు లోన • నాకులించె.

శా॥ సంహారోద్యను మొప్ప శూలము జగ • చ్చాంచల్యముం జేయుచున్
రంహోదగ్రత రామచంద్రు పయికిఁ • రాఁజూచి రౌద్రస్థితిన్
సింహప్రక్రియ హుంకరింప నది వి • చ్ఛిన్నంబుగాఁ దూలె దు
ర్వ్యంహోదూషితు యత్నముం బలె సురల్ • బ్రహ్మాదులున్ మోదిలన్.

తే॥ పోయినట్టి ప్రాణంబులఁ • బొందినక్రియ, నొంది రగచరుల్ ఖేచరు • లుమ్మలంబు
విడిచి యాడిరి పాడిరి • విరులవాన, గురిసి వేఁడిరి రావణుఁ • గూల్పు మనుచు.

మ॥ అని వార్యంబగు శూలమున్ దన మహా • హుంకార హుంకార భీ
షణ నాదంబున బీఱువో నడఁచె నీ • సంగ్రామ భీమున్ దురం
బున సాధించుట దెవ్విరంబను తలం • పుం బొంది దేవారి త
మ్మని వాక్యంబుఁ దలంచె; దుర్మదమెకా • పోకార్చు విజ్ఞానమున్ ?

మ॥ వరశక్తిన్ శరశక్తి నెల్ల నిచటన్ • వ్యర్థంబు గావించె వీఁ
డరయన్ భర్గుఁడుకాఁడు విష్ణువును కాఁ • డంభోజ సంభూతికఁ
డిరవారంగఁ దపస్వి కాఁడు జనలో • కే శానుఁడుం గాఁడు దు
స్తర సంసార భవాబ్ధి తారక మహా • తత్త్వంబుగా నెంచెదన్.

మ॥ పరమాత్ముండగుఁగాక వేఱు మఱి యె • వ్వాఁడైన నౌఁగాక ని
ర్భర శౌర్యంబున గెల్చితిన్ జగములన్ • బ్రాంచ ద్యశం బందితిన్
బిఱుదీయం బనియేమి ? గెల్చిన జగ • ద్విఖ్యాతి సిద్ధించు నం
గర రంగంబున నీల్గినం దుదకు మో • క్షంబబ్బు నేలా వెతల్ ?

మ॥ అని చింతించి కడంకతో నిరృతి ది • వ్యాస్త్రంబు ధ్యానించి దా
నిని వింటం దెగఁదీసి రామునిపయిన్ • పేడంగ దుర్వార ని
స్వన హాలాహల భీకర జ్వలిత జి • హ్వా దంష్ట్రి కోగ్ర స్ఫుటల్
పౌనరన్ వెల్వడె సర్పజాలము నభో • భూభాగముల్ గప్పుచున్,

ఉ॥ శేషునికంటె దొడ్డవియుఁ • జీఁదఱ గొన్నవి లోకజాలమున్
శేషములేక మ్రింగునవి • చిల్కు ముఖంబులఁ గ్రక్కుచున్ మహా
భీషణ లీలఁ బర్వ నరి • వీర భయంకరమూర్తి దానవ
ద్వేషి ఖగేంద్ర సాయకము • దీఁడుచు నేసె ఫణుల్ నశింపఁగన్.

ఉ॥ రావణు నస్త్రమాయ బవ • రంబునఁ బర్విన యంతమాత్రకుం
జేవఁ దనర్చు పక్షములు • చిన్నిదవుం బలువన్నె మేచులుఁ

లావగు చంచువుల్ నఖ బ • లంబును శోభిలుచుండు వైనతే
యావలి నిండిపోయె నెట • నారయఁ దార్క్ష్యమయంబుగా నటన్

ఆ॥ లెక్కలేని గరుడి • పక్కులు నోట ని, వ్పులు వెలుంగఁ బరవ • మొనసి సురలు
పక్షులగుచు నోట • వహ్నులఁ గొని లంకఁ, గాల్ప వచ్చినట్టి కరణి దోఁచె.

తే॥ ఫణి ఫణావళుల్ నిప్పుల • పగిది వెలుఁగఁ, గమల నాళంబులను నోటఁ • గవ్వికొన్న
కరణి నాగకులంబులఁ • గాళ్ళఁ బట్టి, చంచు ఖర నఖరముల దా • రించి వైచె

ఆ॥ అట్టి తతిని వినత • తట్టి ఱెక్కలగాలి, వలన భవుని మేన • నలరుచున్న
మందనంబులెల్ల • మఱి మఱి చలియించెఁ, దక్కు వానిఁ గూర్చి • తడవనేల ?

ఆ॥ గండఁడైన రావ • ణుండు మనంబున, • ఎంది యూర్పువుచ్చి • ఖండనమునఁ
జండ విశిఖ తతుల • దండిగాఁ గురిసి కో, దండి కూపిరాడ • కుండఁ జేసె.

ఆ॥ రామ మార్గణములు • రావణు శరముల, రాల్చి మీఱి యేగి రాక్షసేంద్రు
వుష్ట వక్షమందు • వుంఖముల్ గనఁబడఁ, జొచ్చి పొడిచి యానె • శోణితంబు.

చ॥ ఇరువురు హెచ్చుతక్కువ లొ • కింతయుఁ గన్పడనీక ఘోర నం
గర మొనరించుచుండ శితి • కంఠ శిలోచ్చయ మెత్తినట్టి క
ర్బురపతి నేర్చియున్న రణ • వుష్కల విద్యలు తోఁపవయ్యె భూ
వరునకు నంతకంతకును • వర్ధిలె లాఘవ నత్వ సంపదల్.

## రాముఁడు రావణుని తలఁ దెగనేయుట

తే॥ నిర్జరవిరోధి బలము క్షీ • ణించు నదను, గాంచియొక యర్ధచంద్రాశు • గంబుచేత
రావణునియొక్క తలదెగ్రించె • రామవిభుఁడు, జాపవంక్తి నొక్కటిఁగూల్చు • వగిదిదోఁప.

తే॥ వాయు శేషుల వందెంపు • బవరమందు, శ్వసనుచే మేరు శిఖరంబు • జలధిఁగూలు
చందమున రావణుశిరంబు • శరధిఁగూలె, రామచంద్రు నమోఘ శ , రంబుచేత.

తే॥ అమరసంఘంబులు త్రికూట • మడఁగునట్లు, దుమికిగంతులు వైచుచుఁ • దొక్కిరాడి
పాడి వినుతించి తలపాగ • లూడఁదీసి, విసరి యొకరిపై నొక్కరు • వేసికొనిరి

తే॥ ప్రాణి చచ్చియుఁ దనకర్మ • బలముచేత, మరలఁ బుట్టిన చందాన , మడుపునోటి
తోడఁ దల యుదయించె న • ద్భుతము గాఁగఁ దవముచేఁ గాక యట్టిది • తనరు టరిది.

క॥ తెగినవి తెగలేదని వగ, వఁగఁ దగి తుత్రిటిలోన మొలచి • పార్థివ తిలకున్
దెగనాడుచు బగ మాఁడుచు, వగఁ జూచుచుఁ బదరె వదెఁ • బండ్లం గొఱికెస్.

క॥ విషముం గ్రక్కుచుఁ జెచ్చెర, విషధిం బడి శీర్షమవుడు • విషధర శయనుం
డిషణమున నెత్తు మేదిని, మిషలేచి తదీయ విషము • మేకొని త్రావెన్.

క॥ అశని వశమగు పనం గొని, దశముఖముల హుంకరించి • దశముఖుఁడు వెసన్
దశరథ సూనునిపై దశ, విశిఖమ్ములు చొరఁగఁ గ్రోధ • వివశత నేసెన్.

ఆ॥ అక్షరముల కాద్య • మైన యకారంబ, యైన రామవిభుఁడు • వీని శిరము
తెగిన మొలచు ననుచు • వగచి కరంబును, ద్రుంచివైచె నధిక • దోర్బలమున.

తే॥ బాణమునఁదునిఁగినచేయి • పట్టియున్న, యాయుధముల వేఱొకచేయి • యందుకొన్న
వగిది మొలచిన హస్తంబు • పట్టుకొనియెఁ, దెగుట మొలచుట కాంచిన • ధీరులెవరు ?

క॥ మాతలి బలమును కుప్రించం, జేతమునఁ దలంచి యమర • జేత తెగిన యా
చేతిని మొలచిన చేఁగొని, భీతిని ఖేచరులు వఱవ • బిట్టుగ విసరెన్

ఆ॥ పంక్తివదను తెగిన • బలితంపు బాహువు, బాధముగ నురంబు • వగులఁ దాఁక
నొచ్చి శోణితంబు • నోరఁ గ్రక్కుచు రాము, తేరి చోదకుండు • తెరలి సోలె

క॥ సొలసిన మాతలి యసువులఁ, దొలఁగింపఁ దలంచి యసుర • తోమరమును డా
పలికేలఁ ద్రిప్పి వైవఁగ, జలజాక్షుఁడు నడుమ దానిఁ • జదియఁగ నఱకెన్.

క॥ వెండియుఁ గరలాఘవ శర, చండతఁ జూవంగఁ దలఁచి • చండాంశు కులీ
నుం డొక్కొక్క శిరంబును, ఖండించెను నూఱుమార్ల • ఖండిత లీలన్.

క॥ శిరములు దిశాంతరంబుల, శరధుల ధరయందు గిరుల • సానువులందున్
దొరలి దొరలి పిడుగుల క్రియ, గురు రవమునఁ బడియె లక్ష, కోట్లుగఁదోడ్తో.

క॥ గోత్రంబుల వ్రీల్చెను న, క్షత్రంబుల మోఁదెఁ గదలి • జలచరములకున్
జిత్రమగు చావు గలుగ, శ, రత్రుటిత శిరంబు లా శ, రంబులఁద్రావెన్

తే॥ ధరణిఁ బుణ్య ఫలానుభూ • తంబులైన, పిదప నౌత్కృష్ట్య మెల్లను • వ్రీదులుగాదె ?
శవములం దినఁ దిరుగు పి • శాచనమితి, తనయెదురఁ దనకన్నులఁ • ద్రవ్వి తినియె.

క॥ ఇరువది కరములఁ బట్టిన, పరశు ముసల ఖడ్గ కుంత • పట్టిన ఘన తో
మర దండాదుల రావణుఁ, డురవడిమై నేసె రాఘ • వోర్వీశు పయిన్.

క॥ పురుషోత్తముఁడగు రాముఁ డ, సురవర్యు దురాన గెలువ • జొప్పడు వెరవే
కరణి యని యరసి వానిన్, శరరాజి నలంకరింపఁ • జను నను బుద్ధిన్.

క॥ బొమ్మన భుజములపై నే, త్రమ్ముల జిహ్వలను తగ నె • ఱంకులలో ద
ట్టమ్ముగ నమ్ముల గ్రుచ్చి శ, రమ్ముల నిలయ మనఁజేసె • రావణు మేనిన్.

క॥ వదనములఁ గనుల భుజముల, నెదనాఁటిన శరము లచట • నిష్ఠంబుగఁ బె
ల్లిదమగు రక్తము ద్రావక, పదరి యవల దూసి నెఱసె, బ్రహ్మాండమునన్.

తే॥ రోమ తుపంబులందు • • రోమములందు, జీవములఁ గ్రుంగదీసి దూ • సిన శరాళి
పలనఁ జలమును వగయును • వ్రట్టవడఁగ, విహ్వలించెను మిక్కిలి • విబుధవైరి.

## రావణుఁడు మూర్ఛిల్లుట

తే॥ అమరనగరి నూరేగిన • యసురవిభుఁడు, వనధిలోనుండి యెదురీఁది • వచ్చినట్టి
మత్స్యములు రక్తమును గ్రోల • గ్రమానువడుచుఁ, దేరిపై సోలివడియెను • తెలివిదప్పి.

తే॥ దుష్టకర్మము భువినుండి • దొరెచనుచుఁ, బొంగి గంతిరి కపులు వే • ల్పులును మిగులఁ
బ్రభుఁడు మూర్ఛిల్లె ననుచు సా • రథి రథంబు, నవ్వలికిఁ గొనిపోయె ర • థ్యములఁద్రిప్పి

తే॥ స్వర్గవాసుల నొప్పించు • పద్ధతులను. నిశ్చయించి చేసెడు రణ • నీచరాలిఁ
గూల్చ దీక్ష వహించు కా • కుత్స్థ విభు ద్రుఁ, తెలివి దప్పిన రావణుఁ • ద్రెంపఁడయ్యె.

తే॥ అరిదియగు తపోబలమున్న • యసురవిభుని, తెలివివచ్చిన విమ్మటఁ • దెగ్రింప వలను
గాదు గావున నిప్పుడే • కసిమనంగు, మనుచు మాతలి పేర్రిరేఁప • ననఘుఁడనియె.

తే॥ ఆయుధంబులు చే జాఱ • నలసి సొలసి, యున్న శత్రుని రణధర్మ • ముజ్జగించి
చిక్కెనని చంపరా దది • శిష్టవథము, గాదు నాయెడఁదకు నిచ్చ • కంబుఁ గాదు.

తే॥ అనిన యతని సత్పద్ధతి • కాత్మ నలరి, మెచ్చి పొగడెను మాతలి • మెచ్చకుండు
విబుధు లెవ్వరు? పదపడి • వేల్పు లదల, సొమ్మ దేఱి లేచెను దశా • స్యుండు కడిమి.

క॥ అలుక తొలఁకు చూపులతో, సొంపు దెలిసి లేచి రాక్ష • సుండు సకల ది
క్కులఁజూచి రాముఁ డెచటం, దెలియమి సారథిని చండ • దృష్టిం జూచెన్.

శా॥ ఓరీ! వంచక? నీకు రక్షకుఁడనై • యుత్కృష్టుఁగాఁ జేసి నీ
గారామారఁగఁ జూచుచుండ నను లో • కంబెల్ల భీతాత్ముగా
దూఱంజేసితి వాలి గొంచు మన శ • త్రుల్ నవ్వ దుష్కీర్తియుం
గూరంజేసితి నిన్ను దున్ర్రింతునని య • ట్లింం దూయ నుంకింపఁగన్.

ఉ॥ సారథి దైత్యనాథు పద • సన్నిధి వ్రాలి నమస్కరించి లం
కా రమణా! మదీయ పథ • కంబిది చెడ్డది గాదు దొడ్డగా
నారసి నీ యమర్ష హృద • యంబున శాంతి వహింతు గాక నా
సారథి ధర్మముం దెలిసి • నల్పితి దీన దొసంగు గల్గ ౨?

ఉ॥ విక్రమ కార్యముల్ నెఱపి • వీఁగితి సోలితి వందె నిల్చితో
నక్రమ మొందు నా తగవు • ప్రాణములుండవు నీకు నిక్కమీ
నక్రమపద్ధతుల్ జగతి • సారధిజాతికి నిత్య ధర్మముల్
పరాక్రమ భంగమేల యొక • పాటి జయింపుము శత్రు నాజిలో.

ఉ॥ స్వామి ససత్త్వుఁడో విగత • సత్త్వుఁడొ యారయుచుండి దొడ్డ కా
రామి ఘటించుచోఁ బ్రభుని • ప్రాణ చయంబున కొక్కసేగి రా
రామి దలంచి కంచరముఁ • గ్రించరఁ గొంచుఁ దొలంగిపోక పో
రామియె? నాదు దోసమన రాదు మదిం బరికించి చూడుమా?

ఆ॥ అనుచుఁ బలుక దాన • వాధ్యుండు కరుణించి, తేరుద్రిప్ప మనఁగ • సారథియును
రామునెదుట నిల్పె • రావణుఁ డంతట, రణముసేయసాగి • రాముమీఁద.

ఉ॥ వందలు వేలుగా విశిఖ • వర్షము గూర్పఁగఁ జూచి జిచ్చమై
నందఱు వీఁడు క్రొత్త దను • జాధిపుఁడే యని పిచ్చలింప మే

ల్చందము లాఘవంబు గురు • సత్త్వము సాహసమున్ వెలార్చి నం
క్రందన సన్నుతుండు రఘు • రాముఁడు నొవ్వ దురంబు సేయుడున్.

చ॥ అనలము రాఁజుచుండఁ బొగ నార్చుట శక్యము గానికైవడిన్
ధనువు కరంబునం దనర • దానవనాథుని గెల్వ దుష్కటం
బని తలపోసి భాస్కర కు • లాఢ్యుడు రాముఁడు ఘోరసాయకం
బున దనుజేంద్రు విల్లు వరి • భగ్నముగా నొనరించె గ్రక్కునన్.

చ॥ సలుపయొనంగు కార్ముకము • నాశముగా దళకంరుఁ డుగ్రుఁడై
బలువిడి విండు లొక్కొకటి • పట్టుచునుండఁ గ ద్రుంగుచుండఁగా
నలిగి జయేందిరా రమణి • యవ్వలికేగ మునుండి ముద్గరం
బులు గద తోమరాదులను • భూరి బలంబున వైచె నొక్కటన్.

శా॥ వానిం ద్రుంచి నభోంతరంబుననె దు • ర్వార స్ఫుర ద్బాహు న
ర్త్యానూనుండగు పీ దలంతుల జనం • దగ్గంబు గా దంచు వి
జ్ఞానశ్రేష్ఠుల కంటిపాపలను • న్మానంబుగాం దూఱి తా
నానారీతులఁ జిత్తమందు సురజి • న్నాశంబు చర్చించుచున్.

## రాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణుం గూల్చుట

మ॥ రుది బ్రహ్మాస్త్రముచేత వీని యసువుల్ • ద్రుంగింతుఁ గాకంచు దా
మదిఁ దీర్మానము చేసి రాఘవుఁడు న • మ్మానించి తన్మంత్రమున్
బ్రదరంబుం దరు భంజకంబు కపిరా • డ్వక్షో మహీధ్ర చ్ఛిదా
ఛిదురంబుం గొని బిట్టుగాఁ దిగిచి యు • ద్భీమంబుగా నేసినన్.

క॥ ఎరవలియును కరువలియును, దరి యరయఁగరాని శరము • ధాతృ నబీజా
క్షరమై నలు మొగములతోఁ, బఱచె దరుల బెరయ నిరులు • పఱవవెలుఁగుచున్.

సీ॥ విలయ కాలంబున • విలసిల్లు భానుండు, మిదుగుఱుఁ బురుపను • వడువు దోఁప
ధరణియు దిశలు నం • బరమును జగములు • దిట దప్పి దిర్దిరఁ • దిరుగుచుండ
సర్వ లోకేశ్వరు • చక్రంబుతోఁ జేరిఁ నలువ • యస్త్రమధిక • బలమునొంది
మూఁడు కోట్లాయువు • మొనసి చేయు తపంబు. పనజాననుం డిచ్చు • వరచయంబు

తే॥ దిశల గెలిచిన తద్భుజో • దీర్ణ బలము, శిథిల మొందంగ వక్షంబుఁ • జించి చొచ్చి
ప్రాణవాయువులం గ్రోలి • పరఁగ నవల, దుండుకుని పెను పీ • పున • దుస్సి పోయె.

ఉ॥ ఆహవమందు దానవుఁ దః హంకృతి దూలఁగఁ గూలఁ గాంచి కో
లాహలముం బొనర్చి చద • లం గల వేల్పులు చల్లు పూలతో
భూహితమున్ వచించి యటఁ • బోయి పయో జలరాశిఁ దేలి వై
దేహి హృదీశు దూణమునఁ • దేఁకువఁ జొచ్చెఁ దదంబకం బొగిన్.

శా॥ శ్రీరామాస్త్ర విభిన్న వక్షుఁడయి య • క్షీణ ప్రతాపుండు ర
క్షోరాజన్యుఁడు శీర్ష భూషణ తతుల్ • క్షోణిం బ్రకీర్ణంబుగాఁ
గ్రూరోగ్రాక్షుల మిగ్గుబుల్ చెదరఁ బి • ర్గుం బోలు ఘోషంబుతోఁ
దేరం జాటి యధోముఖుండగుచు ధా • త్రిం గూలె దుష్కర్మచే

ఉ॥ కోప మడంగ మాననము • క్రుంగఁగ మాయ తొలంగ కామభృ
త్తావము మ్రింగ నత్త్వ నము • దగ్రిత చెంగ యశం బొదుంగ నా
లావిత దుర్వచస్సులు క • లంగ దశాస్య ముఖంబు లత్తఱిం
దావసులం గలంచు బెడి • దంబునకంటె వెలింగె ముమ్మడిన్.

చ॥ అరదము ధాత్రికిం దిగుడు • నంబుద దేహుఁడు డిగ్గి క్రిన్యభు
గ్వరుని శరీరమున్ దనివి • పాఱఁగఁ గాంచఁ దలంచి దాని కా
వరుని సుహృద్వరుం బలెనె • భావనసేయుచుఁ జూచె; లోక భీ
కరుఁడగు శత్రువైన మృతి గాంచిన పిమ్మట మిత్రుఁడే కదా!

రాముఁడు రావణుని వీఁపునందలి గాయములఁగాంచి శంకించుట

చ॥ మరలి దివంబు చేరుమని • మాతలి నంపి సుమిత్రినూతియున్
దరణిసుతుండు మారుతియుఁ • దక్కటి వీరులు చుట్టిరా వెనన్
బరులకు వీఁపు చూపని సు • పర్వవిరోధి గురు స్వరూపమున్
బొరిపొరిఁ జూడసాగె సుర • పుణ్య ఫలోదిత మూర్తి యింబుగన్.

ఆ॥ రామ సాయకమున • రణధాత్రిఁ గూలిన, రావణుని వది శి • రంబులవయిఁ
బృష్ఠభుజములందు • వీకున నాడిరి, కవులు గిరులమీఁద • గంతినట్లు

తే॥ వాని మొగులుఁ బోలిన పృష్ఠ • భాగమందు, ద్విరద రదన ఖండంబులు • విభుని లేఖ
లట్లు తొడవులై మొవ్వ వ్రి • ణాంకములు శ, లంకముం బోలి గాన్పించు • లలినిగాంచి

ఉ॥ జానకికై జనించిన రు • షా భరణంబు దురాత్ముఁడైన యా
దానవురూపుతోఁ దఱిగి • తాఱఁగ రాముడు శత్రు పృష్ఠ భా
గాన స్ఫుటంబుగాఁ దెలియ • గాయము కాయను గొంచి నా మహా
నూన పరాక్రమంబు వెలుఁ • గొందదుగా ! యనెఁ బిన్న నవ్వుతో.

చ॥ జగముల గెల్చి యేనరినఁ • జచ్చు కతంబున రావణుండు తాఁ
బగతుర మున్నెదిర్చి పొల • వంబుగఁ జేసిన పోర వీఁపునఁ
నగిలిన పుంటికాయలు వి • తావిత చేసెను మద్బలిష్ఠ దో
ర్యుగళ పరాక్రమంబు నని • రోధ కలంకముఁ గూర్చి చెల్లరే!

తే॥ కార్తవీర్యునిచే వీఁడు • కట్టువడిన, చరిత విని వీడితోడి మ • చ్చరము నాకు
నొదవెఁగా యని లజించు • చుండ నిపుడు, వీని వీఁపు గాయంబులు • కానఁబడియె.

తే॥ మచ్చరుల గేలి యశమును మలిన పఱుప, వెన్ను వగలకుఁ జూసిన • వీనివలన
గలుగు గెలుపు మెచ్చందగు • గెలుపుగాదు, దీనివలనఁగీర్తియురాదు • తెగడు దక్క.

తే॥ అనినవినివిభీషణుఁడుదుఃఖాశ్రుకణము, లొలుకఁబరిత ప్తహృదయుఁడై • పలికెనిట్లు
వ్రభువరా! యనమంజన • వాక్యములను, నీవ పలుకంగ నేమన • నేర్తునయ్య!

చ॥ భుజములు వేయిగల్గిన నృ • పుండును వాలియు నొందినట్టి యా
విజయము నిక్కమైనదియొ? వేల్పుల శాపముచేతఁ గల్గె నం
బుజదళనేత్ర! లోక వరి • పూత వయింగల కామబాధచే
గజిబిజి చెంది దీల్పడియెఁ • గాక యలంతులఁ బోవువాఁడొకో?

చ॥ కడిమి నిరస్త శాత్రవము • గా భువనంబు లొనర్చి పేర్చి యె
య్యెడ నెదురేది లేక చరి • యించుచు దిగ్గజ దంత నంఘముల్
తొడిఁబడి యాడ్వఁ గ్రుచ్చికొని • తోఁచు కిణంబులుగాక శత్రు లె
క్కడ? యితనిం జయించి వెను • గాయముసేయుట యేడ? భూవరా!

క॥ ఆయవ విక్షంబునకుం, జేయని తొడవులుగ యముని • చేతి మహా దం
డాయుధము హనుమ ముష్టియు, నియనువున వెలికిఁదోృవ • నిటు గన్పడియెన్.

చ॥ చెలసిన కాలకూట మొగిఁ • జిచ్చులకంటిని మ్రింగినన్ మహా
బలయుత నర్పజాలములు • పక్షులరాయని గెల్చినన్ జగం
బులఁ గల వీరవర్యుల వ్ర • పుష్ట భుజాంతర సీమఁబేర్చి య
గ్గలికను నాటు కైదువులు • గాఁదఁగజాలవు వీని ఁొమ్మునన్.

మ॥ చరురంభోధి పరీత భూతలము దం • ష్ట్రిం గ్రుచ్చి క్రోడంబు న
మ్మఁటితో నిల్చిన మీఁద లోకములు మా • మందారితఁటన్ ద్రిమ్మటల్
వెత లేనాఁటికిఁ దీఱునంచు మది నా • వ్విం బొంకె నీచేత నీ
గతి లంకేశుఁడు పొంద వీని మృతి నిం • క న్నమ్మకుండెం గదా!

మ॥ అన నాఁగాకని రాఘవుండు మది న • త్యంతంబు విశ్వాసముం
గొని నీయన్నకు సాంపరాయిక విధుల్ , గూడంగఁ జేయుంచి ర
మ్మనుమానంబును వీడుమా ధరణి వై • రాదుల్ మనుష్యుండు చే
తనుఁడై యుండెడు నంతదాఁకనె చుమీ • ధర్మజ్ఞ! చింతింపుమీ!

ఆ॥ అనుచు నతని నంపి • యదలు తీఱఁగ వచ్చి, మోదమంది తనకు • మ్రొక్కుచున్న
నిఖిల నిర్జరాది • నిచయంబుఁ గనువేడ్క, నెదురుగాఁగ నడచె • నినకులుండు.

## విభీషణుని చింత

ఆ॥ అన్న దొనఁగురెల్ల • మన్నింపఁదగినవి, పొమ్మనంగ నతఁడు • పోయి యగ్ర
జన్ముఁగాంచి పట్టఁ • జాలని పెనుచింత, లోన మునిఁగిపడియె • వానిమీద.

ఆ॥ జగతి జీవులెల్ల • జాలినొందఁగ ఖేచ, రులును మౌనులును క • రుణ వహింప
రాలుఁ గరఁగ నేడ్చి • రావణు పైఁబడి, పలువరించె నిట్లు • బహు విధముల.

సీ॥ హా లోకభీకర ! హా మేరునిభ ధీర ! అద్వంద్వ శూర ! మా • యా ప్రకార !
ఉండుచోఁ ద్రిదశ కు • లోన్మూలి వైతివి, చచ్చుచో ననుర వం • శముఁ జెఱిచితి
మ్రింగిన గరళంబు • మేకొని చెఱచు జా, నకి యను విసము కా • నఁగనె చంపు
వలదని యానాఁడె • పలుకంగ వినవైతి, వింక నేఁటికి వినంగ • విచ్చగింతె •

తే॥ పర కళత్రంబుఁగొంట య • భావ్యమంటిఁ, దొలఁగరాని యపఖ్యాతి • దొరయునంటిఁ
గోరవలదంటి వైరంబు • కూడదంటి, వంశము నశించునంటి నా • పలుకువింటె ?

శా॥ నాఁడగ్నిం బడినట్టి వేగవతి యా • నాఁ డుర్వరా జాతయై
యాడంబోవక దైత్యనాశమునకై • యిచ్చోటికిం జేరె నీ
జాడ ల్వ్రేలని యెంతచెప్పినను రో • షస్ఫూర్తి మన్నింప కి
ట్లీడాగోడము చేసికొంటి కుల శౌ • ర్యేచ్ఛా విభూత్యున్నతుల్

ఉ॥ కారుణికుండు రాముఁడని • కామిని నిమ్మని సంధిమేలనం
గా రహి వీడకుంటి వర • గౌరవముల్ పసి శిక్షముల్ వృథా
ధారుణిఁ బొర్లుచున్నయవి • తప్పక నాపలుకిప్పుడైన సీ
తా రమణుం డనాది పర • తత్త్వము సుమ్మని నమ్మికే దివిన్.

శా॥ వీరస్వర్గము చేరితో ? నలువ మే • ల్వీటం బ్రవేశించితో ?
తారాద్రిం దగఁ జొచ్చితో ? యెవఁడు నిన్ • దాకొంచు నీజీవ సం
చారంబుం గొనిపోయె ? కాలుఁడో ? లన • చ్చంద్రాంశువుల్ నేఁడు చ
ల్లారం గల్గెనె ? మారనాటకము నేఁ డైనం దుదిం బొందెనే ?

చ॥ నగఁసని చంపుచేఁత తన • మానసమందిడి చుప్పనాక యా
పగ గొనితెచ్చి యిచ్చి తన • పంతము నెగ్గఁగఁ జేసికొన్న దీ
పగిదిగ నారకానఁ గలఁ • పాపులు స్వస్సుఖమొందు పుణ్యులున్
బగఱుగ నైరి యెల్లిదపుఁ • బాటున నేఁ మొగంబు గాంతువో ?

మహాస్రగ్ధర.
విజయశ్రీ పంకజాక్షిన్ • విమలగుణయుతన్ • విశ్వ సాహిత్య లక్ష్మిన్
భుజమేధా శక్తి యుక్తిన్ • భువన విజయ వి • స్ఫూర్తి నాసించు చేతుల్
త్రిజగన్మాతన్ బ్రపూతన్ • త్రిదశగణనుతన్ • పృథ్వి సంజాత సీతన్
బొజుఁగై స్పర్శించు నిచ్చన్ • భువినె తడవఁగాఁ • బూర్ణ సంసిద్ధి గంటే!

తే॥ అనుచుఁ బనవు విభీషణు • నవలికీడ్చి, విధి నెఱింగియు మతినెద • వెగపనేల ?
లెమ్ము కాఁగల పనుల నా • లింపు మనుచు, భల్లుకేశుండు లేపి సాం • త్వనముపలికె.

## మందోదరి విలాపము

మ॥ విరియం బాఱిన కేశపాశములతో • వ్రేలాడు హారాలితో
నురుఁగం బాఱిన మూర్ఛ చిత్తములతో • బొబ్బిల్లు కన్నీటితోఁ
గరముల్ ఱొమ్మున మోఁదికొంచు వడి లం • కానాథు కాంతల్ పరా
మరిసల్ లేని విధంబునన్ జరగిరా • మందోదరీ యుక్తలై

తే॥ పొలుపు సత్యంబు ధర్మంబు • భూతదయయుఁ, గలుగుకులమునఁ బుట్టిన • ఘనుఁడుసిగ్గు
వదలి చేయు కార్యమువలె • వాయి విడిచి, యేడ్చు కాంతల రవ మెల్ల • యెడలఁ బరవె.

తే॥ కాలియందెలు మొఱపెట్ట • గజ్జెలేద్వఁ, గొంద తేగుదెంచిరి రణ • క్షోణి కపుడు
కొందఱు పురందరుని పగఁ • గూలె ననుచు, నచటనే జీవముల వీడి • రవని దొరలి

తే॥ ఘోర శోకంబు గందర • గోళపఱుప, నందముం జెడఁ దొడవులు • చిందుచుండఁ
గనుల నశ్రుజాలము మబ్బు • కరణిఁ గురియ, వనరి విచ్చత్రోవఁ గొందఱు • వచ్చినారు.

తే॥ తలలు మోఁదుకొనెడువారు • తడవువారు, కనుల నీరూర నాడళ • కంఠ బాహు
పీఠముల మీఁదఁబడి సూత్న • విగత భర్తృ. శోకమున నేమి యెఱుఁగక • సుక్కినారు.

తే॥ పదములను ఱొమ్ము భుజములు • వదనములును, దొడిఁబడఁగఁ బలుమాఱులు • తడవి తడవి
యేడ్చి యేడిచి నాలుక • లెండఁదాఱ, తెలివి దప్పి ధారణిపయిఁ • దెరలినారు

ఉ॥ పొందిరు మున్ను దుఃఖములఁ • బొందిన నెప్పుడో పొల్లయల్కయే
పొందుదు రద్దియుం దునిసి • పూర్ణ సుఖప్రద మంచు నెమ్మదిం
గొందురు దైత్యకాంత లిటు • గూరిన యార్తి భరింపలేక యా
దెందముపైని వ్రాలి శట • డిందిన ప్రాణము రోయుక్తై పడిన్.

తే॥ జక్కసులు రక్కసులు నాగ • చంద్రముఖులు, సిద్ధ సఖులు విద్యాధర • స్త్రీలు బేల
మోహముంచుటచే శోక • మున మునింగి, తడవి తనివి సనక చాలఁ • దల్లడిలిరి.

తే॥ ధర్మము సతిసెప నెదఁజేర్చు • ధరణిజాత, మీఁది మరులున మమ్ముప్రే • మింపవైతి
దానిచేఁగాదె యీగతి • తనకెసిఁకు? దాని వదలి మమ్మిపుడైనఁ • దనుపరాదె?

తే॥ అనుచు తోల మందోదరి • యలమటించి, కడలిపై మించు వ్రాలిన • కరణి విభుని
వక్షమున వ్రాలి శిలలును • వృక్షములును, కరఁగి తోడన పలవింపఁ • గనికరించె.

చ॥ అసుర మృగేంద్ర! నీవుస్మృతి • నందిన విమ్మట నేను నంచుటల్
దొసఁ గతి దుర్భరం బటంచు • దుర్వృత మక్కటః నాదు సన్నిధిన్
బొసఁగిన యివ్వి నీమకుట • భూషిత శీర్షములే? కదించి నా
వ్యసనము మాన్పవో? వదన • పద్మ వికాసము చూపవో యిఁకన్,

చ॥ ఎలరిచి వెండికొండ భరి • యించిన నీ పెనుమేని శోభలన్
వెలుపల నావగింజ యెడ • వీడక తొల్చి యసువ్రజంబు ని
ట్టలముగ రోయుతీరా ? హృద • యంబున జానకిమీది ప్రేమ లో
వల౯ గలదంచు నారసిన • పద్ధతియో ? యిది రామబాణముల్ ?

చ॥ అలయక రాము తూపులు గు • హాముఖముం బలె తొమ్ముఁ దొల్చి య
వ్వల౯ జనియున్న వక్కట ! త • పంబును దార్ఢ్యము వీర్యముం జెడన్
బొలిసితివే ? యిఁకేది గతి ? ఘో • రితరోగ్ర శరంబొకండు ని
మ్మళముగఁ గ్రోలె జీవముల • మానుషశక్తియు నింత యొప్పునే ?

మ॥ వనితాజాతికి భూషణంబయిన యా • వైదేహి యందంబు త
ద్ఘన పత్నిత్వము దైత్య నాసికయు లం • కారాజ్య కామంబు రా
ముని కాంతార నివాస నిర్ణయ విధం • బుం గూడి జంభారి చే
సిన పుణ్యంబుగఁ బూర్తియై పరిణమిం • చె న్నాకు నే డీగతిన్.

చ॥ అమరుల దిగ్గజంబుల న • మాపతి ధాతృ ముకుంద జిష్ణులన్
సమరమునందు మించిన య • సాధ్య బలాఢ్యున కెవ్వటన్ వినా
శము కలదే యటంచు నెల • సంబున నుండితి నీ మహాతపః
క్రమ ఫల జీవితంబునకు • రాముఁడు పుట్టెఁ గృతాంతుఁడై భువిన్.

చ॥ కొమరుగ నొందు మూఁడు నలు • కోటికి మేర వచింపరాని స
త్త్వమునకు జీవితానకుఁ ద • పఃఫలరాశికి నింక నాశ మే
క్రమమున వచ్చునంచు మది • గాఢ తరంబుగ నమ్మియుంటి సీ
తమ యను ఘోర హాలహల • మక్కట యన్నిటి మ్రింగె వ్రేల్మిడిన్ ?

చ॥ జగము స్వభావ మిట్టిదని • సత్య మెఱుంగు సమర్థు లెవ్వ రీ
జగముల నెల్ల గెల్చిన ప్ర • శస్త బలిష్ఠులు నిల్చిరేమి ? యిం
పగు వి[illegible] నాటి పువు • టమ్ముల గల్గిన శంబరారికే
యగడుపడంగఁ జిక్కిన బ • లాఢ్యుని నాశము చేయరే నరుల్ ?

తే॥ రాము నెంచితి నాడి నా • రాయణునిగఁ, దెలియ కిట్టు లుత్తముని ప • త్నినిచెఱగొని
వచ్చితివి తత్ఫలం బను • భావ్యమయ్యె, నిప్పుడైన నియ్యది నీకు • నెఱుఁగరాదా ?

మ॥ అని చింతాకులితాత్ముఁడై కడచి య • త్యంతంబు దుష్ప్రాప వే
దన నిండార గశీర్ణ హారమగు త • ద్వక్షంబు హస్తంబుతోఁ
దనియం జేరిచి తృప్తిమై నతని నా • థా ! యంచుఁ బేర్వాడి యం
తన నిశ్వాసము నిల్పె జీవము లనం • తర్లీనమై పోవఁగన్.

తే॥ అమరకాంతలు విద్యాధ • రాంగనలును, మునిసతులు నాగ తరుణులు • మనుజ సఖులు
పెక్కుగతుల మందోదరి • పెద్దతనము, వేయి నోళ్ల శ్లాఘించిరి • వేళయందు.

సీ॥ అంత విభీషణుఁ • డంతరంగంబునఁ, జింతించి క్రమరీతిఁ • జిచ్చుకొలిపి
సంస్కారముల నెల్ల • శాస్త్రోక్తముగఁ జల్పి, శవముల నుంచెఁ గా • ష్ఠములమీఁద
వాద్య స్వనము లెల్ల • వారి రవంబుల, వినవీక మిక్కిలి • విస్తరించె
సిదమును లెల్లని • గొడుగును తోడరా, నతని పత్నులును వె • న్నంటి నడవఁ
తే॥ జుట్టివచ్చి యిర్వురకుఁ జి • చ్చును రగిల్చి, చేయఁదగు క్రియలెల్లను • చేసి యవలఁ
దక్కువారికిఁ గూడ నా • తండె యుక్త, కర్మము లొనర్చె బడి నుద • కంబుతోడ.
ఆ॥ అవల వచ్చి రాము • నంఘ్రి పద్మములకు, మ్రొక్కి నతఁడు నతని • హీనుఁగు గాంచి
లోక సహజ మిద్ది • నీకు సమ్మతిక మి, ట్లొందు టుటవె యనుచు • నూఱడించె.

## 37 శ్రీరామ నివర్తన పటలము 358

తే॥ బహుళ శాస్త్ర మర్మంబులఁ • బ్రకృతినైజ, ధర్మముల నెఱిఁగించి యా • దైత్యరాజు
నూఱడించి లక్ష్మణుఁ గని • యొప్పుమీఱ, నిట్టులనియె రాముఁడు ప్రేమ • మెసకమెసఁగ.
ఆ॥ అర్కసుతుఁడు మారు • తాత్మజుఁడును తక్క, కపివరులును వెంటఁ • గదల వేగి
నీతియుతుఁడు యామి • నీచర విభునకుఁ, బట్టమొనర నీవు • కట్టుమయ్య.
క॥ అని యాజ్ఞచేసి పంపఁగ, ననిమిషులు దిగీశులప్పు • డగునంతకుఁ బ్రే
మను శక్తి కొలఁదిఁ దోడ్పడి, పనులొనరించిరి విశేష • పరతంత్రులుగన్.
ఆ॥ పుణ్య తీర్థములను • మొగులు జలంబుల, జలధి జలము హార • సమితి సింహ
పీఠి బొఁడికమ్ము • ప్రీతితో వేల్పులు, తెచ్చి కొఱఁతలేక • యిచ్చినారు.
ఆ॥ అటుని యాజ్ఞవలన • హరిణముఖుఁడు మ, యుండు వచ్చి హరిహ • యుఁడు భవుండు
పొగడఁదగిన పగిదిఁ • బూజ్య విధంబుల, మంటపంబు గూర్చె • మండనముల.
తే॥ విధ్యుక్తంబుగా బ్రహ్మవి • విబుధవరులు, పుణ్యతీర్థాభిషేకంబు • పొసఁగఁ జేయ
నన్న యాజ్ఞానుసారి రా • మానుజుండు, ప్రీతిమకుటంబు వెట్టె వి • భీషణునకు.
ఉ॥ నీలగిరీంద్ర శృంగమున • నీరజ మిత్రుఁడు తోఁచు చందమై
నీలమణీ విభాసిత వి • నిర్మల పీఠి విభీషణుండు మో
దాలసుఁడై కిరీటయుతుఁ • డై తగు బంధువులైన పూర్వ దే
వాలి భజింప వాసవుని • యందమునన్ వెలుఁగొందె నత్తఱిన్.
తే॥ సురలు దివ్య సుమములఁ • గురిసినారు, తావి పూవుల సిద్ధ సా • ధ్యావలులును
చిందఁజేయఁ ద్రిమూర్తులు • శిష్టమౌని, జనము లాశీస్సుమంబులఁ • జల్లినారు.
తే॥ నవ్యమకుట భూషణుఁడు దా • నవవిభుండు, భక్తితోడను సౌమిత్రి • పాదసరసి
జాతములకుఁ బ్రణామంబు • సరవిఁజేసి, పలికె విశదఫణితి నెల్ల • వారు వినఁగ.
తే॥ ఏను శ్రీరామ సన్నిధి • కేగి మరలి, వచ్చునంతాఁక నీలంకఁ • బ్రాభవమునఁ
గొఱఁతలేక పాలింపంగఁ • గోరినాఁడ, ననుచుఁ బ్రార్థించి యొప్పించి • యచటి కరిగె.

సీ॥ కపికులేంద్రుని తోడ సం • గదుని తోడ, వచ్చి పదముల కెఱఁగిన • వాయుదైత్య
విభుని రామచంద్రుండు సం • ప్రీతితోడ, నలమి మృదు భాషణంబుల • నల్లనయియె.

చ॥ పవిగొని మూఁడు లోకముల • వారు నుతింపఁగ దేవతాలికిన్
జనులకు నీతిపద్ధతికిఁ • జిక్కటికిం దగురీతి నిల్పి శ్రీ
యును సుకృతంబు కీర్తియు న • మున్నతి నొందఁగ రాజ్యభారమున్
గొని సుఖమందుమా యనుచుఁ • గొన్ని హితోక్తులు పల్కి పిమ్మటన్.

## హనుమంతుఁడు సీతకు రామ విజయము తెల్పుట

చ॥ హనుమనిఁ గాంచి నీవు జన • కాత్మజ యున్న వనంబు చేరి యిం
దొనరిన యెల్ల సంగతుల • నొప్పుగఁ దెల్పుమ యన్న నాతఁడున్
చనిచని వాయువేగమునఁ బావని జానకి యున్న చోటికిన్
జని వసివాడియున్న విర • జాజికి వర్షమువోలెఁ గన్పడెన్.

చ॥ కనఁబడి మ్రొక్కి భానుకుల • కాంతుని నామము నుచ్చరించుచున్
దనియక గంతులేయుచును • దాళము వైచుచుఁ బాటపాడుచున్
జనకజ తన్ను గాంచియె ని • జంబు గనుంగొనఁ బెక్కురీతులన్
గునియుచు నెట్టకేని నుమ • కోమలి పాదము దాపి యిట్లనున్.

చ॥ శుభము శుభమ్ము మంగళము • శోభనదేవతకుం జయమ్ము మే
ల్లాభములు తల్లికిన్ దనుజ • సూదనజాయకు భద్రముల్ సుర
ప్రభృతులు సంతసింప రఘు • రామ మదేభము యామినీచర
వ్యభిజన సారసాకరము • నంకిలి వీడి కలంచెఁ దల్లిరో!

ఉ॥ రావణ మత్త నాగమును • రామ మృగేంద్రము చించిచెండె ర
క్షోవిభు మస్తకంబులు వ • సుంధర దొర్లెను వాని బాహువుల్
ప్రేవులు నక్కలీడ్చెను శ • రీరముమీఁద నెఱంగె గ్రద్దలుం
గావరు కన్నులం బొడిచి • కాకులు దిన్నవి సంగరస్థలిన్.

క॥ తోషమతి రామునాజ్ఞ వి, భీషణు నియమమున లంక • వీథుల మర వి
ద్వేషుల కాంతలు దక్కఁగఁ, భాషింపఁగ నొక్క యసుర • బ్రతుకం దయ్యెన్.

క॥ అమృతము పించిన యావా, క్యములన్ విని యొక్క కళను • గల రేక క్రమ
క్రమమున వర్ధిలి యంకము, సమసిన విధుఁబోలి జనక • జాత వెలింగెన్

ఆ॥ రాహు గళితమైన • రాజబింబము వలె, ధరణిజాత ముఖము తనరఁ గాఱుఁ
గేలు దొమ్మి మనము • లీలఁ బూరించెను, మేరలేక ముదము • మీఱుకతన

ఆ॥ కార్శ్య మొందియున్న • కాంతయంగములెల్లఁ, బెద్దవగుచు మిగులఁ • బెరుఁగఁ దొచ్చె
వాడియున్న వల్లి • వర్షంబుచేత నా, నా సుఖముల వెలసి వనజ భంగి.

చ॥ భ్రుకుటియు వంగఁ జెల్వముగ • తొమ్మ చెమర్పఁ దలం పొకందుగా
నొకటి వచించునట్టిదిగ • నొప్పె సముత్కముచేతఁ బక్వమై
రకమగు ప్రేమ కల్లవలె • భ్రాంతిని గొల్పన ? యేమివింత ? నా
నకి తెది పల్కఁ దోఁచక మ • నంబున నూరక యుండె విప్వెరన్.

ఉ॥ పితియుకుందు సద్గుణి మ • నీషి మరుత్సుతుఁ దద్దికాంచి త
ల్లి! తరమెంచరాని యెన • లేని కుతూహల మొంది యుత్తరం
బీతని కేమి యిత్తునని • యెంచఁగ లేకిటు లూరకుంటివో ?
కోఁతి యసత్యమాడె నను • కొంటివొ ? యన్న వచించు నామెయుఁగా.

చ॥ అసదృశమైన యుత్కలిక • యావట యన్నియు రేఁగి నన్ను నా
వనమున నుండనీకిటుల • వల్లటపేసెను వక్కణింప నే
దెనయును తోఁపనీయమిని • తెప్పలకుంటిని విబ్బరంపు నం
తన మది చిత్త విభ్రమము • దార్కొనఁ జేయదె ? మారుతాత్మజా !

ఉ॥ నీ వలనాఁడు నాచెలను • నీఁగెద నంచభయం బొసంగి యా
కైవడి మన్మనో విలయుఁ • గ్రచ్చుఁదెచ్చి దురాన దైత్యులన్
వావిరిఁ గూల్చి తద్విజయ • వార్తను తెల్పిన పుణ్యమూర్తిని
న్నేవిధి సత్కరింతునని • యేమియుఁ దోఁచకయుంటిఁ బావనీ !

మ॥ ఇన వంశోత్తముఁ దోడి తెచ్చితివి నా • హీనస్థితిం దెల్పి మ
ద్ఘన దుఃఖంబులఁ బాపినాఁడవు త్రిలో • కంబుల్ ప్రసాదించినన్
తనయా ! యస్థిర లక్ష్మ లవ్వి నత మ • స్త ప్రాంజలుల్ దక్క నే
యనువుం దోఁచదు వాంఛయున్నను ప్రియం • బాసంగఁ దెల్పంగదే !

చ॥ అనవుడు వాయుజాండు హృద • యంబున నుబ్బి నమస్కరించి మ
జ్జననివి నీముదంబె యగు • జానగు నా యభివాంఛలెల్ల వి
న్మనుకులచంద్రు సన్నిధి స • మర్పణసేయ మనంబుగోరు నే
వనమువకంబె మేలయిన • భాగ్యము నాకొకచేని లేదిఁకన్.

మ॥ త్రిజగ త్పన్నుత జాతిరత్నము క్రియన్ • దీపించు స్త్రీరత్నమున్
ద్రిజటం దక్కఁగ విన్నలంచి బహురా • త్రిం గూర్చు నీరాక్షస
వ్రజము న్నా కసిదీఱ దంచుటకు సం • రంభించె డెందంబు బే
రజము ల్పల్కిన వీరి నాలుకలపై • రంబూదఁగా నూద్చెదన్.

చ॥ పలుకఁగరాని ప్రల్లదము • పల్కుచుఁ బైఁబడి మ్రింగువార మం
చులుకఁగఁజేసి చీల్తుమని • యుత్తలపెట్టుచు నొంచుచుందు నీ
వలువల జాతి చెల్వలను • పాద నఖంబుల చిన్న భిన్నముల్
సలిపెద నీవరం బొసఁగు • చాల రహించెద నంచు వేఁడఁగన్.

చ. చెలువలు భీతిమైఁ జెదరి • సీతపదంబుల వ్రాలి తల్లి! నీ
యలఘుపదంబులే శరణ • మంచు విధేయత వేఁడ నంజికల్
వలదని మాటయిచ్చి కపి • వర్యుని గాంచి విశుద్ధ మానసా!
తలఁపకు వీరిఁ జంపుటకుఁ • దప్పులు వీరలయందు గల్గునే?

ఉ. రావణు బోధచే నటులు • రాయిడి చేసిరి కాని వీరికిన్
భావములందు నాయెడల • వైరము గల్గద యస్వతంత్రలున్
నావిధి యిట్లు నన్నకరు • ణంబుగ వేఁచుచు నుండెఁగాక యో
పావని! వీరు కుబ్జవలెఁ • బాపులు గారు సహింపఁగాఁ దగున్.

ఉ. పాప కులంబునం బొడమి • పాపములం దలవాటుపడ్డ దు
ర్లేషలె యైన నావలని • ప్రేమను వీరి మనంబులందు సం
తాపము గూర్పఁ జూడకుము • ధర్మగుణాలయ! పుణ్యమూర్తి! నా
ప్రాపును గోరి రియ్యది వ • రంబుగ నాకొఱ కీయ వేఁడెదన్.

ఉ. అనవుడు వేఁడుచేల? యిది • యాజ్ఞయ కాదె? కృపాసముద్రవౌ
జననివి! తల్లి పల్కు లెద • జార్చు సుతుండు సుతుండె? మేలు! నీ
ఘనమతి నెంచి నట్ల యగుఁ • గాకని పావని కేలుమోడ్పు గై
కొని యటనిల్చె జానకి క • కుంరిత మోదముఁ గూర్చుచుండఁగన్.

చ. అపట విభీషణుం బిలిచి • యార్యుఁడు సీత నలంకరించి నీ
విచటికిఁ దోడి తెమ్మన న • భీష్టము నందినభంగిఁ బొంగి యు
బ్బుచు దనుజప్రభుం దరిగి • భూసుత సన్నిధి శీర్షక ప్రభల్
రుచిరముగా ధరం బరవ • మ్రొక్కి నయంబు భయంబు పెంపునన్.

శా. తల్లీ! కోరిన శత్రు వీర జయ మా • ప్తంబయ్యె రాముండు విన్
వాల్లభ్యంబునఁ జూడఁగోరె దరిసిం • పన్ వచ్చి రంగస్థలం
బెల్ల న్నిండిరి వేల్పు లచ్చటికి వే • యింపారఁ దోడ్తేర న
న్నుల్లాసంబునఁ బంపె లెమ్మ లలి ను • ద్యోగింపు కై సేఁతకున్.

ఉ. నావుడు సీత యిట్టులను • నాయిట నున్న విధంబు లెస్సగా
దేవతలున్ దినేంద్ర కుల • దీపుఁడు మౌనులు నాకలోక రా
జీవ దళాక్షులుం గనుట • సెబ్బుఱ గాదది యింతలింత లే
సీవిధి నొందియుం దుదకు • నెట్లు సహింతు నలంకృతుల్ గొనన్.

తే. అనుచు జానకి పఠియిఁప • నసురవిభుఁడు, తల్లిరో! రామునాజ్ఞ చం • దంబు విట్లు
విన్నవించితి నస నాపె • విభునియాజ్ఞ, యిట్టులేయైన సరియని • యియ్యకొనియె.

## అప్సరసలు సీత నలంకరించుట

ద్వి॥ జనకజ నలంకరింప న • ప్సరస లేగు, దెంచి తిరుమంజనము సేయఁ • దివిరి తగిన
పునుఁగు కస్తురి గంధ చం • దనము తావి, తైల జలములఁ జేకూర్చి • దాసినారు.

ఉ॥ శ్రీల సులక్షణంబులకు • క్షేత్రము క్రొత్తది జాతి సొమ్ము మే
ల్లీలల కెల్ల మచ్చు కర • లిన్ వెలిదేఱిన వెన్నతోడు ధ
ర్మాలికిఁ దల్లియైన జన • కాత్మజ యొంటి జడన్ వదల్చె రం
భా లలితాంగి వేదముల • వ్యాసుఁడు నేర్పున విచ్చుకైవడిన్.

చ॥ తరమగు దొండఁబోలుచు సు • ధామధురోక్తుల నొయ్యనొయ్య వె
ల్వఱచెడు నోట ముత్తెముల • వంటి రదంబులఁ దోమి నెత్తికిన్
బరిమళ తైలమంటి మను • వట్టిన రత్నము సానపట్టు న
ప్సరుమన గీత మంగళ ర • వంబులతో జలమార్చి రచ్చెలుల్.

చ॥ పవడపుఁ దీవ నారజపుఁ • బాల మరుంగున మూసియుంచు న
ప్ప విదివి చందనం బలఁది • వక్షముపైఁ దగఁ జెందిరంబు సాం
కవమును మెత్తి మేల్కుసుమ • కన్నియ వన్నియ పట్టుచీరయున్
నవరణవేసి మేఖలను • సొరుగఁ దాల్చిరి సన్నకౌనుపై

సీ॥ ఇంద్రాణి తాల్పంగ • విమ్మగు రిక్కల, తహినొప్పు తారహా • రంబుగూర్చి
విద్రుమోష్ఠమునకు • విమలమౌ కుంకుమ, రసముఁబో ల్తాంబూల • రసము దడవి
సంతసగాఁగ వ • సంతంబు చుట్టి హా, రతి యెత్తి దేవతా • రక్షచేసి
యద్దిమండలము నం • దంకమృగంబన, హైమ విమానంబు • నందు చేర్చి

ద్వి॥ విబుధకాంతలు తనుమట్టి • వెంసియుండఁ, గవుణ దైత్యులు గుంపులై • క్రందుకొనఁగ
వెడలఁ బాఱ వల్లల్ల వి • భీషణుండు, నీరద శ్యామ గాత్రు స • న్నిధికి వచ్చె.

ద్వి॥ ఇవల మునులు సురలు వారి • యింతులును క్ర, మోదమున గుంపులై చేరి • మురియుచుండఁ
దక్కువార లానంద వా • ర్తలు పచించు, చింపుగాఁ జూచు వేడ్క వ • హించి క్రమ్మ.

ఉ॥ ఉత్తమవంశ దీపిక య • యోనిజ సాధ్వి పవిత్ర సద్గుణో
దాత్త చరిత్ర సీతను ము • దంబునఁ జూడఁగఁ గోరి గుంపులై
యొత్తుగఁ గూడి త్రోవ యిడ • కుండఁగ దైత్యులు దండపాణులై
మొత్తి యదల్చి త్రోచిరి ప్ర • మోదుల మోములు వెల్లఁ బాఱఁగన్.

క॥ అత్తఱి రాముఁడు సందియ, మొత్తిన చిత్తంబుతోడ • నుద్భ్రాంతంబున్
దత్తఱయగు చేలన ముని, సత్తము లట జరుగు తిరు • చయ్యనఁ దెలుపన్.

క॥ అని వినియు వినక మున్నే, పెదవులు చలియింప దైత్య • విభుఁగని యీవె
ట్టిదముల నీవుండఁగఁ జే, యుదురే ? తగునయ్య ప్రేమ • యుతులు నలంపన్ ?

క॥ కదనంబుఁ జూచు వేడుకఁ, బదువులుగా వచ్చియున్న • వారి నరక యి
ట్లదలించుచు దండింపం, బదరి యనుమతించు వతఁడు • ప్రాజ్ఞుండగునే?

ఉ॥ కూలియుఁ బక్రియ న్నలువ • సుందరులన్ విడనాడి వచ్చుటల్
వోలునె; తక్కు వేలుపుల • పొల్పులఁ దెల్పఁగనేల? తాపస
స్త్రీలను పూరుషుల్ ముదము • చే విటురా వదలించి మోఁదుచుం
దోలుట క్రూరకృత్యమగు • దోసము సుమ్మిటు పేయఁగూడునే?

ఆ॥ పాదు జనులనిట్లు • పద్దసేయక యదఁ. గించి తఱుమఁగొట్టు • టెంచుగాదు
వలదటంచుఁ గినిసి వలుక • విభీషణుఁ డదలుతోడ నొదలు • వతఁక విలిచె.

శా॥ సీతాదేవి రణాంగణంబున పమీ • చీనంబుగాఁ జూచి త
ద్భూతక్షోణివి కంకగృధ్ర బలి భు • గ్భూతాలికిం బందువుల్
ప్రీతించేసిన రామభద్రు వినస • ద్వీరాంక వేషంబు నెం
తో తృప్తింగనఁ దత్తఱించు హృదయాం • దోళంబుతో వచ్చుచున్.

శా॥ నా పూతత్వము కేటగాఁ దెలిపి పై • నా నాథు వీర్యంబు న
ద్దీపింపం బొనరించి నాకులము కీ • ర్తిన్నిల్పి యాలోకమున్
జూపం బూనిన మారుతాత్మజున కి • చ్చో నా సతీత్వంబు ను
శ్రీ పెంపొందఁగ నిశ్చలంబగు చిరం • జీవిత్వ మీఁ జాలున్?

శా॥ నామేనిప్పు దశుద్ధమయ్యె ననువుల్ • నాళ్లి నశ్లేయగుణా
ప్రేమంబొక్కటి చూడ నానగావి యు • ర్విన్నిల్చె: వేతాండు చే
తో మోదంబును కూర్ప లేదనుచు వం • తోషించి సౌదామినీ
జీమూతం బననొప్పు చాపయుత రా • జీవాక్షు వీక్షించె దాన్.

చ॥ తొడరి సురాంగనామణులు • తోడనరాఁగ విమానమందు వ
చ్చెడి జనకాత్మజాత తన • జీవములన్ మరలన్ వహించు న
వ్వడువున డిగ్గెఁ దన్ముఖము • భాస్కర వంశ పయోధి సోముఁ డ
య్యెడ హృదయాంబుజం బలర • నిమ్మగు సొమ్ముగఁ గాంచువట్లుగన్.

మ॥ ప్రతిజన్మంబున జీవితేశుఁడయి తో • డ్పాటొంది దుర్జన్మ దుః
ఖతతుల్ ద్రోచి ముదంబుగూర్చు నిజ హృ • త్కాంతుణా మనో మోదన
స్థితి వీక్షింప భజింపఁగంటి నిఁక నే • జీవించియున్నన్ సరే
గతియింపన్ సరె యంచు వీడినది యా • కంజాక్షి హృత్తాపమున్.

క॥ ప్రేమస్వరూపుఁడగు శ్రీ, రాముఁడు వీక్షించె జనక • రాజ కుమారిన్
రామాజన తిలకము సా, ధ్వీమణి సద్ధర్మకీర్తి • దేవతను రహిణా.

క॥ గ్రీష్మలత పోల్కినున్న వ, షష్మతి తనపాదములకు • మ్రొక్కినఁ గని యా
యుష్మంతుఁడు గనెఁ గన్నుల, కుష్మ మెదఁ జూచు దంద • శూకమువోలెన్.

## శ్రీరాముఁడు సీతను కఠినోక్తు లాడుట

మ॥ నియతిం దప్పిన దైత్యువింటఁ గులహా • నిం జేర్చి పీవాన్నమున్
బ్రియమారన్ భుజియించి శీలమును బా • విం ద్రోచి యున్నావు ప
శ్చిక్రియలన్ లజ్జను వీడి చావక యిటుల్ జీవంబుతో నుండి యే
భయమున్ లేకిట కేల వచ్చితివి ? సం • భావింతు నెంచెంచియో

ఉ॥ విను చెఱ వీడ్చ చేకొనఁగ • నీరధి గట్టి నిశాచరాన్వయం
బును మొదలంటఁ గూల్చి రణ • భూమిని రావణు సంహరించలే
దినకుల గౌరవంబు మఱి • యేను వహించిన యట్టుచేఁ గలం
కను వహియించు నంచుఁ గడఁ • కంబను దెంచితి వైరిఁ గూల్చితిన్.

చ॥ అమృతముమీఁదికంచె నది • కానను బ్రాణుల మేని మాంసమున్
సమలుచు నాసవంబు వ్యస • నంబుగ నానుచునుండి మాయెడన్
సుముఖత చూపుచుండు టిఁకఁ • జొప్పమునే స్మరణించుదానఁ ? బ్రే
మమున నొసర్చు విందులవి • మామది కెంత ఉడెంచునో కదా

తే॥ పావన కులంబునం జనిం • పక ధరిత్రిఁ, గీటకము వలె జన్మించి • క్రిందుపడఁగ
నత్ప్రవర్తన మదుగంట • జార్చి జన్మ, సంపదకుఁ దగుపని పూర్తి • సల్పినావు.

చ॥ ఇలువడి సత్యవర్తనము • వీక్ష్య యనీచత శ్రీకరత్వమున్
లలిత విచక్షణత్వము క • లంకములేని మనంబు కీర్తియున్
గులసతి లక్షణంబు లవి • కూల్చితి పట్టుగ నీదు పుట్టువే
వినస మదారతం గనవి • పృథ్విపు కీర్తిని బోలె దుర్మతీ.

ఉ॥ ఉత్తమ వంశజాతలు వి • యోగము గల్గినవేళ నింద్రియ
స్వత్త నడంచి శీలమున • భంగము కాని దిటంబు గల్గి స
పత్నమ భోగహీనతఁ ద • పం బొనరింతురు మాన రక్షకై
చత్తురు గాని నీకరణి • సౌఖ్యము లందరు శీల నాశినీ !

చ॥ విలువక పొమ్ము నామదిని • నీదగు చేష్టలు అంపమట్లు గం
డ్రలుగను కోయుచుండె నెద • వ్రయ్యఁగఁ జావుము కావమేని నీ
వలచిన చోటికేగి సుఖ • వర్తన నుండుము విన్ను గైకొనం
గొలుపదు బుద్ధి యంచుఁ గొఱుఁ • గ్రుచ్చిన భంగి నదల్చి పల్కఁగన్.

చ॥ ఇనకులు పల్కులన్ విని య • హీన గుణాత్మకులైన వేలుపుల్
మునులును వానరుల్ దనుజ • ముఖ్యులుఁ దక్కు సఖీ జనంబులున్
మనము కలంగఁబాఱ మఱు • మాట వచింపఁగలేక బోరనన్
బనవిరి విహ్వలించిరి ప్ర • పాతము నెందిరి సోలి ధాత్రిపై.

శా. నేలం జూచుచు నిల్చినట్టి కరుణా • విష్పంద వారాశి సం
శీలవ్రాతము కాణయాచి త్రిజగ • చ్చిద్దాత్రి పై దేహి వి
శ్వేలా దుఃఖ పయోధి ముగ్గి ప్రణమున్ • వేధింప బెగ్గిల్లి న
లీలం గంపిలెఁ గుండె హా యనియె ప్రా • లెన్ ధాత్రిపై దబ్బునన్.

శా. రామ క్ష్మాపతి వాక్కు నెత్తిపయి ని • ర్ఘాతంబునాఁ గ్రుమ్మఁగా
భూమిం గూలిన సీత కర్మ మట సం • బోధింపఁగా లేచి వాః
శాప క్షోణిఁ దపించు నేశి జంభృ • త్కాసారముం గాంచి పో
నేమార్గంబును లేమిఁ దల్లడిలు న • ట్లెగెం దలకించుచున్

ఉ. పీరును నెత్తురుం గలిసి • నేత్రములం దిగజాఱ నేడ్చుచున్
దోరక నేఁ ప్రాణముల • తో మనినట్టి ఫలంబు తాళఁగా
నేరని యిట్టి వాక్యముల • నే వినఁ గావలయున్ మదీయ దు
ర్వార దురంత దుష్క్రియలు • ప్రాపుఁగ నేరి మతేమనందగున్ ?

మ. కరుణా సాగర ! మారుతాత్మజుఁడు లం • కం జేరి వీక్షించి వి
వర కారుణ్యముఁ గూర్చి పల్కుచు సమా • శ్వాసించెఁ గాకున్న భూ
భరమై యే మనుదాననే ? యతఁడు నా • బన్నంబుల న్నీకు వి
స్తర పక్కిన్ వచియింపఁడో ? వినుత దూ • తత్వంబు తాఁ జేయఁడో ?

మ. పురుషోత్తంసమ ! యింతకాలము శ్రమం • బుం గొంచుఁ గాపాడు సు
స్థిర చారిత్రము సత్త్వస్ఫితియుఁ బా • తివ్రత్యమున్ సర్వమున్
బర మర్మజ్ఞ విచక్షణం బయిన నీ • భావంబు వీక్షింపమిన్
బరిసెన్ వీసరపోయె పీఠిఁడి ప్రలా • పం బట్లు వ్యర్థంబుగన్.

మ. స్థిర పతివ్రత్యము గల్గు దాన నన నా • చిత్తంబె సాక్ష్యంబగున్
సరసీజాననుఁదేవి నాదు హృదయ • స్థైర్యంబు మార్పంగ లేఁ
డిరవారంగ రమూద్వహుండె సభ స • న్నిట్లాడువో వింక మ
ద్వరు భావంబును మార్ప నేర్పుగల దై • ప మ్మొక్కఁడున్నే యెటన్ ?

చ. అజ హర చక్రులుం గరత • లామలకంబుగ సర్వ కార్యముల్
త్రిజగములం దెఱుంగుదురు • తెఁకువఁ గాంతల చిత్త సంస్థితుల్
విజముఁగఁ గాంచలేరు మఱి • నిర్మల నిష్ఠఁ బతివ్రతాత్వ మ
క్కజముగ నెవ్వరింకఁ గనెఁ • గా నొకతింతు ? ఫలంబు నేమగున్ ?

ఉ. కావునఁ గాయమున్ విడుతు • కర్యమగున్ భవదాజ్ఞ యటి స
ద్భావయుతంబ కాన నెడఁ • దం గొదుకం బనియేమి యుండు ? నా
చావును గోరుచుండె విధి • చక్కటి యంచు మఱందిఁ గాంచి య
న్నా ! వనమందు పోలెనె యా • పర్పుము ప్రస్తర మొందు వహ్నితో.

ఉ॥ నాయన! పుణ్యరూప! రఘు • నాథుఁడు పల్కిన పల్కు వింటె? నా
కీ యవశిష్టకార్యము ర • హిం బయిలోటము మాని క్రచ్చఱం
జేయుమ యన్న నాతఁడును • చేష్టది దుస్సహ వేపమాన చిం
తాయత నాంతరంగుఁడయి • యన్న మొగంబును గాంచె నత్తఱిన్.

మ॥ జలజాతేక్షణు నమ్మతిం దెలుపు సంజ్ఞం గాంచి సత్ప్రాణముల్
వలవంజాలని లక్ష్మణుండు వగతో • వాపోవుచున్ వెక్కుచున్
బలుచం గట్టెలు తెచ్చి పేర్చి యనలున్ • బ్రేరేఁచె వైదేహి వి
శ్చల చిత్తంబునఁ జేరవచ్చె జనముల్ • సంతాపముం బొందఁగన్

## సీత యగ్నిం జొచ్చుట

సీ॥ లోకజనని వహ్ని • లో డిగ డాయంగ వేదంబులెల్ల వా • విడిచి యేడ్చె
ధర్మదేవత యెదఁ • దల్లడిల్లెను ప్రద, క్షిణము సేయఁగఁ బ్రాణి • గణములేడ్చె
నమరకాంతలు బోరు • మని విలపించిరి, బ్రహ్మయుఁ గూడని • పగిది యనియె
హరుఁ డక్రమంబనె • హరిరాజు బెగ్గిలె, భల్లుకేంద్రుఁడు పాక • వశ్యమొందె
తే॥ విన్నఁదన మొందె వెగచి వి • భీషణుఁడు, స్రుక్కి స్రుక్కి సౌమిత్రియును • సొమ్మవోయె
చెడితిరా యంచు హనుమ మ్రాన్పడియె రామ, విభుఁడు నిర్విణ్ణుఁడై బాల • వెగడుగుడిచె

సీ॥ అనుచితంబని మును • లనాఘమని సాధ్యు, లాగసంబని యక్షు • లనుచునుండ
ఎడకడయని సిద్ధు • లెగ్గని యురగులు, తగని పాడియని గం • ధర్వు లనఁగ
గరుడు లాక్రందింప • ఖగములు విలపింపఁ, బంచభూతంబులు • పరితపింప
దనుజులు మిడుకంగ • మనుజులు నడుకంగ, స్థావర జంగమ • తతి గలంగ
తే॥ శేషుఁ డాదుఁగ గులగలోకముల్ • శోషిలంగ, గ్రహచయంబులు తమతమ • గతులు దప్ప
సాగరంబులు రోదన • స్వనము వింప, ధరణిజాత యగ్నిం బ్ర • దక్షిణించె.

చ॥ వలగొని విల్చి రామ పద • వారిజముల్ మదినుంచి యో మహా
నల! సకల క్రియాధికర • ణా! వినివారిత లోక కల్మషా!
దలమతినై మనంబున వ • చస్సునఁ గర్మల నెన్నఁడేనియున్
గలఁక వహింతునేని నను • కాల్పుము బూది యొనర్పు పావకా!

తే॥ వియతి నిట్లు ప్రార్థించి యా • నీరజాక్షి, తనదు కాణాచియైన చెం • దమ్మియందు
చొచ్చునది వోలెఁ జిచ్చున • జొచ్చి నిలిచె, సర్వ జీవులు మనముల • సంతసింప.

చ॥ అవని సర్వభక్షకుఁడ • నై యపవిత్రుఁడనైన యేను నీ
యవనిజ సోఁకుచేత విమ • లాత్ముఁడ నయ్యెదనంచు మద్భు నా
పవన నఖుండు నగ్గరిత • పావన పావక కీలమాఁడి రా
ఘవు కడ కేగుదెంచెఁ గర • కంజములన్ వహియించి జానకిన్.

మ॥ పతి వీక్షించిన కిన్కచే నయిన తా • పస్వేద బిందు వ్రజ
స్థితి యొక్కింతయు మాఱలేదు జడలోఁ • జెల్వారు నవ్యాబ్జ సం
తతి యుంకేనియు వాడలేదు కనుమీ • తాత్పర్య యుక్తుండవై
దితి వంశాంతక ! నిప్పుకం జెదలు ధా • త్రిం దాఁకునే యెన్నఁడేన్ ?

శా॥ నా దౌర్బల్యము నుంతయేని మది నె • న్నంబోక కోపంబుతో
వైదేహిం గన నామె స్వీయ మహిమా • వహ్నిం దగుల్వడ్డ నా
దా దౌర్భాగ్యము నేమియందు? మఱి నా • యత్యాహితం బేదియున్
లేదే ? నాపయిఁ గిన్క యేలొకా ? జగ • ల్లీలా మహానాటకా !

మ॥ అని ప్రార్థింపఁగఁ గాంచి లోకములు పా • స్థ్యంబొందె బెగ్గిల్లి పో
లిన ప్రాణంబులు నెమ్మదిం గొనియె ని • క్లేశంబు నంధిల్లఁగా
ముని పత్నుల్ సురదైత్య కాంతలును న • మ్మోదాత్మలై యేచి ల
జ్జను పాటింపక గంతులేసి రెవరా • నంతోషముం బొందరో ,

మ॥ గురు మోదంబున వానరావళు లొగిన్ • కోలాహల ధ్వానముల్
వరఁగం జేసెను రాముఁ డయ్యదనునన్ • వైశ్వానరుం గాంచి దు
శ్చరితం దీని దహింపకిట్లు కరుణన్ • శాంతుడవై కాచు టె
వ్వరి యాదేశము ? నీవెవండ ? వన భా • స్వదహ్ని తా నిట్లనున్.

సీ॥ నే నగ్నిదేవుండ • నీదేవి వైదేహి, తనదు పాతివ్రత్య • దహనుచేత
దహియింప సహియింప • దిలము గాకిటు నిను, శరణంబు వేఁడితి • సంశయింతు
వేలొకో యిటఁగిను • నెఱుఁగవికైవడి జగములయందున • నతులు పతుల
నెడసియుండిన సంశ • యించుట సందేహ, ములఁ బలువిధములఁ • గలఁకలేని

తే॥ కరణిఁ దొలఁగించుకొనుట నా • కడన జరుగు, చుండుటయు లోక సహజమై • యుండుఁగాని
యామేచే నేను శుద్ధుఁడ నగుచునుండ, నామె పరిశుద్ధురాలని • యనఁగనేల ?

సీ॥ సత్యశీలుండగు • సామీరి పలుకుల, మన్నించి చేపట్ట • కున్న నీవు
శంకానివృత్తి ని • శ్చయరీతిఁ జూపు నా, నయ వాక్యముల నెంత • నమ్మఁగలవో ?
అమరులు మునులు లో • కములు హాహాకార, మొనరించుచుండుట • వినఁగరావో ?
ధర్మంబు వీడి య • ధర్మంబుపై బుద్ధిఁ, గూర్చు విధంబెందు • నేర్చికొంటి ?

తే॥ పూతచారిత్ర కోపంబె • పూనునేని • మొగులు కురియునే ? మేదిని • పగులకున్నె ?
తగవు నిలుచునె ? జగములు • తలరకున్నె ?, అంబుజభవుండు గడగడ • లాడకున్నె ?.

తే॥ అనుచు వచియించి తపియించు • నగ్ని విబుధ, వరులు గొనియాడ జీవులు • వనటవీఁగ
సీతఁ గొని తెచ్చి రాముని • చెంత నిలుప, నతఁడు కారుణ్య సహితుఁడై • యనియె నిట్లు.

ఉ. నీవు సమస్త జీవులకు • నీతి తొలంగని సాక్షివౌటచేఁ
బావని లోకనిందలకుఁ • బాత్రముగాఁ బది సీత యంచు సం
భావనసేసి పల్కితివి • బంధురరీతిఁ బరిగ్రహించెదన్
దేవిని వానరావళియు • దేవతలుం బరితోషమందఁగన్.

మ. అని వాక్రువ్వ సమస్తలోకము లపా • రానందముం బొందె బ్ర
హ్మను గీర్వాణులు గాంచి తానె తన మా • యన్నిల్పి సామాన్యుఁడౌ
జనునిం బోలెను తన్నుఁ దా నెఱుఁగకీ • చందాన మున్నట్టి రా
ముని పూర్వస్థితిఁ దెల్పవే యనుడు వే • ల్పుం బెద్ద తా నిట్లనున్.

## రాముని పురుషోత్తమత్వమును నలువ వెల్లడించుట

శా. శ్రీరామా! పురుషోత్తమా! రవికుల • శ్రేష్ఠుండవే నీవు; నా
మేర న్నిల్చిన యల్పబుద్ధి నగు స • క్లిష్టోక్తి సైరింపు నీ
తీరుం దెల్పఁగ శక్తిలే దుపనిష • త్సిద్ధాంత తత్త్వంబ వా
ధారాధేయము లీవ సర్వమును నీ • తత్త్వంబ లోకేశ్వరా!

మ. తొలి తత్త్వంబగు మాయయున్ మరల నం • దుంబుట్టు తత్త్వంబు ల
వ్వలఁ బై నుండెడు జీవుఁడున్ దనకుఁ బై • భాస్వత్ప్రభారాశియై
తలఁపం దెల్ప వచింపరాని పరమా • ర్థం బీవ నీమాయచేఁ
గలుగు న్నిల్చు నశించు లోకములు సం • కల్ప ప్రభావంబునన్.

చ. తొలిస్థితియైన సృష్టియును • తుట్టతుదిం గల నాశమున్ సదా
వెలఁగని నీస్థితి న్నిగమ • శీర్షములే పరమార్థమంచు ని
న్నొలసి వచించుఁగాని మఱి • యొక్కరి నిక్కడ కేగుదెంచు వా
రలఁ గలవారిఁ దెల్పవు ప • రాత్పర! సర్వ జగన్నియామకా!

చ. శివునకు నాకు నింద్రునకు • శిష్టజనాళికి జీవరాశికిన్
దవిలియుఁ దొలఁకుండు పర • తత్త్వము నీవని కాంక్షచేసి ని
క్కువము నెఱుంగు పుణ్యజన • కోటి భవాంబుధి దాఁటి దేవతా
స్తవన విశేష పాత్రమగు • సత్యపదంబును గాంద్రు రాఘవా!

మ. తిలిచంద్రుల్ తమ జన్మకారకులుగాఁ • దర్శించు సజ్జుల్ ధరా
స్థలిలో సంసృతి పాశబద్ధులయి సం • తాపించి తత్త్వార్థమున్
దెలియంజాలక చావు పుట్టువుల యా • వర్తిం గుందుచున్నారు వి
జ్ఞులు నీతత్త్వ మెఱింగి ముక్తులయి సం • శోభింతు రెల్లప్పుడున్.

చ. ఇరువది యైదు తత్త్వముల • కీవలి తత్త్వము నీవుగాక వే
రొరుఁడు లేఁడటంచు శ్రుతు • లొక్కటఁ జాటుచునుండె సత్తముల్

కరులగు వారు దీని కెఁక • గావలెనే వ్యవహార ధర్మమం
దౌరిమిక సాక్షి నమ్ముటకు • నుత్తర సాక్షిని బోలె నిద్దరన్

మ॥ అనుమానాదిక సత్ప్రమాణగతి నూ • హాపోహముల్ సేఁత నిన్
గన సాహాయ్యపడంగలేవు వనజా • క్షా! వేద శీర్షంబులున్
నిను నీదాపటికంబు పూర్తిగఁ గనన్ • లేకున్న విజ్ఞాన వీ
క్షణచే జాడగ నిర్ణయించి తెలుపున్ • సర్వేశ! సర్వాత్మకా!

ఉ॥ నీ కరుణా విశేషమును • నెమ్మి నహింపని వారి కింద్రియో
ద్రేకము విఘ్న కారకము • దివ్య భవద్గుణ రూపలక్ష్మి న
స్తోకముగా నెఱుంగుటకుఁ • దూకొని యింద్రియ శక్తిఁ ద్రుంచ నీ
శ్రీ కమనీయ పాద సర • సీరుహ చింతన దక్క నున్నదే •

శా॥ నీకుం బుట్టువు లేదు మాయయుఁ దొలి • న్నీనుండియే పుట్టె నీ
యాకాశాదిక పంచభూతములు త • త్త్వాదుల్ ప్రపంచంబు మా
యాకార్యంబులు కల్పకాలమున మా • యన్ డిందు నమ్మాయ నీ
యాకారంబున డిందు నీకు విలయం • బా లేదు నిత్యాత్మకా!

మ॥ మించుం బోలె క్షణంబులో నడఁగు వి • ఖ్యాధ్యా ప్రపంచంబు సృ
ష్టించం బెంచఁగ ధర్మము న్నిలుప స్థ • శ్రీనింప నేకాకివై
ప్రాంచద్రీతిని నన్ను వెల్వఱుతు వం • త్యంబందు నాశంబు గ
ల్పించం బూనెదు దాఁగియుండెదవును త్రి • స్థిం గానఁ నెన్నండున్.

శా॥ నారూపంబున సృష్టిచేసి జగముల్ • నారాయ ణాఖ్యుండవై
యాధారం బోషణ చేసి శూలివయి సం • హారంబు గావింతు వీ
వౌరా! రేఁ బవలుల్ దినేశ్వరుఁడు ప్ర • త్యక్షంబుగాఁ జేసి లో
కారాధ్యుండును లోకబంధుఁడగు చా • యం బొంది సర్వేశ్వరా!

శా॥ సంపన్నాఁధల నొందు మా మనము నా • శంబందు నత్తంచరుల్
చంపన్ యత్నముచేసి పాఱఁడిబుమన్ • సంరక్షవై నిన్నె ప్రా
ర్థింపన్ మాకయి పెక్కుజన్మముల ప్రే • తిం బొందుచున్నావు నీ
కింపుం గూర్చెడి యాటలో విమలాకో • యీ కార్యము ల్ రాఘవా!

మ॥ ప్రణవార్థంబు నెఱుఁగువారె పరమా • ర్థంబైన నీతత్త్వమున్
గణనీయంబుగఁ గాంచువారలనుము • క్తిద్వేషులున్ ముక్తబం
ధములున్; దక్కినవారు సంచలిత త • త్త్వజ్ఞానులై జన్మ కా
రణ మాయంబడి ముక్తి మార్గమును చే • రం బోవ రెన్నాళ్లకున్.

క॥ నీరూప మిట్టిదయ్యెను, గారాముగ జగములెల్లఁ •గాంచి పెనిచి ధ
ర్మారూఢిఁ జూపు జననిని, కారాని వచస్సులాడి • కలఁపకు లంద్రీ

## శంకరుఁడు దశరథు నటకుఁ బిలిపించుట

తే॥ అని విలాప పలుకఁ బశుపతి, యను నీవు జగంబులకు న • నాదివి త్రిజగ
జ్జననియగు సీత లక్ష్మియె, యనఘ! నీచరిత నీవ • యరయఁగలేవొ ;

మ॥ జనలోకేశ్వర! సీత నీడఁదగుదు • శ్చారిత్రయే? లోక పా
వన చారిత్రను శంకచేసి విడువన్ • భావింతువేనిన్ జగ
జ్జని సందోహము తల్లడిల్లి తుది నా • శంబందు నట్లాట దే
విని నిందించుట మాని చేకొనుము మా • వేఁడ్కోలునన్ రాఘవా!

చ॥ పశుపతి యిట్లు పల్కి సుత • బాధ వియోగ మహోగ్ర వేదనా
వశమున జీవము ల్విడిచి • వైష్ణవలోకము నొందియున్న యా
దశరథుఁ జేరి నీతనయుఁ • దండకు వచ్చి తదీయ చిత్తక
ర్కశతను మాన్పి మోదము జ • గంబులకుం గలిగింపవే యనన్.

మ॥ శివు నాజ్ఞం గొని ప్రేమపాత్రమగు క్ర • వ్యాదాన్వయధ్వంసి రా
ఘవు వీక్షించు కుతూహలంబు మది మాఁ • గంజేయ నుత్కంఠయుం
దవులం బంక్తిరథుండు భూమికి దిగెన్ • దండ్రిన్ సమీక్షించి దా
నవభీముండగు రామభద్రుఁ డెరఁగెన్ దత్పాద పద్మద్వయిన్.

చ॥ తెలచిన సూను బాహువులఁ • దియ్యముతోఁ దగ గ్రుచ్చి యెత్తి కౌఁ
గిలిగొని బాష్పవారిఁ జిలి • కించుచుఁ జిక్కఁగఁజేర్చి నా భవం
బిలఁ గడు ధన్యమయ్యెనని • యింద్రియవారము తృప్తి పొందఁగాఁ
దొలఁగ వియోగవేదనయు • దుర్భర మోదముతోడ నిట్లనున్.

ఉ॥ కేకయరాజపుత్త్రి మది • గీడ్పడఁ గోరు వరంబు శూలమై
యూఁకున నామదిం దొలుచు • చుండెఁ గుమారక! నేఁటిదాఁక నీ
లోకహితంబు పేర్మి నత • లోక జయేందిర చేరి మించు సు
శ్రీకమనీయ వక్షమిటు • చేరఁ దొలంగెను నేఁడు నాయనా!

ఉ॥ ఉత్తమ పుత్త్రులం గని మ • హోన్నతి నొందిన వారు మత్పదా
యత్త రజంబునేని సమ • మందని యుద్ధుర గౌరవంబు నా
కిత్తఱిఁ గూర్చినాఁడవు మ • హేచ్చను నీవలనన్ గడించితిన్
సత్తమలోక సౌఖ్యమును • శాశ్వతకీర్తి జగత్త్రయంబునన్.

మ॥ మును నాచేత నమస్కృతుల్ గొనిన వే • ల్పుల్ తాపసశ్రేష్ఠులున్
నను సంస్తోత్రము సేయ నిప్పటి జగ • న్మాన్యాంగమున్ జూడుమా
వనజాతానను నుద్దిగా వినుత భా • వస్ఫూర్తిఁ గల్పించి లో
వని సంతోషము మీఱఁ బల్కి మిథిలా • ధ్యక్షాత్మజం జూడఁగన్.

చ॥ జనకజయున్ మహావినయ • సంగతయై పద పంకజాత వం
దన మొనరింప నామెను ము • దంబున లేవఁగనెత్తి ప్రేమమున్
దనుక శిరంబు మూరుకొని • తల్లిరో! నీవలనన్ నిజంబుగా
వినకుల ముజ్జ్వలించె లభి • యించెను నాకును నిత్య సౌఖ్యముల్.

శా॥ పాతివ్రత్యబలంబు లోకులకుఁ దె • ల్పంబూని నీభర్త యీ
రీతిన్ వీతియుతోగ్రవహ్ని దుముకం • బ్రేరేఁచు నవ్వార్త నీ
చేతంబందున నిల్పకమ్మ! జనముల్ • చిత్తంబు శంకించుచో
హేతిన్నిల్పి పరీక్ష సేయుటలు బ్రాఁ • తే! కోపము న్మానుమా!

ఉ॥ బంగరు నిప్పునం దిడుట • పన్నియు హెచ్చొనరింపఁ జామ్మ! సా
రంగ విలోచనా! సుగుణ • రాజిత చిత్తుఁడు నీమగండు మీఁ
దం దొనరాదు ఇట్టి పను • ధాస్థలి నంచుఁ దలంచి యిప్పు డీ
యంగమునన్ నిధించి పెల • యంగ నొనర్చె భవన్మహత్త్వమున్.

చ॥ పరమ పతివ్రతా మణుల • పాలి విభూషణమా! ధరిత్రియే
వరతర జన్మభూమి యగు • వైష్ణవ లోకమునుండి ధారణీ
భరమును మాన్పఁబూంచె జగ • పాహనుతోడ జనించి తీవు నీ
యురు గుణరాశికిం గలఁక • యొంటునె యొక్కటి? లోకపావనీ!

॥ అని వచియించి యంచుకయు • నల్కఁ వహింపని శాంతచిత్త యీ
జనకజ యంచు డెందమున • సంతసమంది యనంతరంబు నె
మ్మనమును ప్రేమ కట్టుటయు • మచ్చికతోడ విపండు. తన్నుదా
ఘనముగఁ గౌఁగిలించుకొను • కైవడి నక్కునఁ జేర్చె లక్ష్మణున్.

మ॥ కనుల న్నీరు జటాధరంబుఁ దడుపన్ • గాటంబుగాఁ జేర్చి యో
తనయా! యన్నను వెంటనంటి సుఖ వి • ద్రాభుక్తులం ద్రోచి యా
తనిఁ గాపాడుచు లెక్కలేని ఘనబం • ధంబుల్ వెసం ద్రోచి నా
ఘన చిత్తాదుల నీఁగినాఁడవు కదా • కారుణ్య వారాన్నిధీ!

మ॥ బలు మాయావిని మేఘనాదు ననిలో • భంజించి గెల్పొందు నీ
బల చాతుర్యము లెల్లవేళలను గీ • ర్వాణుల్ ప్రశంసించు వా
రలు లోకంబుల గాసిపెట్టు దనుజ • వ్రాతంబుఁ జెండాడి వి
ర్మల ధర్మంబును నిల్పినాఁడవు జగ • న్మాన్యుండవై పుత్త్రకా!

చ॥ అని వచియించి రామ సతి • నర్మిలిఁ గాంచి గుణప్రపూర్ణ! నీ
కొనరఁగ నీయ సాధ్యమగు • నొండు వరంబును వేఁడుమన్న న
య్యనఘుఁడు పల్కె మిమ్మ మ్రొగి • నవ్వలి లోకమునందు గాంచి మ
న్నన దగ వేఁడనుండి సడి • నాకు లభించె నిఁకేమి కోరుదున్?

చ॥ అయినను కోర్కి యొండు గల • దయ్య ! మనంబున దుష్టశీలఁగాఁ
గయికొని చూడ రోఁతపడు • కైకయుఁ దత్తనుజుండు నాకుఁ ద
ల్లియు సనుజుండుగా ననుఁ • శింప వరంబు ననుగ్రహింపుమీ
మెయికొని యన్న నెల్లరును • మేలని మెచ్చిరి రాము చిత్తమున్.

మ॥ అకలంకుండగు తమ్ముఁ దట్టి యతఁడే • యొంటబట్టభంగము త
క్కక కావించి తపస్విరూపమును పైఁ • గాంతారవాసంబు గొం
కక నీకిచ్చిన క్రూరదైత్యయగు నా • కైకేయిపైఁ గోప మిం
చుకయుం దగ్గద యంచుఁ దండ్రి యన ర • క్షోమర్దనుం డిట్లనున్.

మ॥ నీరనీచ్ఛేంబులు లేక యుండఁగఁ బ్రజన్ • బోషింపఁగాఁ బూను నా
ధరణీభాతము సర్వపాపములకున్ • స్థానంబయొ నంచు వి
ద్వరులెల్లన్ వివరింపఁగా నెఱిఁగి త త్కార్యంబు నీకొంట నా
నెరపై యున్నది గాగ తల్లియెడ మ • న్నింపన్ దొసంగున్నదే !

చ॥ వర బల మానసుం గడచి • వర్తిలు రాముఁడు డిట్లు వల్కఁ బం
క్తిరథుఁడు కిన్కమానెఁ బరి • కించిన విన్న మునీంద్ర విద్వరుల్
వరములు రెండు కోరె మును • వారక కైకయు రాముఁ డిప్పుడున్
వరములు రెండె కోరెనని • వందుల బొల్కి నుతించి రయ్యెడన్.

మ॥ సకలామోదక సత్య రక్షణముకై • శస్తంబుగాఁ గీర్తి వ
ర్ధక దేహంబును గొన్న యా విభుఁడు ప్రే • తారాము సౌమిత్రులన్
బ్రకటప్రేమను భూమిపై నిలువ నా • జ్ఞాపించి యారెండు కో
రికలన్ వారల కిచ్చి తా మరలెఁ గీ • ర్తింపంగ బృందారకుల్.

## వేలుపులు రాముని కోరిక లొసంగుట

ఉ॥ కూటువలైన ఖేచరులు • కూర్మిని రాముని గాంచుచున్ నిరా
ఘాటముగాఁగ నీవలచు • కార్యము కూర్తము కోరుమన్న నీ
బోటునఁ గూలినట్టి కపి • ముఖ్యులు ప్రాణములొంద వార లే
చోటునఁ జేరినన్ • ఫలయు చొక్కపు టోగిర మొందఁ గోరుదున్.

చ॥ వరదులు బ్రహ్మరుద్రులు త • పస్విలు విద్యుఁన్ గతుపృతుల్
వరము ననంతు నవ్యయు భ • వప్రకరంబులఁ ద్రుంచు నచ్యుతున్
పరిపరి రీతులం దవియఁ • బ్రార్థనముల్ పొనరించి నీ కృపా
పిరతని పొందుఁగావుత వ • నేచరవర్గము కోరినట్లనన్.

చ॥ కదనముపూను నాటఁగొరె • గండఱి నీల్గిన వానరావళుల్
ముదమునజీవముల్ గొని ప్ర • పూర్ణబలంబున లేచి పోరికై

పొదలుచు హుంకృతుల్ సలిపి • మోములు కన్నులు తృప్తినొంద శ్రీ
వదనుని గాంచి జే యనుచు • సందడి సేయుచు • డాయ వంతటన్.

సీ॥ వేల్పులు రాముని • వేడ్కతోఁ గాంచి యి, ట్లనరి వివేచించి • యాదిదేవ!
వనచర సేనతో • వచ్చి కృష్ణాష్టమి. వేళ సువేలపై • విడిసి నాఁడె
పోరు ప్రారంభించి • పౌలస్త్యదిండులఁ గూల్చి, పౌలస్త్య నవి నమా • వాస్యఁద్రుంచి
శోకంబులకు మేలు • జోకతోఁ జేసితి. విట్టులే పదునాలు • గేండ్లు కడచె

తే॥ నేఁడు పంచమి నీవేగి • వియతు భరతుఁ, జేరవేని యాతఁడు గూలు • జిచ్చునందు
సరగ నడువుమ యని పల్కి • సన్నుతించి, తమ నివాసంబులకు నాజ్ఞఁ • దరలినారు.

## సీతా రామ లక్ష్మణులు పుష్పకము నధిరోహించుట

తే॥ గడువు నే టితో • దీఱి త • మ్ముఁడు గతింప, మా కులంబును నశియించు • మాఱులేదు
కాన నేఁడె చేరఁగఁదగు • కర్జమునకు. వలయు సాధన మున్నదే • తెలుపవయ్య!

సీ॥ రాముఁ డిట్లని తత్త • అంపడఁగని విభీ, షణుఁడను దేవ పుష్పకము కలదు
పౌలస్త్యుఁడు కుబేరు • భంగించి కొన్నది. వానికిఁ బరమేష్ఠి • దీని నొసఁగె
నుత్తమ జనముల • చిత్తంబులంబలెఁ, బరిశుద్ధమైనది • వనచరాళు
లెల్ల రెక్కిన జలి • యింప దందేగినఁ, గోరి నేఁడె యయోధ్య • జేరవచ్చు

తె॥ ననుడు వడిగఁ దెప్పింపుమా • యనుచు రాము
చంద్రుఁ డానతి యిడలోక • చయముఁబోలు
పటుపు వేయి సూర్యుల బోలు • మెఱుపు గలుగు
పుష్పకంబు దైత్యేంద్రుఁడు • పొనఁగఁ దెచ్చె.

తే॥ పుష్పకము ధారణికి దిగ్గ • భూవరుండు, నేఁడు విజముగ నాకోర్కి • నెగ్గెనుచుఁ
దలఁచి దాని నధిష్ఠించెఁ • దత్తఱమున, విరులు విచ్చల విడిగ ఖే • చరులు చల్ల.

తే॥ త్రిజట కేల్మోడ్పుఁ గాంచి వై • దేహి నీవు, లంక కధిదేవతంబోలి • లలితరీతి
శుభము లొందుదు గాకని • సుభగు పజ్జఁ, జేరె నూర్మిళేశుఁడు నధి • ష్ఠించెనంత.

ఆ॥ విజయ వేళ నాఁటి • వెన్నుని యుదరంబుఁ, బోలి గగనమందు • పొలుపు గొలుపు
పుష్పకమున మన్న • భూపాలచంద్రుండు, హితులఁగాంచి ప్రేమ • విట్టులనియె.

తే॥ నలువ వంశంబు నీదౌట • తల పుమయ్య, నిన్ను చేరువారికి మేలె • వించుమయ్య
పెంపు సొంపార లంకఁ బా • లింపుమయ్య. యనుచు నవ్విభీషణునకు • నాజ్ఞయొసఁగె.

తే॥ పంక్తికంధరు నీ భుజ • బలమువలనఁ, గూలిచితి దురమునఁ గ్లాంతి • గూరియున్న
వానరులఁగాని నీవుక • వరముఁజేరి, సుఖివి గమ్మని సుగ్రీవుఁ • జూచి యనియె.

తే॥ మీమనోబలోత్సాహ వ • మేళనమునఁ, గాక యేనింత పని సేయఁ • గలనె? వాలి
తనయ! భల్లు కేశ్వర! నీల! పవన! యనుచు, ముదితుఁడై పల్కి సౌమిత్రి • ముదమునొదిగె.

ఆ॥ వారు దిగులుకొరఁ • బ్రాణంబులు నొదల్లు, వదఁకఁ గనుల నీరు • పుడమిఁ దడుప
విన్ను పిడి శివ • విచయంబు భరియింపఁ, జాలమనుచు మఱియు • జాలినొంది.

ఆ॥ కోసలంబు చేరి • గురుతర పట్టాభి, షేక వేషమందు • స్మితముఁగాంచి
పరమ మోదమంది • సురలునట్లుగఁ గృప, నేయవయ్య వేడ్క • చెలఁగు ననుచు.

మ॥ విమలప్రేమ విభీషణాదులు కపుల్ • వేఁడంగ శ్రీరాముఁ డ
ర్యమవంశాంబుధిసోముఁ డా హితుల చి • త్తావేగముం గాంచి సం
భ్రమ మేపారఁ గలంగకుం డిదియె నా • భావంబు మిమ్మిట్లు దుః
ఖమునం ద్రోచి గడించు భాగ్యమది యొ • క్కండేని నాకుండునే?

మ॥ భరతత్రాణము వేగిరింప విటులే • భాషించితిన్ మిమ్ముఁ బెం
పరికోరింపఁగఁ గాదనం గపులు భా • స్వత్పుత్త్రిఁడున్ దైత్య భూ
వరుఁడున్ మారుతి బొందితో సురపురిం • బ్రాపించు చందాన సం
బరమున్ మోదము నొంది మ్రొక్కె రెలమిం • బాటించి భూజానికిన్.

తే॥ కపులకోర సుగ్రీవుని • గాద్పుకొదుకు, నల విభీషణుఁ డక్కవా • రలను వడిగ
నెక్కఁడీ విమానం బని యెలమి రామ, చంద్రముఁడు సెలవిచ్చెను • సంభ్రమమున.

తే॥ పలుకువార్తయే పెనుబదు • పగిది నేడు, పదుల వెల్వాలు వానర • పతి విభీష
ణుండు నంగదుఁ డాంజనే • యుండు నెక్కె, యొక్క ప్రక్కఁ జేరిరిచాల • మత్సహించి.

తే॥ పదియునాలుగుజగముల • పాప్రబుకొక్క, మొగివికూర్చున్నను స్థలంబు • మిగిలియుండు
దద్విమానమహిమ కర్మ • తతి దహించు, జ్ఞానులకెగాక తెలుప భూ • జనుల కరిది.

క॥ పనచరులు పనచ రేంద్రుఁడు, దనుజులు దనుజేంద్రుఁడును ము • దంబునఁ గొలువన్
జనకజలోఁదమ్ముఁనితో, మనుజేంద్రుఁడు వెడ్డె వేల్పు • మన్నినిక్రియన్.

తే॥ పుష్పకమ్ము గొప్పజగమ్ము • పోలి వెలయ, రాముఁడయ్యెడ లోకకా • రకుఁడు నిర్వి
కారుఁడు నిరంజను దు స్వప్ర • కాశ పుంజ, మగు పరంజ్యోతి పరమాత్ముఁ • డనఁగనొప్పె.

క॥ వానరనాధుండును లం, కానాథుఁడు దైత్యచయము • కపి బృందంబుల్
మానవనాథుని యాజ్ఞను, మానవ రూపములఁ గొఱరి • మక్కువతోడన్.

తే॥ తూర్పు పడమరలకు నేగు • తో యజహితుఁ, డప్పు డుత్తరమున కేగు • ననువుమెఱసి
వెడల నవ్విమానము రామ • విభుఁడు జనక, జాతఁ గని యిట్లు పల్కె సం • ప్రీతుఁడగుచు.

## రాముఁడు సీతకు త్రోవలోని చిత్రములఁ జూపుట

చ॥ మనము కళంకహీని కను • మా యిది నే మది నెంచినట్టు లం
కను వలగొంచఁ బోయెడిది • కాంచుము తూరుపు వాకిలిన్ బ్రహ
స్తుని మన నీలుఁ డిచ్చటనె • దోర్బల యుక్తి నడంచి కూల్చె ద
క్కిణమున ద్వారమిద్ది పరి • కింపు సుపార్శ్వుఁడు చచ్చె నిచ్చటన్.

చ॥ ఇది పయిదిక్కు వాకిలిట • నింద్రజితున్ మన లక్ష్మణుండు ఘెం
పొదవ వధించె నియ్యెడియె • యుత్తర మార్గము రావణుండు బె
ట్టిదముగ పోరు సల్పి యిట • డిందె శిరంబులు కేలు లెక్క లే
కెదుఁగఁగఁ దున్మి తున్మి మడి • యించితిఁ దుష్టుదిన్ వరాంగినీ ॥

సీ॥ కపులు వారిధిఁ దాఁటఁ • గడఁగి చిత్రంబుగాఁ, గట్టిన సేతువు • గాంచు మబల ।
తలిదండ్రులకు గురు • వులకుఁ బంధులకుఁ జే, సిన కీడు దీవి ద • ర్శింపఁ దొలఁగుఁ
దొల్లి యింద్రున కంజి • తోయధిం జొచ్చిన గంధమాదన మదే • కంటె సుదతి ।
తత్పర్వతంబుతోఁ • దవిలి యీవారధి, పొలుపుటచేఁ బరి • పూతమయ్యె

తే॥ జాహ్నవీ గౌతమీ సర • స్వతుల సింధు, యమున నర్మద కావేరు • లందు మునుఁగు
వారి పాపముల్ తొలఁగు న • ప్పగిది నిందు, మునిఁగి దీనిఁ జూచినఁ బాప • ములు తొలంగు.

సీ॥ వశుహంతకులు పితృ • వంచక హంతలు, పసిబిడ్డలం జంపు • పాప గుణులు
పడఁతుల నలుకిన • పొడువలు • తపసులఁ, దొడఁగి హింసించిన • దుండగీంద్రు
శరణార్థులం ద్రుంచు • నలజాతి పలువలు, వచ్చి భక్తిని సేతు • వారి మునుఁగఁ
బాపంబులను వీడి • పరిశుద్ధులై వేల్పు, లగుదురు వడవ లిం • దరుగుకొలకు

తే॥ వింటికొనచేత వంతెన • విఱుచు చోటఁ, దానమాడిన పంచ పా • తకము లీఁగి
యిరువదొక్క జన్మంబుల • నింద్రభోగ, ములను పొంది సుఖింతురు • జలజనేత్ర ;

తే॥ విటలనేత్రుని జటయందు • విలుచు గంగ, సేతువగు భాగ్యమును నేను • చెందనైతి
నంచు గొప్ప తపంబు గా • వించుచున్న • దనిన దీవి గౌరవమున • కలవియున్నె ;

క॥ ఎరుఁగుండిట నా పావక, ర వహ్నికి నోర్వలేక • శరణము చొచ్చెన్
వరవర్ణిని ! కాంచితె క్ర, మ్మఱ దీని నగస్త్యుఁ డుండు • మలయాచలమున్.

చ॥ సురచిరగాత్రి ! చూడుమిది • సుందరశైలము విష్ణువాసమున్
వరమతి వేంకటాచలము • భక్తిని కాంచుము నీ మనంబు నే
నరసితి వాయుపుత్త్రుఁడు ప్రి • యంబున నన్ దొలుదొల్తఁ జూచు చో
టరయుము బుశ్యమూక మిది • యన్నులమిన్న ! మనోహరంబుగన్

తే॥ అమిత బలశాలి శత్రు భ • యంకరుఁడు, శూలిభక్తుండు నగు వాలి • కూలినట్టి
పీమ యిది యది చూడు కి • ష్కింధ సూర్య, సుతుడు పాలించు నగరంబు • శోభనాంగి

చ॥ అనుటయు నంత సంతసిలి • యార్య ! కపీంద్రుల పెక్కు పెల్లువల్
మన మలరంగ గొప్ప బహు • మానముతోఁ గొలుపంగ నుండు ని
ష్ఠమనస్సృతి సేయు నే నొకటె • నైయరుదెంచుట లెస్సగాదు నీ
యనుఁగులు వారివారి లలి • తాంగులతో నరుదేరఁ గోరెదన్.

చ॥ పిలువుఁడి యన్న జానకి ము • భీష్టము రాముఁడు సూర్యసూతితోఁ
దెలుపఁగ నాతఁడుం బిలిచి • తెప్పున మారుతిఁ గాంచి పల్కె నా

బలియుఁడు పూతమానసుఁడు • భావ్యమ యంచరుదెంచి వానరీ
కులములఁ దోడితెచ్చె రఘు • కుంజరు పత్ని మనంబు పొంగఁగన్.

ఉ॥ పావని వెంట వచ్చిన వ్ల • వంగనతుల్ తమజేనికిన్ ధరి
త్రీ పరపుత్రికిన్ రఘువ • రేణ్యులకుం దగ్రమొక్కి తాము సం
భావన సేయఁ దెచ్చు శుభ • వస్తువులెల్లను ముందుంచి సీ
తా వనితా లలామను మ • దంబునఁ గొల్చుచు నిల్చి రయ్యెడన్.

చ॥ నరచె విమాన మర్కకుల • నాథుఁడు పిమ్మట సీత కిట్లనెన్
మదఁతిరొ ! కాంచితే భువన • మాన్య జలాన్విత గౌతమీ నదిన్
అదిముడినొంద పంచవటి • జింక కనంబడె నిందె యంద సీ
యెడయిక దాపురింపఁ గృశీ • యించితి మత్తగజేంద్ర గామినీ ;

చ॥ ఇది తపసుల్ వసించి తపి • యించెడు దండక చిత్రకూట మి
య్యది భరతుఁడు వచ్చి నను • ప్రార్థన సేసిన చింద ప్రేముడిం
బొదలఁగ నీవు పెంచినవి • పూలత కూఁటు మందహాస సం
పద చెలువొంద శాఖ లను • బాహులతో నిను పిల్చెఁ జూడుమా.

ఉ॥ ఓ జనకేంద్ర పుత్రి ! కను • ముగ్ర తపోబల శాలియౌ భర
ద్వాజుఁడు శిష్యవర్గయు ము • దంబునఁ గొల్వఁ దివంబె రూప ము
త్తేజిత రీతి నొందె ననఁ • దేఁకువఁ గేఁను దండ కుండికల్
బ్రాజిల వచ్చుచుండె మన • రాక యెఱింగి యెదుర్కొనగా వడిన్.

## భరద్వాజుఁడు శ్రీరామాదులకు విందుపెట్టుట

తే॥ అనుచుఁ దమ విమానము దిగ • నాజ్ఞయిడఁగ, దేవలోక సమ భూమికి • దిగినపగిది
విలువ రామచంద్రుఁడు ముని • నేత కెదురు, చని తదియాంఘ్రియుగము మ • స్తమునఁ దదవె
తే॥ వత్సలత తొలఁకఁగ భర • ద్వాజమౌని. దీవన లొసంగి రాముని • తివిరి యెత్తి
యలమికరము మూర్కొనియశ్రు • జలముచేతఁ. దోయజాక్షని జటలలో • దూఁగఁగదిగె.
తే॥ సీతయును లక్ష్మణుండును • చేరికేలు, మోడ్చ నాతండు దీవించి • ముదము వలన
మనసు కరఁగంగ నమృతంబు • తనకుదొఁకు, చందమున నుబ్బి తా వివ • శత్వమందె.
తే॥ దనుజపతి వనచరపతి • తక్కువారు, చేరి చేమోడ్ప వారి నాశీర్వదించి
వేద ఘోషంబుతో శిష్య • వితతితోడఁ, బర్ణశాలకుఁ గొనిపోయె • వారి నతఁడు.
తే॥ శాస్త్రయుతముగ నతిథి పూ • జలను సలిపి, శ్రమము పోకార్చి పదపడి • ప్రవిమలార్క
వంశదీపకు శ్రీరామ • భద్రుఁ దనివి, ననక మతిమతి కని యిట్టు • లనియెఁ దుదకు.

మునులు నరులు సుమనసులును, ఘనముగ భీతిల్లఁ గ్రూర • కర్మంబులు నె
ఱ్ఱున పేయు దనుజ కులములఁ, దునిమితి లోకముల మేలు • తొట్టగ రామా ॥
మ॥ ఖర మారీచ విరాధులన్ వనమునన్ • ఖండించి పాలంబులన్
శరమొక్కంటను ద్రెళ్చి యింద్రతనుజుం • జక్కాడి వారాశి దు
ర్భర కోపంబున మాడ్చి రావణుని త • ద్వంశంబు నిర్వంశమై
పరఁగం గూల్చితి వెల్ల లోకములకున్ • బ్రాపింపఁగా శ్రేయముల్.

చిత్రకూటంబు వీడి దక్షిణమునందు, గలుగు చెడుగుల నన్నిటిఁ • దొలఁగఁజేసి
మరలి వచ్చెదు దనుక ని • న్మఱవలేదు. వచ్చితివి నేఁడు విందవై • వఱలుమయ్య ॥
చ॥ కరమున విల్లు దాలిచి జ • గంబుల గాసిలఁజేయు దుష్టులన్
జెఱచితి వెల్ల జీవులకు • సేమము సేకుఱె సర్వదా తవో
విరతియు నిల్చె మాకుఁ గరు • ణించితి పీశపథంబు చిత్త మా
భరతుని మీఁది వత్సలతఁ • బర్విదుచున్నది పీకు రాఘవా ॥
చ॥ అతఁడును మైమెఱపుఁ గను • లందుని నక్రులు రాల వంది వి
శ్రుతమతి లేక వేగుటయుఁ • జింతను దక్షిణ దిక్కు చూచుచున్
వితమటి దుఃఖమే తనువు వీఁక భజించిన చందమొంది నీ
కతయే తలంచుచున్ గడె ఘు • గంబుగఁ ద్రోచెదు నేఁడు రాఘవా ॥
చ॥ విసుగుచు నింద్రియావళుల వీక నడంచి దినంబుఁ గాయలన్
గసరులఁ దిన్చు సౌఖ్యములఁ • గాంచక కత్తృణ తల్పమందు దా
విసులఁ దొలంచుచున్ సతము • నిన్నె జపించుచు రాజధానికిన్
వసిగొని శోక పల్లియను • వాసము చేయుచునుండు రాఘవా ॥

పదితల లిరుపది కరములు, విదితంబుగ నేలఁగూల • వింశతి బాహుం
గదవమునఁ గసిమసంగుచు, జదిపిన రఘువీర ! నిన్నె • జపియింతు సదా.
అలీల మౌని పలుకఁగ, శూలియు వనమాలి తమ్మ • చూలి నుతింపం
జాలిన మీదయచే నేఁ, బోలఁగ ధన్యుండనైతిఁ • బుణ్యచరిత్రా ॥
మ॥ అని సీతాపతి తెల్ప మౌనియును రా • మా ! నీయభీష్టంబు దీ
ర్చను నాచిత్తము తత్తఱించె నన శ్రీ రాముండు కీశవ్రజం
బునకున్ మీవనమందు కాయ గసరుల్ • పుష్పాసవంబుల్ జలం
బును నిందారఁగ నుండుఁగాక యన నా • పుణ్యుండు సంతుష్టుఁడై.
శా॥ కాకుత్స్థాన్వయ ! నీకు నీహితులకుం • గావింతు సేవిందు నేఁ
డీ కాంతారము దేవలోకమగు నా • యిష్టంబు సందిల్ల న
స్తోకప్రేమను పొందుఁ డంచొక హవి • స్సున్ వేల్వఁగాఁ గ్రన్ననన్
నాకం బచ్చటి కేగుదెంచెఁ గపులా • నందంబునం దొందఁగన్.

శా॥ సుగ్రీవాదులకున్ మహేంద్ర విభవ • స్తోమంబు విందార మా
ర్యాగ్రీయాన్వయ మందనాకృతికి రా • జ్యాన్నంబు చేకూర్చి స
ప్యగ్రుండై రఘురామ భూపుఁడు జగ • త్ప్రాణాత్మజుంగాంచి నం
దిగ్రామంబున కీవు పున్నచని మ • ద్వృత్తాంతముం దెల్పుమున్.

చ॥ భరతుని శీలమున్ దలఁచు • భావము లెల్లను బోలఁగాంచి చె
చ్చెరఁ జనుడెంచు డెన్నఁగ వి • శేష పథంబగుఁ బోయి రమ్మనన్
సరియని మారుతాత్మజుఁడు • చయ్యన వాయుపథంబునందు తం
దిరి పడి చిత్తవేగమును • దిందుపదం జని బోవు త్రోవలో.

తే॥ గుహుని గని రాము నేమమ్ము • కోర్కెఁ దెల్పి, యవలికేగెను రాఘవుఁ • డసురవధము
సేయుఃద్ధతిఁ గంటిమి • చిత్తమలర, భరతు వర్తనఁ గందమీ • ...ము.

## భరతుడు రాముని రాకకుఁ బరితపించుట

సీ॥ ప్రతిదినంబును రామ • పాదుకల్ అర్చించి, యింద్రియంబు లడంచి • మెలఁగువాఁడు
అన్నిచోటులఁ గల • యనుకంపయొకచోటఁ, బూర్ణరూపము గొన్న • పోల్కివాఁడు
తిలిగియు గొల్లక • కాంతార వాసుల యోరెమే భుజియించు • చుండువాఁడు
చూచిన వెతతోఁడ • జూచు దక్షిణదిక్కు, గాక వేఱొక దెస • గననివాఁడు

తే॥ అన్న వాక్కు చెప్పినటి కరు • ణ్యములుగావు వచ్చునని జీవముల నిల్ప • వలచువాఁడు
కుడుచు నీటికి జీవాత్మ • కును నిజంబు, జీవ మా రాముఁడని చింత • సేయువాఁడు.

తే॥ రాము పట్టాభిషేక సీ • రంభు గాంచి, కాక శాస్త్రవాహిని దరి • గాంచలేని
భక్తుఁడా వాఁడు జానకీ • పతుడు వచ్చు, దినముఁ గూర్చి యాలోచింపఁ • దివిరినాఁడు.

తే॥ తాను లెక్కించు లెక్కలోఁ • దప్పుగలదొ, యనుచు గణకులఁ బిలిపించి • యడుగ వారు
తీఱు నేఁటితోఁ వనవాస • దీక్ష యనుచుఁ, బలుక భరతుఁడు మనమున • భయము చెందె.

క॥ సంపద్భోగంబుల మని, సుంపని పుణ్యుండు నొచ్చి • యుప్మలితముతోఁ
గంపముతో ననుకంప జ, నింపఁగ నిట్టూర్చి తుదకు • నేలన్ వ్రాలెన్.

శా॥ నామీఁదం గృపగల్గునో కలుగదో • నాయార్తి లెక్కింపవో
నామాటల్ మదినుంతువో యునువవో • నాకీవు మన్నింపవో
నామోముం దిలకింపఁగాఁ దలవవో • నాచిత్తముం గానవో
ప్రేమం దల్లులనైనఁ గాంచుటకు రా • వే సత్కృపం జూపవే,

శా॥ నాదౌర్భాగ్యము చేత నీకు నడవిన్ • దాపించిరే శాత్రవుల్,
నీదాయల్ హరి శంభులైన నవిలో • నిల్వంగనే నోర్తురే,
కాదే యింకను కొన్ని యేండ్లు భరత • క్ష్మాపాలుఁడే రాజ్యముం
మోదంబారఁగ నేలనిమ్మనుచు నా • మోదించితే? యగ్రజా!

చ॥ అడవినె యుందుగాక మరి • యాద నయోధ్యకె వత్తుగాక నీ
యెడఁద యదెట్టులుండె నటు • లే జరపింతువుగాక యేదియున్
దడవక నాప్రతిజ్ఞ ఫల • దంబు నొనర్చుచె నాకుఁ గర్జమౌ
విడిచెద నగ్నిలోనఁ బరి • వేదన దీఱ మదీయ జీవముల్.

మ॥ అనుజన్మా! యిటురమ్ము చేరువకు వి • న్నర్థింతు నొక్కండు నీ
వనుకంపంగొని యా వరంబు దయచే • యన్ వేఁడెదన్ రామచం
ద్రుని యేవార్తయు వీనులం బడదు నా • దుష్కర్మ సంప్రాప్తి న
గ్నిని నేఁజొచ్చెద నన్ను వచ్చుదనకన్ • వీక్షింపు మీరాజ్యమున్.

మ॥ అన శత్రుఘ్నుఁడు విహ్వలించుచు హలా • హాలంబు భక్షించు వి
న్నమషం దోఁప ఎడంకి నేలఁబడి య • న్నా! యేమి దోసంబు నీ
కొనరింపం దలపెట్టినాఁడ? మది ని • ట్లూహింపఁగాఁ బోలునే?
నను శిక్షింపఁ దలంచితేల? యిదియున్ • నాచేయు దుష్కర్మమో?

చ॥ జనకుని సత్యవాక్యనిగఁ • జల్పఁగ నన్న వనిం జొరంగ సే
పన మొనరింపఁ గానలకు • బ్రాఁతిగఁ దమ్ముఁడొకండు పోవ రా
ఘవుని పునరాగమావధియుఁ • బోవఁగఁ దమ్ముఁ డొకండు జీవముల్
తనకఁగ వీడుచుండఁ గడ • తమ్ముఁడు రాజ్యము సేయుఁ జెల్లరే?

చ॥ అడవుల నన్నయుండఁ బుర • మందలి భోగములందెఁ దమ్ముఁడన్
నుడి జగమాడునంచు మది • నొచ్చి తపించుచునుండి యగ్నిలోఁ
బడుచును పిన్నతిమ్మఁ దొద • వంగలఁడంచుఁ దలంతుకాక యీ
యెడరు సహించి యే బదికి • యేలఁగఁబోలునె యీ ధరాస్థలిన్?

శా॥ శత్రుఘ్నుం డిటు లక్కఁగా భరతుఁ డి • చ్ఛ న్నొచ్చి యస్థైన నే
ధాత్రిం బాలన సేయుచుంటి నని తా • దా రామభద్రుండు తా
నీ త్రోక్కాటమె గూర్చుచుం దడసె ప • హ్నిం జొచ్చు యె నీల్గుచోఁ
బుత్రప్రేమను కావవచ్చు జనమున్ • బుణ్యాత్మ! విప్పింపవే.

## కౌసల్య భరతు సమాధానపఱచుట

మ॥ భరతుండిట్లు వచించు వార్త వడిగాఁ • బ్రాఁకన్ జనంబెల్లఁ ద
త్తఱపాటొందె బతివ్రతామణి కృపా • ధౌరేయ కౌసల్య దు
స్తర తాపంబున సాహసంబు వలదో • తండ్రీ! జగంబెల్ల ని
ర్భర దుఃఖంబునఁ గ్రుంగి కూలు ననుచుఁ • వచ్చెన్ విచారంబునన్.

చ॥ తలముడి వీడ మేన్వడఁకఁ • దత్తఱపాటున వచ్చు తల్లి న
య్యలఘుఁడు కాంచి యామె చర • ణాంబుజముల్ తలసోఁక మ్రొక్కఁగాఁ

దరియుఁ గుమారు శీర్షమున • తక్కక యక్కునఁజేర్చి నాయనా!
వలదిటు సాహసంబు మము • వారక కావు సుతుండ నీవెకా!

ఉ॥ నీ జనకుం డొనర్చినది • నీ పెదయన్న వనంబు చేరుటల్
నాటగజంపు దుష్కృత గ • ణంబు ఫలంబగుఁ గ్రమ్మఱిల్లమిన్
నాజనన ప్రభావమగు • నాయన! నీదొసఁగేమి యిందు? నీ
నీ జగ మీ విధాన నశి • యింపఁగఁ జేయుట యుక్త కార్యమే?

ఉ॥ నీవగినిం డొరంగ నలరి • నీప్రజయుం బడు సేనయుం బడున్
జావక మేము నిల్తుమొకొ? చానలు మమ్ముల నెంబడింపరే?
చావడె ధర్మమున్? జగము • సర్వము కూలదె నీటతాటమై?
యీవిధి పాపకర్మమని • యెంచవొ? యేమి తలంచి తియ్యెడన్?

చ॥ ధర్మయుతంబులై తనరు • దద్దయు నీపను లెల్ల కాలమున్
ధర్మ విహీనపద్ధతిని • తారుట గానమ యెప్డుదేని నీ
ధర్మ గురుత్వ సంపదలఁ • దక్కక నీవెఱుఁగంగలేమ నీ
శర్మద సత్త్వధర్మములు • శాశ్వతముల్ యుగపాళి మాఱినన్

ఉ॥ ఉత్తమ పుత్త్రి! రామవిభు • లొక్కటఁ బెక్కగు కోట్లు కూడినన్
బొత్తిగ నిన్ను బ్రేమమయుఁ • బోలఁగఁ జాలుదురే? పుణ్యమే
యిత్తెగ రూప మొందినది • హీన్ వహియించిన నీవు వోవఁగా
రుత్తమె కాదె ప్రాణి నికు • రుంబము తోడ నజాండ మియ్యెడన్.

ఆ॥ మాపు రాకయున్న • రేపె రాఁగలఁడు నా, తలఁపు పొల్లుగాదు • తప్పెనేని
రామవిభున కేదొ • రారాని యెడరు ప్రా, ప్తించె నంచు నెదఁద • నెంచవచ్చు.

తే॥ నీవె శాస్త్రధర్మంబులు • నీవుతక్క. శాస్త్రధర్మంబు లొకఁడైన • జగతిలేదు
ఒకఁడు మరణించె ననియెంచి • యుర్వినున్న. ప్రాణికోటులఁ జంపఁ బా • ల్పడఁగఁదగునె

ఉ॥ ఉర్వివి చావు పుట్టుకలు • యోగ వియోగములున్ సుఖాదులున్
సర్వము కర్మజాల ఫల • సంభవమౌటఁ దలంచి సాత్త్వికుల్
గర్వము మోహమున్ వదలి • కాంతురు నిచ్చలు సౌఖ్యమంచుఁ దా
నిర్వృతి గూర్చు రామ జన • నిం గని కైక కుమారుడుఁ డిల్లనున్.

తే॥ రాము సత్య వాక్యము దిన • రాజవంశ. శీలమును చెడ జీవింపఁ • జాల నాదు
ప్రతిననెఱవేర్చుకొందు నీ • పలుకువినని, దొసఁగుశంకయింపు మమ్మరో! విసుగుగొనక

ఉ॥ ఏనును సత్యపాలనకు • నిమ్మగ జీవము పీడు తేపకిన్
మానుఁడనే కదా! జనకు • సూక్తుల నౌదలఁ దాల్చి పెన్నఁగా
జానకిజానికే విధియొ, • జానుగఁ దక్కినవారి కుర్వరన్
బూనిక నెగ్గఁ జేసికొనఁ • బోలవొ? యెక్కడి పాడి? తల్లిరో!

ఉ॥ తల్లి వచస్సు మీఱమియుఁ • దండ్రి నుడుల్ జవదాటకుండుటల్
పెల్లుగ నింపఁ బాత్రమగు • ప్రేమ సమూలముగాఁగఁ ద్రుంచుటల్
చెల్లిన దొక్క రామునకె • చెల్లదు నాకది చచ్చి నామదిన్
వెల్లడి చేసెదన్ గలుష • బృందముఁ బాపెదఁ జూడుఁ డిందఱున్.

## హనుమంతుఁడు భరతుని చేరుట

చ॥ అని భరతుండు చేరఁజని • యగ్నిఁ బ్రదక్షిణ మాచరింపఁగా
జనముల గోడు క్రందుకొని • చయ్యన వ్యోమము ముట్ట నా ఘన
స్వనముల నాలకించి రభ • సంబునఁ గార్యము మించెనంచు న
య్యనిల సుతుండు తత్క్షణము • నందుమ డాసె మహోగ్రవేగు డై.
ఉ॥ డాయుచు రామచంద్రుఁడు క • డంకను వచ్చుచు నున్నవాఁడు స
త్యాయతసంధుఁ డైన భవ • దాయువు వోయెనయేని రాఘవుం
డీయిల నవ్వలం బ్రదుక • నీకొనునే, యని పల్కి తూఱి యం
దాయిత మైన యగ్గి నతఁ • డాఱిచి బొగ్గులు చేసె వ్రేల్మిడిన్.
చ॥ పదపడి వచ్చి యాభరతు • పాద సరోజయుగంబు భక్తి నె
న్నుదురు స్పృశింప మ్రొక్కుచు న • నుం బరిపూత చరిత్ర దాసుఁగా
మదిఁ దలఁపందగున్ సుజన • మాన్యుని రాముని రాక కెన్న
ల్వది గడె లింక నున్న యవి • వారక మీరు గణించి చూడుఁడీ
శా॥ నా వాక్యంబులు యం దసత్య మదియు • న్నన్ మీకు నే మున్నుగా
నీ వహ్నింబడి కూలవా ద ధరజా • క్షేమంబు దిదో వచ్చెఁ బొ
ద్దావర్తించి జనించుదాఁక పలుమా • యామీఁద రాఁడేని నీ
వీ వైశ్వానరులోనఁ జేరుము మనో • భీష్ట ప్రకారంబునన్
తే॥ వచ్చుచోఁ బ్రేమమున భర • ద్వాజమౌని. నిలిపి విందుపెట్టఁ • వేఁడ • నిలిచినాఁడు
తామసింపఁడు పీఁమీది • తత్పరత ను. నీరజాక్షుండు నంశీ • నిరలు. భరత।

## భరతుఁడు రాముని రాక విని యానందించుట

తే॥ అతఁడు ప్రేమలోఁ బంపిన • యాసవాలు, కలదు చూడుమా యనుచు నుం • గరముఁ
గాంచినంత నయ్యది వారి • కనులఁ జొచ్చి. ప్రాణముల నిచ్చె నమృతంబు • పగిదినొప్పి.
తే॥ రోదనము వోయి యానంద • రుతము చెలఁగె, వేఁడి కన్నీరు చల్లనై • వెడలసాఁగె
వ్రాలియుండిన తలలెల్లఁ బైకిలేచెఁ, జేతులెల్లను హనుమ నా • శీర్వదించె.
క॥ పలుమఱు హనుమకు మ్రొక్కుచుఁ, జెలఁగి నటన సేయు సుగుణ • శీలుఁడు భరతుం
డలఘుని ముద్రిక నక్కున, నలమెఁ గనుల నద్దికొనియె • నానందించెన్.

తే॥ వేఱుదుఃఖంబులేనట్టి • విమలగుణుఁడు, భరతుఁడపుడు నిక్కముక్రొత్త • భరతుఁడయ్యె
ఖుఖము లిబ్బొంగె మేనుసు • బూరటిల్లె, నతని యానంద మదిచెప్ప • నలవియగునె ?

తే॥ నిలువుగాఁ బ్రేమ మధికమై • నవ్వు నేడ్పు, నిక్క గంతులు వైచును • నేలఁబడును
చేష్టదక్కఁ బూరించును • చెప్పఁరించు, మలసి తిరుగు మాపతికి న • మస్కరించు.

క॥ ఆడుం డాడుఁడు రాముని, గ్తూడుఁడు కూడుండి యతని • కొమరగు కీర్తిం
బాడుఁడు పాడుఁడు పెతలను, పీడుఁడు పీడుండి యితని • వినుతింపుఁడనున్.

తే॥ కఠినమానస యగుకైక • కడుపునొచ్చు, ననుచుఁ బెద్దలకున్ మ్రొక్కు • నవనిపులకు
మ్రొక్కుఁ బెలుపలకును మ్రొక్కు • మ్రొక్కికొనును, పృథివిఁ గల్గువంటిదె సుమా • ప్రేమగుణము

తే॥ పిదప భరతుండు హనుమంతుఁ • బ్రీతిఁగాంచి, యెవ్వఁడవు తెల్పుమా విన • నిచ్చగింతు
విప్రవేషంబుతో వచ్చు • విబుధపతివొ, ముగురు మూర్తుల నొకఁడవై • తగుదువనిన.

చ॥ అతనికి నాంజనేయుఁ డను • నంజనిపుత్త్రుఁడ వానరుండ మా
రుతిని దినేంద్రనందనుని • రూఢిగఁ గొల్చుచునుండు జానకీ
పతికి హితంబు జేతమును • బలైము గోరక కూర్చు దాసుఁడన్
సుతగుణపూర్ణ ! నీకడ ని • నుంగున వచ్చితిఁ గామరూపినై

క॥ నాయల్పరూపమును నీ, వీయెడఁ గన నిచ్చగింతు • వే యని మార్చెన్
కోయని వెర్గిరు లాఘ్వెన్, ఖీయును మోదంబు నెడఁద వికవికసేయన్

తే॥ పవనసూనుని దొడ్డరూ • పంబు గాంచి, భరత శత్రుఘ్ను లతి మాత్ర • బద్ధమనిరి
సకల జనములు నుడిపడి • పావకున్న, దిగ్భ్రమం జెంది పెల్లు భీ • తిల్లినారు

తే॥ వాయుపుత్త్ర ! మేమాదు • వాక్కులెల్ల, నీవెవుల కందునంతటి • నిన్వనంబు
కలని కాపు కావున దొల్లి • టిరణి నిలిచి, నీ మహా రూప మడఁపుము • నియతచరిత !

తే॥ అనుచుఁ బ్రార్థింపఁ దనివేడ్క • ననుసరించి, పిన్నరూపంబు గైకొన్న • విబుధనుతున
కమిత సంపదలను భూష • ణాంబరములు, సుదతిగాఁ గైకపుత్త్రుఁడు • దొసఁగె ప్రీతి.

తే॥ మత్తగజము లుత్తమజాతి • మణులు తురగ, చయములను పాఁడి గోవులు • స్యందనంబు
మంచి కేదా ములను ని • మ్మాన పూర్వ కముగ నొసఁగెను హనుమకుఁ • గైకసుతుఁడు

తే॥ తమ్ముఁ వీక్షించి మరి పౌర • పతికి నెల్ల, రామవిభు నెమర్కొన బంధు • రాజితోడ
బయలుదేఱుఁడియని యున్ని • వాచలంచి, తెలియజాటింపఁ జేయుము • తెఱఁగుఁ గాఁగ

తే॥ తోరణములు గట్టించి వీ ధుల నలంక, రింప రథగజాశ్వంబుల • రీతిగాఁగఁ
బొలుపు సేయింప మంగళ • పూర్ణకుంభ, ములను పెట్టింప వలయు వా • రలను పనుప.

తే॥ క్రమముగా భరద్వాజునా • శ్రమమువఱకు, ముత్తెములపందిరులమర్చి • పురమునెల్లఁ
గ్రొత్తదగునట్లు పేయించి • కొమరు మీఱ, మంగళారావములను చె • లంగఁజేయు

తే॥ అనుడు శత్రుఘ్నుఁ డప్పుడ • యరుగుదెంచి, శుద్ధగుణయుతుఁడును బ్రహ్మ • సుతుఁడు హితుఁడు
మంత్రియును ప్రాజ్ఞుడైనను • మంత్రుఁ గనిచి, భరతునాజ్ఞను వివరించె • బంధురముగ.

సీ॥ అవార్త చెవిఁజొచ్చి • నంత సుమంత్రుఁ డ, త్యానందమునఁ దమ్ము • తావ మఱచి
భేరులు మ్రోగించి • వీథివీథికిఁ బవి. కకుబంత విశ్రాంత • కలిత కీర్తి
రావణ సమవర్తి • రామమూర్తికి నెదు, ర్కోలు సేయఁగ రాచ • కొమరులు బల
వితతులు పురజనుల్ • వేడ్కతోఁ గై సేసి, కొవి రండనుచు మీరు • ఘోషణంబు

తే॥ సేసి రండని కింకర • శ్రేణి నంప, వారు చాటించి రంత వ • వ్వలుకు విన్న
ప్రజలు కోలాహలము సేయఁ • బత్తనంబు, పూర్ణ చంద్రోదయాంబుధి • పోలుపునొందె.

సీ॥ రాము నెదుర్కొన • రండను చాటింపు, పేరకుఁ బెన్నిధి • విధము యయ్యె
రాము పెండ్లికి మున్ను • రండని చాటించు, కరణి నొప్పారెను • మురజ రవము
అఱువదివేల య • క్షౌహిణుల బలంబుఁ, బౌరకాంతామణుల్ • పౌరవరులు
రాజకుమారులు • ప్రార్థించు సంపద, యెదురైన చందాన • ముదము నొంది

తే॥ పౌవలి నడచిరి తల్లులు • ముగురు పసిఁడి, శిబికలం బెక్కి వెడలిరి • శిష్టజనులు
బంధువులు పరివేష్టింప • భరతరాజు, లీలగా హనుమంతుని • కేలుపట్టి.

తే॥ రామభద్రు పాదుకలు శి • రక్షముగాఁగ, విరుగెలంకులఁ బైఁడివా • మరలు వీవ
గజఘటలు మున్నుగా నేగఁ • గలితపాండు, రాతపత్త్రంబు నీడలో • నడుగుదెంచె.

మ॥ కృప మమ్మేలిన రామచంద్రు నెదురం • గేల్మోడ్చి స్వామిదితో
నృప సంపూజ్యుఁడు పాదచారియయి తా • నే తెంచుచున్నాఁడు వ
చ్చు పథంబందున రాలు నేఁడిగొని కా • ల్మ్రుం గోపులా క్రొ వ్వాయం
బపచారం బని దాఁచెనో యన సిమ్ము • దస్తాద్రిఁ జేరెన్ వెసన్

భరతున కాంజనేయుఁడు గాథ సమస్తంబు దెల్పుట

తే॥ భరతుఁ డయ్యెడ మారుతి • వదనము గని, రామచంద్రుఁడిన్నాళ్లుగా • రవముతోడ
నెచ్చటెచ్చట నుండె? నే • మేమిచేసె? వివరముగఁ జెల్పవే యన • వినియె నతఁడు.

తే॥ పుత్రమనందుండటయుఁ దల్లి • వరమువలన, ననుఁ జేగుటయును నీవు • వచ్చి యతని
పేఁడ పాదుకలం గొని • వెడలుటయును, తెలుపనేటి కన్వలి కత • దెలుపువాఁడ

ఉ॥ దండకయందు చేర మని • తండము రాక్షస హింపఁ దెల్పి నీ
యండమ చేరినార మిఁక • నాపద దీరించి కావుమన్నఁ గో

దండధరుండు రాఁగ న • దం బొనరించె దశాస్యుఁ గూల్చె ను
ద్దండ పరాక్రమంబున య • ట్లావిధిఁ దెల్పెద నాలకింపుమా.

చ॥ తన యువతిన్ గ్రహించి రిపుఁ • డప్పక వీరుఁడు మాటిమాటికిం
బనువడ వచ్చివచ్చి తన • భావము మార్చెదరంచు దండకా
వనమును చేరుచోఁ దెవక • వచ్చు విరాధుని గూల్చి యవ్వలన్
దనుజాలఁ గూల్చ మౌనులకుఁ • దా నభయం బొసఁగెన్ మహాత్మకా!

మ॥ పదియేం డ్లచ్చటనుండి రాఘవుఁడు త • ద్వాక్యప్రకారంబుగా
నదథిం ద్రావు నగస్త్యుఁ జూడఁ జని యా • యుత్కృష్ట దేవర్షి కాం
క్ష దలిర్పంగ ముకుందు కార్ముకము న • క్షయ్యంపుఁ దూణీరముం
బ్రదరంబుల్ తరవారి బొందదము గా • రంబార సీయం గొనెన్.

మ॥ అవలన్ వారు జటాయువుం గలిసి నె • య్యంబార సేవించి పం
చవటింజేరి కుటీరమందు దినము • ల్సాగించుచుండంగ దా
నవి యొక్కర్తుక చుప్పనాతి యెదురై • నారీమణిన్ జానకిన్
దవదాహంబును బోలె ముట్టి కొని పోఁ • దర్కింప సౌమిత్రియున్.

మ॥ కని యా రక్కసి కర్ణనాసికలు లాగిన్ • ఖండింప నాదైత్యయుం
గినుకం బోయి ఖరాదులం గలిసి యా • కీడ్పాటు దెల్పంగఁ ద
ద్దనుజుల్ కోప సమేతులై బలిమితో • దర్పించి శ్రీరామచం
ద్రునితోఁ గయ్యముసేసి మాఁడి రగినిం • దూదిం బలెం గ్రచ్చుఱన్.

శా॥ లంకాద్వీపము చేరి శూర్పణఖ పౌల • స్త్యున్ సమీపించి తా
నంకెం బొందిన పద్ధతిం దెలిపి మీ • నాంకధ్వజంబో యనం
బొంకం బారు విదేహకన్య చెలువం • బుం దెల్పి ప్రేరేఁపఁగా
లంకేశుండును వచ్చె సీతఁ గొని పో • లంకించి మారీచుతో.

శా॥ మారీచున్ హరిణంబుగాఁ బనిపి తా • మౌనీంద్రవేషంబుతో
శ్రీరామాంగన యున్నభూమిని పెక • ల్పెం దేరిపైఁబెట్టె నా
డారిం బోవఁగనీక యడ్డు విహగేం • ద్రస్వామిఁ జక్కాడె లం
కారాజ్యంబునఁ గార మంచె జనక • క్ష్మాపాల కన్యామణిన్.

మ॥ ఎలయింపం గమకించి దవ్వులకుఁ ద • న్నీడ్పించు మారీచ రా
ట్కులసింహుండగు విశిఖ • క్రూరాహతిం గూల్చి య
వ్వల వైదేహిని రోయుచున్ జనకుఁడౌ • పక్షీంద్రు వీక్షించి కాం
దలపాటొంది సమాచరించె వడి నౌ • ర్ధ్వ ప్రక్రియల్ భక్తిమై.

సీ॥ వదపడి సీతను • వెదకుచు దక్షిణ, దిశ కేగుదెంచుచుఁ • దివిరి పట్టు
వికృత రూపుఁ గబంధు • వికటశాపము మాన్పి, శబరి చేసిన యుప • చారములను

ప్రేమను గైకొని • యామె తెల్పిన త్రోవ, నిన సుతుఁ జేరి స్నే • హించి వాలి
వలనఁ గల్గిన దుఃఖ • ములఁ దీర్తునని యభ, యము దయచేసి సా • లములఁ గూల్చి

తే॥ వాలి వక్షంబు భేదించి • ప్లవగ రాజ్య, మును దినేంద్రసూతికిఁ బ్రేమ • మున నొసంగి
వానకాలంబు కడచు న • వ్వలను తోడు, వెదఁగ రమ్మని పంపె న • బ్జానసుతుని.

సీ॥ గజుఁడును గవయుండు • గంధమాదనుఁడును, పనసుండు నీలుండు • వాలిసుతుఁడు
శరభుండు ఋషభుండు • శతబలి మైందుండు, ద్వివిద జాంబవదాది • వీరవరులు-
డెబ్బది వెల్లువల్ • ప్రబ్బిన సేనతో, వానకాలము దాఁటఁ • బ్లవగ విభుఁడు
వచ్చి యచ్చట నన్ని • వంకల సీతను, వెదకు పద్ధతులను • విశదపఱచి

తే॥ నాల్గుభాగముల్గాఁగ సై • న్యంబుచేసి, యొక్కొక విభాగ మొక్కొక • దిక్కువెదకి
నదిగ నెలలోనఁ గ్రమ్మఱి • వచ్చునట్లు, కఠిన శాసన మొనరించి • కడఁక నంపె.

ఉ॥ అంగద జాంబవంతులు ర • యంబున దక్షిణదిక్కుచేరి వ
న్నంగనఁ గాంచి రమ్మనఁగ • నంబుధి దాఁటితి లంకఁ జేరితిన్
రంగుగ సీతఁగాంచి రఘు • రాముని వార్తల విన్నవించి యా
సంగతి రామచంద్రునకుఁ • జక్కఁగఁ దెల్పితి నంత నందఱున్.

ఉ॥ దక్షిణవార్ధిఁ జేరుతఱిఁ, దక్కక రాముని శౌర్యసంపదల్
రాక్షసరాజుతోఁ దెలిపి • రాముని కాంతను వీడకున్న వి
పక్షయు లక్ష్మి నాశమగు • నన్న విభీషణుఁ దిట్టి దానవా
ధ్యక్షుఁడు వెళ్ళఁగొట్ట నతఁ • డార్యుని జేరఁగవచ్చెఁ బ్రీతిమై.

శా॥ కాకుత్థ్సుం డభయం బొసంగి వెస లం • కారాజ్య పట్టాభిషే
కం బట్టము గట్టి శాంతియుతుఁడై • వీరుండు ప్రార్థింపఁగా
నాకర్ణింపమి రోషభీషణ ముఖుం • డై చూడ సప్తాంబుధుల్
చీకాకై జలమింకి మాఁడెను పర • శ్రేష్ఠుల్ వితాకొందఁగన్.

ఆ॥ శరణు శరణమంచు • వరుణుండు ప్రార్థించెఁ, దరులు గిరులు ప్లవగ • వరులుదెచ్చి
వనధిఁబూడ్చి దనుజ • వరుని లంకనుచుట్టి, చేసినారు వీర • సింహరవము.

శా॥ కైలాసంబుఁ బెకల్చు బాహువులు ది • క్కారంగ శృంగంబు లా
ఖీల ప్రక్రియ నాటినట్టి యురమున్ • వీకైన శీర్షంబులున్
లీల న్నేలకు వ్రాల్చి వాని యనుజున్ • వేఁటాడి రాముండు ని
ర్మూలించెన్ దనుజాన్వయంబు ప్రమదం • బుం బొంద బృందారకుల్.

ఆ॥ దనుజ యువక వరులు • దనుజేంద్ర సుతులును, లక్ష్మణాస్త్రములకు • లక్ష్యమైరి
సంగరాంగణంబు • శవమయమయ్యెను, సురలు మునులు ముదము • చోద్యమంద.

ఆ॥ అమర సిద్ధ సాధ్య • యక్ష గంధర్వాదు, లెలమి సతులతోడ • నిలకు వచ్చి
వినతి నిలిచి బహుళ • వినుతులు చేసిరి, తొలఁగె లోకములకు • దొసఁగు లనుచు.

చ॥ అమరఁగ రావణాదులకు • నంతిమకార్యములెల్ల సద్విధి
క్రమమునఁ జల్పుమం చసుర • కాంతు విభీషణు నంపి జానకీ
రమణిని కోపగించి యెదు • రన్ శుచినిల్పి పరీక్షచేసి కాం
తము వహియించె రాఘవుఁడు • ధాతృహహరేంద్రులు సంస్తుతింపఁగన్.

చ॥ అనదృశ సత్యవాక్యుఁడగు • నాటి విమానమునందు వచ్చి నం
తనమున మ్రొక్కు సూనులను • తత్పరతన్ బిగి కౌఁగిలించి మె
చ్చి నదలు మోదవారి నభి • షేకముచేసి విదేహకన్యకన్
గౌనరవి ప్రేమతోడఁ గయి • కొమ్మన రాముఁడు నమ్మతించుమన్.

ఉ॥ పెంచిన తల్లి కైకయుఁ • బేరిమి నామె కుమారుపైని మ
న్నించిన నిష్కలంక లన • దుత్కట భావము నుంచ వేఁడెదన్
గొంచక యీవరమ్మ నొనఁ • గూర్పుమ యన్న నొసంగి సత్యస
త్త్వాంచితమూర్తి మీ జనకుఁ • డాదటఁ జేరె ముకుందలోకమున్.

చ॥ పదపడి వేల్పులన్ మనసు • పాటిన పెక్కువరంబులీయ దె
బ్బదియగు వెల్లువల్ దనుజ • బంధులు రాక్షస వీరవాధు ల
ద్వది యగు నేడుకోటు లల • రంగ విభీషణుఁ డిచ్చెఁ బుష్పకం
బదియచుమీ వియత్పథము • నందు జపంబున వచ్చుచుండెడిన్.

ఆ॥ నెమ్మి రాఘవుండు • నిన్ను దలంచుచుఁ, దమ్ముతోడ జనక • తనయతోడ
సకల హితులతోడఁ • జని భరద్వాజుని, యాశ్రమ స్థలంబు • నందు చేర.

తే॥ ఆతఁ డాతిథ్య మీయంగ • ననువుపఱువ, నిన్నుగాంచి యీముద్రిక • నీకుఁ జూపి
యూఱడింపంగ నన్నం పె • మరవడి మెయి. రామచరిత మియ్యది మహా • రాజ తిలక!

మ॥ భరతుండంతయు సావధానమతియై • పాటించి యాలించి ని
ర్భర మోదాద్భుత సంభ్రమంబు లెద నా • రం గూరి మల్లాడ నా
ఉర పాత్రుండయి యొక్క తమ్ముఁడు నమి • ద్ధాత్రిన్ సహాయుండుగా
వరసాహాయ్యంబు నిసంగనోపికిని దౌ • ర్భాగ్యుండ నేవియ్యెడన్.

ఆ॥ అనుచుఁ బలికి భరతుఁ • డధిక నిర్వేదంబు, తోడఁ గాలినడక • తోడ హనుమ
తోడ నడచిచేరెఁ • దోయజాప్తుఁడు తొలి, గట్టు నెక్కుమున్నె • గంగ కడకు.

శా॥ ఘోరాకారుల రావణాదులను త్రై • క్కోల్చేసి యుద్యజ్జయ
శ్రీ రాజిల్లఁగ రాఘవుండు నగరిన్ • శ్రీదేవి భూదేవి త
న్నారాదింప మహాభిషిక్తుఁడగు నం • దానఁ దుందై పూర్వ ది
గ్వీథిం దంపిన కాన్కయో యనంటలిన్ • విభ్రాజిలెన్ భానుఁడున్.

మ॥ అకలంకుఁ డటఁ గాలకృత్యములు నొ • ప్పారంగఁ గావించి పా
దుకలన్ భక్తిని పూజచేసి మఱి వా • తూలాత్మజుం గాంచి దై

త్యకులాహివ్రజ పక్షిరాజ ! రవికే • జా ! నీదు వాక్యావళుల్
వికటార్థంబును బొందగావగునె యీ • విశ్వంభరన్ ? మారుతీ !

మ॥ కపిసైన్యంబులు దైత్యవాహిను లసం • ఖ్యాకంబులై వచ్చుచో
విపులక్షోణి భరింపలేక వెగడున్ • వేపొంద ధూళి వ్రజం
బుపరి వ్యోమముఁ గప్పదే ? యలబలం • బుద్వేలమై లేచి స
ప్త పయోరాసుల ఘోషణంబు పగిదిన్ • వర్తిల్లదే ? పావనీ !

మ॥ పరివారంబులు విండియుండెను భర • ద్వాజాశ్రమం బింక ద
వ్వరయన్ లేదు ప్రశాంతమై యమరునే • యాపీడుపట్టంతగా
బరువై నామది సంశయించెను జగ • త్ప్రాత్మజా ! జానకీ
శ్వరుఁ డెందుండెనొ తెల్పరాదె ! యనుచున్ • సామీరి తానిట్లనున్.

మ॥ వ్రతసంపన్న ! మునీశ్వరుండు సురలన్ • బ్రార్థించి కల్పింప స
న్మతిఁ బుష్పావన కందమూల ఫల సం • పత్తిం బ్రపేవించి నో
ళ్లతిమాత్రంబుగ నార్పలేవి గతచే • వట్లుండెఁ గాదేవి వి
ద్రితమై యుండఁగఁబోలు నిక్కమిది చిం • తింపంగ నీకేటికిన్ ?

గుహుఁడు రాముం గానవచ్చుట

ఉ॥ కన్నులపండువై తనరఁ • గాంచెదు రాముని నాక నిప్పుడే
పన్నగ నంచు సాంత్వనము • పల్కఁగ వచ్చుట మౌని వింద వా
ప్రన్నజవ ప్రసన్నమతి • బాఁతిగ మిత్రులతోడఁ దృప్తిమైఁ
గొన్నతఱిన్ గుహుండు కను • గోఁ జనుదెంచెను గొప్పసేవతో.

ఉ॥ వచ్చి మనంబు కన్నులును • వాఁచిన వోల్కిని గాంచి కాంచి పై
విచ్చుఁ బ్రదక్షిణించి రహి • యించి పదంబుల వ్రాలి రాముఁడున్
గ్రుచ్చి కవుంగలించుకొని • కూరిమి మీఱఁగ క్షేమవార్తలన్
మెచ్చుగఁ బల్కసేయ రము • వీరుని చూచి గుహుండు ప్రీతిమై.

ఉ॥ నాకక డాసుపై భవ ద • పార కృపారస దృష్టి గల్గుచో
దార సుతాదు లౌదురె యు • దార హితుల్ ? వెనువెంటనంటి సే
వారతి నున్న లక్ష్మణుని • భాగ్యము నోచని దుర్భగుండ నా
కారయ క్షేమసంపదల • కంతముగల్గునె ? రాక్షసాంతకా !

మ॥ అని చింతించు గుహుం గనుంగొని ఘన • శ్యాముండు రాముండు తొ
ల్లిటి ప్రేమంబున నీవు నాభరతుకం • టెన్ జూడ వేఱుయ్యేదే ?
ఘన సౌఖ్యంబులు గల్గుగాత మన నా • కైవర్తకస్వామి భ ,
క్తిపి భూజానకు లక్ష్మణాఖ్యునకుఁ బ్రే • మైక్యన్ వారు దీవింపఁగన్.

తే॥ గుహుని రవిసుతాదులకుఁ బె • న్గూర్చిఁ జూపి, యితఁడు మన స్నేహితుఁడు జీవ • హితుఁడ గాం
ఘూములకువేఁడు గుహుఁడను • పుణ్యచరితుఁ, డనుచుఁ దెలుప నెల్లరుగొని • యాడిరత).

క॥ ఎల్లరు విష్ణుగోష్ఠిగ, నుల్లాసంబునను గలిసి • యుండఁగ రవి రం
జిల్లెను వడమటికొండన్, ఫుల్లాబ్జాక్షుఁడు స్వకృత్య • ముఁ దీర్చికొనెన్.

తే॥ సీతతో రామచంద్రుండు • సెజ్జఁజేరె, గుహుఁడు సౌమిత్రియును కపి • కోటి దనుజ
నికరముమ పరివేష్టించి • నియతినుండఁ, బెల్లు మాటల దెల్లనఁ • దెల్లవాఱె.

శా॥ పంకేజాక్షుఁడు కాల్యకృత్యముల ని • ర్వర్తించి మౌనీంద్రు మో
దాంకంబైన యనుజ్ఞగైకొని విమా • నారూఢుఁడై యోగి వి
శ్శంక ప్రేమమయాంతరంగుఁడగుచున్ • సాగింప వెన్నంట నా
తంకంబేమియు లేక వెల్వడియె మి • త్రవ్రాతముల్ గొల్వఁగన్.

తే॥ పుష్పకంబు శీఘ్రంబుగఁ • బోవుచుండఁ, జందమైన శిల్పంబుల • నందమొంది
యింద్రపురి ధిక్కరించుచు • నెసఁగు స్వపుర, దుర్గ కుడ్యముల్ కమలకుఁ • దోఁచెదవియ.

తే॥ అనుఁగులంగని వర్ణింప • నలవికాని, యశమునొందిన సూర్యాన్వ • యాధిపతుల
రాజధాని కానఁగవచ్చె • రాజిలంగఁ, గాంచుఁడన లేచి కేల్మోడ్చి • కాంచినారు.

## భరతుఁడు శ్రీరామాదులం గాంచుట

తే॥ గగనమందు పెక్కురు దివా • కరులకాంతి, గలిగి వెలుఁగు విమానంబు • కానఁబడఁగ
నదిగొ వచ్చె రాఘవుఁడని • యాంజనేయుఁ, డలరి కేకలువైచి ప్ర • క్కలకుఁ జూచి.

క॥ కమలాక్షుఁడు కపిసేనయుఁ, గమలవదన లక్ష్మణుండు • కన్నులు తనియన్
బ్రమదమున నేగుదెంచిరి, తిమిఁగనుమని చూపె భరత • ధాత్రీశునకున్.

ఆ॥ ఎల్లలోక వాసు • లెక్కనఁ జోటింత, యొనరునదియు పాటి • యొనరనిదియు
జిగి దిశాంతములకుఁ • జిమ్మునదియునైన, పుష్పకంబు గాంచె • భూరియశుఁడు.

తే॥ మేరు గుహను మెఱుముతోడి • మేఘభాతి, పుష్పకమున జానకితోడ • భూవరుండు
కావరాఁ గాంచె భరతుండు • కన్నవారి, కలకలము లేచి లంకను • కదలిచనియె.

ఉ॥ స్నాయు వసా వికార మలి • నమ్మగు దేహము వీడి సత్యమున్
బాయక కోరి విష్ణు భువ • నంబు భజించిన తండ్రిఁ గాంచు నా
తోయమునొంది కానలకుఁ • దూలిన ప్రాణమువంటి యుల్లస
త్తోయజనేత్రుఁ గాంచె భర • తుండు కుతూహలియై రహించుచున్.

తే॥ దోవుపోయిన వస్తువు • దొరకినట్లు, వెతలు దొలఁగంగ సమ్మోద • వివశుఁడగుచు
భువనవంద్యునకుం గేలు • మోడ్పఁదలఁచి, భరతుఁడప్పుడు పావని • కరము వీడె.

క॥ హనుమంతుఁ డపుడు గగనం, బున నచ్చు విమానమునకు • మున్నుగఁ జని రా
మునకుఁ బ్రియమ్ముగ వందన, మొనరిచి యిట్లనియెఁ గ్రేవ • కొదిఁగి నిలుచుచున్.

ఆ॥ వహ్నిఁ బడఁగమన్న • భరతుని చేరి మీ, జాడ దెలిపి సాహ • సంబు మాన్పి
యెల్లరకును మోద • మొసఁగించితిని వారు, వచ్చి రదుగొ ధాత్రి • వరుఁడు వలరి.

ఉ॥ మారుతి! దుర్భరంబులగు • మాయెడరుల్ బహుళంబులయ్యు నీ
వారని సత్కృపామతి ని • వారణచేసెను మాతపఃఫలం
బీ రహి నీస్వరూపమున • నే డ్తెఱవచ్చి తొలంగఁదోలె నీ
పారము లేని మేలునకుఁ • బ్రత్యుపకార మొకండు కల్గనే!

చ॥ నిరతము తోడునీడయగు • నిన్నును నాతలిదండ్రులం గృపా
శరధిని లక్ష్మణున్ భరతుఁ • జయ్యన నొక్కొకమాటలోనఁ ద
ద్గురుగుణ సంపదల్ దెలుపఁ • గూడునె? సన్నుతశీల! దానవ
ద్విరద మృగేంద్ర! మేరు సమ • ధీర! మదీయ తపఃఫలాకృతీ!

తే॥ ప్రథితగుణుఁడు రాఘవుఁ డిట్లు • పలుకుచుండఁ, బాదుకలఁ దలఁదాల్చిన • పావనుండు
వ్రతములం గృశియించిన • వాఁడు కేలు, మోడ్పుగలవాఁడు భరతుఁడు • మొనసి డాసె.

తే॥ తల్లి గుణములకుం బగ • దాయ కొన, లమ్మనేలిన యేలిక • తమ్మగుట్టి
వచ్చె గనుమని చూపె శ్రీ • వల్లభునకు, ధర్మములకెల్ల సాక్షిగాఁ • దనరు హనుమ

క॥ కాంచిన రాముఁడు దశరథుఁ, గాంచిన తఱినొందు కౌతు • కంబును పొందెన్
మించి తన మేను పులకల, నించెన్ గనుదోయి జలము • నించెను తోడ్తోన్.

క॥ కాంచెద జనములఁ బౌరుల, సంచితులన్ గురుల బాంధ • వావలినెల్లన్
గాంచెదఁగాకని మనమున, నెంచిన యంతన విమాన • మిలకుం దిగియెన్.

క॥ క్రిందికి దిగిన విమానం, బందఱకును పుణ్యఫలము • నందింపంగా
బృందారక లోకమునకు, నొందం గొని చను విమాన • మోయన నొప్పెన్.

సీ॥ ఎడపడియున్న క్రే • పెనయ గోవును డాయు, పలుమగాఁ గన్నత • ల్లులకు నొప్పె
మాయనీఁగిన వారి • మనము లయించు జ్యో, తీరూపమునఁ దన • స్థితుల కొప్పె
వ్యాధిచే నీఁగిన • ప్రాణముల్ మరల న, చ్చిననొల్కి కోసల • జనుల కొప్పెఁ
గన్నవారలకెల్లఁ • గన్నతల్లిగ నొప్పె, మగువలకు మధువు • వగిది నొప్పె

తే॥ భరత శత్రుఘ్నులకుఁ గను • పాపలట్లు, ప్రేమగలవారలకు సురా • మృతము కరణి
నొప్పె నప్పుడు తమునీడి • యున్న రామ, భద్రు నాగమనము కను • పండు వగుచు.

ఉ॥ రాముఁడె జీవమై తనరు • రాజ్యమునందు నయోధ్యయందు రా
మామణులున్ జనంబులును • మానిత శుద్ధ మనోజ్ఞ భావ సు
స్థేమము లొందినారు సుర • సేవ్యుని రాకను హేమపుత్త్రికా
స్తోమము జీవ మొందుక్రియ • నోలిలినారు ముదంబు పెంపునన్.

తే॥ చందనము గంధ వొదియుఁ బుష్పములు వెన్న, తురగ ఫేనంబు గజమద తోయములును
మోద బాష్పముల్ గలిసి స ; ముద్రజలము, పగిది మహిఁ బొంగెఁ బ్రవహించె • వనధిఁ జేరె.

చ॥ ధరణికి దిగ్గఁ బుష్పకము • తల్లుల తమ్ము లరుంధతీవిభుం
దురవుగ నెక్కనంతఁ బురు • షోత్తముఁ డప్డు వసిష్ఠు పాద పం
కరుహము లంటి మ్రొక్కఁ దమ • కంబున నాతఁడు లేవనెత్తి యా
దరమునఁ జెక్కుమూర్కొ తన • వందనముం బొనరింప దీవనల్

చ॥ పదపడి లక్ష్మణుండు పద • వందనముం బొనరింప దీవనల్
ముదమునఁ జేయుచున్ శిరము • మూర్కొనె జానకి వచ్చి మ్రొక్కఁగా
సదయుఁడు సర్వసౌఖ్యము లె • సంగుతమంచు వచించెఁ బ్రీతి గ
ద్గదిక రవంబుతోడఁ బు ల • కమ్ములకుం గులకమ్ముగా నొదల్.

మ॥ తొలుతన్ రాముఁడు కైకయం బ్రముఖ సం • తోషంబుతో మ్రొక్కి య
వ్వేలఁ దక్కంగల తల్లులం దెలవ న • వ్వారల్ మహోత్కంఠతోఁ
బలుమాఱుల్ తల మూరుకొంచుఁ దనువున్ • బాధంబుగా దువ్వుచున్
జెలఁగన్ మోద జలాభిషేచనము తు • ష్టిం జేసి రప్పట్టునన్.

మ॥ పొలుపొం..న్ ధరణీ తనూజయు యథా • పూర్వంబుగా వారికిం
దెలుపన్ మా కులదీపమంచుఁ బొదువన్ • దీవించి రావెన్కఁ ద
ద్బలుఁడున్ లక్ష్మణుఁ డర్థి మ్రొక్కఁ దనువుల్ • పూరిలవ నొక్కండవే
జ..జా కేక్షణు తమ్ముఁ డైతివని రా • ..ంసించి దీవించుచున్.

సీ॥ పాదుకలను తన • భక్తివి నామక. గా ..ర్పించి త • ద్ఘన పదముల
వ్రాలిన భరతుని • బోలంగఁ గవి రామ. విభుఁడు మిక్కటమగు • వెత గడించి
నాల్కయెండఁగ నొక్క • పల్కు పలుకుంప. నేరక వివ్వెల • నిలిచి తనవు
ప్రాణంబు లొకటగు • పగిది బిగ్గఁ గవుంగి. లించి మిక్కిలి పర • వించి సోలి

తే॥ యశ్రుధారల పేతి సౌ • ...దిపుచు. గట్టి దూ.. ప్రమ్మోప జడల్ • కట్టితడవి
శిరము మూర్కొని క్రేపును • చేరు మొ.వు. చందము..ముండెఁ బనియత • బాలతేదవు.

చ॥ వినుత మహేంద్ర భోగ పద • విం దృణకల్పముగాఁ ద్యజించి ప
మ్మనివంవేష చర్యలను • పూని యశంబు గడించు తత్పవి
త్రుని చరణాంబుజంబులకు • మ్రొక్కెను భక్తిని లక్ష్మణు గుణ త
ద్ఘన పదరేణువుల్ శిరముఁ • దాఁకి పవిత్రత గూర్ప నాయ్యనన్.

చ॥ వనముల నగ్రజన్ము పద • వారిజముల్ భజియింపఁ దోడుగాఁ
జని శ్రమకోర్చి నిద్రయును • చక్కయఁ జేరఁగ వీక త్రోచి జీ
వనము ల నప్పగించి వసి • వాడిన మేవివి దీర్ఘ బాహులం
దమవుగఁ గౌఁగిలించె భర • తాఖ్యుఁడు దేహము పావనంబుగాన్.

మ॥ దురితధ్వంసియుఁ బిన్నతమ్ముఁడగు శ • త్రుఘ్నుండు సీతాహృదీ
శ్వర సౌమిత్రుల పాదపద్మములు శీ • ర్షంబంటఁగా మ్రొక్క వా
రరుదౌ ప్రేమను కౌఁగిలించికొని • మి త్రాసంబులం జార్చి,ని
ర్భర మోదంబున నల్వురుం బొదలి రా • ర్ద్రింబైన చిత్తంబులన్.

మ॥ జనకక్ష్మావిభు పుత్రికిన్ • భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ మ్రొక్కఁగాఁ
దను దావచ్చిన శీర్షకంబు తొలఁగం • దాటించు శీర్షంబు నె
ట్టన ముల్లోకములం జయించు దనుజా • ధ్య ప్రార్థనం దోచు కా
ళ్ల నాకొండొండు స్పృశించి పావనత పొ • ల్పుంబొందె ధన్యంబులై ,

చ॥ విమలుల సూర్యపుత్రక వి • భీషణ జాంబవ దంగదాదులన్
క్రమముగఁ జూచ వారలు భ • రంబగుభక్తి నమస్కరించి రా
సుమహితచిత్తులన్ దనుజ • సూదను తమ్ములు ప్రేమ మీఱఁగా
సముచిత రీతులం దనియ • సత్కృతులం బొనరించి రత్తఱిన్ ,

చ॥ సచివులు దండనాధులును • సంగడిరాజులు రాసుమంత్రకుం
డచటికివచ్చి సమ్మదము • నంగద పోరొనరింప మ్రొక్కి యా
యచలకు భారమై తొదరు • నావద లేదిఁక నంచుఁ బల్కఁగా
నుచిత విధమ్మున న్నరవ • రోత్తముఁ డాదృతిఁ గాంచె వారలన్

ఆ॥ సేనలెల్ల వచ్చి • సేవింపనందఱు, బుష్పకంబులోనఁ • బొలుపుమీఱ
నిలువుఁడనఁగ వచ్చి • నిలిచి లక్ష్మణునకు, భూదేవి సుతకు • మ్రొక్కినారు.

చ॥ విరుల నరంబు లెల్లెడల • వ్రేలు విమానము చూడఁ బంకజో
దరు నుదరంబొ వార్ధి యమృ • తంబులఁగ్రోలు నగస్త్యు దొడ్డయో
కరతలమో సమానమగుఁ • గాదని ఖేచరు లబ్బమందుచున్
విరులను చల్లినారు రఘు • వీరుని కీరితి నుగ్గడించుచున్ .

సీ॥ భేరి రావములు శం • ఖారావములు బ్రాహ్మ, ణాశీరవంబు గ • జాశ్వరవము
కాహళధ్వనులు మం • గళ నినాదంబులు, ఘనభోంతరములు • బోరు కలఁగ
నంబుధి ఘోషంబు • డంబు విడంబించి, లేఖుల రవముతో • లీనమయ్యె
మహిత విమానంబు • రహిలేచి యటనుండి, సాకేతపథమున • సాగుచుండి

తే॥ యవనితోడను భూజను • లమరపురికిఁ, గదలు వగిది శక్రుండు స్వ • ర్గంబుతోడ
నింక వచ్చుచందంబున • నెనసి వెంసి, పొలుపుతోడ నందిగ్రామ • మునకువచ్చె.

## —: 38. శ్రీరామ పట్టాభిషేక పటలము :—

మ॥ స్థిరసీలుండప రామచంద్రముఁడు నం • దిగ్రామముంజేరి ము
న్నురవై యున్న జటాభరంబు లటనా • యువక్షౌర్మచె నూడ్చి భూ

వర వేషోచిత మండనంబు లిరవొ • ప్పందాల్చి రత్నద్యుతిన్
బురువహూతుంబలెఁ బొల్చెఁ దమ్ములు లసద్భూషాలిచే శోభిలన్.

శా॥ ఆకాశస్థలి నంది నిక్కి ధ్వజ ప • ఙ్త్యాంచ త్కరాబ్జంబులన్
సాకేతంబున కేగుదెంచనుచు నా • నందిల్లు చందాన న
స్తోక ప్రాభవ మందిర ప్రభలతో • శోభిల్లు సాయోధ్యకుజ
శ్రీకంఠాఘుఁడు చేరనెక్కె రథమున్ • శ్వేతాశ్వ సంయుక్తమున్.

తే॥ కొమరుగాలక్ష్మణుఁడు తెల్ల • గొడుగుఁబూనఁ, జామరంబు శత్రుఘ్నుండు•దాఁచివీవ
దివిరి భరతుడు బంగారు • తేరు దోల , సుత్సుకుండయి రాముఁ డ•యోధ్యకేగె.

ఉ॥ వానరనాథుఁడున్ దనుజ • వర్యుడు భద్ర గజాలమీఁద న
మ్మానిత రీతి నెక్కి యిరు • మైఁ జనుదేరఁగ నంగదుం దనం
ఖ్యాన జనంబు నందడుల • నారఁగబాపుచు ముందుపో హనూ
మానుఁడు వెంబడించెను న•నుంచితభక్తి భజించి కాల్నడన్.

చ॥ సమధిక గౌరవంబులరు • స్థానములైన మనుష్యరూపముల్
ప్రమదముతోడఁ గైకొని • సు వాసిత చందన గంధ ఘుంఘుమల్
కమియఁగ వానరుల్ హరుల • గంధగజంబుల మీఁదనెక్కి న
క్రమముగ ముందు వెన్కలను • ప్రక్కల నేగుచునుండి రొయ్యనన్

చ॥ ద్విరదములన్ బసింది మణి • తేరులఁ దేజుల నెక్కి ఛత్ర చా
మర విభవంబుతోడ నృప • మాన్య కిరీటముతోడ నొప్పు మా
వరు లసమంత్రుడు వంద్రుడుగురు • భక్తిని నూరెలనిల్చి కొల్చుచున్
నరస సుహృదాప్తులన్ హిత య • శస్కర వార్తలఁ బల్కి చుండఁగన్.

చ॥ కపికుల కామినుల్ విబుధ • కాంతల రూపము లొంది నిర్మల
చ్ఛవులలభంగి హస్తినులఁ • జక్కని గోడిగ లెక్కి చుట్టి రా
విపులకుమారి రిక్కగమి • వెల్గునిశాకర దింబమో యనన్
దివురులు గట్టు కాంతులను • తేజిలి యేగె విమానమందునన్.

చ॥ ఖచరులు మౌనులుం బరమ • కౌతుకమందఁ బ్రసూన వర్షమున్
బ్రచురము గాఁగఁ జింద ధర • స్వర్ణ లతాంత మయంబ యౌట నా
యచల వసుంధరాఖ్య యట • సార్థకమై తనరారె రాట్కృపా
విచలిత దృష్టి హేమమయ • వృష్టిఁ బ్రపాతమొనర్చె నిట్టనన్.

ఉ॥ వెన్నెల కాలమందొనరు • వీత జలంబగు వారిదంబు నా
నెన్నఁగ నిన్నినాళ్ళు మద • మింతయుఁ గార్చని వారణావళుల్
మన్నని రాకఁగాంచి తమ •మక్కువ లోవల నిల్వజాలమిన్
బ్రన్ననఁ బ్రోచికొంచు వెలి • వచ్చెనొకో యనఁ గార్చె నత్తఱిన్.

ఉ॥ మూఁగలు మాటలాడుక్రియఁ • బోఁడిమి పేశలొనర్చె వార్యముల్
బాగుగఁ బుష్పవాటికలు • వల్లవితంబులు పుష్పితంబులై
మేఁగెసు పువ్వుఁబోండ్ల యెల • మేనులు బంగరు రంగుమీఱె రా
మాగమ మొప్పె ధాత్రిని చ • రాచర కోటికి మోద దాయియై.

ఉ॥ రాజ్యము నేలఁగా దగిన • రాముఁడయోధ్యను చేరి తల్లులన్
బూజ్యులఁ్రమొక్కి వేల్పులకుఁ • బూజలొనర్చి వసిష్ఠు నాజ్ఞమైఁ
బ్రాజ్య ధరాధిదేవియును • పద్మ నివాసిని యుల్లసిల్లఁగా
భోజ్యపదాస్పదంబైన • భూపతి హర్మ్యముఁ గాంచె నయ్యెడన్.

చ॥ వలువలు వీడఁ జూడకయు • భామలు ధీరులు జాఱుచున్న దు
వ్వలువల మాటిమాటికిని • వారక వీడక చెక్కుకొంచు మే
నులు గమనింపనైరి తమి • సూల్కొన నాసవమాని చొక్కుచున్
వలువలు జాఱగా జరగు • బాగున నొప్పిరి చూచువేడుకన్.

ఉ॥ తొందరచే భుజిష్యకల • దుస్వలువల్ నృపతుల్ ధరించుచున్
జందన గంధు లుడ్పురెలి • చల్వలు పూరిషరాజి తాల్చుచున్
గ్రందుగనున్న గుంపునఁ బొ • రం గలవంబు లలంపకున్న నం
దందొరయంగ నిమ్మడిగ • నందెళరీరము లా జనావలిన్.

ఉ॥ రామవియోగమైన తటి • రాములు మోవ పిహీనలై సదా
నోములు నోచుచుం బతి వి • నోదము లొందకఁయుండు వారటన్
రాముని రాకతో శుభ క • రంబగు భూషఁచేత మేనులం
భామలు దాఁచినారు రమ • భర్తల చిత్తము పల్లవింపగ

తే॥ సురకలావంబుతో మను • జుల కలాప, మొగని హొపపవే నరసే • తకుబలకును
వతులు దాసిన తఱినొక•కతము కసని యలుక, పొవమె భర్తపమీఁడ• యపరమరికను.

చ॥ భరతుని గాంచి రాఘవుఁడు • హాపసహిత సూర్యపుత్రుఁ గ
ర్బురవతిఁ దక్కువారలకు • మోదముతోఁ గొనిపోయి చూపు చి
త్రరువులఁ జిత్రదృశ్యములఁ • దప్పుగఁ జూపుసంగ నాతఁ డ
త్యురుతర గౌరవంబున మ • హోత్సుకతన్ గొనిపోయె లోనికిన్

: సుగ్రీవాదులు నగరుసొవలి చిత్రదృశ్యాలఁగాంచుట :—

తే॥ మిత్రవర్గంబు వెంటరా• మిహిరకులుఁడు, పెద్ద ద్వారు దాఁటి గంభీరమగుచు
మేరువుంబోలె విలసిల్లి• శ్రీరహించు, నద్మమైన ప్రాంగణంబు/ సరగఁ జొచ్చె.

చ॥ రవిజ విభీషణాదులు సు • రత్న మయూఖచయంబు లెల్లెడన్
బ్రబలవిమలకాంతులన్ వివిధ • భంగులఁ జిమ్ముచుచే భయంబునం

దవిలి మనంబు భావములు • తత్తఱిలం దడఁబాటు నివ్వెరన్
మిపుల భజించి మేడువడి । మేగలి తెప్పల నార్పరై రటన్.

చ॥ హరియురమందు రాజిలు మ । హామణియట్లు వెలుంగు సౌధమున్
వెరగొని కాంచి యెవ్వరిది । వేడ్క సృజించిరొ తెల్పవే యనన్
భరతుడు పక్షితంద్రికిఁ ద । పఃఫలమైచన మున్ను మెప్పునన్
సరసిజ సంభవుం డొనఁగు । సౌధ వరం బిది నాఁగ వారలున్.

తే॥ కమలవాసిని కిది మేటి । కాణయాచి, వర్ణనము సేయ మాపోఁటి । వారు వలఁతు
లగుదురే? యని కేల్మోడ్చి। యవలనున్న, మండపము చూడఁ బోయిరి। మందగతుల.

తే॥ రావణానుజాదులు సౌధ । రాజ మహిమ, వినుతిసేయుచు నుండఁగ । నినసుతుండు
శ్రీరఘూత్తము పట్టాభి । షేక దినము, సరయకుండు పేరొకొయని । భరతునడిగె.

తే॥ వార్ధుల జలంబు బహుపుణ్య । తీర్థజలము, వచ్చి చేరుట యొకనాఁటి । పనియె యనుచు
భరతుఁడాడఁ గపీంద్రుండు । వాయుపుత్త్రు, మోసు గొంపనంత నతండు । భూమిదాఁటె.

తే॥ కులగురుని తక్క ఋషులను। పిలువుమనుచు, భరతుఁడనఁగ సుమంత్రుండు। నరగనేగి.
శిష్య మిత్రబృందములతో వ । సిష్టుదోఁడ, బిలుచుకొనివచ్చెఁ బత్సభా । నిలయమునకు.

శా॥ భక్తిం గైకసుతుండు మౌనికి నమో । వాకంబు లర్పింప న
మ్మక్తుం దమ్ముని ప్రేమమైఁ దిరముగా । భూదేవి శ్రీదేవియున్
రక్తింజెంద మహేంద్రుచందమున శ్రీ । రాముండు పట్టంబు నం
సక్తింబొందఁగ రేపె గల్గు శుభ మా । సాధించు లగ్నంబనన్.

వ॥ గురుగురుసములౌ తాపస, వరుడును రామాభిషేక । వాసర్లగ్నం
విరవుగ స్వర్ణాక్షరముల, విరచించితి లేఖ లపుడె । విభులకు సంపన్.

క॥ మూడు త్రిలోకవాసుల, కాతతమతిఁ దెల్ప పనిన । యంపఁబడు నటుల
శీతము లొల్లమి వచ్చిరి, ప్రీతిన్ వారలను వెక్క । పెట్టిగ దశమే?

తే॥ అల వసిష్ఠులో భరతుఁడు । నర్కసుతుఁడు, రావణానుజఁ డంగద । ప్రముఖ నిఖిల
దనుజ భల్లూక వానర । మనుజవరులు, కలిసి శ్రీరాము నొద్దకుఁ । గడఁకఁ జనిరి.

క॥ పట్టాభిషేకమునకున్, నెట్టన శుభదినము రేపె। నియమిత విధులన్
బట్టుగఁ జేయుము దశరథు, పట్టీ! యని గురుఁడు తనదు । వసము చేరెన్.

క॥ నలువ పనుప మయుఁడు సభా, కలనమునకు రాఘవేంద్రు । గౌరవమునకున్
వలసినవలె లోకోత్తర, లలిత చతుర మండపం బ । లంకృతిసేసెన్.

ఆ॥ సప్తసాగరముల । జలములు పుణ్యతీ, ర్థముల జలముఁ దెచ్చి । తగినచోట్లఁ
బవన తనయుఁడుంచె । బంధుర పద్ధతి, నంద దనసి వెలుఁగు। నందమొనఁగ.

తే॥ పదుణ్యేకుల లెల్లని। గొడుగుతోడ, భద్రకరులపై రత్నపుం। ముందునిచి
వివిధ వాద్యధ్వనులు రేఁగి। విస్తరింప, సరయు జలముఁ దెచ్చిరి। సరభసమున.

తే॥ వజ్రపాదముల్ మాణిక్య । ఫలక మమరు, పసిఁడి గద్దె స్ఫటికమండ। పమున నాసర
నుంచి రందుపై భుజకీర్తు । లుల్లసిల్ల, బాహులు వెలుంగ సీతతోఁ । బ్రభుఁడుచేరె.

## రాముఁడు పట్టాభిషిక్తుఁడగుట

సీ॥ మంగళగీతంబు । లంగు చెలంగ వేద ధ్వనులలర చిం । దంబు లడర
బహువిధ వాద్యముల్ । ప్రబలంగఁ దాళ మృ, దంగ రావములుదా । త్తతఁ జెలంగ
సురలు క్రొవ్విరుల నా । త్తరముగఁ గురియంగ, మొదటి వేలుపు మొట్ట మొదట వచ్చి
యభిషేక మొసరించె । నవ్వలఁ బశుపతి, మౌనులు విప్రులు। మంత్రి వరులు
తే॥ పౌరవృద్ధులు కపిరాజు । వాయుజుఁడు వి, భీషణుండు మున్నగువారు । పెరిమతోడ
వచ్చి యభిషేక కార్యంబు । వాంఛితార్థ, సిద్ధిగాఁగ రాఘవునకుఁ । జేసినారు.

శా॥ ఆనాఁ డొక్క వదంబునే కడుగ ది । వ్యాంభఃప్రసారం బుమా
ధీశుం డెక్కువ మక్కువం గొనుచు నె । త్తిందాల్చె నా బ్రహ్మయే
యానాఁ డంగము పూర్తిగాఁ గడుగఁగా । నేనిర మెచ్చెట నే
డానం దాడటఁ దాల్చునో యనుచుఁ గాం । క్షం జూచి రింద్రామరుల్.

చ॥ మరకత వర్ణ్యతంబొకటి । మూపగఁ దోయజరాజిఁ బూచి చెం
దరఁగసనాని రెండుకను । దమ్ములు వీనుల నంటుచుండు నా
ప్పరపగు నెమ్మిలోఁ జెలఁగు నోజ భజించిన రాము నుస్పుర
న్మరకత రూపమున్ గనిన పుణ్యులు ప్రేంచెరి బంధ ముక్తులై.

మ॥ అభిషేక క్రియతెల్ల నస్తమముగా । నారన్ మహాప్రేమ తో
లఘురై మౌనులు తోడ్పడన్ బదుయ చా । యజ్ఞ మూలంగా బ్రహ్మ న
న్నిధుఁడా శిష్ఠ వసిష్ఠ మౌని జరుపన్ । సెంచెన్ సుమంత్రుండు గో
త్రభిమం గొల్చి యొనంగు కల్పకమునా । ద్రవ్యంబు నభ్యాకరున్.

సీ॥ శ్రీరామ పాదుకా । సేవాభి నిరతుండు, భరతుండు చ్ఛత్రంబుఁ । బట్టి నిలువ
సౌమిత్రి నిధులు ల । వ్ర్రుఁడు శత్రుఘ్నుండు, వినతులై చామరాల్ । వీచుచుండ
నిత్యానపాయిని । నిఖిల జగన్మాత, సీత వామాంక సం । స్థితి రహింప
శ్రీరామ ముద్రికా । చిత్తసంభావని, పావని పదపీర । మై రహింప

తే॥ హరి నిశాచర సామంత । పదుల బంసి, రామకృత విక్రమము కీ । ర్తనము సలిప
కొలువ రాముఁడు సకల స । ద్గుణ గణాధి, రాముఁ డవ్వేళఁ బట్టాభి । రాముఁ డయ్యె.

ఉ॥ శ్రీలసమ భూమియుం జెలఁగు । శ్వేతభుజాంతమున రాఘవుండు సం
శ్రేయము లుల్లసిల్లఁగ * వ । సిష్ఠుఁడు దీవనతోడ నుంచు నా

---

* తిరువెణ్ణెయ్ నెల్లూరు జటప్ప వంశీయులగు వ్రాయ్స్ లందియఁ గైకొని [illegible] రత్న కిరీటము శ్రీరాముని శిరసున నుంచెనని మూలము.

చ॥ సచివులు చేరికంగొలువ । సైన్యపతుల్ జయ శబ్దముల్ వచిం
చుచు వినుతింపఁ దమ్ములును । నూరెల నుండఁగ వందిమాగధుల్
రుచిరముగా యశోబ్ధి లహ । రుల్ విజయాంక వినూత్న గీతికా
ప్రచయముతో నుతింపఁ జెలు । వల్ వరియింపఁగ మంగళ స్తుతుల్.

క॥ నృపవరులు దనుజవరులుం, గపివరులును పౌరవరులు । కై వారంబుల్
నిపుణత నొనరింపఁగ రహి, విపంచికల వైణికులు ప్ర । వీణతచూపన్.

తే॥ దినకరసుతుండు దానవా । ధీశ్వరుండు, డాసి సేవించి వహి నుచి । తాననములఁ
గూరుచుండ రాముఁడు నిండు । కొలువుసేయు, చుండు తఱివచ్చె గుహుఁడు సే ।
వోత్కమతిని.

తే॥ పులి కళానంబు దట్టిగాఁ । బూని కత్తి, నడుమునంజెక్కి నావిక । నాయకుండు
పరిజనంబుతో వచ్చి శ్రీ । వరుఁ బ్రదక్షి, ణించి సేవించి యొకవంక । నిలిచె నొదిఁగి.

క॥ కరుణామయుడగు శ్రీరఘు, వరుఁడు తనదిటంపుఁ బ్రేమ । వారంపై సుం
దర సుస్మితవిధిఁ జూవుచు, నురుపుగఁ బలుకాడి యొనఁగె । నుచితాసనముల్.

తే॥ సత్రపర్తనమున గురు । జ్ఞానులైన, వార లుచిత వాక్యజ్ఞులు । ధీరవరులు
నిఖిల కళలఁ బ్రవీణులు । నీరజాక్షుఁ, గొలిచి తమ తమ నేర్పుల । వెలువరింప.

క॥ నరపతులును తక్కిన వన, చరపతులును దనుజపతులు । నరసిజనేత్రున్
స్థిరభక్తిఁ గొలిచి యెఱుఁగక, జరపిరి తేలికగ వేడ్క । జనరెండు నెలల్.

ఉ॥ కారణజన్ముఁడైన రఘు । రాంతుఁడు లోకము నంతసింప నీ
తీరున గద్దెపైఁ గొలుపు । చేరి ప్రియంబున వచ్చియున్న య
వ్వారల గారవించి వను । వం దలపోసి పశుప్రజంబు బం
గారము క్షేత్రముల్ మఱి । నికాయ మొసంగెను విప్రకోటికిన్.

క॥ వలసినవి వలసినంతగ, వలచిన యాచకజనంబు । పరిమోదమునం
జెలఁగ నొసఁగి వదవడి పు, ప్పంపస్మని కోరె రాము । వుఁడు ప్రియమారన్.

క॥ హరులును శిబికలు తేరులు. కరులును మాన్యములు రత్న । కాంచన భూషాం
బరము లవారిగఁ గాన్కగఁ, బెరిమను మన్నించి పిదప । వీడ్కొలొసఁగెన్.

క॥ శంబర మర్దనునకుఁ దా, నింబుగ జనియించు వేళ । నింద్రుఁ డొసఁగు ర
త్నంబుల కడెములతోఁ జీ, నాంబర తురగాదు లొసఁగె । నర్క సుతునకున్.

క॥ మును కమలాసనుఁ డిచ్చు, కున కొసఁగిన యంగదములఁ । గొమరుగఁ దన పే
రును సార్థపఱుప నెంచెనొ, యనగ నొసఁగె నంగదునకు । సధికప్రేమన్.

క॥ మఱియును ముక్తాహారము, కరి తురగ స్యందనములు । కనకాంబరముల్
కరుణించి విన్నతంత్రికి, నిరవుగఁ దోడగుమ యెల్ల । యిమ్ముల ననియెన్.

మ॥ ప్రియమారంగఁ గటాక్ష వీక్షణములన్ । వీక్షించి సామీరి న

వ్యయసాహాయ్యమొనర్చినట్టి ఘను లెవ్వారయ్య నీరేవ? నే
దియుఁగన్పింపదు నీకుఁ బ్రత్యుపకృతిం । దిట్టంబుగాఁ జేయ న
క్షయకీర్తీ! నను గౌఁగిలించికొనుమా । గాటంబుగా మారుతీ.

శా॥ మాదేహంబులు నీయవే యనుడు । కైమాటించి వామూని నీ
యాదేశంబె యుపాయసంబు మఱి యా । లా? బిడ్డలా? నాకు నీ
పాద ద్వంద్వమె చాలునన్న రఘు । భూపాలుండు కేయూర హా
రాదుల్ దువ్వలువల్ మతంగజ తురం । గాఢ్యంబు లర్పించుచున్.

మ॥ తలిరుంబోణి కనర్ఘమైన యొక మ । క్తాదామ మిప్పించి యిం
దుల నెవ్వాని కొసంగ నీమనము సం । తోషించు నవ్వానికే
లలి నీయందగు దీవనను దన మనఃక్లాంతిం బ్రమార్జించు క
ర్వాలి వట్టింగని యిచ్చె వాసకి దయా । ర్ద్రి స్వాంతమై గ్రక్కునన్.

క॥ రిక్కల కాంతులఁ బైకొని, రిక్కల రాయనికి నుపమ । రీతిజెలఁగుచున్
వాక్కాంత యొసఁగు నాసర, మొక్కఁడు గాకెక్కుఁ దొసఁగె । నురు భూషణము

క॥ కటకములు హారములు దు, వ్వటములు కేయూరములును । పటుతురగ మదో
త్కటకరుల సరపముల ను, దృటవీరుని నలుని పిలిచి । పేర్మిపుఁ డొసఁగెన్.

క॥ అతులిత భూషల నొసగెను, శతబలికి నమూల్యరత్న । జవరాశ్వములన్
దతపతి కేసరి కొసఁగెను, ప్రతిలేని సువస్తువులను । వారిని కరుణన్.

ఆ॥ ద్వివిద తార నీల । గవయ జాంబవదాది, వీరవరులఁ బిలిచి । ప్రియములాడి
వలసినంత కనక । వస్తు వాహనములు, నిచ్చనిడి కటాక్ష । దృష్టిఁ జూచె

తే॥ గుహ నిదాంచిర ఖని వి । భీషణునిఁగాంచి, కలుషదూర । సములు నీకంటె లేరె
వనధి కిపుడు సమంబగు । పట్టునందు, నేని నీకు సమానుఁడ । గానరారు.

తే॥ అనుచు నుపలించిప్రియమున । సమదరిమ్ము, కటకముల పద్మరాగ్యనే కవచయంబు
కనకచేల కాంభోజ ఘనతురంగ, ములను కడు సుగంధ ద్రవ్య ములనొ

తే॥ శృంగిబేర పురేశ నా । రంగఁగాంచి, నీకుదెలుపంగ వలసిన । నియతు తెవ్వి
యనుచు శ్వేతాశ్వనికరముల్ । కనక రథ చ, యంబు పీతాంబరము లిచ్చె । నింక

మ॥ హనుమ జ్జాంబవ దంగద ద్వివిద తా । రాది ప్లవంగేశులను
దినరాజాత్మజుఁ గాంచి వీడుఁడనుచుం । దెల్పెం దలంపంగనై
నను కారానిదె యైన మీపురములను । నాజెంబుతో మేలు నం
దనగాఁ గాచుట నాకు ధర్మమగుఁ గా । నను వెడెదను గావుఁడీ

మ॥ దనుజాధ్యక్షున కాదటన్ పెడలుచే । ధర్మంబుగాఁ దెల్పి మీ
మనముర్ దూరము కావ యంచుఁ బలుకన్ । మన్నించి దైతేయ కీ
శ నిషాదాధిపు లెంతయున్ విడువ ని । చ్చన్ లేనివారయ్యు రా
ముని వాక్యంబులు మస్త మందిడుటయే । ముఖ్యంబుగా నెంచుచున్.

తే॥ భరత లక్ష్మణ శత్రుఘ్ను । ధరణిజాత, లను వసిష్ఠ ముగ్గురు తల్లు । లను గుణాభి
రాము రాముని వలగొని । ప్రణుతిచేసి, సెలవుగొని మరలిరి తమ నెలవు సేర.

తే॥ గుహుని సృంగిబేరమ్మునఁ । గూర్మి విడచి, యగచరేంద్రుని కిష్కింధ । యందు వదలి
కర్బురులు పరివేష్టింప । గగనవీధి, దైత్యపాలుండు తనరాజ । ధానిఁ జేరె.

సీ॥ మిత్రులఁ బంపి య । మ్మిహిర కులేశుండు, తక్క సుహృజ్జన । తతులతోడ
నీతిమంతుండై య । నీతిని సద్ధర్మ, హితుండయ్యు ధర్మంబు । నెత్తకుండ
వర్ణాశ్రమాచార । పరిపాలకుండయ్యుఁ, దల్లికూఁతుల నొక్క । తమిని చూచి
తమ్ములు తనకసు । దసుఁలై వర్ధిల్ల, జనులు తండ్రి యటంచు । జనపుచూప

తే॥ క్షీర సాగరమందున । శేషతల్ప, మందు యోగనిద్రను వీడి । యవతరించి
చెడుగుంంద్రోచి మేలు ర । క్షించు రామ, చంద్రుఁడేలె జగంబులు । చలపనొండ

మ॥ జగదారాధ్యుఁడు రాముఁడై పుడమిలో । జన్మించి దుష్టాత్ములన్
దగ ఖండించిన ధరాతలంబున లస । ద్ధర్మంబు నెక్కొల్పి పూ
జ్యాగతిం బొల్చిన జానకీ విభుని స । చ్చారిత్రమున్ భక్తి యొం
దఁగఁ బల్కన్ వినినన్ సుఖించి యట మీఁ । దం గాంత్రు క్షైవల్యమున్

మంగళ మహాశ్రీ

మంగళము రామునకు । మంగళము తమ్ములకు
మంగళము సంతతము । మైథిలికి వేడ్కన్
మంగళము మారుతికి । మంగళము భారతికి
మంగళము నీతికిని । మానమున కెప్డున్
మంగళము భక్తికిని । మంగళము ధాత్రికిని
మంగళము వీని విను । మాన్యులకుఁ బేర్మిన్
మంగళము పాడికిని । మంగళము ప్రేమకును
మంగళము మంగళము మంగళమహాశ్రీ.